శ్రీరస్తు

# తెలుఁగు వామనపురాణము

సహస్రకంఠరామాయణాది గ్రంథకర్తయగు

కవిభూషణ విద్యాశేఖర


**పండిత రామావఝ్ఝుల కొండయ్యశాస్త్రి**


ప్రణీతము




చెన్నపురి:

వావిళ్ల ముద్రణాలయమున

ముద్రితము

**1929**


---



రామావఝ్ఝుల కొండయ్యశాస్త్రి.

శ్రీరామచంద్రాయ నమః

# సంపాదకీయభూమిక - కృతజ్ఞత.

ఆర్యమహాశయులారా!

సుజనహితోపదేశకులును శ్రీ అభినవాంధ్రవాల్మీకి కావ్యప్రతిష్ఠ బిరుదాంచితులును, సన్మిత్రులును నగుపండిత జనమంచి శేషాద్రిశర్మగారిహితోపదేశంబుమెయి సహస్రకంఠరామాయణమును పద్మపురాణమునుండి తెలిఁగించినమ్మట నాయభివృద్ధిని నిరంతరమును గోరుచుండు శ్రీశర్మగారు నన్నుఁగాంచి 'సత్పసంతానములం బ్రశస్తివహించిన కృతివిరచనంబె' యని నన్ను బ్రోత్సహించి వామనపురాణమును తెనుంగు సేయుమని యుపదేశించిరి. గాని కుపబలముగా మాగ్రామసమీపముననుండు మంగుపల్లెనివాసులును, దేవబ్రాహ్మణపూజానిరతులును, సమాశ్రితజనసంరక్షణాగ్రేసరులును నగు శ్రీయుత అల్లంపాటి పోలిరెడ్డిగారు తమ పక్షముగ జూపిరి. ఈయిరువురును సంతసముతో నూతకుండకై హెచ్చరించుచు వచ్చిరి. శ్రీ శేషాద్రిశర్మగారు వామనపురాణంబును బొంబాయి శ్రీవేంకటేశ్వర ముద్రణాలయంబునుండి తెప్పించి యొసంగిరి. నేను శ్రీరామచంద్రపాదారవిందములు మనంబున ధ్యానించి గ్రంథరచనకుఁ దొడంగితిని. పట్టుదలతో ననుదినమును గవిత్వముఁ జెప్పుట కుదరపోషణమునకయి యుండు శ్రమలవలనను, నించుక వైద్యవిద్య యభ్యసించినవాఁడనగుట నామాగ్రామంబుల యాతురరక్షణార్థమై చనవలసినవాఁడనగుటను, నీగ్రంథము రుధిరోద్గారి సంవత్సర మాఘశుక్ల దశమి నాఁడు సంపూర్తిచేయఁగలిగితిని. ఇంచుమించుగ సార్థవత్సరమునకు వ్రాయఁగలిగితిని. పుస్తకరచనము నాయత్నమున నుండునట్టిది కావునఁ బూర్తియయ్యెఁ బుస్తక మిద్దానిని నెట్లు వెలువరించి లోకమునఁగల భాషాపోషకులయంతికమునకుఁ బంపఁగలుగుదునా యన్నయూహ యహరహముగ నామనంబున నంకురించి నన్నుఁ బరిపరివిధములఁ జీకాకుపడఁజేసె. నాపాలి కల్పకంబులునాఁ దగు శ్రీశర్మగారును రెడ్డిగారును నున్నవారుగదా యని తలంచి ముద్రణాదికార్యంబుల నెఱవేర్పింపఁ జేయుటకు శ్రీశర్మగారిని, ముద్రణకార్యంబునకు వలయుధనంబు నిప్పించి సాయంబుగావించుటకు శ్రీపోలిరెడ్డిగారిని నాశ్రయించి నాకృతికన్యకం బరిగ్రహించి బుధజనులసేవకుం బంపుఁడు మీభారమని విన్నవించితి. శ్రీ అల్లంపాటి పోలిరెడ్డి

గాను తనకుఁ గార్యంబు లెన్ని యున్నను వాని నవలకుం ద్రోసిపైచి గ్రంథము
ద్రణకార్యంబె తనకార్యంబుగా దలంచి వెంటనే నావెన్వెంటవచ్చి తమమిత్రుల
కీయత్నంబునంతయు వివరించి ద్రవ్యసాహాయ్యంబును జేయువారలను నాలుగు
తెగలుగా నేర్పాటుగావించి ఉద్ధారకులు, నిర్వాహకులు, పోషకులు, చందాదా
రులు అనునామంబుల ద్రవ్యము నొసంగుటకై తగినరీతిం గావింపుఁడని హెచ్చ
రించిరి గ్రంథనిర్మాణమునకుఁ జేయుతోడ్పా టనంతమని తెలిసినవెంటనే తమతమ
శక్తి ననుసరించి యగ్ర్యగ్రాసనులవారు సాయముం జేసిరి వారినామధేయంబు
లను గృతజ్ఞతతో నిందుఁ బొందుపఱచియున్నవాఁడ విలోకింపఁ బ్రార్థితులు
ఈగ్రంథమునకు ద్రవ్యసాహాయ్యముం జేసినవారికి నాకృతజ్ఞతఁ దెలుపుచున్నాఁ
డను ఇఁక ముద్రణకార్యంబు మిగిలియుండె పుస్తకంబంతయును భద్రముగఁ గై
కొని కడపపురంబున విద్యాలయమిత్రులగు సర్వవిధముల నాకాధారభూతులుగ
నుండువారును, నాకుఁ బ్రోత్సాహము గల్పించిన శ్రీ జనమంచి శేషాద్రిశర్మగారి
దగ్గఱకుఁబోయి యీగ్రంథమును జూపించి యచ్చొత్తింపఁ బ్రార్థించితిని వారు
మిగుల నావృత్తిమెయి నన్నుఁ గారవించి నాయాప్తినమున కియ్యకొనిరి పిమ్మట
భాషాపోషకులై నిరంతర ముద్రగ్రంథముద్రణముం గావించుచు లోకమున కుప
కారమునుగావించు బ్రహ్మశ్రీ చెన్నపురి వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారు
ముద్రణమున కియ్యకొని నాకు వసతికల్గఁ బడిచ్చినధనమును గైకొని ముద్రణం
బును సంపూర్ణంబుగావించిరి కాఁబట్టి యిప్పు నిరంతరోపకృతిఁ గావించు శ్రీ వావిళ్ల
వేంకటేశ్వరశాస్త్రులుగారికిని, నోపికతోడఁ బుస్తకంబునంతయుఁ బఠించి పీఠి
కను వ్రాసియిచ్చి, యచ్చొత్తించునప్పుడు సరిచూచుచుఁ దోడ్పడిన కడపపురమున
హైస్కూలునందు తెలుఁగుపండితులుగనున్న కావ్యపురాణతీర్థ విద్వాన్
బ్రహ్మశ్రీ జనమంచి వెంకటసుబ్రహ్మణ్యశర్మగారికిని, మొదట నుండి గ్రంథపరిసమా
ప్తియగు వఱకు నిరంతరము నా కన్నివిధములఁ దోడ్పాటుగావించుచుండిన అభిన
వాంధ్రవాల్మీకి కావ్యస్మృతితీర్థ బ్రహ్మశ్రీ జనమంచి శేషాద్రిశర్మగారికిని నిరంత
రము కృతజ్ఞతతో వందనము లర్పించుచున్నాఁడను.

---

శ్రీరామచంద్రాయ నమః

శ్రీ తెలుగు వామన మహాపురాణ

# కృతిసమర్పణమహోత్సవప్రశంస.

మహాశయులారా!

ఏను గంగాయాత్ర చేసినవిధముగ పలుమాఱుగ పెద్దలతిరుణావలనను భగవత్ప్రసాదంబుకలిమివలనను మొట్టమొదట ననుకొనినవిధముగఁ బురాణంబు తెలుంగుసేయుటయు ముద్రించుటయుఁ బూర్తియయ్యె. ప్రాచీనాచారము ననుసరించి యీవామనపురాణంబును దైవసాన్నిధ్యమున సమర్పించుటయు, బ్రాహ్మణసంతర్పణమును, పెద్దలగు పండితులకు సన్మానసభయందుఁ బఱచుటయుఁ బండితజనాంగీకరణంబును గొనఁబడినవిగదా యిపి యెట్లుసాగునా యన్నయూహ మదియందుఁ బొడమె. ఈమహాకార్యములు నెఱవేఱుట యంతసులభము కాదని నాకు మనసునందు తోఁచె నాఁడు మేమనగనుమతులు, చింతామణివంటి మహానాశ్రితజన ప్రశస్త సిద్ధాయులలును నగు నిపుణమహాశయులు గలుగ వారవర్తయుందురా యని తా రూహింపనేల? బ్రహ్మశ్రీ పండిత జనమంచి శేషాద్రిశర్మగారును, శ్రీయుతులగు అల్లంరాజు పోలిరెడ్డిగారును నను మహానుభావులే వీరలయాదరంబున నప్పగించు కార్యంబయిన గిట్టుకొక్కుడుగదా యని తెలంగి వారిన్నిట్లుఁజేరి యుంకిలి మొదల్పు కార్యక్రమంబు నిర్ణయించితి. సభాసురోత్తములా! యీసంకీర్ణ బంతిభోజనము శ్రీరామచంద్రకృపచే నెల్లకార్యంబులును నిర్విఘ్నంబుగ సాగఁగలవని భక్తాగ్రగణ్యులును, సత్కార్యధురంధరులునగు నీక్రిందఁ జెప్పఁబడిన వారందఱి యొక్కయాహ్వానసంఘమును నిర్మించిరి

బ్రహ్మశ్రీ, జనమంచి శేషాద్రిశర్మగారు

మ-రా-రా-శ్రీ, అల్లంరాజు పోలిరెడ్డిగారు

» గంగవరపు వెంకటస్వామినాయనింగారు

» చల్లా వేంకటనరసారెడ్డిగారు

» నాగిరెడ్డి వెంకిరెడ్డిగారు

» పున్నపు కేశవయ్యగారు

గిరినుండి వేంకటగిరిమహారాజాగారి యున్నతపాఠశాలాప్రధానాధ్యాపకులును అష్టావధాన నిపుణులునునగు బ్రహ్మశ్రీ అల్లాడి జగన్నాధశాస్త్రులుగారును విజయం చేసియుండిరి మఱియును కొందఱు పండితులును, న్యాయవాదులును వచ్చిరి వారికందఱకును శ్రీయుతులును, న్యాయవాదులును, కరంకరాగతాన్నదానని రతులును నగు మ-రా-రా-శ్రీ, మునుంగమూరు వెంకటసుబ్బారావు, బి ఏ, బి ఎల్, గారు నానాదేశాగతపండితమండలికాతిథ్యము గావించి సత్కరించిరి ఎల్లరును బాష్పశకటంబు నధిరోహించి కలువాయపురంబును జేరిరి కలువాయపురంబునం దత్యంతోత్సాహంబుగ ప్రజలు తమగృహంబుల నలంకరించియు, సంతోషముతో నిండినవారై యెల్లరిండ్లకు వచ్చుచుండిరి శ్రీచెన్నకేశవాలయంబున మంటపనిర్మాణముచలువపందిరివింతవింతరంగులతోడనుకదంబాస్తంభంబులతోడను జాతపల్లవతోరణంబులతోడను జూచువేడుకకైయొప్పునట్లు నిర్మించఁ జేసిరి కలువాయపురవాస్తవ్యులును కార్యనిర్వాహకులునైన వారికార్యంబంతయుఁ బొగడఁదగియుండినా కార్యములన్నియుఁ బూర్తియైనవి వలసినవారెల్లరును వచ్చిరి నాకుఁ గల్గిన యుత్సాహమునకు మేరయేలేదు మాఘశుక్లసప్తమీ స్థిరవాసరము నుదయమున మంగళవాద్యములతో దేవాలయంబులం దర్చనలును నభిషేకంబులును జరగినవి తొమ్మిదిగంటలకు శ్రీతెలుఁగువామనమహాపురాణమును, సంస్కృతవామనమహాపురాణమును, శ్రీచెన్నకేశవస్వామివారివిగ్రహంబులతోడఁ బురంబునందు మంగళవాద్యంబులు బోరుకలంగ నుత్సవంబు చేయంబడియెను పదునొకండుగంటలకు దేవాలయంబున నెల్లరుఁ జేరిరి దాదాపుగ రెండువేలమంది వచ్చిరి గ్రంధము మూలవిగ్రహపాదారవిందములకడ జయజయధ్వానములతో సమర్పింపఁబడియె దేవునకును కృతికని నిర్యాపనీ జనంబు లెంచఁబడెను ఆవలఁ బండితప్రకాండులును సభాధ్యక్షులునునగు నాగపూడి కుప్పుస్వామయ్యగారు గ్రంథాపస్యమును షష్ఠ్యంతములును బఠించిరి శ్రీకపిలె జొ శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రులుగారు కొన్నిభాగములును, శ్రీగునుపాటి యేనాదిరెడ్డిగారును, శ్రీపాణకాశేషరెడ్డిగారును నందందుఁ జదివిరి గ్రంథపఠనము ముగిసినవెంటనే సభముగించి యెల్లరు గృహంబులకుఁ జనిరి చుట్టుపట్లు రెండామడలదూరమునుండి జనంబులిమ్మహోత్సవంబు సందర్శింపవచ్చియుండిరి బ్రాహ్మణులకు మృష్టాన్నంబులు సంతుష్టిగ సమారాధనను శ్రీపోలిరెడ్డిగారును, శ్రీజనమంచి లక్ష్మీనారాయణయ్యగారును, శ్రీపాటూరి వీరరాజుగారును జరపిరి వైశ్యులకు శ్రీగునుమూర్తిశ్రేష్ఠిగారును శ్రీసానె సెట్టి సుబ్బయ్యశ్రేష్ఠిగారును భోజనంబులఁ బెట్టించిరి హరిజనులకును శూద్రులకును

శ్రీ తోట సుబ్బయ్యగారును, శ్రీ దర్శి లక్ష్మీనారాయణయ్యగారును సంతృప్తిగ భోజనముం బెట్టిరి పిదపను శ్రీ కరణము పద్మానాయఁడుగారును, నాగిరెడ్డి కొండారెడ్డిగారును, అల్లంవా బ్రహ్మారెడ్డిగారును, పక్కుంగల కార్యదర్శులును అన్నదానముం గావించిరి దాదాపు రెండువేలమందిబీదలు భుజించిరి పేదల కన్నదానము గావించుచోటఁ బోసిన యన్నరాశి చూచుట కాశ్చర్యముం గొల్పుచుండెను శ్రీ మానుగుంట చిన్నచెంచయ్యగారు సమస్తపదార్థంబులను క్రమంబున కూర్చి నెల్లూరునగరంబునుండి గొనితెచ్చిరి వచ్చినయెల్లవారికిని నన్నదానము మిక్కిలి మహోన్నతముగఁ గావింపఁబడియె మధ్యాహ్నానంతరము 3గంటల కొకగొప్పసభ శ్రీ చెన్నకేశవాలయంబునఁ గూడెను ఇసుకచల్లిన నేలచాలనిరీతిగఁ జనులు లెక్కకు మిక్కుటముగ నరుగెంచియుండిరి నాలుగువేలకుమించినదని కొందఱు చెప్పుకొనుచుండిరి దేవాలయావరణమున జోటుచాలమి ప్రాకారంబులమీఁద నెక్కియు నచటను తావుదొరకనందున పెన్నఁబోయినవారలు దేవాలయబహిర్భాగంబున నిలువఁబడియు నుండిరి అధ్యక్షులఁ మున్నగుపెద్దలను నన్నును సుమంగళవాద్యంబులతో దేవాలయంబునకుఁ గొనితెచ్చిరి ఎల్లరును సుఖాసనాసీనులైరి నెల్లూరు పమరంగలనాట్యప్రవృత్తులును సుశరభారతగ్రంథకర్తయు నష్టావధానియునగు తెంగిరాల రామనాథశాస్త్రిగారు దైవప్రార్థనముఁ గావించిరి ఆవల శ్రీ జనమంచి శేషాద్రిశర్మగారు మృదుమధురంబులగు వాక్కులచే స్వాగతోపన్యాసముం గావించిరి ప్రథమమున శ్రీ అభినవాంధ్రవాల్మీకి కావ్యప్రతితీర్థ బిరుదాంచితులగు జనమంచి శేషాద్రిశర్మగారు లిఖితపత్రంబునుండి చదివిన శ్రీ పండితాఖండలులగు బ్రహ్మశ్రీ నాగపూడి కుప్పుస్వామయ్యగారి పాండిత్యము మున్నగువిషయంబులఁ దెలియఁజెప్పి యగ్రాసనాధిపతిగా నుండ నంగీకరింపఁగోరిరి శ్రీ కవిరాజ బ్రహ్మశ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రులుగారు బలపఱచిరి శ్రీ గుంపరి రాధాకృష్ణయ్యగారు ప్రోత్సహించిరి జయజయధ్వానములతో శ్రీ నాగపూడి కుప్పుస్వామయ్యగారు సభాధిపత్యమును గొని యగ్రాసనము పైన నధిష్ఠించిరి అగ్రాసనాధిపతిగారి ప్రారంభోపన్యాసము ముగిసిన యనంతరమున నగ్రాసనాధిపతిగారి యనుమతిచే గిప్పనుండివచ్చిన పండిత కావ్యపురాణతీర్థ విద్వాన్ బ్రహ్మశ్రీ జనమంచి వేంకటసుబ్రహ్మణ్యశర్మగారు పురాణప్రశంస యనువిషయంబునుగూర్చి గంభీరవాగ్గుంభనల నుపన్యసించిరి పురాణములను దెల్గుగావించుటలోఁగలలాభము, పురాణములం దెల్గున రచించినవారి నామంబులను దెల్పి సభ్యుల రంజింపఁజేసిరి అంతట రాజమహేంద్రవరమునుండి యరుదెంచిన పండితప్రకాండులుఁ, గవితల్లజులును నగు బ్రహ్మశ్రీ కవిరాజు శ్రీపాద కృష్ణ

మూర్తిశాస్త్రులుగారు తమసహజగంభీరములగు వాక్పుంజములచే నిప్పటికాలపుఁ గవిత్వమునుగుఱించి యుపన్యసించుచుఁ బ్రాచీనకాలపుఁగవిత్వమును దానివిలువను వెల్లడింపఁజేసిరి పిమ్మట బళ్లారినుండివచ్చినపండితులగు బ్రహ్మశ్రీ కావ్యతీర్థ రావాడ వేంకటరామశాస్త్రులుగారు వామనపురాణప్రశంసనుగుఱించియు నన్నుగుఱించియు నీక్రిందిపద్యములఁ జదివి బహూకరించిరి

తే. యజ్ఞసూత్రంబు దండ మృగాజినములు, వింతచెలువంబు దనకొదవించుచుండ
దైత్యనాథునిఁ జేసాచి దానమడుగు, గుజ్జువడుగోముఁ గనిపద్యగోంపయార్యు
సీ. పరఁగు నొక్కండిట బరిమళోల్లాసాఖ్య సరళాంధ్రవివృతి సత్ప్రభిఖ్యుండు
కలఁ డొక్కఁగుండిటఁ గమలగర్భాండాగ్నిపురాణాంధ్రకృతి రచనాయశుఁడు
నెసఁగు నొక్కండిటఁ శృంగారతత్కృతి కవిరాజబిరుదంబు గనినఘనుఁడు
వఱలు నొక్కండిట వామనాంధ్రపురాణ రాజంబు రచియించు సమ్యక్కీర్తి
తే. మఱియు నీసభ నెందఱో మహితమతులు, వారినందఱ వర్ణింప వశమె యరయ
మగనిఁ దలపించు మోహనపురమందిరమ్ము, వాణి కిదె సుమ్ము వేయాఱు వలుక నేల
చ. సురుచిరవామనాఖ్యకృతి శోభిలు రామపదాంబుజద్వయిన్
స్థిరతరభక్తి నర్పితము సేయు మహోత్సవ మెంచి చూడఁగా
నకకవి తిక్కయజ్వ తన భారతకావ్యము సాదరంబుగా
హరిహరనాథుపాదములఁ గర్పణసేయువిధంబు తోఁచెడిన్ 3
ఉ. వ్రాయఁగవచ్చునే యురక భవ్యపురాణచయంబు దెవ్వనిన్
దాయతపాండితీవిలసితామలశక్తియు లేకయున్న శ్రీ
లాయితశబ్దచాతురి సులక్షితవామనమన్ పురాణ మో
హో యని మెచ్చఁజేసి తిక నొప్పుగ నిన్ను నుతింప శక్యమే 4
తే. పద్యరత్నంబు లర్పించి పంకజాక్షు, మెప్పుఁ బడసితి సుకవీంద్ర! మిగుల నీవు
నెట్టిపూజయొ ఫలమును నట్టిదబ్బుఁ, గానఁబద్యంపురత్నాలఁ బూనికొనుము

కావ్యతీర్థ రావాడ వేంకటరామశాస్త్రి,

తెలుఁగుపండితుఁడు, మునిసిపల్ హైస్కూలు, బళ్లారి.

పిమ్మట రాయచోటినుండివచ్చిన బ్రహ్మశ్రీ పండిత వెల్లలూరు వేంకటాద్రిశర్మగారు క్రిందిపద్యములను జదివి నను గారవించిరి:—

పంచరత్నములు

క. శ్రీరామావసుధాకుల, వారాకర పూర్ణసోమ! వరగుణధామా!
ధారుణిఁ గొండయనామా! శ్రీరామ పదారవిందసేవానియమా!

ఉ. భారత మాంధ్రభాషగను । బండితవామక రంజకంబుగా
సారసదార్థగుంభనలఁ । జక్కనిశైలి రచించి మించు స
త్స్వారి గురుండు తిక్కకవి । సోముఁడు జన్మము నొందినట్టి నె
ల్లూరి సమీపగ్రామమున । నుద్భవ మొందితి వింత యొప్పనే! 5

ఉ. వ్రాసితి నుత్తర సహస్రగళ । రామచరిత్ర త్రిలింగ భారతిన్
హాసినిఁగం విహ్వాటి । వామన పుణ్యపురాణ మాంధ్రభా
షన్ సరసంపుఁ గావ్యముగ । సారకవిత్వమహత్త్వ మొప్పగన్
జేసి కృతిన్ రఘునాథుని । చేతి కొసంగితి పున్నె మెట్టిదో! 6

సీ. పరిమళోల్లాసమున్ । వ్యాఖ్యాన మొనరించి పండితమాన్యుఁడై । పరఁగు నొకఁడు
కృష్ణభారత మను । కృతిఁ జేసి "కవిరాజ" బిరుద మందినబుధ । వరుఁ డొకండు
ఆంధ్రబ్రహ్మాండ రా । మాయణాదుల వ్రాసి 'యాంధ్రవాల్మీకి' నా । నలరు నొకఁడు
కావ్యశాస్త్రపురాణ । కళలవిద్వత్పట్టమును బొంది వెలసిన । ఘనుఁ డొకండు
తే. ఇట్టి మహనీయు లెందఱో యిచటఁ జేరి, యుండు శుభవేళ మిపుల మ । హోత్సవంబు
గాఁగ శ్రీరామవరపద । కమలములకుఁ, గృతి సమర్పించి మహిఁ గృత । కృత్యుఁడైతి

క. నరలోకమాన్యుఁడయి సుస్థిర యశము గడించి హరిని । సేవించుచు బం
ధురకావ్య రచన సేయఁగఁ, జిరజీవిగఁ గొండయార్య! చెలఁగుము । మహిలోన్.

వెల్లలూరు వేంకటాద్రిశర్మ,
తెలుగుపండితుఁడు,
బోర్డు సెకండరీ స్కూల్, రాయచోటి.

లువాయ
16-2-1929



అంతట నుత్తరభారతగ్రంథకర్తలగు బ్రహ్మశ్రీ అష్టావధాని తంగిరాల రామనాథశాస్త్రులుగారీక్రిందిపద్యరత్నముల నొసంగిరి:—

తే. శ్రీమన్మందకటాక్షవీక్షణములన్ । జెల్వొందు లేనవ్వుతో
ప్రేమన్ బైదలిఁ గౌఁగిటన్ జొనిపి సం । ప్రీతిన్ విడంబించు నా
రాముం డాఘనుఁడా రమారమణుఁ డా । రాజీవపత్రాక్షుఁ డీ
రామావర్ష్ముల కొండయాహ్వయుని నా । శ్రాంతంబుఁ గాపాడుతన్

సీ. ఇయ్యఁగాఁ దలఁచి పం । డ్లిగిలించు కల్పకంబునకున్న విఖ్యాతి । బోవఁ దెగడి
యియ్యఁగాఁ బాడసూపి । యింతలో వెలవెలఁ బాఱు నీరదము దప్పంగఁ ద్రోచి

మ. రా. రా. శ్రీ బెజవాడ రామచంద్రారెడ్డిగారు తీర్మానము నామోదించుచు నిట్టి గొప్పవిద్వాంసులుగలసభలలో నిట్టిగర్హణీయవిషయంబును జర్చించుటకంటె నుపేక్షించుటయే పాడియనియు, లోకవిరుద్ధచర్యగానుండు శ్రీశాస్త్రిగారిచర్య నిరసింపవలసినదనియుఁ బల్కిరి తీర్మాన మెల్లరచే నంగీకరింపఁబడినది

పిమ్మట నగ్రాసనాధిపతిగారు లేచి హితోపదేశము గావించుచుఁ దగురీతి గ్రంథమునకును దత్కర్తకును గారవంబునెఱపిన కార్యదక్షులకును, ఆహ్వానసంఘ సభ్యులకును నెల్లూరిమండలవాస్తవ్యులకునుగల గొప్పతనంబును దెలిపి యిట్టులే యిఁకముందుఁగూడ భాషను పోషింతురుగాక యని కోరి యుపన్యాసమును ముగించిరి కరతాళధ్వనులతో జయజయశబ్దనినాదములతో సభ జయప్రదముగ నెఱవేఱెను అప్పటికి రెండుగంటల రాత్రియయ్యెను ఎల్లవారును తమతమనివాసంబుల కరిగిరి మఱుసటిదినమునను నెల్లవారలఁ దగురీతి సత్కరించి యాహ్వానసంఘసభ్యులు వారి వారిపురంబులకు వారి నంపిరి

ఈకార్యమునకుఁ గారణభూతులుగనుండి సమస్తభారమును దామే వహించి నిర్వహించిన శ్రీయుతులగు అల్లంపాటి పోలిరెడ్డిగారిని బ్రశంసించుచు శ్రీగుసుపాటి ఏనాదిరెడ్డిగా రీక్రిందిపద్యములను జదివి తమసంతోషమును వెలిఁబుచ్చిరి

క. ప్రోలయ వేమనృపాలుని, బోలిన యీపోలిరెడ్డి బుధకవివరులన్
 లీలమెయిఁ జర్చి విద్యా, లోలతసుఖ మొసఁగె బుధులోకము మెచ్చన్

క. కృతులు రచించియు సత్కవి, కృతులందియు రెడ్డిదొరలు కీర్తిప్రథులై
 హితముల నొసఁగించిన లో, కితగతు లెల్లను పోలిరెడ్డి జ్ఞప్తికిఁ దెచ్చెన్

ఈవిధంబున నాచేసినయీకృతికిఁ దగినసిద్ధంబగు మహోత్సవంబుఁ గావించిన నామిత్రులకెల్లరకుఁ గృతజ్ఞతఁ జూపుటకంటె నేఁ జేయఁజాలిన దెద్దిగలదు? సేవకుఁడ నగు నన్నుఁ గరుణించి మరలనిట్టికృతిరచనకు ననుఁ బురికొల్పుఁడని వేఁడుచు వందనము లాచరించుచున్నవాఁడను

'ఉత్పన్నసౌహార్దానా ముపచారః కైతవం భవతి' యన్నట్లుపచారవాక్యములేల? నాకృతజ్ఞతాపూర్వకవందనములను మరలఁ దమకుఁ గావించుచు నింతటితో విరమించుచున్నాఁడను

చాపురాళ్లపల్లె
నెల్లూరుజిల్లా

విధేయుఁడు,
రామావఝుల కొండయ్యశాస్త్రి

## ఇటీవలవచ్చినయభిప్రాయము

శా॥ శ్రీమద్రామజయంబు ము న్దెలుగునన్ సృష్టించి శ్రీవామన
స్వామి ప్రాభవసత్పురాణమును విద్వద్దేవతుల్యంబుగా
భూమిం గ్రన్ననఁజేసి గౌరవమునం బొల్పారుచున్నట్టి యో
రామావరఘుల కొండయాఖ్యసుకవీంద్రా! కీర్తి భాసిల్లుమీ.

సీ॥ శ్రీకరంబై తెలిఁ జెలఁగెడి విభవాబ్ధ మాఘుఁప్రొమియందు మహితదీప్తిఁ
గలువాయ యనుపేర జెలఁగు గ్రామంబందు జరిగినపండితసభకువచ్చి
నట్టికవీంద్రులీ వాంధ్రీకరించినగ్రంథంబునందుఁ గ్రాలుకొన్ని
పద్యగద్యంబులఁ బఠియించి నీమీఁద బంచరత్నోపమపద్యములను

ఆ॥ గౌరవార్థముగనుఁ గల్పించి సభ్యులు, పనఁగఁ జదివియిడిరి వేడ్కఁ గనక
హస్తభూషణముల నందితి ఎటఁ గొండయాఖ్యకవివరేణ్యా! యద్భుతముగ

తోఁట సుబ్బయ్యశ్రేష్ఠి,
నల్లూరుగ్రామము,
నల్లూరుజిల్లా

చ॥ పరమమునీంద్రవర్యుఁడగు వ్యాసమునీశునిభాష మెంతయున్
సరవిని బద్యజాలములఁ జక్కఁగ నిల్పి యనూనరీతి నీ
వరయఁగ వామనంబు జన మబ్బుర మందఁగఁ దెల్గుఁజేసి యీ
ధర సుయశంబుఁ గొంటివి బుధప్రకరస్తుతిఁజేసి సత్కవీ!

ఉ॥ నాసుకృతంబు పెంపునను నర్మిలినీదుపురాణ మాధృతిన్
జేసి మదీయమిత్రగృహసీమను జూచిపఠించితిన్ సవ
ర్యాసమునన్ గ్రమంబుగను వ్రాసిన తత్కవితాపటుత్వమున్
వాసిగఁ గొండయాఖ్యకవివర్య నుతింపఁ దలంపుఁ బెంచెడిన్.

గీ॥ రామవరఘుల కులవార్ధిరత్నమా య, శేషసత్కీర్తిశోభిత! శేముషీని
ధాన! గొనుమి వేపద్యరత్నములనిత్తుఁ, గొండయార్యా! మనంబునఁ గూర్మిదొలుక.

కడప
27-3-29 }

గారి పెద్దిరాజ రాజేశ్వరశర్మ.

శ్రీమత్త్రిపురసుందర్యై నమః

# పు రా ణ స మా లో చ న ము.



చ. జగముఁ దుదంచుఁ బంప్రభ శీఘ్రమునన్ విలసిల్ల నీకమున్
దగవరు నూర్తిపుత్త్రి తనయద్వయసేవితయై చెలంగఁ జె
న్నగు నగుమోముతోడ శుకహారము లొప్పఁగ శంకరుండు సొం
పుగఁ గనుపట్టుఁగాక కను మూసినయప్పుడు విచ్చినప్పుడున్

సజ్జనవరేణ్యులారా! భక్తమదగ్రగణ్యులారా! పండితాఖండలులారా!

శ్రీపరమేశ్వరుఁ డనవృతమహిమాంచితుఁడు సమస్తచరాచరములందు నిండి వెలుంగువాఁడు. ఈ ప్రపంచంబంతయు నామహామహునిసంకల్పసంభవము తన యిచ్ఛారూపంబున సృష్టిస్థితిలయంబులఁ గావించుచు నాపరమేశ్వరుండు లోకజాలంబుచే క్రీడించుచుండు. పిపీలికమొదలు బ్రహ్మపర్యంతముగలప్రాణులు పరమాత్మయధీనంబులు కాకుండుటకేనియు సంశయము లేదు. ఆబ్రహ్మాండపర్యంత మామహాత్మునిసంకల్ప ముదయించినయంతనే యుత్పత్తిల్లు ఎప్పుడా దేవుఁడు తలంపుమానునో యెల్లలోకంబులు నశించును. ఒక్కొక్కసృష్టి కొక్కొక్కని నధికారిగాఁ గావించుచుఁ గర్తృత్వంబు వారలకుఁ గల్పించి తానే కర్తయై మాయామయుఁడై భ్రాంతిని జగంబునందు వ్యాపంబుఁ జేసి తాను జిన్మయుండై సచ్చిదానందము నందు విలసిల్లుచుండును. అట్టి పరమాత్మవిభూతులే ప్రాణులు. వానికి భగవంతుఁడే ప్రవృత్తులం గల్పించి ధర్మాధర్మవిచక్షణాజ్ఞానంబు నొసంగి వానికిఁ దగినకర్మముల నేర్పఱిచి తపనుగుణంబుల నొసఁగుచున్నట్టి జ్ఞానంబును గలిగించి యెల్లవానిని నడిపించుచుండును. ప్రాణులన్నియు భగవంతునిచే సృష్టింపఁబడినవై సమానధర్మంబుల నొందియున్నను బుద్ధి మదగ్రగణ్యత్వంబున మానవులు మొదట లెక్కపెట్టఁదగినవారైరి. ఆహారనిద్రాదులు సకలప్రాణులకును సమానధర్మంబులే. జ్ఞానముమాత్రమే మానవుల కెక్కువయగుటం జేసి మానవుల కుత్తమత్వంబు గలిగె. జ్ఞానములేని మానవుఁడు పశుతుల్యుఁడే యగు. ఈవిషయంబు వేదంబులందును, స్మృతులయందును, పురాణంబులందును, ఇతిహాసంబులందును విశదంబుగనుండుట యెల్ల రెఱింగినయదియె. జ్ఞానమను నొక్కపదార్థంబువలనఁ గాఁదగినయుపకృతి యేమిగల దని మనము ప్రశ్నింపరాదు. అమేయంబగులాభంబు దాననే యొదవుచున్నది. లోక

మునందు మనుటకు జ్ఞానమే ప్రధానముగును దాన యుక్తాయుక్తవిచారణ శక్తి యుదయించును ఆశక్తివలనఁ గామక్రోధాదికంబు లగునరిషడ్వర్గనిజయంబును, దానం జేసి సద్ధర్మాచరణంబును, సత్కారణంబున గురుజనసహవాసంబును, దాన ముముక్షుత్వంబును, నంత నపవర్గప్రాప్తియుఁ గలుగుటయు సంభవించు ఈ యపవర్గప్రాప్తియే మనుజునిజన్మమునకు గణింపఁదగిన కార్యము

మొదట మనకంటెఁ బూర్వులు మాకు మేలుసేయఁగోరి యెన్నియేని నియమంబులను మనమనుగడయందుఁ గలిగించిరి వారిట్లు కలిగించుటకుఁ దగినయాధారము లెయ్యవియని మనము చర్చింపఁబోయెదమేని మాకు ముఖ్యముగ గోచరించునట్టివి వెక్కులుకలవు అట్టివాని కాధారమైయున్న భగవంతునిసత్యవాక్కునకుఁ జెప్ప వేఱు లేదు ఆసత్యవాక్కే వేదము దానినే శ్రుతియందురు శ్రుత్యర్థము నెఱింగిన వాఁడే శ్రోత్రియుఁడు. శ్రుతి సృజింపఁ దగిన హేతు వెయ్యదియో యింతక యోచింతము పిపీలికాదిబ్రహ్మపర్యంతము గలప్రాణిసముదాయము నేప్రవర్తనమునను౦చిన శాగుగనుండునో యద్దాని న్నెద్ధమునలోకమున వ్యాపింపఁజేయఁగునా యని మనంబున భగవంతుఁడు యోజించి తనవాక్కునుండి వేదములనిర్మించి చతుర్ముఖునకొసంగ చతుర్ముఖుండు తన వదనచతుష్టయంబున నుచ్చరించుటం జేసి యాశ్రుతికిఁ జతుర్విధత్వంబుగలిగె వానిని వ్యాసాదిమహర్షులు పరశ్రేయస్సునుగోరినవారగుటంబట్టి యుపదేశంబునందె లోకంబున శిష్యప్రశిష్యమూలంబున బోధించి ప్రాణుల, నందులో మానవులధర్మాచరణంబున కుస్ముఖులఁగావింపఁగిరి స్వేచ్ఛచేసత్యాచారులయి కామక్రోధాద్యరిషడ్వర్గస్తులయిన మానవులకు నిరయంబు గలుగుచుండుటయు, దానికిం గారణంబు ధర్మములు శాసనములు లేకుండుటయు గారణంబులనియు నట్టివానిని జక్కఁగఁ దెలియఁజెప్పుట పెద్దలకుఁదగినకృత్యంబనియుఁ దలఁచి భగవదంశసంభూతులగుమహర్షులు వేదవాక్యంబులు సులభంబుగ నెల్లరును గ్రహింప ననువుకాని వనియుఁ దలంచి వేదార్థోపబృంహణము లగుస్మృతులను నిర్మించిరి అవియును నించుక కఠినంబులుగ నున్నవనియు, సుసులభబోధకంబులుగావనియు, దర్శించి లోకోపకారార్థంబుగా నష్టాదశమహాపురాణంబులను నష్టాదశోపపురాణంబులను నితిహాసంబులనురచియించి లోకంబున వెలయింపఁజేసిరి ఇట్లు కొంత కాలంబరుగ నల్పబుద్ధులగుజనంబుల యునికి నిరీక్షించి ఋష్యంశసంభూతులగు మహాకవులు శ్రుతిస్మృతిపురాణేతిహాసాగమంబులఁగల ధర్మపుంజంబులను విన్నంతమాత్రముననే హాయిని గల్పించునట్టివియుఁ జూచినయంతనే తాదాత్మ్యంబును బొందించునట్టివియును నగు శ్రవ్యకావ్యంబులు దృశ్యకావ్యంబులునాఁ జనుకావ్యపుంజంబులను భువనంబుల

నిందించి కృతకృత్యులైరి ఇప్పటికి వారికార్యంబంతయుం దీరినది మొత్తముమీఁద నివియన్నియు మానవసమాజ శిక్షకుం బాత్రంబులై ధర్మాచరణబోధకు వీజం బులై యున్నవనుటలో నేసంశయంబును లేదు.

ఇట్టివే శాసనంబులుగా భగవంతుఁడు తనయంశభూతులుగా నుండువారిచే నేర్పాటుగావించి ప్రవృత్తికిఁ దోడుపడినవాఁడయ్యె వీనిని ముత్తెఱంగులుగా విభజించి మహాత్ములు ప్రభుసమ్మితంబులనియు, సుహృత్సమ్మితంబులనియుఁ, గాంతాసమ్మితంబులనియు నామకరణంబులఁ గావించిరి పెద్దలవాక్యము లక్ష్యము ననుసరించియుండును వారు దివ్యజ్ఞానయుకలవారు కాంచుడు వారివిభజనం బెంత సమంజసముగ నున్నదో!

ప్రభుసమ్మితములనగా రాజు సేవకునిఁగాని తనప్రజనుగాని యేవిధముగా నియమించి యిటునటు కదలనీయక తనయాజ్ఞానువర్తుని గావించునో తద్విధమ్ముగ జనంబులను ధర్మవిచ్యుతులను గాకుండునట్లు గట్టిగాఁజెప్పి నియమించునట్టిశాసనంబులు (చట్టములు) వేదములు

సుహృత్సమ్మితములనగా బంధుమిత్రాదులు తగువిధమగుమర్యాదతోఁ దమకుఁ గావలసినవానికి నచ్చఁజెప్పి యొప్పించి సాధుపథంబునకు ద్రిప్పురీతిగ హితముగ సన్మార్గమునకుఁ ద్రిప్పఁజాలుశాసనంబులు పురాణములును, నితిహాసంబులును నైయున్నవి

కాంతాసమ్మితములనఁగాఁ బ్రియమగుకాంత తనకాంతునిస్వాంతమ్మునకు సంతసమ్ముకలుగువిధమ్మున బ్రియోక్తులచే నెమ్మిగ వశపఱచుకొని హితవుగలవి మంచిత్రోవను ద్రిప్పుకరణి వినినంతనే హాయిగలిగించి తన్మయత్వమునుబొందించి హితపథంబునకు వర్తింపఁజేయునట్టి చట్టములు కావ్యంబులు

'కవేః కర్మ కావ్య'మ్మని పురాణంబులను గావ్యకక్ష్యలోఁ జేర్పవచ్చునుగాని పురాణలక్షణమ్ములకును గావ్యలక్షణమ్ములకును నెక్కువ భేదము గలదు ముందు ముందావిషయము చర్చింపఁబడును

'పురాభవం,' అనికాని, 'పురానీయతే' అనికాని పురాణశబ్దమునకుఁ బెద్దలు వ్యుత్పత్తినిఁజెప్పుదురు దీనికి వివరణమును "వ్యాసాదిమునిప్రణీత దేవతార్థవర్ణిత పంచలక్షణాన్వితశాస్త్రమ్" అనివిశదీకరించిరి అనగా వ్యాసాదిమునులచే రచియింపఁబడినదై దేవతార్థము విస్తృతముగా వివరింపఁబడిన పంచలక్షణములతోఁ గూడినశాస్త్రమని నిర్వచనము

పురాణములందుఁ గలవిషయంబు లెవ్వి? దాన నగులాభము లేవియన్న నిందు ధర్మాత్ములనిర్మలచరిత్రములును, వారికిఁ గలుగువైభవంబులును,తన్మహత్త్వంబులును, దుర్మార్గులజీవితములును, వారికిఁగలుగు విపర్యయంబులును, దన్నీచప్రవర్తనానుసరణమగు దురదృష్టవైభవంబులును, నుదాహరణపూర్వకంబుగ నర్ణింపఁబడి నీతిబోధకంబైనవిషయంబు ముఖ్యంబుగ నుండును దేవతాభక్త్యః దేశము, సన్మార్గబోధ ఇవి మానవసమాజశిక్షకుఁ బ్రధానసాధనములై వెలయుటంజేసి చక్కఁగ వానియందు వివరింపఁబడియుండును

అనంతమహిమాన్వితంబులైన యీ పురాణవిషయచర్చ శ్రుతులయందే చేయఁబడియుండుటంజేసి వీనిమహత్త్వంబు నెన్న శక్యంబుగాదని మనము తలంపనగును వేదములపిమ్మట వచ్చినపురాణములప్రశంస వేదములయందుఁ జేసియుండుట విరుద్ధముగ భావింపరాదు భగవంతుడు త్రికాలజ్ఞుఁడు ఆమహామహునకుఁ దెలియనియర్థం బుండఁజాలదుగదా!

"ఋగ్వేదో యజుర్వేదః సామవేదోఽథర్వాంగిరస ఇతిహాసః పురాణం విద్యా ఉపనిషదః శ్లోకాః సూత్రాణ్యనువ్యాఖ్యానాని వ్యాఖ్యానాని"

శతపథబ్రాహ్మణము ౧౪-౬-౧౦-౬

"అస్యమహతో భూతస్య నిశ్వసితమేతద్యదృగ్వేదో యజుర్వేదస్సామవేదోఽథర్వాంగిరస ఇతిహాసః పురాణమ్" బృహదారణ్యకము

ఇదం వా అగ్రేణ కించిదాసీదిత్యాదికం జగతః ప్రాగవస్థా ముపక్రమ్యసర్గప్రతిపాదకం వాక్యజాతం పురాణమ్" బృహదారణ్యకము

ఇట్టి మహిమగలవేదప్రతిపాద్యములయిన పురాణపఠనంబున శ్రవణంబునఁ బారనంబునఁ బాపంబులెల్లఁ బటాపంచలగుటయు, దాన ధర్మాధర్మవిచక్షణాజ్ఞానంబు గలిగి శీలంబలవడి, భగవంతునియందు భక్తిశ్రద్ధలు మిక్కుటములగుటయేగాక మోక్షంబును గరతలామలకం బగుచున్నది నిష్కలగురుభక్తి, పితృభక్తి,దేవతాభక్తి దేశభక్తి, రాజభక్తి కలిగించి యాస్తికులఁగావించుటకుఁ బురాణములే యాధారణములు మొదటినుండియు సత్యము, ధర్మము, ఫలసిద్ధులు మనంబులందుఁ బ్రతిఫలింపఁజేయుట కీపురాణములే హేతువులు సంసారంబను పెనుచీఁకటియందుఁబడి దిక్కుతెలియక యనన్యగతికులైనమానవులకు విజ్ఞానబానూదయంబును గావించు కీపురాణంబులే యారోగ్యసాధనంబులు విషయైకలోలురై పరమేశ్వరతత్త్వంబెట్టిదని యెఱుంగఁజాలక యుక్కిరిబిక్కిరియై యల్లాడుమానవులకు నిదమిత్థమ్మని

నిర్ణయించి ఘంటాపథంబుగ ఘోషించుచు వివేకముఁగల్గించుచున్నవి పురాణములే యని మనంబున బాగుగ నమ్మవలయును. ఎంతచదివినను క్రొత్తగఁ గన్పడుచు నభిరుచినిగల్పించుచు నత్యధికానక్తిని బఠనమునందుఁ బురాణములు పెంచుచున్నవి

"ఆదిత్యస్యోదయస్థానసౌవర్ణం భారతీకథా, శ్రేష్ఠా భార్యా సుమిత్రం చాపూర్వాణి దినే దినే" అనఁగా సూర్యోదయంబును, బంగారంబును, భారతకథయును, ప్రియురాలగు భార్యయును, ఒక్కనిమిత్తుండును దినదినంబును క్రొత్తవిగనే యగపడునట్లును నెంతటి రుచియంబు గలిగియుండినను సుగుణనిం నిరతిశయ గనఁబడునట్లును బురాణములును దినదినము నూతనములుగఁ దోఁచుచుండునట్టివై యానందసంధాయకంబులై యనేకవిషయసన్నిబద్ధంబులై యలరుచుండును

లోకజ్ఞానంబుఁ దెలియవలయునన్న బురాణంబులే చదువవలయును గణితము, సాముద్రికము, స్వప్నము, శకునము, జ్యోతిషము, ఖగోళవిజ్ఞానము, యోగము, శారీరము, మొదలగునసేకవిషయంబులు పురాణాంతర్భూతంబులై గురువర్యునిచెంత నంగోయవిచ్ఛేదముఁ జేసి దివ్యఫలంబు నొసంగ సమర్థంబులై యున్నవి

ఇట్టిపురాణంబు లెన్ని? వానియందుఁ గలలక్షణంబు లెయ్యవి యనువిషయంబు నించుక నించుక విమర్శింపవలసియున్నది. ఆశ్చర్యం బెన్నిపురాణములొకేలక్షణయుక్తము కలయవి రచియించుటకు హేతు వెయ్యది? ఒక్కపురాణమునందుఁ గలకథయే మఱొక్క పురాణంబున నించుక మార్పుగలిగియుండనేల? యనునంశము యోజింపఁదగినయంశమే

పురాణములు పదునెనిమి. ఇవిగాక యుపపురాణములు పదునెనిమిది.

"మద్వయం భద్వయం చైవ బ్రత్రయం వచతుష్టయం
అనాపలింగకూస్కాని పురాణాని పృథక్ పృథక్"

అనఁగా మత్స్యమార్కండేయములు, భవిష్యభాగవతములు, బ్రహ్మ బ్రహ్మాండ బ్రహ్మవైవర్తములు, వామనవరాహవాయువైష్ణవములు, అగ్నినారద పద్మలింగగారుడకూర్మస్కాందములు ననునవి యష్టాదశపురాణములని పెద్దలు వచింతురు ఇందుఁగలచతుష్టయములో వాయుపురాణము నుపపురాణములందు జేర్చి యాస్థానంబున శివమహాపురాణంబు నుంచవలెనని పల్కుదురు ఈనిర్ధారణమునకుఁ బెద్దలే ప్రమాణము.

సామాన్యముగఁ బురాణలక్షణము:—"సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశో మన్వంతరాణి చ, వంశానుచరితం చేతి లక్షణానాంతు పంచకమ్" అనఁగా సర్గము=సృష్టి

ప్రతిసర్గము మరీచ్యాదినవబ్రహ్మలచే జేయబడినసృష్టి, వంశము- సూర్యచంద్రవంశములయుత్పత్తి, మన్వంతరము-స్వాయంభువు మున్నగుమనువుల కాలమునందుగల ధర్మపద్ధతి, వంశానుచరితము పూర్వవంశస్థుల సుప్రసిద్ధములగుచరిత్రముల సముదాయము ఇట్టిలక్షణములతో నొప్పునదే పురాణమనంబడు

మహాపురాణము దశలక్షణసమన్వితము దీనికిం బ్రమాణము

"సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశో మన్వంతరాణిచ,
వంశానుచరితం విప్ర! పురాణం పంచలక్షణమ్
ఏతదుపపురాణానాం లక్షణంచ విదుర్బుధాః,
మహతాంశ్చ పురాణానాం లక్షణం కథయామి తే
సృష్టిశ్చాపి విసృష్టిశ్చ స్థితి స్తేషాంచ పాలనం,
కర్మణాం వాసనా వార్తా మనూనాం క్రమేణ చ
వర్ణనం ప్రళయానాంచ మోక్షస్యచ నిరూపణమ్,
ఉత్కీర్తనం హరేరేవ దేవానాంచ పృథక్పృథక్,
దశాధికం లక్షణంచ మహతాం పరికీర్తితమ్"

(శ్రీకృష్ణ జన్మఖండము)

పురాణములు వ్రాయుటకుం గల కారణము దానికిం బ్రమాణము

"నిస్తారాయతు లోకానాం స్వయం నారాయణః ప్రభుః,
వ్యాసరూపేణ కృతవాన్ పురాణాని మహీతలే
పఠనా చ్ఛ్రవణా ద్యేషాం నృణాం పాపక్షయో భవేత్,
ధర్మాధర్మపరిజ్ఞానం సదాచారప్రవర్తనం
గతిశ్చ పరమా తద్వద్భక్తి ర్భగవతి ప్రభో,
తాని తే కథయిష్యామి సప్రమాణాని భూతలే"

(పాతాళఖండము)

ఇష్టమహిమంబును బురాణంబు లాఖ్యానరూపంబున వెలువరించుచుండును దీనికిం బ్రమాణము:—

"ఆఖ్యానైశ్చాప్యుపాఖ్యానైః గాథాభిః కల్పశుద్ధిభిః,
పురాణసంహితాం చక్రే పురాణార్థవిశారదః.
ప్రఖ్యాతో వ్యాసశిష్యో భూ త్సూతో వై లోమహర్షణః,
పురాణసంహితాం తస్మై దదౌ వ్యాసో మహామునిః

ఆఖ్యాన మనఁగా నుపాఖ్యాన మనఁగాఁ బ్రమాణము

స్వయం దృష్టార్థకథనం ప్రాహురాఖ్యానకం బుధాః,
శ్రుతస్యార్థస్యకథన ముపాఖ్యానం ప్రచక్షతే"

(ఇయ్యది విష్ణుపురాణము మూఁడవయంశమున నాఱవయధ్యాయమున గలదు)

పురాణపఠనఫలము —

"అష్టాదశపురాణానాం నామధేయాని యః పఠేత్,
త్రిసంధ్యం జపతే నిత్యం సోఽశ్వమేధఫలం లభేత్"

(మార్కండేయపురాణము)

మహాపురాణములు దశాధికలక్షణసమన్వితము లనిగదా తేలినది

అవి 1 సృష్టి, 2 విసృష్టి, 3 స్థితి, 4 పాలనము, 5 కర్మవాసన, 6 వార్త, 7మన్వాదివర్ణనము, 8 ప్రళయము, 9 మోక్షము, 10 హరిభక్త్యుత్కీర్తనము ఇవి ముఖ్యములైనయంశములు

ఈపురాణము లన్నిటియందును వక్తయు శ్రోతయు నుందురు వారిలో ప్రధానముగ నెవ్వనిచే నెవ్వరికి చెప్పబడినదో వారిపేరే పురాణములకు నామ ముంచఁబడినట్లు తోఁచుచున్నది. ఈక్రింద నష్టాదశమహాపురాణముల నామంబులును వానియందు వక్తృబోద్ధవ్య స్వరూపంబులును, తత్సంఖ్యానంబును దెలుపుచున్నాను

1 బ్రహ్మపురాణము—, పదివేలగ్రంథము ఇందు బ్రహ్మవక్త శ్రోత మరీచి

2 బ్రహ్మవైవర్తపురాణము—పదునెనిమిదివేలగ్రంథము అంబరీషుఁడు ప్రచ్ఛకుఁడు వసిష్ఠుఁడు, బోధకుఁడు

3 బ్రహ్మాండపురాణము—పన్నెండువేలగ్రంథము బ్రహ్మ వక్త

4 మత్స్యపురాణము— పదునాలుగువేలగ్రంథము మత్స్యమూర్తి మను వునకుఁ జెప్పినది

5 మార్కండేయపురాణము—తొమ్మిదివేలగ్రంథము ధర్మపక్షులచే జైమినిమునికిఁ జెప్పఁబడినది

6 భవిష్యపురాణము—పదునాలుగువేలగ్రంథము శతానీకుఁడు బోధ్యుఁడు సుమంతుఁడు బోద్ధవ్యుఁడు

7 భాగవతపురాణము—పదునెనిమిదివేలగ్రంథము శుకయోగి పరీక్షిన్మహారాజున కుపదేశించినది

8 విష్ణుపురాణము—ఇరువదిమూఁడువేలగ్రంథము. పరాశరుఁడువక్త మునులు శ్రోతలు.

9 వరాహపురాణము—ఇరువదినాలుగు వేల గ్రంథము భూదేవికి వరాహమూర్తి చెప్పిన గ్రంథము

10 వామనపురాణము—పదినాలుగు వేల గ్రంథము నారదునకుఁ పులస్త్య మునీంద్రుఁ డుపదేశించినది

11 శివమహాపురాణము—ఇరువదినాలుగు వేల గ్రంథము వాయుమూర్తిచే జెప్పఁబడినది

12 అగ్నిపురాణము—ఎనుబది వేల గ్రంథము భృగువు యోగి సమయమున బోధించినది

13 నారదపురాణము—ఇరువది వేల గ్రంథము కలియుగమును గురించి నారదునిచేఁ జెప్పఁబడినది

14 లింగపురాణము—పదునొకండు వేల గ్రంథము శివునకు సంబంధించిన గ్రంథము

15 స్కాందపురాణము—లక్ష గ్రంథము ఈశ్వరుఁడు స్కందునకుఁ దేశించినది

16 గరుడపురాణము—పదునారు వేల గ్రంథము విష్ణువు గరుడునకు జెప్పిన గ్రంథము

17 కూర్మపురాణము—ఆఱు వేల గ్రంథము కూర్మమూర్తియగు విష్ణువుచేఁ జెప్పఁబడినది

18 పద్మపురాణము—ఏఁబదియైదు వేల శ్లోకములుగలది బ్రహ్మదేవునిచేఁ జెప్పఁబడినది

ఈపదునెనిమిది పురాణములును మూఁడువిధములుగ విభజింపఁబడినది అనఁగా సాత్త్వికములు, రాజసములు, తామసములు అని ఇందుకుఁ బ్రమాణము

1 సాత్త్వికములు:—"వైష్ణవం, నారదీయం, చ తథా భాగవతం స్మృతం, సాత్త్వికాని పురాణాని విజ్ఞేయాని శుభాని వై"

2. రాజసములు:—"బ్రహ్మాండం బ్రహ్మవైవర్తం మార్కండేయం తథైవచ, భవిష్యం వామనం బ్రాహ్మం రాజసాని నిబోధత"

3 తామసములు:—"మాత్స్యం కౌర్మం తథా లైంగం, శైవం స్కాందం తథైవచ, ఆగ్నేయంచ షడేతాని తామసాని నిబోధత"

పద్మపురాణము, ఉత్తరఖండము 43 అధ్యా.

ందుఁ గాంచగాఁ గొన్ని తక్కువగ నగుచుచున్నవి అవి వారాహపాద్మ గారుడములు

ఇఁక నుపపురాణములు పదునెనిమిది యెవ్వియనఁగా:—

"ఆద్యం సనత్కుమారోక్తం, నారసింహ మతఃపరం,
తృతీయం స్కాందముద్దిష్టం కుమారేణ తు భాషితం
చతుర్థం శివధర్మాఖ్యం సాక్షాన్నందీశభాషితం,
దుర్వాససోక్త మాశ్చర్యం నారదోక్తమతః పరం,
కాపిలం వామనం చైవ తథైవోశనసేరితం
బ్రహ్మాండం వారుణం చాథ కాళికాహ్వయ మేవచ,
మాహేశ్వరం తథా సాంబం సౌరం సర్వార్థసంచయం
పరాశరోక్తం ప్రవరం మారీచం భార్గవాహ్వయం"

(గారుడము, ౨౨౭ అధ్యాయము)

ఇవి యుపపురాణములు.

పురాణములందును నుపపురాణంబులందును గథలు వచ్చినవె వచ్చియున్న వ్యాసోక్తిని యతిక్రమించి భేదమున నుండుటను దానిఁ జెప్పని మఱియొకదానిని భావింపరాదు వీనియందు శివమహిమను జెప్పునవియే యెక్కువగఁ గన్పట్టుచున్నది శ్రీనాథుఁడు తన కాశీఖండమునందు:—

"వసుప నెనిమిది యన్యదేవతలఁ జెప్పు
పదిపురాణంబు లీశ్వరుఁ బ్రస్తుతించు" అని నిరాఘాటముగఁ జెప్పియున్నాఁడు పేరుమాత్రమే చూచి యిది విష్ణుపురాణమనియు నిది శివపురాణమనియు నిర్వచించుటకు వీలుపడదు పురాణేతిహాస మెల్ల రెఱింగినవిషయంబే ఇఁక నీయనవసరపుమాటలను వదలి ప్రకృతమనుసరింతము

మనము చేతఁబట్టుకొనియుండు నీపురాణము వామనమహాపురాణము. దీనిని వేదవ్యాసులవారు సంస్కృతమున రచియించిరి పులస్త్యుఁడు నారదమహర్షికి బోధించినయుపదేశముగల గ్రంథరాజము

ఇందు:— "శృణు వత్స! ప్రవక్ష్యామి పురాణం వామనాభిధమ్,
త్రివిక్రమచరిత్రాఢ్యం దశసాహస్రసంఖ్యకమ్ ౧
కూర్మకల్పసమాఖ్యానం వర్గత్రయకథానకమ్,
భాగద్వయసమాయుక్తం వక్తృశ్రోతృశుభావహమ్ ౨

... ... ... ... ...

పులస్త్యేన సమాఖ్యాతం నారదాయ మహాత్మనే ౧౬
తతో నారదతః ప్రాప్తం వ్యాసేన సుమహాత్మనా,
వ్యాసాత్తు లబ్ధవాన్ వత్స తచ్ఛిష్యో రోమహర్షణః ౧౭
స చాఖ్యాస్యతి విప్రేభ్యో నైమిశేయేభ్య ఏవ చ,
ఏవం పరంపరాప్రాప్తం పురాణం వామనం శుభమ్ ౧౮
యే పఠంతి చ శృణ్వంతి తేఽపి యాంతి పరాం గతిం,
లిఖిత్వైతత్పురాణం తు యః శరద్విధువేఽర్పయేత్ ౧౯
విప్రాయ వేదవిదుషే ఘృతధేనుసమాచితం,
ససముద్ధృత్య నరకాన్నయేత్స్వర్గం పితౄన్ స్వకాన్ ౨౦
దేహాంతే భుక్తభోగోఽసౌ యాతి విష్ణోః పరం పదం"

(వామన [illegible] బృహద్వామన సంహితాయాం [illegible] ౧౦౫ అధ్యాయః)

ఇట్టి శ్రేష్ఠపురాణవిషయంబులన్నియు సవిస్తరంబుగ నారదంబున వివరింపఁబడియున్నది

ఇందుఁగల ముఖ్యములగు నితిహాసములు, విషయసూచికయందు విశదీకరింపఁబడియుండుటం జేసి గ్రంథవిస్తరభీతి నిందుఁ బొందుపఱుపనైతి

ఇట్టిమహిమగల యీపురాణరాజంబులను మనశుభాశంసులగు పెద్దలెట్లు శ్రుతిస్మృతులనుండి సంగ్రహించి లక్ష్యలక్షణపురస్సరంబుగ సులభబోధకముగ నిర్మించిరో యట్లే కొంతకాలము క్రిందటనుండియు మాపూర్వులు కాలమహిమను జూచి గీర్వాణభాషయందున్న యర్థంబును విశదంబుగ నెల్లరకుఁ దెలియఁజేయఁ గోరి భాషాంతరీకరణముం గావింప దొరకొనిరి పురాణము లన్ని భాషలయందును బరివర్తనము చేయఁబడినవి మనత్రిలింగభాషయందును సాధారణముగ నన్నిపురాణములును బరివర్తనము చేయఁబడినయట్లు కానంబడుచున్నది ఈసందర్భమున నేయేపురాణము నేయేకవిచేఁ బరివర్తనము తెలుఁగునకుఁ గావింపఁబడియెనో వ్రాయుటయు మంచిదనియని తోఁచి వ్రాయుచున్నాను చిత్తగింతురుగాక

ఈపరివర్తనమునకు మొదట మార్గదర్శకులు కవిత్రయమువారే యని గట్టిగాఁ జెప్పఁదగు పంచమవేదం బనంబరఁగు భారతమును దెలుంగునకు వ్రాసి దారిఁజూపిరి. దాన సంస్కృతమునుండి తెలుఁగునకు వ్రాయుట ప్రారంభమయ్యె.

మనవామనపురాణమును దెలుంగునకు లింగమగుంటతిమ్మకవి యనుమహా కవి యొకరు పూర్వకాలమున వ్రాసిరికాని, యప్పుడు ముద్రణాదిసౌకర్యములు లేక తాళపత్రములయందే వ్రాసికొనవలసియుండుటంబట్టి నశించినదని చెప్పవచ్చును ఇట్లే మఱియెన్ని మనయభాగ్యవశంబున నంతరించెనో తెలుపఁజాలము

ప్రస్తుతము మనవామనపురాణమును దెనుఁగునకు వ్రాసినవారు నెల్లూరు మండలమున నాత్మకూరను పట్టణమునకుఁ జేరిన చాపురాళ్లపల్లె గ్రామనివాసియుఁ, బండితమహాకవియునగు బ్రహ్మశ్రీ రామావఝుల కొండయ్యశాస్త్రులుగారు వీరి వంశావళి గ్రంథాదినిగాంచనగు వీరు బాల్యమునఁ గడపపురమున శ్రీ శేషాద్రి శర్మగారితోఁగూడ శ్రీపరాంకుశ దాసాచార్యులుగారియొద్ద విద్యాభ్యాసముగావించి సాంసారికవ్యాసంగములకు లోనయి విద్యఁజాలించి తమస్వగ్రామమునకుఁ బోయిరి వీరికి బాల్యమునుండి కవిత్వమునం దభిరుచి యనియు నాకుఁ దెలిసినఁ వీరు యయాతినాటకమును నొకయక్షగానమును వ్రాసి దానిం దనశిష్యులకుఁజెప్పి పల్లెలలో వారిచే నాడించి మెప్పుగాంచిరనియు, నాసమయమున నీకవీంద్రుని మిత్రులగు శ్రీశేషాద్రిశర్మగారు "నెచ్చెలీ! నీకవితను గ్రంథముల వ్రాయుటయందు వినియోగింపుమా" యని ప్రోత్సహింపఁగా సహస్రకంఠ రామాయణమును బద్మపురాణంబునుండి తెలుఁగు జేసి రనియు, నంతట నీవామనంబును బద్యకావ్యంబుగా వ్రాసిరనియు నాగురువర్యులును, నీమహాకవిమిత్రులును నగు శ్రీశేషాద్రి శర్మగారొకానొకసమయంబున సందర్భవశంబున సెలవిచ్చిరి నాయందు బాల్యంబు నుండియు నీకవీంద్రునకుఁ బ్రీతిమెండు ఈపురాణం బామూలాగ్రంబు పఠియించితి పురాణతీర్థపరీక్షోత్తీర్ణుఁడ నయియుండుటంజేసి న న్నీసమాలోచనంబు వ్రాయ నాదేశించిరి పెద్దలగువారియనుమతి నుల్లంఘింపఁజాలక సముద్రమున కేతము నెత్తినరీతి నిమ్మహాకార్యంబుఁ గావింప నేనల్పుండనయ్యును వారియాజ్ఞాప్రోత్సాహ బలంబుగలవాఁడనై పూని వ్రాసితి నిందలిదోసగులను మన్నింతురని విజ్ఞులగు మిముం బ్రార్థించుటయే నా యుచితకార్యము క్షమింపఁ బ్రార్థితులు

ఇఁక నీవామనపురాణంబునందలి కవితాశైలి మిక్కిలి సరళమై హృదయంగమమై ద్రాక్షాపాకంబున నొప్పుచున్నయది దాని నుదాహరణంబుఁ జూపఁ బూనిన గ్రంథమంతయుఁ జూపవలసివచ్చును విస్తరభీతి వదలుచున్నాఁడ

భాషాంతరీకరణపద్ధతియుఁ బెద్దల ననుసరించుచుఁ బ్రాచీనపక్కిని వదలక యున్నది సంస్కృతగ్రంథమున ముద్రణమునంబడిన దోషంబులుండినను నీకవీశ్వరుండు వానినన్నింటని దనవిద్యాబలంబున సవరించుకొని తగినరీతిఁ దెలుఁగుఁ గావించినవాఁడు అందందుఁ గొన్నిభాగంబుల నెత్తిచూపుట యుపోద్ఘాతము వ్రాయువానిలక్షణంబుగా నుండినను నా కార్యమును గ్రంథవిస్తరభీతిచే వదలితిని. ఎల్లయెడల సంస్కృతంబునందలి భావంబునకు నించుకేనియుఁ దీసిపోవకయున్నది

కవి యందందుఁ బ్రాచీనుల భావంబులను గైకొనినాఁడు. కాని, యది దోషంబుగాఁ పరిగణింపఁ దగదు

| | | | |
|---|---|---|---|
| (2) | 10 | సారసాక్షి | దూరకచుట్టుకొన్న ఉత్తర రామాయణము |
| (3) | 21 | సత్ప్రబంధంబు | సప్తసంతానములలో మనుచరిత్ర కనుకృతి |
| (5) | 3 | కలికెడిది | భాగవతమున కనుకృతి. |
| (125) | 350 | రంగదభంగ | రంగదరంతిభంగ (దాశరథిశతకము) |

ఇంతమాత్రముచేతనే కవి చేతఁగానివాఁడన రాదు ఇంత గ్రంథము నెట్లు వ్రాసెనో యూహింపుఁడు మాటలా? చదువుచుండ కింపుగానుండుపద్యములం గాంచుఁడు

| | |
|---|---|
| 82 పుట | ఇందుఁగల పద్యములమనోహరత్వముం గాంచుఁడు |
| 83 పుట | 393—399 |
| 108—111 పుట | యుద్ధవర్ణనము |
| 114, 115 | పద్యములఫక్కిని చిలకింపుఁడు |
| 121, 184, 185, | ఇందలిశైలిని గనుంగొనుండు |
| 246, 334 | పరిహాససంబంధములు సొంపు నింపుచున్న యవి |

ఇట్లుదాహరింపఁబూనినఁ బుస్తకమునంతయుఁ జూపవలసివచ్చును అందం దచ్చుతప్పులు కానంబడుచున్నవి ఇవి గ్రంథాభిమానులు రెండవముద్రణమునకుఁ బ్రోత్సహింతురేని యపుడు సవరింపఁబడుననుటలో భ్రాంతి లేదు

మహాశయులారా! ఇట్టి గ్రంథముల వ్రాయించి లోకంబునకును భాషకును రక్షణంబుగలిగించినవారని కీర్తింపదగు శ్రీ కొండయ్యశాస్త్రులుగారు గావించిన లోకోపకృతి యెన్నుటకు సాధ్యముకాదు వీరిట్లె ప్రతియొద్దియేనిపురాణమును దెలుంగునకు వ్రాయుచు నీత్రిలింగదేశజనులకును నాంధ్రులకును దోడ్పడి భాషను బోషించుచు శాశ్వతారోగ్యవంతులై చిరకాలము విలసిల్లుదురుగాక యని కోరుచు నాలేఖనికి సెలవు వేఁడుచున్నాఁడను

"శ్లో॥ పుంసః స్వరూపపరివర్ణన మేవ కార్యం
తజ్జన్మభూమిగుణదోషకథావృథైవ
రత్నాకరోత్థ మభినందతి కో విషంవా
కో వా న పద్మ మభినందతి పంకజాతమ్"

ఇట్లు, విన్నవించు, విద్వజ్జనవిధేయుఁడు,
కావ్యపురాణతీర్థ విద్వాన్
జనమంచి వేంకట సుబ్రహ్మణ్యశర్మ,
తెలుఁగుపండితుఁడు మునిసిపల్ హైస్కూలు.

కడప,
15-3-1929
విభవ ఫాల్గుణ శుద్ధపంచమి

# ఇటీవల తోడుపడినవారు.

## పోషకుల శేషము

మ-రా-శ్రీ, పేరేచెర్ల జగన్నాథశ్రేష్ఠి, గోకులపల్లె

క ఘనపేరేచర్లాన్వయ, మునఁబుట్టి జనోపకారమున శౌర్యమునం
దనరు జగన్నాథశ్రేష్ఠిని గాచును సంతతంబు శ్రీశుఁడు పేర్మిన్

మ-రా-శ్రీ, తోట చలమారెడ్డిగారు, బాపురెడ్డిపల్లె

క వినుతంబగుతోఁటకులం, బునఁగల్గి విశిష్టమార్గమునఁ దేజమునన్
దనరినచలమారెడ్డిని, వనజదళాక్షుండునై న వామనుఁ డేలున్

మ-రా-శ్రీ, కాకూరు నాగిరెడ్డిగారు, అనంతసాగరం, నెల్లూరుజిల్లా

క కాకూరువంశమున సు, శ్లోకులు మెచ్చంగఁ బొడమి సొంపుగ నెసం
గఁగ నొన్న నాగిరెడ్డని, శ్రీకమలానాథుఁ డేలు జెలఁగెడు కరుణన్

మ-రా-శ్రీ, నాగిరెడ్డ వెంకిరెడ్డిగారు, కలువాయి, నెల్లూరుజిల్లా

చ విలసితనాగిరెడ్డి సమశిక్షితుఁడై కులాన్వయమందు గీర్తితో
గలిగి రమావిలాసమున గ్రాలుచు భూసురదేవభక్తితోఁ
జెలఁగుచు శౌర్యధైర్యములఁ జెన్నువహించిననాగిరెడ్డినిన్
జలజదళాక్షుఁడైనహరి శశ్వదలిః ప్రేమచెలంగఁ గావుతన్

క తనయూరఁ దమినిఁ జరగిన ఘనవిద్వత్సభకుఁ దగిన కార్యసహాయం
బునుఁ జేసి కీర్తిఁగాంచెను, జనులందఱు నైయటంచుఁ జాల నుతింపన్

క పరరూపాయల నచ్చటుఁ, బరిలం బగుభక్తి బుద్ధి వారలనొసఁగెన్
బదివెక్కల నీసుజనుఁడు, విదితం బగుగౌరవమున వెలయుహరిదయన్

మ-రా-శ్రీ, శింగమల కొండారెడ్డిగారు, పోటుపెం, కడపజిల్లా

క శింగమల వంశమందున, రంగార జనించి కీర్తి రాణించి తమిన్
బొంగెడకొండారెడ్డి న్రభంగ దయన్ రాముఁ డేలు వసుధాస్థలిపై

బ్రహ్మశ్రీ, విశ్వనాథ శ్రీనివాసయ్యగారు. ఆత్మకూరు, నెల్లూరుజిల్లా.

ఆ పరమవిశ్వనాథ వంశదీపకుఁడునై
వెలయు శ్రీనివాస విప్రనాథుఁ

గరుణతోఁ గనేలుఁ । గమలాక్షుఁ డాహరి
సంతసమున ధాత్రి । సంతతంబు

మ-రా-శ్రీ, చింతంరెడ్డి సుబ్బారెడ్డిగారు, రంగంపల్లె, కడపజిల్లా

క. ఘనచింతంరెడ్డికులంబునఁ గల్గి జనోపకారమున శాంతమునన్
జానరెడ్డి సుబ్బారెడ్డిని, మనసారఁగఁ బ్రోచుఁగాత । మానాథుఁ డిలన్

మ-రా-శ్రీ, మడకల మారారెడ్డిగారు, మలినేనిపట్టణము, కడపజిల్లా

క. ఇలలోన వెలయుమడకల, కులమందునఁ బుట్టి మేటి । గుణములవలనన్
వెలుఁగిన మారారెడ్డిని, జలజాక్షుం డైనశౌరి । సంతత మేలున్

## చందాదారుల శేషము

మ-రా-శ్రీ, అన్నపురెడ్డి వోబుళరెడ్డిగారు, గ్రామమేజస్ట్రేటు, పాంగూరు
కాళిదాసు వెంకటసుబ్బయ్యగారు, నెరజనంపాడు
మన్నూరు వెంకటకృష్ణయ్య, గోగులపల్లె
చల్లా వెంకటరెడ్డిగారు, పాతాళ్లపల్లె
పస్పు వెంకటరెడ్డిగారు, చాపురాళ్లపల్లె
చౌడూరు చిన్నయ్యగారు, పోస్టుమాస్టరు, ఒంటిమిట్ట, కడపజిల్లా.
రామావఝుల లక్ష్మీనరసయ్యగారు, కోటపాడు, కడపజిల్లా
చింతంరెడ్డి సుబ్బారెడ్డిగారు చిట్టిపల్లె, కడపజిల్లా
రామావఝుల గోవిందయ్య, నగరిపాడు, కడపజిల్లా
వఝుల సుబ్బనరసయ్యగారు, బుక్కాయపల్లె, కడపజిల్లా
చవనా పెంచలయ్యగారు ,, ,,

# శ్రీరస్తు.



శ్రీ తెనుఁగు వామనపురాణమునకు సహాయమొనర్చిన పుణ్యజనులగు
ఉద్ధారక, నిర్వాహక, పోషక చందాదారులనామంబు లిందుఁ
గ్రిందఁ జేర్పఁబడుచున్నవి.

## ఉద్ధారకులు.

మ-రా-రా-శ్రీ ; అల్లంపాటి పోలిరెడ్డిగారు, మంగుపల్లె, నెల్లూరుజిల్లా

సీ. శ్రీకరనిజకీర్తి । శిష్టలతాంకూర మమరవృక్షం బెల్ల । నల్లుకొనఁగ
వరనిజదానశ్రీ । వన మనుపమకంధి పూరణప్రావీణ్య । భూతి నలర
సంతతనిజగుణ । సరసపుష్పముదీప్తి శ్రీపతితోఁ జేరి । చిందులాడ
నిజదైవగురుభక్తి । నిర్మలమణిహార మలవాణివీణపై । నమరి వెల్గ
తే. నార్తిహారకైకదక్షుండు । నర్థిబృంద, చాతకాంభోధపముండును । సత్యవాక్యుఁ
డనఘుఁడును సర్వభూతహి । తాత్ముఁడైన, పోలిరెడ్డిని శ్రీహరి । ప్రోచుఁగాత
క. ఖేటులు మెచ్చఁగ నల్లం, పాటికులం బెల్ల వెలుఁగఁ । బ్రభవించి ప్రజా
కోటులు మెచ్చ ధరిత్రిన్, బాటిల్లెనుఁ గడలజయము । వరుసం బ్రాకాన్
చ. అనిశము బీదసాదలను । నాదట నేలుచుఁ బండితాదృతిం
దనరుచు శాంతభావమునఁ । దద్దనటించుచుఁ బుణ్యతీర్థసే
వనమునఁ బుణ్యగాత్రుఁడయి । భర్గునిఁ గొల్చుచు భక్తినుండి శ్ర
ద్ధను సురవిప్రకార్యరతి । ధారుణిరాజిలు నాఘునుం డొగిన్
సీ. ఒకరాత్రి నీఘనుఁ । డుత్సాహ మేపారఁ బలికెను ననుఁగాంచి । భక్తి నీవు
తెనిఁగించినట్టి వా । మనపురాణం బొగి నవనిపై శాశ్వత । మై చెలంగ
ముద్రించుటకుఁ బుణ్య । పురుషులకడ శక్తి కొలఁది ధనంబును । గార్చుకొనుము
చాలనివిత్తంబు । సమకూరఁజేసెదఁ జింతింపవలదు నీ । చిత్తసీమ
ఆ. ననుచు రెండునూఱు । లగు ధనంబునుఁ బ్రోగు
చేసి యిచ్చి కీర్తిఁ । జెందె నిట్టి
పురుషునకును శివుఁడు । బుధులెన్నఁ గైలాస
గత్యావాస మిచ్చి । కాచుఁగాత



మ-రా-రా-శ్రీ, కలిసెట్టి వెంకట భొట్లుగారు, చుంచులూరు

సీ శ్రీమించు కలిసెట్టి । శిష్టవంశంబందు జనియించి దీప్తితోఁ । జాలవెలిఁగి
వెంకటభొట్లను । పేరుతో రాజిల్లి ధైర్యసాహసములఁ । దద్ద నలరి
వైద్యగణంబుల । భాసిల్లి సురవిప్రపూజాపరుండునై । పుణ్యతీర్థ
ముల మున్గి గతపాప । ముల నలరారుచుఁ దమి బీదలకు నెల్ల । ధనమొసంగి
తే జ్ఞానియై ముక్తికన్యతో । గాఢకేళిఁ, దేలి సంసారవార్ధిని । దీప్తిదాఁటి
పెద్దలనుఁగన్న భక్తితో । విస్తరిల్లె, నౌర నీఘనునెన్న శ । క్యంబె ధరణి.
క పదిపదుల సంఖ్యధనమును, సదయుండై యచ్చుఁ గూర్ప । స్వయముగ నొసఁగెన్
బదిల మగు మోక్షపదమును, ముదమున నిడుఁ జక్రి యట్టి । పుణ్యాత్మునకున్

---

మ-రా-రా-శ్రీ, గ్రంథే చెన్నయ్య శ్రేష్ఠిగారు, నాయునిపల్లె

సీ శ్రీసతీకరుణతోఁ । జెన్నుమీఱెనఁటన్న వాక్చమత్కారంబు । వలన వెల్గు
విజయాభిరాముఁడై । విఖ్యాతిఁ గెనఁటన్నఁ బరహితవృత్తితోఁ । బ్రజ్వరిల్లు
ధీగణ్యబుద్ధితోఁ । దేజరిల్లెనఁటన్నఁ బుణ్యకార్యాసక్తి । బోలుపు మిగులు
సత్కర్మపాలన । సారజ్ఞుఁడు నఁటన్న సాధుసంగతితోడఁ । జాల నలరు
తే ధర్మమార్గప్రవిష్టుఁడై । తనరె నన్న, నిత్యశాంతమ్మువలనను । నెగడసాగె
నౌర! గ్రంథేకులాబ్ధి శ । శాంకుఁడైన, చెన్నయశ్రేష్ఠి భువి నిట్టు । చెలఁగెఁ దమిని
క ఈసుజనునకునుఁ దమ్ముఁడు, నై సోమయసెట్టి భూసు । రామరసేవో
ద్భాసితుఁ డచ్యుతపదయుగ, శాసక్తస్వాంతుఁ డగుచు । నలరును గీర్తిన్
క అచ్చునకై శతరూప్యము, లిచ్చిరి సమకూర్చి భక్తి । నీతఁడు వీరిన్
ముచ్చట లూరం గాచును, సచ్చరితులు మెచ్చుచుండ । క్ష్మాస్థలిలోనన్.

---

మ-రా-రా-శ్రీ, గోపవరం గోపాలరెడ్డిగారు, గోపవరము, కడపజిల్లా

సీ శ్రీగోపవరగోత్ర । సింధుచంద్రుండునై పృథివీశభక్తితో । నెసఁగి తమిని
సాధుపోషణమున । సంతతయాచకవాంఛాప్రదానసక్తి । వలన మిగిలి
సజ్జనగోష్ఠిని । సతతంబు భాసిల్లి కవులసంతుష్టులఁ । గా నొనర్చి
వాక్చమత్కారంబు । వలన ధైర్యంబునఁ బ్రబలవిక్రమమున । సొబగుఁగాంచి
ఆ పరులగర్వ మడఁచి । భక్తి నిర్జరవిప్ర, కార్యకరణదీక్షఁ । గ్రాలి కీర్తిఁ
గొమరు మిగులునట్టి । గోపాలరెడ్డిని, బ్రోచు రామచంద్ర । భూపుఁ డెలమి.
తే. వామనపురాణ మిల నచ్చు । పడుట కొఱకు
ఘనముగను విత్త మొనఁగూర్చి । గణ్యలెన్న

నిచ్చె నీపుణ్యశాలికి । నీశ్వరుండు
కడిమి సుఖభోగముల నిచ్చి । కాచుఁగాత

మ-రా-రా-శ్రీ, కీర్తిశేషులగు అల్లంపాటి పెంచలరెడ్డిగారు,
మంగుపల్లె, నెల్లూరుజిల్లా

ఉ వంచనలేనివాఁడును వి । ఖ్యాతిఁ డల్లముపాటివంశజుం
డంచితవిత్తశాలియు మ । హామతియుం గురుభోగవంతుఁడున్
మించిన కీర్తిశేషమున । మేదినిపై విలసిల్లువాఁడు నా
పెంచలరెడ్డిఁ బ్రోచు హరి । ప్రీతిని నాత్మపదంబునం దగన్

# నిర్వాహకులు.

బ్రహ్మశ్రీ, లోకా పెంచల సుబ్బయ్యగారు, సోమశిల, నెల్లూరుజిల్లా

సీ అనిశమ్ము శాంతమ్ము । వినయమ్ము రాజిల్లఁ బొల్పారు నేవాని । బుద్ధిసీమ
సకలభూతకృపాల । తాంకూరరత్నంబు భాసిల్లు నెవ్వాని । భావసీమ
దాక్షిణ్యదానాది । ధర్మసద్గుణములఁ జెన్నారు నేవాని । చిత్తసీమ
వరదైవగురుమునిభ । క్తిఁ నెపు డాలవాలమా నేవాని । స్వాంతసీమ
తే యట్టి సుజనుఁడు లోకాన్వ । యార్ణవాబ్జుఁ
డైన పెనుశిలసుబ్బయ్య । కద్రిరాజ
పుత్రికాలోలుఁ డైనట్టి । పురహరుండు
కరుణ సుఖభోగముల నిచ్చి । కాచు గాత.

క. తనధనము నచ్చు తొఅకై, ఘనముగ నిడి కీర్తితోడఁ । గాశ్యపిలోనం
దనరారె నీవరోత్తము, మనసార నుమేశ్వరుండు । మాటికి నేలున్

మ-రా-రా-శ్రీ, చల్లా చెంచుపాపిరెడ్డిగారు, రాపూరు చెంచువోబుళరెడ్డిగారు,
చంద్రపల్లె, కడపజిల్లా.

సీ. పరఁగఁ జల్లాన్వయ । ప్రభవుండు భూసుర భక్తుండుఁ బరహిత । పరుఁడు మనుజ
పతిమాన్యుఁడౌఁ జెంచు । పాపిరెడ్డిని దమిఁ బాలించు శ్రీరామ । భద్రుఁ డెలమి
శ్రీకరచరితుండు । శిష్టగుణాఢ్యుండు రాపూరుకులజుఁడై । రహిఁ జెలంగు
చెంచు వోబుళరెడ్డి । మించినకరుణతో నలరినవాఁడునై । యభవుఁ డేలు
ఆ వేడ్క నచ్చునకును । విస్తృతభక్తితో
నైజధనము నిడిరి । నాల్గుఁదులుఁ

గానఁ బుణ్యలోక । గలియును గీర్తియు
వీరి కొనరుచుండు । విష్ణుదయను.

---

మ-రా-రా-శ్రీ, బిజివేముల రామిరెడ్డిగారు, ఆ చెన్నారెడ్డిగారు,
చవ్వటపల్లె, కడపజిల్లా

సీ శ్రీబిజివేముల । శ్రేష్ఠవంశంబునఁ బిచ్చిరెడ్డి జనించె । విశ్వమందు
నాపుణ్యధనునకు । ననఘాత్ము లగు రామిరెడ్డి చెన్నారెడ్డి । ప్రీతి గుల్కఁ
బుత్రులై వితరణ బుద్ధి । భావంబుల నలరారి పుణ్యకా । ర్యప్రవర్త
నంబున యశమున । నల్దిక్కులందునఁ గడిమి శోభిల్లి యీ । గ్రంథముద్ర
తే ణార్థమై రెండుపదులసం । ఖ్యను జెలంగు
విత్తమును నిచ్చిరటు కాన । వీరిఁ జక్రి
కరుణఁ జిగురొత్తుచుండఁగాఁ । గాచు సర్వ
విబుధు లరుసందుచుండ నీ । విశ్వమందు

---

మ-రా-శ్రీ, చిట్లూరు రాచయ్యశ్రేష్ఠిగారు, మంగుపల్లె, నెల్లూరుజిల్లా.

తే కోమరు మిగిలిన చిట్లూరు । కులమునందు
వేంకటశ్రేష్ఠి జన్మించి । విపులకీర్తిఁ
జెలఁగె నతనికి రాచయ । శ్రేష్ఠి పుత్రుఁ
డగుచు ధరఁబుట్టి దీప్తితో । నలరి యతఁడు.
తే కాశి మొదలగుచున్నట్టి । గణ్యపుణ్య, తీర్థములనెల్ల సేవించి । తెంపుతోడ
దానము లొనర్చి నిజవంశ । ధర్మవృత్తిఁ, బరఁగి శాంతస్వభావంబు । భాసిలంగ
సీ సుకతసంగిణిఁబోలి । తోఁణఁ బినాకిని తనరుఁ; దదుత్తర । తీరమందు
నభవుఁడా సోమేశుఁ । డలరును; నట ధర్మసత్రంబుఁ గట్టించి । శ్రద్ధతోడఁ
గరకరంపుతిరునాళ్ల । కాలంబులోఁ బ్రతివత్సరంబున బంధు । వర్గమునకు
సన్యాసులకును దమి । నన్నదాన మొనర్చి పొరిఁ గీర్తి నలరు నీ । పుణ్యపురుషుఁ
ఆ డిచ్చె నచ్చుకూలికి । నేబదిసంఖ్యతో, నలరుచుండు ధనము । నధికభక్తిఁ
గాన శంకరుండు । కల్యాణములనెల్లఁ, గరుణ నితని కిచ్చి । కాచుఁగాత

---

మ-రా-రా-శ్రీ, రామిరెడ్డి వోబుళకొండారెడ్డిగారు,
కదిరినాయనిపల్లె, నెల్లూరుజిల్లా

క ఇలఁ జెలఁగుజనులు పలుదెఱఁగులఁ దెరొక్కన రామిరెడ్డి । గోత్రంబం దు
జ్జ్వలగుణగణమణియై యో, బుళకొండారెడ్డి పుట్టి । పొంగారురుచిన్.

చ ధరణిని బాలచంద్రు గలెఁ । దద్దయుఁ బెంపును జెంది కీర్తితోఁ
బరఁగుచు శాంతచిత్తమున । బ్రాహ్మణులన్ సురల న్భజించుచున్
నిరతముఁ బుణ్యకార్యముల । నేర్పునఁ జేయుచు నుండునట్టి య
ప్పురుషుని మామనోహరుఁడు । పూర్ణ దయారసదృష్టి నేలుతన్

---

మ-రా-శ్రీ, రాచపల్లె నాగిరెడ్డిగారు, కుంటనెల్లిపాడు, నెల్లూరుజిల్లా

చ అవనిని రాచపల్లెకులశమం దురుదీప్తిని గంగిరెడ్డి భూ
ధవులు సుతింపఁ బుట్టి బహు । ధార్మికవృత్తిని విప్రదేవతా
నివహముల న్భజించుచును । నిత్యము పేదలఁ గాచునట్టి మా
నవునకు నాగిరెడ్డి యను । నర్మిలిపుత్రుఁడు కల్గి సొంపునన్
ఆ. పెరిగి సాధువృత్తిఁ । వెలయుచు శాంతభా
వమ్ముతోడ మిగుల । వఱలునట్టి
పురుషవరుని రామ । భూపాలచంద్రుండు
కాచు సుతులధనముఁ । గడిమి నొసఁగి

---

మ-రా-శ్రీ, కీర్తిశేషులగు దరిశి వెంకటసుబ్బయ్యగారు, నెల్లూరు

క ఘనుఁడు యశోశేషుండును,
జనమాన్యుఁడు దరిశి వంశ । సంభవుఁడు దయా
ధనుఁడౌ వేంకటసుబ్బ
య్యనుఁ బ్రోచును ముక్తి నొసఁగి । యచ్యుతుఁడు దయన్

---

మ-రా-శ్రీ, బుట్ట వెంకటరామిరెడ్డిగారు, కామిరెడ్డిపాడు, నెల్లూరుజిల్లా

ఉ పొంకముమీఱ రాజిలెడి । బుట్టి కులంబునఁ బుట్టి దీప్తి నే
ణాంకునిరీతి భాసిలుచు । నార్యధరామరదేవభక్తితో
శంక యొకింతలేని దగు । స్వాంతమునం దనరారువాఁడు నా
వేంకట రామిరెడ్డికిని । విశ్వవిభుం డొసఁగూర్చుభద్రముల్

---

మ-రా-శ్రీ, పాతపాటి నరసారెడ్డిగారు, వరికుంటపాడు, నెల్లూరుజిల్లా.

క. వరపాతపాటికులజుఁడు, నరసు డు భూదేవదేవ । చయభక్తుండౌ
నరసారెడ్డిని శ్రీహరి, కరుణ న్గాపాడు ధాత్రిఁ । గరుణామతితోన్

---

మ-రా-శ్రీ, తోఁట సుబ్బయ్యగారు, కుల్లూరు, నెల్లూరుజిల్లా.

ఉ. శ్రీకరతోఁటవంశవర । సింధుశశాంకుఁడు శౌర్యవంతుఁ డ
స్తోకయశోవిలాసుఁడును । దుర్జనదూరుఁడు వైద్యగణ్యుఁడుం
బ్రాకటదైవభక్తుఁడును । బంధురతుండుఁ గవీశ్వరుండు సు
శ్లోకుఁడు ధర్మశాలి యగు । సుబ్బయ నేలును రాముఁ డెప్పుడున్

మ-రా-శ్రీ, మానుగుంట చిన్నచెంచయ్యగారు, కొత్తపల్లె, నెల్లూరుజిల్లా

చ. మనుజ శశాంకుఁడై సకల । మానవకోటిహితుండు శాంతుఁడున్
వినయవివేకశీలుఁడును । విప్రబుధామరపూగభక్తుఁడున్
ఘనుఁడును మానుగుంటకుల । కంధిశశాంకుఁడుఁ జిన్నచెంచయా
ఖ్యనుఁ జెలువొందుసజ్జనునిఁ । గంజదళాక్షుఁడు ప్రోచు నిత్యమున్.

మ-రా-శ్రీ, పున్నపు కేశవయ్యగారు, నెల్లూరుజిల్లా

ఉ. పున్నపుగోత్రజుండు బుధ । పుంగవపాదయుగార్చనాపరుం
డున్నతకీర్తిశాలియగు । నోత్తరుఁ డచ్యుతభక్తియుక్తుఁడున్
సన్నుతమార్గుఁడున్ సతత । సత్యరతుం డగుకేశవాఖ్యునా
పన్నశరణ్యుఁ డైనహరి । భావము రంజిలఁ బ్రోచు ధాత్రిపై

మ-రా-శ్రీ, పాబోతు వేంకటరాయలుగారు, గోగులపల్లె, నెల్లూరుజిల్లా.

ఉ. దాతయు మిత్రకార్యహిత । తత్పరుఁ డార్యగణార్చనుండుఁ బా
బోతుకులప్రదీపకుఁడు । భూరియశుండును శేషయాత్మజుం
డాతతధైర్యశక్తి నల । రారిన వేంకటరాయనిం దమిన్
శ్రీతరుణీమనోహరుఁడు । చిత్తము రంజిల నేలు భూస్థలిన్
క. రెండగుపదులధనంబును, దండిమతు ల్మెలఁగ నిడిరి । తమి నచ్చునకై
చండాంశుకులజుఁ డగురా, ముం డొసఁగుశుభమ్ము నిత్యమును వీరి కిలన్

## పోషకులు.

మ-రా-శ్రీ, కాళిదాసుసుబ్బాశాస్త్రిగారు, నెల్లూరు.

క. వరకాళిదాసకులజుఁడు, గురుధర్మాయనుఁడు శాస్త్ర । కోవిదుఁడు దయా
పరుఁడౌ సుబ్బాశాస్త్రిని, సరసీరుహనేత్రుఁ డేలు । ధాత్రీస్థలిలోనన్

మ-రా-శ్రీ, రామావఝుల నారాయణయ్యగారు, ఎప్పిరాలగ్రామము, కడపజిల్లా

క శ్రీరామావఝులకుల, వారిధిసోముండు ధీరభావాన్వితుఁడౌ
నారాయణయ్య నేలు న, పారదయాదృష్టి శౌరి ప్రత్యహమందున్

మ-రా-శ్రీ, కంచి సుబ్బయ్యశ్రేష్ఠిగారు, చాపురాళ్లపల్లె, నెల్లూరుజిల్లా

క. ఘనకంచివంశజాతుఁడు, మనుజశ్రేష్ఠుండు ధైర్య మహితుండు యశో
ధనుఁడగుసుబ్బయ్యశ్రే, ష్ఠినిఁ గాచుత చక్రపాణి చిత్తం బలరన్

మ-రా-శ్రీ, మురుకూటి కొండారెడ్డిగారు

క మురుకూటిగోత్రజాతుఁడు, బరహిత కార్యుండు బంధుపరివృతుఁడు గుణా
కరుఁ డగుకొండారెడ్డిని, పరసిజభవజనకుఁ డేలు సంతస మలరన్

మ-రా-శ్రీ, సన్నపురెడ్డి రామిరెడ్డిగారు.

క సన్నపురెడ్డికులంబున, జెన్నలరం బుట్టి పెరిగి శ్రీలిపైఁ గీర్తిం
గన్నట్టి రామిరెడ్డిని, వెన్నెలదొరబావమఱఁది వేడుకఁ గాచున్

మ-రా-శ్రీ, పెద్దిసెట్టి చలమయ్యగారు.

క. కరివరదచరణసేవా, పరచిత్తుఁడుఁ బెద్దిసెట్టి వంశజుఁడుఁ గృపా
పరుఁడగుచలమయ్యను శ్రీ, ధరుఁ డోముత సంతతంబుఁ దయదళుకొత్తన్.

మ-రా-శ్రీ, మద్దిసెట్టి కొండయ్యగారు

తే మద్దిసెట్టికులంబందు మాన్యు లెన్నఁ
బుట్టిపెంపొంది కీర్తితో భువినిఁ గ్రాలు
కొండయశ్రేష్ఠి ననిశముఁ గువలయమున
జానకీనాథుఁ డేలును మానితదయ

కీర్తిశేషుఁడగు కంచి రామయ్యగారు.

ఆ కంచివంశమందు ఘను లెన్న జన్మించి, మంచివాఁడటంచు మనుజులనఁగ
బొనరి కీర్తిశేష మునను న్న రామయ్య, నచ్యుతుండు కాచు నాదరమున.

మ-రా-శ్రీ, గుట్టపల్లె నరసప్పనాయుఁడుగారు, ఏకరపాడు.

క. ధర గుట్టపల్లె కులజుఁడు, సరసుఁడు బంధుప్రియుండు సాధుహృదయుఁడౌ
నరసపనాయుని రాముఁడు, నిరతముఁ గాపాడుఁ బేర్మి నెగడుచు నుండన్.

మ-రా-శ్రీ, కోటి గంగిసెట్టిగారు, గోగులపల్లె, నెల్లూరుజిల్లా.

ఆ కోటవంశజుండు । గుణశాలియును దయా
పరుఁడు సత్యరతుఁడు । బంధుహితుఁడు
విప్రదేవభక్తి । విలసితుఁడౌ గంగి
సెట్టిఁ గాచు నెపుడు । శ్రీధరుండు

మ-రా-శ్రీ, తోఁట చిన్నసుబ్బయ్యగారు, గోగులపల్లె, నెల్లూరుజిల్లా

ఆ. తోఁటవంశమందు । వాటిల్లు వన్నెతోఁ, గలిగి పెరిగి కీర్తిఁ । గ్రాలు చిన్న
సుబ్బయాభిధాన । సుజనుని గోపాల, బాలుఁ డేలుఁ జేర్మి । పరిఢవిల్ల

మ-రా-శ్రీ, సుసర్ల అంకయ్యగారు

క శంకారహితుం డపగత, సంకటుఁడు సుసర్లవంశ । సంజాతుండౌ
నంకయ్యనుఁ గమలేశుఁడు, పొంకమునఁ ధాత్రిమీఁద । బ్రోచుచు నుండున్.

మ-రా-శ్రీ, చందలూరి కేశవయ్యగారు

క ఘనచందలూరివంశం, బునఁ బుట్టి విశిష్టమార్గ । మున వేడుకతోఁ
దనరారు కేశవయ్యను, వనజోదరుఁడైన చక్రి । బాగుగ నేలున్

మ-రా-శ్రీ, యిరుకుమాటి కొండప్పశ్రేష్ఠిగారు

క పండితజనరంజకవా, జ్మండనుఁ డాఢ్యుండు నిరుకు । మాటి కులజుఁడౌ
గొండప్పశ్రేష్ఠిని హరి, దండిమతిం గ్రాలి మిగుల । ధరఁ గాపాడున్

మ-రా-శ్రీ, పర్ణా బుడ్డయ్యగారు

క. వరపర్ణావంశంబున, గురుకాంతి జనించి మించి । కూరిమిఁ బ్రజలం
గరిమనుఁ గను బుడ్డయ్యను, బరమాత్ముం డైనరామ । భద్రుం డేలున్

మ-రా-శ్రీ, కంటె పుల్లయ్యగారు, కొత్తపల్లె, నెల్లూరుజిల్లా.

క. వినయమ్మున శాంతమ్మునఁ, గనికరమున సాహసమున । ఘనతను మిగులన్
దనరిన కంటే పుల్ల, య్యనుఁ గాచును మాపతిసుఁ । డతిమోదమునన్.

మ-రా-శ్రీ, దూబిసెట్టి నాగయ్యగారు.

క. ఘనదూబిసెట్టి కులమున, జనియించి సుశీలవృత్తి । చాతుర్యములం
దనరారిన నాగయ్యను, మనసారఁగ నేలుఁ ధాత్రి । మాపతి కరుణన్.

మ-రా-శ్రీ, కాసా సూరపరెడ్డిగారు, అగ్రహారము, నెల్లూరుజిల్లా.

క. శ్రీసత్యమంచిరుండును, దాసావనుఁడైన చక్రి । దయ తళుకొత్తం
గాసా సూరపరెడ్డిని, భాసురమతిఁ గోడ నేలుఁ । బ్రత్యహమందున్

—•—

మ-రా-శ్రీ, పేరుభొట్ల శేషయ్యగారు, బొమ్మవరము, నెల్లూరుజిల్లా.

ఉ. శ్రీకర పేరుభొట్ల వర । సింధువునందు హిమాంశురీతి న
స్తోకరుచిం జనించి ధర । సొంపునఁ బెంపును జెంది నిత్యముం
బ్రాకటకీర్తితో మిగుల । రాగిలు శేషయ నామధేయు ద
ర్వీకరవైరివాహనుఁడు । వేడుక లూరగ నేలు నిత్యమున్

—•—

మ-రా-శ్రీ, పప్పు రామిరెడ్డిగారు

ఆ. పప్పువంశమందుఁ । బ్రభవించి ధీరత్వ, సరణివలన ధాత్రిఁ । జాల నలరు
నట్టి రామిరెడ్డి । ననిశము గోపాల, బాలుఁ డేలుఁ గూర్మి । పరిఢవిల్ల.

—•—

మ-రా-శ్రీ, కలువాయ ఎరుకలరెడ్డిగారు

క. కలువాయ గోత్రజుండును, జలజాతపదార్చనుండు । శాంతుం డురుధీ
కలితుఁడు సుగుణుం డగునెరు, కలరెడ్డినిఁ బ్రోచు శివుఁడు । కృప చిగురొత్తన్.

—•—

మ-రా-శ్రీ, అల్లంపాటి పెంచలరెడ్డిగారు

క. ఇల నల్లముపాటి మహా, కులమందు జనించి దీప్తిఁ । గోమగారి దయా
కలితగురుచిత్తుఁ డగుపెం, చలరెడ్డిని గాచు శివుఁడు । సంతోషమునన్

—•—

మ-రా-శ్రీ, సంగరాజు వేంకటరామరాజుగారు, ఎగువపల్లె, నెల్లూరుజిల్లా

క. శంకరభక్తుం డపగత, శంకుండును సంగరాజు । సద్వంశజుఁడౌ
వేంకటరామనృపాలునిఁ, బంకజదళనేత్రుఁ డేలుఁ । బరమాదృతిమై

—•—

మ-రా-శ్రీ, సంగరాజు వేంకటసుబ్బరాజుగారు

తే. సంగరాజకులంబెల్ల । జగతి దీప్తి
నలర జన్మించి పెంపొంది । యధికకీర్తి
శోభితుం డగువేంకట । సుబ్బరాజుఁ
బ్రోచు మానాథుఁ డగుశౌరి । భూమియందు

—•—

శ్రీదొమ్మరాజు చెంచురాజుగారు

తే. దొమ్మరాజు కులాబ్ధిని । దుహినకిరణు
కరణి జన్మించి దీప్తితోఁ । గ్రాలి దాన

పరుఁడు శాంతుండు ధీరుండు । భవ్యుఁడైన
చెంచురాజును బాలించు । శ్రీధరుండు

శ్రీపందిటి సుబ్బరాజుగారు, గుడిగుంటగ్రామము, నెల్లూరుజిల్లా

క. పందిటివంశజనితుఁడు, బృందారకభక్తుఁ డనిశ । పృథుయశుఁడు దయా
స్పందుఁ డగుసుబ్బరాజును, సుందరధరుఁ డైనచక్రి । మాటికి నేలున్

శ్రీదొమ్మరాజు వోబుళరాజుగారు

క. ధరదొమ్మరాజుసంతతి, వరకాంతి జనించి విబుధ । వర్యులసేవం
బరఁగిన యోబుళరాజును, బరమాత్ముం డైనరామ । భద్రుం డేలున్

శ్రీమునగపాటి వెంకటసుబ్బరాజుగారు, చిలకలమఱ్ఱి, నెల్లూరుజిల్లా

ఉ. పంకవిహీనమౌ మునగ । పాటి మహాకులవార్ధియందు నే
ణాంకునిఁబోలి కల్గి వినయంబును నిర్జరవిప్రకార్యని
శ్శంకితచిత్తవృత్తియును । సజ్జనసేవయు నొప్పువాఁడు నా
వేంకటసుబ్బరాజునకు । వేంకటనాథుఁ డొసంగు భద్రముల్.

శ్రీమునగపాటి వేంకటరాజుగారు

ఉ. పంకవిహీనమౌ మునగ । పాటికులం బిల వన్నెఁగుల్క బ
ల్వంకముగా జనించి గురు । విప్రులఁ బెద్దలఁ గన్న శ్రద్ధతోఁ
గింకరుఁడై భజించుచును । గీర్తిని రాజిలుచున్నవాఁడు నా
వేంకటరాజు నేలు శ్రుతి । వేద్యుఁడు నా హరి సార్వకాలమున్.

శ్రీమునగపాటి నల్లపరాజుగారు

క. ఘన మునగపాటికులజుం, డనఘుఁడు శాంతుండు భూసు । రామరభక్తిన్
దనరెడు నల్లపరాజును, వనమాలి దయార్ద్రదృష్టి । బరిపాలించున్.

శ్రీనందిమండలము వేంకటరాజుగారు.

తే. పండితామరభక్తుండు । భద్రయశుఁడు
మేటిగుణములతోడను । మెఱయువాఁడు
నందిమండలచంద్రరా । జునకు ననుమఁ
డైనవేంకటనృపు హరి । యవనిఁ గాచు

### శ్రీ పెసల నాగిసెట్టిగారు

ఆ. పెసలవంశజుండు । ప్రియవాక్యసంపన్నుఁ, డార్యకార్యయత్న । హర్షుఁ డైన
నాగిసెట్టి నేలు । నానాచరాచర, స్వామి యైనరామ । చంద్రుఁ డెపుడు

---

### శ్రీ చిట్లూరు పుల్లయశ్రేష్ఠిగారు, మంగుపల్లె, నెల్లూరుజిల్లా

ఉ. శ్రీరమణీయమందిరుఁడు । శిష్టజనాంబుజసూర్యుఁడుం జి
ట్లూరు కులప్రదీపకుఁడు । లోభవివర్జితమానసుండు స
ద్భూరమణప్రసాదుఁ డగు । పుల్లయశ్రేష్ఠిని సర్వవిష్టపా
ధారుఁడు నైన శంకరుఁ డు । దారకృతిం దనరారి కావుతన్

---

### శ్రీ చిట్లూరు వీరయ్యశ్రేష్ఠిగారు.

తే. అద్రిజేశుండు భక్తసం । ఘావనుండు, సర్వభూషణుఁ డైనట్టి । శంకరుండు
కూర్మితోడను జిట్లూరు । కులజుఁ డైన, వీరయశ్రేష్ఠిఁ గాచును । వేడ్కలర

---

### శ్రీ మాలెపాటి సుబ్బరామయ్యశ్రేష్ఠిగారు

తే. మాన్యు లెన్నఁగఁ గీర్తితో । మాలెపాటి
వంశమునఁ బుట్టి రహిమీఱి । వఱలు సుబ్బ
రామయశ్రేష్ఠి ననిశము । రామచంద్ర
భూమిపాలుండు పాలించు । భూమిఁ గరుణ.

---

### శ్రీ బుట్టి బ్రహ్మయ్యగారు, కామిరెడ్డిపాడు, నెల్లూరుజిల్లా

క. జనులెన్న బుట్టికులమున, జనియించి రుచిం జెలంగి । శౌర్యస్ఫూర్తిం
దనరిన బ్రహ్మయ్యను హరి, మనసారఁగ నేలుఁగాత । మాటికిఁ గరుణన్.

---

### శ్రీ ఊరిమిండి రాఘవరెడ్డిగారు.

తే. ఊరిమిండికులం బందు । నుద్భవించి
విక్రమోదారగుణముల । విస్తరిల్లి
ప్రీతి నలరారు రాఘవ । రెడ్డి నెపుడు
సకలశుభముల నొనఁగూర్చు । శౌరి మిగుల.

---

### శ్రీ చంద్రా నరసపనాయునిగారు, వెదుసుపల్లె, నెల్లూరుజిల్లా

క. వరచంద్రాన్వయమందున, సరసులు మెచ్చంగఁ గలిగి । సద్గుణములతోఁ
బరఁగిన నరసపనాయునిఁ, గరుణామతి రాముఁ డేలుఁ । గాశ్యపిలోనన్.

---

శ్రీ యగిటిల చంచయ్యగారు, వెంకటరెడ్డిపల్లి, నెల్లూరుజిల్లా

క. యగిటిల వంశోద్భవుఁడును, సుగుణియు నాఁ జెంచయాఖ్యు । సుభగశ్రేష్ఠున్
ఖగవాహనుండు ప్రోచును, నగణిత మగు శుభము లిచ్చి । యనఘులు మెచ్చన్

శ్రీ కందనూరి వెంకటసుబ్బయ్యగారు, దేవరాయపల్లి, నెల్లూరుజిల్లా

తే. కందనూరికులంబందుఁ । గలిగి దీప్తిఁ
బెరిగి యశమున ధాత్రిపై । విస్తరిల్లి
నట్టి వేంకటసుబ్బయ్య । నచ్యుతుండు
కరుణ చిరకాలము రక్షించుఁ । గౌతుకమున

శ్రీ గంజాము నృసింహాచార్యులు, మహిమలూరు, నెల్లూరుజిల్లా.

సీ వసుధ గంజాము సద్వంశమం దుదయించి వినయగుణంబుల । విస్తరిల్లి
భిషగుత్తముండు నై । పృథివి బీదలఁ గాచి సభలందుఁ గీర్తితోఁ । జాల నలరి
భవవాంఛఁ బోనాడి । వరచిత్రగోపురప్రాసాదములతోడఁ । బ్రబలు గుడినిఁ
గట్టించి యట రమా । కాంతుఁడౌ శౌరిని నిల్పి పూజించుచుఁ । నిర్మలాత్మ
తే నలరి వీతరాగుఁ । డౌ నృసింహాచార్య, వర్యునకును భక్త । వరదుఁ డమర
వందితుండు నైన । వామనదేవుండు, నిజపదంబు నొసఁగి । నెమ్మిఁ గాచు.

శ్రీ యద్దనపూడి వెంకటప్పయ్యగారు, ఆత్మకూరు, నెల్లూరుజిల్లా.

తే బుధులు మెచ్చంగ యద్దని పూడి వంశ
మందు జన్మించి మిత్రతే నలరి పుణ్య
మనుజుఁడై కీర్తితోడను । మలయుచున్న
వేంకటప్పయ్య నిల నేలు । విశ్వవిభుఁడు.

శ్రీ వేమన లింగయ్యశ్రేష్ఠిగారు, చుంచులూరు, నెల్లూరుజిల్లా

తే ఉర్వి వేమనవంశమం । దుద్భవించి
పెరిగి విప్రార్చనాశక్తి । వెలసి కీర్తిఁ
జెలఁగుచుండిన లింగయ శ్రేష్ఠి నెపుడు
పురహరుం డైన శంభుండు । ప్రోచుఁగాత.

శ్రీ కంచి కంటు పోలయ్యశ్రేష్ఠిగారు, కొండయ్యశ్రేష్ఠిగారు.

క వినుతిం బరుకం చేకుల, మునుఁ బేర్కొనఁ జేసినట్టి । పోలయ్యశ్రే
ష్ఠిని గంచి కొండయశ్రేష్ఠినిఁ దమిఁ గాపాడు ధాత్రి శ్రీశుఁడు పేర్మిన్.

## శ్రీ సుద్దపల్లె గిడ్డయ్యశ్రేష్ఠిగారు

ఆ సుద్దపల్లె వంశ।జుండును సురవిప్ర, భక్తుఁ డధికశౌర్య।బంధుయుండుఁ
గీర్తిలలితుఁ డైన।గిడ్డయ్యశ్రేష్ఠిని, సంతతంబుఁ గాచుఁ। జక్రధరుఁడు

## శ్రీ జొన్నా రోశయ్యగారు

క చెన్నలరు సుగుణగణముల, సన్నుతిఁ గన్నట్టివాఁడు। సరసాత్ముండౌ
జొన్నారోశయ్యనుఁ దమి, వెన్నెలదొర బావయుండి। వేడ్కనుఁ గాచుఁ.

## శ్రీ కంటే చెంచయ్యగారు.

క వనజోదరభక్తుండును, వినయో క్తి విశారదుండు। విఖ్యాతుఁడుఁ
ఘనుఁ డగుకంటే చెంచ, య్యను గాచును మాధవుం డ।హర్నిశమందుఁ

## శ్రీ వేమన చిన్నయ్యగారు

తే పరమ వేమనవంశ సం।భవుఁడు వినయ
శీలుఁ డైనట్టి చిన్నయ।శ్రేష్ఠి కెపుడు
భద్రవిజ్ఞానముల నిచ్చి। భవుఁడు ప్రేమ
సంతతంబునుఁ గాపాడు। జగతి యందు

## శ్రీ వేమన ఓబయ్యశ్రేష్ఠిగారు

క. ఘనవేమనకులజుండును, మనుజాఢ్యుఁడు విమలవాక్య।సహితుండు దయా
ధనుఁ డగునోబయ్యశ్రేష్ఠినిఁ గాచును జక్రధరుఁడు। క్షితితలమందుఁ

## శ్రీ కీర్తిశేషుఁడగు కంటే రోశయ్యగారు

క. వినయుఁడు గంటేకులజుం, డనఘుండునుఁ గీర్తిశేషుఁ। డగురోశయ్యన్
వనమాలి యైనశ్రీశుఁడు, తనలోకమునందుఁ బ్రేమ। దద్దయు నేలున్

## శ్రీ దూబిసెట్టి పాపయ్యగారు

క. మునిజనవంద్యుఁడు సుజనా, వనుఁడును భగవంతుఁ డైన।వనమాలిదయన్
ఘనుదూబిసెట్టి పాప, య్యనుఁ బ్రోచును బ్రేమతోడ। నవనీస్థలిపై.

## శ్రీ మానుగుంట కోదండరామయ్యగారు,

నాయునిపల్లె, నెల్లూరుజిల్లా.

క ఘనమానుగుంటకులజుం, డనఘుఁడు కోదండరామ।యాఖ్యుం డగుస
జ్జను నేలు విబుధు లెన్నఁగ, వనజాతుం డైనరామ।భద్రుం డుర్విన్.

శ్రీ నాగరాజుపల్లె మునిస్వామి సీతారామయ్యగార్లు

క. సామజవరదుఁడు విలస, ద్ధాముఁడు రాముండు గాచుఁ । దనయు శ్రీ సీతా
రామయనాదటనుముని, స్వామిని ధర నాగరాజు । పల్లెకులజులన్

---

శ్రీ ఆస్తి వెంకటరాజుగారు, రాచపాళెము, నెల్లూరుజిల్లా

క. ఘనులెన్న నస్తిగోత్రం, బునఁ గల్గి పరోపకార । బుద్ధి న్మిగులం
దనరిన వెంకటరాజును, గనికరమునఁ జక్రపాణి । గాచు ధరిత్రిన్

---

శ్రీ పేర్ల చంచయ్యశ్రేష్ఠిగారు, లిమ్మానాయునిపేట, నెల్లూరుజిల్లా

ఆ. పేర్లవంశమందుఁ । బ్రఖ్యాతి జన్మించి, పెరిగి శాంతవృత్తి । వెలసి కీర్తి
నలరునట్టి చెంచ । యశ్రేష్ఠి నిత్యముఁ, గరుణతోడ శౌరి । గాచుఁ గాత

---

శ్రీ మాలే చెంచురామయ్యశ్రేష్ఠిగారు

క. కరివరదుఁ డేలు నిత్యము, ధరణీసురభక్తుఁ డధిక । ధైర్యుఁడు మాలే
వరగోత్రకంధిచంద్రుం, డరిహరుఁ డగు చెంచురామ । యశ్రేష్ఠిఁ దమిన్

---

శ్రీ సంబటూరు రామసుబ్బయ్యగారు, చంద్రపల్లె, కడపజిల్లా

ఆ. సంబటూరు వంశ । జాతుండు నిజవర్ణ, సరణిరతుఁడు సత్య । సహితవచనుఁ
డార్యలక్షణుండు । నగు రామసుబ్బయ, నామవిప్రు, నేలు । నరసఖుండు

---

శ్రీ పావుదిప్పు గొండారెడ్డిగారు, రామాపురము, కడపజిల్లా

క. శ్రీరాముఁ డేలు శుభగుణ, వారాత్మునిఁ బావుదిప్పు । వంశజు నమలా
చారునిఁ గొండారెడ్డినిఁ, భూరమణులు మెచ్చుచుండ । భూస్థలిలోనన్.

---

శ్రీ యాదాల బాలయ్యశ్రేష్ఠిగారు, బెడుసుపల్లె, కడపజిల్లా

తే. భాసురంబైన యాదాల । వంశమందుఁ
బుట్టి గురుకీర్తితోడను । బొనరుచున్న
బాలయశ్రేష్ఠి గోసఁగును । భద్రపదము
సంతసంబున నలరారి । చక్రధరుఁడు.

---

శ్రీ కాల్వ ముసల్ రెడ్డిగారు, చేతాయపల్లె

ఆ. కాల్వవంశజుండు । గరుణాసముద్రుండు, శాంతభావుఁ డధిక । శౌర్యుఁడైన
ముసలరెడ్డి నెపుడు । ముచికుందవరదుఁడౌ, మాసతీశుఁ డేలు । మహినిఁ బేర్మి

---

శ్రీ కొమరగిరి వాసుదేవయ్యగారు, గోపవరము

తే. కొమరగిరిగోత్రమందునఁ । గూర్మిఁబుట్టి
వాసుదేవాఖ్యనలరారి । వసుధవన్నెఁ
గన్న విప్రోత్తమునిధైర్య । కలితు నేలు
వామనస్వామి నిత్యము । వారిగాఁగ

శ్రీ గాజులపల్లె వెంకటసుబ్బారెడ్డిగారు, బోవిళ్ళవారిపల్లె

క. ఘనగాజులపల్లె కులం, బునఁ బుట్టి సుదీప్తితోడ । భువి నెప్పెఁ బెంపొం
దిన వేంకటసుబ్బారె, డ్డినిఁ బ్రోచును గేశవుండు । డీకొను కరుణన్

శ్రీ ఎనమండ్ర గురుస్వామయ్యగారు, రివిన్యూ యిన్స్పెక్టర్, కడపజిల్లా

క. శ్రీమహితుని సుగుణోజ్జ్వల, ధాముని గురుకీర్తి పుష్ప । దాముని శాంతో
ద్దాముని నెనమండ్రగురు, స్వామిధరామరుని రామ । చంద్రుం డేలున్

శ్రీ వేరుభొట్ల నారాయణయ్యగారు, బద్వేలు, కడపజిల్లా

క. సారాచారుఁడు ధర్మా, ధారుండును వేరుభొట్ల । తతకులజుండౌ
నారాయణయ్య నేలును, నారాయణుఁ డెపుడు మనుజ । నాథులు మెచ్చన్

శ్రీ పెద్దిరెడ్డి చన్నారెడ్డిగారు, తంగేడిపల్లె

క. వినయవిధేయుఁడు దీనా, వనుఁడును శ్రీపెద్దిరెడ్డి । వంశోద్భవుఁడున్
మనుజశ్రేష్ఠుం డగుచుం, డిన చెన్నారెడ్డిఁ జక్రి । డీకొని కాచున్

శ్రీ సింగల్ రెడ్డి శేషారెడ్డిగారు, పోరుమిళ్ళ

క. సింగల్ రెడ్డికులజుఁడ, వ్యంగుని విజయాభిరాము । శాంతుని దుష్టా
సంగుని శేషారెడ్డినిఁ, బొంగుచు మానాథుఁ డేలు । భూపతు లెన్నన్

శ్రీ మురుకూటి గురివిరెడ్డిగారు, వడ్లమూను.

క. మురుకూటి గోత్రజుండును, గరుణాకరుఁ డార్యభక్తి । కలితుఁడు ధర్మా
కరుఁ డైనగురివిరెడ్డినిఁ, బురహరమిత్రుండు కాచు । భూభాగమునన్

శ్రీ వీరంరెడ్డి గోపాలరెడ్డిగారు, గోపాలునిపల్లె, కర్నూలుజిల్లా

క. శ్రీపతి వీరంరెడ్డికు, లాంబోనిధి సోముఁ డచ్యు । తాంఘ్రిరతుం డౌ
గోపాలరెడ్డి ననిశము, గాపాడును భూస్థలమునఁ । గారుణ్యమునన్

శ్రీవిప్పర్తి వేంకటసుబ్బయ్యగారు, వేంకటమ్మపేట. నెల్లూరుజిల్లా

క. శంకరభక్తుం డపగత, పంకుఁడు విప్పర్తివంశ । పావకకరుఁడౌ
వేంకటసుబ్బయ్యను శ్రీ, పంకజనేత్రుండు ప్రోచుఁ । బరమముదమునన్.

క. అచ్చునకై పదిరూప్యము, లిచ్చిరి వేత్త్యాల భక్తి । నెసఁగెడిమతులై
సచ్చరితు లైనవీరిని, ముచ్చట లూరంగ శౌరి । భువిపైఁ గాచున్.

---

## చందాదారులు.

చాపురాళ్లపల్లె, ఆత్మకూరుతాలూకా, నెల్లూరుజిల్లా

మ-రా-శ్రీ, కంటే యానాదిసెట్టిగారు
దరిసి కొండయ్యగారు

అగ్రహారము

ఇరుకుమాటి పెద్దవేంకటసుబ్బయ్యగారు
ఇరుకుమాటి చినవేంకటసుబ్బయ్యగారు
కంటె సుబ్బయ్యగారు
అక్కులరెడ్డి నారపరెడ్డిగారు

బొమ్మవరము.

కాశిరాజు సీతారామయ్యగారు

కలువాయు

పాటూరు వీరంరాజుగారు
చల్లా వేంకటనరసారెడ్డిగారు
అమరా సుబ్బరాయుఁడుగారు

పొంగూరు

ఊట్ల వేంకటసుబ్బాశాస్త్రిగారు
కాళిదాసు శ్రీరాములుగారు
సొట్టు సుబ్బయ్యగారు

కామిరెడ్డిపాడు

రామావఝుల అప్పయ్యగారు
అక్కెం ఆదెయ్యగారు
వాసిలి వీరయ్యగారు
పిన్నంరెడ్డి పిచ్చిరెడ్డిగారు

మంచాలపల్లె.

మ రా-శ్రీ, చల్లా కేశిరెడ్డిగారు
సడ్డా వేములరెడ్డిగారు
రూపిరెడ్డి కొండారెడ్డిగారు

కంభంపాడు

గామావర్ఘుల సుబ్బయ్యగారు
కంభంపాటి నాగయ్యగారు
వెంబులూరు వేంకటసుబ్బయ్యగారు

వెంగంపల్లె

మునగా వేంకటసుబ్బయ్యగారు.
పెసల వేంకటసుబ్బయ్యగారు
గురిడి చలమయ్యగారు
వేములపాటి సీతారామయ్యగారు, చిరివెళ్ల
కంభంపాటి అప్పయ్యగారు పాతెళ్లపల్లె, గ్రామము

కల్లూరు

శత్తి గురుమూర్తిశ్రేష్టిగారు
వడ్లపూటి రంగయ్యగారు.

బెడుసుపల్లె

రాటకొండు పిచ్చినాయుడుగారు
కొడవల వేంకటసుబ్బానాయుడుగారు

దేవరాయపల్లె

అనంచర్ల సుబ్బయ్యగారు
పువ్వాడి సుబ్బరాయుడుగారు

మహిమలూరు.

వనం వేంకటనారాయణయ్యగారు
వాకాటి నారసింహారెడ్డిగారు
చింతలపల్లె వేంకటనరసారెడ్డిగారు

పల్లెపాడు, నెల్లూరుతాలూకా

ఇంగువ శివయ్యగారు.
పులుగల్లు సుబ్రహ్మణ్యమయ్యగారు
నూకలపాటి కృష్ణారెడ్డిగారు, అల్లూరుగ్రామము
దొమ్మరాజా కొంతురాజాగారు, ఎగువపల్లె
సంగరాజా వెంకటసుబ్బరాజుగారు, గుడికుంట

చిలకలమర్తి

నందిమండలం వేంకటరాజాగారు

మ-రా-శ్రీ, మునగా వేంకటసుబ్బయ్యగారు.
పార్లపల్లె చినవేంకటరెడ్డిగారు, మూకనపల్లె

వరికుంటపాడు

రాపూరు వేంకటసుబ్బారెడ్డిగారు.
పాలిపాటి పెంచలరెడ్డిగారు

గౌరవరము.

గంగవరం వేంకటస్వామినాయుడుగారు
గంగవరం రామనాయుడుగారు
గంగవరం వెంగమనాయుడుగారు
చల్లగొండ్ల శేషయ్యగారు
దూది చెంచయ్యగారు
కుర్లూరు ముదుకలయ్యగారు
అమరా వెంకటచెంచయ్యగారు, దాచూరు

ముంగుపల్లి

బిస్సాటి రమణయ్యగారు
చిట్లూరు వెంకటసెట్టిగారు
కొమ్మినేని నరసయ్యగారు, కోటితీర్థము
కొత్తపల్లె, ఉదయగిరితాలూకా, నెల్లూరుజిల్లా
నారాయణ సుబ్బయ్యగారు
కంటె పిచ్చయ్యగారు
పాటి వీరశేఖరమయ్యగారు
కంటె కొండయ్యగారు
ముప్పూర్వు వేంకటసుబ్బయ్యగారు, చుంచులూరు
నెల్లూరు నరసింగరావుగారు, భైరవరము

నాయునిపల్లె

కంటె వేంకటసుబ్బయ్యగారు.
కంటె సుబ్బయ్యగారు
నాగిసెట్టి వీరయ్యగారు
సోమిసెట్టి కృష్ణయ్యగారు
మన్నె పిచ్చిరెడ్డిగారు
తాకే నాగిరెడ్డిగారు.
మన్నె చెంచిరెడ్డిగారి కొండారెడ్డిగారు.
పోలంరెడ్డి వేంకటసుబ్బారెడ్డిగారు
మన్నె కొండారెడ్డిగారు

మ-రా-శ్రీ, మన్నె సోమయ్యగారు
పడచల వీరయ్యగారు
ఫారెస్టర్ రంగయ్యగారు

తిక్కవరం

బిస్సాటి వేంకటశేషయ్యగారు
గంగినేని అప్పానాయుఁడుగారు
చంద్ర పిచ్చినాయుఁడుగారు
గంగినేని పిచ్చినాయుఁడుగారు

రాచపాలెము

యల్లంరాజు కొండ్రాజుగారు
యల్లంరాజు పెదకొండ్రాజుగారి కొండ్రాజుగారు
బద్వేలి తాలూకా, కడపజిల్లా
కొండలకుంట వెంకటనారాయణయ్యగారు
గట్టుపల్లె లక్ష్మీనరసయ్యగారు
కొమరగిరి నరసింహయ్యగారు, చెన్నంపల్లె
గాజులపల్లె సుబ్బరామిరెడ్డిగారు
సంగరాజు వేంకటరమణయ్యగారు, మల్లెగుడిపాడు
కసువుల వేంకటసుబ్బయ్యగారు, బాలాయపల్లె
ఉగ్గరాజు గోవిందయ్యగారు, గానుగపెంట
పాలకొలను అబ్బిరెడ్డిగారు, రజాసాహెబుపేట
దీక్షాగురుమూర్తియ్యవర్గారు, సిద్ధన కిచ్చాయపల్లె
కట్టమూడి నరసింహులుగారు, పోరుమామిళ్ల,
వారణాసి కృష్ణయ్యగారు ,,
తేగలపల్లె రామయ్యగారు, సిద్ధవటము
గోపవరం రామిరెడ్డిగారు, బేతాయపల్లె.
భూమిరెడ్డి చినరామిరెడ్డిగారు, భూమిరెడ్డిపల్లె
దాసా సోమయ్యగారు, గోపవరము ,,
సుస్వరం వెంకటప్పయ్యగారు, ,,
కొమరగిరి నరసింహయ్యగారు, ,,
సిద్ధమూర్తి సుబ్బారెడ్డిగారు, చింతపూతాయపల్లె.
మోటిపోతుల వేంకటయ్యగారు, తిరువెంగళాపురము
పేరుభొట్ల సీతారామయ్యగారు, చంద్రపల్లె
సంబటూరు కోదండరామయ్యగారు ,,
కనుమళ్లపూడి గురునాథము ,,
బండారు చిదంబరసెట్టిగారు, యల్లంపేట.

మ-రా-శ్రీ,, యాగా కొండారెడ్డిగారు, కొమ్మనవారిపల్లె.
అవధానం రామచంద్రయ్యగారు, పుల్లంపేట
చౌడూరుసీతారామయ్యగారు ,,
తిరుమలరెడ్డి అశ్వత్థరెడ్డిగారు, పల్లపాడు

బోయనపల్లె

ననిసెట్టి సుబ్బరామయ్యగారు
నాగరాజుపల్లె చెంచయ్యగారు
కోణిదన, పెంచలయ్యగారు
నాగరాజుపల్లె వెంకటసుబ్బయ్యగారు
గ్రంధే చెన్నయ్యగారి రామయ్యగారు
వడ్ల చెంచయ్యగారు
భూమిరెడ్డి సుబ్బారెడ్డిగారు, చింతలచెరువు
తన్నేరు సుబ్బమ్మగారు, దాత, వోగూరు

వాకమడ.

నన్నపురెడ్డి కొండారెడ్డిగారు
మల్లు నరసారెడ్డిగారు.
మల్లు పెంచలరెడ్డిగారు

యప్పిరాల

అడ్డగంటి సుబ్రహ్మణ్యమయ్యగారు
అడ్డగంటి శేషాద్రయ్యగారు
మూరంరెడ్డి వేంకటయ్యగారు.
బగడాలపుల్లయ్యనాయుడుగారు, నెల్లూరు, పెన్నడ్డుసబ్ అసిష్టాంటుసర్జను

ఒంగోలు.

వరదా రంగయ్యనాయుడుగారు, బి ఏ, ప్లీడరు
వరదా రామకృష్ణయ్యనాయుడుగారు, బి ఏ, యల్ టి, టీచరు, మిషను హైస్కూలు [చేపాక్, మద్రాసు
వరదా వేంకటరమణయ్యనాయుడుగారు, ఫారెస్టు పంచాయతీ ఆఫీసరు,
రావుసాహెబ్ వరదా శ్రీరాములునాయుడుగారు, మునిసిపలు చేర్మెను, తాలూకాబోర్డు ప్రెసిడెంటు, రైల్వే కంట్రాక్టరు
వరదా లక్ష్మీనారాయణనాయుడుగారు, లాండుహోల్డరు
రావుసాహెబు బడేటి వెంకట్రామయ్యనాయుడుగారు, బి ఏ., యం ఎల్
తోట నరసింహులునాయుడుగారు, సి ఐ డి ఆఫీసు., మద్రాసు.

క ఇలః బొగడగః జందాదా, రులు నై వేర్వేఱ నైదు 1 రూప్యంబుల ని
శ్చలమతుల నిడిరి వీరిని, గలువలదొర భావకరుణః 1 గాచు ధరిత్రిన్.

# విషయసూచిక.

## ప్రథమస్కంధము

విషయము. పుట.

## ద్వితీయస్కంధము



## తృతీయస్కంధము

| విషయము. | | పుట. |
|---|---|---|

## చతుర్థస్కంధము.



## పంచమస్కంధము

## షష్ఠస్కంధము

## సప్తమస్కంధము.

విషయము. పుట.



## అష్టమస్కంధము.

## దశమస్కంధము.

## ఏకాదశస్కంధము

విషయము. పుట.

## ద్వాదశస్కంధము



సమాప్తము.





శ్రీరస్తు

శ్రీసీతా లక్ష్మణ భరత శత్రుఘ్న హనుమత్సమేత శ్రీరామచంద్రాయ నమః

# తెలుఁగు వామనపురాణము

## ప్రథమ స్కంధము

## పీఠిక


రమ్యంబు ఋషీంద్రచిత్తవనజ। క్షేత్రాలవాలంబు, సీ
తారామాలతికాయుతంబు, గురుస। త్త్వస్ఫారపుష్పంబు వి
స్తారోదారకృపాఫలంబు, నతలోక। స్తోమకర్ణంబు నా
శ్రీరామామరపాదపంబును మదిన్। సేవింతు మోక్షాప్తికై. 1

ఉ శ్రీకరరామవామవర। సీమను వేడ్క వసించి నిత్య మ
స్తోకదయార్ద్రభావయుత। సుందరదృష్టుల భక్తపూగమున్
వీఁకనుఁ బ్రోచుమాత, కవి। బృందనిషేవిత నిత్యపూత, మా
యాకృతి యైనసీత, పృథు। హర్షసుఖంబుల నాకొసంగుతన్ 2

చ హరికులుఁడైన రాఘవుని। హస్తతలంబున నుండి ప్రోల్లస
ద్వరమణిహేమదివ్యరుచి। వారవిభాసితదిగ్వితాన మై
సురరిపుపూజ్యతత్పరత। శోభిలునట్టిశరాసనంబు నా
[1]కరముడి శర్మదాయకము। నై చెలువొందుచుఁ నేర్మిఁ బ్రోవుతన్ 3

చ నరహరితుల్యులై తనరి। నర్మిలి రాముని రెండుప్రక్కలం
గరము వసించి ధర్మమణి। కాంతివిరాజితచాపహస్తులై
నిరుపమభక్తితోఁ బరుని। నిశ్చలతన్ భజియించు శ్రీకరుల్
భరతుని లక్ష్మణానుజుని। వావిరిఁ గొల్చెద నిష్టసిద్ధికై 4

చ. పరమకృపాలవాలుఁ డయి। భాసిలు రాముని భక్తి నెన్నుచున్
శరవరచాపహస్తుఁ డయి। సంతత మావిభు వెన్కనుండి సు

1 అరముడి=మాటిమాటి.

స్థిరమతిఁ గార్యకారణవిశిష్టరతి న్దనరారులక్ష్మణున్
సరగున నామనఃకమలసద్మమునందు స్మరింతు నిత్యమున్. 5

మ. జననాథుం డగు రాముశాసనము శీర్షంబందు నిత్యంబుఁ దా
ఘనతం దాల్చి తదగ్రసంస్థితుఁడు నై కైవారము ల్సేయుచున్
వినుతిం గాంచినవీర్యవంతు, సుమనోవీథీసమాక్రాంతు, శ్రీ
హనుమంతు న్మదిలో భజింతుఁ గవితాయత్నార్థసంసిద్ధికై. 6

చ. స్థిరతరచిత్తము ల్వెలుఁగ శ్రీరఘురాముని కన్నివైపులం
గరము వసించి తన్మయతఁ గ్రాలి పరేశునిఁ బ్రస్తుతించుచుం
బోరిఁబోరి నుండు ఋక్షపతి పుణ్యవిభీషణసూర్యపుత్రవా
నరపతుల న్భజించెద ననారత మాత్మవిశుద్ధికై తగున్. 7

ఉ. వావిరి నన్నిలోకముల వైఖరిమీఱ సృజించి నిత్యుఁడై
గీవి సరస్వతిం గలిసి గేవ చెలంగఁ బయోజపీఠిపై
భావము పల్లవింపఁ గడు భాసిలు బ్రహ్మ కవిత్వధాటిఁ జెం
పావహిలంగఁ జేసి మనసారఁగ నిత్యము నన్నుఁ బ్రోవుతన్ 8

ఉ. వాణి, సువాణి, దేవమునివర్ణ్యపవిత్రచరిత్రసద్గుణ
శ్రేణి, వినూత్నరత్నరుచిచిత్రితపేశలకంకణోల్లస
త్పాణి, మదద్విరేఫతతిపత్రసమానసుకాంతకాంతిభృ
ద్వేణి, పవిత్రసుందరకవిత్వపటుత్వము నిచ్చి ప్రోవుతన్ 9

ఉ. సారసపంక్తి నూరకయె చక్కఁగఁ దాల్చిన వాడునంచ భా
గీరథిఁ గూర్చి చుట్టితివి కృత్యమె జాణవు చూడఁ జూడ నీ
ధీరసికత్వముం దెలిసెఁ దెల్లముఁగా నని పల్కు నవ్వునీ
హారమహీధ్రజారమణుఁ డౌశివుఁ డోముత నన్ను నిత్యమున్. 10

మ. పరమేశుం డగుణుం డగుండు నగువిశ్వప్రాప్తరూపన్ శక్తివి
స్ఫురణత్వంబున సర్వసద్గుణలసచ్ఛోభాన్వితుం జేసి సుం
దరియై భాసిలి స్వాఖ్యసార్థకమునై తల్లోకృత్త వేదస్తుతిన్
గరిమం జెందిన దేవి హైమవతి నన్ గాపాడు నెల్లప్పుడున్ 11

సీ. ఎలమి భక్తులకోర్కె లీడేర్చె నేదేవి ధనముచే ముక్తిసాధనముచేత
దేవాళికష్టంబుఁ దీరిచె నేదేవి రణముచే వీర్యకారణముచేత
సకలజగత్సృష్టిఁ జరియించె నేదేవి కృతులచే విస్తృతాకృతులచేత
మహిషాదిదైత్యుల మర్దించె నేదేవి బలముచే భూరిదోర్బలముచేత

తే. నంగనాగణ్యసతి, దళితాసురేంద్ర, వితతి, గుణవతి, సురగణవినుతి, నిత్య
దివ్యమతి, యైనపార్వతీదేవి యిష్టసమితి నొనఁగూర్చి నన్నేలు సంతతంబు 12

క. వితతసుధార్ణవమధ్య, స్థితసాగసపీఠమందు దీప్తి చెలంగన్

సతతము బాగుగ వెలిఁగెడి, శతధృతిశరదేవి నన్ను సంరక్షించున్ 13

మ. కరుణాశంభుఁడు పుత్ర! రమ్మనుచు వేడ్కన్ బిల్వఁ దా వచ్చి త
త్పురుకంఠంబున వ్రేలుసర్పసమితిన్ బల్మారు వీక్షించి వా
ని రహిన్ దామరతూండ్లదండలనుచు న్నేర్పొప్ప నూహించుకుం
జరవక్త్రున్ మదిలో భజింతుఁ గవితాసన్మార్గసంసిద్ధికై. 14

## గురుస్తుతి

క. వరకందాళ్లకులాంబుధి, పరిపూర్ణేందుండు శిష్యపరివృతుఁ డుస్మ
ద్గురుఁ డగుదాసాచార్యుని, చరణంబుల నే భజింతుఁ జంచద్భక్తిన్ 15

సీ. వసుధపై జనమంచి వంశాబ్ధిచంద్రుఁడై శేషాద్రి యనుపేరఁ జెన్నుమిగిలి
పావనజాహ్నవీప్రముఖనదీస్నానపుణ్యస్థలార్జితపుణ్యసమితి
బాల్యమందునె కడుఁ బడసి జ్యోతిశ్శాస్త్రపారజ్ఞుఁడై తనుఁ బ్రాజ్ఞు లెన్న
నీశ్వరీకరుణతో నెలమి బ్రహ్మాండపురాణంబుఁ దెనుఁగునఁ బ్రకటితముగఁ

ఆ. కృతి నొనర్చి పిదపఁ గీర్తనీయంబు నా, రామచంద్రగాథ రమ్యకృతినిఁ
భక్తిఁ జేసినట్టి బాల్యసుహృద్గురు, వరుని నే భజింతు భావమందు. 16

ఉ. శ్రీకరయోగమూర్తి యయి చెన్నలరారెడునమ్మహాత్ముఁ డ
స్తోకదయానిరూఢి ననుఁ జూచి వచించెను మానవుండు భూ
లోకమునన్ జనించి భవలోలతఁ గాలము నీఁగి వృద్ధుఁడై
ప్రాకటదుఃఖవార్ధిఁ బడి వ్యాకులమందుచు సీల్గి క్రమ్మఱన్. 17

ఆ. చేసినట్టికర్మచేత నిబద్ధుఁడై, పుట్టి గిట్టుఁ గాని పూర్ణుఁడైన
పరునిఁ జేరునట్టిపరణినిఁ గనుఁగొనఁ, జాలఁ డకట! ప్రకృతిసహితుఁ డగుచు.

క. సంసారమె తన కెప్పుడు, సంసారం బనుచుఁ దలఁచు జడమతి భువిలోఁ
గంసారిని సేవింపక, సంసారాంబుధిని దాఁట శక్యమె చూడన్ 19

క. కాలము జరపక భక్తిన్, గాలాత్ముఁడు సకలదేవగణమాన్యుఁడు శ్రీ
లోలుఁ డగుపద్మనాభుని, గీలించి, భవంబు విడిచి కృతనిశ్చలతన్ 20

తే. సత్ప్రబంధంబుఁ గావించి చక్రికిడుము
జన్మరాహిత్య మగుఁ గాన జగతి నదియె
సప్తసంతానములలోఁ బ్రశస్త మగుచు
ఖిలముఁ గాకుండు నిత్యమై వెలసి మిగుల 21

చ. సకుఁడ మదీయవాక్యము విశంకటబుద్ధి గ్రహింపఁగా నగున్
ప్రకటితమైనవామనపురాణము నాంధ్రవచోభిరామస
త్ప్రకరయుతంబు నాకృతిని వావిరిఁ జేయుమటంచుఁ బల్కి యా
సుకవి యొసంగె నాకు దయ శోభిలుచుండఁగఁ దత్పురాణమున్. 22

క. ఇచ్చిన నే దానిఁ గొని, సచ్చరితాత్మునకు మ్రొక్కి । శౌరిని శ్రీశుఁ
హెచ్చుగఁ దలఁచుచు నీకృతి, మచ్చికమీఱంగఁ జేయ । మది నెంచి తమిన్
క. ఇనసోమభౌమబుధగురు, ఘనకవిశనిరాహుకేతు । ఖగములనెల్లన్
వినుతించెద సత్యము నా, మనమునఁ గుదురంగ మాటి । మాటికిఁ జేర్మిన్ 24
క. హరివహ్ని కాలరాక్షస, వరుణమరుద్ధనహ్యాకేశ । భవులను దామో
దరభక్తుల భీష్మాదుల, వరభక్తిఁ గొలుతు నెపుడు । వాంఛాప్తికి నై 25

—— సుకవిస్తుతి ——

క. శ్రీరామకల్పతరుశా, ఖారమ్యస్థలనివాస । కవి రైయి సతమా
శ్రీరామునిఁ బలుకుచుఁ దెం, పారెడివాల్మీకిపికము । నాత్మ నుతింతున్. 26
సీ. శ్రుతిజాలములనెల్ల । శోధించి భాగించి తేటతెల్లంబుగాఁ । దెలిపె నెవఁడు
రాజ్యలక్ష్మిని భోజ । రాజున కొనఁగొనార్చెఁ బ్రాజ్ఞుల నోడించెఁ । బ్రౌఢి నెవఁడు
కాళిచే సభలోనఁ । గవి వీఁడె యని మూఁడుసారులు పలికించె । సరవి నెవఁడు
పరదేవి దయతోడఁ । బద్యంబుఁ దుదయందుఁ దూఁగించి వ్రాసిచేఁ । దోడ రెనెవఁడు
తే. కవిత నెంగిలిఁ గావించి । ఖ్యాతి మిగులఁ, గన్నవాఁ డెవ్వఁ డావ్యాస । కాళిదాస
దండి భవభూతి బాణులఁ । దత్త్వవిదులఁ, దలఁతు నిష్టార్థసిద్ధికై సంతతంబు హృదిని
మ. చతురత్వోక్తిఁ గవీంద్రులెల్లఁ బొగడన్ । జాతుర్యవాగ్యుక్తితో
క్షితిపై భారతవేదమున్ దెనుఁగునన్ । జెన్నారఁగాఁ జేసి త
థ్యనితిస్ స్మృత్యుఁడు నై నన్నయబుధున్ । దివ్యప్రభావుండు నౌ
కృతికిక్కన్నను శంభుదాససుకవిం । గేల్మోడ్చి వర్ణించెదన్. 28
ఉ. రామనృపాలమౌళిపద । రమ్యసరోజయుగంబు నాత్మలో
వేమరు సంస్మరింపుచు వి । వేకశిఖామణి రైయి తనర్చి బల్
గోముగ నాంధ్రమందుఁ గృతిఁ । గూరిమి భాగవతం బొనర్చి తా
భూమినిఁ గీర్తిఁ గన్నద్విజ । పుంగవుఁ బోతనసూరి నెన్నదన్ 29
క. కవిసార్వభౌముఁ డని బుధ, నివహము కొనియాడుచుండ । నృపవర్యసభా
భవనముల వెలుఁగు శ్రీనా, థవరకవిన్ డెందమందుఁ । దద్దయుఁ దలఁతున్ 30
తే. ధరణి నెవ్వాఁడు కవితాపి । తామహాఖ్య, నలరె నట్టిమహాత్ముని । నమలమతినిఁ
గవికులేశ్వరుఁ బెద్దనఁ । గామితార్థ, సిద్ధికై నే స్మరించెదఁ । జిత్తమందు. 31
సీ. పేశలకవిసంస । విజ్ఞుఁడై చెన్నొందు తిమ్మనసూరిని । నెమ్మిఁ బొగడి
పదపద్యచాతుర్య । భాసుర రామలింగకవిని ముదమొప్పఁ । గను నుతించి
గడియకు శతపద్య । కల్పనఁ గలరామరాజకవీంద్రునిఁ । బ్రస్తుతించి
శ్లేషప్రబంధమ్ము । కృతి నొనర్చినమేటిఁ బింగళిసూరన్నఁ । బ్రేమఁ దలఁచి
తే. భవ్యసత్కృతు లొనరించి । పరిధవిల్లు, సూరితుహినమయూఖు లౌ । సుకవివరులఁ

గడిమి వినుతించి కలతెల్గు। కవుల కెఱఁగి, తివిరి కృతిఁ జేయ సమకట్టి। తిని గడంగి.

క. సురతుల్యులైనకవులకు, నరయఁ బ్రమాదములు కల్గు। నటులౌట సుధీ
వరులార! నెరసులుండినఁ, బరమదయన్ దిద్ది నన్నుఁ। బాలింపనగున్ 33

వ. అని యిట్లభిమతదేవతల నారాధించి దయాసముద్రులగు నస్మద్గురువరుల నభినందించి ప్రాచీనగీర్వాణాంధ్రకవికుంజరులఁ గొనియాడి బుధేంద్రుల కంజలి యొనర్చి 34

ఉ. వామనమూర్తిసత్కథల। వర్ణితమై సుమహాజనేష్టమై
భీమవిశాలపాపనగ। భీషణవజ్రసమానమై మహో
ద్దామగుణాభిరామమయి। తద్దయు భూమిని నొప్పునట్టి శ్రీ
వామనసత్పురాణమును। వావిరి వ్రాసెదఁ దెల్గుబాసలోన్ 35

శా. నానార్థప్రతిపాద్యవామనపురా। ణంబున్ గృతిన్ జేయ వి
జ్ఞానం బేమియు లేక చింతఁబడఁగా। నాకున్ గవిత్వానుసం
ధానారంభవివేకమార్గమును మో। దం బొప్పఁ దానిచ్చె ము
న్నే నా రాముని యాజ్ఞ లేకయు కృతిన్। నిర్మింప శక్తుండనే 36

క. పలికెడిది వామనం బఁట, పలికించెడువాఁడు రామ। పార్థివుఁ డఁట నేఁ
బలికిన దుష్కృతహర మఁట, పలికెదఁ బరగాథ లెవుడు। పలుకఁగ నేలా 37

చ. గురుకలికల్మషేంధనవి। ఘోరమహాతాశనదివ్యమూర్తితోఁ
బరఁగి మునీంద్రహృత్కమల। వాసుఁడునై పొలుపొందు రామభూ
వరపతినా నుతింగనెడి। భర్తకు నీకృతికన్యకామణిన్
స్థిరతరభక్తి నిచ్చెదను। చింతితమోక్షసుఖాప్తికై తగన్ 38

తే. శౌరికథయందు దోషలే। శంబుఁ గాన, నైన నది పావనంబునై। యలరు జగతిఁ
బ్రమథనాథుని గళమందుఁ। బరిఢవిల్లు, చిహ్నమట్టులఁ గనఁబడు। సేవ్యమగుచు

— నిజవంశక్రమము. —

క. అని నిర్ణయించుకొని నే, మును మద్వంశప్రకార। మునుఁ జెప్పుటకై
మనమునఁ దలంచి చెప్పం, గనుఁ బూనితి నెట్టు లనినఁ। గాశ్యపియందున్. 40

ఉ. నాకధునీసమామలపి। నాకిని కుత్తరభాగమందుఁ బు
ణ్యాకరమై సమస్తవిబు। ధాఘనిషేవితభూమిభాగమై
ప్రాకటపార్వతీరమణ। భాసురదివ్యనివాసుప్రతి
ష్ఠాకరమైన సోమశిల। చారుతటం బొకఁ డొప్పు నెంతయున్. 41

క. తారాధీశకృతంబై, వారక సీక్షేత్ర మలరె। బహుపుణ్యతఁ బెం
పారెడిదక్షిణకాశియు, నై రహిఁ బొలుపొంది పాప। హారమై వరమై. 42

క. ఆరమ్యక్షేత్రమునకు, వారుణదిశయందు నొక్క । పర్వతతతి యొ
ప్పారుచు ననిలాశకుఁ జెం, పారఁగఁ గొనసాగియుండు । నతిరమ్యంబై. 43

ఉ. ఆనగపంక్తిలోపల మ।హామునిరాజసుపర్వసేవ్యమై
మానితసానుసంహతిస।మన్వితమై తనరారి నిత్యమై
సూనశరారిసంస్థితిని । శోభిలు మల్లెముకొండ దీప్తితో
దానికి నుత్తరస్థమగు । ధాత్రిని సజ్జనవారయుక్తమై. 44

ఆ. పరఁగు చావురాళ్ల । పల్లి యొక్కటి కల, దదియు సకలజనుల । కధికహర్ష
దాయకంబు నగుచుఁ । దనరు నచ్చట ముల్కి-, నాఁటివారు కలరు । సాటిలేక

ఆ. అట్టివిప్రులందు । నామ్నాయవిదులునై, భూరివైభవమునఁ । బొనరునట్టి
రామవఝ్ఝలనెడి । ప్రథితపౌరుషనామ, ధేయు లనఁగఁ గలరు । ధృతి దలిర్ప 46

ఉ. శ్రీకర రామవఝ్ఝలవి।శిష్టకులామలదుగ్ధసింధుస
త్కోకనదారిఁ బోలి తమిఁ । గొండయనాముఁడు సంభవించి య
స్తోకగుణాఢ్యుఁడై చెలఁగి । సుందరబంధుసమంచితుండు వి
ద్యాకలితుండునై వెలసెఁ । దజ్జ్ఞులు మేలని యెంచిచూడఁగన్ 47

శా. సారాచారుఁడునై సకొండయ భువిన్ । సావిత్రి యన్నామినిం
ధీరు ల్మెచ్చఁగఁ బెండ్లియై సతత మా।స్త్రీరత్నముం గూడి సం
సారోదారసుఖాబ్ధిఁ దేలుచు జను । ల్సంప్రీతిఁ జెన్నొందఁ దాఁ
దారాధీశునిమాడ్కి నింపెసఁగె స।ద్ధాత్రిన్ ప్రభావోన్నతిన్ 48

సీ. అంత వారికిఁ బుట్టి । రనఘులు కొండయ సుబ్బయ పోలయ్య । సుతులు మూఁగు
రంతగ్రజుండునై । హరువొందు కొండయ పౌరాణికుఁడు వైద్య । పారగుండు
సత్యశీలాచార । సంపన్నుఁ డంబికాపతిభక్తుఁ డామ్నాయ । పరుఁడు నగుచు
భవ్యసద్గుణకదం । బయు నైన నన్నమాంబను బెండ్లియై తోష । భావ యగుచుఁ
తే. బొనరునట్టి సతిన్ గూడి । పూర్ణభోగ, వితతి నొందుచు భాసిల్లె । విశ్వమందు
రమ్యరూపయు నగురతి । రమణిఁ గలసి, వెలుఁగుచుండిన కందర్ప । విభునిరీతి. 49

క. శ్రీమంతుఁడైనయతనికిఁ, బ్రేమను సుతు లుద్భవించి । పెరిగిరి తేజో
ధాములు కొండయ సుబ్బయ, నాములు సత్కార్యనిపుణ । నయతంత్రజ్ఞుల్. 50

సీ. అం దగ్రజుండునై । యలరుకొండయ మహాశీలాభిరాముఁడై । చెలఁగి యింద్రు
రాణిచందంబున । రాజిల్లులక్ష్మాంబఁ బెండ్లాడి ప్రియురాలిఁ । బ్రీతిఁ గూడి
కొమరొందుచుండఁగఁ । గొండయ సుబ్బయసుబ్బరామయ యను । సుతులు కలిగి
రందు జ్యేష్ఠుఁడఁ గొండ । యాఖ్యుఁడ దోషజ్ఞపదపద్మసంస్తుతి । కరుఁడ నిపుడు
ఆ. భావశర్మసరణి । భావించి మది రోసి, భూరిభక్తిపుష్ప । పుంజశోభి
తంబు నగుచు నెపుడు । దద్దయు నొప్పుమ, ద్భావసీమయందుఁ । బ్రౌఢి మెఱయ.

## కృతిసమర్పణము.

క. శ్రీసీతాభామాహృ, ద్వాసునకు మనోజ్ఞ హేమ।వాసునకుఁ జిదా
భాసునకు రత్నభూషా, ద్భాసితున కనంతహంస।భావాసునకున్ 52
క. శీతాచలజాపరినుతి, జాతానందునకుఁ గామ।శతసుందరదే
హాతతరుచికందునకుం, గోతర్పితబంధురునకు । గోవిందునకున్. 53
క. దోషాకరభీషణఖర, దూషణముఖదనుజహరణ।తోషునకుఁ స
ద్భాషునకును భాషాధిప, భాషాపతివినుత పాద।పంకరుహునకున్. 54
క మేరునగధీరునకు జగ, దారాధితనిత్యమంజు।లాగారునకుఁ
సారాచారున కఖిలా, ధారున కనవరతభక్త।తతిసులభునకున్ 55
క వాతాత్మజాదికపినుత, పాతకహరనామునకును । భవభయగురుసం
తాపితదాసావనరత, చేతోయుతకామునకును । శ్రీరామునకున్ 56

## కథాప్రారంభము.

వ సమర్పితంబుగా నాయొనర్పంబూనినవామనపురాణకథాక్రమం బెట్టిదనిన 57
శా. శ్రీరాజిల్లుమొగంబుతో వటుఁడునై । సృష్టీశుఁ డెవ్వాఁడు వి
స్తారప్రాభవశాలి యైనబలిచెం।తం జేరి త్రైలోక్యల
క్ష్మీరామామణిఁ గొంచు దేవపతి కి।చ్చెన్ప్రీతిఁ దద్వామనా
కారస్వామికి నిర్జరేశునకుఁ గాం।తు న్మ్రొక్కెద న్నిత్యమున్ 58

## నారదుఁడు వామనపురాణమును చెప్పుమని పులస్త్య నడుగుట.

క ఆశ్రవరహితుఁ బులస్త్యుని, నాశ్రమసంస్థితుని వాగ్వి।దగ్రియు నమలుఁ
డాశ్రవుఁడు నారదుం డొగి, నాశ్రితవరుఁ జూచి పలికె । హర్షము మీఱన్ 59
సీ రమణీయవామనా।శ్రయపురాణము వేడ్క వినుపింపు వీనుల।విందుగాఁగ
విష్ణుఁడు మునుప్రభ।విష్ణుఁ డేలకొ చూడ వామనత్వముఁ దాల్చె వాంఛ మీఱ
నడిగెడునా కర్థి।వానతియ్యఁగ నగు దైత్యారిభక్తుండు । దైత్యవరుఁడు
ప్రహ్లాదుఁ డేటికి । బర్హిర్ముఖులతోడ బాహుశక్తి దలిర్పఁ । బటుతరరుష
తే. యడరఁ గయ్యంబు నొనరించె । నధికసంశ
యము మనంబునఁ గలిగె, ద్విజాఖ్య! మేటి
వన్నెకలదియుఁ బ్రాగ్రియ।వదన యైన
దక్షుపుత్రిసతీదేవి । తాపసేంద్ర! 60
క భయరహితుండును సద్గుణ, చయుఁడునుఁ గాలాత్ముఁ డఖిల।జగదీశ్వరుఁడుం
జయశీలుఁ డగుభవునకు వి,నయవతిసతి యయ్యె నని వి।నంబడె ధాత్రిన్. 61
క మునివర్య! యావరానన, తనదేహము వదలి యేల । తగ రమ్యం బై
తనరెడిహిమవంతునిగృహ,మునఁ గలిగెను గడలి లక్ష్మి । పుట్టినకరణిన్. 62

తే వెండియు శుభాంగి ముక్కంటి। వెలది యయ్యె
నీవు సర్వజ్ఞుఁడ వటంచు । భావమందుఁ
దలఁచినాఁడను గృపతోడఁ । దవిలి నాదు
సంశయముఁ దీర్పు మిత్తతి । జగము లెన్న 63

క నానావిధతీర్థవ్రత, దానమహాత్మ్యముల వాని। తత్త్వవిధుల నో
మానికులవర్య! తెలుపుము, మానుగ జయమబ్బు నీకు । మహి నక్షయమై

చ అనియిటు నారదుం డడుగ । నారయుడ వాగ్మియు మానిసత్తముం
డనఘుఁడు నౌపులస్త్యుఁ డొగి । నాత్మను బొంగుచుఁ బల్కె నారదున్
వినుతతపోనిధిన్ ఘనుని । విశ్రుతతేజుని దైవభక్తునిం
గని హరి వామనుం దలఁచి । కమ్రమృదూక్తులతోడ నాదృతిన్ 65

తే. వామనపురాణమును ముని। వర్య యిపుడు
మొదటినుండి క్రమంబుగ । ముగియువఱకుఁ
జెప్పెదను సావధానత । చేరి వినుము
దాన మోక్షంబు చేకూరుఁ । దథ్య మరయ 66

—• గ్రీష్మవర్షర్తువర్ణనము •—

తే హైమవతి తొల్లి దుష్కర । మైన గ్రీష్మ,కాల మరుదేరఁ గని భీతిఁ । గడఁగి భవుని
మందరస్థమహీశుని । మహితయశుని, భవునిఁ గన్గొని పలికెను । భక్తి గదుర

క. దేవేశ గ్రీష్మకాలం, బీవసుధఁ బ్రవృత్త మయ్యెఁ । బృథుభీషణమై
దావాగ్నికరణి నున్నది, పావన భక్తార్తిహరణ! । భాసురమూర్తీ! 68

తే. భయదవాతాతపంబులు । వసుధ మనల, నెచటఁ జెందక పోఁగల । వచట నాకు
నిల్లు లేదయ్యె నేగతి । నిట్టిపాప, కాల మేగునొ తెలియదు । కలఁగె మనము

మ. అని క్లేశాత్మిక యై వచించుసతితో । నాడెన్ భవుం డోలిమై
వనితా నేను నిరాశ్రయుండ నగుచు । న్వర్తించుచున్నాఁడ; నీ
వనభాగస్థలి నంచుఁ బల్కి విని తాఁ । బ్రాణేశుతోఁ గూడి త
ద్వనవృక్షంబుల నీడలం గడపె నుద్యద్గ్రీష్మకాలం బొగిన్ 70

తే నిర్జనాచరితము ఘన। నిబిడతిమిర, కారితాశంబు నయి పటు। కలితరావ
మగుచు నుత్పన్నమయ్యె గ్రీ। ష్మాంతమందు, వర్షకాలంబు వసుధపై । భాసురముగ.

క వానిం గని సంతసమున, దానవవిధ్వంసి యైన। భవుఁ డగుభవుతో
మానిని యగుసతి పల్కెను, మానుగ సప్రణయదివ్య। మంజులసూక్తుల్ 72

తే మహి మహేశ్వర వీచెను । మారుతములు
హృదయభేదనకరములై । యెంతయు నిన

మండలము తోఁచెఁ బరివేష । మహిత మగుచు
నింద్రచాపంబు పడమట । నెసఁగుచుండె. 73

వ. మఱియుఁ బటుతరజాతవాతకంపితంబులై పతత్రినీలగోత్రంబులఁ దాఁటి నెమ్మిఁ గ్రమ్ముకొని హరిమండలములసరణి మీఱి యెడనెడఁ దెఱపి పడక గర్జించుచున్న ఘనంబులును; ఘననీలవేణుల మేనుల మిసమిసల పెంపుసొంపులకుఁ గంపించి సైరింపక శాగుగ దాఁగి మూఁగి రేఁగి పోయెడురీతి నంబుదంబుల నడుమను మలయక పొలయక వడిఁ బోయి మెఱయు క్రొమ్మెఱుంగులును, మెఱుఁగులకు నుఱుములకు వెఱవక తమపింఛములఁ దమిని గొప్పఁగ విప్పి యొప్పిదంబున రొప్పుచు నర్తనంబులఁ గావించుమయూరంబులును గలిగి, రావణానుజచిత్తంబుపోలిక హరిరావవైభవంబై కరివరదమిత్రకంటకంబుమాడ్కి సారంగరాజితంబయి కృతయుగంబురీతి గురువర్షంబయి వర్షాగమం బరుదెంచె వెండియు 74

క. జలధారలు గగనచ్యుతములు నయి పడుచున్నవి బకములు కొక్కెఱలుం
జలకాంక్షఁ గొలుచుచున్నవి, జలదంబుల నెమ్మి మిగుల । జలజాతాక్షా 75

సీ. నీపసర్జార్జుననిర్మలకేతకీ । తరువులకమ్మని । తావు లొప్పఁ
బూచినపూవులు । పొలుపొంద వాతాదులను రాలుచున్నవి । లక్ష్మిమగనిఁ
దలఁచెడుభక్తుల । తతపాతకంబులు కడువడిఁ బాసిన । కరణి మేఘ
గర్జనంబులు విని । కాసారములనెల్ల విడుచుచున్నవి హంస । వితతి యల్ల

తే. బుధులు నీచాశ్రితంబులై । భువిఁ బ్రవృద్ధ
మూలములు నైనయాశ్రమ । ములను విడుతు
రెటులు భుజగేంద్రభూషణ । కుటిలదనుజ
హరణ! భక్తాలిరక్షక । యార్తిహరణ 76

ఉ. శంకర యీవనస్థలిని । సర్వమృగావళి తేజరిల్లె ని
శ్శంక రమించె సత్వరత । సంతస మొందెఁ జరించె లీలమైఁ
బొంకము మీఱ భాసిలెనుఁ । బొల్పుఁగ ధూమములు నూత్నకాంతి నే
వంకను జూడ సస్యయుత । బాలతృణంబులు కల్గి రాజిలెన్ 77

తే. నీలరమ్యాభ్రములయందు । నెగడుచుండు
మలినవృద్ధినిఁ బొడఁగాంచి । మనము చెదరి
శూరులందఱు గృహములఁ । జేరుటకును
వెడలుచున్నారు ఫణిభూష । వినుతవేష ! 78

క. తగణోద్గమముల నుద్వృత, కరవేగము లగుచు నదులు । కలఁగె, జనంబుల్
నిరతానుజ్వలులై రొగిఁ, బసిమేశా! చిత్రమేమొ । పరికింపంగన్ 79

క. సోమాంకితమకుటా! తమి, భామలు నీచులనుఁ గూడ । భావములోనం
గామించి కొలుచుచుండిరి, వేమఱు జలదములఁ । జదలు విస్తృతి వెలిగన్

వ. మఱియుఁ బూచిన పీరతరులును తరులసరసఁ జెలఁగి సురనారీవిహారముల కిర
వగుచు ముకుళితసుమనోభిరామము లయిన కదంబములునుఁ గదంబసారసహ
కారఖర్జూరచారుపనసాదిమహీరుహశాఖామండితఫలకమలయుఁ గమలాపూ
ర్ణము లై గమనాగమననిరోధకరము లగుతరంగిణులును రంగత్తరంగజాతవా
తచలితపద్మపత్త్రకాసారంబులునుఁ గలిగి. 81

క. భూతేశ! దుస్సహం బయి, చేతశ్చిత్రదము నగుచుఁ జెన్నలరారె
న్నేతాదృశకాలము తూలితి, నీతఱిఁ గరుణించి ప్రోవు మెలమిఁ బలికెలిన్ 82

ఉ. వానకుఁ జిక్కి సుక్కి కడు వంతలఁగుందక యుండురీతి మై
నీనగరాజమందు గృహ మేదెస నైనను గట్టుమో విభూ
దీనపరా! యటంచు సతి దీనత వేఁడఁ ద్రినేత్రుఁ డాడె స
న్మానముతో నతిం గనుచు మంజులచిత్రవచస్సు లొప్పఁగన్ 83

చ. సుమహితసింహచర్మపరిశోభితదేహుఁడ నై వనంబులో
సమతఁ జరించునా కిపుడు సద్మముఁ గట్ట ధనంబు లేదు స
త్యము ఫణిరాజు జన్నిదము తామరపువ్వులు కర్ణభూష లో
ప్రమదరో! ద్రవ్యహీనుఁడ భవ్యగృహంబులు గల్గ నేర్చునే 84

సీ. ప్రియ మానినీమణి పింగళాఖ్యాహినాకి బాహాపురి, మఱి యొకటి యయిన
నూరిధనంజయశుభజగంబు సొంపున, నశ్వనామకుఁ డని యలరుపాము
సవ్యకంకణము తక్షకుఁ డపసవ్యకంకణము నీలాంజనకాంతి కలుగు
నీలనామకమగు వ్యాళము శ్రోణిపై రాజిల్లుచున్నది రమ్యగతిని

తే. దివ్యభాగ్యంబు నాకిట్లు తేజరిల్ల, నీకు సుఖ మెట్లు వాటిల్లు నీరజాక్షి
యనఁగ దదసత్యసంయుక్తఘోరోగ్ర, వాక్కులాలించి భీతి మై వనిత యపుడు

ఆ. అవనితలముఁ జూచి యతిలజ్జతోఁ బతి, వాసకష్టమునను బహుళరోష
కలితభావ యగుచుఁ గడుసు నిట్టూర్పులు, వేండ్రముగను విడిచి విసిఁగి పలికె

క. త్రిపురహిత! సంప్రతను నై, తరుమూలమునందునుండి తడఁబడునా కీ
గురువృష్టికాల మిగతి, గర నెటు చనకుండుఁ జెప్పుమ తర్కింప మదిన్. 87

క. అని దీన యగుచు నాడెడు, వనితామణిఁ జూచి తనదుభావము లోనం
గనికరము దోఁప శంకరుఁ, డనియె న్మునివంశతిలక! హర్ష మెలర్పన్ 88

తే. ఘనఘనావస్థితాంగవై యుండ్రాలు నీదు, కాయమున నంబుధారలు కదియ కెట్లు
కడవఁగల వావిధంబునఁ గడిమి వాన, కాలమరుగంగఁ గల దింక గలఁత వలదు

క. మానమున నీకని తద్వాం, ఘనభాగములోని కరిగి కరుణామతి ద
క్షునిపుత్త్రి యైనసతితో, మనసిజహరుఁ డంతఁ గూడి మమత వసించెన్ 90

క. మునివంశతిలక దానన్, ఘనుఁడు మహేశ్వరుఁడు నై నకళంకరుఁ డనకున్
వినఁబడె దివి ఘనకేతుం, డనునామము సార్థకముఁగ నమరులు మెచ్చన్. 91

క. పిమ్మటఁ బ్రావృట్కాలం, బిమ్ముల మేఘములమీఁద । నేఁగె హరుఁకున్
నెమ్మి జనించె శరత్సను, యమ్ము జనానందకరము । నై రమ్యముగన్ 92

శరదృతువర్ణనము

క. తొలఁగెను కుసుమములకలుషములు, విలసిల్లెను భానుదీప్తి । విశ్వము నిండం
గలఁగెను జారులమనములు, వెలసెను జొంపములచేత । వివిధవిహగముల్ 93

వ. మఱియు సారహీనసంసారమును బాసినపురుషులకరణి గాలివలనఁ దూలి చదలు వదలిన జలధరములును, ధారాసంపాత ముడిగినఁ గని తరులఁ బాసి చను లోహపృష్టములునుఁ, బుష్టవేగమును మాని దరులఁ దగులక పాఱుతటినులును, దట గృహారామవనసీమలనుండు విటపములలోని గూడులఁ బరిత్యజించి నిక్కి తెక్కలు చక్కఁగ విప్పుకొని చను పికవర్గములును, వర్ధమానములై నేలరా లిన కొమ్ములుఁ గల నల్లచారల దుప్పి తుటుములునుఁ, దుటుములగు రొంపుల పెంపుసొంపు లుడిగిన ఒలాశయములును, జలాశయముల మిగుల రాణించు నప సిజములును, సరసిజాననిర్మితి బ్రహ్మాండకిరంపఘనసారఖండములమాడ్కి వెల్లి విరిసిన చంద్రకిరణములునుఁ, జంద్రవర్ణసన్నిభము లై తావులకుఁ దావులగుచుఁ బుష్పించిన పూలగుత్తులుగల లతాజాలములును, లతావృక్షముల క్రింద నందు లేక పసరురంగునఁ బెంపొందిన కసవుల మేసవి బలిసి శ్రమఁబాసి విచ్చలవిడి దిరుగు గోకులములును, గుల్మచ్ఛన్నములై సంతోషాంతరంగు లగుకవులునుఁ, గవిముఖగ్రహతారకోపేత మగు విష్ణుపదంబును, విష్ణుభక్తుల హృదయముల చెలువున దిఙ్ముఖవైమల్యముఁ గల చంద్రికలు నుఁ గలిగి ధనదుధామంబుచా డ్పున శుంభత్పద్మకుందశ్రీయుతం బై వరవర్షిని చెలువున నకృష్టపయోధరం బయి శరత్కాలంబు చూపట్టె. 94

క. నారద! యేతాదృశ మగు, శారదకాలంబు నందు । జలధరములపైఁ
గూరిమి నుండినపతిఁ గొని, కారుణ్యాకరుఁడు హరుఁడు । కమనీయగతిన్ 95

ఆ. మందరాభిధాన । మహితశైలమున, కరుగుదెంచి పిదప । నమలమార్గ
సమశిలాతలాన్వి । తమునై నతన్నగ, శృంగమందుఁ గాంతి । పుష్టిఁ దగుచు 96

తే. సరవి శంభుఁడు రాజిల్లె । సతినిఁ గలిసి
ఛాయతోఁ గూడి వెలుగొందు । చదలుమాని
కమువిధంబున శారద । కాల మేగె
శౌరి హరి మేలు కాంచెను । సంతసమున 97

దక్షుఁడు యజ్ఞసిద్ధి నొనర్చుట.

సీ. దక్షప్రజాపతి । ధరణిపై యజ్ఞంబుఁ గావింప సమకట్టి । కశ్యపులను
శక్రాదినిర్జర । చయమునుఁ బిలిపించి కడిమి నదస్యులఁ । గా నొనర్చి
సరవి నరుంధతీ । సహితు వసిష్ఠుని శంసితవ్రతుని ని । రస్సంశయాత్ముఁ
ననసూయ యనునట్టి । యతివకు భర్తయౌ ఘనుని నత్రిని ధృతి । కలితుఁ డైన

తే. కౌశికునిఁ జంద్రతోఁ గూడి । క్రాలుచున్న
నంగిరసనామమౌని నహల్య యనెడి
సతికిఁ బతియగుగౌతమ । సంయమిని న
మాయ యనునాతిమగఁడు నై । మహిని వెలయు 98

తే. వరభరద్వాజుఁ బిలిపించి । భక్తితోడ, సభ్యనిర్దేశసత్కర్మ । సరణి యందు
నిలిపె శ్రుతిశాస్త్రవేదాంగ । నిపుణులైన, వారి నాపూనిచంద్రులఁ । బరమచరిత!

క. యముని సహింసానాథుం, బ్రముదితమతిఁ బిలిచి ద్వార । పాలునిఁ గా య
జ్ఞముఁ జేయుచోట నిలిపెను, రమణం జంద్రేశు నంగిరసుని న్వేడ్కన్ 100

తే. కడఁగి మృష్టాన్నపానసం । స్కారమందుఁ
బరఁగ నియమించె సత్రంపుఁ । బనినిఁ జక్కఁ
జేయుటకు నుంచె భృగువును । నెలఁగి రోహి
ణీప్రియుఁడు నగుచంద్రు । నియతిఁ గుల్క 101

చ. ధనపతిఁ జేసి పిమ్మటను । దక్షుఁడు ఘాఁతుల వారిధిర్దలన్
మనుమల యజ్ఞమందు గరి । మంపుదయం బిలిపించి మీనకే
తనరిపుఁ డైనశంకరునిఁ । దత్సతి యైనసతీలలామనున్
వినుతగుణాభిరామునుఁ బ్ర । వృద్ధజనావనదీక్షకామునున్ 102

ఆ. పిలువఁబనుపకుండెఁ । బ్రీతి లేకుండుట, చేత నన సవిస్మ । యాతతాత్ముఁ
డగుచు నారదుండు । యత్నంబుతో నాపులస్త్యుఁ జూచి పలికె । లలితభణితి

ఉ. ఏలొకొ దక్షుఁ డాద్యుఁడు మ । హేశుఁడు జ్యేష్ఠుఁడు శ్రేష్ఠుఁడుం జగ
జ్జాలతనుండు నాహరుని । జన్నముకై పిలిపింపఁ డయ్యె స
చ్ఛీల యటంచుఁ బల్క విని । శేముషి పొంగ నతండు నంతయా
ఖీలమనస్కుఁ డై మిగుల । వెల్లడి నారదమౌని యాదృతిన్. 104

తే. దయదలిర్పఁగఁ బలికెను । నయము మీఱ
దక్షుఁ డాద్యుఁడు జ్యేష్ఠుఁడుఁ । దత్త్వవర్యుఁ
డగుమహేశుఁడు పునుకను । హస్తమందుఁ
దాల్చి చరియించువాఁ డని । తలఁచి యతని 105

వ. యజ్ఞమునకు రమ్మని పిలువఁ బనుపఁ డయ్యె నన విని చిత్రపడి యతఁడు మునీంద్రా! దేవతాశ్రేష్ఠుఁడును శూలపాణియును ముక్కంటియును షడ్గుణైశ్వర్యసంపన్నుఁ డగు శంకరుఁ డేకర్మమునఁ దనకరంబునఁ బునుకను ధరించె వక్కాణింపు మని వేఁడఁ బులస్త్యుఁ డిట్లనియె. 106

— సృష్టిచిత్రము —

సీ. అవ్యక్తుఁ డయినబ్ర । హ్మాముచేత నాదిపురాణంబులనుఁ దొల్లి । రహినిఁ జెప్పఁ
బడినపురాతన । పరమగాథను దృఢమతితోడ విను నష్ట । మూరుతార్క

చంద్రోడుపావకస్థావరజంగమకలితార్ణవంబు నాకాలమందు
మునిఁగినలీఁగలఁ బొదరిండ్లఁ జిమ్మచీఁకటు లొప్పి యెవరికిఁ గానరాని
ఆ. దగుచు నప్రతర్క్య మై జన్మమృతులును, లేని దుర్దినమున లీల మెఱసి
యచ్యుతుఁడు సహస్రహాయనపరిమితి, కలుగురాత్రి వేళఁ గడఁగి నిదుర
తే. పోయి క్రమ్మఱఁ దద్రాత్రి పాయుచుండ, నిర్గుణబ్రహ్మమంతట నిఖిలలోక
సృష్టిసంకల్ప మొనరించెఁ బృథులశక్తి, రాజసంబగురూపుతో రమ్యచరిత
తే. దివ్యపంచాస్యములచేతఁ దివిరి నవ్వ, జగములకు సృష్టికర్త యై సర్వవేద
విదుఁడు నై రాజసగుణంబు విస్తరిల్లఁ, బుట్టె రాజిల్లెఁ బరమేష్ఠి పూజ్యభంగి
సీ. మునినాథ పిమ్మట మూఁడుకన్నులచేత భాసిల్లుచుండెడి వదన మొప్ప
శూలంబుఁ జేపట్టి సుభగాతుమాలనుఁ జూపించుచును దమోరూపు డగుచుఁ
దతజటాజూటంబు తలమీఁద రాజిల్ల బ్రహ్మపుట్టినరీతి బరుఁడొకండు
కలిగె వెంటనె యహంకారంబు పొఁసూపె దాన వారిద్దఱు దర్పమొప్ప
తే. గర్వితులునయి రామీఁదఁ గరళికంఠుఁ
డాగ్రహంబున బ్రహ్మతో నాడె నెవఁడు
నిన్నుఁ బుట్టించె నిచటికి నీవు రాఁబ
నేమి యన ధాత కోపించి మృడునిఁ జూచి 110
క. పలికెను నీ వెవ్వండవు, తలిదండ్రులు నీకు నెవరు తడయక నాతోఁ
బలుకు మటంచని యూఁగలి, బలిమిం బ్రియవాద మొదవె వారికి నచటన్.
క. ఆవాదమందు ద్రుహిణుఁడు, భావజపరిపంథిఁ జూచి బహురోషమునన్
భావాభావస్థితులను, భావింపంజాల వీవు పలికితివి బళీ 112
ఆ. శబ్దగుణకమగుచుఁ జనియించె జడలెట, నతులవీణఁ గరము వందుఁ దాల్చి
కిలకిలారవంబు లవి నొనర్చుచు నటఁ, గలిగినాడ వీవు గర్వమేలా? 113
చ. అని యిటులాడుచుండ విని యాతఁడు మానియు నైన బ్రహ్మచే
తను బరిభూతుఁ డై మొగము ధారుణివంకనె పెట్టి దీనతం
దనరుచు నుండె రాహుగళితద్విజరాజునుఁ బోలి యంతటన్
ఘనపరమేష్ఠిపంచముఖంబుఁ గడిందియు నైన కిన్కతోన్. 114
తే. ఆడెఁ గోపాంధకారితుఁ డై నరుద్ర
తోఁ దమోరూప! నీవాఁగి ద్రుళ్ల నేల
నే నెఱుంగుదు నీశక్తి నెద్దు నెక్కి
తిరుగుచు దిగంబరుండ వై తిపురుచుంట. 115
క. లోకక్షయమునుఁ జేయం, బ్రాకటముగ వెలసినావు బహుదోషివి వన్
ఆకటులజూఁ గని కోపము, భీకర మయి పెంపుసెందఁ బృథుగర్వమునన్ 116
క. త్వరపడి బ్రహ్మనుఁ గాల్చెడి, గరిమపుఁగామమున దోఁచు ఘనునికరణి నా

పురహరుఁడు తానవచ్చెను, గరమరుదుఁగ నతని । కపుడు కాంతిస్ఫూర్తిన్
వ. మునీంద్రా! శ్వేతరక్తకర్బురావదాతనీలపింజరవర్ణములు కలిగి దుర్దశము లయిన మోము లయిదు పుట్టె నంతటఁ జదువుల వేల్పు వేఁడివెలుంగున కెనయగు నామొగంబుల నాలోకించి కఱకంఠునితో నిట్లనియె శంకరా! నీ మొగంబు లెగురఁగొట్టఁబడిన నీటిబుగ్గలచాడ్పున నగపడుచున్నవి వీనియం దేమి పరాక్రమము కలదని పలికిన విని క్రోధఘూర్ణితమానమానసుఁ డయి రుద్రుడు తనగోటిచేత నాభాతతల నొకదానిం ద్రుంచె నది యాతనియెడమ చేతియందుఁ దగులుకొని యెంతానొకతతి యైనను వదలకుండె నంత 118

సీ. పరమేష్ఠి రోషంబు । ప్రజ్వలించుచునుండఁ గవచంబుఁ గలవాఁడు । ఘనశరాస్త్ర
ధరుఁడు కుండలములు । దాల్చినధీరుఁడు ధీమంతుఁ డగువాఁడు । దీప్యమాన
శరచాపహస్తుఁడు । శక్తియుక్తుఁడు నాశరహితుఁడు ఘనబాహు । రమ్యతనుఁడు
హరితుల్యదర్శనుఁ । డతులచతుర్భుజుఁ డమ్ములపొదిఁ దాల్చి । నట్టివాఁడు
తే. నయినపురుషుని సృష్టించె । నంత నతఁడు
హరునిఁ గనుఁగొని పలికె దుష్టాత్మ! శూల
హస్త! పాపమనీష నీ । వందువలనఁ
జంపఁ బో చాలు నింకేల । జాడ్య మేల' 119

క. ఏవాఁడు జగతిలోపలఁ, గావరమునఁ దిరుగు పాప । కర్ముని జంపం
భావంబులోనఁ దలఁచును?, నీవిట నుండంగఁ దగదు । నీచగుణాఢ్యా! 120

క. అని యీక్షైవడి నాతఁడు, ఘనపరుషోక్తులనుఁ బలుకఁ । గఱకంఠుఁడు తా
విని దిక్కుఁగోఁప కయ్యేడఁ, దనకప్రియ మొదవఁ జూచి । తహతహపడుచున్

క. సరిదాఢ్య యగుసుస్వాలి, నిరతముఁ బ్రవహించుచోట । నెగడి నరునకుం
గురువగు నారాయణునకుఁ, బరమస్థానంబు నగుచు । భాసిలునది యై 122

తే. సరవిఁ జెన్నొందు బదరికా । శ్రమమునకును
బోయి నారాయణునిఁ గాంచి । పూర్ణభక్తి
నాడె; దేవేశ! నీవు మహాదయాస
ముద్రుఁడవు భిక్ష నాకిమ్ము । పుణ్యచరిత! 123

చ. అని కడుదీనుఁడై నుడువు । త్ర్యంబకుఁ గన్గొని ధర్మపుత్త్రుఁ డో
మనసిజవైరి! నాభుజము । మానితశూలముచేతఁ గొట్టు మం
చని వచియించె నాకరణి । నట్టులొనర్పఁ ద్రిశూలఘాతసం
జనితము నైనమార్గమున । సంభవ మొందెను మూఁడుధారలున్ 124

క. నారద! యాధారలలోఁ, దారాపథమం దొకండు । తగ భాసిల్లెన్
ధార యొకటి పృథివిస్థలిఁ, జేరను రాఁ జూచి మదినిఁ । జిడిముడిపడుచున్.

ఆ. తపమె ధనముగాఁగఁ । దనరారు నత్రిసంయమి గ్రహించె దాని । నతనివలనఁ

గలిగె శంకరాంశ కలితుఁడై దుర్వాసుఁ, డనెడు మానినాథుఁ డతులభక్తి
తే పరఁగ మూఁడవధార కపాలమందుఁ, బడియెఁ బ్రావృషినంబుదపటల మెలమి
వడిని గర్జించుచున్నట్టి పగిది నెవని, నిలనుఁ దాళఫలక్రియ నిపుడె కూల్తు.

మ అని గర్జించుచుఁ దత్కపాలమున నుత్కృష్టదీప్తితో నందరుం
డనువాఁ డస్త్రతనుత్రచాపధరుఁడై యత్యంతతారుణ్యుఁడై
ఘననీలాసితగాత్రుఁడై కలిగె నుత్కంఠ న్విజృంభించుచుం
దనదేహచ్ఛవి దిక్కులందు గడిమిం దళ్కొత్తి దీపింపఁగాన్. 128

సీ ఆయెడ నారాయణాత్మజుఁ డగునరుఁ గాంచి హరుం డాడెఁ గ్రౌర్య మొప్ప
నోనరవర! వారిజోద్భవుఁడును దుష్టవాక్యుఁడు రవిశతప్రతిభుఁడైన
నీనరుఁ బడగొట్టుమనవుఁ డాపురుషుఁ డాద్యము సుప్రసిద్ధమైయజగవాఖ్య
నలరువిల్లునుఁ దాల్చి యక్షయతూణీరములతోడ నని జేయ మోహరించెఁ

ఆ గడిమి బ్రహ్మసుతుఁడు గర్వంబుతోఁ బోరఁ, బ్రతిఘటించె వారు బలిమి వేయిఁ
దివ్యవత్సరములు ధృఢశక్తిమై పోరి, రంత హరుఁడు నలువ కనియె నిట్లు

వ పరమేష్ఠీ! పరమాద్భుతకర్ముఁ డగునానరుఁడు దురమున నీనరుని వేడి కోలల
నొప్పించి త్రోసినఁ బడి పరాజితుఁడయ్యె నని చెప్ప నామాటవిని యతఁడు
నవ్వి, గిరిశా! త్వదీయమదీయపురుషు లీజన్మమునఁ బరాజితులు కా రని నుడు
వుచు నిజాంశజుం డగునరుని సూర్యునియం దంతర్హితునిఁ జేసె నంత హరుఁడు
తననరుని ధర్మపుత్రుఁ డగునరునియం దైక్యముఁ జేసె నిట్లు బ్రహ్మశివులకు వివా
దంబు కలిగి నివర్తించె నని చెప్పి వెండియుఁ బులస్త్యుఁ డిట్లనియె 130

క నారద! హస్తతలంబున, ఘోరం బగుపునుక హరుఁడు గొని బహుచింతా
భారాకులేంద్రియంబుల, వారనిసంతాప మొదవి వర్తింపంగాన్ 131

బ్రహ్మహత్యపీడితుఁడై శివుఁడు తిరుగుట.

తే. నలుపుకాటుకగుమిచవి నలిఁ జెలంగ, రక్తమూర్ధజ యయి మహారౌద్రభంగి
బ్రహ్మహత్యహరాంతిక భాగమందు, వచ్చి నిలిచినఁ గనుఁగొని భర్గుఁ డనియె

క. వికరాలిని నీవెవతెవా, వికటిగలిగె రాఁ బనేమి వివరింపు మనన్
వికవిక నవ్వుచుఁ బలికెను, సకలేశునితోడ నదియు సంయమిచంద్రా! 133

తే. బ్రహ్మహత్యను నేఁ బరబ్రహ్మరూప
వచ్చితి నటంచు వాక్రుచ్చి వడిగ నతని
కాయమందుఁ బ్రవేశించెఁ గడఁగి దాన
గర్హితుఁడు నయి హరుఁ డంతఁ గలఁత మిగుల 134

తే బదరికాశ్రమభూమికిఁ బరమభక్తి
నరిగి నారాయణుని నరు నచటఁ గాన

జాలకరయి చింతచేఁ గుంది । సత్వరముగ
యమునలోఁ గ్రుంకఁ బోయిన । నదియు వెఱచి. 135

చ. జలరహితస్థితి న్వఱలె । శంకరుఁ డంతటఁ బ్లక్షజాసరి
జ్జలమున స్నాతుఁ డౌటకునుఁ । జయ్యనఁ బోవ నిరస్తనీర మై
పొలిసినఁ గాంచి సిగ్గుపడి । పుష్కరమాగధసైంధవాటవీ
స్థలమున సంచరించి విగ । తశ్రముఁ డై వతీ మానినాయకా 136

క. నిమిషారణ్యస్థలికిం, గ్రమమున ధర్మాటవికిని । రయమునఁ జని త,
ద్విమలాంభస్సుల మునిఁగినఁ, దెమలక యా బ్రహ్మహత్య । తిరముఁగ నుంటన్

తే. దేవగృహములను బవిత్ర । దివ్యనదులఁ
దీర్థముల నాశ్రమంబులఁ । దిరిగి మునిఁగి
పరమయోగంబుతో నున్నఁ । బరుని నది వ
దలియుఁ జనకుండె నత్యంత । దారుణముగ. 138

ఉ. పిమ్మట గట్టువిల్తుఁ డతి । భీతుఁడు నై కురుజాంగలమ్ము నొ
క్కమ్మడిఁ జేరి చక్రధరు । నుజ్జ్వలపత్త్రపలిష్ఠుఁ గేశవుం
దమ్ములఁ బోలునేత్రములఁ । దాల్చు దానవవైరిఁ జక్రిఁ దా
నిమ్ముల గాంచి కేల్మొగిచి । యెంతయు వేఁడఁ దొడంగె భక్తితోన్ 139

## హరుఁడు భగవంతుని వేఁడుకొనుట

క. శ్రీకర! భక్తశివంకర, పాకారిప్రముఖవినుత । భాసురసారా!
భీకరదానవహర సు, శ్లోకా! జోహారు నీకు । శుంభద్ధీరా! 140

తే. శంఖచక్రగదాధర । సర్వదేవ, నాథ! గరుడధ్వజానంత । నామ! వాసు
దేవ! నిర్గుణ! హైరణ్య । దివ్యగర్భ!, వందనము నీకొనర్చెద । వాంఛ మిగుల

శా. జ్ఞానాజ్ఞాననిరావలంబ సకలా । కారా! జగద్రక్షకా!
ధీనిష్ణాతుఁడ వై విరాజసగుణో । ద్దీప్తిం బరబ్రహ్మ వై
నానాస్థావరజంగమాత్మజగతి । న్నానావిచిత్రంబులం
గానవ్వచ్చెడురీతిఁ జేయు నిను నేఁ । గాంక్షించి సేవించెదన్ 142

ఆ. సత్వగుణముఁ దాల్చి । జగదీశ! విష్ణురూ
పమున సర్వలోక । పాలనంబు
సేయునీకు నతులు । చేసెద గురుహస్త
విజితవిషయజాత! । విశ్వవేద! 143

క. సకలవ్యాపక! నిర్జర, నికరాధిప! తిమిరకాయ! । నేనుఁ ద్వదీయాం
శకుఁడను రోషోద్భవుఁడను, వికలగుణాన్వితుఁడఁ బ్రోవు । విశ్వేశ! హరీ!

క. వామన! మాధవ! మునిజన, కామితసద్ధామ రత్న । కాంచనదామా!
సోమానలరవినేత్రా!, కోమలనీలాభ్రగాత్ర! । గుణరత్ననిధీ! 145

సీ శ్రీకరశుభగాత్ర శృంగారచారిత్ర పావకాంబరమనో వాయుబుద్ధి
జలశరుద్వలును నీవ జన్మంబు శౌచంబు ధర్మమహింసయు దానమార్గ
వము నీవ యక్కటికము నీవ లక్ష్మియు బ్రహ్మచర్యం బీవ భద్రశాంతి
సత్వమార్గము నీవ సాంగము లౌనాల్గు తొలిచదువులు నీవ తోయజాక్ష
తే వేదపారగ! యుపవేద వేద్య! నాదు, కాయమున బ్రహ్మహత్యచే గలిగినట్టి [ప
దోసమును బాపి రక్షింపు దుఃఖ మొదవె, దగ్ధుడను నష్టతనుడను దరమెసై

క దీనులకష్టముఁ దీర్పను, దీనులఁ బాలించి కీర్తిదిక్కుల నింపన్
దీనావన! నీ కమరును, దీనుఁడ నను గావవయ్య దివిరినకరుణన్. 147

ఆ దుర్నిరీక్ష్య మగుచుఁ దోఁచుచున్నది దీని, బాపి నన్నుఁ బ్రీతిఁ బావుఁ జేయు
భక్తబృందలోల! ధర్మనిర్మితచేల, భావకలుషహరణ! భాగ్యకరణ! 148

చ అని మునివర్య! శంకరుఁడు హర్షము దూలి వచింపఁ గేశవుం
డనఘుఁడు చక్రపాణి మనసారఁగ నాశివుఁ జూచి బ్రహ్మహ
త్యను వదలింపఁ జేయఁగల దై కలనాదశుభప్రదంబు నై
తనరెడుమాట చెప్పెదను దాన జయం బగు నీకు నీశ్వరా! 149

చ కలదు ప్రయాగ, గాంగజల గాహననిర్గతసర్వలోకని
స్తులకలుషాతివేగ, సుర తోషితభాసురనవ్యరత్నకో
మలరుచిసౌధపూగ, బుధ మండలమండితభాగ, భామినీ
కలకరకంకణక్వణన విభ్రమవిరాగయు నై వసుంధరన్ 150

తే అట్టిపుణ్యంపుఁ జోట మహాత్మ యోగ, శాయి నానొప్పు దేవుఁ డస్మత్కృపాభి
జాతుఁడు వసించుచున్నాఁడు సరవి నతని, దక్షిణపదంబుననుఁ బుట్టి ధరణి మీఁద

తే సరగఁ బ్రవహించుచున్నది చారువరణ
సర్వజనపాపహరణ! విస్తారపుణ్య
భాగ్యకరయగు వరుణ తేవ్వరదుసవ్య
చరణమునఁ బుట్టి పాఱుచు కలిమి లేక 152

క ఆసీనావ కమగునది, భాసిలె నా రెండునదులు పాపహరము లై
వాసిఁగనె సర్వభూతా, వాసునిచే వానిఁ నడుమ వఱలినచోటన్. 153

క త్రిభువనముల శ్రేష్ఠంబయి, శుభములఁ జేకూర్పఁ జాలి సుకృతప్రదస
ద్విభవమున నుండుతీర్థము, సుభగగుణా! కలదొకండు శుభఫలదం బై 154

తే భోగివగు నీకు దోసంబు పోవునట్టు, చేయఁజాలిన దై పుణ్యసీమ యగుచుఁ
దనరు వారాణసీపురి దానిమహిమఁ, బలికెదను వేడ్కతో విను భావచారి

కాశీపురవర్ణనము.

తే విప్రులశుచిస్వకత్వంబు విని హసించి
వలఁపుఁగ త్రైలమొలనూళ్ల వలనఁ గలుగు

గవముచేసినవేదస్వ । నముని వినఁగఁ
జాలఁ గోరిరి గురువులు । సారె భర్గ! 156

చ. చెలువలు నాల్గుదిక్కులను । జెన్నలరారెడుత్రోవలందరిం
బలిఁ జరియించుచుండఁగను । లక్ష్మికిచే నెలువైనకాళులం
వలివెలుఁగంతఁ జూచి స్థల । పద్మిని పోవుచునున్న దేమొకో
తెలియకటంచు విస్మయముఁ । దేఁకువలేక చెలంగె నీశ్వరా! 157

తే. తుంగసౌధమందిరమ్ములు । తుహినకిరణు
నస్తగించుచునున్నవి । యామినులనుఁ
బోడవులగు టెక్కెములు గాలిఁ । బోదలి తూలి
మఱుఁగుపఱచు వర్కని । మహితశక్తి 158

చ. తరుణులతేటమోములనుఁ । దమ్ములుచందురుతాలఁగోడలం
సరగున సంక్రమింపఁ గని । షట్పదసంఘము లెల్ల భ్రాంతి మై
నప్పుడరవిందవర్యమును । జొచ్చుట కెంతయు నెమ్మనంబులం
గరముఁ దలంపవచ్చునతి । కాంతిఘనంబుగఁ బూని శంకరా 159

సీ. లేదు పరిశ్రమ । లీల సంమోహనకేళిలంజికలు । జాలము లకు
తీగదాశ గృహస్థ । దీప్తి కాజలకేళిఁ దేలుచునుండిన । లెఱవలకును
నడ్డగింపఁ డోకండు । హారితోడఁ గలిసియుఁబరగృహంబులఁదమి । ఛాలి మెఱసి
చూపఁడు శక్తి స్వ । సుందరీసురతంబుఁబోనాడి మఱియొక । పొలఁతియందుఁ
తే. గో: దొరులధనముఁ । గాటసాక్ష్యంబులుఁ, జెప్ప రెపుడు సత్య । చిత్తులగుచుఁ
జేయ రెవరికైనఁ । జెడుపని నాపురి, జనులు నాగభూష! । చతురభాష! 160

ఆ జవ్వనంపువేళ । జనులందుఁ గరులందు, మానమదముమదము । మానువేళ
దానభేదనంబు । దంతింద్రములయందుఁ, దాఁటి ముడియుఁ గలదు । దైత్యభేది!

క కుయివెట్టుకాశికములుం, బ్రియదోషము లగుచునుండుఁ । జెంపారంగం
బ్రియదోషులు కారాపురి, నయముఁగ నున్నట్టి జనులు । నాగాభరణా! 162

క సారెకుసారెకుఁ జూచిన, వారిదగణమందు గళిత । వర్తనమటులే
తారాగణాకులీనత, వాసక వర్తించుచుండు । వరవృషరూఢా! 163

చ పరఁగ మహాభుజంగహరి । వారితభైవరభూతిలుబ్ధలై
కరము సుచంద్రదేహలయి । కమ్రవిలాసిను లైనభామలా
పురవరమందు నీవలెనె । పొల్పుగనుందురు వింతనోపఁగా
సురుచిరగాత్ర! శివతతి । సూత్ర! పవిత్రచరిత్ర! శంకరా! 164

ఉ అపురిలో మహాశ్రయము । నందొగినిత్యములోలభాస్కరుం
డేఁపునుండుఁ బాపహరుఁ । డీప్సితముండయి కాంతిఁ గుల్కని

ప్పాపద శాశ్వమేధమునఁ । జక్రి మదంశ ... డైన కేశవుం
డాపదఁ బాపుదేవుఁడగు । నచ్చుతికిం జను నిశ్చయంబుగన్ 165

ఉ పాపనివృత్తిఁ జెందఁగల । వాఁడవు పొమ్మని చెప్పె పక్కనా
శ్రీపతికంత మ్రొక్కి నుతి । సేసియుఁ బిమ్మటఁ గాశికిం జగం
బాపవిమోచనార్థమయి । బంధురభక్తినిఁ బూని దీక్షతో
గోపతియానమహేశ్వరుఁడు । గొబ్బునఁ బోయెను దార్క్ష్య కైవడిన 166

క నారద! శివుఁ డట్టులె చని, వారణాసి పంచటితీర్థ । వరముల లోలుఁ
సాశ్వమేధముం గని, కోరికదత్తీర్థములనుఁ । గ్రుంకి సభక్తిన్ 167

ఆ విగతపాపుఁ డగుచు । విశ్వేశుఁ గేశవుఁ
జూడ నరుగుదెంచి । సుభగు నచటఁ
గాంచి వందనములు । గావించి నుతియించి
పలికె నతని గార్చి । భయముగదుర 168

మ భువనేశా! హతదానవేశ! సుఖదా! । పుణ్యప్రదా! నీప్రసా
దవిశేషత్వముచేతఁ గాసి తొలఁగెం । దథ్యంబుగా బ్రహ్మహ
త్య వడిన్ బోయెనుగాని యీపుడు కమ । స్తచ్యుతిం జెంది యీ
యవనిం గాల దిదేమి కారణమొ నా । కారీతి డెందంబునన్ 169

చ తెలియదు కాన తద్విధముఁ । దెల్లముఁగా వచియింపుమంచునా
వలిమలవిల్లువాఁ డడుగ । వారనిప్రేమను గేశవుం డనెన్
గలదు విచిత్రకారణము । గాసిల నేటికి నీకు నెప్పుడుం
దెలియఁగఁ జెప్పువాఁడ విను । తీఱును సంశయ మింక నీశ్వరా! 170

తే కమలకహ్లారములచేతఁ । గ్రాలి దివ్య, పుష్కరవిరాజమానమై । పొలుపు మిగిలి
నాడుముంగల సురతతి । నరసు సేవ్య, మైనమడుగొక్కటియుఁ గల । దదియు జగతి.

తే తీర్థరాజము కావునఁ । దివిరి దాని, యందు శ్రద్ధను స్నాతుండ । వైనయెడల
నంతఁ ధరమీఁదఁబడును నీ । హస్తగతక, పాల మద్దాన నీకుఁ గ । పాలి యనఁగ.

క ఖ్యాతిగను పేరు రాఁగల, దాతతముగ నెల్లవార । లానందింపన్
భూతలమున నాయది వి, ఖ్యాతిఁ గపాలప్రమోచ । నాఖ్యఁ జెలంగున్ 173

క. అని సురపతి యగు కేశవుఁ, డనఘుం డగు శివునితో ... । నాడిన వేడ్కం
జని తత్కపాలమోచన, మున శాస్త్రవిధిస్నానింగ । మునివరతిలకా! 174

క. మునిఁగినఁ ద్రిపురాంతకుచే, తిని భాసిలుపునుకి వదలి స్థిరపైఁ ద్వరఁగన్
జను లెల్లఁ జూడఁ బడియెను, మనసిజహరుఁ డంత సోష । మహితుం డయ్యెన్

క. వనమాలి సుప్రసాదము, ననుఁ చ తీర్థంబునకును । నలుఁగడలందు
న్మనుకొని కపాలమోచన, మనునామము సార్థకము గ । నలరెం జుండీ 175

ఆ. దేవపూని! హరుఁడు । తివిరి యీరీతిఁ గ, పాలి యయ్యె నందు । వలన దక్షుఁ
డితనిఁ బిలువఁ డయ్యె । నధ్వరమునకును, గర్వితుం డటంచుఁ । గరుణ వదలి 177

వ. అట్టితెరుణమం దెల్లవారలు కుతుకంబున దక్షయజ్ఞమున కరుగుచుండి రంత.

మందరగిరిపై సన్నుతలెని జయ చూడవచ్చుట

క. సుందరవరకందర మగు, మందరనగమందు హరుని । మగువను జూడన్
జంకువను వచ్చెఁ గౌతమ, నందిని యగు జయ కడిం । డ నర్మిలి మించన్ 179

క. ఒరయిడ నొంటరిగా జయ, దాయుటయును దక్షపుత్రి । దానిం గని యో
తోయజముఖి! నీపొంకతవె, ంయత్నం బేమొ తెలియ । రా దయ్యె మదిన్ 180

సీ. విజయాఖ్య నలరారు । వెలఁదియు నీవెంట రా, దేమిపలుకు మో । రమణి! యనఁగ
నాదేవిమాటల । నా పరమేశ్వరి విని పల్కె నో యమ్మ! । వినుము తమినిఁ
దల్లి తండ్రియునైన । దక్షునిచేత నాహూతలై యజ్ఞంబుఁ । బ్రీతిఁ జూడ,
నరిగిరి నేఁ దల్లి । యైనయహల్యతోఁ దండ్రియౌ గౌతమ । తపసితోడ,

ఆ. యజ్ఞవాటమునకు । యత్నంబుతోఁ బోవు, చుండి వారి విడిచి । యువిద! నిన్నుఁ
జూచుటకును వేడ్క । సొంపార వచ్చితి, నరుగుదేరవా! శు । భాంగి నీవు 181

క. హరుఁ డచటికిఁ జనఁడా యు, ధ్వరమునకును దక్షుఁ డిపుడు । తరుణీమణిరో!
కరుణను రమ్మని పిలుచుట, కొఱ కెవ్వనిఁ బనుప లేదె । కోరికమీఱన్ 182

తే. తాతపిలుపింపకుంట నత్యంతవిస్మయావహం బయ్యె రాఁగల । వా లతాంగి.
సకలసుమానులును వారి । సతులు సుతులు, రోహిణీదేవి చంద్రుఁడు । రూఢిఁ గుల్కు

వ. పదునాలుగులోకముల నున్న చరాచరజంతునికరములు మతల్లి కలగుపినతల్లులు
ను దక్షాధ్వరమున కామంత్రణమ్ము వడసి, జన్నమునుఁ గన్నులారఁ జూచి
విన్నాణము గఁ జనుచున్నవారు నీవు నిమంత్రితవు కావా! రావా యని
జయ వక్కాణించె నంత 184

క. అమ్మాట వజ్రపాతని, భమ్ముఁ గ నాలించి దక్ష । వరపుత్రి వెసం
దిమ్మవడుచున్న మతితో, నుమ్మలికము కలిగి కూలె । నూపిరి వెడలన్ 185

చ. మృతసతిఁ జూచిచూచి జయ । ముంచినదుఃఖమునందు మున్గి వి
స్తృతజల మక్షియుగ్మమునఁ జెచ్చెఱ జారుచునుండ వేగ హా
సతి యని సుస్వరంబుఁగనుఁ । జాలఁగ నేడ్చె ధరిత్రి వ్రాలి భూ
తలతలివిచిత్రమంచుఁ గడు । దల్లడమందెను సంయమీశ్వరా 186

క. ఆక్రందనరవము విని, విక్రమమున శూలిరైన । విషమనేత్రుఁడు బ
లవ్వక్రగతి నేమి యిది యని, సక్రోధతను జయకడకుఁ । జనుదెంచి వడిన్.187

తే. గండ్రగొడ్డలిచే నరకంగ మ్రాను, వదలి పుడమినిఁ బడులీఁగ । వలెను మిగుల
శిథిలమైనట్టి యంగము । ల్చెదఱ నేలఁ, బడిన నిజసతిఁ జూడఁగాంచి । పండ్లు గొరికి.

క. పలికె న్జయనుఁ గనుంగొని, లలనా! ఖేదింపఁబడిన । లతగతి నీనా
కులసతి యా సతి సోలెనుఁ, బలుకవె యని నాపెలం । భాషించె మునీ! 189

తే. లీలభర్తలఁ గూడి చెల్లెండ్రు, సకల, దేశములవార లాదిత్య । దేవమునులు
సవనమునుఁ జూడఁజనఁగని । జనకుఁ డిట్లు, తనకివజ్ఞతఁ జేయఁగ । ధర్మమౌనె

చ. అని పసతల్లి యైనసతి । యాత్మఁ దలంచి విపన్నయై వెసం
గనులను బాష్పములు దొరఁగ । గాసిలి కూలెను పట్టిచింతతో
నని వచియింప భీతిదము । నా పలుకు న్విని రోషమగ్నుఁడై
కనఁబడె రుద్రుఁ డాయెడనుఁ । గ్రౌర్యము శౌర్యము పిచ్చలింపఁగన్ 191

ఉ. రుద్రుఁడు క్రుద్ధుఁడై జటలు । రూ నిఁ దత్సకలాంగకంబులన్
ఛిద్రములేక పావకుని । చిత్రపురోచులు నిర్గమించె సం
భద్రులు వీరభద్రముఖ । వర్యగణంబులు కేసరీముఖుల్
రుద్రులు గాత్రరోమజులు । రోషముతోడ జనించి రంతటన్ 192

తే. తద్బలంబులఁ గూడి గంధర్వసేవ్య, మానమందరగిరినుండి । సుహితకాంతి
కలుగు తుహినగిరిం జేరి । శిఖలమ్ము,దారయొచోట దక్షుఁడు । ధ్వరముఁ జేసె

హరవీరభద్రులు దక్షయజ్ఞధ్వంస మొనర్చుట

ఉ. చేయుచు నున్నచోటికిని । వెచ్చవచ్చెనుఁ గ్రౌర్య మొప్పఁగా
నాయెడ వీరభద్రుఁడు మహాబలశాలి కుబేరదిక్కునం
బాయక నిల్చె శూలమును । బాహువునం దగఁదాల్చి యుద్ధలిం
దోయజనేత్రయైన జయ । దుస్సహమైన తదధ్వరంబునన్ 194

క. ధరియించి పూర్వదక్షిణ, ధరశీర్షస్థలమందు నిలిచెఁ । దన్మధ్యమునన్
హరుఁడు త్రిశూలధరుండై, గురుకోపముతోడ నిలిచె । ఘోరాకృతిపై

వ. అట్టియెడ 196

క. నారద! శక్రపురోగము, లైరహిదేవతలు సర్వ । యత్నులు మాను
ధీరులట వీరభద్రుని, వీరుని హరివదనుఁ జూచి । విస్మయపడుచున్ 197

క. ఇదియేమి హేతువో యని, మదిఁ జింతిలుచుండి రపుడు । మహానుజ్జ్వలభ
ప్రదనీలదేహకాంతులు, విదితంబుగ సర్వదిశల । వెలుఁగుచు నుండన్. 198

క. చిలువల కెనయగుతూపులు, విలుదోనలును వేగ దాల్చి । పితరులదారవా
కిలిఁ గాచుచుండి వెడలెను, బలిమిన్ గణనాథుఁ డల్ప । భావించి వడిన్ 199

ఆ. వచ్చుచున్న జముని । వారిరిఁ జూడఁగాంచి, వీరభద్రుఁ డంత । బుధులకెక్కి
నొక్కకరమునందు । నుజ్జ్వలపవినిభ, శూలమును ధరించి । సొరిది మించి 200

క. విలుఁగొని రెండవచేతనుఁ, జిలుకుల మూఁడవదియైన । చేఁ దాల్చి గదన్
నలి నాల్గవ కేలం గొని, బలుఁడగు యముతోడఁ బోరఁ । బాటించి మడిన్. 201

వ ఎదిరించినిలిచిన గణేశునిఁ గాంచి సహింపక కినుక నష్టభుజుం డగుదక్షునంపు సామి పెక్కువారసములను ఖడ్గచర్మాసిప్రాసచాపముఖసా ధనములఁ గరంబు కరమ్ములఁ దాల్చి యాతని వధియింపఁ బూని నిలిచినఁ గని వీరభద్రుఁడు రౌద్ర రసోల్లసితమూర్తి యై మహార్ణవంబునం దిరుగు మందరనగమ్ము చందమ్మునఁ గద నమ్మునఁ జెలరేగి తిరిగి సనాతనుఁ డగుజమును సమయింప సమకట్టి మత్త వేదండ శుండాదండ సన్నిభ మ్మగునిజభుజదండమందు మండితమ్మగుకోదం డమునఁ దండోపతండములగు కాండములు నరివోసి పంపినఁ జూచి కా లుఁడు లయకాలునిభాతి తేఁగి ఆద్బాణములను నడుమనె ఖండించె నిట్లా మహాత్ములు శరచాపధరులై పరస్పరజయకాంక్షఁ గలిగి పోరిపోరి రక్తసిక్తాంగు లగుచుఁ బూచినమోదుగులవలె రంజిల్లి రపుడు వీరభద్రుఁడు విజృంభించి నారాచములఁ బ్రొద్దుకోమరుని బిట్టల్కఁ గొట్టిన నతఁ డట్టె సొమ్మసిల తూలి వ్రాలి చిన్నపోయినమనంబునఁ బెడమొగము వెట్టుకొని దురముఁ జెయుట వదలి నిలిచె నంత గణేశుఁడు నిరాటంకముగ యజ్ఞవాటంబు సొచ్చెనని పుల స్త్యుఁడు చెప్పి మఱల నిట్లనియె 202

చ సవనపుశాలఁ జొచ్చినవి। శాలయశస్కుని నగ్గణాధిపుం
దివిజులు చూచి బాణములఁ । దేఁకువఁ గైకొని నిల్చి రంత భూ
దివిజులు వాసవాదులును। దిగులు పన్నగ సిద్ధసాధ్యులున్
భువనహితు ల్ఖగాధిపులు । పుణ్యులు చక్రధరు ల్మునీశ్వరుల్ 203

సీ గంధర్వవసువులు । కదనశూరులు నవగ్రహము లు ద్వాదశ। రవులు యక్షు లును సూర్యకులజులౌ। మనుజేశ్వరులు చంద్రవంశపురాజులు। భాసురాంగు లగుయక్షు లేకాద। శ ఋక్షులౌ రుద్రులు కింపురుషులు భోజ। కిన్నరులు, భవ్యవిశ్వేదేవ। భద్రులు దితిజులౌ దానవులును మఱి। దక్షుయజ్ఞ
తే వాటమున కేగుదెంచిన । భవ్యు లెల్ల, నుద్ధతి నుదస్త్రపాణులై । యొక్క మొగిద మూఁగి యెదిరించి నిలిచిరి। భూరిశక్తి,మానికులచంద్ర! విమల విజ్ఞానసాంద్ర!

ఉ అయెడ వీరభద్రుఁడు మహాసురముఖ్యులఁ జూచి విస్ఫుర
త్సాయకచాపధారియయి । చయ్యన వారి నెదిర్చి గాయము
ల్గాయము నందు నేర్పడఁగఁ । గాండములం బఱగించి యార్వనా
తోయము వారు ధీరులయి । దోర్బలశక్తులు పెంపుసెందఁగన్ 205

తే. వీరభద్రుని నెదిరించి । వివిధఘోర, శస్త్రవర్షంబు గురిపింపఁ। జంచలింప కతఁడు తద్బాణములనెల్ల । నతులతీక్ష్ణ,తరశరంబులఁ ద్రోడిచేసి । ధరణిఁ గలిపి

క వెంటనె శస్త్రాస్త్రంబులు, వింటను సంధించి వ్రేయ। వెఱచి సురాదు
ల్గెంటించి యతనితోడను, దంటన్ జేయంగలేక । తహతహపడుచున్. 207

వ మన మితనిచేఁ జంపఁదగినవార మైతి మని యెంచి యూరక నిలిచి పఁచివ్వచేయఁ
గోరరై రంత జుహ్వామాను లగుమహర్షు లెచట హవిస్సును భాగించి దేవతా
ర్థమై హోమముగావించుచుండిరో తద్యజ్ఞమధ్యభాగమునగణనాథుఁడు నిలిచె
నయ్యెడ 208

హరివీరభద్రులతోఁ బోరుట.

క హరివదనుని గణనాథునిఁ, బరమాద్భుతవేషుఁ జూచిఁ । భయమున మును లా
వరహోత్రముమానుచు శ్రీ, హరిశరణముఁ జొచ్చి రపగ । తానందులునై 209

క దిగులొందెగ మునులం గని, ఖగవాహనుఁ డైనచక్రి । కరుణాదలిర్పన్
వగచేలఁ జూడుఁ డిపు డా, గతునిఁ బరిమార్చువాఁడ । బంధురశక్తిన్ 210

మ అని వారందఱ నూరడించి హరియు । ద్యచ్ఛౌర్యగాంభీర్యుఁడై
ఘనదేహావరణ ప్రదారణభుజంగస్ఫార ఘోరాస్త్రముల్
గొని శార్ఙ్గంబునఁ గూర్చి యార్చి గణపుం । గ్రోధంబుతోఁ జూచి వై
చెను వక్షస్స్థలిఁ దాకునట్లు పెలుచం । జేజేలు మోదింపఁగన్ 211

క. మునినాథ! యమోఘములగు, వనజాక్షుని తూపు లతని । వరదేహముఁ దా
కి నిరస్తశక్తితోఁ బడెఁ, గననాస్తికువలన నర్థి । గణములమాడ్కిన్ 212

క అది కని బిట్టల్కన్ హరి, గదవైచిన శూలమునను । గణపుఁడు దానిం
జిదియన్ గొట్టెను ధరఁబడ, విదితంబుగ నెల్ల రంత । విస్మయపడఁగన్ 213

శా ఘోరాస్త్రంబులు వ్యర్థమౌటఁ గని బల్క్రోధంబుతో శౌరి యా
వీరాగ్రేసరు దివ్యబాణతతుల । న్వేవేగ నొప్పించినన్
ధీరత్వంబున వీరభద్రుఁ డొకటన్ । దీక్ష్ణాంబకశ్రేణులన్
సారానేకశరత్రిశూలగదలం । జక్కాడె నత్యుద్ధతిన్ 214

క గదభగ్నమైనహరితాఁ, బొదలినకినుక న్హలంబుఁ । బొాతిఁ బోతివైవం
బదరక గదచే దానిం, బదఁ పడి నుగ్గాడె నతఁడు । పరమమునీంద్రా! 215

ఆ హలము విఱిగిపడిన । హలధరుఁ డగుశౌరి, ముసలసాధనమును । మోహరించి
వ్రేయ హలముకరణి । వెస వీరభద్రుఁడు, దానిఁ ద్రుంచి త్రోసె । ధరణిమీద

క ఆరెండుచదియుట న్గని, వారిజనాభుండు గరుడ । వాహనుఁ డంతం
గ్రూరతఁ జక్రము వైచెను, వీరునిఁ జెండాడుటకును । విశ్రుతశక్తిన్ 217

మ మునినాథా! హరిమీనరూపధరుఁడై । పొల్మారుశక్తిన్మథుం
డనువానిం గబళించినట్లు గణపుం । డావేళఁ జక్రస్థితిం
గని శూలం బటవైచి దానిగడిమిన్ । గాంతించి మ్రింగె న్మహా
ఘను లౌరా! యని చూచు నద్ధతిమెయిం । గ్రౌర్యంబు పెంపొందఁగన్ 218

తే చక్రమును మ్రింగఁ గనుఁగొని । శౌరి రోష
తామ్రనయనద్వయుండయి । దర్ప మొప్ప

వచ్చి యవ్వీరుభావాలు। బలిమి నదిమి
భూస్థలంబునఁ బడఁద్రోసెఁ। బొదలుశక్తి. 219

సీ గణనాథుఁ డచ్యుతు। కరములఁ దోడలని ష్పేషణుఁడై యుండఁ। బిత్ర మొప్పఁ
దివ్యక్త్రముననుండి। తతరుధిరోద్గారసహిత మై చక్రంబు। జారిపడినఁ
గని దానిఁ గైకొని। కైటభసంహారి కదనంబునను వాని। వదలె నంత
సిగ్గుతో గణపుఁడు। శివుసన్నిధినిఁ జేరి దైత్యారిచేతనుఁ। దనకు సంభ
తే వించిన పరాజయముఁ జెప్ప। విని హరుండు
రోషతామ్రాయతాక్షుఁడై। రుధిరసిక్త
కాయుఁ డగువీరభద్రునిఁ। గాంచి నిశ్వ
సించు నాగంబుకైవడిఁ। జెలఁగి యపుడు 220

క ఉద్దవిడి నతనిసశరుం, దద్దయుఁ గావించి యానఁ। దగనిడి వడిఁగా
నుద్దిష్టస్థానంబున, నద్దికమున నునిచె శూరు। శారా యనఁగన్ 221

ఆ శూలధారి యగుచు। ...లుకుఁజూపులకోడఁ, గాలివెంటనాఁగ। గర్వ మొప్ప
యజ్ఞవాటమునకు। హరుఁడు వచ్చినఁ జూచి, వెఱచిరచటిమునులు। వినుతచరిత

క శిరమునఁ జెంజెడ లొనరఁగ, నురుదుద్రక్షాంబికముల। నుగ్రుం డగుశం
కరుఁ జూచి కుబ్జమాత్రాం,తరమున హరి డాఁగి నిలిచెఁ। దత్స్థలగతుఁడై 223

తే అష్టవసువులు హరుఁజూచి। యతులభీతిఁ,జనిరి సరిదాఖ్య యగుసర। స్వతి జనించె
సీతనా నొప్పు ప్రఖ్యాతి। చేత నపుడు, మానికులచంద్ర! సద్గుణమహితసాంద్ర!

క. భీకరనేత్రత్రయముల, వీఁకను వృషకేతనములు। వెల్గెడివారై
యేకాదశరుద్రులు హరుఁ, దాకి దిగులొంద వెడలి। గ్రరఁగాలి రొగన్ 225

తే ప్రవిమలవిశ్వేదేవులు, పవనాశ్వినులనలసాధ్య। భాస్కరముఖ్యుల్
నవనాగ్రాపూపంబుల, నవఘుళిముగ మ్రింగుచుండి। హరుఁ జెం, భువిన్ 226

శివుఁడు దక్షయజ్ఞధ్వంసముఁ జేయుట

తే పడిరి తమ్ములపగవాఁడు। భయమువలనఁ, జుక్కలనుఁగూడి ...తిరిఁ। జూపుచున్న
వాఁడు నయి పైకి వడిలేచి। వచ్చి, మింటఁ జేరితనచోట నిలిచెను। శిష్టచరిత 227

క అతులితకశ్యపముఖమును, లతిభక్తిదలిర్పఁబుష్ప। హస్తులు నగుచున్
శతరుద్రీయజపంబును, మితిమీఱఁగఁ జేసి మ్రొక్కి। మెలఁగిరి భీతిన్ 228

క మాటికి మాటికి దక్షుని, బోటి బలుం డైనహరుని। బొడఁగని భీతిన్
ఖాటలశాదిమహాసుర, కోటులకడఁ గృపణ యగుచుఁ। గాయుచు నేడ్చెన్ 229

వ అయ్యెడ మునీంద్రా! కోపావేశుఁ డగురుద్రునిచేతఁ గొందఱు తలప్రహారు
లగుచుఁ బడిరి కొందఱు పాదతాడితులై కూలిరి మఱికొందఱు శూలఘాత
కోర్వఁజాలక మ్రగ్గిరి బెసికంటిమంటచేఁ గొందఱు సీల్గిరి ఇక్కైవడి వర్తించు

చుండఁ, బూషుఁ డనుసూర్యుఁడు పెక్కండ్రసురక్కసులను దేవతలనుఁ జక్కాడుచున్నముక్కంటిం గని వెక్కసపడి చక్కఁగఁ జేతులు చాచి మిక్కిలి వడి నతనిఁ జిక్కించుకొని స్రుక్కింపఁ సమకట్టి వచ్చుచుండ విలోకించి కఱ కంఠుఁడు కనలి వలిరేగి పూషునిహస్తముల నొక్క కేల నొక్కపట్టి యతనివ్రేళ్ల తుదలనుండి రక్తధారలవారిగ వెడలుచుండినను విడువక సింగము మృగశాబకమునుఁ బట్టి యవలీలఁ ద్రిప్పివైచినకరణి మహావేగమునఁ గాంతిమంతుఁ డగు దివాకరుఁ జిరజిరఁ ద్రిప్పివేసినఁ దద్బాహువులు తెగిన సన్నినరముల ముడులు కలిగి కులుచవయ్యె హరుఁ డంతట రక్తమందు దోఁగిన వేఁడివెలుం గునుఁ గని వదలిపెట్టి మఱియొకచోటి కరిగె నని చెప్పి పులస్త్యుఁడు వెండియు నిట్లనియె 230

చ. పురహరుచేత భంగపడి | పూషుఁడు సంచ్లిగిలించి నవ్వె యో
పురుషవరేణ్య! చివ్వకునుఁ | బొందుఁగ రమ్మని | సారెసారెకుం
బరుషపుమాటలం బిలువ | భర్గుఁడు రోషసమన్వితాత్ముఁడై
యురవడిఁ దద్రదంబుల మ | హోత్కటముష్టినిఁ గొట్టె నారదా! 231

ఉ. కొట్టినతోడ దంతములు | గొబ్బున రాలెను భగ్నదంతుఁడై
నెట్టన నెత్తు రొల్కఁగను | నిగ్గతసంజ్ఞ నతండు శీఘ్రమే
గుట్టుగఁ గూలె వజ్రహత | గోత్రము కైవడి వింతదోఁపఁ బల్
దిట్టరి యాభగుం డనెడుదివ్య | దివాకరదేవుఁ డుద్ధతిన్ 232

తే. శోణితము మేనఁ గారఁగా | స్రుక్కిపడిన
పూషుఁ గని ఘోరరూపుతోఁ | బొదలి మండు
నట్టికన్నుల వృషభవా | హనునిఁ దేఱి
చూడ నాగోపపలె వాని | చూడ్కు లణఁగ 233

క. కరతలమునఁ గన్నులపై, నురవడిదాటించి యతని | నుర్వినిఁ ద్రోసెన్
సురలకు క్షోభ మొనర్చుచు, బహుమాద్భుతశక్తితోడఁ | బరమమునీంద్రా

తరువోజ. సకలమరుద్గణపావకనిర్జర | సంఘము శక్రపురస్సరమై
ప్రకటితశీలిని బంధుకదుఃఖ మ | వారిగఁ బుట్టి దిగంతరభూ
మికి వెసఁ బోయిరి వారలు పోఁగని | మించినభక్తిని గోణవులా
చకితసురారులు చక్కఁగ నిల్చిరి | సన్నుతిచేయుచుఁ బ్రాంజలులై 235

చ. హరుఁ డటమీఁద గోపపడి | యధ్వరశాలను దైత్యదేవతా
వరులనుఁ గాల్పఁ జూడఁ గని | బాధను వీరులు కొంద ఱాయుష
వరుసఁగఁ గూడుచున్నతులు | వాపక చేయుచు నేఁగి రన్య లా
పురహరుఁ జూచి పెంగులుఁ | బొందుచు నిల్చిరి సంయమీశ్వరా! 236

తే. అపుడు భర్గుఁడు నేత్రత్రయమునఁ బావ
కులనుఁ జూడఁగఁ దద్భూరి । ఘోరదృష్టి
వలన నవి భస్మమయ్యెను । వడిని నగ్ను
లెల్ల సమయుటఁ గని భీతి । యొసఁగుచుండ 237

ఉ. యాగము దివ్యరూపమృగ।మై యమరద్యుతపుష్కరంబునం
దీఁగయొలుంగు విక్లబగ।తిస్థితి నుల్లసిల న్వడింజనం
గాఁ గని కాలరూపమునఁ । గ్రాలుచు నున్న మహేశుఁ డుద్ధతిం
బాగుగఁ జాపమం దపుడు । పాశుపతం బతివోసి శీఘ్రతోన్ 238

ఆ. అనుసరించి వెడలె । నందుపై నర్థము, చే జటాధరాఖ్య। శివుని కధ్వ
రంపుశాలనడుమ । రాణించె మింట న, ర్థమునఁ గాలరూప। తనుఁ జెలఁగి 239

క. చెప్పఁబడుచున్నవాఁడని, యుప్పరమమునీంద్రుఁ డాడ । నాలించి ముదం
బుప్పతిల నతనితో నని, నప్పుడు నారదుఁడు విస్మ।యావహుఁ డగుచున్ 240

హరుని కాలస్వరూప నిర్ణయము.

చ. పరమమునీంద్ర! నీవిపుడు । భర్గుఁడు కాలతనుండు వ్యోమగో
చరుఁ డని నాకుఁ జెప్పితివి । చక్కఁగఁ దద్భిన్నతిలక్షణంబులన్
గురుదయఁ జెప్ప నర్హుఁడ వ।కుంఠితతేజ! యటంచు వేఁడ సు
స్థిరమతి యాపులస్త్యముని।శేఖరుఁ డిట్లని చెప్పె నాదృతిన్ 241

మ. కర మెవ్వాఁడు జగద్ధితేప్సుఁ డగుచున్ । గ్రాలెన్నభోవ్యాప్తితోఁ
బురనాశుం డనుఁ గాలరూపియును నై । పొల్పాగుతచ్ఛర్వభూ
కరరూపంబు వచించెద న్వినుము వీఁ । కన్ దాన నిస్సంశయం
బు రహిన్ గల్గును నీకు నిర్వృతి మహా।పుణ్యాత్మ! సత్యంబుఁగాన్. 242

వ. అశ్విని నాల్గుచరణములు భరణి చతుష్పాదములుఁ గృత్తికా ప్రథమాంశముఁ
గలిసి కుజక్షేత్రమై రాణిల్లుమేషరాశి కాలరూపుఁ డగువానికి శిరం బని
చెప్పంబడును కృత్తికాంశత్రయము రోహిణి నాలుగుపాదములు మృగశిరా
ర్ధంబుఁ జేరి శుక్రక్షేత్ర మగువృషభరాశి శివునకు ముఖమని పలుకఁబడును.
మృగశీర్ష రెండంశలు ఆర్ద్ర చతుశ్చరణములుఁ బునర్వసు మూఁడుపాదము
లుఁగూడి బుధాలయమై వెలుఁగొందుమిథునము గగనస్థుండగుశూలికి భుజద్వం
ద్వమని వక్కాణింతురు పునర్వసుశిష్టాంశముఁ బుష్యమి నాలుగుపాదములు
సర్పనక్షత్ర చతుశ్చరణములు మిళితమై చంద్రసద్మ మగుకర్కటకమధ్వరధ్వంసికిఁ
బార్శ్వద్వయమని నుడువుదురు మఖ నాల్గంశములు పూర్వఫల్గునీచతుష్పాదము
లుత్తరా ప్రథమాంశముఁ దివిరి రవిగృహమై రాజిల్లుసింహరాశి పరమేశ్వరునకు

హృదయమని భావింతురు ఉత్తరాత్రిపాదములు హస్తచతురంశములుఁ జిత్తార్ధముఁ బొలిచి బుధుని ద్వితీయస్థానమైన కన్యారాశి శంకరునకుఁ గుక్షియని భావింతురు చిత్తానక్షత్రార్థము స్వాతి నాలుగుపాదములు విశాఖ మూఁడు చరణములుఁ గలిసి శుక్రునకు రెండవయిల్లై తనరారు తులారాశి రుద్రునకు నాభి యని యాడుదురు ద్విదైవత్యాశాంశము ననూరాధ నాల్గుపాదములు జ్యేష్ఠా చతుశ్చరణములుఁ గూడి కుజునికి ద్వితీయక్షేత్రమై భాసిల్లువృశ్చికరాశి శర్వునకుఁ బురుషాంగ మని వచియింతురు మూలపూర్వాషాఢాష్టాంశములు నుత్తరాషాఢప్రథమచరణముఁ గలిసి గురునికి గృహ మగుధనుస్సుమహేశునకు నూరుద్వయమని తలంతురు ఉత్తరాషాఢాత్రిపదములు శ్రవణచతురంశములు ధనిష్ఠార్ధముఁ గూడి శనిక్షేత్రమై శోభిల్లుమకరరాశి భూతేశునికి రెండుజానువులని యెన్నుదురు శ్రవిష్ఠాద్వితీయాంశములు శతతారాచతుష్పాదములుఁ బూర్వాభాద్ర మూఁడుచరణములుఁగూడి ఛాయాపుత్రునికి రెండవగృహమై యుల్లసిల్లుఁ గుంభరాశి మృత్యుంజయునకు రెండుజంఘులని వినఁబడుచున్నవి. ప్రోష్ఠపదాంశము నుత్తరాభాద్ర నాలుగుచరణములు రేవతీచతుష్పాదములుఁ జేరి గురునికి ద్వితీయక్షేత్రమై వన్నె కెక్కు-నమీనరాశి గిరీశునకు రెండుపాదములని వక్కాణింతురు నిక్కమని చెప్పి వెండియు నిట్లనియె 243

ఉ నారద! కాలరూపమును ♦ నాగవిభూషణుఁ డిట్లు దాల్చి తా
దారుణకోప మొప్పఁ గడు ♦ దర్పితుఁడై సవనాగ్ని నత్తఱిన్
ఘోరము నైనశస్త్రమునఁ ♦ గొట్టిన స్రుక్కుచు బుక్కు సన్నిభా
కారముతోడ నింట నడి ♦ క్రాలిన దయ్యెను భీతిపెన్గొనన్ 244

క. అనిపలుకు పులస్త్యునిఁ గని, మనసారఁగ నారదుండు ♦ మరల నడిగె నో
మునినాథచంద్ర! యుక్తిని, ఘనమతివై నీవు నాకు ♦ గాంక్ష దలిర్పన్ 245

క ద్వాదశరాసులఁ గ్రమమున, నాదటఁ దెలిపితివి వాని ♦ యాకారంబుల్
ఆదరువును సంచారము, సాదరముతోఁ జెప్పవలయు ♦ వర్ణ్యాభణితులన్. 246

క అని ప్రార్థించిన విని ముద, మునఁ దద్రూపాదివిధము ♦ మోసనెదుభక్తి
న్వినిపించెద నమ్మది వినుమని వక్కాణింపఁ దొడఁగె ♦ నాతని కెలమిన్ 247

## ద్వాదశరాసులరూపక్రమము.

సీ. కాంతిమేషమజావి ♦ కాధనాదిసమాన మూర్తియౌ దానికిఁ ♦ బూర్ణధాన్య
రత్నాదులందును ♦ రమ్యనూతనశాద్వలచ్ఛన్నకలితస్థ ♦ లములనుండు
చోటడి నిత్యంబు ♦ శోభితకాసార పుల్లాబ్జసైకత ♦ భూములందుఁ
దిరుగును; వృషభంబు ♦ లివిరి సన్నిభదేనుకులములఁ జరియించు ♦ గొూర్మిదాని
తే కెలమి కృషికుల నేలయై ♦ యుక్కయుగ్మ
మమలశయ్యాసనపరిగ్రహాంబు నైన

కామిని పురుషరూపంబు । కలిగి పేణఁ
బుట్టువాద్యంబు ధరియించి । పొలుపు మిగిలి 248

వ. గీతనర్తనశాలల నెపుడు వసించుచుండి యది వెండియు 249

క. ఖేలారతిమై నిత్యము, వాలాయము తిరుగుచుండు । భర్గుం డిట్లే
లీలను ద్వేధాత్మకుఁడై, పాలి న్వెలుఁగొందుచుండుఁ । బరితుష్టుండై. 250

తే. కటకరూపంబు కలది క । ర్కటకరాశి
వారిసంస్థితి వెలసి కే । దారకూప
పులినభాసురభూములఁ । బొలుపు మిగిలి
యది చరించును నిత్యంబు । హర్ష మొదవ 251

క. హరియుతకాననదుర్గమ, గురునగతలములవిశేష । ఘోరగుహాలం
కర మొప్పుచుండుఁ బోయుల, కిరవగుపల్లియలఁ దిరుగు । హృష్టస్థితితోన్ 252

శా. భావారూఢిని ప్రోహిదీపికకర । ప్రఖ్యాతయై కన్యతా
రీవిన్నిత్యము స్త్రీరతిస్థలమునన్ । రేవన్ జరించున్ గమిన్
సావిం దప్పక వెల్గునట్టులములన్ । స్థానంబులందుండి తా
వే వీథ్యాపణకర్తయై నరుగతి । న్స్వైర్యాణ మేపారఁగన్ 253

ఆ. త్రాసుఁ గార్మిఁ బట్టి । తతపుణ్యయన వ్య, వాటముల వసించు కీటరాశి
ఘోరకీటరూపశోభితమై గర్త, ములనుఁ బుట్టలందు । ముదముతోడ 254

క. తిరుగున్ దమి విషగోమయ, పరిమితకీటాదిదీర్ఘ । పాషాణములం
గరకరనుండును నిత్యము, భరితతపోవిత్తసాంద్ర ! । పరమమునీంద్రా! 255

తే. వాజిజఘనంబుపోలిక । వఱలునట్టి
కార్ముకము సింగిణినిఁ దాల్చి । కాంతిఁ గుల్కు
వాజిశూరాస్త్రవేదియై । వన్నెకెక్కు
గజరథాదులస్థాయియై । క్రాలుచుండు 256

ఆ. మకరముఖము కలిగి । మకరాఖ్య నలరారి
యొద్దుమూపురమున । నెలమిఁ దనముఁ
గలిగి నదులఁ దిరిగి । కడలిలో వర్తించు
మకరరాశి యెపుడు । మహితశక్తి. 257

ఆ. కుంభపురుషుఁ డెపుడు । గొనకొని భుజశీర్ష, కైతవాలయములఁ । గ్రాలి తిరిగి
నీటఁ గ్రుంకి పొదలి । నేర్పుతోఁ గల్లమ్ము, వారియిండ్ల పొంతఁ । జేరియుండు.

ఉ. మీనముమీనయుగ్మతను । మించినకాంతిఁ జెలంగుచు న్మహా
జానపదాబ్ధితీర్థముల । సౌఖ్యముతో విహరించుచుండి స
న్మానితపుణ్యదేశముల । ధార్మికభూసురవేశ్మభూములన్
మానక స్థాయియై మెలఁగు । మంజులలీలఁ జెలంగి నారదా! 259

సీ. కడుభక్తితో నీకుఁ । గ్రమమున మేషాదు లైనట్టి రాసులఁ । గలరునట్టి
లక్షణంబుల నెల్ల । లలి మీఱఁ జెప్పితి భవ్యుఁ డుద్ధవ్రాగ్నినిఁ । బట్టి సర్వ
భువనంబులకు హితం । బును జేసినట్టి యీ పరమరహస్యంబుఁ భావ మలర
బలికితిఁ గావునఁ । బాపహరంబునై పుణ్యప్రదంబునై । పొలుపు మిగిలి,
తే. భద్రముల నిచ్చి పాపంబుఁ । బాఱఁదోలి, పరమపుణ్యప్రదంబునై । పరిఢవిల్లు
నట్టి దీనిని నెవ్వని । కైనఁ జెప్పఁ, గాఁడు దు నిజంబుగా నీవు । కువలయమున
క. తోయజసంభవసుత! తమి, నీ యుపనింకోకవిశేష । మెఱిఁగించెదనీ
తోయము విని ముద మొందుము, పాయును నెఱసులు నుబున్య । పదమబ్బునొగిన్

పులస్త్యుఁడు నారదునకు నరనారాయణులజన్మక్రమముఁ జెప్పుట.

తే. భవ్యతనుఁడైన బహ్వృచ । బ్రహ్మమునకు
ధర్ముఁడను పుత్త్రుఁ డుదయించెఁ । దాల్మిమిగుల
నతనికి నహింస యనుపేర । నలరునట్టి
భామినీమణి భార్య యై । పరిఢవిల్లె 262
క. ఆరమణీగర్భంబునఁ, గూరిమి హరికృష్ణు లనెడి । కొమరులు మఱియున్
నారాయణనరనాము ల, పారపరాక్రములు పుట్టి । భాసిల్లిరిలన్ 263
క. వారలలో హరికృష్ణులు, సారపుసంసారసరణిఁ । జాలించి ముదం
బారఁగ యోగాభ్యాసులు, నై రహిఁ జెన్నొందిరంత । హర్షముతోడన్. 264
క. నారద! పురాణపురుషు, ల్నారాయణనరులు లోక । నాథహితేచ్ఛం
గోరి తపంబును జేయుట, కై రయమున దుహినగిరికిఁ । గదలిరి పూన్కిన్ 265
క. చేరి కని రచట గంగ న, పారభవత్రాసభంగఁ । బావన విలస
త్తారంగహస్తమస్తక, సారస్థలసంగ నతుల । చారుతరంగన్. 266
క. గంగావిస్తృతతటతల, మంగళకర బదరికాశ్రమ గతీర్థమునం
బొంగుచు వసించి పరుమదిఁ, సంగతునిఁగఁ జేసి తపము । సల్పిరి భక్తిన్. 267
తే. తపనసము లైనవా రిట్లు । తప మొనర్ప
జగములన్నియు వెఱపుతోఁ । జాలఁ గలఁగఁ
జెంచె నింద్రుఁడు దానిచేఁ । గుంది కంది
డెందమునఁ గొంతవడిఁ జింత । జిక్కొనంగ 268
క. ఇది యేమివింతయో యని, పదఁపడి కారణము నెఱిఁగి । భంగ మొనర్పం
గుఱిగొని తలఁపున నచ్చర, ముఖ్యతలలో మేటి యగుచు । మొనసినరంభన్ 269
మానిని నయ్యెడఁ బంపెఁ ద । దాశ్రమభూమికి । నంతనె కంతుఁడు । దుర్దముఁడై
చయ్యనఁ జూతకిసాలయసాయక । సంపద మిత్రవ । సంతుఁడు రా

నెయ్యమునం జనె నేర్పున వారలు నీటాడవం గుమిగూడి యటన్
అయ్యెడ నాఁగ యథేచ్ఛవిహారము నత్యధికంబుగ సల్పి రొగిన్ 270

వసంతర్తువర్ణనము

క. భాసిలె నంత వసంతము, భాసురశుకశారికాపికబహుళకలరవో
ద్భాసంతము సుమపరిమళ, వాసితదిగ్వంత మగుచు వసుధాస్థలిపై. 271

ఉ. రాలినయాకు లొప్ప కడురమ్యరవిప్రభ కల్గి భూస్థలిం
జాల వెలుంగఁజేయుచును సంతతము న్విలసిల్లె మోదుఁగుల్
లీలను గోయిల ల్మిగుల లేఁతచిగుళ్లను మెక్కి నిక్కి బ
ల్సోలుచుఁ గూసెఁ గాముకులు సొక్కఁగ సోలియుఁ జింత నెందఁగన్. 272

క. నారద వసంతసింహము, వారని కింకిరిని శిశిరవారణమును గం
భీరతఁ గింశుకనఖముల, ధారుణి వెసఁ జీల్చి పొలిచె దర్ప మెలర్పన్ 273

క. బలిమిన్ దుషారనాగము, నిలఁగూల్చితి ననుచు నవ్వె నెలమి వసంతుం
డలలోధ్రకుందకుట్మల, సలలితహాసములచేతఁ జతురత్వముగన్ 274

క. తనపుత్రుఁడు తనకంటెను, ఘనుఁడై యామ్యాశనుండఁ గని నే నిచటం
జనరా దనినటువలెఁదా, ధనదునిదిశ సంచరించెఁ దరణి యథేచ్ఛన్ 275

సీ. కాంతిమైఁ బూఁచినకర్ణికారవనంబు లవనీశపత్రము లమలహేమ
రమ్యభూషలవలె రాజిల్లె నీపము ల్పార్థివసన్నాహ్య భవ్యరాజ
సుతకింకరులమాడ్కి శోభిల్లెఁ బుష్పితోజ్జ్వలరక్తవంజుళచారువనులు
రహిని వసంతభూరమణుని కడఁ గ్రాలు సంగ్రామశోణితసిక్తులునైన

తే. భటులకైవడి రాణించె వనములందుఁ, దేజరిల్లెడి తేఁటులు తివిరి పింజ
రితములై సఖురాకను సతత పులకితాంతరంగాత్తమూ సద్జనాళిఁ బోలి.

ఆ. ఏటిరొద్దులందు నెసఁగు ప్రబ్బలితీఁగ, లిలను మత్స్యమానవృత్తి మేది
యనుచు వ్రేళ్లఁ జూపి యాడెడికైవడిఁ, బుష్పగుచ్ఛపటలిఁ బొలుపు మిగిలె

వ. దేవమునీంద్రా! బదరికాశ్రమమునందు రక్తపలాశకిసలయంకాశదేహయునుఁ గింశుకచరణయును, వికసితాబ్జవదనయును, బిల్వఫలకుచయును, వికసత్కుందదంతయును, మంజరీకరవిరాజితయును, బంధూకాధరయును, సింధుకనవాంకురయునుఁ, బురుషకోకిలదివ్యనాదయునుఁ, గంకేలివస్త్రయును, మయూరవారభూషణయును, సారసారావమంజీరయునుఁ, భ్రాగ్వంశరసనయును, మదహంసగమనయునుఁ బుష్పమాలాంశుకయును, సంసర్గరోమరాజివిరాజితయునైన వసంతలక్ష్మి సంప్రాప్తం బయ్యె నంత 278

క. నారద! నారాయణుఁ డింపారఁగ నావేళ బదరికాశ్రమభాగో
దారము నఖిలాళులఁ గని, శూరాస్త్రం బైనమరునిఁ జూచెన్ బిదపన్. 279

ఆ. అని పులస్త్యుఁ డాడ ననియె నారదుఁడు వెండి, సంయమీంద్ర సర్వజగములకును

నాథుఁడై వెలుఁగు । నారాయణుఁడు గాంచె, బదరికాశ్రమమునఁ । బాలిఁ జెవని?

మత్త వానిసంస్థితి నాకుఁ జెప్పు మ । హావార్యతేజ యటన్న నా
మౌని యిట్లనె చక్రిపుత్త్రుఁడు । మన్మథుం డొగి శంభుకో
పానలమ్మున దగ్ధుఁడై భువి । నంగహీనత నొంది బ
ద్ధీనుఁడయ్యె నటన్న బల్కెను । దేవమౌని ముదంబునన్ 281

ఆ దేవదేవుఁడైన । దివ్యశంభునిచేతఁ, గామదేవుఁ డేమి । కారణమునఁ
గాల్పఁబడెనొ నాకుఁ । గరుణతో నద్దానిఁ, జెప్పు మనఁగ నతఁడు । చెప్పఁదొడఁగె

క దాక్షాయణి యాసతి మును, దీక్షన్మృతిఁ జెందఁజూచి తెగువగ నా స్థా
లాక్షుఁడు దక్షుని జన్నము, నాక్షణమునఁ జెఱచి తిరిగె । నవనీస్థలిపై 283

హరుఁడు మదనోన్మాదశరపీడితుండై తిరుగుట.

తే అలరుతూపులువిలుకాఁడు । డావృషధ్వ
జుని సపత్నీకుఁ గని రోష । మొనరఁ దనదు
విలుగుణధ్వనిఁ గావించి । వేడ్క మించి
పొంచి యున్మాదశరమును । బూనివైచె. 284

చ. పిదప హరుండు మన్మథుని । బెట్టగుతూపులఁ దాఁకితుండునై
పదరుచు బాణవిద్ధకరి । భంగిఁ దపించుచు భార్యయౌ సతిన్
మదిఁ దలఁచి సంస్మరించుచును । మాటికి వీడి హిమాద్రి వనంబులన్
విదితసరోవరోపవన । వీథులఁ గ్రుమ్మరెఁ దాపశాంతికై 285

క కాళిందీనదియందుం, దూలుచు బడఁ దానిలోని । తోయము లెల్ల
న్నీలత్వగతములై వడి, మాలిన్యమ్ము నెంచి వేగ । మలసె మునీంద్రా! 286

క. అదిమొదలుఁ జేసి తజ్జలము దగం భృంగాంజనంబు । పోలిక నుండెం
గుదియక నది ప్రవహించును, విదితావనికేశపాశ । విధము దలిర్పన్ 287

ఆ పుణ్యకూపతీర్థ । భూధర కానన, సరసులందుఁ బులిన । సానుతీర్థ
నిఖిలభూములందు । నిటలాక్షు డిచ్ఛతోఁ, జేరి తిరిగి సుఖముఁ । జెందఁడయ్యె

క క్షణకాలము దుఃఖించుం, క్షణకాలము పాడుచుండు । సన్నుతభణితిం
క్షణ మాత్మపత్నిఁ దలచుం, క్షణకాలము నిదురఁబోయి । స్వప్నముఁ గాంచున్

ఉ ఆకలయందు నాత్మరమ । ణైనసతీమణిఁ గాంచి ముద్దరా
లా! కరుణావిహీనవు । దా యని యిట్లనిపల్కు భ్రాంతితో
నో కలకంఠి! నన్నిచట । నొంటిగ నుంచి చనంగవచ్చునే?
పోకిక నైన నిల్వ నగుఁ । బూర్ణదయారస మొప్పుచుండఁగన్ 290

క చెలి నీచే విడువంబడి, వలరాజనునగ్నిలోనఁ । బడి దగ్ధుఁడనై
కలఁతనుఁ జెందితిఁ గావున, వల దిఁకఁ గోపంబు నీకుఁ । బాలింపు ననున్ 291

చ అతివరో! నీదుపాదముల కంజలిజేసి వినమ్రబుద్ధిమై
సతతము సంచరించెదను సత్యము; వేడుకఁ బల్కనోఁదమిం
జతురత మీఱవచ్చి విని చయ్యనఁ గన్పడి తాఁకి మ్రొక్కి స
మ్మతమునఁ గౌఁగిలించుచును మాటలు చెప్పవ దేమి యుత్తతిన్ 292

క విలపించు నరునిఁ గనుఁగొని, కలుగదె దయ యువనికైనఁ గాఠిన్యపిలోనా
గల్గఁగడిపలెఁ గననిర్దయ, కలదా? నీ కద్దికలదు కాంతామణిరో!. 293

ఉ కన్నరో! నీవు తొల్లి ననుఁ గన్గొని మోదముమీఱ నాయకా!
నిన్నెడఁబాసి లోకమున నేమనఁజాలను నిక్కమంచు నా
కున్నతిఁ జెప్పి తప్పితి వి దొప్పునె' వేగమె వచ్చి తాపముం
దిన్నఁగ దీర్చి ప్రోవు మిఁక దివ్యసుభాత్ముఁడ నాదు నీదయన్ 294

క వేఱుగ నాసంతాపము, తీఱదు శపథంబు నిజము తివిరినపూన్కిం
బోఱగ దోలుము కంతుని, వేఱెడి ద్యునట్టివాఁడ వెలఁదిరో! కనుమా 295

తే అటుల విలపించి స్వప్నాంతమందు బుద్ధుఁ
డగుచు డగ్గుత్తికనుసారె నడవిఁ గాయ
చున్నవాఁరుఁ గాంచి మరుఁడంత నోర్వలేక
వింట నారిని సారించి విక్రమించి 296

క సంతాపనశరము న్వడిఁ, బంతంబునఁ గూర్చి మగలఁ బరశివుపైన
న్వింతఁగ వైచెను దానా, సంతాపితుఁ డగుచు మగుడసాంబుఁడు మిగులన్.

క వెగడొందుచు పూత్కారము, జగమంతటఁ జేసి చేసి జడమతి యగుచూ
వగపున వసింపఁ బోడఁగని, మగఁటిమితో మరుఁడు మగుడమహితస్ఫూర్తిన్.

చ. కరము విజృంభణాస్త్రమున గాసిలఁగొట్టె విజృంభితుండునై
పరఁగుచునుండ దన్నిశితబాణవితుణ్ణుఁడు నా మహేశ్వరుం
డరతిని బూని యంతటను హా! యని మిక్కిలి సంచరించుచుం
బరిభవ మొంది కుంది కడుబాధనుఁ జెందెను సంయమీశ్వరా! 299

క అంతట జగత్ప్రిధానుని, సంతతపాంచాలికాఖ్య సమరసు నలకా
కాంతుసుతుఁ గాంచి యాతని, చెంతకుఁ జని వానితోడ శివుఁడాడెఁ దగన్

సీ. భ్రాతృవ్య! యొకమాటఁ బాటించి యిప్పుడు చెప్పెద నద్దానిఁ జేయు; మమిత
విక్రమశాలివై వెలుయుచున్నావన విని వాఁడు పలికెను విశ్వనాథ!
పనియేమి చెప్పుమా పని యొనరించెద నది దేవతాభేద్య మైనదైన
నతులవీర్యుఁడ వగుహర నీకు దాసుఁడ భక్తియుక్తుఁడ నని పలుక; సంత

ఆ సించి శివుఁడు పుత్ర! చెప్పెద నాసలి, నాశమొందఁ జూచి నన్ను మరుఁడు
సమయ మిది యటంచు సంతాపనోన్మాద, వరవిజృంభణాస్త్ర వహ్నిఁ గాల్చె.

క. కట్టా! తద్విరహము చే, నట్టిట్టనరాని పోటు । లంతట వెట్టిం
బట్టి చరించితిఁ గంతుఁడు, గట్టరివాఁ డనుచు మదికిఁ । దెలిసెను వత్సా! 302

క. కామాగ్నిదగ్ధదేహుఁడ, నై మహితోన్మాదశస్త్ర । హతి స్రుక్కి సుఖో
ద్దామరతిధైర్యములు లే, కీమాడ్కిం జిక్కినాఁడ । నిత్తఱిఁ జూడీ! 303

క మదనప్రణున్నములు నై, పొదలెడిసంతాపనాది । భూరిశరతతి
న్వ్యథితముగఁ దాల్చుశక్తియుఁ, బదిలంబుగ నీకు దప్పఁ । బరునికిఁ దరమే 304

ఉ కావునఁ గోరు మీవనుచుఁ । గాళగళుండు వచింప వాఁ డొగిన్
వావిరిఁ దత్ప్రకాండములఁ । బంధురశక్తినిఁ దాల్చి వెక్కసం
బోవుచునుండఁ జూచి మదిఁ । బొంగుచు శంకరుఁ డాడె వానితో
నీవు మదీయవాంఛితము । నియ్యెడఁ దీర్చినవాఁడ వందుచేన్ 305

వ మిత్రపుత్రా! నీకుఁ బ్రతిపూజనము కొఱకు వరము నిచ్చెద నఖిలలోకహాస్య
కారి వగునినుఁ జైత్రమాసమం దెవుడు బాలతరుణవృద్ధయువతులలో నెవ్వ
రతిభక్తిఁ జూచి కాంక్షిఁ బూజింతురో వారందఱు నాయున్మాదమునుఁ దాల్చి నీచెం
గట నాడుచుఁ బాడుచుఁ గ్రీడించుచు వాద్యములఁ బోరుకొల్పుచు హాస్యవ
చోనురక్తులయి మెలంగుచు నుండి తుదకు యోగరతు లయ్యెదరు నీవు
మన్నామమునఁ బాంచాలికేశ్వరుఁడ వని జగత్ప్రసిద్ధుఁడ వయ్యెదవు ఇంతియ
కాక మదనుగ్రహమునఁ బూజ్యతముఁడవయి సకలపురుషులకుఁ గోరినకోర్కె
లిచ్చువాఁడవు కాఁగలవు పొమ్మని యానతిచ్చిన విరూపాక్షునకు నమస్కరించి
యతఁడు దాక్షిణమున దీక్షతోఁ గదలి వృక్షవనక్ష్మాభృత్సస్యదేశములఁ దాఁటి
కాలంజరమున కుత్తరమం దుండునదియును, హిమవద్గిరికి దక్షిణమునఁ బొద
లుచున్న పుణ్యప్రదేశమునుఁ జేరి యచట నివసించి రుద్రప్రసాదమునఁ
బూజ్యుఁడై రాజిల్లుచుండె నని చెప్పి పులస్త్యుఁడు వెండియు నారదున
కి ట్లనియె 306

మదనుఁడు మరల హరునిపైఁ గవియుట.

చ ధనదునిపుత్త్రుఁ డేఁగఁ గని । ధైర్యముతోడఁ ద్రినేత్రుఁ డాయెడన్
మన మలరార వింధ్యగిరి । మంజులభాగముఁ జేరె వెంటనే
మనసిజుఁ డంత వేగమున । మానక యచ్చటి కేగి శంకరుం
గని చిగురాకుఁదూపులనుఁ । గాసిలఁ గొట్టుతమిం జెలంగఁగన్. 307

తే చూచి యతివేగమునఁ బాఱి । సొంపుతోడ
భామలనుఁగూడి మౌనీంద్ర । పటల మెచట
నుండె నాభీమదారువ । నోర్విఁ జేరె
నంగజాతానుసృతుఁడయి । హరుఁడు భీతి 308

ఉ. చేరినఁ జూచి సంయములు । శీఘ్రమె నమ్రశిరస్కులై నమ
స్కారముచేసి నిల్వఁ గని । శంభుఁడు భిక్ష మొసంగుఁ డంచు వే
సారులు వారితోఁ బలుక । సంయము లంతట నూరకుండఁ ద
ద్భూరిసుపుణ్యదాశ్రమపు । భూములఁ గ్రుమ్మరె నాతఁ డేర్పడన్ 309

సీ. వర్తించు శంభుని । వారకఁ బొడఁగాంచి భార్గవాత్రేయుల । భార్య లెల్ల
మునిపత్నులును మోహ । మున మున్న నిర్గతసత్వలై క్షోభముఁ । జాల జెంది
రపు డరుంధతియును స । హల్యయు శ్రద్ధతో నాత్మశుప్రాజాప । గాత్మతత్వ
మొప్పారుచుండఁగ । నుండిరి వలఁపునఁ జెలరేగి తక్కిన । చెలులు కామ

తే. బాతికినిఁ జిక్కి తమతమ । పతుల సుతుల
నాశ్రమంబుల విడనాడి । హరుఁడు చనిన
సరణిఁ జేరిరి కరిణులు । కరి మెలంగు
చోటులకుఁ జేరుచందాన । సుభగచరిత! 310

మునులు హరలింగముఁ బుడమిపైఁ బడునట్లు శపియించుట.

చ. తమసతు లేగఁ జూచి కడుఁ । దల్లడ మొందుచు భార్గవాదిసం
యములు విశేషకోప మడ । రార మహేశునిఁ జూచి వీని లిం
గము పడిపోవు నిక్క మని । ఖండితవాక్కుల నాడి రందుచేఁ
త మహిని వ్రచ్చి దూరె వడిఁ । దచ్ఛివలింగము సంయమీశ్వరా 311

తే. భవుఁడు తనలింగ మవనిపైఁ । బడినఁ దాఁగ
ధరణి నగి వ్రచ్చి చని రసా । తలముఁ జేరి
పిదప బ్రహ్మాండమంతటఁ । బెఱిఁగి పైన
వెలిఁగె నిజకాంతి దిక్కుల । వెలయుచుండ 312

క. ఆవేళఁ గరిగెఁ గొండలు, భూవనధులు నదులు వృక్ష । పుణ్యస్థలముల్
స్థావరజంగమయుతలో, కావళికల్లోల మొంద । నగణితతేజా! 313

తే. బాధపడులోకములఁ జూచి । బ్రహ్మ వడిని
బుండరీకాక్షు దర్శింపఁ । బూని పాల
కడలి కడకేగి యచ్చోటఁ । గ్రాలుచున్న
హరికి వలఁగొని మ్రొక్కి య । ట్లనియె భక్తి. 314

క. శ్రీవత్సాంకితవక్షా!, దేవారిధ్వంసదీక్ష! । దీనసురక్షా!
భావజ్ఞ! సర్వలోకము, లీవేళ గలఁతఁ జెందె । నేలొకో చూడన్ 315

చ. అని వచియించు బ్రహ్మఁ గని । యచ్యుతుఁ డిట్లనె దారుకావనం
బున విహరించు శంకరునిఁ । బోలఁగఁ జూచి మును ల్కుపింపఁగా
ఘనతరశంభులింగ మిలఁ । గ్రక్కునఁ దున్ని పడెన్ దదార్తిచే
తను ధర యిట్టికంపమును । దాల్చె నన న్పరమేష్ఠి భ్రాంతితోన్. 316

తే. ఆవిచిత్రము విని భక్తినాడె సర్వ, దేవతాధీశ! మన మింకఁ దివిరి యచటి
కేఁగుద మటంచు సారెకు నిట్లుచెప్పి, వినయ మింపారుచుండఁగ వినుతచరిత

పరమేష్ఠికేశవులు శివలింగాద్యంతముఁ గన నరుగుట.

ఉ. అంతట బ్రహ్మదేవుఁ డఖిలాతతలోకపుఁ డైనశౌరియుం
సంతనకట్టి యాకొడను శంకరలింగము వెల్గుచోటి క
త్యంతరయంబునం జని వియత్స్థలి మీఁటినదైనతచ్ఛివా
కాంతుని లింగమూర్తిఁ గని గాఢతరాద్భుతు లైరి పిమ్మటన్ 318

వ. హరి దానిమూలమునుఁ గనఁ దలఁచి 319

క. వినతాసుత వాహనుఁడై, ఘన మగుబలిగృహముఁ జేరి కళవళపడుచుం
డిన బుద్ధిఁ దిరుగుచుండెను, వనజాసనుఁ డూర్ధ్వంబ వడిదానిఁ గనన్ 320

తే. అంచపై నెక్కి దానిదా నంత మరయఁ
గడఁగి పైనుండుసప్తలోకముల కేఁగి
వెదకి తుదిఁ గానఁజాలక విసిగి మరల
వచ్చె భూలోకమునకు విభగ్నవృత్తి 321

ఉ. క్రిందట నేడులోకములఁ గేశవుఁ డాశివలింగమూలముం
బొందనశక్తుఁ డై మఱలి భూస్థలిఁ జేరెను నంత భక్తి బ
ల్క్రిందుకొనంగ వారపుడు గాఢమహేశ్వరలింగసన్నిధిం
జెంది నమస్కరించి నుతి చేయఁ దొడంగిరి సంయమీశ్వరా! 322

సీ. శ్రీకర శంకర శివ మహేశ్వర శర్వ సురవైరినాశక శూలహస్త
జీమూతవాహన శితికంఠ పరమేశ సర్వేశ కనకాక్ష సత్యదీక్ష
కవివర్య దక్షయాగధ్వంస వృషకేత నాభ్రకేశా భవహార త్రినేత్ర
అహిరాజకేయూర హాలాహలాహార బాలేందుభూషసద్భక్తపోష

తే. పుణ్యచారిత్ర యి జగంబునకుఁ జూడ, నాదిమధ్యావసానము లరయ నీవ
దేవదేవ మహాదేవ దివ్యభావ, జోత నీకును సన్నుత సుభగచరిత! 323

వ. అని వినుతింపుచుండి రంత. 324

తే. ఇటుల సంస్తూయమానుఁ డై హితవుగదుర
వాగ్మి వరుఁడునుఁ దద్దారువనగుఁ డైన
హరుఁడు నిజరూపమున వారి కనియె నపుడు
మానికులరాజ! సద్గుణమహితతేజ. 325

క. సురనాథులార! పరిభవ, పరివిధుఁడను గామతప్తబంధురతనుఁడం
గరమస్వస్థుఁడ నగుదును, విరామ మే లేకయుండ విస్తృతభక్తిన్ 325

క. పొగడెద రేలా? తెలియదు, వగఁగుందక పల్కుఁ డనిన వారని రపుడో

జగదీశ్వర! నీలింగము, జగతిం బడినందువలనఁ । జనముల కెల్లన్ 327
క. ప్రాకటభారంబై యది, వీఁకను జెన్నారె దానిఁ । బ్రతి న్మరలం
గైకొనఁ దగు నని వేఁడెద, మీకగణినిఁ బూన్కి మీఱనెలమి మహేశా!.

చ. అనుటయు శర్వుఁ డిట్లనియె । నబ్జజమాధవులార! దేవత
ల్మనముల … గా నెపుడు । మామకలింగముఁ బూజఁజేయుచుం
దనరెడివార లైనయెడఁ । దప్పక దీనిఁ గ్రహింతు నట్టికా
దనిన గ్రహింప నెన్నటికిఁ । దథ్య మటం చని పల్కె సంయమీ! 329

క. అనవిని కేశవుఁ డట్ల, యని తమి వాక్రుచ్చె నంత । నబ్జజుఁడు మహిం
వినయమున హేమపింగళ, ఘనలింగము స్వయముఁగాను । గైకొనె వేడ్కన్.

క. పిమ్మట భగవంతుఁడు నా, బమ్మ చతుర్వర్ణమార్గ । భవపూజల నా
క్కమ్మడినిఁ జేసి భక్తిం, గ్రమ్మఱ నవి దెలియుటకును । గాంతుఁ దలిర్పన్. 331

నలువ నాలుగాశ్రమములకును లింగపూజావిధానముఁ గల్పించుట.

క. నానావిధరీతులఁదగి, జ్ఞానానందప్రధాన । కరశాస్త్రములం
మానుగ వానికిఁ జేసె న, నూనము గాకుండునట్లు । లురుతరభక్తిన్ 332

తే. అందు మొదటిది శైవమ । న్యంబు పాశు
పతము మూఁడవయదియు నై । పరఁగుచుండుఁ
గాలదమనంబు సొరిది కా । పాలికంబు
నాల్గవదియగును మునికుల । నాథ వర్య! 333

సీ. శక్తినాముఁడు వసిష్ఠప్రియపుత్రుఁడు శివుఁడయ్యె స్వయముగఁ । దొలినిఁ దొల్లి
యతనికిఁ బ్రియశిష్యుఁ । డాయె గోపాయనుఁ డని వినఁబడుతపోధనుఁడు నైన
వరభరద్వాజుండు । వర్ణ్యమహాపాశుపతుఁడయ్యె నతనికిఁ । బార్థివబుధి
జాతుఁడా సోమకేశ్వరుఁడు శిష్యుం డయ్యె నరవినాపస్తంబ । సంయమీంద్రుఁ
తే. డెలమిఁ గాలాస్యుఁడయ్యె గ్రో । ధేశ్వరాఖ్యుఁ
డతనికిని ఛాత్రుఁ డాయె న । త్యధికబలుఁడు
ధనదుఁడు మహావ్రతంబునఁ । దనరె నట్టి
దివ్యచారిత్రునకు మహా । దీప్తిగులుక. 334

ఆ. శూద్రజుండు నగుచు । సొంపారి సంతత, వీర్యవంతుఁ డగుచు । వెలసి భూరి
యత్న! తపసి యైన । యర్ణోదరుం డను, వాఁడు శిష్యుఁ డయ్యె । వాసి మిగుల

క. నారద! భగవంతుఁడు నా, సారసభవుఁ డభవుపూజ । సల్పుటకొఱకై
చారుచతురాశ్రమస్థితి, నీరీతిం జేసి తనదు । గృహమున కరిగెన్ 336

చ. నలువ నిజాలయంబునకు । నర్మిలి నేఁగ హరుండు హాటకో
జ్జ్వల నిజలింగరూపు ముప । సంహృతిఁ జేసి విచిత్ర కాటవీ

స్థలమున సూక్ష్మలింగముఁ బ్రసన్నముఁగాఁగఁ బ్రతిష్ఠచేసి వి
చ్చలవిడి నంతటఁ దిరిగె శ్రాంతి సుఖంబును గోరి సంయమీ! 337

వ. అని పులస్త్యుఁ డాడిన విని నారదుండు తరువాతివృత్తాంతం బానతిమ్మని యడిగిన. 338

క. ధారాధరరుచివారా!, వారణసంతాపహరణవర్ణితధీరా!
ధీరజనకార్యకారా!, కారణపురుషావతార కరుణోదారా! 339

ఉ. శ్రీమహితప్రభావ! మునిచిత్తకుశేశయధామ! సద్గుణ
స్తోమ! సుగంధకాంతసుమశోభితదామ! వినూత్ననీరద
శ్యామ! నిరస్తకామ! పటుసారదితీశ్వరభీమ! ఘోరసం
గ్రామ వికర్తనాన్వయని! రాజితసాగరసోమ! రాఘవా! 340

మాలిని. నిరుపమహితవిద్యా నిత్యభావానవద్యా
పరమసుగుణహృద్యా భవ్యవేదాంతవేద్యా
గురుతరపటుసారా గోనుతాఘ్యప్రచారా
భరతభువనభారా పాపసంఘాపహారా 341

గద్యము ఇగి శ్రీమద్రామచంద్రకరుణాసమాసాదితకవితావైభవ, హారితసగోత్ర సంభవ, శ్రీరామవర్ఘ్యులదుగ్ధపారావారసుధాకర, కొండయకుమార, నయగుణ విధేయ, కొండయనామధేయవిరచితం బగు శ్రీవామనపురాణంబునందుఁ బ్రథమ స్కంధము



శ్రీరస్తు.

శ్రీసీతా లక్ష్మణ భరత శత్రుఘ్న హనుమత్సమేత శ్రీరామచంద్రాయ నమః.

# తెలుఁగు వామనపురాణము

## ద్వితీయ స్కంధము.



సీతాహృత్సారస
వాసా! శశికోటివిశద । భాసురహాసా
వాసవభోగవిలాసా
దాసా వనతీవ్రకామ । దశరథరామా. 1

తే. అవధరింపుము మునిగణా।ధ్యక్షుఁ డమలలలితభాషణుఁ డైనపు।లస్త్యుఁ డంత
నబ్జయోనికుమారుండు । నైన నారదునిఁ గనుంగొని పల్కె సం।తోష మొదవ. 2

హరునికంటిమంటచేత మన్మథుఁడు కాలిపోవుట.

ఆ. తేఁటియల్లెవాఁడు । తిరుగుఁడుఁబడుగట్టు,విల్లునచటఁ జూచి । విసిఁగి మఱలఁ
జెంత నిలిచి ముందుఁ జేరి । శింగిణిఁ దాల్చి, గాసిఁ బెట్టఁగడఁగెఁ । గడిమి మెఱసి.

మ. హరుఁ డగ్రస్థితుఁ డైనకందుఁ గని కో।పాత్మాశదృష్టి న్మర
శ్చరణాగ్రంబులదాఁకఁ జూచె నపుడా।శార్వత్రినేత్రాగ్నిదు
స్తరవేగంబునఁ గాముపాదయుగము।ధ్యప్రాంతపర్యంతమా
తరుణం బందునఁ గాల్చె మేలని బుధు।ల్దర్పించి భాషింపఁగన్ 4

ఆ. దర్పకుండు తనదు।దగ్ధపాదంబులఁ,గాంచి మేటిఁడైన । కార్ముకంబు
విడిచె నంత నదియు । విస్మయ మొప్పార, నైదువిధము లొనర । నరిగె నపుడు.

వ. మునీంద్రా! వానియందు. 6

ఉ. ఏయది ముష్టిబంధమున । నేర్పడె హేమమయాతిశోభతో
నాయది భూరిదీధితుల । హర్షదమై సుమనోభిరామమై
పాయని మేటితావులకుఁ । బాలి సుపూజ్యమునై ధరిత్రిలో
నాయెడఁ జంపకాఖ్యతరు।వై జనియించెను వింతమీఱఁగన్. 7

తే. వజ్రభూషితశుభరూప।భాసురంబు నైన నాభిస్థలంబు । పెంపారునట్టి
వకుళనామనగంబు నై । వాసికెక్కు కేసరారణ్యమునఁ బుట్టె । తలిని మాని

ఉ. నీలమణిప్రభూషితవినిర్మలకార్ముకకోటిమత్తభృం
గాలిసుశోభితస్థితినిఁ గన్పడు పాటలమయ్యె గోమణీం
ద్రాలఘుకాంతిఁ గల్గి తనరారుచు నాభికి ముష్టిమూర్ధమై
క్రాలెడి దైనచోటు శశికాంతకరంబులశోభితంబునై 9

సీ. పంచగుల్మంబులఁ బరఁగుమూలతియయ్యె మొనసిక్రిందిదిసు నై మొనసెముష్టి
కెలమినూర్ధ్వంబు గా నెంగివి ద్రుమభూషితం బగుస్థలముసంతతముఁ జెక్కు
టిరులుకల మల్లెతీఁగయై జన్మించె నొడలు కాలెడితత్తఁ జడిసి మరుఁడు
విడిచినకోలలు వేలకొలందిరమ్యనులు దేవాచరితములు జాతి
తే. కలితములుఁ దానితావులుఁ గమ్రపుష్ప
వినుతఫలములు భోజ్యంబులునగుచూత
నగములై పుట్టెఁ బార్వతీనాథుఁ డైన
హరుని కృపతోడ మానికులాబ్ధిచంద్ర 10

ఉ. ఈగతి శంకరుండు మరునీర్ష్యనుఁ బొందినబుద్ధిఁ దగ్ధునిం
గాఁగ నొనర్చి భీష్మమగు కాయముఁ దాచి విశేషపుణ్యభూ
భాగముఁ గోరి శీతగిరివాసముఁ జేరెఁ దపం బొనర్ప బల్
రాగిలుభక్తితోడ సురరాజి నుతింపుచు నుండఁ జెచ్చెరన్. 11

ఆ. సాస్త్రచాపుఁ డైనస్మరుఁ డభవునిచేత, దగ్ధుఁ డయ్యెఁ దొల్లి దానివలన
వాఁ డనంగుఁ డగుచుఁ బటుధనుర్ధారియై, దేవపూజ్యసరణిఁ జేజరిల్లె 12

వ. అని చెప్పి మఱియు నిట్లనియె 13

క. నారద! నారాయణుఋషి, ధీరుం డగుమదనుఁ జూచి ధృతి నగి మారా!
శూరా! యిటుండు మని యీ, తీరున భాషించె నపుడు దివిజులు చూడన్

క. అతని సుస్థిరవృత్తినిఁ, జేతోభవుఁ డంతఁ జూచి చిత్రగుఁ డయ్యెన్
ఖ్యాతిని వసంతుఁ డాతఁడు, నాతత మగుచింత నొందె నత్యధికముగన్. 15

శా. రంభా సుందరి తత్ప్రరాణముని సంరంభోక్తిచాతుర్యముల్
కుంభత్తేజముఁ జూచి స్వాగతమునన్ సొంపారఁ బూజించి ని
ర్దంభత్వంబున నుండె నంతట జగత్సంతాపనానంగవి
స్రంభప్రక్రియతోడ నుండినవసంతున్నిర్దయాక్రాంతునిన్ 16

క. నారాయణుండు కని నగి, రారా! నిలు మిం దటంచు రహిసుమయుతమా
సారప్రసూనమంజరిఁ, గోరికఁ జేఁబట్టి వారు గుదికొని చూడన్ 17

ఆ. మిహి పసిండిమేన మించినబాలిక, నొకతెఁ దొడలయందు నుజ్వలంపు
నీటుగుల్కునటుల నిర్మించెఁ దనతపో, మహిమవలన ముందు మహితతేజ!

నారాయణజాతయగునూర్వశినిఁ జూచి మదనుఁడు భ్రమసి రతిగాఁదలంచుట.

క కులువునఁ బుట్టినదియు నై, నెఱిఁగలసర్వాంగములను నెగడెడు తెఱవన్
వెఱివినిఁ గని మరుఁ డీసతి, యతిముఱి నారతియ యేమొ యని భావించెన్.

క మాటలు కన్నులు దృగ్గలి, నీటగుకుటిలాలకములు నెఱి కన్బొమలున్
వాటంపు ముక్కు వాతెఱ, దీటగు నారతికిఁ జూడఁ దెల్లముఁగాఁగన్. 20

సీ చేరిన సజ్జనశ్రేణిచందంబున మగ్నచూచుకములై మహితపీవ
రావిరళంబులై యలరారు దీనిగుబ్బలు దానినన్నట్ల పాలిఁ జెలఁగ
వళులమూఁడిటిచేత వఱలెడియీచెలి సన్ననియుదర మాసకియ దనఁగఁ
బోలుపొందెఁ దేఁటులు పులినముకడనుండి సరసికిఁ బోయిన సరణిఁగుల్కు

తే జఘనమునసుండి నూగారు స్తనతటద్వ
యమునుఁ గన నేగుచున్నదో యనఁగ వెలసెఁ
గనుల కానంద మగుచు నీకాంతకాయ
ముజ్జ్వలజ్జలకసన్నిభ మయ్యె నార! 21

ఆ. పాలకడలిఁ దఱచు పట్ల వాసుకిచేత, నలరు నట్టిమందరాద్రికరణి
దివ్యరశనచేత దీప్తమై యీనాతి, వెడఁదనడుము వెలసె వింతఁ గులుక. 22

క విరి బోఁడితొడలు కదళీ, తరులా యనఁనొప్పెఁ జూడఁ దథ్యముగాఁ గం
దరతుల్య మగుచుఁ బొక్కిలి, కర మరుదున వెలసె నార! కమనీయంబై. 23

ఆ. మఱుఁగుపడిన చీలమండచేనొప్పారు, జానువులు విలోమజంఘికలును
లక్షకలు రహించు లలితపాదంబులీ,సొగసుకత్తె కమరెఁ శోభ్యమగుచు.

క. నెలరా మొగ మది నునువె, న్నెలరా వాల్గంటినవ్వు నీలపురుచిచే
నలరారె మేలుకీల్జడ, నెలరాలసరాల మించె నెలతనఖంబుల్ 25

క ధ్యాతిగ మారుం డిగతి, నాతన్విని నాత్మపత్ని యనిపేర్కొని కా
మాతురుఁ డయ్యెను మనుజ, వ్రాతస్థితిఁ బలుకవశమె వసుధ స్వామీ!. 26

క. అత్తఱి మధుఁ డూర్వశిఁ గని, తత్తపా టొదవుచుండఁ దహతవాడుచున్
జిత్తజునిదైవ మెలంగెడు, పత్తనమా! యేమి దనుచు భావించె మదిన్ 27

ఆ. రాత్రిపోవుచుండ రహితమానీచంద్రు, శోభసూర్యకిరణసుప్రతాప
పీడితంబు నగుచు భీతితో నీతన్వి, శరణుఁ జొచ్చె నేమొ సత్య మరయ.

క అని యిట్లు తలఁచి యచ్చర, వనితలకడఁ జేరి మానివలె ధ్యానముతోఁ
దనువు న్మఱచి వసించెను, జనుఁ డెవ్వఁడు పొగడనేర్చు జగతిఁ దానిన్ 29

క. అంతట నానారాయణుఁ, డంలిమభాగమున విష్ణు యాక్రాంతులు నై
మంతన ముండినమదనవ, సంతాదులఁ జూచి పలికె సస్మితుఁ డగుచున్ 30

ఆ. మన్మథాదులార! మానుగ నాయూరు, జాత యైనదీనిఁ జారుతన్వి

నిపుడె స్వర్గమునకు నింపుతోఁ గొనిపోయి, దేవపతికి నిడుఁడు తివిరి మీరు

చ. అని వచియింప భీతి పెనుపారఁగ వారలి రూపరేఖలం
దనరుచు యౌవనాంగి యగు తత్సతిఁ గైకొని స్వర్గధామికిం
జని దివిజాధినాథునికిఁ జారువిలాసిని దానినూర్వశిన్
వినయము మీఱ నిచ్చి ముని వీరులసంగతి నాడి రింపుతోన్ 32

ఉ. నాకవిధుండు చిత్రపడె నాఁగనె పట్టి బలీంద్రలోకభూ
నాకములందు నీకథ ఘనంబయి చెన్నలరారె దీనిన
స్తోకమనీషచే నెవఁడు శ్రోణి వినును దమి నాతఁ డచ్యుత
శ్రీకరపుణ్యధామమును జేరి సుఖంబున నుండు నారదా!. 33

ప్రహ్లాదకథాప్రారంభము

సీ. మునినాథ యొకనాఁడు భూమి హిరణ్యకశిపుఁ డనుపేరుతోఁ జెలఁగునట్టి
ఘోరాసురుని హరి హూల్పఁగాఁ దత్పుత్రుఁడైన ప్రహ్లాదుఁ డాయవనియందు
నభిషిక్తుఁడై బ్రాహ్మణామరభక్తితో రాజ్యంబుఁ బాలింప రమణ నృపులు
వేదోక్తవిధితోడ వివిధయాగంబులుఁ జేయుచు నుండిరి శ్రీలుసురాళి
తే. తీర్థయాత్రాతపఃకామ దీక్షులైరి, వైశ్యులందఱు నిజవృత్తి పరులునైరి
చెలఁగి శూద్రులు బ్రాహ్మణ సేవచేసి, వారికెక్కుడు సత్కీర్తి వఱలుచుండ

తే. ధర్మకర్మానుక్రమంబులఁ దగిలి నాల్గు, వంగడమ్ములవారలు వాసిఁ గాంచి
రపుడు నిజవృత్తియుక్తులై యమరవరులు, సంతసించుచు నుండిరి సంతతంబు.

చ్యవనమునిచరితము.

క. అగణితదివ్యతపస్వియు, నిగమాంతవిచారపరుఁడు నిష్కాముఁడు నా
భృగుపుత్రుం డగుచ్యవనుఁడు, మగఁటిమితో నొక్కనాఁడు మహితస్ఫూర్తిన్.

వ. మునీంద్రా! స్నానార్థమై నర్మదానదికిని వైనాకులేశ్వరతీర్థంబునకుఁ జని మహాదేవు
నట దర్శించి మునుఁగుటకొఱకు నదీజలమందు దిగిన నెఱుపగు కడకన్నులు కల
పామొకటి యతని గ్రహించిన భయపడి మనంబున వనజాక్షుని నుతించె దాని
వలన నవ విషములేనిదై భయంకరముగఁ బాతి పాతాళలోకమునకుఁ గొని
చని విషహీనతం జేసి తన్ను విడిచిపోయినదయ్యెనంత నతఁడు పాముచేత విడువఁ
బడి యంతటఁ బూజితుండై నాగకన్యలంగూడి ముచ్చటలరఁ దిరిఁగి దానవేం
ద్రపురంబుఁ బ్రవేశించి తదర్చితుఁడై పిదపఁ బ్రహ్లాదుని కగఁబడె నని పలికి పుల
స్త్యుఁడు వెండియు నిట్లనియె. 37

క. నారద! ప్రహ్లాదుండా, భూరితపోధనునిఁ జూచి పూజించి మునీ!
కూరిమి నిక్కడి కేలాగో, చేరితి రన నతఁడు పలికెఁ జిత్తం బలరన్ 38

క. ఏనర్మదలో మునుఁగం, గాఁ గనియొకపాము నన్ను । గైకొని యిటకుం
బూనికఁ దెచ్చినవచ్చితి, దానవవర! యన నతండు । తతభక్తిమెయిన్ 39

మ. మునినాథా ! బలిసద్మమందు మఱియున్ । భూమ్యంతరిక్షంబులన్
వినుతింపందగి పుణ్యదాయకములై । వెల్గొందుతీర్థంబుల
న్మనసొప్పారఁగ నాకుఁ జెప్పి కరుణ । న్మన్నింప నర్హుండ వీ
వన హర్షంబునుఁ జెంది దైత్యపతితో । నామౌనివర్యుం డనెన్ 40

క. ధర నైమిషతీర్థము పు, ష్కరమునఁ బుష్కరము నాగ । పురిఁ జక్రాఖ్యం
బరఁగినతీర్థము మేలని, నిరతముఁ గొనియాడు చంద్రు । నిరుపమ తేజాల్. 41

చ. అన విని సంతసించి యతఁ । డత్తఱి నైమిషతీర్థసేవఁ జే
యను మదినెంచి రాక్షసుల । నందఱఁ జూచి మునీశ్వరుండు చె
ప్పినగతిఁ దజ్జలంబుల న । పేక్షనుఁ గ్రుంకి మురారిఁ బీతవ
స్త్రునిఁ గని పూజసల్పుటకుఁ । దుష్టజనం బగుఁ గాన మీరొగిన్ 42

ఉ. సంతస మొప్ప లెం డనిన । సాధుమనంబుల దైత్యదానవు
ల్సంతన కట్టి భక్తిని ర । సాతలము న్విడనాడి భూస్థలా
భ్యంతర నైమిషాటవికి । నత్తఱిఁ జేరి తదీయతీర్థమం
దింతనరాని భక్తి జని । యింపఁగ స్నానము చేసిరో మునీ! 43

క. శ్రీమంతుఁడు దైత్యకుల, స్వామియు నై ఖ్యాతిఁ గనిన । ప్రహ్లాదుండా
భూమిని వేఁటను సల్పుచు, సామీప్యమునం దిరుగుచు । సంయమినాథా!. 44

మ. ఉరుపుణ్యప్రద యౌచు వారియుత యై । యుద్వృత్తవేగంబునన్
ధరపైఁ బాఱుసరస్వతీనదిని హృ । ద్యం బౌట వీక్షించి చెం
త రహిం గొప్పగుకొమ్మలం దనరి వి । స్తారాస్త్రశాఖాత్తఫీ
కరమౌ సాలనగంబు దానికడ బ । ల్లాఘప్రభ న్మిక్కిలిన్ 45

క. పెనుబాములవలె విస్మయ, మును జేయుచు నొకటి కొకటి । ముఖలగ్నము లై
తనరినశరములఁ గన్గొని, ఘనకోపముఁ జెంది దైత్య । గణపతి పిదపన్ 46

ఆ. పొడుగుజడలబరువు । పొలుపొంద నల్లని, జింకతోళ్లఁ దాల్చి । స్థిరతపోభి
లాషమానసముల । లలినొప్పు మునుల ని, ద్దతినిఁ గాంచి వారి । దతిని మఱియు.

క. లక్షణయుతకార్ముకముల, నక్షయతూణీరముల మ । హాజగవంబున్
దక్షం బగుశార్ఙ్గంబును, వీక్షించి మహాసురాళి । విభుఁ డావేళన్ 48

తే. డాంభికులు వీ రటంచని । తలఁచి పురుష, వర్యు లగువారితో నని । వాస్తవముగ
ధర్మనాశన మగునట్టి । దంభ మెల్లఁ, దాల్పఁబడె నద్ది ద్విజులకుఁ । దగదు తగదు.

క. బరువగు జడ లెట తప మెట, వరబాణాసనమహాస్త్ర । వారం బెట దు
ర్భర మని తోఁచెను మీవిధిఁ, బరికింపఁగ నాకు నిపుడు । పరమాద్భుతమై. 50

క. అని పల్కుచున్న ప్రహ్లా, దుని జూచి నరుండు పల్కె । దోరఁపుఁ దలఁపే
లను శక్తి నీకుఁ గలిగెఁ, దనుజేశ్వర! దానిఁ జూపు । తలఁగని పూన్కిన్. 51

క. అన విని దైత్యుఁడు ధర్మం, బను సేతువు మీఁద నేన । హర్నిశమందుం
బనిఁగొని తిరుగుదు గావున, ఘనశక్తియు నాకుఁ గలఁదు । కలదా మీకున్? 52

శా. ఈరీతి న్వచియింపఁగా విని నరుం । డీర్ష్య న్విజృంభించి బ
ద్ధీరత్వంబునఁ బల్కె నూర్జితము నై । దీపించె మా శక్తి వి
స్తారోదగ్రపటుత్వశాలి యగుచున్ । ధైర్యంబుతో మమ్ము నే
శూరుం డోర్వను శక్తుఁ డౌనె యనిలో । క్షోణిస్థలిం దానవా 53

ఆ. నీవు తెలియు కిట్లు । నిక్కుచు బలికితి, వనిన దైత్యనాథుఁ । డాగ్రహించి
యెట్టులైన మిమ్ము । నెదిరించి పోరి నే,జయముఁ గాంచువాఁడ । జగతి ననుచు

నరప్రహ్లాదులయుద్ధము.

చ. పలికి ప్రతిజ్ఞఁ బూని గుణ । వంతుఁడు నైన దితీశ్వరుండు వి
చ్చలవిడి నున్న సేనలను । జారువనాంతములోన నిల్పి ని
స్తుల మగు విల్లుఁ జేతఁ గొని । లోఁ దనె నారినిఁ గార్చి తద్వన
స్థలమద్రువంగఁ జేసె గుణ । శబ్దము నాయెడ సంయమీశ్వరా! 55

క. అంతట నరుఁ డజగవమును, బంతంబున వంచి నిశిత । పటుబాణముల
న్వింతగ విడిచిన దైత్యుం, డింతిం తనరానికోప । మేర్పడ నంతన్. 56

సీ. భర్మపుంఖోజ్జ్వల । బహుశస్త్రములతోడ నాబాణములఁ ద్రుంచె । నంత నరుఁడు
తనకోల లతనిచే । ధరఁ గూలుటనుఁ జూచి క్రమ్మఱ విల్వంచి । కఠినభూరి
శరములసంధించి । సరగున వైచె నీ । చం దాన రెండేసె । సరవి నరుఁడు
మూఁడస్త్రముల నేసె । మొనసి దానవరాజు నరుఁడంతటను వ్రేసె । నాల్గుశస్త్ర
ఆ. ములను విడిచి మరల । మోహారంబుగఁ బంచ
బాణములనుఁ బఱపు । బాహుశక్తి
నంత దానవేంద్రుఁ । డా ఋషిపైఁ దీవ్ర
శరము లాఱుఁ బఱపె । సత్వరముగ 57

క. వడి నరుఁ డెనిమిది తూఁపుల, జడియఁగ దితిపుత్రుఁ గొట్టె । శౌర్యస్ఫూర్తిన్
గడిమిని దొమ్మిది చిలుకులు, విడిచెను నరుమీఁద దైత్య । విభుఁ డావేళన్ 58

క. ముప్పదియా అమ్ముల గుఱిఁ, దప్పక నరుఁ డతని వ్రేసె । దైత్యుఁడు వానిం
దప్పించుకొని రయంబున, నప్పుడు పెనుకోప మడర । నమితోద్ధతి మై 59

క. దెబ్బది రెండు శరంబుల, నబ్బలునిన్ దూల నేయ । నతఁ డల్గి వడిన్
నిబ్బరమున శతశస్త్రము, లబ్బురమునుఁ జెంద విడిచె । నసురేశునిపై. 60

క. ఇలిబోఁడు మున్నూరమ్ముల, నలికోపముతోడ నరుని । నాగటఁ గొట్టెన్

జతురతపట్ట్భితకాండము, లతఁ దసురునిమీఁద నేసె నారాయనఁగన్ 61

ఉ వెండియు వేయికోలలను వేగమె ధర్మజుమీఁగ దైత్యుఁడు
ద్దండత నేసెఁ బిమ్మటను దర్పముతో మితిలేనితీరులన్
భండనమం దొకం డొకనిపైఁ బఱపైచిరి కింకిరి స్మహో
ద్దండపటుత్వబాహుబల దార్ఢ్యులు నై మునివంశశేఖరా!. 62

క నరుఁ డోవాటించి యుద్ధతిఁ, బరిమితి లేనట్టిశస్త్రవారంబులు పు
ష్కరభూదిశలు న్నిండనుఁ, గర మరుదుగ విడిచె భూత గణ మదరి చనన్.

క గురుబలుఁ డగు ప్రహ్లాదుఁడు, పరువడి నరుఁ డేసినట్టి బాణౌఘములన్
వరహోమపుంఖశరముల, ధరఁ బిండిగఁ జేసె మిగుల దర్పం బలరన్ 64

ఉ అంతట ఁమరూపులయి హర్షముతో నరదానవేశ్వరుల్
పంతముఁబట్టి యొండొరులపై నతితీక్ష్ణను మార్గణాళి న
త్యంతము నాఁట నేసికొని రాయెడ దానవుఁ డాగ్రహించి బ
ల్వంతనకట్టిచాపమునఁ జయ్యన బ్రహ్మశరంబుఁ గూర్చినన్ 65

క కని ధర్మజుండు పెలుచను, ఘననారాయణశరంబుఁ గార్ముకమందున్
గనలుచు సంధించినఁ గని, దనుజుఁడు సింగిణిని నునిచె దహనునిశరమున్ 66

క పురుషోత్తముండు నగునరుఁ, డురవడిఁ గోదండమందు నుగ్రాస్త్రంబున్
నిరసించుచు సంధించెను, సురలందఱు చోద్యమొంద సురుచిర తేజా 67

వ. ఇట్లిరువురు శరాసనంబులఁ బిరాఁ గలుకుటమ్ముల నతివోసి యార్చి ఏర్చి యొక్కుమ్మడిఁ జక్కఁగ విడిచిన నవి జాజ్వల్యమానము లై పోరిపోరి శాంతి నొందె నంత సజ్జనాహ్లాదకరుం డగు ప్రహ్లాదుండు తన బ్రహ్మాస్త్రముఁ వ్యర్థం బగుటఁ గని మండిపడి వేదండశుండాదండతుల్య మగునిజభుజదండమందు గదాదండమును దాల్చి రథమునుండి భూమండలికి దూఁకి వచ్చుచుండె; నపుడు నారాయణుండు కినుకం గదాహస్తుఁడై వచ్చునట్టిదానవాధినాథుఁ నాలోకించి స్వయముగఁ దనవెనుక నరుని నునిచి ముందుఁ దాను యుద్ధకామ మగుచిత్తముకలిగి వచ్చుచుండె; నాదిలిజుఁ డంతటఁ దపోనిధియును శార్ఙ్గపాణియునుఁ బ్రఖ్యాతుఁడునుఁ బురాణఋషియును గురుపరాక్రముఁడును లోకపాలుఁడు నగు నారాయణదేవుని నపు డెదురింపఁ జనె నని చెప్పి వెండియు నిట్లనియె. 68

నారాయణుఁడు ప్రహ్లాదునితోఁ బోరుట.

క నారద! శార్ఙ్గముఁ జేఁగొని, నారాయణుఁ డగ్రమందు నడువం గని దు
ర్వారం బగుగదఁ ద్రిప్పుచు, ఘోరస్థితి నతనితలనుఁ గొట్టం బెలుచన్ 69

తే తద్గదాపీడితుండు నై తనరుధర్మ, జనికనుంగవనుండి విచ్యుతము నగుచు

వహ్నివర్షసమం బగు | వారి పాఱె, నంత దానవుఁ జేసిన | దైనగదయు 70

క. వరదుని తలఁ దాఁకినదై, విరిసి శతాకృతుల తోడఁ | బృథివినిఁ గూలెన్
ధరణీధరశిఖరంబునఁ, గరకరఁబడు పిడుగుకరణి | గాంభీర్యనిధీ! 71

చ. దనుజుఁడు వీరుఁడై మఱల | ధైర్యముతో రథ మెక్కి చాపముం
గొని వెస వంచి తూణమున | ఘోరత నుండెడి గార్ధ్రపత్రసం
జ్ఞను దనరారుబాణములఁ | గ్రక్కునఁ గూర్చి సాధ్యుమీఁద నే
సెను ప్రతిఘాంధకారితవి | శేషమనంబునఁ గల్గి సంయమీ! 72

ఆ. రూఢి నర్ధచంద్ర | రూపము లై వచ్చు, వాఁడిబాణముల న | వార్యబలుఁడు
తనదుదివ్యశస్త్ర | తతులచేనుగ్గాడి, వాని నొవ్వఁ జేసెఁ | బటిమతోడ 73

ఉ. వింతగ దైత్యవల్లభుఁడు | వీరుని నాతని నేసెఁ గోలలం
బంతముఁబట్టి ధర్మజుఁడు | బాగుగ దైత్యునిఁ గొట్టె శక్తిమై
నంతట మర్మభేదితము | లైనశరంబులు వైచి యార్చుచుం
బొంతేఁ బరస్పరంబుగను | బోరిరి నీవిధి వార లుద్ధతిన్. 74

తే. అలఘులఘుచిత్రసమరంబు | నరయ దేవ
గణమునకుఁ బుట్టెఁ గలయిక | గగనమందు
దేవదుందుభిరవములు | దివిఁ జెలంగె
నతులసుమవృష్టి వారిపై | నపుడు కురిసె. 75

సీ. గగనస్థులై తమిఁ | గ్రతుభుజు లీక్షింప ఘనశస్త్రులై ప్రేతు | కిప్రమోద
వర్ధనంబుగ నని | బటుశక్తిఁ జేయుచు దీవ్రాశుగంబుల | దిశలవిదిశ
లను మఱివ్యోమ | తలం బెల్లఁ గప్పిరి ధర్మజుఁ డామీఁద | ధనువుఁ దాల్చి
దారుణాస్త్రములచేఁ | దనుజుని సర్వాంగసంధులభేదింప | జడియ కతఁడు
తే. కోపమున వేగవంతుఁడై | ఘోరధనువుఁ,బట్టి కడిమిని సాధ్యుని | వదనహృదయ
భేదన మొనర్చె బిలుకులఁ | బిలుకుతోడ, నంత గోపంబుమీఱ నా | రాయణుండు.

చ. దనుజుని ముష్టినిన్ బొలయు | దారుణధన్వము నర్ధచంద్రరూ
పానరిన కోలతోఁ దునిమె | నుద్ధతి దైత్యుఁడు భిన్నచాపముం
గని మఱియొక్కమేటివిలుఁ | గ్రక్కునఁ గైకొని లాఘవంబునం
గనలుచు నెక్కువెట్టి శిత | కాండసువృష్టి జెలంగఁ జేసినన్ 77

ఆ. సాధ్యుఁ డాత్మశస్త్ర | చయమునఁ దత్కాండ, ములను బిండిచేసి | పుడమిఁ జల్లి
మత్సరమున వాని | మహితకోదండంబు, విఱిచె నర్ధచంద్ర | విశిఖమునను. 78

ఆ. ధనువు లెన్నివిఱిగి | ధరఁగూలుచున్నను, వెగడుపడక దైత్య | విభుఁడు వేలు
విండ్లఁ దాల్చుచుండ | వీరుఁడు వీక్షించి, విఱిచెవానినెల్ల | విపులశక్తి. 79

క. దనుజుఁడు శింగిణు లుడుగిన, మనికితుఁడై సర్వలోహ | మయమై ధృఢతం

దనరారుదీర్ఘపరిఘముఁ, గొని త్రిప్పుచు నతని పైన గొబ్బున వైచెన్ 80

ఉ. క్రన్నన దాని నొక్కవిశిఖంబున ద్రుంచె నరాగ్రజుండు వి
చ్ఛిన్ననిజాయుధంబుఁ గని శ్రీయుతుఁ డా దనుజుండు వెంటనే
పన్నుగ ముద్గరంబుఁ గొని బాహుబలంబునఁ ద్రిప్పి సాధ్యుపై
నన్నవలేనికోపమున నత్తఱి వైచెను సంయమీశ్వరా! 81

చ. వినుతచరిత్ర ధర్మజుఁడు వేగమె వచ్చెడిముద్గరాస్త్రముం
గని పటుశక్తితోడ దశకాండములన్ దశరీతు లేర్పడం
గనుబడఁ గొట్టఁ దున్నిపడెఁ గాశ్యపి నాయది దైత్యుఁ డుద్ధతిం
ఘన మగునొక్కపాశమును గైకొని సాధ్యునిమీఁద వైచినన్ 82

క. నరగణ్యుఁడు తత్పాశము, నరవిని ఛేదింప వాఁడు శక్తిం గొని భీ
కరగతి నేయఁ దపోనిధి, ధర నర్ధేంద్వస్త్రము నను దానిం గూల్చెన్. 83

క. పఱపినశస్త్రము లన్నియు, విఱిగి ధరం బొలయుచుండ వేఱగుధనువుం
గఱకరిఁ గైకొని తూపుల, నఱిముఱిఁ గాఁడించె నతని నసురుఁడు బలిమిన్ 84

తే. భువనగురుఁడును దైత్యేంద్ర భూరితాప
ముండు నైనట్టి నారాయణుండు కినుక
నస్త్రమునఁ గొట్టె వక్షస్స్థలమందు దాన
భగ్నహృదయుఁడు నై వాఁడు భ్రాంతిచెంది 85

క. అరదముపైఁబడ సారథి, బిరబిరఁ దోలఁగించె నతని వెలిఁగా నంతన్
గురుబలుఁడు లేచి క్రమ్మఱఁ, గరమున దృఢకార్ముకంబుఁ గైకొని కడిమిన్.

మ. అని చేయం బనిఁ బూని రాఁ గదితిపుత్రాధీశుని స్వీరునిం
గని సాధ్యుం డనె దైత్య! పోరెదము పో కాలించి సూర్యోదయం
బునఁ జేయం దగునట్టికార్యమును సమ్మోదంబుతోఁ జేయుమీ
వనఁ బ్రహ్లాదుఁడు నైమిషాటవికిఁ డాయం బోయి సద్భక్తితోన్ 87

ఉ. ఆఱొడ నాహ్నికక్రియను యత్నముతో నొనరించి యుద్ధముం
జేయఁ దొడంగె ధర్మజుఁడు జెచ్చెఱ నట్లనె వచ్చిపోరె నా
తోయముఁ జూచి దానవుఁడు తోరపుదాంభికు నెట్లు గెల్తు నీ
తోయమునం దటంచు నిశి దుర్ఘటచింతనుఁ జెందె సంయమీ!. 88

తే. తపసిచంద్రమ! యీరీతి దైత్యవిభుఁడు, ధర్మపుత్రుని నెదిరించి ధైర్య మొప్ప
దివ్యవర్షసహస్రంబు దివిరి పోరి, ఘనునిఁ గెల్వంగఁజాలక కలఁగి పిదప. 89

— ప్రహ్లాదుఁడు నరనారాయణులఁ గెల్వలేక పీతవాసునకు విన్నవించుకొనుట —

సీ. ధర్మవాసునిఁ జేరి భక్తితో దైత్యుండు పలికెను దేవేశ భవవినాశ
హరియు నారాయణుఁ డగుసాధ్యునిఁ జయించుశక్తి నాకేలొకో చాలదయ్యెఁ

దత్కారణముఁ దెల్పు । దయనన్నుఁ బీతవాసుండు ప్రహ్లాదునిఁ । జూచిపలికె
సురభుజ! నీచేత । నొగినిర్జరులచేత నాసాధ్యవిప్రుఁ డసాధ్యుఁ డాటి
ఆ ననఁగ నసురుఁ డనియె । నాతఁడు నాచేత, నని నజేయుఁ డైన । నవని నేను
జేసినట్టిప్రతిన । చెడి యసత్యం బౌను, సకలలోకపాల । సత్యశీల! 90
క హీనప్రతిజ్ఞులై భువి, మానసములు తల్లడిల్ల । మాదృశు లెట్టూ
దీనస్థితి మై మనుదురు, కాన భవన్నికటమందుఁ । గదలని పూన్కిన్ 91
ఆ కాయశోషణమ్ముఁ । గావింపఁగలవాఁడ, ననుచు నిర్జరేశ్వ । రాగ్రమందు
నిట్టు పలికె దైత్యుఁ । డెలమి శిరఃస్నాతుఁ డగుచునుండె నజుని । నాత్మఁ జేర్చి.
ఉ పిమ్మటఁ బీతవాసుఁ డగు । విష్ణుఁడు దైత్యునిఁగాంచి పల్కె నీ
వమ్మహనీయు నెన్నటికి । నైనను యుద్ధమునన్ జయింప కీ
విమ్మగుభక్తినిం గెలుతు వీ । విపు డేఁగు మటన్న ఖిన్నుఁడై
సమ్మతిలేక దానవుఁడు । వయ్యనఁ బల్కెను విష్ణుమూర్తితోన్ 93
శా. దేవా! సువ్రత! మూఁడులోకములలో । దీపింప నీధర్మజుం
డేవంకం గనఁగా నజేయుఁ డగుచో । నే నీప్రసాదంబుచే
భావింపంబడి కీర్తిఁ జెంది తుగ నిర్బంధప్రతాపుండ నై
యీవేళ న్వసియింప సాధ్య మగునే । బృందారకాదు ల్గనన్ 94
తే శ్రీశ! నాచే జగంబులు । జితములయ్యె, ధర్మపుత్త్రుఁడు నీప్రసా । దమున విజితుఁ
డయ్యెనేని శచీపతి । యనఁగ నెంత, వాఁడనంగను విని పీత । వాసుఁ డనియె.
తే. అసురపంచాస్య! నేనె నా । రాయణుండ, భువనములనిండఁ దయఁజల్లి । భూరిధర్మ
సత్త్వివర్తనశాలితప । శ్చర్యయందుఁ, దత్స్వరూపంబుతో నుండుఁ । దథ్య మరయ.
క దానవ జయమునుఁ గోరితి, లేనిమహాభక్తి నామ । హేశు ననంతుం
గానం జని సేవింపు మ, నూనజయం బలరు నీకు । నుర్వీస్థలిపై 97
మ అని పీతాంబరుఁ డాడ వ్యాప్తుఁడయి దై । త్యాధీశ్వరుం డంధకా
ఖ్యను జెన్నారినదానవోత్తముని వే । డ్కం బిల్చి యావేళ ని
ట్లనె నాచేత విసృష్టమె తనరు రా । జ్యశ్రీనిఁ గాతుంపు ప్రే
మను దైత్యాదుల నేలి కీర్తిఁ గనుమా । మర్యాదతో నంధకా!. 98

ప్రహ్లాదుఁడు నరనారాయణుల శరణుఁజొచ్చుట.

క మునివర ప్రహ్లాదుం డిటు, లన విని కనకాక్షుఁ డైన । యంధకుఁ డెలమిన్
ఘన మగుతద్రాజ్యంబును, మన మలరఁగఁ దాల్చె నపుడు । మహితస్ఫూర్తిన్.
తే నరవి నాయెడ బదరికా । శ్రమమునకును
మంతు కెక్కినప్రహ్లాదుఁ । డంత నరిగి
సాధ్యనరులనుఁ గని వారి । చరణములకుఁ
గరములు మొగిడ్చి వలఁగొనెఁ । గడిమిఁ బిదప. 100

క. ఘనతేజుఁ డసురుఁడు నా, వనజోదరుఁ డతని కనియె । బలిమి న్నను నీ
వనిలో జయింప కిటు ప్రభు, లని చేసెద వెందుకొఱకుఁ । దెలియ దటన్నా.
క. వినయముతో దైత్యుం డనె, నిను నెవ్వఁడు గెల్వఁగలఁడు । నీ కంటె ధరం
గన దివ్యపురుషుఁ డెవ్వఁడు, వనజోదర పరమపూరు । భావవిదూరా. 102
వ. దేవా! నీవు నారాయణుండవుఁ బీతవసనుండవు, జనార్దనుఁడవు, దేవుఁడును విష్ణుఁ
డవు, శార్ఙ్గచాపధరుఁడవు, నాశరహితుండవు, మహేశానుఁడవు, శాశ్వతుఁడవు
పురుషోత్తముఁడవు కావె యోగనిష్ఠాగరిష్ఠులు సతతము నినుఁ దలంచుచున్న
వారు బుద్ధిమంతులు నినుఁ బూజించెదరు స్నానశీలవ్రతులు సదా జపించుచు
న్నారు యజ్ఞము నడుపువారు నిను యజించుచుండెదరు చ్యుతములేనివాఁడ
వును, హృషీకేశవుఁడవునుఁ జక్రహస్తుఁడవును, విశ్వంభరుండవును, మహా
మీనరూపుండవును, హయమస్తకుండవును, దివ్యకమఠరూపివియును, హిరణ్యా
క్షునికిఁ బగవాఁడవును, మాతండ్రి యగుహిరణ్యకశిపుని వధించిన నృకేసరి
వియుఁ గారోద్ధృతమై వరాహమైనవాఁడవును దేవదేవుఁడ వగునీకు వందనం
బులు సర్వనాథుఁడవు విభుఁడ వగునట్టి యోగరుడకేతనా! బ్రహ్మరుద్రేంద్ర
పావకయమనైఋతివరుణవాయుకుబేరశర్వసూర్యచంద్రచరాచరాదులు నీవె
కావె జగదీశ్వరా పరమేశ్వరా యని వేఁడి వెండియు నిట్లని స్తుతించె 103
సీ. మాధవ భక్తసం । యమివారరక్షా వకభూమి జలనభో । వాయురూప
ధరుఁడవై వేయివి । ధమ్ముల నిఖిలలోకములందు వ్యాపించి । క్రాలు నిన్నుఁ
గదనంబులో గెల్వ । గలఁ డెవ్వఁడో హృషీకేశ నిశ్శేష । గ నాశరహిత
పూర్ణభక్తినిఁ దోష । మును జెందెదవు చూడ నితరభక్తి జయింప । నెట్లు నీవు
తే. శక్తుఁడవు కావ దేవేశ జగదధీశ, సంతతంబును నామగిఁ జాలభక్తి
వేఁడెదను నామొఱాలింపు । విపులదయను, భక్తమందార నతజన । పాపదూర
క. నారద! ప్రహ్లాదుఁ డు పెం,పారినసద్భక్తి నిట్లు । ప్రార్థింప మహా
కారుణ్యంబున హరియమ,రారాతినిఁ జూచి పలికె । నతితోషమునన్. 105

నారాయణుఁడు ప్రహ్లాదునకు వరంబు లిచ్చుట

క. అనుపమ మా నీస్తుతిచే, తను హృష్టుఁడ నైతి ముఖ్య । తమ మగుభక్తిం
దనరిన నీవలనను గాం,చిన వాఁడఁ బరాజయంబు । చిత్తి దైత్యేశా!. 106
క. ఇతుఁడైననరుఁడు దండముఁ, దతతుష్టి నొసంగుచుండు । దండార్థంబై
కుతుకమున వర మొసంగెద, నతివేడ్కన్ గోరు దిలిసు । గాగ్రణి పూన్కిన్.
చ. అనవిని దైత్యుఁ డాడె జగ । దన్వయ! కోరినకోర్కెఁ దీర్ప నీ
కును దగుఁగాన, గోరెద వ । కుంఠితభక్తి చెలంగుచుండు నే
ననితరసాధ్యులైనమిము । నాజినిఁ గాతియఁ బెట్టినందుచే
లెను జనియించు కాయదురి । తంబుల నెల్లనుఁ బాపు మీశ్వరా!. 108

క. అని ప్రహ్లాదుఁడు వేఁడిన, వనజోదరుఁ డతనికట్లవరము నొసఁగి యో
దనుజేశ్వర! రెండవవర, మును దయ నిచ్చెదను గోరు పూర్ణేచ్ఛ ననన్. 109

మ. విని ప్రహ్లాదుఁడు సంతసించి పలికె న్విశ్వేశ! యేరీతి నా
మనసొప్పారినయుష్మదాశ్రయమహామర్యాదసేవాపరా
యణవృత్తిం దనరారు నిత్యమనదైత్యధ్వంసి యట్లౌను నీఁ
కను వేఱొక్కవరంబు నిచ్చెదను వేఁడ్కం గోరు దైత్యోత్తమా 110

చ. అన విని దానవేశ్వరుఁడు హర్షముతో ననె నన్నిగోర్కులుం
ఘనమగు నీప్రసాదమున గాంచితి సత్యమధోక్షజా! ముదం
బున భవదీయపాదరతిపూర్ణముఁ గా నగురీతిఁ జేయుమీ
వనఁగ రమేశుఁ డప్పు డటు గానని పల్క వచించెఁ గ్రమ్మఱన్. 111

తే. విబుధు లౌ నాననంగ నీవేళ నొక్క
వరము నిచ్చెద మద్భక్తివఱలి యెపుడు
జరయు మృతియును లేక నిర్జరుఁడ వగుచు
నవని నుండఁగఁగలవు నీవార్య యెన్న. 112

ఉ. దానవసింహ! కార్యరతి దాల్పు పురంబున కేఁగి ప్రీతితో
మానుగ దైత్యశేఖరులమానసము ల్వికసింపఁజేయుచుం
బూనిక నిత్యరాజ్యమునుఁ బొందుఁగ నేలుము మత్పదాంబుజ
ధ్యానుఁడ వైననీకు భవమండలి బంధము లేదు ధాత్రిపై 113

క. ఉత్తమనిజకులధర్మముఁ, జిత్తంబున మఱవ కెపుడు చేయు మనంగా
నత్తఱిఁ బ్రహ్లాదుండనె, నుత్తముఁ డగుశౌరితోడ నుజ్వలమతియై. 114

క. వదలినరాజ్యము నాచేఁ, బదపడి యేరీతి దాల్పఁగఁబడు నీవేళన్
సదయా! లోకగురూ! యన, ముదమున హరి పలికె దైత్యముఖ్యునితోడన్

ఆ. అసుర! నీకు నట్టులాత్మలోఁ దోఁచిన, నాత్మపురికిఁ బోయియత్నమొప్ప
దైత్యదానవులకుఁ దగునీతిఁ బోధించు, వాఁడ వగుము ధాత్రి వన్నెగుల్క

క. నారద! యీచందంబున, నారాయణుఁ డంత దైత్యనాథుఁడు భక్తిం
శ్రీరమణునకును వలఁగొని, చేరెను తనపురికిఁ గోర్కె చెలువారంగన్ 117

సీ. ఆసమయంబున నంధకాసుర దైత్యవరులు సభాస్థానవర్తులుండు
నైనప్రహ్లాదదైత్యాధిపుఁ బొషఁగాంచి పలికిరి పుణ్యాత్మ! భవ్యరాజ్య
మున నధీశుండవై ముద మొప్పఁ బాలింపు మని వేఁడుచుండిన వినక దానిఁ
గామంబు దిగనాడి కర్బురేశుల సవ్యమార్గస్థులనుఁ జేసి మదినిప్ర
తే. మేయుఁ డగుకేశవుని భక్తి మిగులఁ బొగడి
సొరిది ధ్యానించి యోగవిశుద్ధకాయుఁ

దగుచు నిర్వాతదీపంబు పగిది నతఁడు
మహిని వర్తించె సద్గుణమణివిభూష! 118

క. ఈరీతిని బ్రహ్లాదుఁడు, శౌరియు సకలేశుఁడు నగు చక్రాయుధుచే
ధారుణికిఁ జతుఁడై రాజ్యము, గోరకమది నజానిఁదలఁచి కూర్మి వసించెన్ 119

అంధకాసురుని వృత్తాంతము

ఉ. నావిని నారదుండనె సనాతనభూపతి ధర్మమేదిరై
వావిరినుండు; దైత్యకులవల్లభుఁ డంధకుఁడై వసుంధరన్
గీవిని రాజ్యమం దెటుల దేవను నిల్పె నటం బులస్త్యుఁ డా
భావవిదూరుతో ననిరె భావము చెన్నలరారుచుండఁగన్ 120

తే వినుహిరణ్యాక్షుఁ డవని జీవించుచున్న
సమయమున నంధకుఁడు లబ్ధచతుఁడై న
కతన నాతని నభిషిక్తుఁగాఁగఁ జేసె
నాత్మపదమందుఁ బ్రహ్లాదుఁ డాత్మనలరి. 121

చ అని వచియింపఁ జిత్రపడి యమ్ముని పల్కెను మానినాథ! యా
దనుజుఁడు రాజ్యభారమునుఁ దాల్చి ధరాతలమందు నేక్రియం
బనులనుఁ జేసె నెట్లు సురవర్యులఁగూడి వసించెఁ జెల్మితో
ననఁగ బులస్త్యుఁ డిట్లనిరె నామునివర్యునిఁ జూచి క్రమ్మఱన్ 122

క. నారద! హైరణ్యాక్షుఁడు, ధారణిఁ బాలించుచున్నరీతి నంధకదే
వారితపంబున శూలిని, సారెకుసంతుష్టుఁ జేసి సజ్జను లలరన్ 123

సీ పన్నగముని సిద్ధబర్హిర్ముఖులచేతఁ జావులేక జయంబు చాలఁగల్గ
నవియును వెండి వాలుతానిసులోఁ జిక్క కాలకవారిచేఁ గాసిఁబడక
యుండునట్టివి యైనయురువరంబులఁ గొని సంతుష్టుఁడై వచ్చి సంతసమునఁ
గవినిఁ బురోహితుఁగాఁ జేసి రాజ్యంబు భాసురగతి నేలె బ్రోఢి మెఱయ

తే బిదప నమరులఁ గెలువఁ దాఁ బ్రీతి నెంచి
వసుధ నెల్లను వ్యాపించి వసుమతీశ
వరుల నిర్జించి దైత్యుఁడు వారిఁగూడి
చిత్ర మగునట్టి కనకాద్రిఁ జేర నరిగె. 124

క అరుదెంచు నాతఁ డింద్రుని, బురువాతుఁడు చూచి సురలఁ బోరొనరింపం
బురిబోల్పి వేడ్కతో మద, కరిని నధిష్ఠించి యుద్ధకాంక్ష న్వాసీ 125

తే. పోయి యమరావతినిఁ గుప్తఁ బొందఁ జేసి
మగుడఁ జనుదెంచె నావేళ మహితబలులు
నైన లోకేశ్వరులు శక్రు ననుసరించి
నిజరథంబులపై నెక్కి నేర్పు మిగుల 126

క. తమతమశస్త్రాస్త్రంబులఁ, దమితోఁ గరములనుఁ దాల్చి । ధైర్యస్ఫూర్తిం
గుమ్ములై కదన మొనర్పఁగ, సమధికరోషమున లేచి । చనుదెంచి రొగిన్ 127
వ. అట్టిసమయంబున. 128
క. సురసేనశక్రయుత మై, కరివాజిరథౌఘముఖ్య । గణములతోడం
గురువేగంబున వెడలెను, కరమరుదుగ ధూళి రాశి । కంపింపంగన్. 129
వ. మునీంద్రా! పిదప నాయోధనబద్ధబుద్ధిని ముందట ద్వాదశాదిత్యులు, నడుమ సాధ్యాశ్విమరుద్గణములతోఁ గూడిన వసువిశ్వేదేవతలు, వెనుకవైపున ముక్కంటియుఁ దదనుచరులై విద్యాధరాదులు తమతమవాహనంబుల నెక్కి వేడ్క వెడలి రని చెప్పిన నారదుఁ డతని కిట్లనియె మునివర్యా! దేవాదులు కలహ మొనర్ప సమకట్టి వాహనారూఢులై వెడలి రని వాక్రుచ్చితివి ప్రతాపశాలు రగు దేవతలలో నెవనికి నేవాహనం బైనది విన నాత్మ యులుకుచున్నది కరుణించి వచియింపవే యని ప్రార్థింపఁ బులస్త్యుఁడు చెప్పందొడంగె. 130

పులస్త్యుఁడు నారదునకు దేవదానవు లెక్కెడువాహనంబులఁ జెప్పుట

సీ. వినవయ్య! చెప్పెద । విబుధాదు లెక్కెడువాహనంబులరీతి । వరుసఁగాను
దనుకరతలజమై । తతవీర్యసత్వమై తనరిన దగుశుభ్ర । దంతిశక్రు
వాహన మగునీశు । వరతేజమునఁ బుట్టి నలుపైనవన్నెతో । నలరి మనసు
గలికల్గి పౌండ్రకా । ఖ్యను వెల్గుమహిషంబు యమునికి వాహన । మగునురుద్ర
తే. కర్ణమలజంబు నై నీల । కాంతి నొప్పు
చతురగతి కల్గి జలనిధి । సంజ్ఞకంబు
నైన మొసలి జలేశువా । హనము నగుచుఁ
బుడమిఁ జెర్కొనఁబడుచుండుఁ । బుణ్యచరిత 131
తే. అంబికాపదసంభూత । మైనదియును
రౌద్రనక్రస్వరూపమై । క్రాలునదియు
శకటచక్రాంబకంబునై । సరవిఁ గుల్కు
రుచిరనరవాహనము కుబే । రునికిఁ గలదు. 132
క. తేఁకువ గలగంధర్వులు, భీకరు లగుభుజగవరులు । పృథుబలయుతులౌ
నేకాదశరుద్రులు శు,భ్రాకృతిజవవృషభవాహు । లగుదురు మౌనీ 133
క. శరశతహంసల నొప్పెడి, యరదము పాల్కడలిపట్టి । దై చెన్నొందుఁ
దురగోత్కరరథులు సూర్యులు, వరవసువులు కరుల నెక్కి । వర్తింతు రొగిన్.
క. నరవాహనసంస్థితు లై, చరియింతురు యక్షు లెలమిఁ । జర్చింపంగా
నురగారూఢులు నై కిన్నరు లుందురు మౌనివంశ । నాయక! పేర్మిన్. 135
తే. ఆశ్వినేయులు తురగవా । హనులు క్షేమ,రూపు లై యుండునట్టి మ । రుద్గణమ్ము

మేటిజంకలపై నెక్కి । నీటుకుల్కి, మెలఁగుచుందురు మోదంబు । మించియుండ

క. శుకములమీఁదఁ గపీంద్రు,ల్ప్రకటితముగఁ గాలిబంట్ల । పై గంధర్వుల్
సుకరస్థలి వర్తింతురు, సకలాశాస్థలములందుఁ । జతురత్వముతోన్ 137

చ. అనవిని నారదుం డనె మహాత్మ! సురేశులవాహనంబులన్
వినితిని దానవాధిపులు । వేడుక నెక్కెడిస్యందనాదులం
గనికరమొప్పఁ బల్కుమనఁ । గా మనసారఁ బులస్త్యుఁ డాడెనో
మునివర! తచ్ఛ్రుతాంగవిధ । ముల్ దమిఁ జెప్పెద నాలకింపుమా. 138

క. రెండాఱునూర్ల మూరల, నుండుఁ గొలందిఁ గలశిఖర । మొనరన్నలుపై
దండి నలుఁగడలవెలిఁగెడి, చండరథం బంధకునికి । సరవిం బరఁగున్ 139

సీ. చంద్రవర్ణాష్టాశ్వ । సత్తమసహితమై భద్రదివ్యంబునై । పరఁగి శుభ్ర
రమ్యహాటకమయ । రథము ప్రహ్లాదునిదా విరోచనునికి । హస్తి యగును
రహిఁ గుజంభునికిఁ దు । రంగమౌ హయకంఠ దానవునకు దంతి । తనరుచుండుఁ
గనకతుల్యాశ్వసం । కలితదివ్యరథంబు జంభునిదై యుండుఁ । జారుకాంతి

తే. శంకునికి వారువం బగు । జతురుఁడైన, మయసురారికిఁ దనరారు । మంచి తేరు
దుందుభాఖ్యునిఁ జెలువొందు । దుష్టదైత్య,పతికిఁ బటుతరసర్పంబు । పరిఢవిల్లు.

క. వినులోహాకర్ణునకు వ్యా,హన మగుసింగంబు శంబ । రాఖ్యధరిత్రిం
దనరిన దైత్యేశ్వరునకు, ఘనమైనవిమాన మొనరుఁ । గాంతిస్ఫూర్తిన్. 141

వ. మునీంద్రా! దైత్యవరు లేతాదృశవాహనములనెక్కి సమరోన్ముఖులై వెడలి
రింకఁ దత్సమరవిధివిశేషంబులఁ జెప్పెద వినుమని యిట్లనియె 142

## దేవదానవుల ద్వంద్వయుద్ధము.

క. గురుబలు లగుబలివృత్రులు, పరువడిఁ బవరంబుసేయఁ । బఱతెంచిరి ని
ర్జరసేనలు పదచరులై, పురుడింపఁగ వెడలి రపుడు । పుణ్యనిధానా! 143

ఆ. పిదపఁ ద్రిదశదైత్య । వితతికిఁ దుములసం,కులరణంబు కలిగె । ఘోర మగుచుఁ
గపిలవర్ణధూళి । కలితమై జగమెల్లఁ, గానవచ్చెఁ బ్రాణి । గణమునకును 144

క. జనకుఁడు సుతుఁడని తలఁపఁడు, జనకుం డని సుతుఁడు తలఁచి । చనఁ డాయుడలం
జెనఁకువఁ గొందఱు తమవా,రినిఁ గొందఱు పరులఁగొట్టి । రి కడురుషమెయిన్.

క. ఒకదానిమీఁద నొక్కటి, వికటస్థితితోడ నపుడు । వెడలె రథంబుల్
శకవికలై కరిపాదా,తికులును జనిరట్లు వడిని । దీప్తిన్మౌనీ. 146

క. తేటపడ నొకని నొక్కఁడు, వాటంబుగఁ దెలిసికొనుచు । వడిఁ బదగులు బల్
పాటించి కొట్టుకొనిరని, బాటవమునఁ జయముఁ గోరి । పరమమునీంద్రా.

క. తరువాయి సురలు దైత్యులు, వరవిక్రమశౌర్యధైర్య । బలసంయుతులై
నిరతము గెలుపుం గోరుచుఁ, గడకరిఁ బోట్లాడుచున్న । కాలములోనన్. 148

వ. మునీంద్రా! నెత్తురునీట వన్నెకెక్కి తేరులనుసుడులచే నిరాతి కాలిబంట్లయొ
అపిడినఁ బుట్టినమ్రోత కలిగి గజకుంభము లనెడితాఁబేళ్లచేఁ గాణించి యుడతె
గక పారుచు వాఁడిమొనలు కలఖడ్గముకిరంబులం గూడి మహాసిగ్రాహవాహిని
యై ప్రేఁగులనునాఁచుతీఁగల నల్లిబిల్లిఁగ నల్లుకొని టెక్కెంపునురుగుదండ
లతో శోభిల్లి గృధ్రలోహపుష్టఘనహంసరాజిత యగుచు డేఁగలనుచక్రవా
కములచే నలంకరింపఁబడి దివ్యకాలకంఠకాదంబ యగుచు నక్కలనుగుక్క
లచే నాకులతఁ జెంగి పిశాచసంయమీశ్వరులచేఁ గలిసి సామాన్యులకు దాఁట
రానిదైన దారుణరణమహానది ప్రవహింపఁ దొడంగెనని చెప్పి వెండియు
ని ట్లనిరి. 149

క. నిరతము నెత్తురుటేరును, వరశూరులు తేరులనెడి । పడవలచేతం
దర్వరితమునఁ దాఁటుచుందురు, దుర మొనరింపంగఁ దలఁచి । త్రోడ్తో శక్తిన్

క. మోఁకాటిబంటిఁ దడియుచు, వీఁకం దన్నదినిఁ దాఁటి । వేగవె యోధు
ల్ప్రాకటజయకావంబున, భీకరులై చంపుకొనుచుఁ । జెనఁగిరి పెలుచన్ 151

ఉ. అంతట రౌద్రభీరుగ్రహమై నసురాసురఘోరయుద్ధమం
దంతము లేక యతుపిశితాశనఘోరపిశాచబృందము
ల్వింత జనింపఁ జేరి భట । వీరులరక్తముఁ గ్రోలి మాంసముం
బంతముఁబట్టి వేగమున । బాగుఁగ మెక్కియుఁ గౌఁగిలించుచున్ 152

క పలుచనిపారలఁ ధరపైఁ, బలువీరులఁ జల్లిచల్లి । బహుంతోషముతోఁ
జెలఁగుచు నన్యోన్యంబుఁగఁ, బలుకుచు వర్తించుచుండెఁ । బరమమునీంద్రా!

క. అరయుడఁ గూసెను నక్కలు, పాయనిశరవేదనార్తిఁ । బడి భటు లిల న
య్యో యని యేడ్చిరి యొరు లాతో యముఁ గలవారిఁబట్టి । త్రుంచిరి పెలుచన్.

తే. భూరివంచకఘోషము । పొసఁగుచుండ
దైత్యసురు లాడుభీకర । ద్వంద్వసమితి
నూపిరులె యొద్దుఁగా నట । నుంచఁబడిన
శాస్త్రవిధికలజాదంబు । చాల వెలిఁగె. 155

ఉ. ఆరణరంగమందుఁ గన । కాతుసుతుం డగునంధకుండు దై
త్యారిపతిన్ మహాజసుని । దర్పితమత్తకరీంద్రపుష్టగున్
వీరుని శక్రునిం గవిసె । వేగమె దుంతెను వేడ్క నెక్కఁబ
ద్ధీరతదక్కనంపుఁబతి । లెంపున రాఁగని క్రోధయుక్తుఁడై 156

క. జను లదరనుఁ బ్రహ్మాదుం, డసురాతుసుఁ డష్టదివ్య । హయయుతరథమున్
మనసార నెక్కి భీకర, ఘనశస్త్రుం డగుచు నెదురఁ । గా నడిచె వడిన్ 157

సీ. సంయమీశ్వర! విరోచనుఁడు జలేశుని నెదురింపఁ జనె జంభుఁ । డెలమి ధనదు
డాసెఁ గుజంభుండు । శ్వసునిఁ గవిసెను మయుఁ డగ్నిహోత్రుపై । మార్గానంగ

నరిగెను బలవంతులైనహయగ్రీవముఖ్యదైత్యేశులు మొనసి దనుజ
వరులు విక్రమమున వసురుద్రభాస్కరచంద్రార్కనిర్జరసమితినెల్లఁ
తే. బొంది కడువడి నన్యోన్యముగనుఁ గూడి
గర్జనంబులు గావించి కార్ముకములుఁ
దాల్చి యుద్ధతి వేయివిధమ్ము లొప్ప
చుండ బలశౌర్యములఁగడు నొప్ప యపుడు. 158

క. ఏరా రారా పోరను, ధీరతతో నుండుమెదుటఁ దెంపరివైనం
బీరము చెడెనా నీ కని, వారని నొండొరులు నిట్లు పలికిరి కడిమిన్ 159

వ. మునీంద్రా! త్రైలోక్యవిభవముఁ గోరుచున్నవారును, సంప్రబుద్ధులును, గురు
వేగు లగుదేవదానవులు వాడికోలలఁ బీడింపంబడి ఘోరామోఘశరతాడితు
లై మిన్నువాఁకవేగమునకంటె మిన్నఁగఁ బాఱి భయంకరంబై భూతప్రేతపి
శాచగణంబులకుఁ దుష్టి నిచ్చునట్టిశోణితనదిఁ బ్రవర్తింపఁజేసి తెన్నదిం
దాఁటుచుఁ బోరుచు నుండిరి గగనస్థులై దేవమునిసంఘములు వారినిం
జూచుచుఁ ద్వరితముఁగ సుశబ్దములఁ గావించుచు నెగడమునఁ జచ్చినశూరు
లకు రంభాద్యప్సరలంగూర్చుచు సంతోషించుచుండి రని పలికి మరల
ని ట్లనియె. 160

ఇంద్రుఁ డంధకాసురు నదిలించుట.

క. మునివర! తత్సంగ్రామము, గనభీమభయంబు నగుచుఁ గ్రాలఁగ సంక్రం
దనుఁడు ధనువెత్తి శరతతి, దనుజేశునిమీఁద వైచె దర్పం బలరన్ 161

చ. గురుబలుఁ డైనయంధకుఁడు ఘోరతరం బగుదివ్యచాపముం
గరమునఁ దాల్చి యింద్రుపయిఁ గ్రన్నన బర్హిణశస్త్రకాండముల్
విరివిని వైచె వారు మఱివిస్తృతశక్తిని భర్మపుంఖదు
ర్ధరనతపర్వవేగశిత బాణహతాంగులు నైరి సంయమీ. 162

తే. అపుడు శక్రుఁడు కోపించి హస్తమందుఁ
గులిశమునుఁ బూని వెసఁద్రిప్పి ఘోరదనుజు
మీఁద వైచినఁ గనివాఁడు మిగుల నలిగి
దానిఁ బొడిచేసె శస్త్రాస్త్రతతులవలన. 163

క. తమిఁ బలి తచ్ఛరముల భ, స్మముగాఁ గావించె నగ్నిసర్పంబుల వే
గముతోఁ గాల్చినతెఱఁగున, సుమనస్సంఘమ్ము తెలమిఁ జూడఁగ నంతన్ 164

తే. బలవదగ్రియుఁడును వేగవంతుఁ డైన
యంధకుఁడు వజ్రమునుఁ జూచి యత్నమొప్పఁ
దేరుపైనుండి డిగివచ్చి దీనుఁ డగుచు
నవని నుండెను హస్తసహాయుఁ డగుచు. 165

ఉ. ఆయది వానిసారథిని । నశ్వమునున్ ధ్వజకూబరంబులన్
వేయువిధంబులం దునిమి । వేగమె యాదనుజేశుచెంతకుం
డాయఁగఁ జూచి వాఁ డపుడు । దానిని ముష్టినిఁ గొట్టి త్రోసి యా
తోయమువారు ఖేదపడఁ । దోరపుఁ గర్జనచేసె నాయెడన్ 166

సీ. కని శతక్రతుఁడు మార్గణము లాతనిమీఁదఁ బఱగింప దనుజుండు । బాహాశక్తి
వానినిఁ బోఁద్రోసి । వాసవుఁ గాతింప వాంఛించి వడివచ్చి । వారణంబు
ఘనకుంభమధ్యంబుఁ । గట్టిగా నఱచేతఁ । గొట్టి మోఁకాలిచేఁ । గూలఁ బొడిచి
పరవివిషాణంబుఁ । జక్కఁజీ రెండుపార్శ్వంబులపై గ్రుద్ది । బాధపఱచి

ఆ. వసుధమీఁదఁ ద్రోయ । వడిఁబడుచున్నట్టి, దంతినుండి శక్రుఁ । డంతలోనె
నేలఁ దూఁకి పవిని । నేర్పుతోఁ గైకొని, యమరసేనఁ దూఱెఁ । ననువుదక్క.

యముఁడు ప్రహ్లాదుని నెదిరించి పోరుట.

క. నారద! పరాఙ్ముఖుం డై, ధీగతఁజెడి శక్రుఁ డరుగ । దీపించి వెసన్
వారక సురసైన్యములన, కారుణ్యంబునఁ గలంచెఁ । గరపరవాతులన్ 168

వ. పరమమునీశ్వరా! విను మత్తఱి నమరశ్రేష్ఠుం డగుజముఁడు కరము కరంబున దండమునుఁ బూని బిరబిరఁ ద్రిప్పి దితిజోత్తముఁ డగుప్రహ్లాదునిఁ జంప నెంచి వానిపైకి నుఱికి వచ్చుచుండె, హిరణ్యకశిపుసుతుఁడు వానిరాకనుఁ గని విలుఁ గైకొని గుణధ్వనిఁ గావించి బిరాన శరంబుల నరివోసి త్రేసి యార్చి పేర్చినఁ గడునలిగి రవిసుతుఁడు వానిబాణకాండములనెల్ల దంషమున ఖండించి మరల నిజభయంకరదండమునుఁ బ్రయోగించిన నది తత్కరమునుండి వెడలి కాలాగ్నివలె భూనభోంతరములనెల్లఁ జొచ్చి భువనత్రయంబులఁ గాల్చుచు వచ్చుచున్నఁ గని రక్కసులు దిక్కుసెడి స్రుక్కి యమదండమువలనఁ బ్రహ్లాదుఁడు మడిసె నని యాక్రోశించిన నంధకాసురుఁడు తదాక్రందనధ్వనిని విని దానవులారా! నేనుండ మీరేల భయపడెదరు సురాధముఁ డగువాఁ డెవ్వాఁడు మిమ్మేమిఁ జేయఁగలఁ డని వాక్రుచ్చి వేగమునఁ జని యపసవ్యకరమున దానిఁ గ్రహించి మరల సవ్యహస్తమున దానిఁ ద్రిప్పుచుఁ బ్రావృట్కాలఘనంబు మాడ్కిఁ గర్జించుచుండె. అంత దైత్యదానవులు తత్ప్రభుతుఁ డగుప్రహ్లాదుని విలోకించి మేలని పొగడిరి పిదపఁ గాలుఁడు మహాదండము ద్రిప్పుచున్నయంధకుని నరసి వీఁడు దుస్సహుఁడును, దుర్ధరుఁ డని తెలిసికొని యంతర్ధానుం డయ్యె నని చెప్పి పులస్త్యుఁడు వెండియు నిట్లనియె. 169

క. అంతటఁ బ్రహ్లాదుఁడు యముఁ, డంతర్హితుఁ డగుటఁ జూచి । యమరశ్రేణిం
బంతముఁబట్టి ధరంబడ, సంతసమునఁ గొట్టె నపుడు । సంయమిచంద్రా. 170

వ. ఆసమయంబున. 171

వరుణచంద్రులు దైత్యులమీఁదికి నరుగుట.

క. అప్పుడు మకరస్థుండై, తప్పక పాశమున మేటి।దైత్యుల నెల్లం
గుప్పలుగఁ గట్టి గదచే, నప్పుడు ఖండించి వైచె । నత్యుద్ధతిమై. 172

క. ఆయెడ విరోచనుఁడు తమి, దోయాధీశ్వరునిఁ దాఁకి । తోమరనానా
సాయకశక్త్యాదులతో, వేయివిధంబులుఁగ బాశ।వితతినిఁ ద్రుంచెన్. 173

చ. జలపతి హస్తమందుఁ గదఁ । జయ్యనఁ బూని విరోచనుఁగా ధరం
జలమునఁ గొట్టి త్రోసి జవ।సంయుతుఁడై యురుదెంచి నాగముం
బలిమినిఁ బాశజాలమున । బాగుగఁ గట్టిన నాతఁ డాఘనుం
గలిసి తదీయపాశములఁ । గ్రచ్చుఱఁ ద్రెంచెను సాహసంబునన్. 174

ఆ. నాశమును లేని దైనత।న్నాగ మపుడు, దర్ప మెప్పార రెండుదం।తములవలన
వరుణదేవుని మర్దించె । వడి నతండు,వధ్యమానుఁడు నై యున్న।వరుణుఁజూచి.

ఉ. శీతకరుండు నైనశశి । శీఘ్రమె వచ్చి తనుప్రభేదమా
శాతశరాళితోడఁ గరి।సత్తముముం బడఁగొట్టెఁ దచ్ఛర
వ్రాతనిపీడ్యమై గజము । రాయిడిఁ జెంగియు వారినాథునిం
భూతలమందుఁ గూలఁదన। భూరిపదంబులఁ దన్నె నంతటన్. 176

సీ. మదకరిచేఁ జిక్కి । మసలక వరుణుండు నలిరేగి తత్కరి । నాల్గుపాద
ములను హస్తములతో । మోహారంబునఁ బట్టి కడఁగి వెన్కటిరెండు। కాళ్లఁ గొప్ప
పాశమునను గట్టి । బలమునఁ జెకలించి వడిఁ ద్రిప్పి మిన్నంది । పడఁగనేయ
నాత్మయంత్రార్గళ।హర్మ్యభూమిని నొప్పు వరసుకేశిపురంబు । వడినిభాను
తే. విద్ధమై స్వర్గమువనుండి । పృథివిఁ గూలు
పగిది వరుణేరితుండు నై । వాఁడు నాగ
సహితుఁడై కూలె దానవ।చయము విస్మ
యాకులస్వాంతతనుఁ జూడ । నపుడు మిగుల 177

సీ. అటుమీఁద జలనాథుఁ । డాగ్రహంబున గదా పాశసమేతుఁడై।బలిమి నసురుఁ
జంప నాత్మఁదలంచి । సత్వరుఁడై రాఁగ వెఱచి దైత్యేశులో । వీర! జంభ
రాక్షసులార! దుర్ధరదైత్యసైన్యరక్షకుఁడు మహాబల।కలితదక్షుఁ
డైనవిరోచనుఁ । డనిలోనఁ బాశిచే నయ్యయో వినిహతుఁ । డగుచుఁ గూలె
ఆ. నంధకునిఁ గూడివచ్చి మీ।రంద ఱితని, నేలుఁ దురుబుద్ధిశక్తుల । నెసఁగు పాశి
వాహనాసురభటుల న।వార్యపాశ, గదలచేఁ జంపెఁ జిత్రంబు।గలుగ నపుడు.

క. ఈరీతిని ధారాధర, భూరినినాదోపమాన।పూర్ణము నై దుః
ఖారావము దితిజేశ్వర, వారకృతం బగుచుఁ జెలఁగె । వసుధ న్మౌనీ! 179

క. ఆరవమును విని యుద్ధతి, సారామోఘాస్త్రశస్త్ర।సంయుతు లగుచున్

వారకజంభాదిమహా, ఘోరాసురవరులు సమర । ధీశక్తిమెయిన్ 180

క. పక్కలు దీప్తానలు పై, గ్రక్కునఁ జనుదెంచి వరుణుఁ । గదియం జని రా
రక్కసులఁ జూచి జలపతి, పక్కన గ్రాహాది విడిచి । పటుశౌర్యమునన్. 181

వ. అంత నతితీవ్రంబుగఁ బాశంబును గేలఁగొని గదను జేత ధరించి చిరచిరఁ ద్రిప్పుచు జంభనికుంభ రాక్షసవీరులపైఁ గవిసి దర్పయుతుఁడగుజంభునిఁ గొట్టి కట్టివేసి దర్పితుఁడై సాహసంబున 182

క. అరచేతఁ దారదైత్యునిఁ, జరణంబున వృత్రదనుజు । జవమున జంభుం
గరిమపుఁ బిడికిటబలునిం, ధరణీతలం బంటఁ గూల్చె । దర్పంబలరన్ 183

తే. అమరవరుఁ డగువరుణుచే । నసురు లధిక
తాపమునుఁ జెంది శస్త్రము । ల్ధరణి వైచి
యదిరి దిశలకుఁ జని రంత । నంధకుండు
వేగి రాయి వారిపతి గెల్వ । వెడలె మానీ 184

చ. ఘనజలనాథుఁ డాయుడను । గర్వముతో నరుదెంచు నంధకుం
గనుఁగొని వానిపాశమునఁ । గట్టి మహాగదతోడఁ గొట్టినన్
దనుజవరుండు పాశమును । ధైర్యముతోడ గ్రహించి తద్గదం
గొని యమృతేశుపై మలఁ । గొబ్బున దానిని వైచె సంయమీ. 185

తే. మొనసి వచ్చుగదాపాశ । ములనుఁ జూచి
యపుడె దాక్షాయణీసుతుఁ । డైనవరుణు
డంబునిధిఁ జొచ్చె నంతట । నంధకుండు
ధరణిఁ గూల్చెను సురసైన్య । తతులఁ గడిమి. 186

ఉ. పిమ్మట వీతిహోత్రుఁ డలి । క్షీణగంధవహావధూతుఁడై
ముమ్మర మొప్ప దానవస । మూహబలంబులఁ గాల్చుచుండఁగా
నమ్మహనీయమూర్తి పయి । నల్గి సురారులవిశ్వకర్మ యొ
క్కుమ్మడి నుగ్రవిక్రమభ । యోన్నతశక్తి చెలంగి మార్కొనన్ 187

తే. శంబరునితోడఁ గూడి ని । శ్శంక మిగుల
వచ్చుచుండినమయుని నా । వహ్ని చూచి
కరువలినిఁ గూడి తద్దైత్య । కంఠములను
శక్తిచేఁ గొట్టి కట్టెను । శౌర్య మొప్ప 188

వ. అత్తఱి 189

చ. కనలుచు శక్తి తద్దనుజ । కంఠము నుద్ధతిఁ ద్రుంప దగ్ధమా
తనువున వాఁడు ధాత్రిఁబడి । తద్దయుఁ గాలెను వహ్నిదీప్తితో

గనలుచు శంబరుం డవని । గ్రక్కున వ్రాలి హరిప్రతప్తదం
తినినదతుల్యరావమును । దీర్ఘముగా వెసఁ జేసె సంయమీ 190

వ నారదా! తదార్తరవంబు నాకర్ణించి యంధకుఁడు కోపరక్తనేత్రుఁడై ఆ! యిదేమి మయశంబరు లని నెవనిచే నిర్జితులై యనుచు వానింజూచి పలికి యిమ్మట నీయగ్ని దేవరరక్షసులదండునుఁ బరాక్రమంబున నుక్కుమిగిలి చక్కాడుచున్న వాఁడు రణాగ్రమం దితనిఁ గెలుచుట సాధ్యము కాదు కనుక నోయంధకా! నీవిపు డరుదెంచి మమ్ముఁ బాలింపు మని యీరీతిం దైత్యులచేఁ బ్రార్థింపఁబడి బంగారువంటికన్నులుకలయాయంధకుఁడు వడిఁ బరిఘముఁ బూని నిలునిలు మని బిగ్గర నఱచి హుతాశునిపైకిఁ బోవుచుండె నవ్వయాత్ముఁ డగుపైశ్వానరుఁ డాయసురునిమాట నాకర్ణించి క్రుద్ధబద్ధబుద్ధియై యెదురేగి వానింబట్టి యొత్తి పుడమిపై నట్టె పడవైచిన నసురాధినాథుఁడు లేచి మేటిపరిఘముచేఁ దెమ్మెరచెలినిం గొట్టిన దల్పిడితుఁడై నీటఁబడ్డ శంబరాంధకుల విడిచి వారిమీఁదికిఁ గడు వడిఁబోయినఁ గని దనుజుఁ డతనినెత్తిమీఁదఁ గ్రమ్మతిఁ దశాస్యధనమ్మునఁ గొట్టి విజృంభించె నపు డగ్నితదసురపరిఘహతుఁడై భయమువలనఁ గదనభూమి వెలుపలికిఁ బాఱె నంత నంధకుఁడు పరాక్రమమున నలిరేగి యుద్ధమందుఁ జిలుకులచేఁ దన్నుఁ బీడించుచున్న వాతచంద్రభాస్కరాశ్వివసుమరుద్గణంబులనెల్ల సమరపరాఙ్ముఖులనుఁ జేసి పిదప నుదగ్రదేవసైన్యంబుల గెలిచి యింద్రాదిదేవగణంబులం గాడి రక్కసులచేఁ బూజింపఁబడుచుఁ బుడమికి నేఁగుదెంచి సకలరాజాధిరాజులఁ గప్పముల నిచ్చువారిఁగఁ జేసి చరాచరమయ జగంబులనెల్ల వశపఱచుకొని దీప్తంతుఁడై పాతాళలోకమం దశ్మకాఖ్యఁ జెన్నొందు మేటిపురంబు సొచ్చి సుఖంబున నుండె నని చెప్పి వెండియు నిట్లనియె. 191

తే అచట వాఁ డుండెను నిత్య । మమరతతులు
వాని సేవించుటకు మహా । భయముతోడ
గుంపులై యచ్చరలఁ గూడుకొని రయమ్ము
మీఱఁ బోవుచు నుందురు । మేకొనంగ 192

వ ఇట్లు పులస్త్యుఁడు చెప్పిన నారదుం డామునింజూచి 193

తే అలసుకేశిపురంబు సహస్రాంశుఁ డైన
కమలమిత్రుఁడు త్రోయ స్వర్గముననుండి
వసుధ నది త్రొట్రుపడుచును । బడె నటంచుఁ
జెప్పితివి దాని విన వేడ్క । చెలఁగె ననఘ!. 194

క. భవహర! సుకేశి యనువాఁ, డెవఁ డతఁ డెవ్వానివలన । నెట్టివరములం

ధ్రువముగఁ గొనె రవి వానిని, భువి నేలకొ త్రోసెఁ బలుకు పుణ్యనిధానా!

క. అన విని పులస్త్యుఁ డిట్లనె, మును నే విన్నట్టి నీకు మునుపటి దగునా
ఘనపుణ్యకథనుఁ జెప్పెద, మనసును సుస్థిరముఁ జేసి మానుగ వినుమా 196

— సుకేశిచరిత్రము —

సీ. అనఘ! విద్యుత్కేశి యని వినఁబడునట్టి దానవనాథుండు ధరణినుండె
నతనికి వరగుణుఁ డగుసుకేశి జనించి తపమున నంబికాధవునిఁ బ్రీతుఁ
గావింప నతనికిఁ గరళకంఠుఁ డజేయతను మఱి వైరిసంతతులచే న
వధ్యత్వమును వ్యోమవర్తియౌ పురమునుఁ గరమర్థి నిచ్చెఁ గౌతుకమున
ఆ. భవునిచేత నట్టివరములఁ గైకొని, నిత్యధర్మమార్గనిరతుఁ డగుచు
గగనపురమునందుఁ గర్బురేశులతోడ, వెలుఁగుచుండె వాఁడు విపులకీర్తి.

క. ఒకతఱి వాఁ డతివేడ్కం, బ్రకటితమగ ధాటవికిని బనిఁ గొని చని త
న్నికటమునఁ జూచె వరముని, నికరంబుల వారివైన నిలయములమునీ 198

చ. కని ప్రణుతించి వారిపదకంజయుగంబుల ముట్టి మ్రొక్కి త
న్మునిచయదత్తపీఠమున మోదముతో వసియించి నామనం
బునఁ గలశంక దీరుటకుఁ బూనికతో మిముఁ బ్రశ్నచేసెదం
బనిఁ గొని పల్కెఁ డీపరమపద్ధతిఁ జెప్పను ధాత్రి నేరికిన్ 199
తే. ఐహికాముష్మికములందు నధికమైన
మంగళం బెద్ది? దేనిచే మాన్యుఁ డగును?
పురుషుఁ డెద్దానితోఁ బుణ్యపురుషులందుఁ
బరమసుఖమునుఁ జెందునుఁ [illegible] మెఱయ' 200

క. అని యిట్లాతం డాడిన, విని పరమమునీంద్రు లపుడు వినువీథిని మే
దినిఁ గలపుణ్యార్థంబును, ఘనముగ వివరించి చెప్పఁ గడఁగిరి ప్రీతిన్ 201

మ. సురవైరీశ్వర! భూనభస్స్థలములన్ సొంపారుధర్మంబు సు
స్థిరమై దానిసమాశ్రయించి నరుఁ డుద్దీపింప సచ్ఛ్రేణిలో
వరపూజ్యుం డగుదానశర్మయుతుఁడై భాసిల్లు నట్లాటచేఁ
గర మొప్పారఁగ దానిఁ జేయఁదగు వేడ్కన్ మానవుల్ భక్తిమై 202

ఆ. ఇటుల మానులాడ హితముగ ననె వాఁడు, లలిని ధర్మ మెట్టిలక్షణములఁ
జెలఁగు దాని నెట్లు చేయనౌ ధర, దేని వలనఁ బ్రీతి సురలు వఱలుచుంద్రు

— ఋషులు సుకేశికి దేవాదులధర్మంబుఁ జెప్పుట. —

సీ. అట్టిడు దానిమహాదయఁ జెపుఁ దన నామును లాడి రాయనఘుతోడ
వేదతత్త్వజ్ఞత్వ విష్ణుపూజలు నిత్యయజ్ఞాదిక్రియ లమరులకును

బసిమధర్మములగుఁ బటుశక్తి మత్సరకలహకార్యములు శంకరుని భక్తి
దైత్యనాథులకెల్ల ధర్మమై యొప్పారు ననిశము సుస్థిర మైనయోగ

తే. దివ్యసిద్ధియు హరిమహాదేవపాద
భక్తియును వేదపఠనంబు పరమసిద్ధ
గణములకు మేటిపుణ్యమై గ్రాలు ననుచు
బలుకఁబడెఁ బండితులచేత భావ్య మగుచు 204

వ. దానవేంద్రా! సంగీతనృత్యవాద్యవిశేషములఁ జక్కఁగఁ దెలియుటయుఁ బలు
కులవెలంది పైఁ జలనములేనిభక్తియు శైలోత్కృష్టోపాసనంబు గంధర్వు
లకుఁ దగినధర్మము లని చెప్పంబడియె 205

క. గురువిద్యాశాలిత్వము, హరుపతిపై భక్తి యమిత మగుకెలివి మహా
పురుషోద్యోగము విద్యా, ధరులకుఁ దగినట్టి వైనధర్మములు సుమీ 206

తే. సకలగాంధర్వవిద్యావిశారదత్వ, మునుఁ బ్రభాకరభక్తియుఁ బూర్ణశిల్ప
కౌశలము కింపురుషులకుఁ గ్రాలునట్టి, ధర్మపద్ధతు లివి మహాధర్మచిత్త 207

క. సరవిన మానిత్వము సు, స్థిరయోగాభ్యాసరతియు స్వేచ్ఛాగతులం
దిరుగుటయుఁ బౌత్రికం బగు, వరధర్మ మటంచు పలుకఁబడె దైత్యేశా 208

క. జ్ఞానము ధర్మవిదిత్వము, మానుగ సద్బ్రహ్మచర్యమహితనియమము
ల్మానసజపయ్యము సత్యము, మానులకుం దగినధర్మ మార్గము లరయన్ 209

వ. దానవేశ్వరా! స్వాధ్యాయబ్రహ్మచర్యములు, దానయజనములు, నిర్గతాయా
సము, సర్వభూతసమబుద్ధియు, విగతలోభత్వము, దయాహింసాక్షమాదులు,
జితేంద్రియత్వము, సదాచారశుచిసంపత్తిభద్రంబులు, కేశవశంకరదేవీభాస్కర
పదభక్తిభజనంబులు మానవధర్మంబు లని చెప్పి వెండియు నిట్లనిరి. 210

క. ధనపత్వగర్వసుఖములు, ఘనశౌండీర్యంబు గరళకంఠుని పదసే
వనము గురువేదపఠనము, కన ధర్మము లౌను గుహ్యకశ్రేణి కిలన్. 211

తే. అన్యదారాభిమర్శిత్వ మభవపాద, భక్తిభావంబు పరధనాబద్ధయుక్తి
వేదపఠనంబు రాక్షసవీరులందు, నుండఁ దగుధర్మము లటంచు నుడువఁబడియె.

క. అవివేకాజ్ఞానంబు, ల్పవివిమలహైన్యం బసత్యపద్ధతి దుస్సం
భవమాంసగృధ్నుత్వము, భువిధర్మము లౌ పిశాచములకును వత్సా! 213

క. సదయుం డగువిధిచేతను, విహితంబుగ నిట్టిపుణ్యవిధములు తొలుతం
గదితములయ్యె సుగతికిని, బదునాలుగుయోనులందుఁ బాటింపంగన్. 214

క. నారద! యీచందంబున, వారాడిన దైత్యవిభుఁడు పలికెను భక్తిం
గోరిమి మీరాడిన వి, స్తారద్వాదశసుపుణ్యసరణులయందున్. 215

క. నరధర్మంబులఁ గ్రమ్మఱఁ, గరమర్థిం జెప్పఁ దనకుఁ । గరుణామతు లై
పరమమునీంద్రులు పలికిరి, సురవైరినిఁ జూచి యపుడు । సురుచిరతేజా. 216

— సప్తద్వీపపరిమాణముఁ జెప్పుట —

సీ. భూపృష్ఠతలమునఁ । బొలుపారుచున్నట్టి యేడుదీవులయందుఁ । గూడియున్న
ప్రజలకుఁ దగినట్టి । పరమధర్మంబుల నాలింపు మేబది । యైనకోట్ల
కొలఁదియోజనములఁ । గొమరారునట్టిదై ప్రాగినీజలమందు । నమరుచున్న
కలముచందంబునఁ । గమలమం దీభూమి పరఁగుచున్నది దాని । పైన దేవ
ఆ. నాథుఁ డైన నలువ । జగపతి యై తమ్మి, దుద్దువంటి రూపు । తోడ వెలుఁగు
కొండ నొకటి నునిచి । కూర్మి నల్లడల నీ, పుణ్యనరులనెల్లఁ । బుట్టఁజేసె 217

క. వ్యాపింప మరల సప్త, ద్వీపంబులు సృష్టిచేసె । దీపింపఁగ నా
ద్వీపములలోన జంబూ, ద్వీపముఁ బుట్టించె మంచి । దీవియుఁ గాఁగన్ 218

క. అది లక్షయోజనంబులఁ, బొదలునుఁ దద్విగుణ మగుచుఁ । బొరి బాహ్యమునం
గదిసికొని యుప్పుసంద్రము, వితతంబై వెలుఁగుచుండు । విశ్రుతచరితా 219

క. దానికి రెండంతలు నై, గానంబడుఁ బ్లక్షనామ । కద్వీపము ని
త్యానతమై యిక్షూదధి, దానికి రెట్టింపుఁ గలిగి । తనరుచు నుండున్ 220

సీ. పదియాఱులక్షల । పరిమితిగలయోజనంబులచే నీజ । గంబునందు
దీపించు శాల్మలీ । ద్వీపంబు వెలుపల దానికి నినుమడిఁ । దనరుఁ గల్లు
కడలి యాయుదధికిఁ । గన నిబ్బడియు నగుఁ గుశమనుద్వీపంబు । కొమరు మిగులు
నాదీవికంటె రెం । డంతలనిడివితో నాజ్యపారావార । మలరుచుండు
ఆ. దివిరి దానికన్న । ద్విగుణమై క్రౌంచాభి, ధానమైనదీవి । తనరుచుట్టి
దాని కినుమడింపఁ । దగునట్టి కొలఁతతో, దధిసముద్ర మొదవు । దైత్యనాథ!

క. ఆకడలికి నిబ్బడియై, శాకద్వీపంబు వెలుఁగు । సత్తమ మగుచుం
బ్రాకటమగు నాదీవికి, వీఁకఁ ద్విగుణత్వ మొప్పి । విష్ణుని కొలమిన్. 222

తే. స్థానమైనట్టి పాలసం । ద్రంబు వఱలు
నాయతంబునఁ దద్ద్విగు । ణాత్త మగుచుఁ
బుష్కరద్వీప మొప్పారుఁ । బుష్కరాబ్ధి
యలరు దానికి రెండంత । లగుచు బెరసి 223

సీ. తివిరి యాసాగర । ద్వీపములే పదికోట్లయోజనముల । కొలఁదిఁ గలుగుఁ
బొడవున నన్యోన్య । ముగ మీఱియుండునుఁ బొలకింధినిఁ జుట్టి । పంచకోటి
పరిమితిఁ బొడవునఁ । బొట్టిల్లుచును లక్షమండకటాహస । మ్మహిత మగుచుఁ
బుష్కరద్వీపంబు । పొదలు నీకైవడి ద్వీపంబు లీయేడు । లివురుచుండు
ఆ. వీనియందు ధర్మ । విధులు సత్క్రియలన్ని, వేలువేలుఁగాన । వెలయుచుండుఁ

గాన వాని నీకుఁ । గరమర్థిఁ బలికెద, నాలకింపు చిత్త । మలర నిపుడు 224

వ. దితిజాధిపా! ప్లక్షాదిశాకాంతద్వీపముల నుండుపురుషులు వీరులుఁ జిరకాల జీవితులు నై యుగప్రళయంబు నొందక జేజేలవలె సంతసించుచుండుదురు తద్ధర్మంబు లత్యుత్తమంబు లై యుండు వారికి. గల్పాంతమందుఁ బ్రళయంబు కలుగు భయదర్శనం బగుపుష్కరద్వీపమందు నివసించు ప్రజలు పైశాచధర్మాశ్రితు లై కల్పాంతమున నశించెద రన నతఁ డిట్లనియె. 225

క. ఆదీవి శౌచహీనము, నై దుర్దశవలనఁ జెలఁగి । యతిభీషణ మై
మేదిని నేలొకో కర్మం, బోదితనాశకమయ్యె । నోమునులారా! 226

ఉ. నావిని మౌను లాడి రసు। రాధిప! రాక్షసయుక్త మైన నా
దీవిని రౌరవాదు లగు। తిగ్మపుదుర్గతు లుంటచే మహా
దావసమానత న్దనరి । తద్దయు బుద్ధినిఁ జూడఁ బుష్కరం
బీవసుధాస్థలంబున న।హీనపుదుర్దశ మయ్యె దానిచేన్. 227

చ. అనిన సుకేశి యిట్లనియె । నామునివర్యులతోడ నెన్ని కై
తనరును ఘోరదుర్గతులు । తథ్యముగా నవి యెంతదవ్వునో
నొనరును వానిరూ పెటుల । నొప్పు నటన్న మునీంద్రు లాడి రిం
పున విను తత్ప్రమాణమును । బొల్పగురూపును దానవేశ్వరా! 228

నరకనిర్ణయము

క. గురుఘోరదుఃఖసంతతి, భరితాఖిలనిరయసంఖ్య । పరికింపంగా
నిరువదియొక్కటి చెలఁగును, బురుణింపఁగ వానియందుఁ । బుణ్యనిధానా. 229

సీ. ద్విసహస్రయోజనవి।స్తృతికలు లై ప్రజ్వలితాంగార।పరివృతంబు
నై రౌరవం బను।నరక మొప్పారును దద్ద్విగుణంబు నై । తప్తతామ్ర
మయభూమితోఁ గ్రింది।మంటతో గలిసి మహారౌరవంబు పొ।ల్పారుచుండు
దానికి నినుమడి । దర్పించి తామిస్రనిరయ మొప్పారు దా।నికిని ద్విగుణ

ఆ. తనుఁ జెలంగు నంధ।తామిస్రదుర్గతి, దానికంటె ద్విగుణ।మాన మగుచుఁ
గాలసూత్ర మొప్పు । గడిమిఁ దద్ద్విగుణమై, యప్రతిష్ఠనరక । మలరుచుండు

వ. పూర్వోక్తనరకమునకంటె నిబ్బడికొలందిని ఘటీయంత్ర ముండును ముప్పదిరెండువేలయోజనంబులపరిమితి నసిపత్రవనము వెలయు. ఇట్లేకోత్తరవృద్ధిసంఖ్యపరిమాణములై క్రమముగఁ దప్తకుంభ, కూటశాల్మలి, కరపత్ర, శ్వానభోజన, లోహపిండ, కరంభ, సికత, క్షారనదీ, క్రిమిభోజన, వైతరణీ, శోణితపూయసంశోషణ మనుపేరులతో నరకము లిరువదియొకటి యై యుండు నని చెప్పంబడెను

చ. అన విని దైత్యుఁ డామునుల । నందఱితో నను నెట్టిదా క్రియా
జనుఁ డురుదుర్గతిం బడును । సత్కృప దీనినిఁ బల్కుఁ డింపుతో

వినుటకు నామనంబు కడు । వేడుకఁ జెందె నటన్న మౌను లా
ఘనునికిఁ దద్విచారమును । గారిలిఁ జెప్పఁ దొడంగి రాయెడన్ 232

క. నరు లెట్టికర్మముల నే, నరకంబులఁ జేరుచుంద్రు । నలి నిజకర్మా
కరఫలభోగములౌ నట్టి, పొరిఁబోలి విను వానినెల్లఁ । బురుషశ్రేష్ఠా! 233

తే. దేవభూసురనిందచేఁ । దివురువారు, మొగిఁ బురాణేతిహాసార్థ । ముల నతృప్తు
లైనజనములు మఱి గురు । యజ్ఞ ధర్మ, నాశకులు చేరుచుందురు । నారకముల

క. యాజ్యాధ్యాపకజననీ, ప్రాజ్యసుహృజ్జనక రాజ । భృత్యసుహృత్స
త్పూజ్యాత్మజాలకుమిత్ర్యన్, వ్యాజ్యముఁ గావించు నరుఁడు । పడు నరకమునన్

చ. ఒకనికిఁ గన్య నిచ్చి మఱి । యొక్కని కాబిడనిచ్చు దుర్జన
ప్రకరముఁ బట్టి క్రూరకర । పత్త్రముతో యమభృత్యు లుగ్రులై
తికమకలాడుచుండ వడిఁ । దెంపున రెండుగఁ గోసి కోసి బ
ల్లకవికలై పడన్ ధరణిఁ గ్రక్కున । ద్రోతురు దైత్యశేఖరా! 236

తే. పరమచందనశిశుపశు । వ్యజనములను
శౌర్యముఁగఁ గొన్న క్రూరులు । సర్వమనుజ
తాపకరులైన చెడుఁగులు । తతకరంభ
సికతమనుదుర్గతినిఁ గూలి । చెడుదు రనఘ! 237

మ. ధరలో నెవ్వఁడు శ్రాద్ధపైతృకమహా । దైవత్యకార్యంబులం
దు రహిన్ జూడనిమంత్రితుండు నగుచున్ । దుర్బుద్ధియై యన్యమం
దిరమందున్ భుజియించెనేని కినుకన్ । దీక్ష్ణంబుగా ముక్కులన్
గరుడు లాగిని రెండుముక్కలుగ వే । డ్కం జీల్చి వైచు న్వడిన్ 238

ఉ. దాసబుధేంద్రమర్మముల । దారుణవాక్కులఁ గ్రుచ్చి నొవ్వఁగాఁ
జేసినవారిమీఁదఁబడి । చేవనుఁ బత్తులు వాఁడిముక్కులన్
గాసినిఁ జెందఁ ల్చుచును । గ్రక్కునఁ ద్రొక్కి ధరాస్థలంబునం
ద్రోసి వసించుచుండుఁ దగఁ । గ్రూరమనంబుల దైత్యశేఖరా! 239

సీ. పండితశ్రేణికిఁ । బైశున్య మొనరించునట్టి దురాత్ముని । నైనజిహ్వ
నశనితుల్యాస్యము । లౌ వాయసంబులు పట్టి లాగుచునుండుఁ । జౌరుషమునఁ
బితృమాతృగురులకు । భీతితోఁ దెగడికఁ గావించుపురుషులు । కడఁగి చర్మ
పూరితం బగుమూత్ర । పూయవిణ్ణారకంబునందుఁ గ్రుంకుచు నుందు । రధికముగను

తే. దేవతాభ్యాగతాతిథి । దివ్యమాతృ
పుత్త్రజనకాగ్నిభృత్యాది । భూతతతులు
కుడువకుండిన తఱి వారి । విడిచి తినిన
చెడుగు లెల్లరు యమపురి । చేరి మిగుల 240

క. పూయాసృగ్విష్ఠంబుల, నాయెడఁ దిని తుత్తురేఁగ । నద్రితనువులై
సాయకశిఖరాననముల, దాయుచుఁ బుట్టుదురు ఘోర। దానవనాథా! 241

తే. పంక్తిఁగాఁ గూరుచుండిన। ప్రజల కెలమి, భేదమున భోజనంబును। బెట్టినట్టి
ఖలుఁడు విడ్భోజనంబునై। క్రాలునట్టి, దుర్గతినిఁ జెందుచుండును। దురితదూర!

క. చేరి చని యన్న మడిగెడు, వారినిఁ బోడఁగాంచి వేలు। పలుపకఁ దారే
కోరి లిఖుజనులు శ్లేష్మా, దారాశనరకమందుఁ। దగ నుందు రొగిన్ 243

వ. సుకేశీ! గోబ్రాహ్మణాగ్నులపై నెంగిలివస్తువులఁ గోరి చల్లినపాపిజనులచేతులు మిగుల వేండ్రమగు తప్తకుంభనరకమందు నుంపఁబడు సూర్యచంద్రనక్షత్రముల మీఁదఁ గామించి యుచ్ఛిష్టముల నైచుదుర్జనుల కన్నులందు యమకింకరు లగ్నిఁ బ్రజ్వలింపఁ జేసెదరు మిత్రపత్నిని, జ్యేష్ఠసోదరునిఁ, జెల్లెండ్రను, జననీ జనకులనుఁ, బతివ్రతలను, గురువృద్ధులను, గాళ్ళఁదన్నిన ఖేదకర్ముల నర్కపుత్ర దూత లగ్నితప్తము లగునినుపగొలుసులతోఁ గట్టి మోకాళ్లవరకుఁ గాలునట్లు చేయుచు భయదమగు రౌరవనరకమునఁ ద్రోయుదురు పాయసమునుఁ, బులగ మును, మాంసమును వ్యర్థంబు గ్రహించి భక్షించు మందప్రజ్ఞులనోళ్లయందుఁ బెతరులదారదూతలు విచిత్రము లగుతప్తాయఃపిండముల నునిచెదరు దేవ గురుబ్రాహ్మణవేదముల నిందను విను దుర్జనులచెవులయందుఁ బ్రొద్దుపట్టి పరి చారకులు పావకతప్తారుణము లగునినుపమేఁకులతోఁ బలుమాఱులు పొడుచు చుందురు విప్రగృహంబులను, సభాలయంబులఁ, బావులనుఁ, జెఱువులనుఁ ద్రవ్వి చెఱుచునట్టి బాలిశులమేనులనుండుఁ చర్మముల గాలకింకరులు వాఁడి కత్తెరలతోఁ గత్తిరించెదరు గోబ్రాహ్మణార్కాగ్నులం దేమూఢులు కోరి వీర్య సేచనంబుఁ గావించెదరో వారిగుదద్వారము లనుండి కాకులు ప్రేఁగులను వెలుప లికి నీడ్చుచుండును స్వపోషణార్థమై వేదపడినపుత్రమిత్రకళత్రాదిబంధువర్గ ములఁ బరిత్యజించినమానవులు సాశ్వయోనియు నంధ్రమయు దుర్భిక్షయు ననుదుర్గతియందు నివసించెదరు 244

తే. శరణుఁ జొచ్చినదీనుఁ డౌ। జనునిబంధ, కత్వ మగుపాలనంబునఁ। గ్రాలఁజేసి
విడుచు జనములు పడుదురు। విపులయంత్ర, పీడనారకమందు వి। వేకధుర్య!

క. భూసుర హోమక్రియలను, భాసురమతిఁ జెఱుచునట్టి। వారి యమభటుల్
వేసరుచుండఁగ త్రాళ్లం, ద్రోసియుఁ జూర్ణంబు చేయు। దురు దైత్యేశా! 246

క. న్యాసాపహారులర్కజ, దాసోఘకరస్థనిగుడ। తాడితతనులై
గాసిల్లుచు క్షుత్తృష్ణా, వాసులు కుష్ఠక్షతాలు। భరితులు నగుచున్ 247

తే. వృశ్చికాసనములమీఁదఁ। బృథులదుఃఖ
మున వసింతురు ధరఁ। బర్వముల రమించు

చెనటి మనుజులు మఱి పరస్త్రీలఁ గూడు
వారిగతులను విను దైత్య। పార్థివేంద్ర 248

సీ. మలయుచుఁ గాఁటకాండ్లలిఁ గౌఁగిటనుఁ జేర్చి వర్తించుచుందురు। బహుళగతులఁ
గురులిరస్కారంబుఁ । గొమరొప్పఁ గావించి వేదమ్ముఁ జదివెడు । విమలవిప్ర
లతులకు గురుఁడు నై । తన రారుదుష్టుండు శిరముపై బరువగు। శిలనుఁ బూని
పొరిదుఃఖపడుచుండు । మూత్రవిణ్మేష్మవి షంబులు వారిలోఁ । జల్లు నతఁడు
తే ఘాయపూరితదుర్గంధ। మూత్రనరక, సహితులై బాధపడుదురు । శ్రాద్ధతిథికి
నీడుఁగాఁ దిన్న పూనవు। లెల్లవారి, పలలముల నిందు రన్యోన్య। భావసరణి

క. శ్రుతిజననీజనకులపై, సతతము విరసమున వఱలు । జడమతి వైవ
స్వతుభృత్యవితతిచే వడిఁ, బతితుం డగుచుండుఁ గొండ। పయినుండి ధరన్ 250

ఆ మారుమనువుతోడ । మహినొప్పమగువల
మగలుఁ గన్నుఁ జంపి । ములయు నరులు
మొనసి వారిగర్భ। ములఁ బోనొనర్చిన
జనులు క్రిములఁ దినుచు । జడియుచుంద్రు 251

క. చండాలాంత్యజు లిచ్చిన, దండిధనంబులు గ్రహించు। దాతయు ఋత్వి
గ్మండనుఁడును రాపులుఁగై, చండశ్రమముఁ జనించు । సౌజన్యనిధీ 252

తే పృష్ఠపలలాశినులు పర। భృతసుతీవ్ర
లైనమర్త్యులు వృకభక్ష। ణాత్తనరక
మందుఁ గాలునిదూతలు । కుంది త్రోయఁ
గష్టములు చెందుచుందురు । కర్బురేశ 253

సీ. కనకాపహారు లగు। కిష్టచరిత్రులు బ్రహ్మఘ్ను లైనట్టి । బాలిశులునుఁ
గల్లుఁ ద్రావెడిదుష్ట। కర్ములు గురుదారతోఁ గూడ రతిపల్పు । దురితమతులు
గోభూమిహర్తా। కుజనులు స్త్రీబాలగోఘ్నులై వెలసిన । కుటిలజనులు
గోవిక్రయులు గురు। కూటసత్యులు సోమవిక్రయులును వేద। వితతి నమ్ము
తే. విప్రులును శౌచహీనులు । విమలనిత్య, కర్మనాశులు కూటసా। క్ష్యముల నిచ్చు
నట్టివా రగుమర్త్యులు। కగుఫలంబుఁ, బలికెదము రాక్షసేశ్వర! । భక్తి వినుము

వ పది వేలవత్సరములదాఁక రౌరవనరకమందునుఁ, బది వేలహాయనంబులవఱకు
దా మిస్రనారకమందును, నల్లి యంధతామిస్రమందున నక్కువడిఁ బిదప నసి
పత్రవననరకమునఁ ద ఱ్వాతంబున ఘటీయంత్రదుర్గతియందునుఁ, దగ్రీలిం దప్త
కుంభమందును గ్రమక్రమంబున నొకదాని వెనుక నొకదానిం జేరి యారాచరించిన
దుష్కృతములకుఁ దగినఫలంబుల ననుభవించుచుందురు నీవడిగిన నరకములస్థి
తుల నెల్ల వివరించి చెప్పితి మని వెండియు నిట్లనిరి 255

క. అంగదనిరయస్థితి యీ, సంగతిమై నుండజనులు । జడమతితోడన్
వెంగలు లగుదురు మఱియొక, భంగిని బలి రేదము వినుము । భావం బలరన్

సీ. అమరులలోన శ్రీ।హరియుఁ గొండలయందు నచలాధిపతియాగు।ధాళియందుఁ
జక్రంబు పక్షిసం।చయమందు ఖగపతి కుండలితతులందు । గుండలీశుఁ
డఖిలధాతములందు । నవనిజము నదులందు స్వర్ణదియును జల।జంబులందుఁ
బద్మంబు రాక్షస।వరులలో హరిపదభక్తుండు భూస్థలిఁ । బరఁగు వాస
తే. ములనుఁ గురుజాంగలంబనుఁ । బుణ్యభూమి
తీర్థములలోనఁ బృథుజల।తీర్థవరము
సరసులం దొగిమానస।సరసు సకల
లోకములలోనఁ బరమేష్ఠి । లోక మనఘ 257

తే. పుణ్యములయందు సత్యంబు । భూరియజ్ఞ
భాగముల నశ్వమేధంబు । పుత్త్రులందు
నౌరసుండును మౌనుల । యం దగస్త్యుఁ
డాగమంబులలో శ్రుతి । యధిక మరయ 258

క. తారలలోఁ జంద్రుండును, భూరిహ్రదంబుల సముద్ర । మును విబుధులలో
నారయఁ బురుహూతుండును, వారక తేజస్వివరుల । భానుఁడు సుండీ! 259

వ. పురాణములయందు మాత్స్యంబును, సంహితలలో బ్రహ్మసంహితయు, స్మృతు
లందు మనుస్మృతియు, శ్రేష్ఠంబు లై యుండు మఱియు 260

క. సురవైరులందు నీవును, వరపాశములందు నాగ । పాశము గురు సు
స్థిర మెందు బంధనంబును, ధరఁగలధాన్యముల శాలి । ధాన్యము వినుమీ

వ. మనుష్యులయందు బ్రాహ్మణుండును, నాలుగుకాళ్ళజంతువులలో ధేనువును, మృగములందు సింగంబుఁ, బుష్పముల జాజియు, నగరంబులందుఁ గాంచీనగరంబును, సుదతులలో రంభయు, నాశ్రమములందు గృహస్థాశ్రమంబును, బురములలోఁ గుశస్థలియు, దేశములందు మధ్యదేశంబును, ఫలములఁ జూతఫలంబును, మొగ్గలలోఁ గోశంబును, సకలౌషధులందుఁ బథ్యంబును, దుంపలం గందయు, రోగములలో నతిసారంబునుఁ, దెల్లనివస్తువులయందుఁ బాలును, వస్త్రములలోపల నూలుగుడ్డయుఁ, గాలములో గణితజ్ఞతయు, విచిత్రజ్ఞానముల నైంద్రజాలంబును, శాకములయందుఁ గాచమాచియు, షడ్రసములలో లవణంబును, ఫలంబులందు దాళిఫలంబును, సరోవరంబులఁ బంపయు, వానరులలోపల జాంబవంతుండును, వృక్షములయందు వటవృక్షంబును, విజ్ఞానులలో శంకరుండును, సతులలోఁ బర్వతరాజపుత్త్రియు, ధేనువులందు గపిలధేనువు, వృషభములఁ గృష్ణవృషభంబును, శ్రేష్ఠంబు లైనమాడ్కి దుస్సహంబులును

దుర్గములు నగురౌరవాదినరకములలో వైతరణియు మిగుల గురుతరంబయి యొ
ప్పుచుండును సకలపాపిష్ఠజనంబులందుఁ గృతఘ్నుండు గొప్పవాఁడు గోబ్రాహ్మ
ణహత్యఁ గావించినవారికిఁ బ్రాయశ్చిత్తంబు కలదు కాని మిత్రకార్యద్రోహికి నె
న్నఁటికైనఁ బ్రాయశ్చిత్తంబు కలుగదని నొడువు మునులకు సుకేశి యిట్లనియె

## జంబూద్వీపవర్ణనము

క. మునులారా! మీచేతను, ఘనపుష్కరఘోరతతులు । గడముట్టగ విం
టిని జంబూద్వీపస్థితి, వినియెదఁ గర్ణేంద్రియముల । వేడ్కలూర 263
క. అని విని వారాదనుజునిఁ, గని ముదమునఁ బలికి రపుడు । కరుణావంతుల్
విను జంబూ ద్వీపస్థితి, మనమును నిర్మలము సేసి । మాన్యచరిత్రా 264
క. భువికాకరమై కడిమిఁ, బ్రవిమలస్వర్గాపవర్గ । ఫలదం బగుచు
న్నవవిధ వైశాల్యంబున, భువి నగి యొప్పారుచుండుఁ । బుణ్యనిధానా 265
సీ. ఆదీవిఁ బ్రాగంత్యభవం దద్భుతం బైన భద్రాశ్వవర్షంబు । పరఁగుచుండు
వలి నగ్ని దెస హిర । ణ్మయవర్ష మలరారు దక్షిణంబున భార । తంబు చెలఁగు
నసురదిక్కున హరి । హావణించుచుండుఁ గి లాలేశుదెసఁ గేతు । మాల మొనరుఁ
గరువలిదిశఁ జంప । కం బొప్పు నుత్తర దెస గురువర్షంబు । తేజరిల్లుఁ
తే. బొసఁగు నీశాన్యమందుఁ గిం । పురుష వర్ష
మతులకాంతి నిలావృత । మంతరమున
నింపుగొనుండు నీరీతి । నెసఁగి యిపుడు
రమ్యగుణసాంద్ర । రాక్షసరాజచంద్ర! 266
క. ఈతొమ్మిదివర్షంబులు, చేతఃప్రీతివము లగుచుఁ । జిరపుణ్యము లై
ఖ్యాతిగఁ బరస్పరం బొగి, నీతీరున వెలయుచుండుఁ । బృథుదీప్తిమెయిన్ 267
వ. సుకేశీ! భారతవర్షంబు దప్పఁ దక్కినభద్రాశ్వాద్యష్టవర్షములందు యుగా
వస్థయు జరామృత్యుభయంబులును లేవు వానికి సుఖప్రాయ మగుస్వాభావిక
సిద్ధియు శ్రేష్ఠమధ్యమాధమంబు లేవి యునుఁ గలుగవు నవద్వీపయుక్త మగు
భారతవర్షమం దింద్రకశేరూతామ్రపర్ణగభస్తిమన్నాగ కటాహసింహలవారు
ణము లనునామంబులతో నొప్పు నీయునిమిదిద్వీపములు కడలి నడుమ నున్న
వగుటం జేసి పరస్పరమగవ్యము లై చెలంగెను తొమ్మిదవది యగుభారతంబు
సముద్రముచే జుట్టఁబడి కుమారాఖ్య నలరారి దక్షిణోత్తరవిస్తృతం బై రాజి
ల్లుచున్నది దానియందు వినుము. 268
ఆ. తెవిరి తూర్పుతుదను । దృఢవీర్యు లైన కి
రాతు లుంద్రు పడమ । రను విశేష
ధీరు లైనయవన । వీరులు కల రాంధ్రు
లధివసింత్రు దక్షి । ణాశయందు. 269

క ఉత్తరమందుఁ దురుష్కుల, మొత్తం బొప్పారుచుండు । ముద మొదవఁగ వి
ప్రోత్తమ నృపవిట్శూద్రక, సత్తములునుఁ గలరు నడుమ । సౌజన్యనిధీ 270

క ఈనాలుగుజాతులు కల, మానవు లిజ్యాదిపాల్య । మానితసేవా
ధానత్వవృత్తు లొప్పఁగ, మానుగ వెలఁగుదురు మైత్రి । మహితాత్ములు నై.

క నా నాపవర్గగతియుం, బ్రాకటముగఁ బుణ్యపాప । ఫలభోగత్వ
శ్రీకరసుఖములు వారికిఁ, జేకూరు నటంచు నమ్మఁ । జెల్లు సురారీ 272

ఆ మలయవింధ్యసహ్య । మాహేంద్రశుక్తిమం
తములు పారియాత్ర । తతనగంబు
ఋక్షభూధ్ర మనఁగ । నివె కులగిరు లని
తలఁతు రమలమతులు । దైత్యనాథ 273

ఉ కులగిరిపార్శ్వభాగములఁ । గోటికి మించిన కొండలుండు ని
ర్మలజలధారలం దనరి । మానవవైభవకారణంబు లై
సలలితసానుసంహతులఁ । జక్కఁగఁ గన్నులరారి సుప్రభం
గలిగి మహోన్నతత్వమును । గాంచి సురాళుల కాలయంబులై. 274

సీ మైనాకదుర్ధర । మందరవైద్యుత వైభ్రాజరైవత । వాతధామ
కోలాహలజయంతి । కుధరము లారుష్య మూకపుష్పగిరులు । బూజ్యచిత్ర
కూటంబు గోమంత । గోవర్ధనాద్రులు సరసతుంగప్రస్థ । శైలములును,
చిత్రకోకణములు । శ్రీపర్వతము ధాత్రి విఖ్యాతిమీఱఁగా । వెలయుచుండు
తే మఱియు నెక్కుడిఁ గలవు ధ । రాధరమ్ము
లవియుఁ జోడవుఁ బొడవున । నధికమైన
పేరునుఁ బ్రతిష్ఠయును లేక । పృథివిలోన
బరఁగుచుండును నిత్యము । భవవిదూర 275

చ జనపదసంఘ మీగిరుల । సన్నిధి నార్యులమ్లేచ్ఛజాతులం
దనరును భూరిభూధరవి । తానవినిర్గతసత్తరంగిణీ
వనములఁ ద్రావి సల్లలిత । భావులు నై జను లుందు రానదు
ల్వననిధిఁ జేరుచుండు విను । వానిని వేడ్కను దైత్యశేఖరా. 276

సీ. జహ్నుకన్యాసర । స్వతులు కాళిందియుఁ జంద్రకేశావతీ । సరయువులును
బాహుదా కౌశికు । ల్బరఁగును సీరయుధాలికీయమునలు । తగదృషద్వ
తియు శతద్రువు గోమ । తియు గండకియు నన బడునదు లాగి భవ్య । పర్వతేశ
పార్శ్వస్థపర్వత । ప్రసృతములునుఁ బుణ్య కరములు పానయో । గ్యములు నగుచు
ఆ నఖిలపాపహరము । లై తనరారుచు, గమనమహిమవలనఁ । గడలియందుఁ
గలియుచుండు నెపుడు । గడువడితో మీఱి, దనుజలోకపాల । ధర్మశీల!

సీ. వేదసినివిదిశ వేదస్మృతియు సింధు పర్ణాసశరములు వైణుమతియుఁ గ్రయును
గరతోయయుఁ బిశాచికయు మహానదియు వృత్రఘ్నినందినులుచర్మణ్వతి
సంతతనీరయుఁ జాలుతీప్రానది పారియాత్రాద్రిసంభవములరయ్యెఁ
జిత్రకూటక్రియా చిత్రోత్పలంబులు శోణమహానద సురసదేవి
ఆ. కలును మఱియు త్రిదివ క్రమువిపాశలు, నర్మదయు గశార్ణ నదియుఁ దమస
మధురసలిలపెవ్య మందాకినులు బుతు, గోత్రజములు సగుచు గువలయమున

క. వరవల్గువాహినులు నై, పరిపరివిధములను బాఱి వననిధిలోనం
సరగునఁ జేరుచు నుండును, గరమరుదుగ నెపుడు చూడఁ గలుషవిదూరా.

సీ. విశయుఁ బయోష్ణిని ర్వింధ్యలు తాపియు వైతరణియు రేవ వాసిలాన
దియు సినీబాహున దియు వేణనిషధలు, తోయగౌరి ఘన దుర్గనదులు
వరకుముద్వతియును బదినాల్గులటనులు, విధ్యాంఘ్రిజంబు లై వెలయుచుండు
వాహ్యయు మఱిసరి ద్వతియు గోదావరి, దుగ్ధోదయయు లస త్తుంగభద్ర
తే. భీమరథ కృష్ణవేణి కా వేరి సుప్ర
యోగ విశ లనునదు లతి యోగ్యజలము
కలిగి సహ్యాద్రిలోఁబుట్టి గాఢగతిని
వసుధపైఁ బాఱి కంధిలోఁ బడును దైత్య 280

క. కృతమాల, తామ్రపర్ణియుఁ, దతవంజుళ శునిసుదామ తటునులు మఱివి
స్తృతి నుత్పలావతియుఁ దగ, సతతము శుక్తియనుకొండ సరవిఁ జనించుం

ఉ. ఈనదులన్నియుం జగతి నింపగుతల్లులు నై సుపుణ్యవి
జ్ఞానఫలప్రదంబులయి కమ్రజలంబుల నొప్పి కంధిసం
ధానవిశేషమార్గములఁ దద్దయుఁ జెన్నలరారి విస్తృతిం
బూని విరాజమానలయి భూమిని బాఱును దానవేశ్వరా 282

క. మఱికొన్ని యేరు లచ్చట, నిఱివిఁగఁ బ్రవహించుచుండు వేలకొలఁదిగాఁ
బఱికింపఁ గొన్ని వానను, విఱుగడ లేకుండఁ బాఱు వింతఁ దలిర్పం. 283

క. ఇవి మధ్యమజనపదసం, భవములు నై మనుజతతికిఁ బానార్హము లౌ
భువనములఁ గ్రాలి దీప్తిం, భువిలో నలరారుచుండు బుణ్యనిధానా 284

సీ. ఆనదీతీరంబులందుఁ గుశూద్రంబుఁ, బాంచాల, కాశిక, బర్బరకురు,
మర్మక, వృక, శాక మాత్రేయములుఁ గళిం, గాంగ, వంగంబులు రంగుమీఱు
మధ్యదేశంబు లై మలయు నాభీరంబు, బాహ్లీక, పల్లవ, వాటధాన,
శార్యధానక, భవ్య, సౌవీర భద్రక, కాలతోయద, ఖేట కములు భూరి
తే. శూద్ర, గాంధార, యవనులు సౌరిది మిగులు
విలసదపరాంత, మాళర, విపులసింధు

కమ్రపారావతకమూషి । కములు, దరద
దివ్యశాత్ద్రవములును । దివిరి మఱియు. 285

వ. లలిత్థో, దకథార, కేకయ, దంశనులును, బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రజన
పదంబులును, గాంధోజా, ఒగ, లోలిక, వేణు, తుషార, బహ్లధబాహ్యతో
ద, రాత్రేయ, భరద్వాజ, ప్రస్థాల, దశేరక, లంపాకా, వకా, రామ, చూడి
కా, లసా, విభద్రలునుఁ, దామపకర్మ మార్గములు కలకిరాతజాతిదేశంబులును,
గణక, కులూతి, కుహిక, యూర్ణపాద, కుక్కుట, మాండవ్య, పాణవీయ
మూర్ణ లనునివి యుత్తరదిక్కున నుండుదేశము లని తెలియుము; అంగ, వంగ,
మద్గు, రాంతర్గిరి, బహిర్గిరులునుఁ బ్రవంగ, వంగేయ, మాంసాద, బలదంతిక,
బ్రహ్మోత్తర, ప్రావిజయ, భార్గవాం, గేయ, మర్షక, ప్రాగ్జ్యోతిష, వృషఘ్న,
విదేహ, తామ్రలిప్తక, మాళవ, మగధ, మానందినులను నివి యూర్ప్వదేశము
లై భాసిల్లును పుండ్ర, కేరళ, చోళ, కుల్య, జానుక, మూషికాద, కుమార,
దామహాశక, మహారాష్ట్ర, మాహిషిక, కళింగా, భీర, వైసక్య, శబర, పుళింద,
విదర్భ, వింధ్యశైలేయ, దండక, పౌరిక, సారికా, శ్మక, భోగవర్ధన, నైమిక,
కుంతలాంధ్ర, కుళింద, నల, మారిపాదులు దక్షిణభాగంబునుండి పశ్చిమ
ప్రాంతవ్యాప్తంబు లగుదేశంబు లై యొప్పారును. శూర్పార, వారిధాన,
దుర్గా, వికట, పుళేయా, సినీల, తాపస, తామస, కారస్కరంబులు, భీమినీ,
నాసికాదినర్మదాదక్షిణభాగస్థదేశంబులును, వారుకచ్ఛ, సుమాహేయ, సార
స్వత, వాత్సీయ, సురాష్ట్ర, వంత్య, ర్బుదంబు లనుజనపదంబులు పడమరదెస
నుండునవి యని భావింపుము కారూ, షైకలవ్య, మేకలా, త్తమర్ణ, దశార్ణ,
గోప్త, కికరవ, తోశల, కోశల, త్రైపుర, ఖైల్లిశ, తురగ, తుంబుర, నైషధా,
నూప, తుండికేర, వీతిహోత్రా, వంతు లనుజనపదంబులు వింధ్యమూలస్థంబులై
యుండు మఱియుఁ బర్వతాశ్రయంబుఁ గలిగి నీరాహార, హంసమార్గ, కుపథ,
తంగణ, ఖశలకుపధలును, అప్రావరంబు లగుమాళ్గా, ప్లుష్ట, సుహోవాలుక,
త్రిగర్త, కిరాత, తోమర, శిశిఖాద్రులాద్యంతస్థము లై ప్రతిభాసిల్లుచుండును.

క. దనుజ! కుమారద్వీపము, ననుగలవిషయంబు లివియె । నర్మిలి నింకఁ
మునుకొని తద్దేశంబులఁ, దనరెడిధర్మముల వినుము । తద్దయు భక్తిఁ. 287

క. మానుగసత్యాహింసలు, దానా స్తేయములు శాంతి । దమశౌచతపో
దీనకృపణతలు పది యివి, మానవులకు దగినధర్మ । మార్గములు సుమీ. 288

తే. ఆశ్రమచతుష్టయంబిది । యవనియందు
విప్రులకు మాత్రమే కల్గు । విహిత మగుచు
నసఁగ దైత్యుఁడు పల్కెడ । దాశ్రమత్వ
సరణి నెఱిఁగింపుఁ డన వారు । సంతసమున. 289

**చతురాశ్రమపద్ధతి**

చ. మన మలరార నిట్లనిరి । మౌనులు గ విప్రుడు దీక్షమై గృతో
పనయనుడై తమింగురుని । వాసమునం దొగి బ్రహ్మచారి యై
వినయము మీఱ నుండదగు । వేసట లేకటవాడు నిత్యముం
బని గొని చేయు కార్యముల । బాగుగ బల్కెద మాలకింపుమా 290

ఆ. మొదట గుర్వనుజ్ఞ । బడిలంబుగా గొని
స్నాతుడగుచు నగ్ని । జాల గొలిచి
తిరిపె మైనకూడు । దినియు నధ్యయనంబు
జేయు చుండవలయు । స్థిరమనీష 291

చ. కరమెదభక్తితోడ గురు । కార్యములందు బ్రయత్నయుక్తుడై
నిరతమునుండి తద్గురుడు । నెమ్మిని రమ్మని నంత వచ్చి సు
స్థిరమతి నాల్గువేదముల । దృప్తిమెయిం బఠియించి దక్షిణల్
సారిబారి నిచ్చి పిమ్మటను । బొందుగ నాజ్ఞను జెంది పూన్కితోన్. 292

క. విమలగృహస్థాశ్రమకా, మముతో గార్హస్థ్య మూని । మహి నుండదగున్
సుమహితవానప్రస్థా, శ్రమమందు ద్విజుండు పిదప । జరియింపవలెన్ 293

క. తన కిష్టమైనయెడలం, బని గొని చతురాశ్రమత్వ । పద్ధతినుండం
దనరును దానిం గొను ఘనుఁ, డునికిం గురుగృహమునందు । నొగి జేయనగున్

తే. గురుడు లేకుండెనేని త । ద్గురునిపుత్రు
డతడు లేకున్న దచ్ఛిష్యు । డగును గురుడు
కాన వారిని బూజించి । గర్వ ముడిగి
ధాత్రిపై బ్రహ్మచారి యై । తనరు టొప్పు 295

క. సారెకు విప్రుం డీగతి, దారుణమృత్యువును గెలుచు । ధర్మపై దానన్
భూరిగృహస్థాశ్రమకాం, ఊరతి కోఁ జెలగి తోష । సహితుం డగున్ 296

క. అతులార్ష కులజకన్యను, గుతుకంబున బెండ్లి చేసి । కొని నిజకర్మా
ర్జితధనమున బితృగణముల, నతిథుల బ్రీతులను జేయ । నా సద్భక్తిన్. 297

తే. అనిన వాడాడె మునులతో । ననఘులార!
లలితమైన సదాచార । లక్షణంబు
వినుటకును గోర్కె కలిగెను । వేడ్క దాని
బలుకు డన వారు నుడివిరి । ప్రమద మలర 298

**మునులు సుకేశికి సదాచారవిధిని తెల్పుట.**

క. తనరెడి నడవడికను నీ, కును జెప్పితి మింక వాని । గుణముల నెల్లం
బనిగొని పలికెద మీయెడ, విను సుస్థిరమనమునన్ వి । వేకనిధానా 299

తే. మొనసి గేస్తు సదాచార । మును నిరూఢిఁ
గానఁ బాలింప వగునట్లు । కానియెడల
నుభయలోకంబులందు శు । భోన్నతత్వ
సరణి కలుగదు వానికి । జతురధిషణ! 300

క. నడవడిక లేక మెలఁగెడు, జడునికి నేరీతిఁగల్లు । జగతిం జూడం
గడిమిఁ దపోసుఖదానము, లుడుగని కిలిమియును మఱియు । నుత్సాహంబుల్

క. కోరిక నాచరణంబును, వారనిగతిఁ జేయవలయు । బనిఁగొని మనుజుం
డారయ నది దుర్లక్షణ, భారముఁ దొలగించు నిజము । భావవిదూరా 302

క. కావునఁ దల్లక్షణమును, భావించియుఁ బలుకుచున్న । వారము దానన్
భావం బలరఁగ విను మది, పావన మగుపదము నొసఁగు । భాసురమూర్తీ 303

ఆ. పుణ్యభోక్తరైన । పురుషునిచే సదా
చార మనెడికల్ప । శాఖిసేవ్య
మగును నరుఁడు రేయి । యరిగెడుతఱిఁ బ్రబు
ద్ధుఁడు నగుచుఁ దొలుత । దైత్యనాథ 304

ఉ. దేవతల న్మునీశ్వరుల । దివ్యుల వేఁకువవేళ నిత్యమున్
భావమునన్ స్మరింప నగు । భావజవైరి వచించినట్లు తా
వావిరిభక్తితోడనుఁ బ్ర । భాతికముం బఠియింప నౌ నసం
గా విని దైత్యుఁ డిట్టులనె । గాఢతరప్రమదంబు మీఱఁగన్ 305

చ. నరుఁడు ప్రభాతకాలమున । నర్మిలిఁ దేనిఁ బఠించి ఘోరమౌ
దురితమునుండి త్రోయఁబడి । తోషముఁ జెందునొ శంకరోక్తమై
పరఁగినతత్ప్రభాతమును । బాగుగఁ బల్కుఁడటంచు వేఁడ నా
పరమమునీంద్రు లద్దనుజ । పాలునితో వచియించి రత్తఱిన్ 306

సీ. కర్బురేశ్వర! విను । గరళకంఠోక్తమై యొనరు ప్రభాతంబు । నుత్సవమున
దాని భక్తిని విన్నఁ । దద్దయుఁ దలఁచినఁ బలికినఁ బాపంబు । పాఱిపోవు
హరిహరబ్రహ్మలు । హరి దశ్వచంద్రులు కుజబుధశుక్రులు । గురుఁడు శనియు
గౌతమాంగిరసులుఁ । గ్రతువసిష్ఠపులస్త్య । రిపురైభ్యకణ్వ మరీచి పులహు

తే. లాసురి సనత్కుమారులు । వాసి భృగుఁడు
భవ్యసనకసనందను । లురసనాత
నాఖ్యఁ గలవానియుఁ బ్రభాత । సౌఖ్యఫలము
నొసఁగుదురు గాత వీరు మ । హోన్నతిఁగను 307

వ. మఱియు భూజలాగ్నిపవనాకాశమహత్తులును సప్తద్వీపసప్తరసాతలసప్తార్ణవ
సప్తకులాచలసప్తర్షిసప్తద్వీపసప్తలోకాదులు ప్రాభాతికశర్మఫలంబు నా కొసఁ
గుదురుఁగాత! 308

క అని మదిని శ్రద్ధమీఱఁగ, ననఘుంబును బావనంబు । నగు నీనుతి భ
క్తిని వేఁడువఁ జదివిన విని, ననుభగవత్కృపను స్వప్న । నాశము గలుగున్.

మ నరుఁ డామీఁదను శయ్యనుండి కడువి । న్నాణంబుఁగా లేచి సు
స్థిరధర్మంబును నర్థముం దలఁపుచున్ । శ్రీనాథ! దామోదరా!
పరమానందకరా! పరాత్పర! హరీ! । పాలింపుమం చాడుచుం
జోరి విణ్మూత్రవిసర్జనంబు సలుపన్ । బో నైను దైత్యోత్తమా! 310

క భూసురగురువైశ్యావర, భాసురసుర రాజ రాజ । పద్ధతులందున్
భాసిలుఁ జతుష్పథంబుల, దాసజనాదులు వసించు । దారులయందున్ 311

క తూరుపు పడమర దిశలుం, జేరిన భువిమీఁద । నాలుచేరెడుపట్టుం
గోరి యట త్సర్గంబును, వారక యెవ్వాఁడు చేయ । వల దని రాద్యుల్ 312

తే. సంతతాచారవిదుఁడైన । జనునిచేత, నెలమి వల్మీకమృత్తు గ్ర । హింప నగును
మూషికబిలాదిభూములఁ । బొదలుచట్టి, వలదు శుద్ధికి నెప్పుడు । వాస్తవముగ

తే మూఁడుతడవలు గుహ్యంబు । నేడుసార్లు
కాళ్లు నొక తేప లింగంబుఁ । గడిగి హస్త
ములను బదితూర్లు మృత్తుచేఁ । బొసఁగఁ జేసి
శుద్ధిఁ గావించు టొప్పు వి । శుద్ధచరిత 314

తే బుధుఁడు పదశుద్ధిఁ గావించి । భూతలమున
నుత్తరప్రాఙ్ముఖుండునై । యుపవసించి
నురుగు లేనట్టి నీటిచే । నోరుఁ గడిగి
నలిఁ ద్రిరావృత్తి నాచమ । నంబు చేసి 315

సీ తనహస్తమునఁ దలఁ । దాఁకి వెండ్రుకలనుఁ బడఁ ద్రిప్పి దంతధా । వన మొనర్చి
దర్పణంబును గని । తల తడియఁగఁగాని కంఠంబువఱకును । గాని నీటఁ
మునిఁగి సంధ్యను వార్చి । మనుకొని జలమునఁ బితృదేవపూజఁ గా । వించిహోమ
మునుఁ జేసి పిమ్మట । మోదంబుతో శుభకారణకరములై । క్రాలుచున్న

తే ధేనుదూర్వల లాజలఁ । దృష్టి గోమ, యమును మఱి స్వస్తికోదక । విమలకుంభ
విప్రకన్యాతుతార్క్ష్యుల । వృషభపుష్ప,చందనాశ్వత్థమధువాలు తా । శనుల ననఘ

ఆ నెమ్మి దర్శించి పిమ్మట । నిజకులోచి, తంబు నా ధర్మమునుఁ జేయఁ । దగును దేశ
మం దనుష్ఠింపఁ దగినవై । యలరు గాత్ర, వంశధర్మంబులను విడు । వంగరాదు

వ సుకేశీ, సాధుజను గట్టిధర్మమ్మున ధనార్జనముఁ జేయందగు నెన్నఁడేనియు దురా
లాప మగునదియు, సత్యము గానిదియు, శాస్త్రాగమహీనమైన కఠినపుమాట
నాడరాదు, ధర్మధ్వంసమునుఁ బరనిందయుఁ జేయఁదగదు దుర్జనగోష్ఠికూడదు.

క తగదు రతి నీటియందును, వెగటుగ వెలుపల వసించు । వెలఁదులయందుం

పగలందు సంధ్యలందును, నగుమొగములఁ దెగడు పరుల నారులయందున్

క. ఇమ్మహిఁ గేస్తుఁడు పశునా, శమ్మును స్వేచ్ఛావిహార సద్ధర్మములన్
వమ్మునఁ జేయంచగ దని, సమ్మతిఁ బలికిరి బుధేంద్ర సంఘములసురా! 320

తే. వ్యర్థసంచారమునఁ గీడు వచ్చు, వ్యర్థ
దానమున విత్తమంతయు ధ్వంస మగును
జీవహింసనుఁ గావించు చెనటి నరుఁడు
దుర్గతినిఁ గూలి బాధలఁ దొట్రుపడును 321

సీ. పరకళత్రంబుల బట్టి భోగించిన నరయ భీత్తవ్య మై నట్టి వర్ణ
సంకరభయ మొక్క జగతి దాన జనించు సంతానమెల్లను శ్లాఘ్య మగునుఁ
బరకళత్రంబులు పరవిత్తములు మృత్యునిరయప్రదంబులై నెగడుచుంట
వానిఁ గోరిన కీడు వచ్చు నిక్కము గాను మఱి దిగంబర యగు మగువఁ జూడఁ

ఆ. దగదు దొంగనపతిఁ దన రాజు నగునితో, నాపరాదు మొట్టు దైన బోటిఁ
దాఁకరాదు దాని దర్శింపఁ గూడదు, మాటలాడఁ దగదు మహితచరిత

ఆ. చేరి పుట్టినట్టి చెల్లెండ్రతోఁ బిన, తల్లితోడఁ బరుని దారతోడ
నాత్మ దుహితతోడ నైకమత్యంబుగా, నొక్కపీఠమందు నుండఁదగదు

క. ధరణి దిగంబరు డై పు, ష్కరములఁ దోఁగుటయు వఱియుఁ బోలుపుగ నట్టే
నిరతాటనశయనస్థితిఁ, బురుషుఁడు వర్తింపఁ దగడుఁ బుణ్యనిధానా 324

వ. అకారణంబునఁ బరిశుద్ధికి భిన్నశయ్యాసనభాజనంబులు వర్జనీయము లై యుండు నాభౌమవారములయందును, చిత్రాహస్తశ్రవణనక్షత్రములందును, నందతిథులయం దభ్యంగము సేయఁదగదు శుక్రవారంబందును రిక్తతిథులలోనుఁ జిత్రావిశాఖాఫల్గునీకృత్తికానక్షత్రముల క్షౌరంబు సేయనికిరాదు శనివారమందును జయతిథులను మూలమృగశీర్షపూర్వాభాద్రానక్షత్రంబులందును మాంసము దినఁ దగదు బుధవారమందుఁ బూర్ణతిథులందు నుత్తరాకృత్తికోత్తరనక్షత్రములయందు స్త్రీసంగమంబు త్యజింప నగును సోమగురువారముల భద్రతిథుల నన్ని కార్యము లాచరింప నగును 325

తే. పశ్చిమోత్తరశీర్షుఁ డై వసుధ నెప్పుడుఁ
బవ్వళించుట సరిగాదు పాలి మెఱసి
పరఁగఁ బశ్చిమదక్షిణ వదనుఁ డగుచు
నరుఁడు భుజియింపరాదు దానవకులేశ 326

క. గురువిద్యాధికుఁ డగుప, ద్గురుసంబరవసనచైత్య కుటజంబులు ని
ర్జరగృహములు శుద్ధాన్నము, ధరపై బుధవరుల చేత ధార్యములు సుమీ

క. తలఁ దడియునట్లు నిత్యము, జలమున గ్రుంకుటయు నాని శిలలోపల వెం
గలి యై నిష్కారణముగ, జలకముఁ గావింపఁదగదు సౌజన్యనిధీ! 328

తే. విధుఁడు జన్మర్క్షగతుఁడైన । వేళఁ దప్ప
జనుఁడు గ్రహణంబులందు స్వ । జనవినాశ
కాలములయందుఁ దైలంబుఁ । గాయకేశ
ములకు రాచి జలంబుల । మునుఁగఁదగదు 329

చ. వనములఁ గ్రుంకి గాత్రముల । వస్త్రముతోఁ దుడువంగరాదు గో
మనుజవరేశ యాత్తమగు । మంచినివాసములందు పుణ్యులై
తనరెడిపండితోత్తముల । దాపున సాధుల చెంత నిత్యముం
జనుఁడు వసింపఁగా నగును । సారెకుఁ గాశ్యపి దైత్యశేఖరా. 330

సీ. అవిమత్సరులు మఱి । యక్రోధనులు కృషీవలులు సత్యాత్ములు । పరమబుధులు
సజ్జ లౌషధిజాతి । సంచయంబులు వైద్యధనికులు శ్రోత్రియు । లధివసించు
పల్లియలందుండఁ । బాడియౌ విను మెట దండించుకోర్కెతోఁ । దనరి సంత
తోత్సవబద్ధవై । రోన్నతచిత్తుఁడై విజిగీషుఁడై బల । విరహితుండు
తే. నైన రాజుండు దేశంబునందు నుండఁ, దగదు, ఎద్వర్జ్యనీయతఁ । దనరు వానిఁ
దినఁదగినవాని నిత్తతఁ గవిరి నీకుఁ, జెప్పెదము భక్తితో విను । శిష్టచరిత 331

మనులు సుకేశికి భక్ష్యాభక్ష్యపదార్థములశుద్ధిఁ దెల్పుట.

క. తైలాక్తాన్నము భోజ్యము, వాలిమి సంభృతము నగుచు । బర్యుషితం బై
క్రాలెడియన్నము విఱిగిన, పాలోగి భోజ్యములు కావు । పరికింపంగన్ 332

వ. అస్నేహములై సన్నగిలినవట్టి వర్జ్యంబులు శశశల్యకసమేతగోధామత్స్యకచ్ఛపంబులును, ద్విదళాదు లగు కాయగూరలు భోజ్యంబు లని మనువు వచించెను మణులు, వస్త్రములు, పవడములు, ముత్యములు, శైలదారుమయము లైన వస్తువులు, తృణమూలౌషధులు, గట్టివలువలు, శూర్పధాన్యము లన్నివిధము లగునారవస్త్రములు నీటఁ బరిశుద్ధిఁ గొందును చమురువస్తువు లగ్నిచే నిర్మలము లగును బ్రత్తిచే నైనవలువలకు వేఁడినీటఁ బరిశుద్ధి కలుగుచున్నది ఏనుంగులదంతాస్థిశృంగము లపుడె శుద్ధినొందుచున్నవి పునఃపాకముతో మట్టిపాత్రలకు శుద్ధి యేర్పడును భైక్షులహస్తములు పణ్యారోమాను లగుస్త్రీల మొగములు పరిశుద్ధములై యుండు 333

సీ. రహి నవజ్ఞాతమౌ । రథ్యాగతంబును భక్తాళికృతమునై । పరఁగునదియుఁ
దళబహుధాంతరి । తముచిరానీతము । తనువైనవాక్యపూ । తంబు మఱియు
బాలవక్త్రము వృద్ధ । బాలకచేష్టలు శుచితోఁ జెలంగును । క్షోణి నెపుడుఁ
గర్మాంతములును నై । కన్పట్టు నీటిపాపనిమేటిశాలలు । పాలుఁ ద్రావు
తే. బాలకులు గల్గుకాంతలు । పాలువిప్రు
షములు సంతప్తజలబిందు । చయముఖాత

దాహమార్జనగోక్రమ । ధరణు లెలమి
దోషములు లేని వగుచుండు । దురితదూర 334

క. నిలయము సేచనమార్జన, ములను ల్లేఖనవిలేప । ములచేత నొగిం
దిలకింప విమల మగుని, శ్చలముఁగ భావించి చూడ । స్థలియందున్. 335

తే. కేశమక్షికగోఘ్రాత । కీటసహిత
మైనయన్నంబు క్షారమ్ము । దంబువులను
శుద్ధి యగునామ్లమున రాగి । సౌరిది సత్తు
సీసములు క్షారమున శుద్ధిఁ । జెందుచుండు 336

తే. కంచు భస్మాంబువులశుద్ధిఁ । గాంచు, నీరు
కాచినందున శుద్ధిఁ దోఁ । గ్రాలు; గంధ
హారణామృత్తోయముల శుద్ధి । యగు నమేధ్య
యుక్తవస్తువు లవనిపై । యోగ్యచరిత 337

క. లెక్కనవస్తువు లెల్లను, జక్కఁగఁ దద్ద్రవ్యగంధ । సమహారణతోఁ
నక్కజమున సంశుద్ధినిఁ, బిక్కటిలున్ సంతతంబు పృథ్వీనిఁ జూండీ 338

క. జననీప్రసూతియందునుఁ, దనయుఁడు ఫలపాతనమునఁ । దగ శాకునియున్
ఘనభారవహనమున శుద్ధినిఁ బొందుఖరంబు నిజము । క్షితిజాధీశా 339

సీ. సరణియందలి తృణ । సంచయంబులు ధేనుగణములు రథ్యాప్ర । కీర్ణమార్త
జలములు పక్షేప్త । సంహతు ల్గరువలిచేత పవిశుద్ధిని । జెందుచుండుఁ
బక్వాన్న మొగిద్రోణ । పరిమితి కధికమై పొనరినయెడ దూష్యత్వమును వహించు
నటు కాన మొదటిదా । న్నంబుఁ గొని త్యాజ్యమైనట్టిదానికి । నంబుసేచ

ఆ. నంబుఁ జెప్పఁబడెను । నలి దూషితాన్నంబుఁ
దెలియకిరు భక్షింపఁ । దెగువ మూఁడు
దినము లుపవసింపఁ । దీఱు దోసము, దానిఁ
దెలిసి కుడువ శుద్ధి । తెలియ దెవట 340

వ. దిగంబరలై జలమునఁ గ్రుంకుచున్న ముట్టయినచానలనుఁ బ్రసవించిన తెఱవల చెంగటనున్నవారిని శవవాహకులను దాఁకినఁ బరిశుద్ధికొఱకై స్నాన మొనర్పుట నొప్పును స్నేహాస్థులఁ దగిలిన సచేలస్నానముఁ గావించి యాచమన మొనర్చి గోవునుఁ దాఁకి సూర్యునిఁ విలోకింపవలెను నరునిఁ దాఁటరాదు. మఱియు రక్తశరీరోద్వర్తనము నొనర్పఁగూడదు గృహములనుండి నిత్యము మలమూత్రోత్సృష్టజలంబులు వెలుపల విసర్జింపనగుఁ; బంచపిండములఁ గ్రహింపక పరజలమందు మునుఁగరాదు దేవఖాతములందును నదులలోనుఁ గొలఁకులందును స్నానముఁ గావింపఁదగును. పూలతోఁటముంగల నకాలమందుఁ బ్రాజ్ఞం దుండరాదు. కరవిద్విష్టుని వీరుఁడు లేనిచోటనిఁ గార్చి భాషింపఁ

గూడదు విబుధపితృసచ్ఛివ్యయాగాదినిందకు లగుదుష్టులతోఁ జేరి మాట
లాడినఁ గలుగుదోషము సూర్యునిఁగన్నతోడనే పోవును సూతిక, షండ,
మార్జా, రాఖు, పతిత, షవిద్ధ, నగ్న, ధన, చండాలాన్నంబులు భుజింపఁ
దగినవి కావనినవ విని సుకేశి మునుల కిట్లనియె 341

క. పరమాత్ములార మీచే, బురుణింపను బడె నభోజ్యాన్నములు పిశితములన్
గురుతల్లతిక్షణముల వి, స్తరమతి వినవలతుఁ జెపుడు దయ తళ్కొత్తన్

మునులు సుకేశికి దుష్టాన్నపద్ధతిఁ జెప్పుట

చ. అనుటయు మాను లాయసురు । నారయుఁడఁ గన్గొని పల్కిరో మహా
దనుజవరేణ్య! బ్రాహ్మణియుఁ । దద్దయు బ్రాహ్మణుఁ డెంతికాలమున్
ఘనత నశేషతం జెలఁగి । క్రాలుదు రట్టిదు లెల్లసూతకు
ల్గనఁగఁ దదోగిరంబు కుడు । గర్హిత మై తనరారు ధాత్రిలోన్ 343

ఆ. ఉచితకాలమందు । నుదకంబులోఁ గ్రుంకి
కరయె విదానుఁ డగుచుఁ । గడఁగి యగ్ని
పైతృదైవతుష్టి । భక్తితోఁ జేయని
జనుఁడు షండుఁ డగుచు । జగతి నొప్పు 344

క. నరు డెవఁడు ముక్తిఁ గోరక, ధరఁ గపటముతోడ జపము । దపముం దమితో
విరివిగఁ జేయునొ పలుకునొ, పారిమార్జారుం డటంద్రు । బుధు లానరునిన్

క. ధనతలికూడినవేళలఁ, దినక దరిద్రులకు నిడక । తెల్లముఁగా న
గ్నిని వ్రేల్వ కున్నమనుజుని, ఘను లాఖుం డతఁ డటంచు । గణుతింతు రొగిన్

వ. తదన్నభక్షకుఁడు సాంతపనాదివ్రతానుష్ఠానత బరిశుద్ధుం డగు 347

తే. సభ్యుఁడే వాఁడు వచ్చెడి । జనులలోనఁ, బతితపాత మొనర్చిన । బరమబుధులు
పలుకుదురు కుక్కుటం బని । వాని నెపుడు, గర్హితం బన్న మతనిదా । గర్వ్బరేశ.

ఉ. ఆపదలేనికాలమున । నన్యపతిన్ స్వకులాభిధర్మముం
బాపుచు నన్యధర్మమునుఁ । బాగుగఁ జేసెడుదుష్టమానవుం
డేపునఁ జెర్కొవంబడుఁ బుధేంద్రులచేఁ బతితుం డటంచు ద
ష్ప్రాపితమా తదీయసహా । చర్యయుఁ జూడ మహాసురాధిపా. 349

క. జననీజనకుల గురులను, బనిఁ గొని సేవింపకుండు । పాపిష్ఠులు స్త్రీ
జనవిప్రగోగణఘ్నులు, కనుఁగొన నపవిద్ధు లగుచు । గ్రాలుదు రనఘా! 350

వ. దైత్యశేఖరా! మఱికొన్నిధర్మంబులు వక్కాణించెదము సావధానచిత్తుఁడవై
వినుమని యిట్లనిరి 351

సీ. అనఘ! యువ్వారికుల । మందు దైవతశాస్త్రసత్యవ్రతంబులు । సమయునేని
యట్టివారలు నగ్న । లగుదు రాదుష్టులకూడు గర్హితము నాఁ । గుడువరాదు

కోరివచ్చిన జన । కోటికిఁ బెట్టక దాతలకప్పుఁ జేరి దానమేలఁ
చేసెద రని చెప్పు । జెనఁటియు శరణాగతునిఁ బొఱఁడోలెడి । జనుఁడు మిగుల

తే. వధమనరుఁ డైనచండాలుఁ । డగును బంధు
సాధువిప్రుల విడనాడు । జడుఁడు కుండ
శీయుఁ డగువానియన్నంబు । తితినిఁ దినిన
వాఁడు చాంద్రాయణముఁ జేయ । వలయు శుద్ధి 352

తే. నిత్యనైమిత్తికక్రియా । నిరసనంబుఁ
గోర్కెతోఁ జేయుమనుజుని । కూడుఁ గుడిచి
నిరశనవ్రతుఁడై మూఁడు । నిశలనుండ
శుద్ధుఁ డగుచుండు నరుఁడు వి । శుద్ధచరిత 353

వ. జాతమృగదివసములందు నిత్యకర్మహానిఁ జేయరాదు నైమిత్తికం బెట్లైనఁ గావింపనగు 354

క. జనునకు భృగుఁడు విధించెనుఁ, దనయుఁడు జన్మించినపుడుఁ । దనబంధువు లె
ల్లను నీల్ల సవస్త్రం బై, చను స్నానం బాడ దైత్య । యుత్తమ భక్తా. 355

ఆశౌచనియమాశ్రమవిధులక్రమము.

క. దాయలు జ్ఞాతిని వెలుపలఁ, బాయని శ్రద్ధను దహించి । పరమప్రీతిం
దోయముల నీయఁదగు నా, తోయము వారికిని భక్తి । తో దైత్యేంద్రా. 356

చ. సవవిచతుర్థసప్తమన । సంబులఁ బ్రహ్మధమాహమందు భూ
సురముఖులస్థిసంచయము । శుద్ధిగఁ జేసి తదంగసంగముం
గర మొనరింప ధర్మమగుఁ । గ్రమ్మఱ పోవకు లైనగోత్రజుల్
పోరిఁబోరి నూర్ధ్వకర్మమును । బూనికతోడ నొనర్పఁగావలెన్ 357

క. జ్వలనవిహోర్ధ్వంధనముల, జలశస్త్రాదులసరిత్రి । సమసిన నరవం
డలమందు బాలసన్న్యా, సులయందగు శౌచ మపుడె । చౌర దామోదరా 358

ఉ. ఆయని నాల్గుచందముల । నానని రెట్లన గర్భభిన్నమం
దేయెడఁ బూర్వమార్గమున । నేర్పడు నొక్కట మూఁట నాటిటం
బాయును విప్రభూమిపలి । వైశ్యుల ద్వాదశవాసరంబులం
బాయును శూద్రజాతులను । మానుగ శౌచము దైత్యనాయకా. 359

ఉ. దాయల కైనశౌచవిధి । ధర్మముఁ జెప్పెద సద్ది విప్రులం
దాయుఁ బదింటి రాజులకు । ద్వాదశవారము లౌను వైశ్యులం
బాయునుఁ బక్షమం దవర । వర్ణుల కెల్లను మాసముందు నీ
తోయమునాల్గుజాతులకు । దొల్లి విధించిరి మౌనిపుంగవుల్. 360

క. తమకైన కాలములలోఁ, దమవారికిఁ జేయు టొప్పు దగ వగుపనులన్
సమమతితో నేకోద్దిష్టము జేయందగును బ్రేతచయముల కెలమిన్. 351

సీ. రహినసపిండీకరణము సంవత్సరాంతంబునఁ గావింపఁ దగును నరులు
పిదపఁ బితృత్వంబు పెంపొందు దర్శపూర్ణాదిపుణ్యములందు నధికభక్తి
జలతర్పణము శ్రుతిసందర్శనంబుగ పారక. గావింపవలెఁ దకర్ద
మునుఁ గార్చి స్వయముగ భూమిదానాదులు కావింపఁ బ్రీతులై కలుగఁగ పితరు

తే. లేగుచుందురు గృహమందు నిష్టతమము
నైనదానిని గుణవంతుఁ డైనబుధున
కిడఁదు మురమొందుటకు నీయ నగును మోక్ష
కామి యగుమానవుఁడు ధరఁ గర్బురేంద్ర! 352

క. తొలి చదువులమూఁడింటిని, విలసితమతిఁ జదువవలయు విపులశ్రద్ధం
బొలుపొందఁగ నిజధర్మము, వలన ధనార్జనముసేసి వాంఛాపూర్తిన్. 353

తే. చెలఁగి తనశక్తి కొలఁది యజింపఁ దగును
జేయుచుఁ జుగుప్స నొందని చిత్తమలర
సందియము లేక పనులెల్ల సమధికతను
గోప్యవిధిఁ జేయవలయు వి కింకరితాత్మ! 354

క. ఈకైవడి జగమందుం, బ్రాకటముగ వెలుఁగుబుధునివాసములోనం
జేకురు ధనాదు లాగిఁ బర, లోకసుఖం బలరు ధర్మలోలురు మెచ్చన్. 355

క. కావున గార్హస్థ్యం బొగి, నీవసుధఁ బ్రశస్తమగుచు నింపారెఁ దగన్
భావించి నొడివెదము విను, మావానప్రస్థవిధము నసురశ్రేష్ఠా 356

వ. విద్వాంసుఁడు సుతుని సంతతినిఁ గాంచి శరీర మనిత్య మని యెంచి యాత్మశుద్ధికిఁ గారణం బగు వానప్రస్థాశ్రమంబుఁ జెందఁదగు నందు మెలఁగెడువాఁడు సతతమరణ్యోద్భవభోగములఁ దనియుచు భూశయనంబుఁ గావించి బ్రహ్మచర్య మూని త్రిషవణస్నాతుఁడై దేవాతిథిపితృవర్గంబులఁ దృప్తినొందఁ జేయుచు నగ్నియందు హోమ మొనర్చుచు జడలఁ దాల్చి నారచీరలుగట్టి విపినములఁ గలిగిన స్నేహవస్తువుల భక్షించుచు నాత్మదర్శనంబుఁ గోరి తపస్సు చేయందగుఁ దురీయాశ్రమమందు వర్తించు ద్విజుఁ డమానియై సర్వసంగపరిత్యాగం బొనర్చి జితేంద్రియత్వంబుననుండి బ్రహ్మచర్యవ్రతానుష్ఠానుఁడై యొకరియింటఁ జిరకాలముండక యనారంభుఁడై తద్విధాహారుం డగుచు భిక్షాన్నంబుఁ గుడుచుచు నాత్మజ్ఞానావబోధాపేక్షతఁ జెలఁగుచుఁ బరుని దర్శింపఁ గమకించుచుండనగు దానవేంద్రా నృపవైశ్యశూద్రధర్మములఁ జెప్పెద మాలకింపుము బ్రహ్మచర్యగృహస్థవానప్రస్థాశ్రమము లీమూఁడు రాజులకును, వైఖానసత్వగార్హస్థ్యములు వైశ్యులకును, గృహస్థాశ్రమ మొకటియు

శూద్రులకుఁ జెల్లుఁగాన నాలుగుజాతులవారు వారి కనుగుణ్యము లగునట్టి
యాశ్రమంబులనుఁ దద్ధర్మంబులను విడువరాదు 367

ఆ బ్రాహ్మణుండు ధర్మపద్ధతి విడనాడి, పరులధర్మ మూనఁ బరఁగెనేని
వేదవానిఁ జేసి వెలసినవాఁ డౌను, దాన భానుఁ డడరి దర్ప మొనర 368

మ కులనాశత్వము రోగవృద్ధి సి ఎవార్కోపంబుతో నిచ్చు భూ
స్థలిలో వానికి నిక్క మాత్మకులసద్ధర్మంబుఁ బోనాడి వెం
గలి యై గోత్రప్రహానిఁ జేయనగు నాకాంక్షించి ధర్మోన్నతిం
దిలకింపం దగుసర్వమానవులచే దీపింప దైత్యేశ్వరా 369

చ కరుణ మునీంద్రు లిట్లు పలుక న్విని దైత్యుఁడు నా సుకేశి యా
పరమతపోధనాన్వితులపాదయుగంబు శిరంబు సోఁక సు
స్థిరమతి మ్రొక్కి యాజ్ఞఁ గొని శీఘ్రుమె పైకని లేచి వేగ్కతో
సురుచిరమైనయాత్మపురిఁ జొచ్చెను ధర్మవిచారుఁడై తమిన్. 370

సుకేశి రాక్షసులకు నీతిగఱపుట

చ. పరమమునీంద్ర దానవుఁడు భాసురనూ స్వపురంబుఁ జేరి దు
ర్భరబలసర్వదైత్యులను బాళినిఁ బిల్చి నిశాటులార యీ
తరుణమునందు నేఁబలుకు ధర్మహితోక్తుల నాలకించి సు
స్థిరగతిఁ జెందుఁడీ యనుచుఁ జెప్పఁ దొడంగె దయాసమేతుఁడై 371

సీ సత్యమ స్తేయంబు శౌచమహింసయు నఖలేంద్రియములసంయమము బ్రహ్మ
చర్యంబు దానంబు తాంతియు దానమహానిత్వ మాచార సుహితవిధియు
శుభదమై మధురమై శోభిల్లువాక్యంబు సత్క్రియారతిదయ ల్పంతతంబు
పరధర్మదంబులై భాసిల్లు నని నాకుఁ బరమమునీంద్రులు ప్రతనమైన

తే ధర్మగతిఁ జెప్పి రటుగాన దాల్మి మీకుఁ
గరుణ నాజ్ఞప్తి నిచ్చితిఁ గలఁతలేక
సర్వధర్మంబులనుఁ జేసి చాలశుభముఁ
బొందుఁడు రటంచు వచి యింపఁ బొంగి యగుల 372

క పిమ్మటఁ దద్వచనంబున, నిమ్ముల నసురౌఘమెల్ల హిత మని మదిలో
నెమ్మిఁ ద్రయోదశధర్మము, లిమ్మహిఁ గావించుచుండి రెంతయు భక్తిన్. 373

ఆ అందువలన దైత్యు లధిక ప్రవృద్ధినిఁ, గాంచి పుత్రపౌత్రకలితు లగుచు
విత్తభోగమహిమ వెలసి సదాచార, కలితు లగుచు నచటఁ గ్రాలి రంత

సుకేశిపురవర్ణనము.

చ అనఘ! మహాత్ము లైనడితిజాళులభాసురసత్యదీప్తితో
నినశశితారకాగణము వేగ నశక్తము లయ్యె దానిచే

తనుఁ ద్రిజగంబులందు నగి తద్దయు రేయినిఁ జందమామరీ
తినిఁ బగలందుఁ బ్రొద్దుగతిఁ దెల్లముగా విలసిల్లె నాయెడన్. 375

తే. తెలియఁబడదయ్యె రవిగతి దీప్తివలన
మింటఁ జంద్రునివలె దాని మిగులఁ దలఁచి
రంబరంబున రేయియుం దాత్మకాంతి
విడిచి చింతించుచున్నట్లు వింతతోఁప 376

క. కమలాకరమందుండిన, కమల తమి న్మిత్త్రుఁ జెంది కామవిధూతిన్
సమత నిడఁ దలచి రేయిని, సమధికమతిఁ బ్రజ్వరిల్లె సంతతము మునీ! 377

ఉ. ఘూకములెల్ల రాత్రియని హర్షిఁ దలంచుచు సంచరింపఁ గాఁ
గాకులు వాని నాయెడను గన్గొని కింకిరిఁ దన్నసాగ సు
శ్లోకులు నైనస్నాతకులు స్రోతసులందు మునింగి దీక్షనుం
గైకొని జప్యమార్గమునఁ గ్రాలిరి తిరిఁ గాఁ దలంచుచున్ 378

తే ఆపురినిఁ జూచి చక్రాహ్వయములు దాని
చెంతఁ జేరక పోరిఁబోరి శీఘ్రగతిని
దివస మిగి యని తలఁచుచు దృఢముగాను
బలుకుచున్నని పలుమాఱు భ్రాంతిఁ బొంది 379

చ పోరి నాకలోకమాత్మ చెలి పొందెడఁబాసి విహాయనదీ
గురుతటమందు బెగ్గడిలి గొబ్బున భూతకృతిజేసి నీల్గ భా
స్కరుఁడు కృప న్మహోష్ణకర కాండములం జగమెల్లఁ గాల్చుచుం
గరకరి నస్తమానమును గాంచఁ డొకప్పుడు నైన నారదా! 380

మ ఒకచక్రాహ్వయము కూలఁ దత్సతి విచా కోర్థార్తిచేఁ బొక్కుచుం
బ్రకటస్ఫూర్తిఁ దపంబుచేయఁ గృపతో భానుండు జాబిల్లినిన్
వికలుంజేసి పరాబ్ధిఁజేర కలప ద్వీరుండు నై చుండె ధా
త్రికత న్నిక్కమటంచుఁ గోకములు వే ద్రిమ్మ బల్కసాగ న్మునీ 381

ఉ. జన్న మొనర్చునట్టి జన సత్తము లందఱు హోమశాలలం
దన్నువతోడ నధ్వరములలం దొగి బుత్విజయుక్తులై తమిం
గ్రన్నన సర్వకార్యముల రాతిరులందె యొనర్చుచుండి ర
త్యున్నతభక్తిభావముల నొప్పెడిరీతులతోడ నాయెడన్ 382

ఉత్సాహము సారె భాగవతులు చేరి చాలభక్తిమీఱఁగా
వారిజాక్షుఁ డైనహరిని భావములనుఁ జేర్చి వి
స్తార మైనపూజ నపుడు సొంతిఁ గుల్కఁజేసి పెం
పారుచుండె రతులమోక్ష వాసకాము లై ధరన్ 383

క. కొందఱు శశిభాస్కరులనుఁ, గొందఱు బ్రహ్మాండధరులఁ । గూర్చి సభక్తిం
జెందినమనసులఁ బూజనుఁ, బొందికఁగా సలిపి రపుడు । పుణ్యనిధానా! 384

ఉ. వెన్నెలచేతఁ గాఁచుకొని । వేడ్కఁ జిగిర్చెడివై చెలంగు నీ
వన్నెలఁగుల్కు రాత్రి హిమ । భానునిచేత సృజింపఁగాఁ బడెన్
సన్నుతికెక్కురీతి నిది । చాల వెలుంగుట మంచిదంచు సం
పన్నమనస్కులై తలచి । వత్తులు చూపిరి కాముకుల్దగన్. 385

సీ. మునికులాంబుధిసోమ! । ముదము పొడసశూన్యశయనం బటంచుఁ బ్రశస్తినొంది
యఖిలకాపద్రద । మా ద్వితీయ్యనులో గురుఁ డగుచక్రిని । గూర్చి భాగ్య
వీసమేతునిఁ గాగ । విపులమహాగంధభద్రపుష్పముల నవ్యాజముగను
మేము పూజించిన । మెచ్చి శ్రేష్ఠంబైన । శాశ్వతశయనంబు । సరవి నొసఁగె
తే. నందుచే నీప్రభాకరుఁ । డాదిరైన
చదువు గలయంటిపై యోగ । సహితుఁ డగుచు
నస్తమింపక స్థిరతర । మైనవిభవ
పదముఁ గాంచె నటంచని । పలికి రొరులు. 386

ఉ. తమ్ముల వైరినాశమునుఁ । దాఁ గని రోహిణి యట్టియంబు పు
ణ్యమ్మగునట్టియష్టమిని । నాగవిభూషణు వేఁడ సుస్థిర
త్వమ్మగుశోకనాశనిక । దా దయమెచ్చి భవుం డొసంగె స
త్యమ్మని కొంద ఱాడి రిల । నత్యధికాద్భుతచిత్తులై ధరన్ 387

తే. కమ్మవిలుకాని మాఁవచే । గంజనేత్రుఁ
డొనర నారాధితుం డయ్యె । నోజఁ బూర్ణ
మైనతక్ష్మితమునఁ జంద్రుఁ । డధికపూర్ణుఁ
డయ్యె నింటను నిక్కమం । చాడి రొరులు 388

మ. గుసుతేజం డగుశౌరిపాదయుగముం । గోర్కి దాని యర్చించి త
త్కరుణ న్దీపిని జెంది భాస్కరుని వేడ్కం గెల్చి మాఁబోంట్లకున్
వరతోషప్రదుఁడై హరి ప్రతిగ్రఁడై । భాసిల్లి సద్వ్రతుతం
బరఁగెం గారణవృద్ధిచే నని పరుల్ । ల్భాషించి రీరీతిగన్, 389

సీ. తావలరాయనిచేతఁ । దొల్లి ప్రభాకరుం డోడి । నిష్కాంతిమై నుండెనేని
కమలాకరము లెట్లు । కాంతిఁ దొలంగక సద్గుణాస్పదమౌ । సంచయమ్ము
లై విచ్చి విలసిల్లు । నంబుజమిత్రోదయము కల్గె గృవమని । యాడి రొరులు
కుముదాకరములల్లె । గార్మితో విలసిల్లె నందుచేఁ జంద్రుఁడు । హాద్య కలిగి
ఆ. పరిఢవిల్లెననుచు । భావించి పలికెడి, వారివాక్యములను । భాస్కరుండు
విని మనుష్యు లిట్లు । వివిధరీతులనేల, బలుకుచుండి రనుచుఁ । బరితపించి 390

సూర్యుఁడు సుకేశినివత్పురంబున నేలంగూలఁజేయుట.

క. మలయుచు నంతట నారవి, కలతెఱఁగెఱుఁగంగఁగోరి కడునిర్మలమై
విలసిల్లునట్టిచిత్తము, కలవాఁడై ధ్యాననిష్ఠఁ గడఁగె న్వాసిన్. 391

క. రవి యోగ మూని కనుఁగొనె, భువనత్రయభాగమెల్ల బొరిఁబొరి రక్షో
నివహముచే గ్రస్తంబయి, నివసించెడిరీతి నంత నిర్మలతేజా 392

క. మఱియోర్వరానిదై దివి, వఱలెడి దితిసుతులవృద్ధి భాసురదృష్టిం
గఱకఱలేక కనుంగొనె, వెఱవిగ భాస్కరుఁడు యోగవిధమున మౌనీ. 393

ఉ. పిమ్మట బ్రాహ్మణావరులఁ బ్రీతి భజించుచు ధర్మయుక్తులై
సమ్మతితో సదాచరణశాలురునై రుచితోఁ జెలంగుచున్
బమ్మెరపాటులేకట విభాసితులౌ దనుజాధినాథులం
బమ్మిన లెల్వితోఁ గనియె భానుఁడు వేగమె యోగదృష్టిచేన్ 394

ఆ. పిదప రాక్షసేంద్ర! భీకరుఁ డతిశేముఁ, గజమృగారిస్పృధుల కిరణఘుండు
నైన సూర్యుఁ డప్పు డసురవిఘాతంబుఁ, జేయునట్టిబుద్ధిఁ జేఁ జెలంగి 395

ఆ. ఆత్మదివ్యధర్మహానిఁ గావించుచు, సకలధర్మములను సమయునట్లు
చేయునట్టి దైత్యశేఖరఛిద్రంబు, భావమందు నెఱిఁగి భాస్కరుండు 396

వ. అంతటఁ గోపాంధకారితుండునై యాసుకేశిదివ్యనగరమును విత్రస్థకలితయు వినాశయు నగు నట్లొనరించె నాయెడ నసురేశుఁ డగుసుకేశి దివాకరకోపావిష్టదృష్టివృష్టుఁడై నష్టపుణ్యాగ్రహంబుగతి మింటినుండి పడుచుఁ దలక్రిందై పడు నిజపురంబునుఁ జూచి హరా! శర్వా! నీకు నమస్కార మని భక్తి నిట్లు బిగ్గర నాక్రోశించె నంత దదార్తరావమునుఁ జవలఁ జరించుచారణులంద తాకర్ణించి యయ్యయో! శివభక్తుఁ డగునీసుకేశి హతుఁడై పడె నని బెట్టుగ నఱచిరి ఆచారణులదీనాలాపంబుల సర్వవ్యాపియు నాశరహితుఁ డగుమహాదేవుఁ డాలించి సుకేశిపురంబు నెవఁడు భూమింబడఁజేసెనని కొంతవడి విచారించి దేవప్రభుఁ డగుభానునిచే నీపురం బిట్లొనర్పఁబడెఁగదా యని తలంచి 397

ఈశ్వరుఁడు సూర్యుని గగనపాతునిఁ జేయుట.

చ. మనికితుఁడై మహేశ్వరుఁడు మండెడిమూఁడవకంటిచూపుచే
తను రవిఁ గాంచ నాతఁ డొగిఁ దల్లడ మొందుచు మింటనుండి క్రి
ద్ద నఁబడె యంత్రసంగళితగ్రావమురీతి విభీషణంబుగా
ననిలనిషేవితోరుపథమందు యథేచ్ఛ వికంపితాత్ముఁడై. 398

చ. మారుతమార్గవిచ్యుతుఁడు మంజులకింశుకసన్నిభాంగుడుం
జారణసిద్ధయుక్తుఁ డగుచాయమగండు నిజాంశుదీప్తి పెం

పారుజవంబుతోడఁ । బరిపక్వముఁ జెందక తాళవిచ్యుతం
బై రసఁ గూలు తాళఫల। మా యనురీతిని వెల్గ నెఱయుమీ! 399

సీ. పడుచున్న భానునిఁ । బరికించి మునివరు ల్పలికి రోమశమలార! । భద్రవాంఛ
కలదేని మాసలి । కాంతుని క్షేత్రంబునందు వ్రాలు మటంచు । నాడ నర్కుఁ
డధికతపోధను । లయినట్టిమునులనుఁ బరికించి పలికెను । భవ్యులార!
పుణ్యాకరస్థితిఁ । బొనరుహరిక్షేత్ర మెద్దియొ దాని నా । కేర్పడంగ

ఆ. పలుకుఁ డనిన వారు । భాషించి రర్కుని, గాంచి యోమహాత్మ! । గాఢపుణ్య!
పూర్ణమైనశౌరి । పురహరక్షేత్రవి, ఖ్యాతంబు వినుము చెప్పె । దము సుభక్తి

ఆ. యోగశాయనునుండి । యోగ్యకేశవదర్శ,నాంత మగుచు నడుమ । నెంతవఱకు
నొనరునట్టివాస । మురివి హరిక్షేత్ర, మనఁగ వెలయుచుండు । ననఘ! చూడె.

క. అని మౌను లాడ విని రవి, ఘనభవనేత్రాగ్నితప్త । కాయుం డగుచున్
వినుతాశీవరుణలనడు, మన నుండినభూమిఁ జేరె । మౌనిలలామా! 402

తే. మఱియు భానుఁడు సంతప్త । మానుఁ డగుచు
నసినిఁ గ్రుంకియుఁ దిరుగుచు । నంత వరుణఁ
జేరి స్నానంబు దానిలోఁ । జేసె నిచ్చ
వచ్చురీలిన గురుతర । బాధ నలఁగ 403

క. సుందరవరుణాసీనడు, లందును మఱి యసినివరుణ । యందును భానుం
డిందుధరునేత్రవహ్నిని, గుందుచు మఱి తిరిగెఁ దిరుగు । కొఱవిగతి మునీ!

వ. తత్సమయంబున జగంబులు చీఁకాకునొందె విను 405

ఉ. ఆకమలాప్తదివ్యరథ । మందుఁ బిశాచగణాదు లెల్ల నెం
దాఁక వసించుచుండెనొ సదర్పముతోఁ దమి నంతలో వెస
న్నాకపురాప్సరోవిబుధ । నాగులు సాధ్యులు బ్రహ్మచెంతకుం
జేకువఁ జేరి తద్దలిసిఁ । దెల్పిరి ఖేలని సంయమీశ్వరా! 406

వ. అత్తఱి బ్రహ్మదేవుండు దేవగణంబులు వెంట నంటి నడున తరణికారణంబు మనంబున నిడి యీశ్వరు నివాసం బగుమందరపర్వతంబునకుం జని దేవాధీశుండును, దుర్జయుండును నగు శ్రీశంభునిం గాంచి భక్తిగదుర శ్రద్ధతో నంద త్రొక్కుమ్మడి. 407

చ. కరములు మోడ్చి మ్రొక్కి భవ। కాలవిభీషణ! భక్తపోషణా!
పరమదయాకరా! విబుధ। పాలనతత్పర! చంద్రశేఖరా!
సురవర! భూరిపాపహర! । సూరిమనోబ్జవిభాకరా! హరా!
పురహర! సత్యవాక్యపరి। పూర్ణమహేశ్వర! పాతుమాం విభూ! 408

క అని వేఁడి దేవదేవుని, ఘనతుష్టునిఁ జేసి సూర్యుఁ । గడురక్షింపం
గను ధాత కాశిఁ జేర్చెను, మినుసిగదయ్యమును బుధులు । మేలని పొగడన్.

శివుఁడు మరల సూర్యుని గగనస్థునిఁ జేయుట

ఆ. పిదప శంకరుండు ప్రీతి చెన్నారఁగ, నబ్జవైరి నాత్మహస్తమందుఁ
బూని లోలనామకమును వియన్మణి జేసి, రథముఁ జేసె మరలఁ బ్రథితతేజ.

చ. అరదమునందు భాస్కరుఁడు హార్యున నుండ నరించి గౌరవే
శ్వరుఁ డగుతత్సుకేశిని సపుత్త్రసబాంధవయుక్తుఁ జేసి పు
ష్కరమున నుండఁజేసెను జగంబులు మెచ్చుచు నుండఁ గ్రమ్మఱం
గర మటమీఁద శంకరుఁడు గాదిలిదైత్యుని బంపి భక్తితోన్ 411

క. హరిచరణములకు వలఁగొని, సురుచిరనిజగృహమునకును సొరిదినిఁ జనె నీ
కరణిం బూర్వము వారల, చరితము రాజిల్లె ధాత్రి సంయమినాథా 412

క. ఈకథను వినినఁ జదివినఁ, జేకూరును మనుజులకును స్థిరపదధర్మా
ర్థాకరసరణులు నిత్యము, కాకోదరరాజశయను కరుణన్మౌనీ! 413

వ. అని పులస్త్యుఁ డాడిన విని సంతసించి నారదుఁ డేవ్రతంబులఁ దొల్లి పరమేశ్వర ప్రాజకొఱకై కామిజనులు కువలయాప్తుఁ గూర్చి పలికిరో వానిని విస్తరించి భాషింపు మనుటయు 414

క. కరుణారసభరితాంతఃకరణా! సత్కార్యకరణ! కమ్రాభరణా!
నరదేవమానిపూజిత, చరణా! లోకావనైకసాధననిపుణా! 415

క. ఇనకోటిధామ! సజ్జన, జనకామ! గుణాభిరామ! సన్నుతనామా!
ఘనరత్నహేమధామా!, దనుజాధిపచక్రభీమ! దశరథరామా! 416

కలహంసోత్సాహవృత్తము కలుషదూర! భవవిదూర! కార్ముకోజ్జ్వలత్కరా!
కలితదివ్యసుగుణధీర! కామకోటిసుందరా!
లలితనీరనిధిగభీర! లసదుదారకీర్తిని
ర్దళితహార! విశ్వభార! రామచంద్రభూవరా! 417

గద్య. ఇది శ్రీరామచంద్రకరుణాసమాసాదితకవితాప్రాభవహరితసకులాన్వయప్రభవ రామవజ్జలవంశదుగ్ధసాగరసుధాకరకొండయకుమారబుధజనవిధేయ కొండయ నామధేయవిరచితంబగు తెలుఁగు వామనమహాపురాణమందు ద్వితీయస్కంధము.



శ్రీరస్తు

శ్రీసీతాలక్ష్మణ భరత శత్రుఘ్న హనుమత్సమేత శ్రీరామచంద్రాయ నమః.

# తెలుఁగు వామనపురాణము

## తృతీయస్కంధము



శ్రీశాంకరీశ కార్ముక
నాశ! విరక్తనకులాబ్ధి నవ్యనిశేశా!
క్లేశా! దుర్జననాశా!
శ్రీశా! గుణసన్నివేశ! సీతాధీశా! 1

క. అవధారు యోగనిష్ఠుం, డవిరళచిత్తుండు నిత్యసహర్షుఁడు లక్ష్మీ
ధవపాదరతుఁడు బ్రహ్మో, ద్భవుఁ డైనపులస్త్యమౌనివరుఁ డావేళన్. 2

మ. ఘనభక్తి న్వినుతించునారదుని వేడ్కం జూచి యామౌని యి
ట్లనియెన్ శంకర! విష్ణుపూజలకు నై యత్నంబుతోఁ గాముకు
ల్మనుభాషించిన వ్రతంబులనుఁ దత్పుణ్యంబులం జెప్పెదన్
విను దానన్మది నుండుచింతవెడలు న్నో మౌనివంశోత్తమా! 3

సీ. మార్తండుఁ డాషాఢమాసంబు నేతెంచి పెంపొందుచు నుత్తరాయ
ణమునఁ జరించునా నలి నవు డజుఁ డైనహరిసుమహాభోగిపర్యంకమందు
నిదురించుచుండును నెఱి నంతఁ గ్రమముఁగ నమరగంధర్వగుహ్యకుల మేటి
జేజేలతల్లులు సిద్ధవిద్యాధర సాధ్యకింపురుషులు సకలమునులు

ఆ. నెమ్మిఁ గులుకుచుండ నిదురింతు రన విని
లోకమొప్ప నారదుఁడు పులస్త్య
సంయమీంద్రుఁ జూచి సద్భక్తితో నంత
నాడె వినయసహితుఁ డగుచు నపుడు.

క. హరిదేవాదులపుష్కల, గురుశయనస్థితిని వినుటకును నాచిత్త
స్ఫురణము చెలఁగెను బలుకుము, వరుస నన న్విని పులస్త్యవరముని పల్కెన్.

### పులస్త్యుఁడు నారదునకు దేవాదులశయనస్థితులఁ జెప్పుట.

తే. రవియుగాభిముఖుండు నై రహిఁ జెలంగ
విశదపక్షస్థ మై చాల వెలయుచంద్ర

వాసరం బందు శ్రీహరి ׀ భవ్యశయన
మునుఁ బ్రకల్పన చేయును ׀ మొనసి మౌని!. 6

క. కావున నఖిలజనంబులు, పావిరిశేషాహిభోగ ׀ పర్యంకమ్ముం
గావించి శుద్ధుఁ డౌ నా, దేవునిఁ బూజింపఁ దగును ׀ దృఢమగుభక్తిన్ 7

చ. పదఁపడి బ్రాహ్మణోత్తముల ׀ బాగుగఁ దృప్తులఁ జేసి వారిచే
తఁ దగ ననుజ్ఞనొంది తమి ׀ ద్వాదశియందు విశుద్ధచిత్తులై
నిదురను జెందఁ జేయ నగు ׀ నీరజలోచనుఁ డైనశౌరినిం
బదిలపుభక్తి నెంపొదవఁ ׀ బల్మలు మానవు లోమునీశ్వరా! 8

—శేషాదుల నిద్రాకాల నిర్ణయము.—

తే. మేటితావులు కలవిద్దె ׀ మెఱయు కడిమి
పూలసెజ్జను వలరాజు ׀ పొందు మీఱఁ
బవ్వళించుఁ ద్రయోదశి ׀ భద్రదివస
మందు ముదమొందుచును భోగ ׀ మతిశయిల్ల 9

తే. శర్మశీతలసౌవర్ణ ׀ సారసౌఘ, నిర్మితం బైనశయ్యపై ׀ నిఖిలదివ్య
యతివరులు చతుర్దశి ׀ యందు నిద్ర, జెందుచుందురు సుభగులై ׀ చెలఁగు వేడ్క

శా. ధ్యేయుండౌ శివుఁ డన్యచర్మమున ను ׀ ద్వేల్లజ్జటాభారముం
బాయన్ గ్రంధిగఁ గట్టి పున్నమను భా ׀ స్వత్స్వర్ణసంయుక్తమౌ
వైయాఘ్రోత్తమచర్మసంస్తరముపైఁ ׀ బాలిం బిసాళింప నా
తోయం బందు సుషుప్తిఁ జెందును మహా ׀ తోషంబుతో నాయెడన్ 11

క. ఆలోఁ గులీరరాశిని, బాలిన్ భాస్కరుఁడు సొచ్చుఁ ׀ బదపడి సుమనో
జాలమునకు రాతిరి యై, పోలున్ యామ్యాయనంబు ׀ పుణ్యనిధానా! 12

తే. అట్టితఱిఁ బద్మయోని లో ׀ కాళిదివ్య
సరణి నరయుచు నసితల ׀ సత్సువర్ణ
కుముదమయతల్పమందు వి ׀ కుంఠితాత్ముఁ
డగుచు నిదురించుఁ బాడ్యమి ׀ నతులదీప్తి 13

సీ. విశ్వకర్మ చెలంగి ׀ విదియను నగసుత తదియను గణపతి ׀ తగఁ జతుర్థిఁ
గాలుండు పంచమిఁ ׀ గడఁగి స్కంధుఁడు షష్ఠి నర్కుండు సప్తమి ׀ నంబ యష్ట
మిని హరి ప్రియనవ ׀ మిని వాతభక్షకదందశూకేశులు ׀ దశమియందు
సాధ్య లేకాదశీ ׀ సద్వ్యాసరమునందు నిద్రించుచుందురు ׀ నియతిమీఱి

తే. నిట్లు భాద్రపదాదిని ׀ నెలమిఁ దల్ప
గతులు నై నిద్ర సెందెడి ׀ ఘనులవిధముఁ
జెప్పితిని వారు శయనింపఁ ׀ జెలువు మిగిలి
వానకాలంబు వచ్చును ׀ వరగుణాఢ్య! 14

క. కొంగలు కొక్కెరతుటుములఁ, బొంగారంగాడి వృక్ష। పుంజములందుం
రంగు చెలంగ వసించెను, నింగి ఘనావృతము నగుచు। నెగడెనుఁ దీప్తిన్ 15

ఆ. కాను లపుడు సూర్యుఁ। గరమర్థిఁ గట్టిన, వరుస్యఁ బెంటిపతు। లమితగర్భ
భారమునను డస్సి। పవళించ నాయితు, వందు నీడలందు। నమలతేజ! 16

ఆ. ఎట్టి తిథియందు నిదురతో। నెంగె విశ్వ
కర్మనామ ప్రజాపతి। కౌతుకమున
నద్ది శయన ద్వితీయ యం। చవని విబుధ
సత్తములు పల్కు నెగడును సత్య మరయ 17

అశూన్యశయనద్వితీయావ్రతపద్ధతి

వ. మౌనీంద్రా! శాద్భృగ్వాసరమందుఁ బద్మాలయోపేతుఁడును, దివ్యపర్యంకగతుఁ
డును, శ్రీవత్సాంకితవక్షుండును, జతుర్భుజుండు నగుహరిని సుగంధపుష్పాదు
లచేఁ జాలఁ బూజించి కోవిదు డగువాఁడు క్రమ్మఱఁ గేశవునికొఱకై శయ్య
యందు మనోజ్ఞఫలంబుల నునిచి నివేదించి జగన్నివాసా, అనంతా, త్రివిక్రమ,
నీవిపుడిందిరతో నీయశూన్యశయనమందుఁ గూడవేని మాకిట భవదనుగ్రహము
వలన స్థిరతల్పము పొసఁగదు దేవా నీ కిపుడు లక్ష్మితో నీశయనంబు లబ్ధంబ
య్యెనేని సత్యముగ దాన మాకు గార్హస్థ్యనాశము లేకపోవును దయతో
మత్కృతతల్పమును గ్రహింపు మని పలుమాఱు ప్రార్థించి హరినిఁ బ్రసన్నుని
జేసికొని రాత్రియందుఁ దైలక్షారరహితాన్నంబు కుడువఁదగు 18

క. రెండవనాఁడు సభక్తిని, బండితుఁ డగుజనుఁడు విప్ర। వరునకు ఫలముల్
దండిమతి నీయఁదగు ముని, మండలి నర్చించు టొప్పు। మానితభక్తిన్ 19

క. మానాథుఁడు ప్రీతుండౌ, మానుగ ననిఃపల్కె దివ్య। మానస మొప్పం
గా నైవేద్యము హరికి న, నూనం బగుశ్రద్ధ నిడఁగ। నొనరు న్మౌనీ 20

క. చాతుర్మాస్యవ్రతమును, భూతలమున నిట్లు జేయఁ। బోలుం భక్తిం
బాతకహర మగునీవ్రత, రీతిం జెప్పితిని నీకుఁ। బ్రీతి తలిర్పన్ 21

ద్వాదశమాసవ్రతవిధి.

క. ఎందాఁక ద్రోణరాశిం, బొంది దివాకరుఁడు వెల్గుఁ। బోరి నందాఁకన్
బృందారకులు క్రమంబున, జెందిన నిద్దురను విడిచి। చెలఁగుదు రంతన్ 22

సీ. వణిగుదయస్థుఁడై। భానుఁడుండఁగ హరి ముందె ప్రబుద్ధుఁడౌ। మొనసి వెనుకఁ
గందుఁడు తెలియును। గడిమి నిద్దురనుండి దీపించునట్టి ద్వి। తీయయందుఁ
జేసినదానంబు। శ్రీపతిప్రియమగుఁ దల్పసంయుక్తమై। తనరు శయ్య
నిజవిభవమునకు। నిలయమౌ నీమహావ్రతము నాచే నీకుఁ। బలుకఁబడియె

## పులస్త్యుఁడు కాలాష్టమీవ్రతవిధి సెప్పుట.

తే. పుణ్యమునివర! యింకొక । పుణ్యసరణి
కలదు దానిని భాషింతుఁ । గాంతు వినుము
మహిని నెవ్వనికైన నే । మాసమందుఁ
గలుగకుండ వియోగంబు । కనఁగ నెపుడు 23

వ. అట్టి భాద్రపదమాసమందే శుభకృష్ణాష్టమిమృగశీర్షనక్షత్రయుక్తమై తనరునో యట్టి పుణ్యతిథి కాలాష్టమి యని చెప్పంబడు నానాఁ డన్నిలింగములయందు దభవుఁడు నిద్రించి సన్నిధానుఁడగుఁ గావున నాతిథియందలి పూజ నాశములేని దని నిగదితంబయ్యె 24

తే. అట్టి తిథియందుఁ బ్రాజ్ఞుఁ । డత్యధికభక్తి
శర్వు గోమూత్రజలముల । స్నాతుఁ జేసి
శుద్ధుఁడై ధూర్తసుమముల । సుస్థిరాత్ముఁ
డగుచుఁ బూజింప నగు నుర్వి । నధికభక్తి 25

సీ. ద్విజవర! ధీరుఁడు । విపులమహాశ్రద్ధతోఁ జంపక వృక్షసం । జాతగంధ
నిర్యాసధూపంబు । నిర్మలమధుఘృతనైవేద్యదక్షిణ । న్యాయరీతి
వెలఁగి సమర్పణ । చేసిన వీనిచే హరుఁడు సంప్రీతుఁడౌ । ననుచు నిట్లు
పలికె నైవేద్యంబు । బ్రాహ్మణునకు నిడ నగు మఱి నాశ్వినమందు నట్టి

ఆ. విధముఁగానె బుధుఁడు । విజితేంద్రియుఁడు నుప
వాసి యగుచు నవమి । వాసరమున
గోమయోదకములఁ । గూడినస్నానంబు
చేయవలయు మదిని । శివునిఁ దలఁచి 26

క. తమ్ములచేతనుఁ బూజను, నెమ్మినిఁ గావించి సర్జ । నిర్యాసంబుల్
సమ్మతి ధూపముఁగా నిడి, కమ్మని మధుమోదకములఁ । గమనీయముగన్ 27

క. హరునకు నైవేద్యం బిడి, పొరి నష్టమి నుపవసించి । పొందుఁగ నవమీ
వరతిథిని స్నాతుఁడయి నా, కొఱకై శివుఁ డధికతుష్టిఁ । గొనుగా కనుచున్

తే. సలిలదక్షిణభూదేవ । సత్తమునకు, నీయ నగుఁ గార్తికంబందు । నెలమి భవునిఁ
బాలతో స్నాతునిగఁ జేసి । పరమభక్తి, బుణ్యకరవీరసుమములఁ । బూజచేసి.

క. శ్రీవిటపిజనిర్యాసము, పావన మగుధూపముఁగను । బాయసమధువుల్
నైవేద్యముగ నిడి గురు, భావం బలరారుచుండఁ । బాయనిభక్తిన్ 30

క. మీనధ్వజారిప్రీతుం, డౌ నాకొఱ కనుచుఁ బలికి । హర్షమ్మొదవం
గా నైవేద్యము రాజత, దానం బిడఁ దగును భక్తి । ధరణీసురునకున్. 31

క. వాసిని నష్టమియం దుప, వాసముఁ గావించి భక్తి । భావం బలరం
గా సలిలమందు నవమీ, వాసరమున జలక మాడ । వలయుం జొండీ. 32

వ. మునీంద్రా! కోవిదుఁడు మార్గశీర్ష మాసమున భవునికి స్నానంబును సరళపుష్పార్చనంబును, దేవదారుబంకతోఁ గలిసిన గంధద్రవ్యధూపమును, మధుమిశ్రితౌదనంబును దామ్రదక్షిణను సమర్పించి శర్వుఁడు ప్రీతుఁ డగుంగాక యని నమస్కరింపవలెను, పౌషమాసమున నిందుశేఖరుని నాజ్యజలస్నాతునిఁ జేసి నందివర్ధనపుష్పములతోఁ బూజించి యిప్పబంకతోఁ జేసినగంధద్రవ్యమున ధూపమొసంగి మధుపక్తినైవేద్య మిచ్చి, జగద్గురుఁ డగుధూర్జటి ముదన్వితుఁ డగుటకై సముద్రదక్షిణ నిచ్చి, త్రినేత్రా! దేవదేవా! నీకు నమస్కార మనుచు నుతింపవలెను మాఘమాసమందు భర్గుని గుళోదకాభిషిక్తునిఁ గావించి కలువలఁ బూజించి కదంబనిర్యాసధూపకలితుం జేసి తిలక్షీరభక్తాన్నంబుఁ గనకసహితతాంబూలంబును సమర్పించి పార్వతీనాథుఁ డగుమహాదేవుఁడు సుప్రీతుం డౌనని వాక్రువ్వందగు నిట్లు పారణముం బాఱుమాసములందుఁ జేయ నొప్పును.

ఆ. పారణాంతమందు । భక్తపాలనపగ, చిత్తుఁ డైనచంద్ర । శేఖరునకుఁ
జెలఁగు శ్రద్ధతోడఁ । జేయింప నగుస్నానం, బంబు భక్తుఁ డైన । నరుఁడు చూని!

సీ. గోరోచనంబుతోఁ । గూడినగుహమున శివునకు లేపన । చేసి పూజఁ
గావించి దేవ! నేఁ । గడుదరిద్రుఁడ నైతి. ప్రీతుఁడవై నీవు । బెడఁగు నెందు
మద్దుఃఖములఁ బాపి । మమతతోఁ బాలింపు మని వేడ నగుఁ బాల్గు । ణాఖ్యమాస
మందు యతవ్రతు । లందఱు గీతనో నుపవాసయుక్తులై । యుండవలయుఁ
ఆ. చారి ద్వితీయమందుఁ । బురహరుఁ బంచగవ్యమున స్నాతుని గను । వఱలఁ జేసి
గంధకుందకుసుమ । కలితధూపమ్మిడి, రాగిపాత్రయందు । రమణఁ గుల్క 35

క. ఘనఘృతగుడయుక్తోదన, మును నైవేద్య మ్మొసంగి । భూసురులకు భ
క్తిని దన్నైవేద్యము ద, క్షిణలం దగ నిచ్చు టొప్పుఁ । దరుగనిభక్తిన్ 36

క. పరమేశ్వర కరుణాకర, వరదా! యని యుచ్చరించి । వస్త్రయుగంబుల్
గురుభక్తిఁ గోడ భూసుర, వరునకు నర్పింపవలయు । భావం బలరన్ 37

ఆ. చైత్రమాసమందు । శివుని నౌదుంబర, నీరమునను స్నాతు । నిఁగ నొనర్చి
మానుగాను దివ్య । మందారసుమముల, వలనఁ బూజచేయ । వలయు భక్తి 38

ఆ. మహిషనామ మొప్పు । మంజుఘృతాక్తగు
గ్గులము ధూపముగనుఁ । గూర్చిఁ జేసి
ఘృతసమేతమోదు । కతతి మృగాజిన
దక్షిణాళి నెల్ల । దాల్చిఁ దాల్చి 39

క. ధనదాప్త! నీకు వందన, మని తమి నిట్లాడి త్రిపుర । హరునకు వానిన్
ఘనభక్తి నిచ్చు టొప్పు, న్మనసార సుధీవరుండు । మాన్యచరిత్రా! 40

సీ. మంజుళ వైశాఖ । మాసమందు సుగంధబంధురసుచువాలి । వలన భవుని
నభిషిక్తు నొనరించి । యలరారు సహకారసుందరమంజరీ । స్తోమములనుఁ

జక్కఁగాఁ బూజించి । పజ్జని రాష్ట్రసధూపంబు సద్ఘృతయుక్తి । లనివేద
నము సమర్పణచేసి । నానావిధంబుల శాలఘ్న! యని కవిశిస్స్వజపము

తే. నిర్మలం బగుభక్తితో । నెగడఁజేసి, భవుని కర్పించినట్టి స । ద్విస్తవారి
కుంభములఁ గోటనిష్టవ్రజ । కుంజరులకు, విమలమైనట్టి బుద్ధి నర్పింపఁదగును

ఆ. జ్యేష్ఠమాసమందు । శివుని నామలక సు, స్నాతునిఁగ నొనర్చి । యరవి నర్క
పుష్పకలితుఁజేసి । పౌరి వృషాంకమువృద్ధి, కారకంబు నగుచు । గ్రాలుచున్న

క హారనేత్రము నర్పించియు, వరదధిఘృతయుక్తసక్తు । ఫలములఁ ద్రుతిం
బురహరునకు నైవేద్యము, గురుభక్తి నొసంగు టొనరు । గుణరత్ననిధీ! 43

తే భక్తి కలిగినపురుషుండు । పాదరక్ష
యుగళమును ఛత్రమును మహా । యోగ్యుఁడైన
భూమిసురునకు దానంబుఁ । బోల నిచ్చి
పూర్ణదంతఘ్నభగనేత్ర । పుష్టిహరణ! 44

క అని భవునిఁ దుష్టిఁ బొందిం, వినుతినిఁ గావింప నగును । వినయముతోఁ బూ
పనిఁగొని యాచందంబున, జనవర్యుఁడు చేయఁదగును । సౌజన్యనిధీ! 45

సీ ఆషాఢమందు శ్రీ । హరుని బిల్వఫలోదకంబున సుస్నాతుఁ । గా నొనర్చి
బిల్వదళంబులఁ । బ్రీతితోఁ బూజించి పాండురకిలవపు । ష్పప్రధూప
మిడి సఘృతాపూప । హితసర్పియవదక్షిణలనివేదనచేసి । నాగభూష
దక్షయజ్ఞవినాశ! । దయ నేలు నీకు నమస్కార మని యిట్లు । మంజుభణితిఁ

తే బలుకఁదగుభృంగరాజంబు । భక్తి శ్రావ
ణమున స్నానంబు శివునికిఁ । గమరఁజేసి
వరుస నర్పించి శ్రీవృక్ష । భవ్యపత్ర
ధూప మర్పింపవలయును । ధూర్జటికిని. 46

క ఘృతదధిమిశ్రితమోదక, హితనైవేద్యంబు శివున । కిడఁదగుఁ బూన్కి
న్మతిమంతుఁడైనమానవుఁ, డలిభక్తివెలుంగుచుండ । నమలమనీషా. 47

వ పిదప దధ్యోదనంబునుఁ బులగమునుఁ జక్కెలములను శుభకపిలధేనువును శ్వేత
వృషభంబును రక్తవస్త్రంబులను విప్రునకు సమర్పించి గంగాధరా! యని ఖం
డపరశునినామజపంబు చేయవలయు నిట్లొనర్చుచు నీయాఱుఁ ఱమాసము
లందుఁ బారణ నొనర్పందగుఁ బూర్ణసంవత్సరం బీమాడ్కి వృషభధ్వజునిఁ
బూజించినమానవుఁ డక్షయలోకములఁ జెందు ననుచు భవుఁడు భాషించె నని
పలికి మఱియు ని ట్లనియె. 48

ఉ పాపహరంబు మోక్షదము । భాసురశంకరభాషితంబు నా
నీపరమవ్రతంబు భువి । నెప్పుడు శోభనపుణ్యభోగసు

త్వాప్తిపక మై చెలంగుచును ౹ భాసిలు సత్యము వేఱుగా దొగిం
గోపన మీ వ్రతం బనుచుఁ ౹ గూర్మిఁదలంపుము మానిచంద్రమా! 49

బ్రహ్మాదులవలనఁగలిగినతరుసంభవము

క శ్రీసమధికమా నాశ్విన, మాసమున బ్రహ్మనాభిమధ్యచ్యుత మై
వాసిఁగను పుండరీకము, భాసురసత్కాంతితోడఁ ౹ బ్రభవించె మునీ 50

వ అత్తఱి దేవాదు లన్యప్రవర్తకులు కారైరి. 51

క అంగజువాస్త్రాగ్రంబున, శృంగారం బగుకదంబవృక్షముకలిగెఁ
బొంగెడిప్రీతి జనించెను, రంగారెడుదానివలన ౹ రహిఁ గంతునకున్ 52

ఉ. యక్షులకెల్ల నాయకుఁడు ౹ నా మణిభద్రునికిం జనించె స
ద్వృక్షము నా వటం బితని ౹ కీవ చెలంగెనుఁ దద్దృిమంబుపై
నక్షయుఁ డా మహేశుమనయం దొకధూర్తనగంబు పుట్టఁగా
నక్షయకాంతి శంభునికి ౹ నాతిరువందున కర్లై సంయమీ! 53

మ అనఘా! బ్రహ్మశరీరమధ్యతలమం ౹ దాపచ్చడా ల్కల్గి ముం
గ్లనుఁ జెన్నొందినచంద్రచ ట్టొదవె వేడ్క న్విశ్వకర్మప్రజే
శుని కావృక్షముమీఁదఁ గోర్కె మిగులఁ ౹ శోభిల్లె స్వాంతెం జనిం
చినదా హేతువుతోడ నాయెడ మునిౕ శ్రేష్ఠు ల్ప్రిశంసింపఁగఁ. 54

సీ. దాక్షాయణీహస్తతలమందు సుందరకుందగుల్మముపుట్టెఁ ౹ గొమరు మిగిలి
హైరంబుకుంభస్థమై సిందువారంబు సంజనితంబయ్యె ౹ జమునియామ్య
భాగమందుఁ బలాశ ౹ పాదపమాదక్షిణో త్తరమందసితరుజంతు
ఫలరుద్రవృక్షము ౹ ల్ప్రభవించె నవ్యయత్నో భకరంబు లై ౹ చోద్యముఁగను
తే శరజునకు మంకెన జనించె ౹ జలజసఖుని,
వలన సంజాతమయ్యె న ౹ శ్వత్థతరువు
పర్వతేశాత్మజకుఁ బుట్టెఁ ౹ బాళిఁ జెలఁగు
జమ్మి నానొప్పు చెట్టు భా ౹ స్వద్గుణాఢ్య!. 55

క సిరి చేతియందు బిల్వము, కరమరుదుగఁ గల్గె రెల్లు ౹ గంట జనించెఁ
వరశేషాహిముఖంబున, సురభియుతం బగుచుఁ జూడఁ ౹ సురుచిరతేజా!. 56

ఉ. వాసుకి పృష్ఠపుచ్ఛముల ౹ వావిరిఁ గల్గె సితాసితంబు లౌ
భాసురదూర్వ లెంతయును ౹ భాసిలు సాధ్యులచిత్తమందు మే
లౌసనవెల్గునట్టి దగు ౹ పచ్చనిచందన ముద్భవింపఁగా
వాసిలె వాంఛ దానిపయి ౹ భావములం దసురాళికిం దమిన్ 57

వ అనఘా! తాదృక్ప్రభరమ్యదివసమగుశుక్లైకాదశినాఁడు సుగంధవర్ణరసాన్వితము
లగుపుష్పపత్రఫలంబులతోడను ముఖ్యౌషధులచేతఁ గేశవుని శరదాగమపర్వం

తముఁ బూజింపఁదగు దానివలన నది యఖండమై పెంపొందు నంతటఁ దిలాజ్య వ్రీహియవలును గనకాదిహిరణ్యము వివిధవస్త్రమణిప్రవాళముక్తాఫలంబులు స్వాదురసవంతము లగుఫలంబులు కట్వామ్లకషాయము లగునీయఖండనైవేద్య వస్తువులు సంవత్సరము పూర్ణమగువఱకు నిజగృహంబున మహాత్ముఁ డగుమాధవునకు నర్పింపనగు మహర్షీ! పిదపఁ గృతోపవాసిరై నియతితో స్నానోచితము లగుతిలాజ్యసిద్ధద్రవ్యములచే నబ్దాంతముదాఁకఁ బద్మనాభునికి నలుఁగిడి శుద్ధోదకముల నభిషిక్తునిఁగ నొనర్చుటొప్పు నావలఁ దద్ద్రవ్యములతో హోమంబుచేయవలెను నిజశక్తికొలఁది దానమియ్యనగు పిదపఁ బుష్పములవలనఁ బాదాదిగఁ గేశవుని నలంకృతునిఁ గావించి దివ్యవిధధూప మిడి కనకమణిస్థగితభూషణభూషితుంజేసి రాగఖాండవచోష్యము లగుహవిస్సుల నివేదనచేసి మంత్రపుష్పాదు లర్పించి 58

శా. శ్రీనారీహృదయేశ్వరా! మురహరా! । శృంగారహేమాంబరా!
పారావారగభీర! ధీరసుకరా! । భక్తాళిహృద్భాగసం
చారా! భూరివిభాకరా! సురవరా! । చక్రాత్తదివ్యత్కరా!
సారాచారవిచార! నీకును నమ । స్కారంబుఁ గావించెదన్. 59

తే. నాకు ధర్మార్థకామము । ల్నాగశయన
పూర్ణములు నై ధరిత్రిఁ బెం । పొందుఁగాక
నీదుదయ నని విజ్ఞప్తి । నెగడఁజేసి
భక్తితో నిట్లు ప్రార్థింప । వలయుఁ నియతి 60

ఉత్సాహ. ఫుల్లకమలపత్రనేత్ర! । భువనములసుదీప్తసీ
వెల్లరొడల నిండియుండు । వెట్లఖండమూర్తివై
కల్ల కాదు కనఁగ నట్ల । ఖండధర్మమోక్షము
ల్పల్లవించునట్టి సత్య । పద్ధతిగ రమేశ్వరా! 61

తే. ఈవిధంబున వత్సర । మెల్ల నిండు, వఱకు విజితేంద్రియుఁడు నుప । వాసి యగుచుఁ
బండితుం డీవ్రతంబు నంఖండవస్తు, వితతి సమకూర్చిచేయ నా । విపులభక్తి 62

క. అనఘా! యిది పూర్ణస్థితిఁ, దనరిసస్పష్టముగ దేవ । తలు వేడుకతో
డను జెలఁగుదు రర్థాదులు, ఘనముగ నక్షయము లగుచుఁ । గడురాజిల్లున్.

క. మానుగఁ గామిజనోక్తము, లౌ నీవ్రతములను నీకు । నాడితి నింకన్
దానవరిపుపంజరమును, నే నాడెద భక్తి వినుము । నిశ్చలమతివై. 64

నారాయణపంజరము

చ. జలరుహపత్రనేత్ర! సుర । సన్నుతిపాత్ర! రమాకళత్ర! నేఁ
బలుమరు మ్రొక్కెద న్విపుల । భక్తితలిర్ప సుదర్శనంబునై

చెలఁగెడుచక్రముం దయను । జేకొని కావుము తూర్పుదిక్కునం
దెలిమి నిజంబుఁగా శరణ । మిత్తఱిఁ జొచ్చితి దార్ఢ్యబుద్ధితోన్ 65

క. కౌమోదకనింగదనుం, ద్రెమ్మం గొని నన్ను నేలు । పతిరులదౌర ది
గ్భాగి న్శరణాగతుఁడను, బామరుఁ డనుఁ బద్మనాభ । బహురుచిశౌరీ! 66

క. నరవర్య! సగదకమలముఁ, గరుణం గరమందుఁ బూని । కాపాడుము న
న్వారుణాశ యందు నీవుం, గరకరిశరణార్థి నైతిఁ । గడుభక్తిమెయిన్. 67

క. శాత ముగుముసలముం గొని, చేతోమోదంబుతోడ । శ్రీదునికడన
న్నీతతి రక్షింపుము జల, జాతాక్ష భువనరక్ష । సత్యసుదీక్షా!. 68

క. ఘనశార్ఙ్గచాపనారా, యణ శరముల దాల్చి హరుని । యా దెసయందు
న్ననుఁ గావు । శరణుఁ జొచ్చితి, వనజోదర దితిజనాశ । వందనము హరీ 69

తే. పంకజంబును జేఁబట్టి । పాంచజన్య, మైనచందంబుఁ బూరించి । యగ్నిదెసను
నన్ను రక్షింపు నిత్యమ । నాథనాథ!, యజ్ఞసూకర! గురు! ముర । హర! సుధీర 70

క. ఇనశతసమకవచంబును, ఘనఖడ్గము కేడెమును స । కరుణం గొని న
న్ననయము నేలుము రక్షో, జనపతి దెసఁ జిత్ప్రకాశ! । చటుల! నరహరీ! 71

తే. వైజయంతిని శ్రీవత్స । భద్రచిహ్న
కంఠభూషణములుఁ దాల్చి । గాలికడనుఁ
బ్రోవు నను వేడ్కతోడనుఁ । బొందుఁగాను
వాజి సంకాశముఖ! భక్త । వారసుముఖ! 72

క. వరద! జనార్దన! దుర్జయ! గరుడునిపై నెక్కి యుంటఁ । గరుణన్నన్నుం
బరిపాలింపుము మ్రొక్కెద, నిరుపమ మగుభక్తితోడ । నిశ్చలమతినై 73

క. గురుమీనరూప! దండము, సరిదధిపా! నీకు నతిర । సాతలమందుం
బరమేశ! నన్ను నేలుము, వరద! విశాలాక్ష! గవన । వైదగ్ధ్యముతోన్ 74

ఉత్సాహ. మస్తకాదిసకలభాగ । మహితతలమునందు సం
శస్తమైన యష్టబాహు । సత్యపంజరం బొగిన్
సిస్తుఁ గుల్కఁ బొందఁ జేసి । క్షితిని నన్ను నేలునిం
బ్రస్తుతించెదను మహాను । భావ! దేవ! శ్రీహరీ!. 75

క. నారద! మున్నీవిధముఁగ, గౌరికి శంభుండు సెప్పెఁ । గరుణామతితో
శ్రీరమ్యమైన నీశుభ, నారాయణపంజరంబు । నరగతుణాకై 76

క. హైమవతి మహిషదనుజుని, భీమాసురవితతి, రక్త । బీజుని వరుసం
గామించి దీనిచే రణ, భూమిని బరిమార్చెఁ దొల్లి । పుణ్యనిధానా. 77

సీ. అన విని నారదుఁ । డాపులస్త్యునిఁ జూచి పలికె నోమునివంశ । భవ్యదీప
రక్తబీజాదులౌ । రాక్షసు లెవ్వరో మహిషాసురుఁ డెవండో । మహితబలులు

నైనవారలనెల్ల । నడఁగించినట్టి కాత్యాయని యేదేవి । యవనివార
లెవ్వారికిని బుట్టి । రెలమిఁ బూర్వము వారిచరిత మంతయు నాకు । సత్య మొప్పఁ
ఆ బలుకు మనుచు నిట్లు । ప్రార్థింప నతఁ డాడె, బాపహరము నగుచుఁ । బరఁగునట్టి
పుణ్యకథను దీనిఁ । బూనివచించెద, భద్రద మిది వినుము । పరమతేజ 78

— మహిషాసురాదిరాక్షసోత్పత్తివిధము. —

చ గురుబలవీర్యసంపదలఁ । గ్రాలెడిరంభకరంభు లన్మహా
సురవరు లిద్దఱుం గలరు । తొల్లిని వార లపుత్రవంతులై
గురుతరచింతతో మదినిఁ । గుందుచు సంతతిఁ గోరి శ్రీధరున్
వరదునిఁ గూర్చి సత్తపము । బాగుగ సల్పిరి సంయమీశ్వరా ! 79
క కోరికఁ బంచనదస్థిత, వారిని వారుండి రధిక । వత్సరగణమం
దారూఢ మయినతపమున, ధీరులు చెర నొందుచుండ । ధృతి తప్పక తన్ 80
సీ అంత వారిద్దఱ । యందుఁ గరంభుండు చేయు చుండెఁ దపంబు । చెలఁగి నీట
నంత జలాంతస్థు । డైనకరంభుని పదముల రెంటిని । వాసవుండు
గాఢనక్రాకృతి । గ్రహియించి స్వేచ్ఛమై తిగిచి చంపెను వాని । ధృతి తలిర్ప
నన్న చావఁ గరంభుఁ డాగ్రహాప్లుతుఁడు నై తనతల ఖండించి । దహనులోనఁ
తే గురుబలుఁడు హోమ మొనరింపఁ । గోరి సూర్య
కాంతియుత మగుఖడ్గంబుఁ । గరమునందుఁ
దాల్చి కేశాత్త మయినట్టి । తలను ద్రెంపఁ
బూనెఁ దెంపున నాతఁడు । పొంగులుచుండ 81
ఉ వాయుసఖుండు సత్కృపను । వాని నివారితుఁ జేసి పల్కె నీ
తోయము ధర్మమా నె కడు । దోషము కాదె నిశాచరేశ్వరా
మాయరె శత్రుదావధము । మానుగఁ జేయుట దుస్తరంబు నాఁ
జేయకు మాత్మహత్య నది । చేయుట మిక్కిలి కష్ట మేరికిన్ 82
శా వీరా! నీ విపు డేదికోరిన దయ । న్వేల్పుల్ప్రశంసింపనే
సాదోదారత నొడ నిచ్చెదను రా । చావంగ నానేల ని
స్సారుం డై మృతినొందువానికథ నొష్టం బౌనుఁ జాల్పాలు నీ
శూరత్వం బని పల్కవచ్చెఁ గని యా । శూరుం డనెన్ భక్తితోన్. 83
కవి రాజవిరాజితము కరువలిమిత్రవరంబు నిడన్మఱి । గాంతుఁ బొసంగినగలహములో
సుర లకజేయుఁడు సురుచిరయుష్మ । చ్ఛోభాధికుఁడు భువనములన్
గరము జయించెడివాఁడును గుపవలి । కైవడి నిత్యమహాబలుఁడౌ
వరసుతు నిమ్మిక భక్తిని మ్రొక్కెద । భద్రుఁ గామశరీరుఁ డమిన్ 84
చ. అని వచియించు దానవబ । లాధిపుతో ననె నగ్ని దేవుఁ డో
దనుజవరేణ్య! నీ విపుడు । తద్దయుఁ గోరినకోర్కె సత్యమై

తనరును దేనియందు మని । తత్పరమా తగ నీకు దానిచే
జనితుఁడు నాఁ గుమారుఁ డన । జాలఁగ సంతస మొంది యంతటన్. 85

క జలరాశిచేత వాఁ డిటు, పలుకఁ బడి యక్షబృంద। పరివృతమాలా
కలితవరయక్షవాహముఁ, దిలకింపం జనియెఁ గాంక్ష । దీపింపంగన్ 86

క చని తత్పద్మాకరమం, దనితరచి త్తంబుతోడ । నటనుండి మహా
వనమహిషధేనుగజచయ, ఘనతురగాజాదిగుణము । గనుఁగొని పిదపన్ 87

తే భావయుక్త మగుచుఁ । బరఁగినదై మూఁడు, వత్సరములచేత । వన్నెకెక్కి
నట్టి మహిషిమీఁద । నసురేశ్వరుం డలి, మోహచిత్తవృత్తి । మొనసె నంత

క బలముకలమహిషిదనుజుఁ, డలనొప్పఁగఁ జూచి మోహ।వార్ధినిఁబడి తా
మలయుచుఁ దన్నికటంబున, కెలమిం జనుదెంచి నిలిచెఁ । బృథుకామముతోన్.

తే కాఁదగినకర్మమున నాఁడు । కడిమిఁ ప్రేరి
తుండు నయి దానితోఁ గామ । తుష్టి నెల్లఁ
దీర్చుకొని దానిచే నది । లివిరి గర్భ
మును ధరించినదనుఁ జూడు । ముదితుఁ డగుచు 90

క అనఘా! దానిం గైకొని, పానగా రెడినాగలోక।మునకుం జని సొం
పున నున్న నిజగృహంబును, మన మలరఁగఁ జేరెనంత । మమతదలిర్పన్. 91

క. అంతట సకలసురారులు, మంతనముం జేసి వింత । మల్లడిఁగొనఁగన్
సంతనకట్టి హసించుచుఁ, బంతంబున వానితోడఁ । బలికిరి మానీ 92

క. వహీఁగుల్క మహిషిఁగానీ, మహిషినిఁగొని నీవు పురికి । మహితోద్ధతితో
నహహా! చనుదెంచితివి దు, స్సహమై తనరారె నీదు । చరితముఁ జూడన్ 93

క. వలనొప్ప నీవు మాతోఁ, బలికిరపలు కేమి యుట్టి । పనికై విపిన
స్థలమునఁ దప మొనరింపక, లలిఁ జనితివా ధరణి నీకు । లజ్జయు లేదో? 94

సీ. పొమ్ము నీ విటనుండ । బుద్ధికాదని పల్కి హాస్యంబుఁ గావించి । రతనిబంధు
గణములు నిష్కార్య।కరుఁ డని భాషించి వెడలఁ గొట్టిరి వాని । వేగ యంత
సిగ్గుతో రంభుండు । చేరె మాలవటంబు చారుదర్శనయును । శ్యామరైన
మహిషి యత్తఱిఁ దన।మగఁ డగుదనుజుతోఁ బుణ్యయక్షస్థాన।మునకు నరిగి

ఆ సాధువనమునందు । సరగునఁ । బలితోడఁ
గలసి మెలసి యుండి । కాంచెఁ గామ
తనుఁడు నైనమహిష। తనయుని నొక్కని
ముదముతోడ నపుడు । మునివరేణ్య! 95

వ అట్టిసమయంబున 96

చ ఋతుమతి యైనతన్మహిషి । నేర్పడఁ గన్గొని యొక్క దుంతమో
హతఁబయి దూఁకఁగా నది నిజాధికశీలముఁ గాచుకొంచు ద

త్పటి యగుదైత్యనాయకుని దావునఁ జేరి నిజేశ! మున్ను పో
తు తమిని వచ్చె నాపయిఁ ద్రుంపు మటంచని పల్క నత్తఱిన్. 97

తే. ఉన్నమితనాసికం బొప్ప చున్నమహిష
మునుఁ గనుంగొని దైత్యుండు మోహరించి
నిశితఖడ్గంబు నంకించి నేర్పుతోడఁ
జంప సమకట్టి వెడలెను సంయమీంద్ర! 98

క. తనుఁ జంప వచ్చుదానవుఁ, గని మహిషము కోప మొప్ప గడుఁ గ్రూరముతోఁ
దనవాడిశృంగముల నా, దనుజునివక్షంబుఁ గ్రుమ్మఁ దహతహపడుచున్. 99

ఉ. ఘోరరవం బొనర్చి భువిఁ గూలెను రంభుఁడు భిన్నవక్షుఁడై
ధారుణిఁ ద్రెళ్లి నట్టిపతిఁ దద్దయు గన్గొని గేదె దీనయై
హా రమణా! యటంచు మది నార్తినిఁ జెంది భయంబుతో వెఱ
నారుచు యక్షదివ్యశరణంబునుఁ జొచ్చెను సంయమీశ్వరా 100

క. శరణముం జొచ్చినమహిషినిఁ, గరుణామతు లగుచు యక్షగణములు పేర్మిఱ
సరవిఱ సంరక్షించిరి, గరువపుమహిషంబుఁ ద్రోసి కర మర్థి వెసన్. 101

ఉ. అంతట యక్షవారితము నైనతురంగమవైరిడెందమం
దంతము లేనిదై వెలయుపట్టి మనోజుని ధాక కోర్వలే
కెంతయుఁ దల్లడిల్లుచు నిరీహతతోడనుఁ గ్రాలి దీర్ఘమౌ
చింత నిజాత్మలో నిగుడి చేవ దలిర్చుచు నుండఁ దెంపులోన్. 102

క. ఉత్తమకాసారంబున, నత్తఱిఁ బడి చచ్చి విక్రమాధికబలసం
పత్తికల నమరదానవ, సత్తముఁడై వెలసె ధాత్రి శౌర్యస్ఫూర్తిన్. 103

సీ. మునివరయును వెంట భుజబలాధికయక్షపుంగవాశ్రితయు నై పొగిలి పొగిలి
కాలంబు వనమందుఁ గడుపుచుండినతఱి మాలవటస్థులై మలయు యక్ష
వరులు రంభాసురవరుని నంతటఁ జితి నారోపితునిఁ జేయ నతనిమహిషి
నాథుతో సహగమనంబు చేసెను భక్తి నాయెడ నగ్నిమధ్యస్థఁ డగుచు

తే. భీమదర్శనపురుషుండు వెడలివచ్చి
ఖడ్గపాణియు భీషణాకరుఁడు నగుచు
యక్షులనుఁ బాఱఁదోలి సంరక్షితుండు
నైన రంభాత్మజుని మహిషాఖ్యు వదలి 104

క. తక్కినమహిషంబులఁ జెం, పెక్కినదోశ్శక్తివలనఁ బృథ్విని గూల్చెఱ
గిక్కుచెడిమృగములన్నియు, దిక్కులకుం బాఱె భీతి దెప్పర మగుటన్ 105

ఉ. నారద! మారుతాదిసురనాథుల నెల్ల జయించినట్టి యా
వీరుఁడె రక్తబీజుఁ డనుపేరఁ జెలంగెను దైత్యవల్లభుం

దై రహిఁగాంచు కాసరసు। రారిని మండలనాథుఁ జేసి రిం
పారఁగ తారకాదిదితి। జాత్మజు లందఱు సంతసంబునన్ 106

తే. అత్తఱిని హీనశక్తి సహా। యులగుచుఁ
చంద్రసూర్యాగ్నిపురుహూత। సకలలోక
పాలకులువీడి రాత్రియ। వాసములనుఁ
బర్వె చీఁకటిదిశలందుఁ। బలసి మౌని! 107

దేవతలు వైకుంఠమున కేగి హరికి మహిషాసురుని ప్రభావంబుఁ జెప్పుట.

క. అనఘా! మహిషాసురుచే, తను నిర్జితు లైన దేవ। తలు నిజగృహవా
హనభోగముల విడిచి భయం, బున వెడలిరి బ్రహ్మలోక। మున కట్టితఱిన్ 108

క. చని నలువఁ బురస్కృతుఁ గాఁ, గనుచేసి రమాకళత్రుఁ। గమలసునేత్రున్
వినుతు గదాచక్రాన్వితుఁ, గననేగి ఖగేంద్ర పీఠిఁ। గడుసుఖమొప్పన్ 109

సీ. అన్యోన్యమైత్రితో। నమరి సురోత్తములైన శ్రీలక్ష్మీశ। హరులఁ గాంచి
భక్తితోఁ బ్రణమిల్లి। వరసిద్ధసాధకు లగువారికిని మహి। షాసురేంద్రు
శక్తినంతయుఁ జెప్పి। శశిసూర్యపావకపవనాశ్విజలపతి। వాసవాగ్ని
బర్హిర్ముఖులఁ బట్టి। బాధించి మోదించి యంత దీధితుల సొం। పారు నాక,

ఆ. తలముఁ జేరి మమ్ముఁ। దఱుమఁగొట్టిన నిరా
కృతుల మగుచువచ్చి। పృథివియందు
నధికక్షితివలన। నడలుచునుండెదు
వార మైతి మిపుడు। వాస్తవమున. 110

క. శరణాగతులా నిర్జర, వరులాడిరి మరల దీన। వాక్యము లిట్లో
హరిహరులారా! దయతోఁ, బరమహితం బయినపలుకుఁ। బాలింపుఁ డొగిన్.

క. సరగున మీరాహితమునుఁ, గరుణ న్వాక్రువ్వ రేని। కర్బురువలనన్
దురమున వికలాత్ములమై, పొరివడిఁ బాతాళమునకుఁ। బోయెద మార్తిన్. 112

చ. అని యిటు దీనభావముల। నాయెడ నిర్జరు లాడువాక్యముల్
మనసిజవైరియుక్తుఁడును। మంజులభావుఁడు కాలహవ్యవా
హననిభుఁ డవ్యయాత్ముఁడగు। నామురసూదనుఁ డాలకించిచూ
చి నిలుపులేని తీవ్రరుష। చే ననె శౌర్యము పిచ్చలింపగన్ 113

చ. పరమునీంద్ర! పిమ్మటను। బ్రహ్మహరాన్వితుఁడౌ రమాపతి
వరుని సకోపవక్త్రమున। వావిరిభాసురభూరిసత్త్వ మా
తరుణమునందు వెల్వడి సు। దర్పములో నొకటై చెలంగి భూ
ధరవరకూటసన్నిభతఁ। దాల్చి రయంబున మించి క్రన్ననన్ 114

తే. అనఘుఁ డైనట్టి కాత్యాయ। నాఖ్యమౌని, విలసదాశ్రమభూమికి। వేఁగపోవ

నతులతన్మునివర్యవీర్యంబుచేత, నద్ది కుడియింపఁబడినదై యలరి పిదప 115

క. అమ్ముని సృష్టోత్తమవీ, ర్యమ్మున వ్యాపింపఁబడినదై తత్తేజం
బిమ్మహి వెలింగెఁ జూడను, సమ్మతి లసదర్కకోటి సన్నిభ మగుచున్ 116

## కాత్యాయనీజన్మక్రమము.

సీ. లిపిరి తన్మునిచంద్రు తేజస్సుతో నట విలసదాయతనేత్ర విశదయోగ
గాత్రయై తనరారు కాత్యాయని జనించెఁ గడఁగి యాదేవిముఖంబు భవ్య
శివశక్తితో నయ్యె శిఖివలనను గల్గె మూఁడునేత్రంబులు మొనసి జముని
దైనవీర్యంబున నమరెఁ గేశంబులు చక్రిచే నష్టాదశంబులైన

ఆ. చేతు లాదవె బుధునిచేత సుసంహిత, స్తనయుగంబు పొసఁగె శక్రుశక్తి
వలనఁ గలిఁగె నడుము భాసిల్లు వైఖరిఁ, బుష్కరంబురీతిఁ బొలుపు మిగిలి

వ. వరుణప్రభావంబునఁ బిఱుఁదులతోఁగూడినగొప్పతొడలుఁ జిక్కలును నలువవ
లనఁ బద్మకోశప్రతీకాశము లగుపాదంబులు ద్వాదశాదిత్యులవీర్యంబువలనఁ
జేతులవ్రేళ్లు వసుప్రభావమునఁ బాదములవ్రేళ్లు, నవబ్రహ్మలతేజస్సువలన దం
తంబులు యతులచే నాసికయుఁ గరువలిశక్తిచే జెవులు, సాధ్యప్రభావంబు
వలనఁ గడుఁజెలువంబున నలరి వలరాజుసింగిణుల గాయగు రెండుకనుబొమలు
కలిగి రాణించె జగత్ప్రసిద్ధిఁగాంచిన తదుత్తమవీర్యంబె కాత్యాయని యనుపేర
వాసిఁగాంచె నాదేవి కత్తఱి 118

క. వరదుఁడు ముక్కంటియు నొ, హరుఁడు త్రిశూలంబు నిచ్చె హరిచక్రంబుం
గరమర్థి నొసఁగె, సలిలే, శ్వరుఁ డిచ్చెను శంఖ మపుడు భక్తితలిర్పన్ 119

ఆ. అగ్ని శక్తి నొసఁగె ననిలుఁడు చాపతూ, ణముల నిచ్చె నక్షయములునైన
బాణతతుల నిడ విభాకరుఁ డమరేశుఁ, డిచ్చె ఘంటతోడ నెసఁగుపవిని 120

క. ప్రాద్ధుకోమకుండు దండము, నొద్దిక ధనదుండు గదను నొసఁగిరి ద్రుహిణుం
డిద్ధకమండలవరగుణ, బద్ధాక్షయమాల నొసఁగె బరమప్రీతిన్ 121

క. కత్తినిఁ గేడెముఁ గాలుఁడు, బిత్తరి యగుచందమామ పృథుహారంబుం
బత్తినిసంద్రముచామర, ముత్తమ మగుమాల నొసఁగె నోమునిచంద్రా! 122

ఆ. కడఁగి దేవశిల్పి కర్తచూడామణి, కుంతలార్ధచంద్ర ఘోరపరశు
సాధనముల నిచ్చె; నరవి గంధర్వాధి, పతియొసంగె రజతపానపాత్ర 123

శా. వ్యాళాధీశ్వరుఁ డిచ్చె సర్పమయమౌ హారంబు సమ్లానతా
లాలిత్యోన్నతగంధసారసుమమాలల్ వృద్ధి చెన్నారఁ గా
ళాళిన్ ప్రద్రుతువు ల్మహోత్సవము మై భాసిల్లఁగా నిచ్చె నా
కాళీదేవి మహాట్టహాసమును వేడ్కం జేసె నంతన్ మునీ! 124

ఆ. వాసవాదిదేవవర్యులు హరివారి, పవనమారుతాగ్ని భానుముఖ్య

లతులభక్తి నంతె। నాదేవిఁ గొనియాడఁ, దొడఁగి రపుడు వేడ్క। తొంగలింప.

క. రోగవినిర్మలతనువున, బాగుగ భువి నిండి తుల్పి।పాసాశాప్రి
డాగురుభయదయ నగుసుర, పూగార్చితదేవికి నతి।పుంజములగుతన్ 126

వ శ్రద్ధా, కాంతి, శాంతి, స్మృతి, పుష్టి, క్షమా, ఛాయా, శక్తి, లక్ష్మి, మేధా, కాంతా, మాయా, మయరూపంబులతో రాణించుశుభదాయిని యగుకాత్యాయనీదేవికొఱకు వందనంబు లొనర్చెదము 127

క ఈక్రైవడి సురవర్యుల్, ప్రాకటముగఁ బొగడ దేవి। బహుమోదంబుం
జేకొనిన దగుచు సత్వతి, శీకరసింహంబు నెక్కి। పృథువేగమునన్ 128

తే. మహి నగస్త్యునిచేత ని।మ్నతనుఁజెంది
ఘోరవిపినాఢ్యమును దీర్ఘ।కూటము నగు
వింధ్యశైలంబునకుబోయె। వేడ్కతోడ
నతులగుణధామ! మానివం।శాబ్ధిసోమ! 129

అగస్త్యుఁడు వింధ్యనగగర్వంబుఁ బాపుట.

సీ. అనుటయు నారదుం। డనె భగవానుఁడౌ కలశసంజాతుఁ డే।ఘనునికొఱకు
ము న్నేమికారణ।మున వింధ్యగిరి నేల హ్రస్వకూటములతో। నమరియుండఁ
జేసెఁ బల్కుము దాని।స్థిరబుద్ధివృత్తి మై యలరు నీవనఁబల్కె।నతఁడు తొల్లి
నారద! వినువింధ్య।నగి మిడ్డగించెను ఎంటఁ జరించెడి। మిహిరుగలని

తే భానుఁ డంతటఁ గుంభసం।భవునికడకు
నరిగి హోమావసానమం। దనియె దూర
మంకు నివసించు నినుఁజూడ। నరుగుదెంచి
తెని జగం బుద్ధరింపుము। ద్విజవరేణ్య! 130

క. వినువీథియందు సుఖనై, చనునట్టుల వడిని నాకు। జనియించినదై
తనరెడువానము నిమ్మా!, యని భానుం డిట్లుఁబలుక। నాలించి తపన్ 131

క. విలసితగుణగణమణి యగు, కలశోద్భవుఁ డనియె నాదు। కడవిఘలుండై
యిల నేయాచకుఁ డేగునె, వలచినకోరికను నిత్తు। వారిజమిత్రా! 132

క. అని లోపాముద్రేశుఁడు, మన మలరనుఁ బల్క ద్యుమణి।మహితామృత మై
బొనరెడు మునివరుమాటను, విని శిరమునఁ గేలుమోడ్చి। వేడ్కం బలికెన్.

సీ ఈవింధ్యనగవర్య। మి తఁడఁ బూన్కితో నడ్డగించెను దారి। నతులశక్తి
నిమ్నకూటుఁగ దీని। నేర్పుతోఁజేసెడి పనియందుఁ బూనుత।పస్వి యనుచు
మార్తండుఁ డిట్లాడ। వఱియగస్త్యుఁడు పల్కె నికొండ నాచేత। నిపుడె హీన
శిఖరి యానట్టుల। చేయఁగాఁబడు నని తెలియుము మది నీదు।దివ్యకిరణ

తే. వితతి మగుసీవహీ।భ్రమ్ము। విశ్వవ రదు, నస్మదంఘ్రిసమాశ్రిత। నమరు నీకు

నేమిదుఃఖ మటంచని । పృథులభక్తి, నతని వినుతించి సంతోష । మతిశయింప

తే. వృద్ధదేవాఖ్యుఁడు మునిగణ । వృత్రహాఁ డగు
కుంభసంభవుఁ డామీఁద । ఘోరదండ
కావనముఁ బాసి వింధ్యన । గమ్ముఁ జేరి
పలికె నాగిరిఁ గనుఁగొని । పరమహాని! 135

తే. వింధ్యనగవర్య! నామాట । వినుము తెమిని
జమున సైదోడు దెసయందు । సకలపాప
హారము పుణ్యప్రదంబు నా । నట్టితీర్థ
వరమునకు నేఁగ మదినెంతొ । వాంఛకలిగి 136

ఉ. వావిరి వచ్చితి న్మసలి । వాఁడను నీపయి నెక్క గిరితం
బోవుదుర్గంబు లే వపుడు । భూమి నణంగు మటంచుఁ బల్కనా
గ్రావము నీచకూటమయి । క్రాలె నగస్త్యుఁడు వేడ్క నంతటన్
వావిరి దానిమీఱి చని । పల్కెను వింధ్యనగంబుతో మునీ! 137

ఆ తీర్థమందుఁ గ్రుంకి । దివ్యదేవాలుండ నై
స్వాశ్రమమున కెపుడు । చనుట కేను
వచ్చునంతవఱకు । వసుధ నీగతినుండు
మట్లు కానియెడల । నద్రిరాజ 138

క నీ తెగడికతో శాపం, బౌతఁటి నొసఁగెద నటంచు । నాఁడె యమాశా
భూతలభాగమునకుఁ జనెఁ, జేతోమోదంబు జయము । చెన్నారుమతిన్ 139

చ కలశజుఁ డట్లు వోయి । తగుకాలమునం దిటవచ్చువాఁడ నే
నెలమి నటంచుఁ జిత్తమున । నెవ్వఁ జింతనుజేసి పుష్కర
స్థలమున కేగి రమ్యమును । దత్తసువర్ణసుతోరణాంతముం
గలిగినపర్ణశాల నటఁ । గౌతుకమొప్ప నొనర్చి క్రన్ననన్ 140

క. అచ్చట విదర్భపుత్త్రిని, మచ్చికతో నునిచి తాను । మహితోత్సుకుఁడై
వచ్చె నిజాశ్రమమునకున్, ముచ్చటతో మరల మాసి । ముఖ్యం డనఘా! 141

సీ పరఁగుబుతావృత్తి । పర్వదినంబులయం దంబరస్థమహా । నాశ్రమమునఁ
గడక నామునియుండి । కడమవేళను దండకావనభూమిలోఁ । గడిమి నిష్ఠఁ
దప మొనర్చుచునుండెఁ । దరుగనికాంతితో వింధ్యాద్రివినువీథి । వెలయుచున్న
పర్ణశాలనుఁ గాంచి । పరమర్షి భయముతో వృద్ధినిఁ జెందక । వృద్ధమాని

ఆ. మరలి రాఁ డటంచు । మదిలోనఁ దలపోసి, నీచశిఖరి యగుచు । నిలిచె నిట్లు
కుంభజుండు వింధ్య । కుధరమ్ము నీచత, రమ్ముఁగా నొనర్చె । ప్రథితశక్తి 142

క. ఘన మగుతద్గిరిశిఖరం, బున మునిజనవినుత యగుచు । ముదము దలిర్పం
గను దుర్గ నిలిచె రాక్షస, జనులం బరిమార్చుటకును । శౌర్యమునొడన్ 143

క. సురవిద్యాధరకాంతల్, దరసురవేశ్యాభుజంగ।లతులా దేవిం
గరమర్థిఁ గొలిచి యుండిరి, పొరిఁబొరి దుఃఖంబుమాని । పుణ్యనిధానా! 144

—చండముండులు మహిషాసురునకుఁ గాత్యాయని రూపరేఖలఁ దెల్పుట.—

తే. అట్టియెడఁ జండముండాఖ్య । నలరునట్టి
యసురు లిద్దఱు విస్మయా।యత్తు లగుచు
నమలవింధ్యాద్రిశిఖరా।గ్రమందు రాఁగ
నిష్ఠ నలరారు కాత్యాయ।నిని మునీంద్ర! 145
చ. కనుఁగొని శైలము న్విడిచి । గ్రక్కునఁ గ్రిందికివచ్చి స్వాలయం
బున కిపు డేగి శౌర్యబల।పూర్ణుఁడు నా మహిషాసురేంద్రునిం
గనుఁగొని ప్రీతితో ననిరి । కర్బురనాయక! నీవు సొంపునం
బొనరినవాఁడ వేమి నిజ।బుద్ధిఁ దలంపవు నిక్క మారయన్. 146
క. ధీరాసురగణనాయక, [illegible]దువడిని మనము । రమణీయముగా
సారెకు వెలిగెడివింధ్యనుఁ, జేరువ మాకొండ నలరు । శిఖరమునందున్. 147
క. సురనారిరూపంబునఁ, బరఁగి మహత్త్వమున వెలసి । బంధురలీలా
భరితాంగంబుల నడరెడి, తరుణీమణి కలదు దానిఁ । దరమే పొగడన్ 148
తే. ఆమె ముంగురు లిలఁగెల్చె।నభ్రసమితి
మోము సోము జయించెను । మూఁడుకన్ను
లగ్నులను మూఁడిఁటిని నోర్చె । నధికదీప్తి
గళము శంఖము నోడించె । కడఁగి నియతి 149
చ. ఘనసకలావనీవిజయుఁ । గా నిను నెంచి మరుండు మించి చే
సిన పటుభూరిదుర్గముల । చెన్నువహించుచు వర్తులంబులై
తనరి కరీంద్రకుంభముల।దర్పము మాపి మనోహరోన్నతిం
గనఁబడు నాతిచన్గవలు । కర్బురవంశపయోధిచంద్రమా! 150
చ. నిరతము నీపరాక్రమము । నేర్పు నెఱింగి హరిప్రియాత్మజుం
డరముడిఁజేసినట్టి వగు।యంత్రములో యన నొప్పి మిన్ననా
పరిఘులఁబోలి పీనతను । భాసిలి శస్త్రసమన్వితంబులై
సరిఁగొని రెండుతొమ్ముదుల । సంఖ్యను నున్నవి తన్విహస్తముల్ 151
తే. రాక్షసేశ్వర! త్రివళీత।రంగ మగుచు
స్నిగ్ధమై సుందరంబయి । చెలఁగు నడుము
పైకిఁ గానసాగుటకు నీడు । భయమువలన
నతనుఁ డునిచినసోపాన । మనఁగ నెపుడు 152
మ. దనుజాత్వద్భయకాతరుం డగుచుఁ గం।దర్పుండు పైకెక్కఁ బు
ట్టినదా స్వేదపునీటివెల్లు వనఁగా । శివం దగం గుల్కుచుం

ఘనతం గైకొని తీరగేహముల వీఁకకందాకి రాజిల్లె నా
వనితా భాసురరోమరాజి మిగులం బాలిం బిసాళించుచున్. 153

తే. భవ్యమై వర్తులంబయి పరమభాగ్య, సూచకం బయి పద్మంపు సొంపుగులుకు
నాభిమకరధ్వజుని కేలివనంపు సరసి, గాఁగ వెలుఁగొందు సురవైరి కాండనాథ.

చ. మంతు వహించి సంతతము మానుగ మంజుళమై సుదీప్తితో
నంతట మేఖలావృతము నై నడు ముల్లసిలెన్ మృగాక్షికిన్
వింతఁగనేఁ దలంచెదను విస్తృతసాలసుగుప్తదుర్గమా
క్రాంతమనోజరాజవరకమ్రపురం బన దీని నాత్మలోన్ 155

సీ. వికతవాలుకములై వెలసి వృత్తంబులై సమను త్రవస్థితిఁ జాల నొప్పి
కడుమృదుత్వముకల్గి కాంతయూరుద్వయి విలసిల్లుఁ గామభూవిభుఁడు జనులు
నివసించుటకుఁగాను నేర్పుతో నునిచిన దేశంబు కోయను తీగు చెలఁగ
నత్యున్నతంబులై యలరి భాసిల్లె నాకలకంఠి జానుయుగ్మంబు మిగులఁ

తే. దానిఁ బొగగాంచి భ్రాంతుఁడై తమ్మిచూలి
తలఁచి తూర్ణముగను వాస్తస్థలమ్ము
లాచతో రాతికెడ గదా యనుచు నేను
మదిని యోచించెదను ఘోరమహిషదనుజ! 156

ఉ. లోకము లెల్ల మించి నిను లోలత గెల్వను మారుఁ డెంచి సు
శ్రీకర మొప్ప నీకరణిఁ జేసె ననం గతకేశవర్తులా
స్తోకశివప్రదంబులయి సిస్తున శోభిలె నారి! చూడ నా
కోకిలవాణి జంఘ లొగి గూరిమి నీనెఱవై దితీశ్వరా! 157

ఉత్సాహ. ధీరనలువవాంఛబుద్ధి దేజరిల్లుచుండ నా
సారసాక్షిపాదయుగము సారసోదరప్రభా
చారుతరముఁ గా సృజించె సర్వదేవనాయకుల్
సారె సన్నుతించుచుండ స్త్రీస్థలంబులోఁ దమిన్ 158

ఆ. ఆనతియ్యఁదగిన దైనట్టిబింబోష్ఠి, నఖరరత్నమాల నభమునందు
వెలయుబుక్తిమాల విధము నై చెలువొందె, దాని నెన్నఁదరమె దనుజనాథ

మ. దనుజేంద్రా! యిటువంటిరూపమునఁ దత్తన్వీలలామం బొగిన్
ఘనబాణాసనశస్త్రపాణి యగుచున్ గమ్రాంగయై యుండ మే
మునుఁ గన్గొంటిమి ధాత్రిమీఁద నది యేపుణ్యాత్ముసత్పుత్రియో
వనితారత్నము గుర్తెఱుంగ మనుచున్ వారిట్లు భాషించినన్ 160

క. ఆదైత్యులవాక్యంబుల, నాదేవీరూపవృత్తియత్నస్థితులన్
సాదరముగ విని మహిషుం, డాదట పెనఁగొనుచు నుండ నాకాలమునన్.

క. కలదా విచార్య మిట నని, వలనొప్పఁగఁ దలఁచె మహిషవల్లభుఁ డోలిం
దొలి దుష్కర్మం బీగతి, వలపించుచు నుండ మోహవశుఁడై యంతన్. 162

ఉ. భూసురవర్య! పూరుషులు ముందుగఁ బొందుదు రబ్జయోనిచే
వ్రాసినపుణ్యపాపములఁ వారక స్థానమునందె నెవ్వఁ డే
వాసములోన నెట్లు చనుఁ బ్రాఁకిని నట్లతఁ డట్టిచోటికిం
ద్రోసినమాడ్కి నైఁ జనును దోడనె తాఁ జనునట్టుకానిపోన్ 163

వ. విను, పిదప నారదుజేంద్రుఁ డతిమోహంబుతో చండ, ముండ నమరబిడాల నేత్ర, కపిల, ఘోరాయుధ, బాష్కల, విక్షుర, రక్తబీజాదులఁ గాంచి సమర సమర్థు లగువీరిపుడు మిక్కుటముగ రణభేరి మ్రోయించి నాకమునువదలి వింధ్యనగంబుఁ జేరి యక్కొండ నొలిదండయం దండంబుగఁ బొందుపఱచిన శిబిర మందు వసించి కవచంబులు ధరించి బాణబాణాసనపాణులై మెలఁగుచుండుఁ డని యాజ్ఞాపించె నంతట విరోధిహంతయును దుందుభిరవుండును రాక్షససేనానాయకుఁడును మయునిసుతుఁ డగుదుందుభిమహిషాసురప్రేరితుఁడై పోయి మింటనుండి కాత్యాయనీదేవిఁ గని 164

దుందుభి కాత్యాయనికి మహిషాసురశక్తిఁ బలుకుట.

క. పరమకుమారీ! వినుమా, నిరుపమభుజబలముతోడ నెగడి మహాభీ
కరదైత్యపుఁ డగుమహిషా, సురదూత నటంచుఁ బలికెఁ జోద్యం బలరన్

సీ. అంతఁ గాత్యాయని యాదుందుభినిఁ గాంచి రారమ్ము దైత్యనిర్భయుఁడ వగుచు
మహిషుఁడు చెప్పిన మాట నిక్కమ్ముగఁ బలుకుమీవన సురవైరిదేవి
వాక్యంబువలన నంబరమును విడిచి ధాత్రిపైఁ జేరి తరువాయిఁ జారువీరి
పైసుఖంబుననుండి పలికె రంభాత్మజుఁ డాడినసుడుల నాయంబతోడ

ఆ. నసురుఁ డమరవైరి యగుమహిషాఖ్యుఁ డి, ట్లాజ్ఞ నిచ్చె నీకు నమరవరులు
తనకు నోడి విగతధైర్యులై భ్రమతోడ, నవని మెలఁగుచుండి రధికచింత

తే. మర్త్యపాతాళపవమానమార్గదేవ, వాసములు మర్త్యనాథాదిపంచజనులు
నాకు వశులైరి స్వర్గాధినాథ దివ్య, నీలగళభాను లాగి నేనె నీరజాక్షి!

క. బాలా! సకలజగంబుల, నేలెదు మన్నీఁడభువినిఁ బృథుపుష్కరపా
తాళసురలోకములలో, నాలమునం దెవఁడు సమత నందును నాకున్ 168

తే. అఖిలములు నన్నుఁ జెందె వీర్యార్జితంబు
లగుచు నిత్తఱి నీభూమియందు నేనె
దివ్యభోగాలయుఁడ శౌర్యకీర్తితనుఁడఁ
జారుగుణజాలపాత్ర! విశాలనేత్ర! 169

శా. వరనారీమణి వాఁడు వీ వనుచుఁ బ్రశ్లాఘించి యీవింధ్యభూ
ధరముం జేరితి నీనిమిత్తమయి మోదం బొప్ప నీధారణీ
భరముం బూనిన నవ్యజింపు తగ నీప్రాణేశుఁ గా నీకు నేఁ
గరమర్హుండను రాజభర్త నగుదుం గంజాతపత్రేక్షణా! 170

కాత్యాయని దుందుభితో రణశుల్కముఁ బలుకుట

చ. అని యిటు లాశరేజ్యుఁడనె నంచు మయాత్మజుఁ డాడ దేవి త
ద్దనుజునితోడఁ బల్కె జితదైవతుఁడై భువి దానవేశుఁడై
మనుట యథార్థమే యతఁడు మాట లిఁకేటికి వాని భర్తఁ గాఁ
గొను మని నీవు పల్కెదువొ కూర్మినిఁ జెప్పెద నాలకింపుమా! 171

మ. దితిజా! మాకులమందు శుల్కమని ఖ్యాతిం గాంచుధర్మంబు సం
తత మొప్పారుచు నుండుదానిఁ బటుదైత్యస్వామి నా కిచ్చునే
ని తమి న్నాని వరింతుఁ బ్రాణపతిఁగా నేనంచు భాషింప వాఁ
డతిమోదంబున నాలకించి పలికెం హర్షంబు సంధిల్లఁగన్ 172

ఉ. ఆయతపత్రనేత్ర! మనసార వచింపుము శుల్కమెట్టిదో
పాయనికూర్మితో నతఁడు బల్మి శిరంబును నైనఁ దెంపుతో
నీయెడ నిచ్చుశుల్కమన నెంతటిదాతని కే దలభ్యమై
పోయినదాని సారెకును భూమిని నింగిని నెంచి చూచినన్ 173

సీ. మయపుత్త్రుఁ డీరీతి మందలించిన విని శివయట్టహాసంబు చేసి నవ్వి
సర్వచరాచరసంహితార్థం బగువాక్యంబు నొడివెనుఁ [illegible] మెఱయ
మానుషాశన! విను మాకులంబునఁ బుట్టి నట్టికుమారిని నని నెవండు
దర్పించి గెలుచునో ధవుఁ డౌను దానికి నతఁ డని పూర్వమం దస్మదీయ
ఆ. కులజు లిట్టిశుల్క గురుధర్మ మొనరించి
రనుచుఁ దేవి చెప్ప నాలకించి
మహిషదనుజుఁ జేరి మానినీమణి చెప్పి
నట్టిదెల్లఁ బలికె నతఁడు మౌని! 174

వ. అంత నధికతేజస్వి యగురంభునిపుత్త్రుఁ డతిమోదమున వింధ్యనగకూటంబు నాక్రమించి సరస్వతినిఁ గెలువఁగోరి సమరసన్నాహసంరంభాయత్తచిత్తుం డగుచు వెడలె నితురుఁ డనురాక్షసుఁడు దీక్షతోఁ బ్రతిపక్షులనెల్ల నీక్షతిఁ గూల్చ నెంచి నమరదానవుని రాణువకు ముందు నడుచునట్లు చేసె నంత నమరాసురుఁడు బలాధిపత్యమును వహించి దృఢాశ్వము నెక్కి దండుండినచోటుఁ జేరి సేన తన వెంటనంటి రాఁ జనుచుఁ గాత్యాయనీదేవి నెదురింప వేగంబునఁ బోయె నంత యుద్ధబద్ధబుద్ధితో నరుదెంచు నమరుని నాలోకించి బ్రహ్మపురోగము లగు వేలుపులు పరమేశ్వరితోఁ గవచంబుఁ దాల్పుమని ప్రార్థించిన నాదుర్గ విని దేవత

లారా! నేఁ దనుత్రాణమ్మును ధరింపను నా ముందఱ నారాక్షసాధముఁ డుండి
ఖండనమ్ముఁ గావింపఁగలఁడే యని భాషించుచు శరనివారణకరం బగువర్మ
మును బూనకున్నం గని త్రిదశవరేణ్యుఁ డగుముక్కంటి తద్రక్షణార్థమై
దేవికి హరిపంజరం బుపదేశించె గౌమారి తత్ప్రభావమువలన సకలదేవతావ
ధ్యుఁడును దనుజవరుఁ డగుమహిషాసురునిఁ దనపాదములతోఁ దన్ని పుడమిఁ
గలిపె నిట్టి మాహాత్మ్యముకల యీ విష్ణుపంజర మంతకంట నధికమైన దని
యెన్నఁబడె. 175

తే. బ్రాహ్మణోత్తమ! యేవాని భావమందు
శౌరి వసియించునో యట్టి జనున కెవఁడు
దర్పహాని నొనర్పను ధాత్రి నట్లు
చేయఁ గమకించెనేని తాఁ జెడును నిజము 176

సీ. ఇటుల పులస్త్యమునీంద్రుఁ డాడిన విని నారదుం డనె మునినాథ! దేవి
పరమవింధ్యమహీధ్రవప్రగుఁడును వాహనాన్వితుఁ డగుమహిషాసురేంద్రుఁ
బటుబాణతతులుండఁ బదహతునిఁగఁ జేసె నేలకో యని మది నిపుడు శంక
కలుగుచున్నది దానిఁ గరమర్థి వివరించి పలుకుమన్న నతండు పలికె భక్తి
తే. వెలయ దేవయుగాదిప్రవృత్తమగుచు
నతులపుణ్యప్రదమ్ము భయాపహమ్ము
నైన నీపుణ్యకథను నీ వవహితుండ
వగుచు నిత్తఱి వినఁదగు ననఘ యెన్న 177

నమరదానవుఁడు కాత్యాయనిపై యుద్ధముఁ జేయఁబోవుట

క. నారద! నమరాసురుఁ డా, తీరునఁ గోపించి మించి దివ్యాశ్వమహా
వారణరథుఁడై వచ్చెన, వారిత దేవీజయాభివాంఛ చెలంగన్ 178

ఉ. అంతట దేవి దేవయుత యై సురవైరులఁ దాఁకి కార్ముకం
బంతన నేర్పుతోఁ దిగిచి యస్త్రవితానముతోడ వారినిం
బంతముఁ బట్టి ముంచె జలవాహము నింగిని వృష్టిధారలన్
వింత గఁ గప్పుమాడ్కిఁ దనవీర్యము శౌర్యము పిచ్చలింపఁగన్. 179

క. ఆకార్ముకంబు శివచే, నాకర్షిత మగుచు మెఱసె హాటకసుమముల్
జోకఁ దగి జలదగతమై, ప్రాకటముగ వెలయు మెఱపుభంగి న్స్వామీ! 180

చ. సురరిపులైన రాక్షసుల క్షోణిని గొందఱఁ గాల్చెఁ గోలలన్
గురుముసలంబులన్ బరులఁ గొందఱ మొత్తె గదాయుధంబుతోఁ
బరువడిఁ గొందఱ న్మిగుల స్వస్థలభగ్నులఁ జేసె దేవి యీ
కరణినిఁ జక్కరక్కసులఁ గ్రక్కున నుక్కడఁగించె నా యెడన్. 181

క. ఆకేసరి యొకఁడైనను, భీకరలయకాలుమాడ్కి । విలసిల్లి జటా
ప్రాకటసటల విదిర్చియు, వీఁకగ దురదైత్యనాగ । వితతి వధించెన్ 182

వ. అంతఁ గాత్యాయనిచే నసురులు కులిశవిదారితులును, శక్తినిర్భిన్నవక్షులును, నాగళ్లచేఁ జీల్పఁబడినకుత్తుకలుకలవారును, గండ్రగొడ్డండ్లతోఁ రెండుతుండెములుగాఁ జేయఁబడినవారును దండాభిహతులు నైరి. కొందఱు కంపించిరి కొందఱు మోహితులై పడిరి, మఱికొందఱు సమరవిముఖులై చనిరి ఇట్లాదేవిచే దైత్యదానవులు చంపఁదగినవారును రుద్రాననులు నై భయార్తచిత్తమొప్పఁ గాళరాత్రినిఁగా నాపరదేవిని భావించి పోయిరి పిదప సమరదానవుఁడు వీక్షించి చనినబలంబును బలాధిపతినిఁ గాంచి రణాగ్రమందు బాణబాణాసనపాణి యై నిలిచియున్నదుర్గ నాలోకించి మత్తమాతంగాధిరోహుఁడై వెడలివచ్చి దేవిపై శక్తిని సింగముమీఁదఁ ద్రిశూలంబును వైచిన నవి జ్వాలనోపమానములై రాఁగని దుర్గ వానిహుంకారరవంబుతోఁ ఖండిసేసె. 183

క. అంతట మత్తకరీంద్రము, పంతంబున దేవి హరినిఁ । బట్టిన నది పై
కెంతయు వైళమునం జని, సంతస మొప్పారుచుండ । శౌర్యస్ఫూర్తిన్. 184

క. దనుజునిఁ బాదతలంబున, ఘనశక్తిం గొట్టి పట్టి । గతజీవునిఁగాఁ
గనుఁ జేసి దంతి మూపుర, మున నుంచి కుమారి కపుడు । ముదమునఁ దెలిపెన్.

ఆ. దేవి దైత్యు నంతఁ । దీవ్రకోపంబున
నెడమచేతఁబట్టి । పృథులశక్తి
రణమునందుఁ ద్రిప్పి । రయమున నిష్ప్రాణ
భంగి వ్రేఁవఁ జేసి । ప్రౌఢి మెఱయ 186

సీ. పటహఘోరనాదని । భం బగుహాస్యంబుఁ గావించె నాయెడఁ । గడఁగి యట్టి
హాసంబువలన నత్యద్భుతం బొనఁగూడ శస్త్రపాణులు మహా । శౌర్యధనులు
వృకసమరూపులు । విషధరగంధర్వశార్దూలసూకర । సైంధవాఖు
మూషికాజావిక । ముఖులు గోవదనులు నానాస్యగురుపాద । నయనచరణు

ఆ. లైనభూతవీరు । లటఁ బుట్టి గుమిఁగూడి
రందు వ్రేఁవఁ జేసి । రన్యు లెలమి
నఱచి రొ[illegible]లు వేడ్క । నలరి పాడుచు నవ్వి
రన్యు లంబఁ బొగడి । రంత మాని 187

క. ఖ్యాతిమహాశనిత్రాసం, ఘాతంబును గూల్చుకరణిఁ । గాత్యాయని త
ద్భూతాళిఁ గలసి తిరుగుచు, దైతేయుని వానిసైన్య । తతిఁ జెండాడెన్. 188

క. సేనాపతియా సమరుఁడు, హీనప్రాణుండు నగుచు । నిలఁ గూలంగా
సేనాపురోగతులు వడి, తా నీటున వెడలి రంత । దుర మొనరింపన్. 189

కాత్యాయని చిక్షురాసురుని వధించుట

చ. రథికులలోన మేటియయి రాజిలువాఁడును సైన్యపాలుఁడుం
బ్రథితుఁడు నైన చిక్షురుఁడె ప్రాణినిఁ గర్ణము దాఁక వింటినిం
బృథుగతిలాగి దేవతలిఁ బెల్లుగఁ గప్పె శిలీముఖంబులం
బృథివిని వృష్టిచేఁ బొదువు వారిదము న్వలె నంత నోమునీ! 190

మ. సురతస్వామిని యైనదేవి ధరపై శోభిల్లఁ దద్వ్యుఛ
కరశస్త్రంబులుఁ బిండిచేసి దనుజా ల్కాంపింపఁగా దేవతా
శర సంధానసువర్ణపుంఖశితభాస్వత్తోడశాస్త్రంబులం
గరపంక్తిన్ ధరియించి మించి మెఱసెన్ గ్రౌర్యంబు మిన్నందగన్ 191

ఉ. పిమ్మట దేవి యాదనుజుఁ బీచ మడంచెను నాల్గుముల్కులం
బమ్మినశక్తితోడ నొకబాణమునన్ వమయించె సారథిం
గ్రమ్మఱ నొక్కశస్త్రమునఁ గాల్చెను టెక్కెము నొక్కతీవ్రబా
ణమ్మున సాస్త్రచాపమును నాశముచేసెను సైయనన్ వెసన్. 192

ఉ. సింగిణి నాశమైనఁ గని చిక్షురుఁ డాగ్రహ మొప్పఁ గేడెముం
రంగదనంగఖడ్గముఁ గరమ్మునఁ దాల్చి బిరాన వైవ నా
భంగినిఁ జూచి దివ్యసురభామిని సాధ్వససైన్యపాలనా
చంగుని చర్మఖడ్గములఁ జయ్యనఁ ద్రుంచెను నాల్గుతూఁపులన్. 193

శా. కాత్యాచార! విచార! నారద! మహాసంతోషిరై క్రోష్టుకుం
డత్యాగ్రహ వరసింహిఁగా డఁజను నట్లాహ్లాద మొప్పంగ నా
దైత్యుం డంతట శూలముం గొని లసద్దర్పాతిరేకంబుతో
నిత్యోత్కాత్యాయనీ కుమారిఁ గవిసె న్నేర్పొప్పఁగా నాయుడన్ 194

చ. ఎదురుగ వచ్చుదానవు మహేశ్వరి కన్గొని క్రోధయుక్తయై
పదములనైదుచేతులును బల్మినిఁ బట్టి శిరంబుఁ గోలలన్
గుదియఁగఁ గొట్టఁ జిక్షురుఁడు కుంభిని వేగమె కూలె నంతటన్
మదమున నుగ్రవక్త్రుఁ డనుమానముఁ బొందక దాఁకె దేవినిన్. 195

కాత్యాయనిఁ బాష్కలాదిరాక్షసులఁ జంపి వారిపై నృత్యంబుఁ జేయుట.

సీ. ఘోరకరాళవక్త్రులు నైనదానవు లుద్ధతపటుబాష్కలోగ్రవదన
దనుజులు దుర్ధరదర్పితదుర్ముఖమార్జారనేత్రులా మాంసభక్షు
లతిబలు లైనట్టి యసురులు కొందఱు బాణాస్త్రపాణులై పరమశివనుఁ
దాఁకుటకై రాఁగ దర్శించి లీలతోఁ గాత్యాయనీదేవి కరమునందుఁ
తే. దమినిఁ డమరుకవీణలఁ దాల్చి నవ్వి, వివిధరీతులవాయింప వేడ్క భూత
గణములెల్లనుఁ దద్వాద్యగతికి సమము,గాఁగ నాడుచు నవ్వుచుఁ గ్రాలె నంత.

ఆ. అసురు లస్త్రధరులు । నై సరస్వతిని నొప్పింప దేవి దనుజ।వితతి కేశ
పాశములనుఁ బట్టి । పంచాస్యముననుండి, పైకి నెగిరి వేడ్క । పరిఢవిల్ల. 197

చ. సురుచిరవింధ్యసానువున । సొంపున నృత్యముచేయుచుండ భీ
కరబలతద్దితీశ్వరులు । బాహువికంపితశీర్షదర్పతా
విరహితశస్త్రజీవులయి । విశ్వముపైఁబడి; రట్టి దానవో
త్కరమును జూచి రోషమున దానవనాథుఁడు తామ్రనేత్రుఁడై. 198

మహిషాసురుఁడు కాత్యాయనిపై యుద్ధముఁ జేయఁ బోవుట.

చ. ఖురములచేత భూతములఁ । గొబ్బున ముక్కలుఁబుట్టుగాలిచే
నొరులను దుండపుచ్ఛముల । మూర్జితతేజముతోడఁ గొండలన్
గురుతరశాతశృంగములఁ । గొండలు భగ్నముసేసి సింగముం
గరకరిఁ గూల్ప నెంచి చనెఁ । గష్టనిశాటుఁడు సంయమీశ్వరా! 199

ఉ. అంతట నంబికాసతి మ।హాగ్రహ మొప్ప బిరాన వాని బ
ల్వింతఁగఁబట్టి పై కెగుర । వేసిన దైత్యుఁడు తీక్ష్ణశృంగుఁడై
పంతమునన్ ధరాభ్రములఁ । బాలినిఁ ద్రవ్వుచు విత్తకంధులం
బంతమువీఁడవే చెఱచి । పాఱెఁ గుమారినిఁ గెల్వఁ బూన్కతోన్. 200

క. అరుదెంచు మహిషదానవుఁ, బరికించి విశేషకోపపరివృత యగుచుం
బరదేవిపాశమున నాసురవైరినిఁ గట్టె సురలు । చోద్యము నొందన్ 201

సీ. కడఁగి దైత్యుఁడు భిన్న।కటహస్తిరూపుఁడై కదిసినదేవి త।త్కరముఁ ద్రుంచె
నతఁడు క్రమ్మఱ మహి।షాసురుఁడై రాఁగఁ బరదేవి వానిపై ।వడిఁ ద్రిశూల
మును వైవ నగి శీర్ణ।మూలమై పడఁగని, జ్వాలనాస్యమైనట్టి । శక్తి వైచె
నది కుంఠితాగ్రమై । యవనిఁ గూలినదైత్యహార మైనచక్రంబు । నంత వ్రేసె
ఆ. నవుడు భిన్నరూప । మై యది ధర వ్రాల, ధనదుగదను ఘోర।దనుజుమీఁదఁ
బరపె నద్ది మిగుల । భస్మమై కాశ్యపిఁ, బడినఁ బరమదేవి । ప్రౌఢిమెఱయ.

వ. మునీంద్రా! మహిషాసురుని వారుణపాశములతోఁగట్టిన నది తచ్ఛృంగతుం డాగ్రఖురచూర్ణితంబై పడిన విలోకించి భవాని కోపించి యామ్యదండముఁ బ్రయోగించె; నదియు బహుదండత్వముఁ జెందె, నంత నమరపతి వజ్రముతో వానిం దేవి చదిమిన నదియు భగ్నత్వముం గాంచె, బిదపఁ గాత్యాయని సింగమునువదలి సత్వరంబున నసురవీరునివీఁపుపై నధిష్ఠింపఁ గని వాఁ డతివీర్యశక్తితో నవనింబడి పొరలాడం దొడంగిన నాబింబోష్ఠి నిజమృదుకోమలపదములతోఁ దడిచర్మమువలె వాని మర్దించిన; నగాభుఁడును సముద్యమానుఁడును బలశాలియు నసురంభసుతుఁడు తత్పదప్రహారితుండై హీనశక్తినుండె నప్పుడు

## కాత్యాయని మహిషాసురుని వధించుట.

ఉ. దానవనాథుకంఠమును । దప్పితఖడ్గముతోడ ద్రుంపఁగా
దాన సఖడ్గపాణి యగు । దారుణమర్త్యుఁడు పుట్టె నంతలో
వానియురంబుఁ ద్రొక్కి పటు । వైఖరిఁ గేశములెల్లఁ బట్టి స
మ్మానితమానసిం దునిమె । మానుగ మానిని మచ్చరంబునన్ 204

తే. దనుజబలమంత హాహాకృ । తంబుతోడ
వెలసెఁ జండుఁడు ముండుఁడు । వీరతార
సారమయు, వాసిలోమ్నాది । సకలదైత్య
పతులు ప్రమథులచేతనుఁ । బవరమందు 205

క. పొరిఁబొరిఁ దాడితు లగుచుం, బిరబిరఁ బాతాళమునకు । భీతిం జని రా
సురవితతి తజ్జయంబునుఁ, బరికించి భవాని నిట్లు । ప్రార్థించి రొగిన్ 206

ఉ. హాయనిఁ ద్రిలోకములఁ । బర్వవిదారుణవక్త్రదృష్టితో
నీయెడ నుండినట్టి జగ । దేకశరణ్యకుఁ జారురూపనా
రాయణికి న్మహామతికి । రాక్షసహంత్రికి సత్యవాక్యకా
త్యాయనికే మొనర్చెదము । ధన్యత మ్రొక్కులు భక్తి నీయెడన్ 207

తే. ఇట్టు లాదేవి దేవతా । ధీశవినుత, యగుచు సురతతి కోరికనై । యవని మరల
జన్మమందెద నని పల్కి । శర్వపాద, జలజముల నాశ్రయించె నిర్జరుల వదలి.

క. భూసురవర్య! పులస్త్యా!, భాసురరుచియౌ భవాని । భవము న్మహిలం
బాసిఁ బలుకుము విన మది, నాసక్తి చెలంగె నాకు । నతివిస్తృతిఁగన్ 209

సీ. అనిన నారదుతోడ । నా పులస్త్యుఁడు పల్కె సంయమీశ్వర! దేవి । సంభవంబు
భాషింతు విను శుంభుఁ । బరిమార్చి సకలలోకములకు హితముఁ । గడిమిఁ జేయ
మదిలోనఁ దలపోసి । మహితతపోధన యగుదేవి హిమగిరి । యందుఁ బుట్టి
భవుని దేవేరియై । భాసిల్లి యువ యనుపేరుతోఁ జెన్నొంది । పృథివిమీఁదఁ
ఆ. గోశమందుఁ బుట్టి । కౌశికి యై వింధ్య, భూధరంబుఁ జేరి । భూతవితతిఁ
గలిసి శుంభదైత్య । ఘనుని శుంభాసురు, నుగ్రవిశిఖవృష్టి । నుర్విఁ గూల్చె

క. అనిపల్క నారదుం డనె, ననఘా! దక్షునికిఁ బుత్త్రి । యగుసతి మృతినిం
గని హిమవద్గిరిసుత యై, తనరినదని పల్కి తీవు । దయ పెంపొందన్. 211

క. నీ వీయెడ ననితరమగు, భావం బొప్పారఁ దానిఁ । బల్కుము నాతో
భావింప సర్వుఁడవు ధర, పావనమునివంశదీప! । పరిహృతపాపా! 212

తే. ఎలమిఁ బార్వతి కోశమం । దెట్లుపుట్టెఁ, గౌశికియు నై ముదంబునఁ । గర్బురేశు
లైన శుంభనిశుంభుల । నాజి నెట్లు, చంపె నీవీరు లెవరికిం । చంగసుతులు' 213

చ. సమధికశీల! దీనిఁ గడు। సత్యముఁగా వచియింపు నీప్రసా
దమునఁ దదీయపుణ్యచరి। తంబును వింటిని విస్తరించి యీ
సమయమునందు హైమవతి। సంభవముం గృపఁ బల్కుమన్న సం
యమివరుఁ డౌపులస్త్యుఁ డనె। నామునివర్యునితోడ నారదున్ 214

పులస్త్యుఁడు నారదునకుఁ బార్వతిజన్మక్రమంబుఁ జెప్పుట.

చ చతురవచోవిలాస! విను। క్ష్మాధరనాయకుపుత్రియైనపా
ర్వతిభవముం షడాననుని। భాసురజన్మవిధిక్రమంబు నే
నతిముదమొప్పఁ జెప్పెదఁ బ్ర। యత్నముతో విను దక్షపుత్రి యా
సతి మృతిఁబొంద శంకరుఁడు। సంతస మేమియు లేక దీక్షతోన్. 215

తే బ్రహ్మచర్యవ్రతాచార। పరుఁడు నగుచుఁ
బోరి నిరాశ్రయభావముఁ। బొంది కుంది
దారుణం బగుతపమున। ధరణినుండె
భూరితేజోభిరాముఁడై। పుణ్యమూర్తి! 216

క అశర్వుఁడె సురసేనా, ధీశుఁడు నై దైత్యవరుల। ధృతి, నడఁగించెన్
శ్రీశివరూపుఁడు నైనా, కేశబలంబులను విడిచె। నీర్ష్యాతురుఁడై 217

తే అంత శంభువినాకృతు। లగుచు దేవ
పతులు వర్తింపఁ గని దైత్య। పతియు నగు ని
శుంభుఁ డానాకవాసులఁ। జుట్టుముట్టి
చివ్వ నోడించె నిజశక్తి। సిద్ధిఁ జూపి 218

దేవతలు హరికడ కరుగుట.

క దితిసుతపతినిర్జితసుర, తతు లతిదుఃఖంబుతోడఁ। దహతహపడుచుం
గుతుకముఁ దొలఁగి రయంబున, నతివల దిగనాడి భీతి। నాయెడ మానీ! 219

శా. శ్వేతద్వీపలసన్మరాళ మగుచున్। జెన్నారి దేవేశుఁడై
ఖ్యాతిన్ గాంచి గదోరుచక్రములవే। డ్కన్ బట్టి విన్నాణిరై
చేతోమోదముతోఁ జెలంగెడి మహా। శ్రీవిష్ణునిం జేరి యో
భూతేశా! మము నేలు మంచు శరణం। బు న్వేడి రాదేవతల్ 220

క. శక్రపురస్సరు లగుచున్, వక్రగతి న్వచ్చు దేవ। వరులను బ్రీతిం
జక్రియు నరవరుఁ డగుహరి, సక్రమముగఁ జూచి నవ్వి। చతురత్వముతోన్

తే అభ్రగంభీరతనుఁ బల్కె। నమరులార!, కుటిలచిత్తుఁడు వేల్పుల। గుమికి తేఁడు
నగునిశుంభునిచేత మీ। రాజిలోన, విజితు లైతిరి కాఁబోలు। విపులభీతి 222

హరి దేవతలకుఁ బార్వతిజన్మయుక్తి చెప్పుట.

సీ కడిమి నెద్దానిచే। గళవళపడి యిట్లు చను దెంచితిరి నాదు। సన్నిధికిని
భూరి భయక్షితమున। బురుడించు జయవిధి నాచరింపుఁడు దాని। హర్ష మొదవ

విలసదగ్నిష్వాత్తవిబుధసంజాత యై మేనాఖ్యతో భువి మెఱయునట్టి
దేవత కలదు తద్దేవి నతిశ్రద్ధ నలరి మహాతిథియందు భక్తి

తే. హైమగిరికయి ప్రార్థింపుఁ దామెయందు
దక్షకోపంబుతో జీవితము మలంబు
రీతి విడనాడి తపమునఁ బ్రీతిఁ జెలఁగు
నతి మనోహరరూపయై సంభవించు 223

ఉ. భావము పొంగ నాసుదతి భర్గునివీర్యవరాంశయుక్తి సం
భావితుఁ డౌకుమారు ననవద్యునిఁ గాంచును వాఁడు ప్రౌఢమై
దేవ సపత్ననాథుఁడును దీపితసైన్యగుఁడౌ నిశుంభునిన్
వావిరిఁ బట్టి చంపఁగలవాఁడు సురోత్తములార! యాజిలోన్ 224

తే. కాన గురుఫలయుక్త యై కలితపుణ్య, శేఖరం బైన యాకురుక్షేత్రమునకు
నరిగి తత్పుణ్యదేశమునందు వెలయు, నట్టి పృథుజలతీర్థమందమలమతిని 225

క. భవ్యకార్యపరులు నై పితృ, నివహంబులఁ బుణ్యతిథిని నిశ్చలభక్తిం
దవిలి భజించిన యెడ రిపు, నివహపరాజయము కలుగు నిజముఁగ మీకున్.

వ. ఇట్లు చక్రి పలుక జిష్ణుపురోగము లగు క్రతుభుజులు వాసుదేవుని దివ్యోక్తుల నాలించి నిటలతటఘటితాంజలిపుటులై నుడివిరి పరమేశ్వరా!, కురుక్షేత్రమున నెద్ది యెటఁ బుణ్యమగుపృథూదకతీర్థంబు కలదు? తత్తీర్థరాజం బెట్లు కలిగె? ఏపుణ్యతిథియందుఁ బితరులు ప్రయత్నముగ జలములచే సంతుష్టు లగుదురని చెప్పంబడె నట్టి వారోత్తమతిథి యెయ్యది? మాకు నానతియ్యఁదగు నని వేల్పులు ప్రార్థించి పలికిన విని కైటభారి కురుక్షేత్రోత్పత్తినిఁ బృథూదకతీర్థప్రభావంబును బుణ్యతిథివిశేషంబును వక్కాణింపఁదొడంగె 227

తపతీసంవరణోపాఖ్యానము.

ఆ. కృతయుగాదియందు మృగచిహ్నకులజుఁ డై
వెలసె ఋక్షుఁ డనెడి విభుఁడు భూరి
బలుఁడు వానివలనఁ బ్రభవించె సంవర
ణప్రభుండు జగతి నవ్యకీర్తి 228

సీ. అంతట ఋక్షుఁ డత్యామోదమును జెంది పిన్నవాఁ డైననుఁ బ్రియకుమారు
నభిషిక్తునిఁగఁ జేసె నాత్మ రాజ్యమునందు బాలుఁడై యుండి యాపార్థివుండు
సర్వధర్మంబులఁ జక్కఁగ నడపుచు మద్భక్తుఁ డయ్యెను మాన్య లెన్న
నతనికి వరుణజుఁ డగువసిష్ఠుఁడు పురోహితుఁడు నై వెలసి భూమీశ్వరునకు

ఆ. సాంగవేదములనుఁ జదివించె సత్కృప, వాని నెల్ల రాజపతి గ్రహించి
సర్వకర్మవిధుల సత్తపోనిధియు నావరుణసుతుని నునిచి భావ మలర. 229

క రాజన్యుఁడనఘాఖ్యుఁడు, గాఁ జను తిథియందు ఘోటకంబెక్కి వనిగా
దేజము దగ వేఁటాడం, గాఁ జతురత నొంటిఁజనియెఁ గడుజవమొప్పన్. 230

క. వననగవైభ్రాజము నై, పొనరుచు సర్వర్తుజనితపుష్పంబులతోఁ
దనరెడి వసిష్ఠమునివరు, వనముఁ బ్రవేశించె వాంఛ వఱలుచు నుండన్. 231

క ఆవనభూమినిఁ దిరుగుచుఁ, దావులకుం దృప్తుఁ డగుచుఁ దత్పరమతితో
నావేళ మెల్లమెల్లన, భూవరసుతుఁ డేఁగి చూచెఁ బూర్ణోత్కర్షన్. 232

సీ ఫుల్లకల్హారాబ్జపుష్పలేందీవరరక్తపద్మసుమాళిరంజితంబు
నగు నావనాంతంబు నరసి యచ్చోఁ నచ్చరలు వేల్పుకన్నెలు రమణఁగ్రీడ
మలయుచుండిరి వారిమధ్యమునం దధికయు నైన యొకకన్యఁ గాంచి తేఁడు
కామునికోలలఁ గాసిల్లి నాసతిసంవరణునిఁ జూచి స్మరుని వాడి
తే తూపులకుఁ జిక్కి ప్రక్కను దొరక నిరువు
రతను శరపీడితాంగులై యతులమోహ
వార్ధిఁ జొచ్చిరి నూరతి వాజినుండి
జారిపడె మేనుఁ దెలియక జగతి వంత 233

ఆ దివ్యమతులు కామదేవాలి గా గంధర్వ, లవనిమీఁదఁబడిన నధిపుఁ జేరి
శీతజలము మేన సేచన మొనరింప, నతఁడు లబ్ధసంజ్ఞుఁ డయ్యె నపుడు. 234

తే వేల్పువెల్లాటకత్తెలు వేగ మట్టి, చెలిని నిజతాతగృహమునుఁ జేర్చి యంత
దీఁపుకలతేటమాటలఁ దేల్చి వాని, నూరడించిరి ప్రీతితో నురుగుణాఢ్య!

ఉ దీవత నంత భూవిభుఁ డు తేజిని నెక్కి విచిత్రహేమకూ
టానతరత్నకోటిరుచిరాయతసౌధమమేతమా ప్రతి
ష్ఠానపురోత్తమంబునకుఁ జయ్యన నేగెను గామచారియై
మానితమేరుకూటమును మానుగ జెందెడివేల్పుపోలికన్ 236

క మనుజేశుఁ డెపుడు గిరి దరి, తిని గనె నానాఁటనుండి దివియందును రే
యినిఁ గుడువక నిద్రింపక, మనుచుండెను మదనువిష్ణు మల్లడి వెట్టన్ 237

వ అట్టియెడ 238

క స్థిరచిత్తుఁడు సకలజ్ఞుఁడు, గురుతపసియు నైన వసిష్ఠముఁ డొమరుండు ధరా
వరుఁ గుపంవరణుని గతి, వరయోగేక్షణము వలన బరికించి వెసన్ 239

క వినువీథి కెగిరి సూర్యుని, ఘనమండలమందుఁ జేరి కమనీయరథం
బున నుండుతీక్ష్ణభానుని, గని ద్విజసత్తముఁడు మ్రొక్కి గడుభక్తి మెయిన్

ఉ క్రమ్మఱ వేడివేల్పు బుషికాంతుఁడు నైనవసిష్ఠమానికిన్
బమ్మిన భక్తి మ్రొక్కి ముని పార్థివుఁ డాయెడ నన్యుసన్నిధిన్

సమ్మతినుండి తా వెలిఁగెఁ। జారుతరప్రభ మింట దంట యా
తమ్ముల నేస్తకానివలెఁ। దద్దయు దివ్యజటాకలాపియై 241

సీ. రవి యంతటను మునిప్రవరునితో నని నీవేమి పనిఁగోరి। యిచటి కిపుడు
వచ్చితి వన విని। వారుశే భాషించె ౹౹౹వరణప్రయోజనముకొఱకు
నిను నేను యాచింప। నేఁ డరుదెంచితి దయను నీసుత యైన। తపతి నిమ్ము
దేవేశ యనుచుఁ బ్రార్థించిన దపనుఁడు పార్థివార్థమునకై। స్వగృహసీమ

తే. కెలమిఁ జనుదెంచినట్టి ముని।నీంద్రవర్యుఁ
డగువసిష్ఠుని కాత్మజ। యైనతపతి
నిచ్చిన గ్రహించి మునివరు। డినునియాజ్ఞఁ
జెంది నిజపర్ణశాలకుఁ। జేరె నంత 242

క హరిసుత సంవరణుని వ ౦, బోరిఁ బోరి దలపోసి మానిపూజ్యునకు నతిం
గుఱుమతి నొనర్చి పలికెను, నిరుపమ మగుభక్తితోడ। నియతాత్ముండై 243

చ విమలచరిత్ర! నేను సుర। వేశ్యల౹౹౹జిమహాటవీస్థలిం
సమధికతుష్టనై వెలసి। చారుగతి న్విహరింప దేవతా
సముఁ డగురాజపుత్రుఁ డట। సారెకు న న్గని కామతప్తుఁడై
శ్రమఁ జనె నేనెఱుంగుదునుఁ। జక్క౹౹గ నాతనిరూపుఁ జెప్పెదన్ 244

—— తపతి వసిష్ఠునకు సంవరణుని దివ్యాంగముల నుడువుట. ——

తే. అతనిపదములు చక్రగ। దాసిచిహ్న
తములు జంఘలు గుఱుతన। దంతిహస్త
సన్నిభంబులు నడుమతి। తామ మగుచుఁ
త్రివళులను౹గూడి హరిమధ్య। రీతి వెలయు 245

క పొందికకలచిందమువలె, నందం బగునతనికంఠ। మంసంబులు బ
ల్సుందరములు బీనాయత, సుందరదృఢతరము లగుచు। శోభిలు మానీ 246

క. వనజోద్భవాంకములు నై, పొనరెడిహస్తములు చత్ర। మునుఁబోలు శిరం
బును నీలవక్రలోమము, లును సమనాసికయు జెల్లు। లోకేశునకున్ 247

క పరిశుభ్రకంఠపం క్తియుఁ, బోరి దీర్ఘములై సుపర్వ। ములు కల్గినవై
కరపాదాంగుళు లొనరును, ధరణీశ్వరు సుతున కెపుడు। తాపసవర్యా! 248

సీ. మునినాథ! యా రాజ।పుత్రుఁడు దశపద్మ భాసితుండును మహా।బలధనుండు
షడ్గుణోన్నతుఁడును। సప్తాంగరక్షుండు త్రైగుణానతుఁడు ప్ర।తాపశాలి
విపులత్రిశ౹౹గ౹౹౹డు ధీరుఁడు త్రిప్రలంబుఁడు మహా।దీప్తితను డు
నాల్గిటఁ గృష్ణుఁడు।నాల్గిట సురభియు, ౹౹శ్వేతుఁడై చాలఁ। దివురువాఁడు

ఆ. తాన నతనిఁ బతినిఁ।గా నేనుఁ గోరితి, మానసమున ముందు। మమత నరసి

మానుగాను సుగుణ మాన్యుఁడై నతనికి, నిమ్ము నన్ను నిష్పు డిద్ధచరిత! 249

చ. కులధనరూపభాగ్యములఁ గూడినవానికిఁ గన్యకామణిం
జెలిమి నొసంగ మే లనుచుఁ జెప్పరి పెద్దలు నన్ను నిర్దయా
కలితుఁడవై పరేశునికిఁ గాంతఁ నొసంగక చిత్తమందు నే
వలఁచినపార్థివేంద్రునకు వాసి నొసంగుము మానిశేఖరా! 250

క. అని యిట్లినసుతపలికిన, మునివరుఁ డామీఁద ధ్యానమును బూని మహీ
శునిగలిఁ గని ముదమున నా, వనితామణితోఁ బలికె వారనిపేర్మిన్. 251

తే. సుదతి! నీచేత నీయుష్మసుతుఁడు తొల్లి
చూడఁబడి కామతప్తుఁడై సొలసె మిగుల
నట్టి రాజేంద్రపుత్రుని నమలయోగ
దృష్టితోఁ జూచి తెలిసితిఁ దివిరి యిపుడు. 252

క. నీ వెవనిఁ గోరి నాతో, భావం బలరారుచుండ భాషించితి వా
భూవిభుఁ డగుసంవరణుఁడు, వావిరి నాశ్రమమునకును వచ్చుఁ బుత్రీ! 253

చ. అని యిటు మానిసత్తముఁడు నైనవసిష్ఠుఁడు పల్క నంతటన్
జనపతిపుత్రుఁ డాయెడ ద్విజప్రముఖాశ్రమభూమిఁ జేరి యా
మునివరుఁ జూచి మ్రొక్క యట మోహినినైవడి నున్నకంజనే
త్రనుఁ గని దృష్టపూర్వ యిది తథ్య మటంచు చని యెంచి క్రన్ననన్ 254

తే. వేడ్క చిగురొత్తుచుండ భూవిభుఁడు పల్కె
విప్రకులవార్ధిచంద్ర! యీ వెలఁది యెవ్వ
రనఁగ వరుణాత్మజుం డిట్టు లపుడు రాజు
తోడఁ బల్కెను సంప్రీతితోఁ జెలంగి 255

క. నరవర! తపతి యటంచు చని, పురుణింతురు పేరుచేత భువి బుధవర్యుల్
హరిసుత! యిది నీకొఱకే, నరవిందాప్తుని భజింప నాతం డోలిన్. 2౬5

క. సారోదారవిచారయు, సారపరిపుసన్నిభాస్యసహితయు భవ్యా
చారసుశీలయు నగునీ, చారుత రాంగిని నొసంగె సంతస మొప్పన్. 257

ఉ. ఇచ్చినసాశ్రమస్థలము నింపువఁ జేర్చితిఁ గాన లేచి యీ
సచ్చరితాఢ్యయా తపతి చారుకరంబును శాస్త్రపద్ధతిం
మచ్చికమీఱఁ గైకొనుము మానవనాథ! యటంచుఁ జెప్పఁ బ
ల్కుచ్చట లూర దాని చెయి భూపతి సద్విధిఁ బట్టె నత్తఱిన్. 258

ఉ. భానునిపుత్రి యా తపతివాసవభోగసముజ్జ్వలుండు స
మ్మానితుఁ డాధ్యుఁడున్ సకలమానవరక్షకుఁడై నతదిద్విభన్
మానసనాథుఁగాఁ బడసి మంజులసద్మములందు నిత్యమున్
బానుగఁ గ్రీడసల్పె శచికక్రునితో విహరించుపోలికన్. 259

## కురునృపతిచరిత్రము

క. అనవలయందుఁ బిమ్మట, మానవపతి లక్షణుండు మాన్యుఁడు కురువర్
సూనుఁడు జనించె లక్ష్మికి, సూనశరుం దుష్కవించు సొబగునఁ జూడన్ 260

తే. జాతకర్మాదిసత్క్రియాసంస్కృతుండు
నగుచు నతఁ డాజ్యమున హుతుఁ డైనయగ్ని
మాడ్కిఁ జెలువునఁ బెంపొందె మాన్యు లెన్న
నాత్మగృహమందు నిత్యము హర్ష మొప్ప 261

వ. ఇట్లు దినదినప్రవర్ధమానుఁ డగు రాజపుత్త్రునకు బ్రాహ్మణశ్రేష్ఠుఁ డగునగస్త్యుఁడు చూడాకర్మం బొనరించె నంత నవనీశాత్మజుఁడు తొమ్మిదవయేఁట నుపనీతుఁడై బ్రహ్మచర్యాశ్రమస్థత్వముఁ బూని గురుశుశ్రూషఁ గావించుచు వేదవేదాంగశాస్త్రేతిహాసాదివిద్యలనెల్ల హృద్యంబుగ నేర్చుకొని పదియవవత్సరంబున దక్షలజ్ఞుఁడయి పుడమియందుఁ బురుషోత్తముం డగుచు రాజిల్లి కురు వనునామంబునఁ బ్రఖ్యాతిఁ గాంచెఁ, బిదప నతనితండ్రి యగుసంవరణుఁడు షోడశవత్సరప్రాయుఁ డగుసుతుని విలోకించి శుభవంశసంభవ నుద్వాహ మొనర్పఁ బ్రయత్నించి

సీ. సద్ధాత్రిపయు సుదామజనపతిపుత్త్రి యౌ సౌదామినీకన్య నాదరమున
నిమ్మన సుతునకు సమ్మతించి సుదాముఁ డింపుతోఁ దనకూఁతు నిచ్చె దానిఁ
గూర్మితోఁ బెండ్లాడి కురుఁ డాసతిఁ గూడి రాజకులాచారరతుఁడు నగుచు
భాసిల్లె శశితోడ వాసిఁ గాంచిన పాకశాసనుకైవడి జగతియందు

ఆ. జనకుఁ డంత రాజ్యసంభారవహునిఁ గాఁ, దనయు వదిని నెంచి తగవిధాన
మునను యౌవరాజ్యమున నభిషిక్తునిఁ, జేసె జనులు జూచి చిత్ర మొందఁ

ఆ. తండ్రివలన నిట్లు తనరాజ్యమం దభిషిక్తుఁ డగుచు నతఁడు కీర్తిని వెలయు
జనుల సుతులమాడ్కి సంతసంబున నేలె, జనకుఁ డనుచు వారు సంస్తుతింప.

క. ఆపార్థివుండు సకల, క్ష్మాపాలుఁ డజాదిజీవగణపాలుఁడు స
ద్భూపాలపాలుఁ డగుచుఁ, బ్రాపింపనుఁ జేసె ధర్మపద్ధతి జగతిన్ 265

వ. ఇట్లు కురుపతి యౌవరాజ్యంబు నేలుచు నొక్కనాఁ డాత్మగతంబున. 266

క. ఎందాఁకఁ గీర్తి లోకము, నం దింపొందంగ నుండు నందాఁక మహా
నందముఁ దానితోఁ జెలు, వందుచు నవ్విభుఁడు బ్రతుక నగు నవనిఁ దగన్.

మ. అని రాజేంద్రుఁడు చిత్తమం దటులు తా నాలోచనం బొప్ప వే
డ్కను గీర్త్యర్థముగా మహీధ్రసహితక్ష్మాభాగమం దంతట
న్మనసొప్పారను సంచరించి పిదప న్మాన్యప్రపుణ్యంబు పా
వనమౌ ద్వైతవనంబుఁ జొచ్చెఁ దమితోభావంబు సొంపారఁగన్. 268

ఉ. అంత విభుండు తత్సమయమందు సముజ్జ్వల మైనతద్వనా
భ్యంతరసీమఁ జేరి పముదంచితుఁడై కన బ్రహ్మపుత్త్రియౌ

సంతతపాపనాశనియు । సద్ధరిజిహ్వయుఁ బ్లక్షజాతయుం
గాంత సుగాత్రియుం । సకలగణ్యయు దేవియు నౌ సరస్వతిన్ 269

సీ. కని విస్తృతంబు నై । కాలుహ్రదంబును గావించి తన్నదీ । కాంతములను
క్రుంకి హృష్టత నీరుఁ । గ్రోలి బ్రహ్మోత్తరదిగ్వేదిపైఁ జాలఁ । దేజరిల్లి
సర్వంసహాభాగ । సమదశయోజనాయతవిశాలసమేత । మయి శమంత
పంచక మనుపేరఁ । బరఁగుధర్మస్థానమునుఁ జేరె నరస । త్తముఁడు ననంగ
ఆ. విబుధు లనిరి పురుష । వీర! నీచే సర్వ, పంచకోత్తరస్థ । పరమవేది
పలుకఁబడెను బ్రహ్మ । పరవేదు లెన్నియో, విస్తరించి చెపుమ । విశ్వనాథ! 270

చ. అన హరి వారితో ననియె । నాఁ డట లోకవిభుండు దేవతా
ఘనపతులైనశంకరుఁడు । కౌతుకులై మును నెట్టివేదులం
దొనర యజించె నట్టి పర । మోత్తమధర్మవిరించివేదు లిం
పొనరుచు నుండు నైదు త్రిక । శోత్తముశాగ! ధరిత్రి నెన్నఁగన్ 271

వ. వానియందుఁ బ్రయాగమధ్యమవేదియనియు, గయాశీర్షము పూర్వవేదియనియు, మహాపుణ్యఫలప్రదం బగువిరజ దక్షిణవేదియనియు, మూఁడుకుండములతో రాజిల్లుపుష్కరము పడమరవేదియనియు, శ్యమంతపంచకస్థ మగునట్టిది యుత్తరవేదియనియుఁ భాషింపఁబడె, నట్టి క్షేత్రమును గురుపిభుఁడు మహాఫలదం బని యెంచి కోరినట్టికోర్కుల నిటఁ గృషిఁ జేసెద నని ప్రయత్నించి యంతట 272

కురురా జష్టాంగసంసిద్ధికై నేలం దున్నుట.

చ. పరమరథంబుఁ బోవిడిచి । పార్థివవర్యుఁ డనంతకీర్తికై
తిరమగుచోటఁ గొనర్చుకొని । దీప్తిఁ జెలంగెడిభర్మసీరముం
బోరి సమకూర్చి శైవవృష । ము న్యమవాహన మైనదుంతనుం
సరిగునఁ బూన్చి భూతలముఁ । జక్కఁగ దున్నుచు నుండె నత్తఱిన్ 273

చ. సురపతి దానిఁ గాంచి మఱిఁ । జోద్యము నొందుచుఁ గర్షకుండు గాఁ
బరఁగెడు నమ్మహీశ్వరుని । పాలికివచ్చి వచించెఁ బార్థివా
కర! యిట నేమిచేయ సమ । కట్టితి వీవని యేమటన్న భూ
వరుఁ డనె శక్రుతో నపుడు । భావము రంజిలుచుండ ధీరతన్ 274

తే. దయయు నిత్యక్షమాశౌచ । దానయోగ
సత్తపోబ్రహ్మచారిత్వ । సత్యములనుఁ
జాలఁ గృషిఁ జేయుచున్నాను । సర్వదేవ
నాథ! యన శక్రుఁ డనియె భూ । నాథుతోడ 275

ఉ. భూవర! యెట్టు బీజములుఁ । బొందెద వెందొగిఁ జూడ కేనితో
నీవని నవ్వి స్వర్గమున । కింద్రుఁడు పోవ నహర్నిశంబులం

దావిభుఁ డోలి నాహాలము । హర్షముతోఁ గొని తక్కుచోట బల్
లెవను దున్నుచుండెఁ గడుఁ గవిని నంతట నేడు క్రోసులున్. 276

క. ఇమ్మట నేఁ జని పలికితి, నమ్మనుజేశ్వరునితోడ । నధిపా! యిట నీ
విమ్మహి దున్నెద వేటికి, నిమ్మళముగ బలుకు మనిన । నృపుఁ డావేళన్ 277

తే. పలికె నష్టాంగధర్మంబుఁ । బ్రౌఢి నిగుడ
నంతనే బీజ మెక్కడ । ననుచు నతని
నడుగఁ దనదేహమం దున్న । నది యటంచు
నాడ నాలించి నే నపు । డతనిఁ జూచి 278

చ. జనవర! నేని దేహినయి । చక్కఁగ దున్నుచు నున్నవాఁడ భూ
మిని విభవంబులన్ హాలము । మిక్కిలి దున్నుచు నుండుఁ గాన నీ
తను వెటు బీజ మా ననుచుఁ । దాలిమి. బల్కితి నంత తే డు తెం
పునఁ గుడిచేయి నా గటినిఁ । బూనియుఁ బూన్కిని దున్నె నొక్కటన్ 279

క. కొనసాగి పెరుగుహ స్తముఁ, గని నేఁ జక్రంబువలనఁ । గడువడి దానిం
దునిమితి వేయితెఱంగులఁ, మనుజేశుం డంత దాని । మహితోత్సుకతన్. 280

క. రెండవకరమునఁ గొనఁ గని, ఖండించితి దాని నేనుఁ । గాశ్యపిఁ బడ భూ
మండలపతి క్రమ్మఱఁ దన, కుండినపక్షిద్వయంబు । నొసఁగెం గడిమిన్. 281

నే వాని ద్రుంచితిని వడి, నావేళ నృపాలుఁ డెలమి । నాత్మశిరంబున్
వావిరి నిడఁ గని యొడయని, భావస్ఫుటవృత్తిఁ జూచి । పరమప్రీతిన్ 282

హరి కురుపతికి వరంబు లిచ్చుట.

సీ. పలికితి వానితోఁ । బార్థివ! భవదీయసాహసంబున కేను । సమ్మతించి
వరదుఁడ నైతిని । వరముఁ గోరు మటన్న విని కురుపతిపల్కె । వేడ్క నెట్టి
వసుధ నాచే దున్నఁ । బడె నట్టి యా వెల్ల నధికధర్మక్షేత్ర । మగుచు నెపుడు
చచ్చినవారికి । స్నాతులౌ జనులకుఁ బుణ్యప్రదంబు నై । పొసఁగు టొప్పు
ఆ. స్నానదానహోమ । జపోపవాసాదు, లితరకార్యవితతు । లెల్ల నిందు
నక్షయంబు లగుచు । పావనింపఁగా నగుఁ, బరమధర్మశీల! । ధర్మచేల! 283

శా. శౌరీ! శంకరనిర్జరాన్వితుఁడ వై । సంప్రీతి మై నీవు నా
పేరన్ జెన్నలరారు నీస్థలమున । న్విఖ్యాతితో నుండుమం
చారాజేంద్రుఁడు భక్తిమీఱ నన । గా నాలించి భూపాలునిన్
గారుణ్యంబునఁ జూచి పల్కితిని నేఁ । గమ్రోక్తు లొప్పారఁగన్ 284

ఉత్సాహ. ధీర! నీవు వలచినట్టి । దివ్యవరముల న్మదం
బారుచుండ నీకు నిడితి । నధికవరము లొసఁగెదన్

సారదేహి యగుము మరల । సమయమునట్టి వేళలో
జేరఁగలవు దీప్తి నన్ను । సిద్ధసాధ్యు లెన్నఁగన్ 285

ఆ మానవేశ! చంద్ర। మూడ్కి నీ సత్కీర్తి, వెలయు జగములందు । వితతరీతి
సోమయాజి వగుచు । నీమంబుతో వేయు, క్రతువరములఁ జేయఁ। గలవు నీవు

వ నారదా! పురుషోత్తముఁ డిట్లు వరమ్ము లొసఁగి కురుక్షేత్రముఁ బాలించుటకై చంద్రనాముఁ డగుయక్షుని జక్రినాథుఁ డగువాసుకిని, శంకుకర్ణుఁ డనువిద్యాధరుని, వసురేశుఁ డగుసుకేశుని, వజావనుఁ డను రాజును బావకదేవుని నిచ్చెఁ; దదాజ్ఞఁ బూని వారరు దెంచి కురుజాంగలమ్ముఁ బాలించుచుందురు తదను చరులును శరచాపధరులును బలశాలు రగునెనిమిదివేలవీరు లతిదురితముల నెపుడు నివారించుచుందురు దానినడుమఁ బెక్కుపుణ్యములతోఁ గూడి నదియుఁ బాపహారియు మంగళప్రదం బగుపృథూదకంబు కలదు ఈపృథూదక జనిత యై జలాఢ్య యగుచుఁ దూర్పుముఖముగఁ బాఱు నొకపుణ్యనది కలదు తొలుత మహాభుజుఁ డగునలువచే సకలభూతగణములలో నీనది సృష్టింపఁ బడియె దానఁ జరాచరస్థమహోగ్రవీరులందఱుఁ దెందుఁ గ్రుంకఁ బ్రయత్నింతురు సృష్ట్యాదియందుఁ బృథివ్యాపస్తేజోవాయ్వాంబరపృథూదకములు సకలసాగరములు గొప్పసరస్సులు నిరంతరజలప్రవాహపూర్ణము లగునదు లిట జతుర్ముఖనిర్మితంబులయ్యె వానియందలి నీరతి పుణ్యదంబై యుండు నాక్షేత్రము దేవసరణియై వెలయుచుండు సరస్వతీదృషద్వతులకు నడుమనుండుచోటు కురుజాంగల మని వాసిఁ గాంచె 287

సీ అట్టి కురుక్షేత్ర। మందు నాసీనుఁడై రాజిల్లువాఁడు పు। రాతనుండు
ఘనతపస్వియు మునిగణగణ్యుఁడౌ రోమహర్షణుఁ గనుగొని । యమరతుల్యు
లగుబుషిసత్తము । లాడిరి మునినాథ! రమ్యకాసారతీర్థప్రమాణ
ములను దేవమహత్వ। ములను శ్రీవామనదేవునిచరితంబుఁ । దేటపడఁగఁ

ఆ గలుకు మనుచు నిట్లు । భాషింప విని యతఁ
డపుడు వారిమాట । లాలకించి
కరయుగంబు మోడ్చి । కరమర్థితో మ్రొక్కి
పలికె బుషులఁ జూచి । భక్తి వెలయ 288

## రోమహర్షణుండు మునులకు సరోమహత్త్వముఁ బలుకుట

క మునులార! తొలుతఁ గమలా, సనుఁ డగుబ్రహ్మను సరోజ। నయనాపతియౌ
వనమాలిని, శ్రీకంఠుని, వినుతించి వచింతు వినుఁడు । విస్పష్టభక్తిన్. 289

ఆ అమలతీర్థరాజ । మగు బ్రహ్మసరసిని, నాడిలను విశుద్ధుఁ । డైనరంతు
కుండు మేటికాంతిఁ । గూడినదై నాల్గు, మొగము లొనరి చాల। సొగసు కలిగి,

క. వెలసెడి కాసారంబును, విలసితముగఁ జేసె ననుచు । విబుధాధ్యుండౌ
జలజాసనుండు నతిముదిఁ, బలికెను మోదంబు వెలయఁ । బ్రథమమునందున్

వ. ఋషివరులారా! కలి ద్వాపరమధ్యమందు మహాత్ముఁ డగువ్యాసమునిప్రవరుఁడు కౌలఁకులకాలంతను, విశ్వేశసన్నిహితము లగుహస్తినాపురసరస్సులను, నిరంతరజలప్రవాహ యగుకన్యాజకగ్గవిఁగును, వామనుచరితంబును నాకుం జెప్పెఁ బుణ్యాకరము లగువాని నేను మీకుఁ బలికెద నాలకింపనగు దేవవరుఁ డగు విశ్వేశ్వరునివలనఁ బావని యగుసరస్వతీనదియు, నంతట నర్ధయోజనపరిమితిగల కాసారంబు సన్నిహితనామము నని చెప్పియుంటి, నట్టి సరసికి ఋషు లరుదెంచి ముక్తిఁగోరి దాని సేవించుచుందురు కొందఱు స్వర్గఫలకాములై భజించుచుందురు 292

తే. ముక్తికాముఁడు యోగియౌ । శ్రీసరస్వ
తీశ్వరుం డీసరస్సునఁ । బృథులభక్తి
నమర సేవించె స్థితికాము । డగుచు విష్ణుఁ
డలమి హరిరూపుఁడై దీనిఁ । గొలిచెఁ జక్రి 293

సీ. సేవ్యతీర్థంబు నై । చెలఁగు సరోమధ్యమునఁ దొల్లి శంభుఁ డుండు । మొనసి మునిఁగి
దివ్యప్రభావుఁడై । దీప్తితో స్థాణుత్వమును జెందె నిం బ్రహ్మ । ముందు వేది
యగుచుండు దానికి । నావల రామహ్రదం బుండుఁ బిమ్మట । ధరణివిభుఁడు
నగుకురునాథుండు । యత్నంబుతో దున్నినట్టి కురుక్షేత్ర । మమరు ననుచుఁ

ఆ. గడఁగి పలుకఁబడెనుఁ । గమనీయరంతుకా, రంతుకంబులకును । రహిఁ శమంత
పంచకమునునుండి । భాసిల్లు రామహ్ర, దంబునకును నడుమ । దనరి మిగుల.

వ. కావునీకురుక్షేత్రశమంతపంచకము బ్రహ్మోత్తరవేది యని వక్కాణింపఁబడె నని పలికిన సంతసించి 295

క. మునివరులు రోమహర్షణుఁ, గని పలికిరి మానినాథ । కర్బురపతిగా
తనరెడుబలిదైత్యుఁడు శ, క్రునిరాజ్యము నెటు గ్రహించె । రూఢిగఁ జెపుమా!

తే. వామనోత్పత్తిఁ దత్ప్రభా । వములఁ జెప్పు
మనుచుఁ బ్రార్థింప విని రోమ । హర్షణుండు
ఋషులతో ననె మునులార! । ప్రీతు లగుచు
నిర్మలస్వాంతముల నొప్పి । నియతితోడ 297

## బలిచక్రవర్తివంశక్రమము.

క. ఘనుఁ డైనవామనేశుని, జననముఁ దచ్ఛక్తియుక్తిసంగతులను దు
ర్జనదనుజాన్వయరీతిని, వినిపించెద నేను మీకు । వినుఁ డీవేళన్ 298

క. బలిదైత్యుం డేకాలమున, నిలఁబుట్టెనొ పూర్వమందుఁ । బృథుశక్తిని ద
త్కాలమున హిరణ్యకశిపుం, డలరెనుఁ దొలిపురుషుఁ డగుచు । నసురేశ్వరుఁడై

క. వానికిఁ బ్రహ్లాదుం డను, సూనుం డుదయించె నట్టిసురవైరికి బ
ల్లానుగఁ బుట్టె విరోచన, దానవుఁ డాత్మజుఁడు నగుచు ధారుణిమీఁదన్
సీ. ఆవిరోచనునకు నాత్మజుఁడై బలి జన్మించి పెంపొంది సారసాక్షు
చేత హిరణ్యకశిపుఁడు హతుండైనఁ దత్కాలమున దేవతతులఁ దఱిమి
సకలచరాచరసహితమౌ త్రైలోక్యరాజ్యంబుఁ జేయుచు గర్వ మెసంగె
నసురులు కృతయజ్ఞు లైరి బలీశ్వరమయశంబరాసురసమహితవిజయ
ఆ. మున సమస్తజగంబులు పూర్వదేవ
వశములై వెలిగె నామాడ్కి బరఁగ మిగుల
నఖిలదిశలెల్ల శుద్ధంబు లగుచు నెపుడు
ధర్మకర్మంబు లేపారె ధైర్య మగుచు. 301
ఆ. సంప్రవృత్తమగుచుఁ జాల నంతట వెల్గి, వితసెఁ బటిమదైత్యవితతిపథము
శంబరాదిదైత్యసత్తమ గర్తితో, నయవసంస్థ నగుచు నర్కుఁ డలరె 302
క. దనుజావనమై గగనము, తనరెఁ గుహుంబు లగుచు దశదిశ లమరెన్
కినఁబడె వేగము లధ్వర, ఘనశోభను నింట మిగులఁ గ్రాలెఁ జూపెన్ 303
క. పిమ్మటఁ బ్రకృతిస్థితితో, బమ్మినలోకంబు ప్రవృత్తియుతమై
సమ్మతి నొప్పెను ధర్మము, నెమ్మి జనింపంగఁ బాపనివహితియుఁ బోఁగెన్ 304
ఉ. ధర్మము నాల్గుపాదములఁ దద్దయు నొప్పెనుఁ జూడఁగా నస
ద్ధర్మము పాదమాత్రమయి తారొకన సాఁగె నిజాశ్రమస్థులై
నిర్మలచిత్తము ల్గలిగి నిత్యము స్వోచితధర్మవృత్తినిం
బేర్మి వహింప బాసిలిరి పృథ్విని మానవు లెల్ల దీక్షతోన్ 305
చ. బలిపటిజేశ్వరుం డెలుడు భాసురదానవరాజ్యమందుఁ దాఁ
జెలువము మీఱ నిర్జరులచే నభిషిక్తుఁడు నయ్యె, రక్కసుల్
విలసితభావులై చెలఁగి విస్తృతశబ్దము భూనభోంతర
స్థలముల నింపఁజేయుచును ధైర్యముతోఁ జెలరేఁగ నంతటన్ 306

శ్రీహరి బలిం జేరుట.

క. కమలాంతరసమకాంతి యుతఁ, గమలోద్యత్కరయుఁ గమలకలితయు దివ్య
గ్విమలాంతరంగయును నగు, కమలబలిం జేరి పలికెఁ గమ్రాక్షులతోన్. 307
చ. విలసితవీర్య! భూరిబల! వీర! మహాసుర రాజ! యీజగ
ద్బలజితుఁడై శచీవిభుఁడు పాఱెన నీదగువ్యసత్వముల్
లలిఁ గని సంతసించి జయలక్ష్మియు క్తుఁడవైననిన్ను నే
వలచి వసింపవచ్చితిని భాసురభావనిరూఢి నిత్తఱిన్ 308
క. వినుతహిరణ్యకశిపుకుల, మునఁ బుట్టిన నీకు నిట్టి పూర్ణజయశ్రీ

ఘునరాజ్యయుక్తకార్యముఁ, గనఁ జిత్రమె యెంచిచూడఁ । గర్బురసింహా! 309

వ దానవేంద్రా, నీవు శాశ్వత మగు త్రైలోక్యరాజ్యమును జెంది దైత్యనాథుఁడగుయుష్మత్ప్రపితామహునిఁ బ్రతిష్ఠాధికునిఁగఁ జేసితి వని భాషించుచు నఖలదేవమనోరమగును సేవింపఁదగినదియు నవము లొసఁగునది యగునాకలుములజవరాలు సురవైరీద్యుఁ డగుబలిచక్రవర్తినిఁ జెందె నంతటఁ గీర్తిప్రభాద్యుతిహ్రీశక్తిబుద్ధిమహామతిశ్రుతివిద్యాస్మృతిశాంతిపుష్టిక్రియాది సకల దేవీకదంబము మంజునృత్యగీతవిశారద లగువేల్పు వెలఁదులుం గూడి త్రిభువనరాజ్య మేలుచు సంపూర్ణైశ్వర్యయుక్తుఁడును బ్రహ్మాదియు నగుబలిదానవేంద్రునిఁ బొందియుండి రని పలికిన విని మునులు రోమహర్షణున కిట్లనిరి 310

క లలితతపోవిభవాఢ్యా!, బలినిర్జితు లగుచు విబుధవరు లేక్రియచేఁ
మెలఁగిరో తదవస్థాస్థితిఁ, బలుకుము వినఁ గుతుక మొదవె । భావములందున్

క దేవాధిదేవుఁ డజరుఁడు, భావాతీతుండు నైన । సద్దాతుఁ డిలం
బావనవామనరూపము, నేవిధమునఁ దాల్చెఁ దొల్లి । హితమతిఁ బ్రమా!

క అని ప్రార్థించిన మునివరుఁ, డనె నోమునులార! వినుఁడు । హర్షముతోఁ ద
ద్దనుజేశలబ్ధమై త్రిభు, వనరాజ్యము వెలయఁ జూచి । వారనిభీతిన్ 313

ఇంద్రాదు లదితికశ్యపులకడ కరుగుట

చ సురపతి మేరుగోత్రమున । సుందరమై విలసిల్లుతల్లిమం
దిరమునుఁ జేరఁబోయి కడు । దీనుఁడునై జననిన్ జేరి సు
స్థిరమతి మ్రొక్కి తాకుసుని । చేత వినిర్జితులైరి సర్వని
ర్జరు లని పల్కఁగా నదితి । శక్రునితో ననె నంతఁ జర్చిమై 314

క తనయు, విరోచనసుతుఁడై, ఘనరేడిబలిదైత్యవిభుఁడు । పోరున మీచే
దునుమ నశక్యుం డనిఁ జడు, పును హానిని గెల్వుండు । పోరిఁ దానౌకఁడై

ఆ దేవనాథ! నీకు । దితిజేంద్రు గెలువంగ, శక్యమగునె వేగ । చని మరీచి
దైవకశ్యపునకు । నభివందనము చేసి, వినయ మొప్ప నిలిచి । వేడవలయు 316

మాలిని అనరభోజననాయకుఁడౌ బలి । నాజిని మీరు పరాజితులై
దీనతఁ గుందినపద్ధతి యెంతయుఁ । దెల్పుచు నతనిఁ జేక్రియతో
హీనపరాక్రముఁ డౌనని భక్తిని । నేర్పుఁ గోరుమన న్వని వే
యానతి శక్రుఁడు పిమ్మటఁ గశ్యపు । నంతికమొందెను గార్యరతిన్. 317

వ మునులారా! క్రతుభుజులు చని యట మరీచిపుత్త్రుఁడును, దేవగురుఁడును, శ్రేష్ఠుఁడును, బ్రహ్మతేజోవిలసితుఁడును, దీప్తతపోనిధియును, ఘృణ్యాగ్ర దేవుఁడును, స్థితానలశిఖోపముఁడును, దౌలివాఁడును, గృష్ణాజినవస్త్రుండును, వల్కలాజినపరివృతుండును, ద్యుతిమంతుఁడును, ఘృతగంధపురస్కృతాగ్నిసన్ని

భుఁడును, స్వాధ్యాయపరుఁడును, దేహావసానలుండును, బ్రహ్మవాదియుఁ బ్రకటితతత్త్వప్రభావోగ్రుఁడును, సకలచరాచరగురుఁడును, సర్వజగత్ప్రజాసృష్టికర్తయు నాత్మభావవిశేషంబునఁ దృతియుఁ బ్రజాపతియు, జనకుఁ డగు కశ్యపుని సందర్శించి పిదప నాదిత్యాదిదేవోత్తము లా పుణ్యాగ్రగణ్యునికి నమస్కరించి నిటలతటఘటితాంజలిపుటులై వినుతించి దైన్యంబున నిట్లనిరి 318

తే. జనక! బలశాలియగు బలిశత్రువలన
ననిని జేయుఁడు నై యొప్పె నట్టి కాన
నమరు లగుమాకుఁ బ్రీతిద మైనశుభముఁ
గడిమి నొనఁగూర్పఁ గానగుఁ గరుణతోడ 319

చ. అని యిటు దీనభావముల నాడెడు పుత్త్రులభాషణంబులన్
విని కుశేశయనాథుఁడు విశ్రుతతత్త్వుఁడు నైన కశ్యపుం
డనె సుతలార! మీరు చతురాననలోకగమంబునందు బు
ద్ధినిఁ దమిఁ జేయుఁ, డానలువ దివ్యమతిం దనరారి పిమ్మటన్ 320

క. బలి దానవుని జయింపఁగఁ, గలిగిన తెఱఁగును విశేషకారుణ్యము మైఁ
బలుకఁగలండు నయంబున, నలసిల్లెడు మీకు నిప్పుడు విపులోత్కంఠన్.

కశ్యపాదులు బ్రహ్మసదనంబున కేఁగుట.

సీ. శక్ర! బ్రహ్మకుఁ బరాజయముఁ జెప్పుటకు నై సమకట్టి తమి గానసరవి నలువ
యిల్లు చేరుద మని హితమతిఁ బలికిన బిమ్మట నాదిత్యవితతితోడఁ
గలిసి నిర్జరవరులక్ష్మాశ్రమమున నేఁగి సంప్రస్థితు లగుచుఁ గదలి
సుమహాబలంబులై శోభిల్లు కామగనములు యథార్హంబుగా బోనసు యాన
ఆ. ముల మహార్హమాత్రములనుఁ బితామహు
భువనమునకుఁ బోయి ముదితు లగుచు
న హితమౌనిసేవ్యమానమౌ తద్దివ్య
చిత్రమందిరంబుఁ జేరి పిదప 322

క. వినుతతపోరాశియు నై, ఘనుఁడై నాశంబు లేక క్రాలెడు నలువన్
గనుఁగొనెడి కోర్కె మనముల, జనియింప సుతేజు లగుచు జని యట మిగులన్.

తే. షట్పదోద్గీతమధురమై చతురసామ
వేదపాఠకరవముల వెలసి శత్రు
విదళనము మంగళంబు నై వెలయు నలువ
సభనుఁ గని నాకవాసులు సంతసించి 324

క. క్రమవరపాదాక్షరముల, విమలస్థితిఁ బలుకఁబడిన వినుతశ్రుతులన్
సమధికపృథుసత్క్రియలం, దమరులు విని మరల మోద మలరుచు నుండన్.

సీ. ఆరయఁ యాగవి | ద్యావేదములఁ బదక్రమముల నెఱిఁగిన | ఘనసుపర్వ
వులు ఉత్తమక్రమ | పదయుతాక్షరసహితోక్తుల నతిపుణత | నొప్పుచుండు
వేదభాగంబుల | విమలమునీశ్వరస్వరనాదితంబును | సత్పురంతు
సంస్తవశిక్షల | సర్వవిద్యలనెల్లఁ దవిలి ఛందస్సులఁ | దెలిసినట్టి
తే. పూర్ణలోకాయతికసత్త్ | ములు చెలంగి
హార్షమునఁ బల్కుమాటల | నాదరమున
గర్షపాత్రంబుగా విని | కాంక్షమీఱ
నక్కసెక్కెడు నిష్ఠ సెం | పారుచుండ 326

చ. అమరి సుమిత్రి తివ్రతులు | నై జపహోమసక్తచిత్తులై
క్రమమున నున్నవారలను | గాంచి తదీయసభాంతరంబునం
దమలసరోజపీఠయు | హర్షమున న్వసియించి సర్వలో
కములకుఁ దాతయౌ నలువ | గ్రాలుచు నుండె నగణ్యకాంతితోన్ 327

వ. అట ననుపమాయ యగువిద్యయుఁ బ్రజాపతులును, ద్విజపూజ్యు లగుదక్షవరు
ణాదులుఁ, బులహమరీచిభృగ్వత్రివసిష్ఠగౌతమనారదాదిమునులునుఁ, బృథి
వ్యాప్తేజోవాయ్వాకాశములును, శబ్దస్పర్శరసరూపగంధములుఁ, బ్రకృత్య
వికారకారణమహదహంకారములును, సాంగోపాంగము లగునాలుగువేద
ములుఁ, దపోలోకస్థులును, షడృతువులును, ధర్మార్థకామక్రోధమోదము
లును, రవిచంద్రకుజబుధగురుశుక్రశనిరాహుసంవర్తగ్రహంబులు మరుద్గణం
బులు విశ్వకర్మయు దివారాత్రులును, వసుషట్కంబును, నక్షత్రమాసపక్షములు,
భక్తితోఁ జరాచరగురుఁడును, శ్రీమంతుఁడును వరిష్ఠుఁడు నగు బ్రహ్మనుఁ
గొలుచుండఁ నపుడు కశ్యపుఁడునుఁ దత్తనయుఁడు ధార్మికోత్తముఁ డగు
నింద్రుఁడును, దేవతలును సకలవాంఛితముల నొసఁగుచు మిగుల శ్రేష్ఠం బయి
నదియు, సర్వతేజోవిరాజితమైనదియు, బ్రహ్మర్షిసమన్వితమైనదియు, బ్రాహ్మశ్రీ
సేవితమైనదియు నచింత్యమైనదియు నపగతశ్రమకలదియు నగుచతురాననసభనుఁ
దత్సభామధ్యపరమాసనస్థుఁడు సర్వాతీతుఁడు నగువిరించినిఁ గని యపుడు 328

క. పరమర్షిసంయుతులు నై, శిరసులతో వందనములు | చేసి యజునిం
చ్చరణము లనియతి నందఱు, కరమర్థిఁ బ్రశంసించి విగత | కల్మషు లగుచున్. 329

తే. వెలసి కశ్యపుతోఁ గూడి | విపులభక్తి, వచ్చియున్నట్టి సర్వదేవతలఁ జూచి
భూరితేజుండు నిర్జర | పుంగవేంద్రుఁ, డగుశతానందుఁ డనెఁ గృప | యతిశయిల్ల.

బ్రహ్మ శ్వేతద్వీపమందు హరిఁ గూర్చి తపం బొనర్పుఁ డని కశ్యపాదిసురులకుఁ జెప్పుట

తే. తివిరి నామాట వినఁ దగు | దివ్యమతిని
దానవోత్తముఁ డగుబలిఁ | దాఁకి యెవఁడు

సమరమునఁ గెల్చి నేర్చెడుఁ । జక్రి వలనఁ
గాఁగలదు మీఁకు సర్వమా । కాంక్షితంబు 331

క. ఆవిశ్వకిరుఁడు గతి కాఁ, డావిబుధాదులకు నాకు । నతఁడే గతియౌ
దేవతలకు నతఁ డధిపుఁడు, భావింపఁగ లోకములకుఁ । బ్రభుఁ డగుచుండున్.

క. ఏకాకి దీవలోకా, ధీశుం డయి విశ్వరూప । దీపితుఁ డగుచుం
నాశము లేక విభావ్యుఁడు, నై శాశ్వతుఁ । డగుచు నెప్పు డలరుం జూడన్.

చ ఎవఁడు సమస్తలోకముల । కీశ్వరుఁ డెవ్వఁడు ధర్మసత్యరూ
పవమహుఁ డపూర్వజుం డనుచు । బాగుగ నెవ్వనిఁ బల్కు రార్యులా
భవమహుఁ గన్గొనన్విబుధ । వర్యులు శక్తులె యెవ్వఁడొప్పు మా
ధవుఁ డగుచక్రి నిట్టి దెలియ । ధాత్రిని నిర్జరులార! యారయున్ 334

ఉ. నాకపురస్థులైనమిము । నన్నును సర్వము వేళ్కఁ జూచువాఁ
డాకమలేక్షణుండు జగ । దాఢ్యునిసత్కృపతో డసద్గతిన్
మీకిపు డేనుఁ జెప్పెదను । మించినభక్తి చెలంగుచుండఁగా
నాకధవాలకింపుడు । నాత్మల శ్రద్ధ యనూనమై తగన్ 335

సీ. ముక్కంటిచెవిదెస । మొనసినపాలసంద్రంబున కుత్తర । తటమునందుఁ
గశ్యపుఁడుయోగ । కలితుఁడై దుశ్చరతపము శ్రీహరిఁ । బార్చి కాల్మిఁ జేయ
నగునట్టు మీఁకు నిశ్చాత్ములై యుండిన నగతకల్మష । వధకసత్య
మభ్రగంభీరర । వాన్వితశుభయద మనిశకల్యాణము । నమలపుష్ట

తే. వర్ణయుక్తంబు సౌఖర । బ్రహ్మయోగి
గన్యభాషణమునువినఁ । గలరు పిదప
విశ్వకరుఁ డవ్యయుండును । విబుధవంద్యుఁ
డైనహరి తుష్టిలోఁగను । నడరు నిజము 336

ఉ క్రమ్మఱఁ దద్విశాంగమయి । క్రాలెడియోగవిసర్జనంబునం
దమ్మహనీయమూర్తి జగ । దాకృతిపీర్య మమోఘమైన దై
క్రమ్మునతండు వెండి సుర । గణ్యునిఁ గశ్యపుఁ జేరఁగోరి తా
నిమ్ముల మెచ్చి వచ్చి వర । మిచ్చును వేడ్క చెలంగ నయ్యెడన్ 337

క సురలార! శౌరివలనన్, వరమున్ గొని పిదప మీరు । బంధురభక్తిన్
వరదుని నెన్నుచు నాకడ, కరుదేరం దగును భద్ర । మలరార నోగిన్. 338

క. అదితియుఁ గశ్యపుఁ డాయెడ, ముదితుఁడు ధీమంతుఁ డైన । మురహరుదివ్య
త్పదముల కెరఁగి వరంబునుఁ, బడిలంబుగఁ గొనుచు వెండి । పరుఁగని భక్తిన్.

తే. షడ్గుణైశ్వర్యముల నొప్పి । చాల వెల్గు, నీవు మాకాత్మజుండవై । నెగడునట్లు
వరమొసఁగి మమ్ముఁ బాలింపు । భక్తలోల, వినుతగుణజాల! కాంచన । విమలచేల

చ. అని గురుభక్తిఁ బల్కి హరి । హర్షితుఁడై యటులౌ నటంచు వా
రిని గని పల్కెఁ గాఁగలఁడు । ప్రీతిని మీరపు డట్లు చేయుఁడం
చని వినుతింప నాఁ గరుణ । నంతట నట్లొనరించు వాఁకనే
వనిదయ మీకుఁ జెప్పఁగలఁ । డాయెడ లోకవిభుండు ప్రీతితోన్. 341

క. నాకేశులార! యిటులా, వైకుంఠునివలన మీరు । వరసంసిద్ధిం
జేకొని కృతకృత్యులు నై, ప్రాకటరుచిఁ జేరుఁ డాత్మ । భవనంబులకున్ 342

క. అని బ్రహ్మపలుక నట్లా, నని పల్కి సురౌఘమెల్ల । నాయెడభక్తిన్
వనజాసనునకు వలఁగొని, వినుతులు గావించి మించి । వేడుక లూరన్ 343

తే. సత్యవాక్యుఁడు । సద్గుణసహితుఁ డైన, బ్రహ్మ పలికినరీతి దేవతలు పుణ్య,
కీరనదీపర్వ కానన । గణ్యశిఖరి, జలధియుత ధారుణిని దాఁటి । సత్వరమున. 344

క. భూతాధివాసవాసము, నై తనరెడి దుగ్ధసాగ । రాంతస్థం బౌ
శ్వేతద్వీపముఁ జేరిరి, చేతోమోదంబుతోడ । శ్రీహరిఁ గొలువన్. 345

వ. ఇమ్మటఁ గశ్యపుఁ గలిసి వేలుపు లటఁ జటులతరభీషణాం బఖిలసత్వాభిహితంబ
భాస్కరంబ మరద్ద్యదం బధికాంధకారబంధురవ్యాప్తాశాభాగాంతరం బగున
మృతస్థానంబుఁ గని రత్తఱి 346

కశ్యపాదిసురులు హరింగూర్చి తపంబుఁ జేయుట.

సీ. బ్రహ్మవిదుండు నై । భాసిల్లు కశ్యపబ్రహ్మధీమంతుఁడు । వాసుదేవుఁ
డమరేశ్వరుండు నా । రాయణుండు సహస్రనేత్రుఁడు దేవుఁడు । నిర్మలుండు
భూతియోగస్వరూ । పుఁడు నైనహరిఁ గూర్చి తదనుగ్రహార్థమై । దశశతాబ్ద
వర్షప్రమాణమౌ । వ్రతమును శ్రద్ధతో స్థానవీరాసన । సత్యమౌన
ఆ. సరణివలన బ్రహ్మ । చర్యంబుతో దీక్షఁ, బూని చేయఁ గడఁగె । బూర్ణభక్తి
నఖిలదేవవర్యు । లటఁ దపోయోగాధి, నిష్ఠవలన మిగుల । నెగడి రంత 347

క. ఘనుఁడైనకశ్యపుం డట, వనజోదరు నాత్మ నిలిపి । వారనిభక్తిన్
వినుతామ్నాయోక్తస్తవ, మునఁ బొగడఁ దొడంగె భక్తి । మొనయుచునుండన్.

వ. అని పులస్త్యుఁడు సంభాషింప నాలించి నారదుఁడు కశ్యపకృతవేదస్తవంబు
నుడువు మనుటయు. 349

ఉ. రంగదభంగసంగరయుత । రాక్షసభంగ, మహోత్తివేటికో
త్తుంగతమఃపతంగ, గురు । తోయజరంగ, పవిత్రక్షీరస
ర్వంగ, కృపాంతరంగ, భవ । సంచయదుర్ఘరఘోరరూపమా
తంగ, మునీంద్రచిత్తవర । తామరసోజ్జ్వలభృంగ, రఘువా! 350

క. శ్రీరత్నహేమమందిర, ధీలాసత్యప్రచార, దీనోద్ధారా,
కారుణ్యాకర, ధర్మా, ధారా, సద్గుణవిశాల దశరథబాలా 351

తరల. పరమకాంచనరత్ననిర్మలభావిరాజితభూషణా!
సరసిజేక్షణ ధర్మధారణ సత్యసంగతభాషణా!
వరశరాసనబాణసంతత భక్తపాలనకారణా!
ధరణిజారమణాసురౌఘవిదారణా! సురరక్షణా! 352

గద్య. ఇది శ్రీరామకరుణాసమాసాదితకవితాప్రాభవ, హారితసకులాన్వయప్రభవ, రామ వఝ్ఝులవంశదుగ్ధసాగరసుధాకర, కొండయకుమార, బుధజనవిధేయ కొండయనామధేయప్రణీతం బగు తెలుఁగువామనమహాపురాణమందుఁ దృతీయస్కంధము

---

శ్రీరస్తు

శ్రీసీతా లక్ష్మణ భరత శత్రుఘ్న హనుమత్సమేత శ్రీరామచంద్రాయ నమః.

# తెలుఁగు వామనపురాణము

## చతుర్థస్కంధము



కాకుత్స్థకులాబ్ధిసు
ధాకర! పితృవాక్యసంగ।తవనవిహారా!
శ్రీకర! జగదాధారా!
రాకాశీతాంశుశీల! । రామనృపాలా! 1

### కశ్యపుఁడు హరిని స్తుతించుట.

క. అవధారు పులస్త్యముని, ప్రవరుఁడు నారదునితోడ । భాషించెను నీ
వవహితుఁడ వగుచు వేద, స్తవమును విను మనుచుఁ జెప్పఁ । దానూల్కొనియెన్

సీ. ఏకశృంగవృషాక।పీశ్వరవృషసము ద్రాక్షయక్షరరుద్ర।పక్షివాహ
సుకవృషసురుచిర।సుందర బంధుర సర్వభూతేశ్వర । చారుహార
భాస్వదనాదిసం।భవ ధర్మ వైకుంఠ కపిల విష్వక్సేన । కలుషహరణ
ధ్రువ వృషావర్త భూ।ధ్రవరగణాధీశ బహురూపగతపాప । పద్మనాభ.
ఆ. పురుషవీరదహన । పురుహూత పృశ్నితే, జోభిరామ భూసు।రాధినాథ
ముంజికేశ హంస । మురహర భవహర, ధర్మవాస సత్య।భవనవాస! 3

వ. ప్రణామనమశ్శబ్దపూర్వకవాసుదేవానాంకిమద్యనిధన, ధనంజయ, శుచిశ్రవోనిజజ
యసంతతామృతశయ, సనాతన, త్రిసదన, తుషిత, మహాసత్వ, భూసురజ్యేష్ఠ,
పరశునామదానవహర, మహాదక్షిణ, మహానియమధర, నిత్యారూప, లోకప్ర
లిప్త, ధర్మజా, గ్రజ, ధర్మనాభ, గభస్తీశ, వాసవేశ, చంద్రరథ, సూర్యవీర్య,
సుధాసాగరశయన, జన్మనాశన, గరుడవాహన, మాంపాలయ అనియు 4
ఆ. భాసురాంగ సర్వ।వందారుమందార, భవసహస్రశీర్ష।పాదహస్త
లసనదివ్యభవన।లక్ష్మీమనోంబుజ, భాస్కరాప్రమేయ।భక్తగేయ 5
క. పురుషోత్తమ గురుసత్తమ, పరమమహాపురుషవేష । పావనభాషా
మురహర పరమదయాకర, సురుచిరతేజోభిరామ । సుందరధామా. 6
క. విశ్వేశ్వర నినుఁ బ్రాజ్ఞులు, విశ్వం బని పలుకుచుండ్రు । విస్తృతభక్తిఁ

విశ్వజ్ఞ విశ్వభావన, శాశ్వత బహుయోనిజాతసత్యసమేతా! 7

సీ. అనఘ! నీవు వషట్కారుఁడవై యుండు వఁగ్ర్యయాగంబుల నిను వషట్కార మనిరి
శతసహస్రకథారసహితుఁ డయ్యె నటంచుఁ దలఁతురు మదిమహాతత్త్వవిదులు
భూవంద్యభృగుపుత్ర భూనాథ భవమిత్ర సద్బ్రహ్మాశయ వేద సరణివేద్య
పుణ్యవాతాంబరపుష్కరంబులు నీవె గురుశిష్యులును నీవె గుణము నీవె

తే. జలధికాననపర్వతస్వర్గమేరు
నాకపాతాళములు నీవె నయవిశేష
శమతపోదానములు నీవె సామవేద
చరమములు నీవె నిన్నెంచ శక్యమౌనె 8

క. హోతవు పోతవు హంతవు, నేతవు మంతవు సమస్తనిపుణుండవు ని
ష్ప్రాతకుఁడవు నీవే సా, కాతరభయభంగ, భక్తగణసత్సంగా! 9

క. యజ్ఞకర హోమకారణ, యజ్ఞేశ్వర యజ్ఞరూప యజ్ఞాధీశా
యజ్ఞవాహంత యజ్ఞఫలదా, యజ్ఞాంగమహానుభావ యజ్ఞనిధానా! 10

తే. ఋక్స్రిభావాభిరామత నెసఁగి మిగుల
భవ్యుఁడవు నై ప్రకాశించువాఁడ వైతి
విజయయును సృక్కుభాండంబు నీవ ఋక్కు
సమిధలును మేథయును నీవ స్వామి నీవ 11

క. సతతము సమస్తమునకుం, బలివై గలివై చెలంగి వర్తింతువు స
మ్మతి శక్తియుతుఁడ వయి భూ, పలివై తనరారు దీవు పావనమూర్తీ! 12

క. యోగము సమధికభోగ, త్యాగంబులు మోక్ష మీవె ధాత్రింజేముతో
రాగమున లోకసమితిని, బాగుగ సృష్టించుచున్నవాఁడవు శౌరీ! 13

క. నిశలును దారాగణములు, పశు, తృణ, జల, కాష్ఠ, దీర్ఘపాషాణంబుల్
పశుపాల, చంద్ర, దీక్షిత, శశిధర, దక్షులు నీవె సౌజన్యనిధీ. 14

వ. దేవా! నీవు విశ్వధరుఁడవు హిరణ్యగర్భుఁడవు, నారాయణుండవు, ప్రథమవర్ణుండవు, రవితేజుఁడవు, మహాపురుషుఁడవుఁ, బురుషోత్తముఁడవు, నిరంజనుఁడవాదిదేవుఁడవు, భూక్రముఁడవు, త్రివిక్రముఁడవుఁ, బ్రభాకరుఁడవు, శంకరుడవు, స్వోద్భవుఁడవు, భూతాధిమహాభూతుఁడవు, విశ్వభూతుఁడవు, విశ్వరక్షకుఁడవు, నిత్యోర్ధ్వరేతస్కుఁడవు, శివస్పతివి, వాచస్పతివి, ఘృతరుచివి, బహుకర్మవంశుఁడవు కావే పరార్థివరద, దామోదరా, సంసారభారహరా! నామొరాలించి పాలింపు మని వెండియు 15

తే. యాజకులు యజ్ఞములలో ననాగమోక్త
కీలి నాల్గింట నాల్గింట రెంట మఱియు

నైదిటను రెంట నినుఁ బిల్తు ॥ రట్టి నీకు
వందనము పూర్త్యరూప విధ్వస్తపాప! 16

క. మునులార! యిట్లు బాడబ,ఘనుఁడుం బ్రహ్మజుఁడు నైన ॥ కశ్యపుచేఁ బెం
పొనరగఁ బలుకం బడు శ్రుతి, వినుతస్తుతి నాలకించి ॥ విపులాకాంక్షన్ 17

క. శ్రీమద్దేవుఁడు ప్రభుఁ డగు, దామోదరుఁ డంత హర్ష ॥ తత్పరుఁ డగుచుం
బ్రేమం బుష్టపదాంకుర, ధామం బయి వెలయు మాటఁ ॥ దద్దయుఁ బలికెన్. 18

ఆ. కశ్యపాదులార! ॥ కరమర్థి నేసు ప్ర
సన్నబుద్ధి నైతి ॥ సకలశుభము
లమరు మీకు వరము ॥ నడుగుఁడీ యనుటయుఁ
గశ్యపుండు శౌరిఁ ॥ గని నుతించె 19

సీ. అమరసత్తమ! నిశ్చయంబుఁగ నందఱ యందుఁ బ్రసన్నుఁడ ॥ వైతి వీవు
పురుషోత్తమునకుఁగూడఁ ॥ బుట్టిన మేటితమ్ముఁడవు గోత్రజులకు ॥ ముదముఁ గలిమిఁ
బలిమి నొసంగెడి ॥ వాఁడవు శ్రీమంతుఁ డవు మహాభగవంతుఁ ॥ డవును నదితి
తనయుఁడ వగు మని ॥ తద్దయుఁ బ్రార్థింప వరఫలార్థినియు దే ॥ వతలతల్లి
ఆ. యైన యదితి దాని ॥ నాత్మఁ గోరుచునుఁ బు
త్త్రార్థముగను వరము ॥ నడిగె దాస
హృదయకమలవాసు ॥ ని దయావిలాసుని
నధికభక్తి మిగుల ॥ నంత సురలు 20

క. దామోదర! సర్వసుర, స్తోమహితకరంబు గోరు ॥ సుమహితమతివై
స్వామివి త్రాతవు దాతవు, నై మద్గృహకుఁడ వగుచు ॥ నలరుము దేవా! 21

ఉ. అని సత్కృతిని వేఁడుచుండఁ గరుణా ॥ యత్తాత్ముఁ డై మాధవుం
డని నావేల్పులతోడ మీకు రిపులై ॥ హర్మ్యాంగి యేపారు పెం
పున వర్తింతురొ వారు నాయెదుట ॥ సమ్మోదంబుతో నిల్తురే
కనఁగా నొక్కమహూర్తకాలమయినం ॥ గాంక్షించి యుద్ధంబునన్. 22

తే. యజ్ఞభాగాగ్రభోజను ॥ లైనరాత్రి, చరుల. బలిమార్చి పారమే ॥ ష్ఠ్యంబు నైన
కర్మమునఁ బితృలేఖులఁ ॥ గవ్యహవ్య, భాగభుజులఁ జేసెదఁ ॥ బ్రార్థిమెఱయ.

క. కావున నిర్జరులారా!, భావం బలరార మీకు ॥ వచ్చిన త్రోవన్
దేవనుఁ జేసగు నని శ్రీ, దేవుం డగువిష్ణుఁ డాడఁ ॥ దివిరెడు వేడ్కన్ 24

క. భావంబు లలర విశ్వే, దేవులు కశ్యపుఁడు సకల ॥ దేవతలు మహా
దేవి యగు దేవమాతయు, దేవేశుం డైనవిష్ణు ॥ దేవునకుఁ దగన్. 25

ఉ. పూజయొనర్చి మ్రొక్కి సుర ॥ పుంగవులంతటఁ దూర్పుదిక్కునన్
రాజిలునట్టి కశ్యపుని ॥ రమ్యమహాశ్రమభూమిఁ జేరి స

ద్యూజలతాఢ్యపుష్పఫల। పుణ్యమునీశ్వరవేదనాదవి
భ్రాజితమై ద్విజాళిరవ। బంధురమై తనరారి సొంపుతోన్ 26

తే. వఱలునట్టి కురుక్షేత్రవనముఁ జేరి, తద్వనంబున నదితినిఁ । దపమునందు
నిలుప నాదేవి ఘోరమై । నెగడుతపముఁ, జేసెఁ బదివేలయేడులు । చిత్తశుద్ధి.

ఉ. పిమ్మటఁ దద్వనం బదితి। పేరఁ జెలంగుచు సంతతోరుభ
ద్రమ్ము సమస్తకామఫల। దమ్మయి శోభిలెఁ గృష్ణుపూజకై
బమ్మినభక్తిఁ దెమ్మెరను । భాగుఁగ గ్రుంగుచు మౌనమూని ని
త్యమ్మసురాళికిన్ వెఱచి। కందడిఁజెందెడు దేవవారమున్. 28

క. వినయతపోధన యగుచున్, దనరెడిసురమాత చూచి । తహతహపడి నా
తనయులు దుఃఖాంబుధిలో, మునిఁగిరి దైత్యార్తు లగుచు । భూభాగమునన్.

తే. వ్యర్థసుత నైతి నేనని । వగచి భక్త
వత్సలుండు శరణ్యుండు । వాసుదేవుఁ
డాదిమధ్యాంతరూపుండు । హరియు దేవ
దైత్యమయుఁ డగుశ్రీజనార్దనునిఁ గూర్చి. 30

## అదితి హరినిఁ బొగడుట.

సీ. వినుతించె భక్తిని । విశ్వేశ మంగళకర దివ్యమంగళ । కలుషభంగ
పంకజదళనేత్ర । బహుజీవతతిసూత్ర పూర్వలోకేశ్వర । భూరిసార
రవికోటిసన్నిభ। రాజీవనాభ పంకజభూతిసంభవ। కమ్రభావ
పద్మాలయాధీశ । భవనాశ సర్వేశ శాంత హృద్యాకర। దాంతసుకర

తే. చక్రధరసంతతాత్మసం। జాతిసర్వ, దేవపద్మాదియుతకర। దివ్యభర్మ
వసన కృత్యార్తిపరిహార। పద్మధామ, నీకు మ్రొక్కెద సద్భక్తి । నెగడుచుండ.

తే. ఆత్మవిజ్ఞాన సవనయో। గాఢ్యచింత్య, యోగధరనిర్గుణామల। యోగసార
హార విశేషయశస్కర। సురుచిరాబ్జ, సంభవాకార మ్రొక్కెద । శ్రద్ధతోడ. 32

ఉ. ఏవిభుకుక్షియందు జగ। మెల్ల వసించె సమస్తలోకమే
దేవునిచేతఁ జూడఁబడి । దీపితమై తనరారె నట్టిస
ద్భావుని స్థూలసూక్ష్మతను । భాసితు శార్ఙ్గిని నామనంబులో
వావిరినిల్పి మ్రొక్కెద న। వారితభక్తి చెలంగుచుండఁగన్. 33

చ. పురుషులు సర్వలోకములఁ । బూనికిఁ గన్గొనుచుండి యేరమా
వరుఁ గనఁజాల రేవిభుఁడు । పాలినిభూతహృదంతరస్థుఁ డై
నరులకుఁ గానరానిభువ। నంబులఁ జూచునొ నిత్యమట్టి శ్రీ
ధరునకు భక్తి మ్రొక్కెదనుఁ । దద్దయు నామదియందు నిత్యమున్ 34

క. వలనొప్ప నెవఁడు వెలుపలి, వెలుఁగై కనఁబడక వెలుఁగు। వెలి వెలసి రుచిన్,

విలసిల్లునట్టి హరికే, వలఁగొని ప్రార్థింతు మిగుల । వాంఛాప్తికి నై 35

క ఏకారణమున దేనికి, నై కడువాటిల్లె నెవని । యం దఖిలం బా
లోకం బాలోకేశుఁ, బ్రాకటముఁగఁ దలఁచి మ్రొక్కి । భావింతు మదిన్ 36

సీ ఆద్యప్రజాపతి । యయ్యె నెవ్వఁడు పితృవరపతి యయ్యె నె । వ్వండు దేవ
పతి యయ్యె నెవ్వఁడు । భావింప దక్షసృష్టదివ్యపర బ్రహ్మ । దేవునకును
పలుమరుఁ గావింతు । బహువందనంబు లే । వాఁడు ప్రవృత్తిని । వర్తనముల
పంక్తిచే సంతోష । పరుఁడు నై స్వర్గాపవర్గఫలంబులఁ । బాలి నిచ్చు

తే. సతత మట్టిగదాధర । స్వామి కెలమి
వందనం బాచరించెద । భక్తి నాత్మ
చింత్యుఁడై యెవ్వఁ డపుడె వి । శేషపాప
కోటులను బాపుచుండునో । కూర్మితోడ 37

క పరిశుద్ధుఁడు పరముఁడు శ్రీ, కరుఁ డగునా బ్రహ్మమునకు । గాఢాదృతిచేఁ
గరయుగము మోడ్చి వినుతింతు, రహిగ మన్ననమునందుఁ । దోఁచెడు పూన్కిన్.

తే అఖిలవిశ్వాస్పదుం డజుఁ । డవ్యయుండు
నగుచు నలరారు నేవిభు । నరసి జన్మ
మరణములఁ బొందకుందురో । మగుడ నట్టి
హరికి నిత్యము మ్రొక్కెద । నధికభక్తి 39

సీ సవనపూరుషుఁడు య । జ్ఞస్థుఁడై యేవాఁడు శ్రేష్ఠాధ్వరముల య । జింపఁబడునొ
యజ్ఞేశ్వరుఁడు విష్ణుఁ । డఖిలేశ్వరుం డగు, నట్టి శ్రీహరికి జో । హారు సకల
విబుధసద్గతియు నై । వెలసి యెవ్వఁడు వేద । విదులచే నామ్నాయ । వీథులందుఁ
బలుమరుకీర్తింప । బడి వాసిఁ గాంచునో వేదవేద్యుఁడు మహా । విష్ణుఁ డాద్యుఁ

ఆ డబ్జపత్రనేత్రుఁ । డగునామురారికిఁ, బ్రణతు లాచరించి । ప్రస్తుతింతు
సకలభూతమయుఁడు । సర్వేశ్వరుం డగు, చక్రిఁ గొలుతు మిగుల । సంతసమున.

ఆ ఎవనివలన విశ్వ । మెల్ల సంభవమయ్యె, విశ్వ మెవనిచేత । వృద్ధి నొందె
నఖిలవిశ్వ మెవని । యందు లీనతఁ జెందె, నట్టిహరికి నతుల । నాచరింతు 41

వ బ్రహ్మాదిస్తంబపర్యంత మగుచరాచర మేదేవునిచేత వ్యాప్తమయ్యెఁ బ్రకృతిక రుఁడును; సమున్నద్ధుఁ డగునట్టియుపేంద్రునికి వందనంబు సంతతమే సర్వేశ్వ రుఁడు త్రిమూర్త్యాత్మకుఁడై సకలమును భరించుచున్నవాఁడో మాయాజా లుఁడు విశ్వమయుఁడు విశ్వపతియుఁ బ్రజాపతియు నగునావిష్ణునిఁ గూర్చి నమ స్కరించెద నని వెండియు 42

చ. అసురమయప్రమూర్తతిమి । రాత్తుఁడు కాక రవిస్వరూపుఁ డై
పొసఁగెడు నేపరాత్పరుఁడు । భూరినిశోద్భవ మైనచీఁకటిం

గని వెసఁ ద్రుంచునో సకలగణ్యుఁ డుపేంద్రుఁడు దుష్టఘోరరా
క్షసహరుఁ డైన నాహరికి సాఁగిలి మ్రొక్కెద నిష్టసిద్ధికై 43

ఆ. భానుచంద్రమూర్తి భాసిల్లునే శౌరి, కినుల సకలలోకకష్టకలిత
కర్మములను మిగులఁ గాంచునో యాదైత్య, నాశనునకు వందనము లొనర్తు

క. పలుమరు నేఁ బలికిన యీపలుకే జగదీశునందు బహుసౌఖ్యము నై
లలిఁ జెలఁగెనేని నిత్యం, బలఘుఁడు నగు నమ్మురారి నభివర్ణింతున్ 45

క. జలరుహనేత్రుం డాడిన, పలుకు నిజం బైనయెడలఁ బదఁపడి నాకుం
గలలోకాలెల్ల దానన్, వెలయుం బూర్ణంబు లగుచు వినుతింపంగన్ 46

క. అని యి ట్లదితి నుతించిన, విని భగవంతుండు భూతవిపరాద్ధ్యశ్యుం
డనఘుఁ డగుశౌరి యామెకుఁ, గనఁబడి భాషించె నంతఁ గమ్రోక్తులతోన్

ఆదితికి హరి వరంబు నిచ్చుట

క. ఓయదితి నీమనంబునఁ, బాయని దగుకాంక్షలెల్లఁ బడయంగల వీ
తోయమున మత్ప్రసాదవి, ధాయక మగుసరణిలోడఁ దథ్యముఁగాఁగన్ 48

తే. ఓమహాభాగ! నీమది నొనరునట్టి, కాంక్ష నొసఁగెద నాలింపు కడిమి నాదు
దృష్టి యున్నట్టి కైనను నష్టఫలము, కలది యౌనె విచారింపఁగా ధరిత్రి 49

క. ఎవఁ డీనావనమందున, నివసించి త్రిరాత్రము గడునియతిం దపమున్
బ్రవిమలమతిఁ గావించునొ, భువి నతనికి సర్వకామములు పెంపొందున్ 50

క. దూరస్థుం డై యుండియు, సారెకు నీవనము నెవఁడు స్వాంతం బందుం
గూరిమిఁ దలఁచునొ సద్గతి, కారయఁ జను మరలఁ జేరఁ డాతఁడు పుడమిన్

సీ. భక్తితో నెవ్వఁ డీవనమందు నొకవిప్రునకుఁగాని మఱి యిద్దఱికినిఁగాని
కడఁగి రైదుగురికిఁగాని ముప్పురికినిఁగాని భోజనమును బూని భక్తిఁ
బెట్టునొ వాఁడు సంప్రీతితోఁ బరగలిఁ జెందు సత్యమటన్నఁ జిత్తమలర
నదితి వచించె నాహరిఁ జూచి దేవేశ! భక్తవత్సల! నాదుభక్తి మెచ్చి

ఆ. సరవి నీవు సుప్రసన్నుఁడవై నది
నిక్కమైనయెడల నిజసుతుండు
నైనవాసవుండు హర్షింపఁ ద్రైలోక్య
పతియు నై సుకీర్తిఁ బరఁగు టొప్పు 52

క. వరదా! సురపతిరాజ్యా, ధ్వరభాగము లసురసంహృతము లయ్యెను వా
విరివానిఁ జెంద నగునతఁ, డిరవగు నీకరుణవలన నీయెడ మరలన్ 53

క. వాసవుకష్టముకొఱకై, భాసురరాజ్యంబు దైత్యపతిహృత మగుటం
జేసి ప్రపన్నతఁ గనునా, కీసమయమునందుఁ దుఃఖ మేర్పడె నభవా! 54

మ. అని భాషించెడిదేవమాతఁ గని సర్వాధీశుఁ డా శౌరి యి
ట్లనె నో దేవి! త్వదీప్సితం బొసఁగెదన్ స్వాంశంబుచే గర్భమం

దున నేఁగశ్యపునుండి చేరి విబుధ।స్తోమంబు కీర్తింప వే
డ్కను నీపుత్త్రుఁడ నై జనించి పిదప । గౌతూహలం బొప్పఁగన్ 55

క. భవనందిని! నిర్జరరిపు, నివహముఁ బరిమార్తుఁ గాన । నిజగృహమునకున్
బ్రవిమలమతిఁ బొమ్మనఁగా, నవికల మగుభక్తితోడ । నదితి వచించెన్ 56

తే. దేవగణభావ కేశవ । దేవదేవ
విశ్వభావన బుధజన।వినుతసదన
సంతసింపుము మ్రొక్కెదఁ । జాల నాదు
విన్నపము నాలకింపు మీ।వేళఁ గూర్మి 57

ఆ. సకల మెవనియందు । సంప్రతిష్ఠితమయ్యె, విశ్వయోని యగుచు।వేడ్క నెవ్వఁ
డలరె నట్టి నిన్ను । నాత్మోదరంబునఁ, దాల్పఁజాల సర్వ।ధరుఁడ వగుట 58

క. అని వేఁడ శౌరి పలికెను, నిను నను నేఁ దాల్పఁగలను । నిజముఁగ నీకా
ర్తినిఁ జేయ, భద్రమగు; సన్మతిఁ జనుచున్నాఁడ నాత్మ।మందిరమునకున్ 59

చ. మునివరులార! శ్రీధరుఁడు । మోదముతో నిటుపల్కి దేవతా
జననికిఁ గానరాక చనెఁ । జయ్యన నయ్యెడ నామె గర్భమున్
ఘనులు నుతింపఁ దాల్చెఁ దమి । గ్రన్ననఁ దజ్జఠరాంతరస్థుఁ డై
వనరుహనేత్త్రుఁ డైనహరి । వావిరివెల్గుచు నుండ దీప్తితోన్ 60

క. ధారుణి గిరగిరఁ దిరిగెను, సారెకుఁ గంపించె భూరి।శైలము లెల్లన్
నీరధులు క్షోభమొందెను, దారలు వినువీథినుండి । తద్దయు రాలెన్. 61

క. సురుచిరముగఁ గశ్యపుపతి, కర మేయేచోట్లఁ దిరిగి । కాంతుఁదలిర్పన్
చరణము వెట్టునో తత్క్షితి, గురుదుఃఖముతోడఁ గ్రుంగె । ఘోరధ్వనిమై 62

క. హరి తద్గర్భగతుం డై, సరవిన్ రాజిల్ల దైత్య।సంహతి కెల్లన్
మురవైరి పలికినట్టుల, గురుతేజోహాని యొదవెఁ । గుంభిని నంతన్ 63

బలి రాక్షసతేజోహానిఁ బ్రహ్లాదు నడుగుట.

సీ. అపగతతేజులై । యలరెడి సర్వరాక్షసుల విలోకించి । కర్బురేశుఁ
డైనబలీంద్రుఁడు । పూని పితామహుఁ డైనప్రహ్లాదునతో । కనియె నంత
తాత! యీదైత్యులు । దహనసందగ్ధులవలె మఱిభావింప । బ్రహ్మదండ
నిహతులపోలిక । నిస్తేజులై రతర్కితముగ నిప్పు డ।రిష్టమసుర

తే. వీరలకు సంభవించునో । విబుధవరుల, చేత నీనాశకృత్యంబు । చేయఁబడెనో
తెలియకున్నది రక్కసు । ల్లేనివలన, విగతవీర్యులు నై యిట్లు।వెగటు గనిరో.

క. అనియిట్లు మనుమఁడౌ బలి, దనుజుఁడు భాషింప నతఁడు । తనమది దాని
ఘనముగఁ జింతించి బలీంద్రునిఁ జూచి వచించె నపుడు । తోఁచినరీతిన్ 65

క. గురుగిరులు కదలె విశ్వం, భర నిజసంస్థితిని వదలె । వార్ధులు నదులున్

నిరతము క్షుభితము లయ్యె న,సురు లపగతతేజు లైరి। సురవిద్వేషీ! 66
తే. వేడివేలుపు పొడిచెడి। వేళయందుఁ, బూర్వమం దెట్లు గాములు। పోక యతని
నాశ్రయించునో యట్లె సు। రాళిఁ గూర్చి, చేరుచున్నది వరలక్ష్మి। చిత్త మలర
క. దనుజేశ! యిట్టి హేతువు, ఘనమై వర్తించె దీనిఁ। గడువ్వల్పముగా
మనమున నెంచకు తగవగు, బని వెసఁ గావింప వలయుఁ। బటుయుక్తిమెయిన్
తే. అసురవరుఁ డైన ప్రహ్లాదుఁ। డాంతరికుఁ, డైనబలితోడ నీరీతి। నాడి వెనుక
నమరదేవ్యుఁడు నా హరి। నాత్మఁ జేర్చి, మొదట ధ్యానంబుఁ గావించి। పిదప భక్తి
క. పరమజనార్దనదేవునిఁ, బరిపరివిధములనుఁ దలఁచి। వామనమూర్తిన్
బరికించె దేవజననీ, వరగర్భమునందు దైత్య। వరుఁ డట్టితఱిన్ 70
సీ. ఆవామనునికుక్షి। యందు మరుద్దేవగంధర్వవసురుద్ర। గణము నాశ్వి
నేయులసాధ్యుల। నిఖిలవిశ్వంబుల ఘోరరాక్షసనాయ। కులను దితిజ
జంభకుజంభు ల। సర్పరాక్షసులఁ దనతనయుఁ డై నవిరోచ। నుని బలీంద్ర
నరకుల బాణుని। నానాసురేశులఁ దనువాకసంబును। దహన వారి
ఆ. పవనచిత్రకంధి। పర్వతద్వీపద్రు,మములఁ బక్షితతుల। మనుజభూమి
విశ్వకరులకరుల। వివిధగ్రహప్రజా, పతులభవమునింద్ర। పతులఁ గాంచి 71
క. కడువిస్మయపడి ప్రహ్లా,దుఁడు మాయఁ జెంది యపుడె। దుష్టాసురనా
థుఁడు వైరోచనుఁ డగుబలి, జడదానవులోడఁ బలికె। సంయములారా! 72
తే. వత్స! సకలంబుఁ గంటినే। భావమందు, నిట్టి నిస్తేజ మీరొంద। నెందుకొఱకొ
పుట్టె మీకును దానినే। పూర్ణముగను, దెలియఁజెప్పెద వినుమది। తేఁటపడును.
వ. పౌత్రా!, దేవదేవుఁడును, విశ్వయోనియు జగదాద్యంతరహితుఁడును, జగ
దాద్యుఁడును, జన్మగహితుఁడును, శ్రేష్ఠుఁడును, వరదుఁడును, బరావరపరముఁ
డును, గార్యస్థితి నొనర్చుటకొఱకై యదితిగర్భస్థుఁ డైనవాఁడును, జగన్నా
థుఁడును, రాజరాజైనవాఁడును, ముఖ్యప్రవరుఁడును, నిరంజనుఁ డాదిమ
ధ్యాంతరహితుఁడును, మహాత్ముఁ డగుహరి తా నొక్కఁడయ్యును నిజాంశం
బువలనఁ ద్రిభువనరాజ్యమును శచీపతికి నొసంగుటకై కశ్యపురాణికి సుతుఁడై
యవతరింపఁగలఁ డని పలికి వెండియు నతనిఁ గని యిట్లనియె 74

ప్రహ్లాదుఁడు బలికి దనుజతేజోహాని కారణము చెప్పుట.

క. ఏవానిరూప మరుఁడు, పావకపురుహూతరుద్ర। పరమేష్ఠిముఖుల్
వావిరిఁ జూతురొ యావసు, దేవాత్మజుఁ డాత్మ కళను। దిగె దైత్యేశా! 75
సీ. ఎవ్వనిశ్రుతివిదు। లీక్షించి యక్షరుఁ గాఁ బల్కుచుందురా। గళితకలుషు
లైనవా రెవ్వని। యందుఁ బ్రవేశించుచుందురో యెవ్వనిఁ। బొందినట్టి
పుణ్యులు క్రమ్మఱఁ। బుట్టకుందురొ యాద్యుఁడయి చెలంగుచు నుండు। నట్టి వాసు
దేవునిఁ గూర్చి నేఁ। దివిరి మొక్కెద సంద్రముననుండి నిత్యము। ఘనతరంగ

ఆ. చయము పుట్టుమాడ్కి । సకలభూతంబులే
వానియందె పుట్టి । ప్రళయమందు
లయముఁ గనునో యట్టి । లక్ష్మీశ్వరున కేను
వందనం బొనర్తు । భక్తివిభుల 76

సీ. గంధంబుఁ గొనువట్టి । ఘ్రాణంబు స్పర్శముఁ దెలిసెడిచర్మంబు । దివ్యరసముఁ
గాంచెడినాలుక । కడఁగి రూపంబులఁ గనుఁగొనుకన్నులే । కమలనయను
నకు లేవొ యట్టి శ్రీ । నారాయణుఁడు యుక్తిచే వేదితవ్యుఁడై । వెలఁగు నెపుడు
సకలేశుఁ డనఘుండు । సత్యచారిత్రుఁ డీశ్వరుఁ డారుఁడు భవ । భయహరుండు
ఆ మలినహరుఁ డనాది । మధ్యుఁ డాద్యుం డజుఁ
డఖిలలోకనాథుఁ । డతులుండు
వేదవేద్యుఁ డగుచు । వెలయు నాహరినాత్మఁ
దలఁచి మ్రొక్కువాఁడ । దైత్యనాథ! 77

ఉ సతత మెవండు విశ్వమును । జక్కఁగఁ దాల్చి చరించునట్టి యా
తొలి నాకకోటి నెత్తి వర । కీర్తి వహించె నెవండు సర్వలో
కతతిని సంహరించె లయ । కాలునికైవడి నీశుఁ డీద్యుఁ డా
తతబలుఁ దైవనాహరినిఁ । దద్దయు భక్తి నమస్కరించెదన్ 78

తే స్వాంశమున గర్భమందుండి । భాసమానుఁ
డైన నెవ్వానిచే దితి । జాలి వీర్య
నాశమయ్యెనో భవపటు । నగకురారుఁ
డీశుఁ డగు నాయనంతు నే । నెలమిఁ గొలుతు 79

మత్తకోకిల లోకయోనియుఁ దాపసోత్తమ । లోకుఁ డీమహనీయుఁడ
స్తోకసద్గుణశాలికశ్యప । సుందరీమణిగర్భగుం
డై కడంగి భవచ్ఛరీరబ । లాధికోన్నతు లెల్లఁ దా
శ్రీకరం బగుషోడశాంశముఁ । జెంది చేకొనె దానవా! 80

బలి హరినిఁ దిరస్కరించుట.

క అనిపల్కెడి ప్రహ్లాదునిఁ, గని నుడివెను బలివిభుండు । కడుఁగోపమునం
గనులం దగ్నికణంబులు, పెనఁగొని ధగధగలుచుండ । భీషణగతితోన్ 81

ఆ తాత! యెవనివలనఁ । దగ్గయు మాకును
నేఁగి కలిగె నట్టి । విష్ణుఁ డెవఁడు
హరిని మించినట్టి । యసురేశ్వరులు నాకుఁ
గోట్లకొలఁదిఁ గలరు । కూర్మి వినుము 82

ఉ శంభుఁడు విప్రచిత్తియుఁ గు । జంభుఁడు దుర్జయుఁ డశ్వశీర్షుఁడున్
జంభుఁడు భంగకారకుఁడు । సాహసుఁ డా శిబిదానవేశుఁడున్

కుంభుఁడు నికుంభుఁడున్ గురుఘోరవినేత్ర మహాహనుప్రగా
రంభులు వీరు వేలయిన రాక్షసు లుందురు కొంద ఱుద్ధతిన్. 83
చ గురుబలవీర్యసంపదలఁ గూడినవారును భూమిభారమున్
బోరిఁ బోరిఁ దాల్ప శక్తులయి పొంపిరి వెంచెడివీరియందు శ్రీ
హరి కొక వీరుఁడే భుజబలాతిశయంబుల నీడు గాఁడె నీ
వరిని నుతింప ధర్మమగునా ఘనమా దనుజాధినాయకా! 84

ప్రహ్లాదుఁడు బలిని శపించుట.

క మునులార యిట్లు వైరో, చని పలికిన విని మహానిశాచరవరుఁ డై
పోనరిన ప్రహ్లాదుండనె, వనజాక్షుని నిందచేయువాఁ డగు బలితోన్ 85
సీ మనుమఁడా! నీయట్టి మందాత్ముఁడును జ్ఞానరహితుఁ డౌ నృపతి యే రక్కసులకు
దొరయయ్యెనో యట్టి దుష్టదానవదైత్యపుంగమ్ము నాశమ్ముఁ బొందఁగలదు
వాసుదేవుఁడు మహాభాగుఁ డజేశుఁడు దేవదేవుఁడు జగత్స్రష్టవిభుఁడు
కరుఁ డగు హరి యాదు పాపసంకల్పుఁ డైతివి నీవలె నరయ నెవఁడు
ఆ పలుకఁగలఁడు నీవు భాషించినట్టి యీ, దైత్యదానవులును దత్వవిదులు
దేవ సిద్ధసాధ్య దివ్యసబ్రహ్మక, స్థావరాంతభూతతతులు మఱియు 86
ఆ తరుసరిన్మహీధ్రతతవనసాగర, ద్వీపవిష్టపములు దివ్యలతలు
పుట్టి గిట్టకుండఁ బొనగునే యెవ్వని యదం, తయును దలఁచి చూడ దైత్యనాథ!
వ. వంద్యవంద్యుఁ డగు పరమాత్ముని నైవ్యక్తికాంశకలోద్భవములగు; నెవఁడు నీవలె నిట్లు చెప్పనేర్చు? జ్ఞానశూన్యతయు, దుష్టబుద్ధియు, వృద్ధాజ్ఞోల్లంఘనంబున జలచిత్తవృత్తియు, సకలదైత్యదానవలయాభిముఖుఁడ వగు నీయొకని యందె సత్యంబుగ విలసిల్లుచున్న వని నుడివి క్రన్నన నిట్లనియె 88
ఆ నీకుఁ దండ్రి యగుచు నెగడు విరోచన, పాపదానవుండు స్వగృహమందుఁ
గలిగె వాని కొడుకు కంసారి నిందించు, నట్టివాఁడ వగుచు నలరు నిట్టి 89
క తనయుఁడు పుట్టుటచే నా, మన మతిదుఃఖాబ్ధియందు మల్లడివడె నే
మని నీకుఁ జెప్పఁగలనో, ఘనముగ యోజించిచూడఁ గర్బురనాథా! 90
తే సకలసంసారనివహనాశకుఁడు నగుచు, శౌరి రాజిల్లఁ దత్పాదసరసిజముల
యందు నే భక్తిరతుఁడనై యలరుచుండ, నట్లు నీ వేల వర్తింప వైతి వకట!
క వనమాలికంటె నస్మ, త్తను వధికము కా దటంచుఁ దగ నీలోకం
బనయము తలఁచుచు నుండుదుఁ, గన నాప్రాణంబు శౌరికంటెనుఁ బ్రియమై.
క పొనరినది కాదు కాదని, దనుజాధమ! నీ వెఱింగి దర్పముతో నా
కు నగౌరవంబుఁ జేయక, వనజాక్షుని దూరుచున్న వాఁడవు పెలుచన్ 93
ఆ నీకుఁ దండ్రి యగుచు నెగడు విరోచనుఁ
డతని కేనుఁ దండ్రి నగుదు నఖిల

లోకమునకు నాకు । లోకేశుఁ డైననా
రాయణుండు జనకుఁ । డగుచు నుండు. 94

క. గురు గురుగురుఁడై వెలసిన, హరియందే భూతివలన । నతిగర్వాణముం
బోరిఁబోరిఁ జేసితి వందునఁ, గర మైశ్వర్యంబు తొలఁగఁ । గలదిఁక నీకున్. 95

క. దనుజా! నీతండ్రికి నేఁ, గనగురుఁడ జనార్దనుండు । ఘనదేవుఁడు నా
వనమాలి నాకు గురుఁడై, పొనరఁగ భువిమీఁద నెపుడు । పురణింపంగన్ 96

క. నిరుపాధికుఁడు నిరంజనుఁ, డరిమర్దనకరుఁడు ప్రత్య । గాత్ముఁడు దేవే
శ్వరుఁ డాదేవుఁడు మూఁడవ, గురుఁ డని చూడంగవలదె । కుత్సితచిత్తా! 97

సీ. ఈరీతి నాకడ । నీవు జగద్గురునిందాకరుండవై । నెగడితేని
వలనఁ శ్రీనాథుని । వాంఛింప వైతివా తత్కారణంబున । దైత్య నీకు
నేశాప మిచ్చెద । నిక్క మచ్యుతునిందయం దీవుపొగరున । నాడినట్టి
పలుకాత్మశీర్షంబుఁ । బట్టి ఛేదించిన దానికంటెను భూరి । ఘోరము గాన
ఆ. భూతి లక్ష్మి తొలఁగి । భువిపైనఁబడు నెట్లు, పరుఁడు శౌరికంటె । భవసముద్ర
పాలకుండు కాఁడొ, । పరువడి రాజ్యవి, చ్యుతునిగాను నిన్నుఁ । జూతు నల్ల

బలి ప్రహ్లాదునిఁ వేఁడుకొనుట.

తే. అనఘమతులార! యిట్లు ప్రహ్లాదుఁ డాడి
నట్టి కఠినోక్తి నాలించి । యసురవిభుఁడు
సారె కభివందన మొనర్చి । సన్నుతించి
పలికె నాతనిఁ గన్గొని । భయముతోడ 99

ఉ. తాత! యనుగ్రహింపు మతి । దర్పితమోహముతో హతుండనై
ఖ్యాతిగ నుండు నాపయిని । గాఢపుఁగోప మొనర్పనేల నే
నీతతిశక్తి గర్వమున । నిట్టిదురుక్తులఁ బల్కితి న్మహా
పాతకుఁడ న్విమోహహత । బంధురచిత్తుఁడనైతిఁ బ్రోవుమా 100

క. ధీరా! సురేశ! దుష్టా, చారుఁడనై యిట్టు లేను । శప్తుఁడనైతిఁ
గూరిమినట్లే శాపని, వారణము నొనర్పు టొప్పుఁ । బడు నీచేతఁ 101

క. వరరాజ్యకీర్తిహానిం, ధరఁ బొందంగల నటంచుఁ । దలఁచి విషాదో
త్కరచిత్తుఁడ నగుదును మఱి, పొరి నవినయకృతుఁడ నగుదుఁ । బుణ్యనిధానా!

సీ. తాత వేఱగునట్టి । త్రైలోక్యవిభవంబు పొందనశక్యంబొ నె । బుద్ధి నెంచ
సంసారమందు యు । ష్మత్సన్నిభులు నైన భవ్యులుండుట దుర్ల । భమ్ము చూడఁ
గావున దానినిఁ । గరుణించి యొసఁగుము నాయందుఁ గ్రోధంబుఁ । చేయఁదగునె
తతభవశోకాగ్ని । దగ్ధుండ నై యిట్లు పరితపించుచు నున్న । వాఁడ నైతి
తే. ననఁగ బలితోడఁ బ్రహ్లాదుఁ । డాడె మరల
వత్స! కోపంబుతో నాకు । బహుళమోహ

మొదవె నందున జ్ఞానంబు చెదరె దాని
వలన నిచ్చితి నిపుడె శాపంబు నీకు 103

ప్రహ్లాదుఁడు హరినినమ్మియుండుమని బలికిఁ జెప్పుట

క. దానవనాథా! యస్మ, ద్జ్ఞానము మోహంబుచేతఁ గడప వితీర్ణం
బైనది కా కెటు లది పో, నేనె రమానాథనిందఁ యొనరింపన్ 104

ఆ. ఘనుఁడు సర్వగుండు కమలామనోహరుఁ
డగుచు వెలయుచున్న హరినిఁ దెలిసి
కొన్నవాఁడ నగుచుఁ గోపంబుతోడ నె
వ్వని శపింతు దైత్యపాల! చెపుమ 105

క నే నొసఁగినశాపము నీ, చే నలి భావ్యంబు నగుచుఁ దీతి నొప్పారున్
గాన విషాదము నాత్మను, మానుము నామాట వినుము మాటలిఁ కేలా? 106

ఉ గొప్పగుశాపమున్ బడసి ఘోరభయంబునుఁ జెంగియుండ నీ
విప్పటినుండి దేవవిభుఁ డీశ్వరుఁ డచ్యుతుఁడైన శ్రీహరిన్
దప్పని భక్తితోఁ దలచి తాల్మి వసించిఁ జూచి పేర్మితో
నప్పరమేశుఁ డేలు నిను, నంతట నిత్యము దైత్యవల్లభా! 107

క దేవేశుఁడు నీచే నిఁక, వావిరిఁ బొగడంగఁ దగినవాఁ డెట్లు శుభం
బీవసుధ నీకుఁ గలుగునొ, భావించి వచించినాఁడ భక్తిని బౌత్రా! 108

క. అని యూఱడించి పలికిన, విని బలి తనడెందమందు విస్మయపడుచున్
వనమాలినిఁ జింతించుచు, ననయము వర్తించుచుండె నతిభక్తిమెయిన్ 109

తే అనఘసుతులార! శౌరి చేసినదితి మిగుల
నధికకామసమృద్ధిదమైనవరముఁ
బొంది గురుకీర్తిశాలి యయిపోసఁగెఁ జక్రి,
గర్భమున బాహ్యవృద్ధినిఁ గాంచె నంత 110

వామనమూర్తిజన్మక్రమము

చ. పదియవమాసమందుఁ బ్రసవస్థితికాలము రాఁగఁ గాంతితో
నదయుఁడు మామనోహరుఁడుఁ జక్రియు నాహరి వామనాకృతిన్
బొదలుచుఁ గల్గె నాసతికిఁ బుణ్యులచిత్తము లుల్లసిల్లెఁ బ
ల్మదమునఁ బొంగ వార్ధులిలఁ బూర్ణతరంగములొప్ప నత్తఱిన్ 111

తే. సర్వగీర్వాణనాథుఁడు సకలలోక
పతియు గోవిందుఁడును భగ వంతుఁ డైన
హరిజనించినవేళయం దదితి సురలు
వేడ్కఁ జెలఁగుచు దుఃఖంబు విడిచి రపుడు. 112

చ. సుకముగ నాఁకుఁడుర్గ గలిగి సొంపునఁ బయ్యెర వీఁచె నింగి ధూ
ళిఁ గలితహీనమై తనరె లీల వెలింగెను సర్వభూతపే
టికలమనీషధర్మమున దేవ వెలింగెను జూడ మానుష
ప్రకరశరీరసాధ్వసము వాసెను వామనుఁ డుద్భవింపఁగన్ 113

తే. సంభవించినమాత్రన చక్రి కప్పు, డబ్జయోనియు భగవంతుఁ డప్రమేయుఁ
డఖిలలోకపితామహుఁ డైననలువ, జాతకర్మాదిసత్క్రియ లరసి పొగడె

— బ్రహ్మ వామనునిఁ బొగడుట. —

సీ. జయభువనాధార జయమానసోహార జయసత్యసంచార జయసువార
జయనిజమాయాచ్యుత జయహరి జయసర్వగురువర జయధర్మ గుణవిచార
జయమహోన్నత జయ జయ జగజ్జనిమృత్యుసమతీత జయభూరిసారకలిత
జయనిత్యకల్యాణ జయభక్తసంత్రాణ జయదయాసాగర జయసుధీర,
తే. జయసమగ్రజయావ్యక్తసంస్థితేశ, జయపరార్థార్థవిజ్ఞాన జయవిధాన
జయసురాలిసమర్చిత చరణయుగళ, కరుణతో డుతె నన్నేలు కనకచేల! 116

క. జ్ఞానజ్ఞేయార్థంబుల, చే నలి నిశ్చితుఁడ వగుచుఁ జెన్నారెడు ల
క్ష్మీనాథ! నీవు జయమున, మానుగ వర్తింపు మెపుడు మాన్యులు మెచ్చన్

ఉత్సాహవృత్తము. భూరిసకలవిష్టపేశ భూతనాథ సంగతా
చారురత్నభర్మఖచితసారభూషణాంచితా
ఘోరకలుషదూర సర్వగురువరా మహేశ్వరా
వారివాహసమశరీర వారణార్తిసంహరా 117

క. లోకాలోకస్థితినిం, బ్రాకటముగఁ బ్రోచునట్టి పార్థివ! నీ వీ
లోకమున జయముతో సు, శ్రీకరగతి వెలయు టొప్పుఁ జేసెద వినుతిన్. 118

సీ. జయజయాఖిలభార జయభక్తమందార సర్వభూతావాస చారుహాస
మహితాజ్ఞానధ్వాంతమయ, జయసుజ్ఞానమయవర్గ్య, జయముక్తిమార్గవిబుధ
నిర్దేశ్యసంహీన నిత్యహృష్టజయేశ, ముక్తికాముకయోగి ముఖ్యసేవ్య
సత్యశాంతదమాది సద్గుణభూషణ, జయసూక్ష్మదుర్జ్ఞేయ చారుగేయ
తే. జయజగన్మూల జయజగజ్జాలవీర, జయసుసూక్ష్మాతిసూక్ష్మవిషాదరహిత
జయమహాయోగినాయక జయజితేంద్రి, య ప్రభాకరకోటిసహస్రతేజ! 119

క. నిజమాయాయోగస్థితి, సుజనోద్ధరణాసక్త శోభనశయనా
కుజనవిదూరాత్మరనిజ, భజనోత్సుక భక్తజాలపాలననిపుణా! 120

క. ఒకకోటి యగ్రమందున, సకలోర్విన్ దాల్చినట్టి శౌరీ! జయమౌ
సకలేశ పాపనాశా! సుకవీశా! నీకు జయము శోణం బొసఁగున్. 121

క. మురహర! హిరణ్యకశిపుని, గురువటమునఁ జీల్చి చంప గురుతరకీర్తిన్
స్ఫురణముఁ గన్న నృసింహా, కరము జయోన్నతిని జెంది ప్రాలుము శక్తిన్.

క. మాయావామన పావన, మాయామయవిశ్వరూప।మాధవశౌరీ
మాయాదూర జనార్దన, పాయక సతతంబు జయము। భాసిలు నీకున్ 123

క. ఏయెడ వర్తించెడి నీ, మాయఁ గప్పంగఁబడుచు। మనుజునివలె ని
త్తోయమున నుండు నీకిల, వేయువిధంబులను జయము। వెలయు రమేశా! 124

క. బహురూపైకనిధిజయ, బహుళశ్రుత్యర్థపాప।భంజన పుణ్యా
వహ నిర్వికారభావన, సహచర జయ నిర్విచార। సకలాధారా 125

ఆ. భూరిపటువికార।పూర్ణమాయోత్కర, వర్ధితాప్రమేయ। వాసుదేవ
పెంపుచెందు మింక। సొంపుతో సర్వేశ, విశ్వభారమెల్ల। వెడలఁజేయ 126

క. ఈలోకమెల్ల నీచే, వాలాయము మేటిధర్మ।పద్ధతికలదై
లీలను శేషస్థితితోఁ, జాలఁగఁ బెంపారవలయు। సత్యచరిత్రా 127

క. ఈశానేంద్రాదిసురా, ధీశులు మఱి నేను యోగి।బృందము సత్యా
వేశులు సనకాదిము, నీశులు నినుఁ గానఁజాల। రెన్నఁటి కథవా! 128

క. మాయాపటసంవీతుఁడ, వై యెవ్వడీలోకమందు। యత్నముతో నీ
వేయెడ నుండువు నిత్యము, మాయానయలోకనాథ। మానాథ! హరీ! 129

సీ. తద్దయు నీప్రసా।దములేక చూచునె నిను నెవ్వఁడైనను। నిఖిలనాథ
క్షితిమీఁద నెవ్వని। చే నీవు పూజింపఁబడి సుప్రసన్నభా।వంబుతోడ
భాసిల్లెదవొ యట్టి।వాఁడె నిన్ గాంచును దేవ! పరుండెట్లు। తెలిసి నిన్నుఁ
గనుఁగొననేర్చు నా।ఘనతరసందీప్తరేశ్వరేశానసు।రేశవినుత
తే. పృథులలోచన వామన।విశ్వరూప, మొనసి యావిశ్వసంభవ।మునకు నీవు
పెంపుచెందుము నేనిన్ను।వేఁడనెంత, వాఁడఁగరుణించి ప్రోవుము। పద్మనాథ.

శా. ఈరీతి న్వినుతింపఁగాఁబడె హృషీ।కేశుండు నౌ వామనా
కారస్వామి సరస్వతీశ్వరునితోఁ। గౌతూహలం బాత్మఁ బెం
పారన్ భావగభీరమై తనరుచున్। హార్దాంబయారూఢల
క్ష్మీరమ్యం బగువాక్యమున్ బలికె వి।స్మేరంబుఁ గావించుచున్. 131

—వామనుఁడు బ్రహ్మతో నింద్రునకు త్రిభువనముల నిత్తు నని పలుకుట.—

సీ. అనఘ! నీచేత నింద్రాదులచేతనుఁ। గశ్యపుచేతనుఁ। గడఁగి మున్ను
వినుతుఁడనైతగు।వేడ్కతో నీవ దీనాథునకును భువన।త్రయంబు
నిడునట్టిపంతంబు। నేఁజేసితిని మఱి క్రన్నన నదితి న।న్గడిమిఁ బొగడ
హతకంటకంబునై। యలరుఁ ద్రైలోక్యంబుఁ నిడఁగల నింద్రున। కేనటంచుఁ
తే. గశ్యపునిరాణితోడనుఁ। గౌతుకమునఁ, జెప్పితినిఁ దద్విధంబుఁగఁ।జేయఁగలను
నాకపతిలోకనాథుఁడై।నలిఁజెలంగఁ, గలఁడు చెప్పితి నిజ మిది।కనుఁడు మీరు.

క. అని వామనుండు పలికిన, విని వేడుకనొంది రఖిల।విబుధులు పిదపన్

వనజాసనుండు కృష్ణా, జినము నిడెఁ శౌరి కపుడు । చిత్తంబలరన్ 133

క. భగవంతుఁ డగుబృహస్పతి, సగుణాకారంబుతోడఁ । జరియించెడి యా
జగదీశ్వరునకు జందెము, నగణిత మగుభక్తితోడ । నర్పించె మునీ! 134

తే. బ్రహ్మసుతుఁ డౌమరీచి నారాయణునకు
నిచ్చెఁ బాలాశదండంబు । నెలమివారి
పూర్ణ మగుకుండికను ముదమున వసిష్ఠ
సంయమి యొసంగె వామనస్వామి కపుడు 135

క. ఆంగిరసుం డాచక్రికిఁ, బొంగి యొసఁగె నంబరంబుఁ । బొలుపగుకుశలన్
రంగుగ నొసఁగెన్ బులహుఁడ, భంగాసన మాపులస్త్య । వరముని యిచ్చెన్.

క. ప్రణవోచ్చారణగురుధూ, మణు లగుదేవతలు సాంఖ్య । సద్యోగోక్తుల్
గణనార్హసకలశాస్త్రము, లణిమాదులు కొలిచియుండె । నాహరి నంతన్ 137

తే. అఖలదేవమయుండు మాయావటుండు
జటియు నైనట్టి మాధవస్వామి గొడుగు
గుండికనుదండమునుఁ బూని । గండు మిగిలి
పోయె బలిదానవాధ్వర । భూమిఁ జేర. 138

క. ఏయేభూస్థలములలో, శ్రీయుతుఁడు పదమ్ము పెట్టి । చెలువునఁ జనె నా
తోయమునఁ బుడమిగర్తము, లాయాచోటులను గనిరి । నలిపీడితర్లై. 139

చ. జడగతితోడ వామనుఁడు । సంతసమొందుచు మెల్లమెల్లఁగా
నడుచుచు నద్రిసాగర వనప్రకటావని నెల్ల శక్తితో
వడఁజలియింపఁజేసె సురవంద్యుఁడు నా గురుఁ డంత మార్గమున్
గడుఁ దమఁజూపసాఁగె మఱి । గౌతుక మొప్పుచు నుండ నాయెడన్. 140

క. కాలాత్ముఁ డైనశ్రీహరి, లీలాగతి జగతియందు । లీల నొప్పవల్
లీలావినోదమునకై, వాలాయము సంచరించు । వైఖరితోఁచెన్ 141

ఆ. మేటిసర్పమగుచు । మించిన శేషుండు, బలిభవంబు విడిచి । వచ్చి దేవ
దేవుఁ డైన వాసు । దేవునకును దోడు, పాటుచూపె భక్తి । పరిఢవిల్ల 142

ఆ. పన్నగేశ్వరుండు । బలిసద్మముననుండి, వెడలివచ్చినట్టి । పృథ్వి కపుడు
కలిగె సుప్రసిద్ధి గాన తద్దర్శన, మహిభయంబుఁ బాపు । ననఘులార! 143

ఉ. అంతట సర్వపర్వతవనాన్వితసంక్షుభితావనిన్ యశో
వంతుఁడు నా బలీశ్వరుఁడు । వావిరిఁ గన్గొని సర్వవిద్యలన్
మంతువహించు శుక్రుఁ గని । మన్ననచేసి వినమ్రపాణియై
పంతుగ మ్రొక్కి పల్కె మఱిఁ । బల్కులు వింత జనింపుచుండఁగన్ 144

సీ. ఆచార్య! నగకాననాబ్ధియుతంబు నై త్రాలుచుండినభూమి । కలఁతఁజెందె

చేనివలనజ్వలత్త్రేతాగ్ను లాసురసంవిభాగంబుల సంగ్రహింప
నొల్లకున్నవటంచు నుకుఖేదమున నాడ విపులాత్ముఁడును వేదవిదుఁడు నైన
కావ్యుఁ డంతటఁ బెద్దకాలంబు ధ్యానించి పలికె దైత్యేశుఁడౌ బలినిఁ గాంచి
ఆ. విశ్వకారణుండు విశ్వేశుఁ డగుహరి, పుణ్యుఁ డైనకశ్యపుని నిశాంత
మందుఁ బుట్టె వామనాకారమున మహా, దీప్తి దిక్కులందుఁ దేజరిల్ల. 145

బలికి శుక్రుఁడు వామనునిరాక చెప్పుట.

మ. పరమాత్ముండును సుస్థిరుండు నగుచున్ భాసిల్లు నాశౌరి యీ
తరుణం బందుఁ ద్వదధ్వరంబునకు నిత్యప్రాభవోత్కర్షచే
తరహీ న్వచ్చుచు నున్నవాఁడు నిజ మాయాదైత్యవిన్యస్తస
చ్చరణక్షేపముఁ జేసి యీధరణికిన్ సంధిల్లె దుఃఖం బొగిన్ 146
క. కులగిరులు తిరుగఁ జొచ్చెన్, గలఁతన్ బెంపారసాగరగండులు బెడఁగై
మలఁగన్ జేసెను వీర్యము, నిలఁగల దైత్యులకు దానవేశ్వర యింకెన్ 147
తే. సకలభూతాధిపతియునీశ్వరుఁడునగుచు
వాసిఁగనిపొంపుఁజెందునీవామనేశుఁ
డాల్ప నసమర్థ యగుచుండుధరణియపుడు
దానవేశ్వర! సత్యముతలఁచిచూడ 148
వ. సురాసురగంధర్వయక్షరాక్షసపక్షియుతం బగుతీతి సతత మితనిచే ధరింపఁబడు
చున్నది జలాగ్నిపవనాకాశవేదనరమహాసురనికరమును విశ్వంభర వహించుచు
న్నది ధార్యధారకభావముల నెట్టిజగత్తు పీడింపఁబడెనట్లు భువనప్రభుఁ డగు
మాయావామనునకీధాత్రి దుస్సహ యయ్యుండుఁ, దత్సన్నిధానమునపుండి
దేవోత్తము లిపుడు భాగహరు లైరి త్రేతాగ్ను లిట దైత్యభాగములఁ గై
కొనిన వర్యె నని భార్గవుం డాడిన విని హృష్టరోమాంగుఁడై బలిచక్రవర్తి
శుక్రునకిట్లనియె 149
ఉ. భూసురవర్య! మత్సవనభూమికి యజ్ఞవిభుండు నైన శ్రీ
వాసుఁడు తాన సత్కరుణవచ్చిన నాకధికుండు నైన వాఁ
డీ సకలలోకములలో నరయ నెక్కడ లేఁడు విశేషపుణ్యముం
జేసినవాఁడ నాదు మతి శ్రేష్ఠుఁడ ధన్యుఁడ నాఁడుఁ జూడఁగన్ 150
మ. నిరతోద్యుక్తులు నైన యోగివరులే నిత్యేశ్వరున్ జూడ సు
స్థిరచిత్తంబులఁ గోరుచుందురో దయాసింధుండు నిర్గుణుఁడున్
బరమాత్ముండును మేటిభాగ్యుఁడు జగదాధారుండునౌ నా మహా
పురుషుండీయెడ రాఁగలండొ దయనా పుణ్యాధ్వరంబున్ గనన్ 151
క. ఆర్యా! నాచే నిపు డేకార్యము చేయంగఁదగునొ కరుణామతి నా
కార్యముఁ బలుకుము చెప్పెద, నార్యులు నిను మెచ్చుచుండ నతిహర్షమునన్.

మ. మునులారా! బలిదానవుం డిటుల సమ్మోదంబుతోఁ బల్కఁ గ్ర
న్నన భాషించెను శుక్రుఁ డాఘనుని కోపోద్రిక్తం చరేశా! సురల్
ఘనుఁ డౌ దేవుఁడె సాక్షిగా సవనభాగప్రాప్తి యాచింతు రీ
దనుజవ్రాతము దానిఁ బొందునటు కార్యత్వర్యంబునన్ జేయనా. 153

ఆ. సత్యసంస్థుఁ డగుచు । సరవి నీతఁడు స్థితి, పాలనం బొనర్చి । ప్రోచినట్లి
విడుచు దానిఁ దుదను । విడువక భక్షించుఁ, దాని రౌద్రవృత్తి । దనుజనాథ!

తే. అసుర నీచేత వంచితు లైరి సురలు
మేర దప్పక విష్ణుండు మెఱయుచుండుఁ
దివిరి దీనినిఁ జక్కఁగఁ దెలిసి చిత్త
గతముఁ గావింప నగుచుండుఁ । గడిమి నిపుడు 154

సీ. కృతకృత్యుఁడును మహాకీర్తికాముఁడు దేవకార్యకరుండు నై । క్రాలునట్టి
వానినువగు స్వల్పవస్తువిచ్ఛుటయందుఁ బ్రతివవహించుట । పాడి కాదు
సరగఁ జెప్పంగ । సాధువాక్యము నా సుప్రయోజనమున్నై । సొంపునొందు
దేవభూత్యర్థమై । స్వప్నసంప్రాప్తితో యాచించువాఁడునై । యలరు విష్ణుఁ

ఆ. డేగ్యుఁడైన నిన్నుఁ । బృథువాంఛతోఁ గోర, దేవ నీకు నొసఁగు । దివ్యశక్తి
నాకు లే దటంచు । నలినేక్షణునితోడఁ, బలుకఁదగును నీవు । భవ్యచరిత! 156

క. మునులార! యిట్లు శుక్రుఁడు, పనిఁగొని బోధింప దైత్య । పతియా బలి క్ర
న్ననఁ బల్కె దైత్యగురునిన్, గని నయ భయ వినయవచన । కలితుండగుచున్.

బలి శుక్రునితో వామనునకు దాన మిచ్చెదనని చెప్పుట.

మ. అనఘా! నే బరయాచితుం డగుచున్ । యత్నంబుతో లేదటం
చని యేతీరునఁ జెప్పుదున్ సకల పాపాళిక్రయాశుండు పా
వనదేవేశుఁడు దివ్యతేజుఁడు జగద్భారుండు నా చక్రినిన్
గని లేదయ్య! యటంచుఁ జెప్పఁగలనే । కష్టంబె యూహింపఁగన్ 158

తే. సరవి నానావ్రతోపవాసములనెట్టి
శౌరిసంప్రీతి నొందునో । సంతతంబు
విభుఁడు గోవిందుఁడైన శ్రీ । విష్ణుఁ డాత్మ
హస్తమునుఁ జాచి సంతోష । మావహిల్ల. 159

క. దనుజేశ! నాకు నిమ్మని, ననుఁ గని భాషింపఁగలిగినన్ దానిని మిం
చినమేటివిభవమున్నదె, ఘనతర మగుకీర్తి కాదె । క్రవ్యాదగురూ! 160

ఉ. శౌచగుణాంబులున్ గలిగి । సజ్జనులే హరితుష్టికై సదా
లోచనకర్గ జన్మముల । లోలతఁ దారొనరించుచుందు రా
ధీవతురుండునైన హరి । తెంపున మత్సవనంబుఁ జేరినన్
జూచి యొసంగు మీవనుచు । సొంపునఁ బల్కినఁ జాలు భార్గవా! 161

ఆ. ఏది దత్తమగుచు నెసఁగు వాచే దాని, భావ మలర జక్రిపాలిఁ గానిన
నది సుకర్మ మగుచు నలరు నాతపమది,సాధుకృతము నగును జగతిలోన 162

ఉ. శ్రీదయితుండు కేశవుఁడు శ్రీకరుఁడా పరమేశుఁ గూర్చి నే
నాదట లేక లేదనుచు నక్కట! యెట్లు వచింపనేర్తు నీ
వాదము చాలుఁ జేయఁగలఁ బ్రాణవినాశము నిక్కమింతటన్
లేదనుశబ్ద మెక్కడను లే కిలఁబోవును నాకు భార్గవా! 163

చ. క్రతుపతి యౌ జనార్దనుఁడు కౌతుకియై చనుదెంచి ప్రేమ నీ
క్రతువున నన్ను నిమ్మనుచుఁ గ్రన్ననఁ బల్కిన నేను దన్మనో
గత మగుకోర్కెఁ దీర్త నిట గ్రక్కున సందియ మేమిలేదు స
మ్మతిని వచించితి న్నిజము మాన్యులు మేలని యెంచిచూడఁగన్. 164

శా. ఆగోవిందుఁడు వచ్చి నిల్చి తను నన్యాసించి యిమ్మంచుబల్
రాగారూఢినిఁ బల్కెనేని నిజమూర్ధం బైన నేమైన నా
భోగాధీశునికే నిడన్ గలను సమ్మోదంబుతో నీయెడన్
భోగాధికృత దీనికన్నఁ గలదే బుద్ధి న్విచారించినన్ 165

సీ. దానవాచార్య! సంతతము యాచించెడు వారికి లేదని పలుక నెపుడు
నాశములేనట్టి నారాయణుఁడు రాఁగ నరసి లేదని యెట్టు లాడఁగలను
దానంబు బాధకుఁ దావలం బగుచుండు నది ధీరులకు శ్లాఘ్య మగుచునుండు
నేదాన మిలలోన నెట్టికష్టము లేనిదై విలసిల్లునో యట్టిదాన
ఆ. మంగళమువంటి దనిచెప్పఁ బడునాడు
రాజ్యమందు విత్తరహితుఁ డైన
వాఁడు శివులుఁ గానివాఁడు దరిద్రుఁడై
వెలయువాఁడు లేఁడు వెదకిచూడ 166

తే. భీతుఁ డైనట్టివాఁడునుఁ బ్రభుబలభూష
వర్జితుఁడు నై చెలంగెడువాఁడు సుప్ర
సాదరహితుఁడు నగునట్టి జనుఁడు లేఁడు
మఱియు నా రాజ్యమందున మాన్యచరిత! 167

తే. ఓమహాభాగ! తృప్తితో నోనరి తుష్టి
కలిగి హృష్టతతో నొప్పి క్రాలుచుండు
సకలమానవనికరము సతతమేనుఁ
దాన సుఖనై మెలంగుదు ధాత్రియందు. 168

వ. మునిశార్దూలా! నాకెట్లు దానఫలంబు నుపదేశించితివో నేనట్ల విశిష్టదానఫలంబు
బొందితి నిపు డీబీజశ్రేష్ఠ మగుదానబీజము వ్యర్థంబయిన నీక మహాపాత్రుఁ

డగుజనార్దనునియం దది నాచే నెట్లు పొందింపంబడినదగు నా కది సమకూడ నేని వేలుపులు సంతుష్టులగుదురు. నాయందలి యనుగ్రహమువలనఁ బరుఁడు కాని హరిజన్మమున నారాధితుండగు నిజము తదారాధనమున నాగోవిందుఁడు తుష్టినొందఁగలఁడు సంశయములేదు తద్దర్శనము నాకు నుపకారియగు నట్లా హరి హర్షితుఁడుగాక కోపమున వచ్చి దేవభాగనిరోధకుఁడ నగునన్నుఁ జంపఁ గమకించెనేని హరివలనఁ గలుగుమృతి కొనియాడఁదగినదగు నాహృషీకేశుఁడు నను జంపుట కెట్లు రాఁగలఁడు? మునిశ్రేష్ఠా! దీని నీ వెఱింగి జగన్నాథుఁ డగునారాయణుఁడు సముపస్థితుఁ డగుచుండ దాన విఘ్నపరుఁడ వయిన నీచేత నాలోచింపఁదగినది కాదే యని భాషించుతఱి 169

### వామనదేవుఁడు బలియజ్ఞశాల కేఁతెంచుట

క. మునులార! విను డు నుడివెద, వనజదళేక్షణుఁడు నైన । వామనుఁ డంతన్
మునిశిష్యులెసఁగయుతుఁ డై, దనుజేశుని యజ్ఞభూమి । దరియం జొచ్చెన్ 170

క. వనమాలి రాకడం దమిఁ, గని స్వీయపురోహితుండు । ఘనుఁడగు నాశు
క్రునితోడ మరల బలివిభుఁ, డనె విజ్ఞులు సంతసింప । నతిహర్షముతోన్ 171

వ. మహాత్మా! శ్రీహరి యేకారణమున నను యాచింప నాత్మ నెంచివచ్చె? నాహరి సకలచేతస్స్వామియు సకలభూతమయుండును చింత్యుఁడు నైయుండి మాయా వామనరూపియై నాగృహంబున కేఁతెంచె నని పలుకునెడ 172

తే. యజ్ఞవాటంబుఁ జేరిన । హరినిఁ గాంచి, దత్ప్రభావంబువలనఁ ద । త్కాంతివలన
విగతవీర్యులు నై దైత్య । విభులు కలఁతఁ, జెంది రాలోనఁ దాపస । శ్రేష్ఠు లలర

సీ. గాధిపుత్ర వసిష్ఠ । గర్గాదు లగుమునుల్మఱికొంద ఱైనట్టి । మానివరులు
సవనంబునందుండి । జడిసిరి బలి తనపుట్టుక సఫలమై । పొనరె ననుచుఁ
దలఁచె. బిమ్మటఁ గలం । తనుఁ జెందియున్నట్టి మనుజుఁ డొక్కండైన । మాటలాడ
కుండె వేత్త్వెలుఁగా । నురుభక్తి నర్చించె । దేవదేవేశునిఁ । గిరి పిదప

ఆ. దేవదేవవిభుఁడు । దివ్యవామనరూప, ధరుఁడు నైన శౌరి । తాపసులను
నమ్రుఁ డైనబలిని । నలియజ్ఞకర్త్రాధి, కారయుతులయతులఁ । గాంచి మఱియు

చ. ధనికుల యాజకాధ్వరస । దస్యసవాగ్ములఁ గాంచి పేర్కొనన్
విని సవనస్థు లైనముని । విప్రులు సభ్యులు సర్వపాత్రుఁడై
తనరెడువామనేశ్వరునిఁ । దత్క్షణమే వినుతించి మేలు మే
లనుచు వచించి రంత నుప । లాలనచేయుచుఁ బల్కె రాయెడన్ 175

ఉ. ఆదనుజేశుఁ డంతఁ బుల । కాంకితగాత్రుఁడు నై కరంబునన్
మోదముతోడ నర్ఘ్యవర । ముం గొని శ్రీహరిఁ బూజచేసి ని

స్ఫేదలేఁ జెంది సంస్తుతినిఁ గీర్తితభక్తి నొనర్చి మించి త
త్పాదములందు శీర్షమునుఁ దాఁకొనఁజేయుచు మ్రొక్కి యిట్లనెన్ 176

క వడుగా! యెవ్వఁడ వెవ్వరి!, బుడుతవొ? తావేది నీకుఁ? బురుణింపుమునీ
నడవడికఁ జూడ వెడఁదా, కడతేరెను నేఁడు నాదు క్రతువుగులంబున్ 177

క శ్రీరమణీవరశిష్టా, చార కృపాధారగభూరిసత్యవిహారా!
నీరాకను నాజన్మము, ధారణి సఫలంబు నయ్యెఁ ధన్యుఁడ నైతిన్ 178

మ వరరత్నంబులొ కన్యలో గృహములో వస్త్రంబులో గోవులో
కరులో మాడలొ మేడలో వనములో గ్రామంబులో సొమ్ములో
హరులో దివ్యరథంబులో కనకశిష్టార్థాళులో భూములో
ధరణీభాగమొ కాక యే మడిగెదో ధన్యాత్మగణ్యా! తమిన్ 179

క. అనఘా!, విను నీకేయది, మనసున కెన యగునొ దాని మమతేఁ దలిర్పన్
మనసార నిడెద నియ్యెడ, గొనిననుఁ బాలించుటొప్పు గురుదయతోడన్ 180

వ ఇట్లు నిలింపవైరి తెంపుపెంపుసొంపున నింపుగఁ బలికిన విని హర్షించి భగవంతుఁ
డైన వామనుఁడు ప్రమోదగర్భితములును సస్మితగంభీరములు నగుమాటలతో
ని ట్లనియె 181

క. పావకశరణార్థంబున, కై వసుధఁ బదత్రయమ్ము నతిహర్షముతో
భావించి నాకు నొసఁగుము, భూవర! సత్కీర్తి వచ్చుఁ బుణ్యము కలుఁగున్.

ఆ. ఒంటివాఁడఁగాన నొకటి రెండడుగుల, మేర పుడమిచాలుఁ గోరినట్టి
వారి కిడుము రత్నవసుధాదులనుఁ జేర్చి, దానతోషసాంద్ర దానవేంద్ర.

సీ. మునులార! వామనమూర్తి యిక్కైవడి భాషింప నాలించి బలివిభుండు
పలికె నచ్యుత! మూఁడుపదములచే నెట్లు యోజింపనీకుఁ బ్రయోజనంబు
వటులును శిలలక్షపదమాత్రమైనను యాచింప నగునని యసురవిభుఁడు
చెప్పిన విని నవ్వి శ్రీశుఁడు పలికెను, దానవేశ్వర పదత్రయముఁ గోరి
తే. నేఁ గృతార్థుఁడ నైతిని నిజము చాలు
నఖిలవిత్తాదులనుఁ బరయాచకులకు
నిష్ట మున్నట్టి లీరున నిమ్ము నీకు
దానిచే మోక్ష మొనఁగూడు ధరను మిగుల. 184

వ అని యమ్మాణవకుండు పలికిన గృహమేధి యిట్లనియె. 185

మ. వసుధాభాగము వేఁడితో యువతుల న్వాంఛించితో వేశ్యలో
వసునాగాశ్వమణిప్రవాళజగతీవస్త్రాదులన్ గోరితో
పసిబాలుండవు కోరనేరవు మహాభాగ్యంబు నాచెంత సొం
పెసలారన్ గని కొంచెమి మ్మనుచు నీ వెట్లాత్మ భావించితో.

వ. అనిన మొగంబునఁ జిఱునగవు నిగనిగఁగుల్క మాయామాణవకుఁడు దానవజన
కున కిట్లనియె 187

ఉ. దానవనాథ! నా కిపుడు దండమొ ముంజియొ యాతపత్త్రమో
మానితమైనకుండికయొ మానగు నీభువనాశ్వవిత్తముల్
మానినులేల భూషణవిమానము లేల పదత్రయంబు స
మ్మానమొనర్చి యిచ్చుటయె మంచిది, మేరు వొసంగినట్లగున్ 188

తే. ఇట్లు పలికెడు సర్వేశ్వరేశుఁడైన
వామనునిమాట లాలించి బలివిభుండు
మోద మొప్ప బదత్రయమ్మును నొసంగె
శ్రీశునకు దివ్యసత్కృపావేశునకును 189

క. బలిదత్తజలము కరమున, సలలితగతిఁబడినఁ జూచి సంతసపడి స
భ్యులుఁ జూచుచుండఁ గడిమిన్, వలనుఁగ నావామనుండ వామనతనుఁడై

వామనమూర్తి విశ్వరూపంబు ధరించుట

శా. ఇంతింతై పరికింపఁగాఁ బుడమిపైనింతై ప్రభోత్కర్షచే
నంతై పుష్కరవీథిమీఁదఁ దమినల్లంతై నిశాధీశుపై
నంతై సూర్యునికంతరై ధ్రువునిపై నంతై మహాలోకమం
దంతై దివ్యపదోన్నతుం డగుచు బ్రహ్మాండాంతగుండై వెసన్ 191

తే. మౌనివరులార! వినుఁడు శ్రీమాధవుండు
పద్మలోచనుఁ డగునట్టి వామనుండు
నిఖిలదేవమయంబునై నెగడు విశ్వ
రూపమునుఁ జూపెఁ జెప్పెద రూఢిదాని 192

వ. ఇట్లు కేశవుండు త్రిగుణమయం బగువిశ్వాకారంబుఁ దాల్చి విశ్వంబును గగ
నంబును నాకతలంబును భువనాశాభాగంబులును సకలంబునుఁ దానై కలసి
మెలసి భూలోకంబు నతిక్రమించి భువర్లోకంబుఁ దాఁటి సువర్లోకంబునకుఁ
బొడవై మహర్లోకంబుఁ దలఁకడచి జనలోకమున కుచ్ఛ్రియుండై తపోలోక
మునకు మీఁదై సత్యవిష్టపమునకంటె నౌన్నత్యమును వహించి బ్రహ్మాండ
ముల నిండి మహాదేవాలుండై నయనంబులఁ జంద్రసూర్యులును, శీర్షంబున
స్వర్గంబునుఁ, బాదంబుల భూమియు, బాహాంగుళులఁ బిశాచంబులునుఁ, గరాం
గుళుల గుహ్యకులును, జానువుల విశ్వేదేవులును, జంఘల నమరోత్తము లగు
సాధ్యులు, నంగంబుల నప్సరోదేవతలును, దృష్టి నఖిలనక్షత్రములునుఁ, గేశ
ముల సూర్యకిరణములునుఁ, దారకల రోమకూపములును, రోమముల మహ
లును, గరముల విదిక్కులునుఁ, జెవులం దిగశ్వినులును, ఘ్రాణంబున నని

బలుఁ డగుపవనుఁడునుఁ, బ్రసాదంబునఁ జంద్రుండును, మనసున ధర్మంబును, వాక్కున సత్యంబును, జిహ్వయందు వాగ్దేవియుఁ, గంఠంబున దేవమాత యగునదితియు, బలంబున విద్యలును, మైత్రంబున స్వర్గద్వారమునుఁ, గను బొమలం ద్వష్టృపూషులును, ముఖంబున వహ్నియు, వృషణంబులఁ బ్రజాపతులును, హృదయంబునఁ బరమేష్ఠియుఁ, బుంస్త్వమునఁ గశ్యపమునియుఁ, బృష్ఠంబున నష్టవసువులును, సకలసంధుల మరుద్గణంబును, వక్షస్థలంబున నేకాదశరుద్రులును, దైర్ఘ్యంబున మహార్ణవంబులునుఁ, గుక్షిని గంధర్వులునుఁ, గటితటంబున రమామేధాకాంతిధృతిసర్వవిద్యలునుఁ, దేజస్సునఁ దపోమహత్తులును, శరీరకుక్షుల నధికబలు లగుదేవతలుఁ, గాంక్షం బశుబంధాగ్రజన్మచేష్టితములునుఁ గలవాఁడై శంఖచక్రగదాశార్ఙ్గదండఖడ్గాక్షయశరతూణీరచాపవిరాజితుఁడునుఁ, గిరీటమకరకుండలకేయూరహారకౌస్తుభమణివనమాలాంబరకంకణవిభ్రాజితుండును, నసమానతేజోవిలసితుఁడును, సునందనాదిపరిచరవాహినీవృతుండునై బ్రహ్మాంశంబు తనమేని కప్పుతెఱంగున నుండ విజృంభించునెడ

సీ. గురుబలు లైనట్టి । ఘోరదైత్యేంద్రులు దేవమయంబునై । తేజరిల్లు
తద్విష్ణురూపంబు । దర్శించి దహనునిఁ గన్న పతంగులరీతిఁ । గదలఁజాల
కుండి రంతట రాక్షసోత్తముఁ డగుచిత్తురుఁడు కోపమున లేచి । రూక్షనయనుఁ
డై రెండుకోఱల । నాకేశవునిచరణాంగుష్ఠమునుఁ బట్టి । నాగ్రహించి

ఆ. చక్రి వానిమెడను । జరణాంగుళంబునఁ, దునిమి మించి సర్వ । దుష్టదైత్య
దానవులనుఁ జంపి । ధారణి నంతట, నిండి వెలిఁగె నంత । నేర్పుమిగుల. 194

చ. సురపరిపాలనక్రియను । సొంపిలుచక్రికిఁ జంద్రభాస్కరుల్
ధరణిని మించిపోవుటఁ । దద్దయుఁ గన్గొన వీటసంస్థులై
పరఁగుచు వెల్గి రంతట న । భంబును దాఁటఁగ సక్థిదేశముం
గరకరిఁ బొంది రందుపయిఁ । గ్రాలినజానుగులైరి చెచ్చెరన్. 195

చ. పరవి నురుక్రముండు నగు । శౌరి సమస్తము నాక్రమించి భీ
కరు లగుదైత్యులన్ దునిమి । కౌతుకియై భువనత్రయంబు ని
ర్జరపతి కిచ్చి విస్తృతధ । రాస్థలిఁ గన్ దగఁ గ్రిందఁ బొందికన్
బరఁగు రసాతలంబు నిడెఁ । బాలిని దానవచక్రవర్తికిన్. 196

## వామనమూర్తి బలిని పాతాళమం దుండుమని చెప్పుట

క. సుగుణాఢ్యుఁడు ప్రభవిష్ణుఁడు, ఖగవాహనుఁ డఖిలనాథ । గణపతి యగు శ్రీ
భగవానుఁ డంత బలివిభు సుగమస్థితిఁ జూచి పలికె । సొంపెసలారన్. 197

తే. దైత్యనాయక! నీచేత । దత్తమైన,జలము నేఁ గొన్నహేతువు । వలన నీకుఁ
గల్పపరిమాణజీవితో । కాల మొనరఁ, గలదు విను మింకఁ జెప్పెదఁ । గౌతుకమున

క. వైవస్వతమనుకాలము, పోవఁగ సావర్ణిమనువు పొడమినవేళన్
దేవతలకు నీ వధిపుఁడ, వై వాసిన్ గాంచఁగలవు భాస్వత్కీర్తిన్ 199

తే. అసురనాయక! నేఁడొల్లి యధికభక్తి
నర్చితుఁడ వైతి సురలచే నందువలనఁ
బంచసప్తతియుగముల వఱకు నీదు
రాజ్య మొసఁగితి నిర్జర రాజున కట 200

క. ఏవారు రిపులొ సురపతి, కావైరులు ధాత్రిపై నియంతప్రస్యలు స
ద్భావులు నగుదురు నాచే, వారిని నీకిమ్మీఁద దైత్యవర రోధింపన్. 201

క. దనుజేశ! సుతల మగుచున్, దనరెడి పాతాళలోకమున మద్వచనం
బునఁ గొని యానతి మీఱక, ఘనతన్ వర్తించుచుండు ఘనయశ మలరన్

సీ. ప్రాసాదశతముల భాసిల్లి ప్రోత్ఫుల్లపంకజకాసారబహుళవృక్ష
శుద్ధసరిత్తటశోభిత మగునట్టి పాతాళభూమినిఁ బరమగంధ
సహితుఁడవును రూపసంపన్నుఁడవు భర్మరత్నోరుభూషణరాజితుఁడవు
చందనస్రగ్దిగ్ధచారుగాత్రుండవు గాననృత్యాసంగగాఢతోష,
తే. భరితచిత్తుండవై శతభామినీయు,తుండవై విప్రనిర్జరస్తోమమునకు
బాధ యొనరింప కెంతవఱకు నుందు,వంతపర్యంత మతిభోగ మనుభవింతు

చ. ఎపుడమరాగ్రజన్ములకు నీవు విరోధముసేయ నెంతువో
కపటమనంబుతో నపుడె క్రక్కునఁ బ్రాళ్లకుఁ జిక్కి స్రుక్కి దు
ఖపుగతి నొంది వేసటనుఁ గ్రాలుచు దారుణకర్మనుండ వై
చపలత నొందఁగాఁగలవు సత్యము దానవదైత్యశేఖరా! 204

క. వనమాలి యిట్లుపలికిన, విని తహతహపడుచు దైత్యవిభుఁ డాశౌరిన్
గని కేల్మోగిచి వచించెను, వనజోదరసద్విచార! భావవిదూరా! 205

క. పాతాళంబున నశనము, చేతఃప్రీతిదము నగుచుఁ జెలఁగెడిభోగం
బాతతసత్క్రియ లేగతి, చేతను సమకూరు నాకు జింతింపంగన్ 206

ఆ. అనఘ దానివలన నాప్యాయితుఁడఁ గాక, భక్తితోడ నెపుడు భావమందు
దలఁతు నిన్ను టంచు దానవేశుఁడు వేఁడ, నాలకించి శ్రీశుఁడనియె మరల.

క. క్రవ్యాదనాథ! సతతము, దివ్యాన్నము నిత్యభోగతృప్తియు నట నీ
కవ్యవహితమై పొసఁగున్, గ్రవ్యాదులు యుష్మదాజ్ఞఁ గ్రాలుదు రోలిన్. 208

సీ. అవిధిదత్తంబులై యలరుదానంబులు విప్రవిహీనమై వెలయు శ్రాద్ధ
ములు గతశ్రద్ధతో మొనయు హోమంబు లదక్షిణంబైన యధ్వరము లవిధి

కృతములో క్రియలును సతమున వ్రతములొసదధీతములునుతీర్థజలవిహీన
పూజలదర్భలై పొసఁగుసత్కార్యంబు లాజ్యము లేక పెంపారుహోమ
ఆ సమితి నీకు ఫలము సరవి నీయనుఁగల
వెపు దెవండు భక్తి నిట్టిచోటు
నాశ్రయించి కొన్నియయాక్రియలనుఁ జేయఁ
నేర్చెనేని వాఁడు నిశ్చయముగ 209

తే అసురభాగుఁడు కాఁ డెపుడైనఁ బుడమి
వినుము భవ్యాశ్రయంబునై విపులపుణ్య
మైనవిష్ణుపదహ్రద మందె వందు
స్నానమొనరించి సద్భక్తి సహితుఁ డగుచు 210

వ విధికృతము లగువ్రతంబులను శ్రాద్ధములను సత్క్రియలను జేయునో వాని
కవన్నియు నక్షయములై పొనరఁగలవు, సందియము లేదు జ్యేష్ఠశుక్ల కాదశి
యం దుపవసించి ద్వాదశియందు విష్ణుపదంబున స్నాతుఁడై వామనుని దర్శించి
తనశక్తికొలఁది దాన మొనర్చినవాఁడు పరమపదంబు నొందఁగలఁ డనిచెప్పి
మరల ని ట్లనియె 211

క నొప్పులు వ్యాధులు బాధలు, తప్పులు లేకుండఁగలవు తథ్యము తమి నీ
విప్పుడు చను మచటికి సొం, పొప్ప నటం చనుచుఁ జెప్పె యురుతోషమునన్

## వామనుఁ డదృశ్యుం డగుట

క బలి కీవరమునుఁ ద్రిభువనములు శక్రున కిచ్చి రూపమును దాచి జనం
బులకు నదృశ్యుం డయ్యెను, జలరుహనాభుండు చూడ సంయములారా! 213

క సురపతి ముల్లోకంబులఁ, బొరిఁబొరి బూజ్యుండు నగుచు భువనంబుల భా
సురమతి నేలెను నిర్జర, పరులందఱు తుటుములగుచుఁ బ్రస్తుతిసేయన్ 214

క బలిపాతాళభువంబును, సలలితగతి నాశ్రయించి జలజాక్షుఁడు నా
వనమాలిని మదిలోపల, దలఁచుచు వర్తించుచుండె తాపసులారా! 215

క ఇటు లేతన్మాహాత్మ్యముఁ, బటుభక్తి వచింపఁబడెను వసుధ నెవం డా
దట నాలించునొ కిల్బిష, పటలం బాతనికిఁ బోయి భద్రం బొనరున్ 216

సీ బలిచక్రవర్తికి బ్రహ్మాదునకుఁగల్గినట్టిసంవాదంబు హాటిక బలికిఁ
బొసఁగినమంత్రితంబును విష్ణుబలి కథితంబుఁ దలంచిన ధన్యవితతి,
బాధలు వ్యాధులునతిశయకష్టము ల్పొందవు రాజ్యంబు తొలినిఁ గోలు
పడినవారికి రాజ్యపద మొనఁగూడును గలుషమడంగు నీకథను వినిన
ఆ భూమిసురుఁడు వేదమును బార్థివుఁడు భూమి
వైశ్యుఁ డధికవిత్తభాగ్యములను

శూద్రవరులు విపుల / సుఖతతులను వేడ్కఁ
బొందుచుండు రెప్పుడు / భూతలమున. 217

క. అనియిట్లు రోమహర్షణు, ముని వామనుదివ్యచరిత / మునుఁ జెప్పిన వే
డ్కను నాలకించి ఋషివరు, లని రాసంయమినిఁ జూచి / యతిశయభక్తిన్.

సరస్వతీనది జన్మక్రమము.

తే. పరమసరిదాఖ్యయును మహా / భాగ యైన
యీసరస్వతి భూమిపై / నెట్లు పుట్టె
మొనసి యెట్లు కురుక్షేత్ర / మునకు నేఁగె
మాకు దయతోడఁ దెలుపుము / మాన్యచరిత 219

సీ. వసుధలో నాయది / బ్రహ్మాండరోవరమునుఁ బొంగి పార్శ్వస్థ / ముఖ్యతీర్థ
యగుచు సంతతము దృ / శ్యాదృశ్యయై యెట్లు యాదసాంపతిదిశ / కరుగుచుండు
బ్రహ్మవిద్వర! యిట్టి / భవ్యతీర్థప్రభావమునెల్ల వివరించి / పలుకుమనుచుఁ
బ్రార్థింప లోమహా / ర్షణుఁ డాడె వారితో మునులార! శాశ్వత / మునఁ జెలంగి
తే. యాపగావర్యయై తన / రారునట్టి, యీసరస్వతి జనియించె / నెలమిఁ బ్లక్ష
శాఖయందునఁ దనుభక్తి / సంస్మరించు, వారిదురితంబులనుఁ బాప / వసుధమీఁద
తే. ఆమహానది శైలస / హస్రములను, రయము మీఱఁగ భేదించి / రమ్యపుణ్య
వారియై ద్వైతమిశ్రిత / వనమునందుఁ, దివ్యగమనమునం జొచ్చెఁ / దేజరిల్ల
క. జనగఁగనుఁగొని పొరిఁబొరి, నానందము పొడముచుండ / నపు డతిభక్తిన్
మావక మ్రొక్కి మృకండుని, సూనుండు నుతింపఁదొడఁగె / సుస్థిరమతియై

మార్కండేయుఁడు సరస్వతీనదిని స్తుతించుట.

క. ఓదేవి! నీవు శుభదవు, వేదారణి వమలమతివి / విస్తృతపుణ్యా
పాదకవు, లోకమాతవు, సాదరగుణమణివి, సత్య / చరితవు జగతిన్. 223
క. ఏపద మేపదసత్త్వ, ప్రాపగునో మోక్షబోధ / పదవికి నది యు
ద్దీపించును నీయందు న, కూపారజలంబు మాడ్కిఁ / గొమరొప్పంగన్ 224
తే. అంబ! నీయందు నక్షరుఁ / డైనబ్రహ్మ
మక్షరముకాని దగువిశ్వ / మధివసించు
నగ్నిహోత్రుఁడు దారువు / నందు గంధ
మవని యందుండుచందాన / నరయ నెపుడు. 225
సీ. దేవి యొక్కడ స్థిరా / స్థిరలసత్ప్రాణవాక్షరస్థానగతియు స / ర్వంబు మిగుల
కలదు లేదనునది / కలదో చూడఁగ నట మాత్రాత్రయమ్ము స / మ్మానమైన
భువనత్రయంబులు / మూఁడు వేదంబులు కళలు మూఁడునుఁ బావ / కత్రయమ్ము
మూఁడు జ్యోతిస్సులు / మూఁడు వర్ణంబులు మూఁడు ధర్మంబులు / మూఁడు గుణము

తే. లక్షలభూతులు వేదత్రయమ్ము మూఁడు
ధాతువులు పితృతతియు। నవస్థలును మూఁడు
నలరు నదియెల్ల నీరూప । మగుచునుండు
నవని నిన్నెన్న నాతర। మా నె యరయ 226

తే. అబ్జయోనికి నాద్యము। లగు విరిన్న, దృష్టులై శాశ్వతంబులై । తివిరి సోమ
పాకసంస్థితికలవియై । బహుహవిర్గ, తంబులై యేవి వెలయునో । ధాత్రిమీఁద.

క. వానిని విజ్ఞులు నిత్యము, మానసమున నిన్నుఁ దలఁచి । మమతదలిగ్ర్వ
గానలిఁ జేయుచు నుందురు, నూనం బగుభక్తితోడ । సురతోషులునై. 228

క. నిన్నుఁ దలఁచుచు నీయందలి, వనసుం దే వాఁడు క్రుంకి । భక్తియుతుం డై
తనపితరులకుఁ దిలోదక, మును విడుచునో వాఁడు మిగులఁ । బుణ్యుఁడు గాఁడే.

సీ. నిర్దేశ్యరహితమై । నిత్యమెయర్ధమాత్రాశ్రితమై దివ్య । మైనదగుచుఁ
బరమమై యవికార్య । భగ్నమై పరిణామరహితమై తన గారు । వట్టి యుట్టి
నీరూప మెన్నంగ । నేను శక్తుండనే యన్యుఁడు శక్తుఁడే । యభినుతింప
నరయఁ దాలోష్ఠజి । హ్వాదులతో నిత్య మేది చెప్పంబడె । నెలమి నద్ది

ఆ. పద్మనాభ దివ్య । పార్వతీహృదయేశ, భాస్కరాబ్జయోని । పద్మవైరి
వజ్రి దేవవహ్ని । వాయుగంధర్వులు, దివ్యకాంతిచయము । దిశలు మఱియు

వ. విశ్వాలయంబు, విశ్వరూపంబు, మహేశ్వరత్వంబు, సాంఖ్యవేదాంతవేదోక్తంబు, బహుశాఖాస్థిరీకృతంబు, సదసత్తులును, నొకటిగాయుండి పెక్కురూపముల నొంది వెండియు నొకటెనగియు, భావభేదసమాశ్రితంబు, నామరహితంబు, షడ్గుణాఖ్యంబు, బహునామవిలసితంబుఁ, ద్రిగుణాశ్రయంబు, నానాశక్తివిభావజ్ఞంబు, నానాశక్తివిభావకంబు, సుఖాతిశయసుఖకరంబు, నిష్కలంబు, సకలంబు, సమస్తలోకంబు, ద్వైతాద్వైతవ్యవస్థితియు నీయందు వ్యాప్తంబై యుండు నాశయుతస్థూల సూక్ష్మపదార్థములకును భూమ్యాకాశపరభాగములం దెల్ల నశించువానికి నీవు దృశ్యవై రాజిల్లుదువు సతత మేది విరూపమో సకలరూపమైన దెయ్యదియో భూతములం దల్పమైనకర్మ మేదియో శ్రుతిలేఖలం దేది సుస్థిరాక్షరసహితమయ్యెనో తత్సర్వంబు నీరూపమై రాణించు నని కొనియాడుచున్న మహాత్ముఁ డగుమార్కండేయమహామునిం గాంచి విష్ణుజిహ్వాగ్రయైన సరస్వతీదేవి యిట్లనియె 231

క. మునినాథ! నన్ను నేస్థల, మునుఁ బొంకింపంగఁగలవో । భువి నే నాచో
టునిఁ గూర్పి రాఁగలం దని, సనిశవ తంత్రితను నగుచు । నతిశయకీర్తిన్ 232

క. అని యా దేవి వచించిన, విని మార్కండేయమౌని । విభుఁ డప్పు డా దే
విని జూచి సారెసారెకు, వినుతించి నమస్కరించి । వేడుకఁ బలికెన్ 233

తే. మొదటికాల నబ్జయోనిదై ♦ మొనయుదాని
కవలనాగమ్రాదంబు బెం♦పారుదాని
కవ్వలనుఁ బుణ్యకర్ముఁడౌ ♦ నక్కురుముని
చేత నాకృష్ట మగుకురు♦క్షేత్ర మొప్పు. 234

సరస్వతి కురుక్షేత్రమును బొంది ప్రవహించుట.

క. ఓయమ్మ! దానినడుమనుఁ, బాయని దగుభూమియందుఁ ♦ బ్రవహించుచుఁ బో
వ్మా యనుల నలినజలయుతె, నై యుపు డమరాళి యెల్ల ♦ నానందింపన్. 235

క. మునివరులార! మృకండుని, తనయుం డీరితిఁ బల్కఁ ♦ దద్దయుఁ బేర్మిన్
జనె నది వెల్లువతోఁగల, సిన దై తత్క్షేత్రమందుఁ ♦ జెలువము మీఱన్ 236

సీ పుణ్యతోయయు మహా♦పుణ్యదాయిని యైనయాసరస్వతి యట ♦ నమరునట్టి
రంతుకమునుఁ బొంగి♦రమణ నంతన కురుక్షేత్ర మెల్లనుఁ దాటి♦చెలువుమిగిలి
పడమటికడఁగూర్చి ♦ ప్రవహింపుచున్నది యచ్చోట మౌనిసే♦వ్యములు నైన
తీర్థసహస్రము ♦ తేజరిల్లుచునుండు, బ్రహ్మప్రసాదంబు♦వలనవానిఁ

తే తెలియఁజెప్పెద వినుఁడు త♦త్తీర్థరాజ
తతిఁ దలంచుట పుణ్యంబు ♦ దర్శనంబు
పాపనాశంబు స్నానంబు ♦ భద్రదంబు
వృజినకర్ములకైనను ♦ బృథివియందు. 237

కురుక్షేత్రతీర్థప్రశంస.

మ ధరపై నెవ్వరు తీర్థదేవతలఁ జి♦త్తం బందు ధ్యానింతురో
కర మావేల్పులఁ దృప్తిచేయుదురొ యా♦కాంక్షించుచున్ శ్రద్ధ నా
వరతీర్థంబులయందు స్నాతు లగుచు ♦ నర్తింతురో వారు సు
స్థిరకైవల్యముఁ జెందుచుందురు మహా♦దీప్తి న్విజృంభించుచున్ 238

క సకలావస్థలఁ గూడైనన్, బ్రకటాశుచి యైన శౌచ♦పరివృతుఁ డైనన్
సకలేశు నెవఁడు తలఁచునొ, వికలుషుఁ డతఁ డంతరమున♦వెలుపల నరయన్

క. వనజాక్షునిసంస్మరణము, ఘనభవనగవజ్ర మగుచుఁ ♦ గ్రాలుచు నుండున్
మనుజుం డనిశము దానిని, మనసునఁ దలపోయవలయు ♦ మాటికి భక్తిన్ 240

సీ. శ్రేష్ఠంబునౌ కురు♦క్షేత్రంబుఁగూర్చి నేఁ బోఁగలవాఁడ నా♦భూమి యందు
నివసించుచున్నాఁడ ♦ నిజమని యిటువంటిమాటఁ బల్కినవాఁడు♦ మహితపాప
రహితుండు నౌ గయా♦శ్రాద్ధంబు గోగ్రహ మరణంబు కిడిమి బ్ర♦హ్మంబునందుఁ
బొనరు సుజ్ఞానంబు ♦ పుణ్యకురుక్షేత్రమున నుంట నీనాల్గు♦ముక్తివిధము

ఆ. లనుచు బుధులు పల్కి ♦ రమలతీర్థసరస్వ, తీనదీదృషద్వ♦తీతరంగి
ణులకు నడుమ నెట్టి ♦ నెలవు రాజిల్లునో, దాని మౌనివరులు ♦ ధాత్రియందు

వ. దేవనిర్మితం బగు బ్రహ్మావర్తదేశం బని వక్కాణింతురు మనుజుండు దూరగతుండయ్యును జిత్తమందుఁ గురుక్షేత్రమునకుఁ బోఁగలననియు నట నివసించుచుండెద ననియు భాషించిన నఘరహితుం డగు కురుక్షేత్రసరస్వతీతటవాసునకు బ్రహ్మమయజ్ఞానంబు సంభవింపఁగలదు నిస్సంశయమని మరల నిట్లనిరి.

క సురసిద్ధసాధ్యపన్నగ, గరుడోరగమానినాథ । గంధర్వాదుల్
కురుజాంగలదేశంబును, నిరతము సేవించుచుంద్రు । నిర్మలమతులై. 243

క. మునివరులారా! తత్సే, వనమున బుధుఁ డాత్మయందు । బ్రహ్మంబును వే
డ్కనుఁ గాంచుచుండు నిత్యము, ఘనదుష్కృతరహితుఁ డగుచుఁ । గదలని పూన్కిన్.

వ అస్థిరం బగు మనుష్యశరీరముఁ జెంది మోక్షమునుఁ గోరుమానవులు పాపకర్ములయ్యు నియతాత్ములై నివసించువారు బహుజన్మసంభవదుష్కృతములఁ బాసి పరిశుద్ధులై శాశ్వతుండును హృత్పద్మసంస్థితుండు నగుపరమేశ్వరునిఁ గాంచుచుందురు బ్రహ్మవేది కురుక్షేత్రములను వానిచెంతనుండు పుణ్యసరోవరంబులను సేవించుపూరుషులు పరమపదప్రాప్తు లగుదురు 245

సీ రమ్యనక్షత్రతా । రాగ్రహారాశికిఁ గాలమునఁ గల్గుఁ । గడిమిఁ బతన
భయము కురుక్షేత్ర । భవ్యస్థలంబునఁ జచ్చినవారికి । జగతిఁ బతన
సాధ్వసం బొగి లేదు । సరవి నేస్థలమందు బ్రహ్మాదులును ముని । ప్రవరు లమర
సత్తము ల్గంధర్వ । సాధ్యయక్షాదులు స్నానాభిలాషము । సంతతంబు
తే వెలయ నుందురో నిత్యము । వేడ్క నచటి
కరిగి స్థాణుహ్రదంబున । నధికభక్తి
కలితుఁడై మున్గు మానవ । గణ్యుఁ డాత్మ
కామమునుఁ జెందు నిక్కము । కలదె శంక? 246

తే జనుఁడు నియమంబువలనఁ గా । సారమునకు
మ్రొక్కి పలుమాఱు రంతుక । మునకుఁ గ్రుంకి
భక్తియుక్తుండు నై సర । స్వతినిఁ జేరి
పాపములఁ బాపుమని మ్రొక్కి । వాంఛ మునిఁగి. 247

వ. పుష్పధూపనైవేద్యము లిచ్చి యక్షేంద్రా, నీప్రసాదమువలన నేనీస్థలంబున రాజిల్లు వనకాసారనదీతీర్థంబుల సేవించుటకై చనుచున్నాఁడ ననిశము విఘ్నమొనర్పకు మని నయభయవినయభక్తులతోఁ బ్రార్థించి పలుకనగు 248

చ అని యిటు రోమహర్షణుఁడు । హర్షముతో వచియింప మాను లా
మునిఁ గని పల్కి రత్యధిక । పుణ్యము లౌ నదులేడిటన్మహా
వనముల నేడిటిఁ సకల । పావనతీర్థములం దదీయగా
హానఫలమెల్లఁ జెప్పుము; దయారసమాత్మఁ జెలంగ నియ్యెడన్ 249

ఆ విబుధవర్య! యెట్టి । విధులచే నేతీర్థ, మునకు నెట్టిఫలము । మొనయుచుండు

నట్టికాలము మాకు నతికృప భాషింపు, మనఁగ బల్కె రోమహర్షణుండు

కురుక్షేత్రవనన దీ ప్రశంస.

క మునులారా! కురుక్షేత్రంబున నుండినవనులనావ ములఁ జెప్పెద వా
నిని వినుఁ డవి కిల్బిషనాశనకరములు పుణ్యదములు జగతిఁ గానన్ 251

వ కామ్యకవనంబు, దేవమాతృవనంబు, వ్యాసవనంబు, ఫలకీసూర్యవనంబులు, మధు
వనంబు, పుణ్యశీతవనం బని యి క్కడువనంబు లుండు నవి శ్రేష్ఠంబు లైనవియుఁ
బాపహరంబు లైనవియు నై విలసిల్లుచుండు నదీనామములఁ బలికెద నాలిం
పుఁడు, సరస్వతీ, వైతరణీ, గంగా, లమ్ము, కౌశికీ, దృషద్వతీ, హిరణ్వతీనామం
బుల నేడునదులు కల వవి సుధాజలస్రవంబులుఁ బాపహరంబులుఁ బుణ్యప్రదం
బులై యుండు వానియందు సరస్వతీనది సదా జలప్రవాహయై యొప్పుచుండును
వర్షాకాలమందుఁ బ్రవహించునదియై తక్కననదులు ప్రకాశించుచుండు నాన
దులందలిజలంబు ప్రావృట్కాలము నఁ బుణ్యదం బని చెప్పంబడె నీనదులన్నిఁటికి
నొకశక్తియైనను రజోదోషంబు లే దీనదీవరంబులు తీర్థమాహాత్మ్యమువలనఁ
బుణ్యదాయకములై రాజిల్లుచుండు సంయములారా! పంకహర మగుమహాతీర్థ
గమనస్మరణస్నానఫలంబుల నాలింపుఁడు 252

ఆ కడఁగి మొదట రంతుకంబును గని నరుఁ
డధికబలుఁడు నైన యక్షునకును
జేతు లెత్తి మ్రొక్కి స్థిరమతి యై తీర్థ
యాత్ర మొదలుపెట్ట నగునుఁ బూన్కి 253

తీర్థప్రశంసక్రమము.

సీ. అంకట నిర్మల మైనమనంబున నదితివనంబున కరుగవలయు
నదితిచే నేచోట నాచరింపంబడె బుత్రవాంఛారతి భూరితపము
నలి మీఁద నచ్చట నరుఁడు స్నాన మొనర్చి నిర్జరమాతయై నెగడు నదితిఁ
బూజించి దోషసమూహవర్జితు డైన పుత్రుని శూరునిఁ బొందు భాస

తే మానరవిశతతుల్యవిమానమెక్కి, కాంతితో డుత స్వర్లోకంబులందు
నిచ్చవచ్చినతీరున ముచ్చటలరఁ, జనును జని లేక క్రమ్మఱ సంతసమున.254

చ పరమమునీంద్రులార! వరభక్తినిఁ బిమ్మట దానిమీఁతీ శ్రీ
హరికి సమీపభాగగతల మైనదటం చని వన్నెకెక్క యీ
స్థిరను సుపుణ్యదాయకము శ్రేష్ఠము నా హరివాసభూమికిఁ
నిరుపమదీక్ష నేఁగ నగు నిశ్చయమార్గము నాత్మ నెన్నుచున్ 255

క విమలస్థానజలంబున, సమధికమతి మానవుండు స్నానముఁ జేయ త
ద్విమలేశుఁ గాంచి నాక, ప్రమథాధిపవిష్టపములఁ బరువడి నెందున్. 256

క. పరమేశుని బలరామునిఁ, భూరి నేకాదశినిఁ గాంచు । పురుషుఁడు కలిదు
స్తరపాపజనితదోషో, త్కరరహితుం డగును నిజము । కాశ్యపియందున్ 257

సీ. మునులార! పిమ్మట । మూఁడులోకములందుఁ । బారిప్లవాఖ్యతోఁ బ్రబలుచుండు
నట్టితీర్థమునకు । నరిగి మహాభక్తి నాతీర్థమునఁ గ్రుంకి । యమరనిచయ
కలితుఁడౌ పరమేష్ఠిఁ । గాంచినపురుషుఁడు బ్రహ్మయజ్ఞఫలంబుఁ । బడయు నచట
రాజిల్లుచున్నది । రహిఁ గౌశికీతీర్థసంభవం బైనట్టి । సంగమంబు

ఆ. సరవి దానియందు । స్నాతుఁ డైననరుండు
తిరము నగుచు మిగులఁ । దేజరిల్లు
పరమపదముఁ జేరి । బహుసుఖయుక్తుఁడు నై
వెలయుచుండు నెప్డు । వేడ్కతోడ 258

క. వినుఁ డడవియందుఁ జేసిన, ఘనదోషము లెల్లఁ బోవుఁ । గడువడితోఁ ద
ద్వనగాహనమాత్రుం డగు, మనుజునకు నిజంబుగాను । మహిపైఁ జూడన్ 259

తే. అంత దక్షాశ్రమంబున । కరిగి దక్ష
వాసనాథుఁడు పార్వతీపతియు నైన
భవునిఁ గని సైంధవాధ్వర । ఫలముఁ జెంది
పుణ్యశీలుండు నగుచుండు । భువి నరుండు 260

క. మనుజుం డంతట శాలూ, కినతీర్థముఁ జేరి మునిఁగి । గిరిశాన్వితుఁ డౌ
వనజాక్షుఁ గొలిచి మదివలఁ, చినలోకము నొందు నఘము । చే విరహితుఁ డై.

తే. ఆజ్యదధిసంయుతంబు భ । వ్యంబు నైన, నాగతీర్థవరంబున । నరుఁడు మునిఁగి
భుజగభయవర్జితుండు నై । భూమిమీఁద, సతతమొప్పారుచుండును । సంతసమున.

వ. విప్రేంద్రులార! దాని కవ్వల నరకోద్ధారకం తుకం బను శివవరతీర్థంబు కల దచటికిఁ బోనగు నాతీర్థసుం దొకరేయి మునింగి తత్తీర్థస్థితుఁడును ద్వితీయద్వారపాలకుఁ డగుయక్షునిఁ బూన్కిఁ బూజించి బ్రాహ్మణుల భుజింపఁజేసి మ్రొక్కి యక్షేంద్రా, భవదనుగ్రహమువలన నే నఖిలకిల్బిషవర్జితుండ నైతి నాచే నిపుడే ఫలసిద్ధిఁ గోరఁబడెనా దాని సంసారమందుఁ బొందుగఁ జెందుచున్నాఁడ గటాక్షింపు మని యిట్లు యక్షునిఁ బ్రార్థించి ప్రసన్నుఁ బంచనదంబుఁ గాంచి పోనగు నాస్థలంబునఁ దొల్లి భక్తలోకవశంకరుఁ డగుశంకరుఁడు పెక్కురక్కసులకు వెఱపునుఁ బుట్టించునదుల నైదింటిని నిర్మించె నందుచే నఖిలసమయములం దాతీర్థము పంచనదం బని చెప్పంబడును రుద్రునిచే నచ్చోటఁ గోటితీర్థములు సృష్టింపఁబడె నాచోటు త్రైలోక్యవిఖ్యాత మగుకోటితీర్థ మని పలుకంబడు. దానియందు మనుజుఁడు స్నానము చేసి కోటీశ్వరుఁ డగుగరళకంఠుఁ గాంచి సతతశ్రద్ధాగరిష్ఠుఁ డై పంచయజ్ఞఫలప్రాప్తుం డగు నట నఖిలదేవతలచే వామనదేవుఁడు సుప్రతిష్ఠితుఁ డయ్యె నాతీర్థంబున మునింగినవాఁ డగ్నిష్టోమఫలంబు

సెందు నశ్వినతీర్థమున స్నాతుఁడైన మానవుఁడు శ్రద్ధాసమన్వితుఁడును, జితేంద్రి
యుండును, రూపవంతుండును, భాగ్యవంతుఁడును, యశోవంతుండు నగు
చుండును 253

ఆ. విష్ణురచిత మగుచు | విఖ్యాతిఁ గాంచిన, వరవరాహతీర్థ | వారియందు
నరుఁడు శ్రద్ధతోఁ గనలిఁ గ్రుంకి విమలుఁడై, చనును బరమగతికిఁ | జారుదీప్తి.

ఉ. చందురుఁ డెట్టిచోట మును | సాహస మొప్పఁ దపం బొనర్చి పెం
పొందినరోగము న్విడిచి | మోదముచెందెనొ యట్టిభూమిలో
సుందరుఁడైనచందురుని | శోభనతీర్థము వెల్గు దానికిం
బొందుఁగ నేఁగ నా నరుఁడు | పూర్ణపుభక్తి చెలంగుచుండఁగన్ 255

సీ. ఆశుభతీర్థంబు | నం దోఁగి స్నాతుఁడై సోమేశ్వరునిభక్తి | జూచి రాజ
సూయాధ్వరఫలంబు | సుభగు లెన్నఁగఁ బొంది తెవులును విడనాడి | దీప్తినలరి
దోషవర్జితుఁడు నై | తుహినాంశులోకంబుఁ జేరి చంద్రునిఁ గూడి | చెలువ మమర
లలి నొప్పుచుండు జ్వా | లామాలనాథునిభూతచయేశునిఁ | బూజచేసి

ఆ. పురుషుఁ డవని మరలఁ | బుట్టఁడు వినుఁ డేక హంసతీర్థమందు | నధికభక్తి
మునిఁగినట్టి నరుఁడు | భూమిధేను సహస్రఫలము నొందు మౌని | భవ్యులార!

క. కృతశౌచతీర్థసేవను, హితమతిఁ గావించు నరుఁడు | కృతశౌచుం డా
తతపౌండరీకఫలగుఁడు, సతతానందుండు నగుచు | జగతిఁ జరించున్. 267

ఆ. హరునివాస మగుచు | నలరు ముంజవటంబు
నందు నొక్కరాత్రి | నతులభక్తి
నుపవసించు మనుజుఁ | డుర్వి గాణాపత్య
మతగతుండు నగును | మాన్యులెన్న 268

వ. మౌనీంద్రులారా! ఆక్షేత్రంబునందె మహాభాగయు భువనప్రసిద్ధయు నగు
యక్షిణి కల దాచోటున కరిగి తజ్జలంబునఁ గ్రుంకినఁ బాపహరంబగు నంతట
బుణ్యాకరం బగుకురుక్షేత్రద్వారముఁ జేరి దానికి నమస్కరించి భూసురుల
భుజింపఁ జేయనగు. 269

ఉ. అంతట జామదగ్న్యకృత | హర్షకపుష్కరతీర్థభూతలా
భ్యంతరసీమఁ జేరి కడు | యత్నముతోఁ బితృపూజచేసి య
త్యంతకృతార్థుఁడై పురుషుఁ | డశ్వమఖోరుఫలంబు నొంది తా
మంతువహించువాఁడును స | మంజసభావుఁడు నౌను ధాత్రిపై 270

క. పూనిక నెవఁ డటఁ గన్యా, దానముఁ గార్తికమునందుఁ | దలఁగని ప్రీతిన్
మానుగఁ జేయునొ దేవత,లా నరునకు నిత్తు రాత్మ | నలరినఫలమున్ 271

క. నెతిదానము లేమైనన్, గఱిగొఱిలేకుండఁ జేసి | గన్యలు మెచ్చన్
నెతినెతి పరలోకంబున, గలువతనం బొప్ప నెప్డు | గ్రాలుచునుండున్ 272

సీ. అనిశ మచ్చట మహాయతుఁడౌ కపిలుండు ద్వారపాలకుఁడునై స్వయముగాను
వెలయుచు దుష్కృతవిఘ్నంబుఁ గావించి దుర్గతినెడఁబాపి తొలఁగించి
మెలయునులూఖలమేఖల యనుమహాయక్షిణిభార్య యైయతని గొప్ప
నది దుందుభినిఁగొట్టి యనిశముఁ దిరుగాడు చుండిపుత్రత్రయైయొనరు పాప
ఆ. విషయజనిత దైన వెలఁది నొక్కతెఁ, జోడఁ, గాంచి కినలి ఘోరగడిమిఁ గొట్టి
పలికె భామ! నీవు వస్తుపుత్రేప్సితా, న్వితవు నైనయొసల వినుము పేర్మి 273
ఆ. భూతవేశ్మమందుఁ బోరిఁ గ్రుంకి యచ్యుత
స్థానమున వసించి దధిని శకట
కూబరమునఁ గుడిచి కుడివెట్ట కిటనుండు
మనుచుఁ నీకుఁ బగటి యందు నేను 274
క. పలికితి నీ వారీతిగా, మలయుము కాదనుచు రాత్రి మదలితివేనిన్
గొలయగ జేసెద నిక్కము, కలికిరో యని నుడువ నాపెకంపించి వెసన్ 275
మ. కరమా యక్షిణిఁ జూచి మ్రొక్కి వినుతుల్ గావించి యోదేవి నన్
గరుణం జూడుము కోప మేలను మహాకౌతూహలం బొప్పఁ ద
త్పరనై యీయెడఁ బ్రోవు మీవనుచు వేడ్కాంక్షించి దీనోక్తకై
వరభక్తి న్వినుతింప యక్షిణి దయన్ భాషించె నాబోటితోన్ 276
క. మానిని యల్పంబైనను, భానుగ్రహణంబు కలిగి భాసిల్లుతఱిన్
మానుగ సరస్వతీస, మ్మానితజలమందు గ్రుంకి మలరహితవు నై 277
ఆ. సకల సిద్ధసాధ్య చారణగంధర్వ, రాజిరాజితంబు రమ్యభోగ
వాసమైన నాకభాసురలోకంబుఁ, జేరఁగల వటంచుఁ జెప్పి చనియె 278

పరశురామతీర్థమహిమ

క. అని యిట్లు రోమహర్షణ, మునివర్యుం డాడి మౌని ముఖ్యులతోఁ గ్ర
న్ననఁ బల్కెఁ దగ్ధవరమహి, మను భక్తిచెలంగ నపుడు మహితోత్సుకుఁడై
క. ఘనభక్తిని రామహ్రద, మున కెలమిన్ బోవ నగును మునుపటఁ దేజో
వినుతుఁడు జమదగ్ని మహా, మునిసుతుఁడౌ రాముఁ డవని పులఁబటి వెసన్.
చ. తనువులఁ జీల్చి తద్రుధిరధారలతోడఁ బ్రపూరితంబులై
మొనయు హ్రదంబులైదిటిని బొందుగ నందొనరించె నంచు నే
వినితిని నాఘనుండు పితృబృందము నాదృతి మీఱ దీక్షతోఁ
దనియఁగఁ జేయ వారలిముదంబును జెందినమానసంబులన్ 281
ఉ. రామునిఁ జూచి పల్కిరి పరాజితభార్గవరామ! సన్మహా
ధామ! జనాభిరామ! గుణధామ! జగన్నుతనామ! రామ నీ
భీమపరాక్రమస్థితికి ప్రేమకు భక్తికి సారెసారెకున్
మేము విశేషమోదమున మించినవారము నైతి మీయెడన్. 282

ఉ. భూరియశోభిరామ! మదిఁ బొంగుచు నెట్టివరంబు నిత్తుఁ గో
రెదొ దానిఁ గైకొనుము కూడు శుభంబు ధరిత్రి నీకు సొం
పారఁగ నంచు వారిటులఁ బల్కఁ లసత్పితృభావభవ్యుఁడు న్మహో
దారుఁడు నైన రాముఁడు ముఖంబు నిజాత్మనుఁ బెంపునొందఁగన్. 283

క. వినువీథియందు నుండెడి, తనపితరులతోడఁ బల్కెఁ దద్దయు భక్తిన్
ఘనులార! మీరు తృప్తిన్, బొనరినవారైతిరేని బుధు లగ్గింపన్ 284

సీ. కూరిమి నీకోర్కె కొనసాఁగఁ జేయుఁడు భవదనుగ్రహమున వఱలి మరలఁ
బటుతపస్సిద్ధినిఁ బడయఁగోరెద రోషభూతుఁడ నైన నాచేత గాత్ర
ముత్పాదితంబు నై యొప్పారె నందుచే భవ్యయుష్మత్పితృభావమునఁ బాప
రహితుఁడ నై నేను గాంచింప నగు నీహ్రదంబులు తీర్థభూతంబు లగుచుఁ

ఆ. బుడమి వన్నెకెక్కి పొలుపారఁగల నని, రాముఁ డాడినట్టి రమ్యశుభద
భాషణముల శ్రోత్రపాత్రంబుగా విని, పితరు లతని కనిరి ప్రీతు లగుచు.

క. అనఘా! పితృవర్గముపైఁ, దనరిన సద్భక్తివలనఁ దద్దయు మెచ్చన్
ఘనమైన దగుచు నీతప, మనయము సొంపారుచుండు నవనీస్థలిపై. 286

ఆ. తనయ! కోపశాపతప్తుండ వై నన్, చేత దేనివలనఁ జెనకె క్షత్ర
మొగిని భూరిశోణితోత్పాదితం బయ్యె, దానఁ బాపముక్తి తనరు నీకు 287

క. ఆరాజులు గర్వితులై, ఘోరాజినిఁ గూలి రాత్మ గురుకర్మములన్
ధారుణి నీహ్రదములు పెం, పారం గల విప్ర పాపహరతీర్థములై 288

ఆ. సంశయంబు లేదు చాలవెలుంగు నీ, మడుఁగులఁ దేవుండు మహితభక్తి
వెలయఁ గ్రుంకి తనదు పితరులకును దృప్తిఁ, గలుఁగఁ జేయఁగలఁడు గాఢభక్తి.

చ. అనిశము వానికిం బితరు లాత్మఁ బెంపగుఫలంబు సర్వశో
భనకరసుస్థిరామరనివాసముఁ జేర్మి నొసంగ నేర్తు రి
ట్లని ద్విజవర్య లాతనికి నాయెడఁ గోరినకోర్కె లిచ్చి పెం
పున వినుతించి మాయ మయిపోయిరి తాపసులార! యత్తతిన్. 290

క. ఇటు లీరామహ్రదములు, పటుపుణ్యకరంబు లగుచు భాసిల్లె ధరన్
వటుఁడు శుచివ్రతుఁడై యా, పటుపుణ్యహ్రదములందు భక్తి చెలంగన్.

తే. స్నాతుఁడై రాముఁ బూజించి చాలమేటి, పసిఁడిఁ జెందును సంయతవ్రతుఁడు తీర్థ
సేవి యైనట్టిపురుషుండు శిష్టవంశ, మూల మనుతీర్థరాజంబుఁ బొంది ప్రీతి

క. మునిఁగి సమూలనిజాన్వయ, మును సతతం బుద్ధరించుఁ బోరి సత్కీర్తిన్
గనఁగా యశోవనాఖ్యనుఁ, బొనరెడుతీర్థంబుఁ జేరి పురుషుం డందున్ 293

ఆ. మునిఁగి గాత్రశుద్ధిఁ బొంది వినిర్మల, కాయుఁ డగుచు మగలఁ గాశ్యపికినిఁ
జేరకుండునట్టి చిరపుణ్యలోకంబు, నందు వెలయుచుండు ననఘులార! 294

సీ. తీర్థతత్పరులునై । దీపించుసిద్ధులు తీర్థంబులం దోఁగి । తిరిగి యిచట
సోంపారుతత్కాయ।శోధనతీర్థంబుఁ జేరక వారెంత।సేపు దనుక
నుందురో యందాక । నురుభక్తిసంయుత మగునాత్మఁ దత్తీర్థమందుఁ గాయ
మును ముంచి క్రమ్మఱఁ । బుడమికి రానట్టి పరమపదస్థితిఁ । బడయుచుండు
నంతటఁ బ్రభవిష్ణుఁ । డైనవిష్ణునిచేత నెట సర్వలోకంబు । లెలమినుద్ధ్ర
తే. తంబు లయ్యెనో యచ్చోటఁ । దనరి మూఁడు,
భువనములలోన విఖ్యాతిఁ । బొంగినట్టి
విష్ణుపోద్ధారతీర్థంబు । వేడ్కఁ జేర
వలయు మునిచంద్రులార! స।ద్భక్తిగదుర. 295

మ. హరి నామస్మరణాత్తమా మనసుతో । నాతీర్థవర్యంబునన్
బురుషశ్రేష్ఠుఁడు క్రుంకి శాశ్వతుఁడునై । పొల్పారు మానాథశం
కరులన్ గూర్చి నమస్కరించి వినుతు । ల్గావించి నిష్కర్ముఁడై
సుర లగ్గింపఁగ ముక్తిఁ బొందును లస।చ్చోభోన్నతిన్నిత్యమున్. 296

శా. శ్రీలక్ష్మీపతిచెంతఁ జేర్పువదై యి । చ్చెన్నారి భవ్యంబునౌ
సాలగ్రామసమాఖ్యతీర్థమునకున్ । సచ్ఛీలుఁడై మానవుం
డోలిన్ జేరఁగనో తదీయజలమం । దుత్సాహియై క్రుంకి పా
పాలిం బోవిడనాడి ముక్తికరదీ।వ్యల్లోకగుండౌ ధరన్ 297

చ. అనిశము లోకవిశ్రుతము।నై కపిలహ్రదనామయుక్తమై
తనరినతీర్థము న్మనుజ।తల్లజుఁ డంతటఁ జేరి దానిలో
మునిఁగి పవిత్రులైనపితృ।పుంగవులన్ ద్రిదశేశమానులన్
దనిపి సహస్రగోఫలముఁ । దద్దయు నొందును నిశ్చయంబుగన్. 298

మ. వరగాత్రాశ్రితుఁడై మహావిబుధుఁడై । వాగీశముఖ్యామరో
త్కరసంసేవితుఁడై జగచ్ఛివదుఁడై । తద్భూమిసంవాసుఁడై
వరదుండై తనరారుచున్నకపిలున్ । బాగొప్పదర్శించి దు
స్తరపాపంబులఁ బాసి ముక్తినిఁ గనున్ । జారుప్రభోత్కర్షతోన్ 299

సీ. భానుతీర్థమునకు । భక్తితోఁ జని క్రుంకి మనుజుఁడు నియమిత।మానసమున
నశనవర్జితుఁడునై । యలరుచు దేవతాపితృవర్గమునకును।వితతతుష్టిఁ
గావించి దశశత।కరదేవుఁడును జగత్త్రయవిశ్రుతుండు నౌ । తరణిఁ జూచి
పురుషుఁ డగ్నిష్టోమ।పూర్ణఫలుండునై విమలమిత్రభువంబుఁ । గాంచి జ్ఞాన
తే. కలితుఁడై ముక్తిఁ జెందునుఁ । గ్రమముతోడఁ
దీర్థసేవాభిలాషతోఁ । దివురువాఁడు
పోరి భవానీవనిం జేరి । భూరిభక్తి
నచట నభిషేక మొనరించి । వార్ష మొదవ 300

క. గోకోటిదానఫలమునుఁ, బ్రాకటముగఁ బొంది కీర్తి భాసిల్లి తపో
లోకమున కేఁగి సుఖియై, వీఁక న్వర్తించుచుండు విస్తృతదీప్తిన్ 301

ఆ. ధాత సుధనుఁ దొల్లి త్రావి త్రేల్పఁగ దాని
వలన సురభి కలిగి బలిభువంబు
నాశ్రయించి యచట నలరారుచుండఁ ద
త్కామధేనువునకుఁ గాంచి నిగుడ 302

తే. తల్లులై లోకమాతలై ధర్మరూప, కలితలైనట్టి సురభులు కడిమిఁబుట్టె
వానిచేఁ దత్సమస్తంబు వ్యాప్తమయ్యె, సందు లేకుండ మునికులచంద్రులార!

క. సవకరుఁడైన విరించికి, నవిదతృణగోలకుగాను దాహృతములు నై
తివిరి విగ్గి పిలువఁ గ్రన్నన, వివరంబును వెడలివచ్చి వెలిఁ దిరుగాడున్. 304

క. ఆరంధ్రద్వారంబున, వారుణవదనుండు భక్తవత్సలతను వి
స్తారకృపాసాగరుఁ డౌ, హేరంబుఁడు స్వేచ్ఛమీఱ హితమతి నుండున్ 305

క. నరుఁ డాగణపతిఁ గని దు, ర్భరదారుణపాపసంఘపరివృతుఁ డగుచున్
బరఁగి జితవిషయుఁడై సు, స్థిరలోకమహావిభూతిఁ జెంది సుఖించున్ 306

ఉ. ముక్తికరంబునై వెలసి పొల్పలరెడి సంగినిన్ మహా
సక్తినిఁ జేరి తద్విమలచారుజలోత్కరతీర్థమందు స
ద్భక్తినిఁ గ్రుంకి శ్రీతనయపాత్ర సమస్తసుభోగపేటికా
యుక్తుఁడునై జనుం డధికయోగ్యుఁడునై కను ముక్తివాసమున్ 307

క. బ్రహ్మావర్తోదమునం, బ్రహ్మార్పణ మనుచు నరుఁడు భక్తి న్మునుఁగన్
బ్రహ్మజ్ఞానియునై స, ద్బ్రహ్మంబునుఁ గాంచుఁ గాంతుఁ బ్రాణచ్యుతుఁడై 308

ఆ. విప్రులార! పిదప విపులసరస్వతి, ద్వారపాల మగుచు వన్నెకెక్కు
నట్టిరంతుకమున కరుగనౌనట మహా, యతినాథుతీర్థ మమరు నెలమి 309

శా. ఆతీర్థంబునఁ గ్రుంకి బంధురనిరాహారుండునై జ్ఞానముం
జేతఃప్రీతిఁగ నొంది నిర్మలుఁడునై చెల్వొందుచున్ యక్షసం
ఘాతాధీశుమహాప్రసాదమునఁ బంకవ్రాతముం బాసి వి
ఖ్యాతిం గామితకార్యసిద్ధిఁ బడయుం గళ్యాణ మేపారఁగన్ 310

సీ. అంతటమునినుతమైన బ్రహ్మావర్తమునకుఁ బోనగునట్టి ముఖ్యతీర్థ
జలమందు జలకంబు సల్పి మర్త్యుఁడు పరబ్రహ్మంబుఁ జెందునుఁ బాలి నంత
మిగుల శ్రేష్ఠంబునై మించుసు తీర్థకమునుఁ గార్పి పోనగుఁ బురుషుఁ డందు
నిత్యముఁ బితరులు నిఖిలామరులఁగూడి వర్తించుచుందురు వాంఛతోడ

ఆ. నచటఁ బైతృదైవతార్చనయుం దలి, హర్ష మొప్ప నిర్మలాభిషేక
మును నొనర్చెనేని పారిశాశ్వతాశ్వమేధంబు నొంది పైతృతలినిఁ దనుపు

క. క్రమ్మఱ మనుజుఁ డవంతికి, సమ్మతితోఁ బోయి మిగుల శ్రద్ధాన్వితుఁ డై
పమ్మిన కామేశ్వరతీ, ర్థమ్మున సుస్నాతుఁ డగుచుఁ దగువగు రీతిన్ 312

చ. సమధికరోగముక్తుఁ డయి చయ్యన బ్రహ్మము నొందు మాతృతీ
ర్థమున సుభక్తితో మునిఁగి రస్యతనూజుల నిత్యలక్ష్మినిన్
విమలపదోన్నతిన్ గనును వేడ్క నరుండు నిజమ్ము పుణ్యస
త్తము లరు దందుచుండ ఘనతాపసనాయకులార! యారయన్ 313

క. అంతట నియతాశనుఁ డై, సంతతనియమంబుతోడ జనుఁ డురుదీక్షా
వంతుం డై సీతావన, సంతర్పణభూమిఁ జేర జనునా భక్తిన్. 314

క. సచ్చరితులార! వినుఁడీ, హెచ్చగు మోదంబు మిగుల హితమతు లై యా
చ్చోట నుండుతీర్థం, బెచ్చోటను లేదు చూడఁ బృథ్వీస్థలిపై 315

క. జనుఁ డట్టి తీర్థదర్శనమున నిరువదియొక్క తరములఁ బొందినజనులన్
దనిపినవాఁ డై కీర్తినిఁ, గను నిజముగ ధాత్రియందుఁ ఘనులు నుతింపన్.

క. మనుజుం డొకతఱిఁ గేశము,లను దానందదుపకెట్టు లావగు దురితం
బును బాసి పూతుఁ డగునా, పని తప్పక చేయవలయు భావింపంగన్ 317

క. శ్వావిలోమాపహమని యా, ఋషివిపైఁ బ్రఖ్యాతితోడఁ బొదలెడితీర్థం
బవగీర్ణ మగుచు శ్వావిజమ్మృగ, నివహంబులవలన నెపుడు నెగడుచు నుండున్.

తే. భూమిసురులార ! సంతతపుణ్యకరము
నై ప్రకాశించు తత్తీర్థ మందుఁ బ్రాణ
ముల నిరోధించి నిజరోమములను ద్విజులు
పెఱికి పూతాత్ము లై కాంతు విమలగతిని 319

సీ. మునులార ! యచ్చోట ముజ్జగంబులవన్నె నలరిన దైవదశాశ్వమేధి
కం బను తీర్థంబు కలదు దానిజలంబునందు సద్భక్తినిఁ జెంది మనుజ
వరుఁడు మునింగి తత్ఫలఁగుఁ డై చెలువొందు నంత జగత్త్రయమందు వాసిఁ
దివిరెడి మానుషతీర్థంబునకు నేఁగ నగును శ్రద్ధాయుక్తుఁ డగుచు దాని

ఆ. దర్శనంబువలన దద్దయుఁ గిల్బిష, వితతిచేతఁ దాను విడువఁబడిన
వాఁడు నగునుఁ దత్ప్రభావంబు వినిపింతు,వినుఁడు వేడ్కతోడ వీనులలర.

## మానుష తీర్థప్రభావము.

ఆ. వివిధలుబ్ధకాస్త్ర వితతితోఁ గృష్ణమృ,గంబు లార్తిఁ జెంది గణ్యమగుచు
రూఢినుండు నాసరోవరంబునఁ గ్రుంకి, భూమిసురులు నగుచుఁ బొనరుచుండ

క. సకలకిరాతులు తద్ద్విజ, నికరంబుల నడిగి రంత నిజశరములచేఁ
గళవికలై మృగగణములు, చకితస్థితి నెచటి కరిగె సంయములారా. 322

చ. వడఁగొని తన్మృగావళులు వచ్చి కొలంకును జేరి నీటిలోఁ
బడి వెడ మున్గనేమొ చెడి వానిగతి న్వివరించి సత్కృపన్

వడి నుడువఁగ దగుఁగ గడిమి బాడబులార! యటన్న వార లా
చెదుఁగులఁ జూచి యిట్లనిరి చిత్తము ల త్తఱి సత్తు నొందఁగన్ 323

ఆ. మేటిబోయలార! మే మామృగములము, రమ్యమైన మీసరస్సునందు
మునిఁగి తత్ప్రభావమున మానుషత్వంబు,నందినట్టి వార మైతి మవని 324

క. ఆకారణమున మీ రిపు,డీకాసారంబునందుఁ బృథుమానసముం
గైకొని క్రుంకి విమత్సర,ధీకలితులు నై విశేషదీప్తి న్మతియున్. 325

ఆ పాపముక్తు లగుచు భాసిల్లఁగలరన, నంత దానియందు నాకిరాతు
లపుడు మునిఁగి నిర్మలాత్ములై నాకలో,కమున కరిగి రతుల కౌతుకమున

క మౌనీంద్రులార! యివ్విధ, మానుషతీర్థప్రభావమానితగాథఁ
మానుగ విందురొ మోక్ష,స్థానంబున కేగి వారు తము నుందురొగిన్. 326

వ ఇట్లు రోమహర్షణుండు మానుషతీర్థప్రభావంబు వక్కాణించిన విని మునులు సంతసించి మునీంద్రా! కురుక్షేత్ర విలసితశేషతీర్థమహిమముల భాషింపు మనుటయు. 327

కుసుమవిచిత్రవృత్తము:—

కరిపతిపాలా కర్బురచేలా, పరజనక్షేమా భవహరనామా
పరశివధామా భవనుతనామా, శరధిగభీరా చతురవిహారా! 328

క పరమేశ్వర కరుణాకర, గురుడోరగసిద్ధసాధ్యగంధర్వమునీ
శ్వరనుతసుందరమందిర, శరణాగతపాల రామ చంద్రనృపాలా! 329

ద్రుతవిలంబితము హరవిరించి సురాధికభావనా, ధరణిపాలన దానవనాశనా!
మురనిశాచర పుంగవశోషణా, సురవిభాషణ సుందరభూషణా! 330

గద్య ఇది శ్రీరామకృపాసమాసాదితకవితాప్రాభవ హారితసకులాన్వయప్రభవ రమవర్షులవంశదుగ్ధసాగరసుధాకర కొండయకుమార బుధజనవిధేయ కొండయనామధేయప్రణీతమగు తెలుఁగు వామనపురాణమందుఁ జతుర్థస్కంధము.

---

శ్రీరస్తు

శ్రీసీతాలక్ష్మణ భరత శత్రుఘ్న హనుమత్సమేత శ్రీరామచంద్రాయ నమః

# తెలుఁగు వామనపురాణము

## పంచమస్కంధము



శ్రీసీతావ్యాప్తోత్కమల
భాసురతామసదివ్యభాస్కరసంకాశ
వాస మహోన్నత శివకర
దాసావనతీవ్రకామ దశరథరామా! 1

రోమహర్షణుఁడు మునులకు కురుక్షేత్రతీర్థ మహిమఁ జెప్పుట

క. విన నాను నారదునితో, ఘనుఁడైన పులస్త్యమౌని కమనీయగతిన్
వినిపించినట్లు మునులకు, ననితరమతిఁ బల్కె రోమహర్షణుఁ డెలమిన్ 2

సీ. ద్విజులార! మానుషతీర్థంబునకు ముందు నాపగా నామవిఖ్యాతితోడ
వెలసి బ్రాహ్మణసమేతవిత యైన నది కౌసుదవ్వనదీక్షితోఁ దనరు నచట
నాజ్యపరిప్లుతమై క్షీరసిద్ధమహా శ్యామాకధాన్యంబు సరవి సగ్ర
జన్ముల కెవ్వరు సంప్రీతి నిత్తురో పాపంబు లేదట్టివారి కెప్డు
తే. డాపగా నదిఁ బొందియం దతులభక్తిఁ
జెలఁగి యెవ్వరు శ్రాద్ధంబు చేయఁగలరొ
వార లాత్మమనోరథ ఫలసమేతు
లై ప్రకాశింపఁగలరు సత్యమ్ము ధాత్రి 3

క. వినుఁ డాపురుషుని పితరులు, మనమందుఁ దలంచుచుంద్రు మహి మద్వంశం
బునఁ బుత్త్రుఁడో పౌత్త్రుండో, జనియింపంగలఁ డటంచు సంయములారా! 4

మ. విదితశ్రద్ధఁ జెలంగ నేజనులు సద్వ్రతంబుతో నాపగా
నదికిన్ బోయి తిలోదకంబుల సమున్నానదేయకీలాలమం
దుఁ దమిన్ బ్రీతులఁ గానుఁ జేయుదురొ దోడ్తో దానితో మేము తృ
ప్తిఁ దగన్ జెందెద మాత్మవంశశతవృద్ధిన్ గోరుచు న్నిత్యమున్ 5

చ. మనుజవరుండు భాద్రపదమాసమునన్ దసితాఖ్య పక్షమం
దెనయుచతుర్దశీతిథినిఁ దృప్తుఁడునై యపరాహ్ణసంజ్ఞమై

గనఁబడు వేళఁ బిండములఁ గ్రన్నన నిచ్చినవాఁడు కిల్బిషం
బును నెడఁబాసి మోక్షమునుఁ బొందునుఁ దాపసులార! యింతయున్ 6

క. బ్రహ్మోదుంబర మనుచుం, బ్రహ్మజ్ఞులచేత నెన్నఁబడి ముఖ్యంబౌ
బ్రహ్మస్థానమునకుఁ దా, బ్రహ్మజ్ఞుం డరుగవలయు భక్తి దలిర్పన్ 7

తే. అచటఁ బ్రహ్మర్షికుండంబు లమరుచుండు
వానిజలమందుఁ గ్రుంకిన మానవునకు
సోమఫలము లభించును సుభగ! సప్త
పరమముని సుప్రసాదంబు వలన మిగుల 8

వ. మునీంద్రులార! దానివిచారంబు నుడివెద సావధానచిత్తులై వినుఁడు 9

సీ. గౌతమ జమదగ్ని గాధిపుత్త్ర వసిష్ఠ కశ్యపాత్త్రిమునీంద్ర ఘనులు భవ్యుఁ
డైనభరద్వాజ మౌనీంద్రుఁ డీయేడు రనోన్యముగఁ జేరి యచటనట్టి
విపులకుండంబుఁ గావించిరి దానికి సరియైనకుండంబు జగతిలేదు
మునిసేవితమ్మునై మొనయుకతమ్మున రహిని బ్రహ్మోదుంబరం బటంచుఁ

ఆ. బలుకఁబడెను దీర్ఘవర్యమౌ తత్తీర్థ, మందు మునిఁగి నరుఁడు వ్యక్తజన్మ
రహితుఁ డైననలువ రమ్యలోకము చెందు, నింత దీనియందు జేయఁదగదు

శా. ఆరమ్యస్థలమందుఁ జైత్రగణత్రై హ్యార్థుఁడై యెవ్వఁ డిం
పార భాసురుఁ దృప్తిఁ జేయఁ గలఁడో బాగొప్ప సంప్రీతులై
కారుణ్యంబునఁ దత్పితృప్రగులు వేడ్క న్వానికి న్నిత్యవి
స్తారాభీష్టము నీయఁగాఁ గలరు నిశ్శంకాత్ములై యెప్పుడున్ 11

తే. జనుఁడు సప్తర్షులనుఁ బూర్చి చాలభక్తి, చెలఁగి వేర్వేఱ స్నానంబు చేసెనేని
తత్ప్రసాదంబువలన సత్యంబుగాను, సప్తలోకేశ్వరుండగు సరవి నచట 12

సీ. విగతకిల్మషులార! వృద్ధకేదారసంజ్ఞితుఁ డైనదేవుండు చెలఁగు వేడ్క
నతిదీప్తిసహ్యయముగా నలరు నాస్థలమందు నఖిలపాతకభగ్న మైనదగుచుఁ
గపిలాఖ్యతీర్థంబు గ్రాలువిశ్రుతమునై తత్తీర్థమందు సద్భక్తిఁ గ్రుంకి
మనుజుఁడు దండిసమన్వితుఁడౌ రుద్రు నర్చించి మరుగుపాటమరఁబోయి

తే. వలిమలల్లునిలోకంబుఁ బడసి మెఱయు
నట మనుష్యుండు స్నాతుఁడై యధికభక్తి
తర్పణమునేసి చౌలకత్రయముఁ ద్రావి
భవునకుని మ్రొక్కి కేదారఫలము నొందు. 13

ఆ. భక్తి చైత్రశుక్లపక్షచతుర్దశీ, వాసరముననచట భవుని గూర్చి
మోద మొప్ప శ్రాద్ధమునుఁ బెట్టుమనుజుఁడు, పరమగతికి నేగుపాళి నగడు.

క. భద్రయు దుర్గయు భవ్యయు, నిద్రయు మాయయు సనాతనియు నాయాశ్రీ
రుద్రాణిదీప్తతో నే, భద్రస్థలమందుఁ గలదో భావం బలరన్. 15

తే. అట్టి కాలాస్యతీర్థంబు। నందు నరుఁడు, మునిఁగి తత్తీరమందునఁ । బొదలుదుర్గఁ
గాంచి దుర్గమసంసార। గహన మెల్లఁ, దాఁటి ముక్తిని జెందును । మేటదీప్తి

ఉ. అంతఁ ద్రిలోకవిశ్రుతము । నాసరకం బనుతీర్థముఁ గనన్
సంతసమొప్ప నేఁగ నగు। సంతతదుర్లభ మైనదానియం
దంతము లేనిభక్తి నరుఁ । డాదటఁ గృష్ణచతుర్దశీతిథిన్
గంతువిరోధిఁ గాంచి కఱ। కంఠుపదంబును జెందుఁ గాంతితోన్ 17

ఆ. మూఁడుకోట్లతీర్థ।ములు సరకం బందు, రూఢి నుండునట్టి । రుద్రకోటి
దానినడుమ మిగులఁ । దనరుకూపంబున, నలరునట్టి సరసి। యందు జనుఁడు 18

ఉ. శంకరకోటినిం దలఁచి । స్నాతుఁడునై శివకోటిపూజని
శ్శంకనుఁ జేసి రుద్రులప్ర।సాదమునన్ గతసర్వదోషుఁడై
పొంకముతోడ నైంద్రవర।పుణ్యవిమానము నెక్కి దీప్తితో
సంకలితుండు నై భవుని । చారుపదోన్నతి నొందు నెంతయున్ 19

తే. పురుషుఁ డెక్కడ దర్శన।మున విముక్తి
నందునో తత్స్థలం బందు । నఘహరంబు
నా యిడాస్పదతీర్థ మొ।ప్పారు దాని
యందు సుస్నాతుఁ డగుచు న।త్యంతభక్తి 20

క. దేవర్లఁ బితరులన్ గురు, భావంబునఁ బూజచేసి । పటుదుర్గతినిన్
బోవిడిచి చిత్తచింతిత, పావనఫల మెల్లఁ [illegible]ందు । భాసురలీలన్. 21

క. సకలాఘనాశకరమౌ, ప్రకటితకేదారతీర్థ।వరమందు నరుం
డకలంకమతిని మునిఁగియు, సకలప్రదదానఫలము । సరవిన్ జెందున్ 22

ఆ. అచటదుర్లభంబు । నగునట్టికింరూప, తీర్థ మొకటి కలదు । తివిరి దాని
యందు భక్తిమునిఁగి।నట్టి పూరుషుఁ డఖి, లాధ్వరములఫలము।నందు నిజము

భువనవిశ్రుతతీర్థప్రభావము

సీ. మునులార! సరకాఖ్య।పుణ్యతీర్థమునకు ముందఱ నందమై । భువనవిశ్రు
తం బనుతీర్థంబు । తనరు రూఢిఁగ దానిభవమఖిలాఘుని । వారణంబు
నై భువియందు వి।ఖ్యాతమౌ నట నారసింహాకృతినిఁ బూని । చేవ నలరు
రక్కసుఁ గూల్చి తి।ర్యగ్యోనిసంస్థితుఁ డై హరి హరిభామ।లందు భూరి

ఆ. రతినిఁ జెందియుండ । రహి నంతగంధర్వ
సహితు లగుచు దేవ । చయములోలి
వరదుఁ డైనహరుని । వావిరి నర్చించి
ప్రణుతకాయు లగుచుఁ । బలికి రపుడు 24

క. దేవా! నరహరివై హరి, భావం బలరార సింహ।భామాగణసం
భావితరతిచిత్తంబున, వావిరివర్తించు చున్న। వాఁ డతిలీలన్ 25

చ. అని యిటు లాతఁడె న్విబుధులాడ మహాత్ముఁడు నైనశంకరుం
డనితరశక్తితోడ శరభాకృతిఁ బూని మృగేంద్రరూపమున్
దనరెడిమాధవుం గని దారుణయుద్ధము వేయి మేటిహా
యనములదాఁకఁ జేసెఁ బటుయత్నము పెంపెసలారుచుండఁగన్ 26

ఉ. తాపసులార! కయ్యమును దర్పముతో నలిరేఁగిచేయు శ్రీ
వాసపురారు లంతట విభాసితతద్ధ్రిదమధ్యపాతులై
వేఁటపాటుతో జనిరి వేగమె తత్తటమందు వేదవి
వ్యాసుఁడు మౌనిపుంగవుఁడు నా కలహాశనుఁ డుండి పొంగుచున్. 27

ఆ. రావిచెట్టు మొదట రహినుండి తద్ధ్యాన
కలితుఁ డగుచు నాల్గు కరము లొప్ప
హరిని లింగరూపుఁ డైయున్న శంభునిఁ
గాంచి పొగడఁదొడఁగెఁ గాఢభక్తి 28

సీ. దేవు డౌ నారునకు వ్యప్రణామంబు ప్రభవిష్ణుఁడై లీలఁ బరిఢవిల్లు
వాసుదేవున కభివందనం బంబికాధవునకు జోహారు ధర్మకాల
భరతస్థితుం డగు పద్మదళేక్షణునకు జోత నిత్యుఁడు నాథనాథుఁ
డును వరబహురూపుఁ డును దేవదేవుఁ డౌ హరునకు మ్రొక్కు విశ్వాత్ముఁడైన

తే. హరికిఁ జేమోడ్పు సంసిద్ధుఁ డైనపార్వ
తీశునకుఁ జేజె విజ్ఞాన హేతుభూతుఁ
డగుచు సర్వంబు వ్యాపించునట్టి కృష్ణ
దేవునికి మ్రొక్కు నిక్కము భావ మలర. 29

మ. పురుషశ్రేష్ఠులు నైన మిమ్ముఁ గని నేఁ బుణ్యుండనై ధన్యతన్
గరమొప్పారితి నస్మదాశ్రమము కల్యాణంబు నయ్యెన్ భవ
త్కరుణన్ శుద్ధమునై సుపుణ్యకృతమై తత్క్షేత్ర నాజన్మ మీ
తరుణం బందును దీని సవ్వల జగత్ఖ్యాతవ్యవస్థితిన్ జూడఁగన్ 30

ఆ. ఇటకు నెవఁడు వచ్చి హితబుద్ధియై క్రుంకి
పాపనాత్ముఁ డగుచు భక్తిఁ జైత్ర
గణముఁ దృప్తిచేయఁ గలుగునో కాఁగల
దింద్రబుద్ధి వాని కిహమునందు 31

చ. చలదళవృక్షమూలమున సంతతమేనువసించుచుండు ని
శ్చలమతి దాని కేనగుఁడు సన్నుతి మిన్నుఁగఁ జేసి కట్టిన
చ్చలికిని గట్టువిల్తునకు శ్రేష్ఠఁపుభక్తిని మ్రొక్కఁగల్గునో
సలలితదీప్తితో నతఁడు సత్యపదంబున కేఁగు నారయన్ . 32

క. ఘనుఁ డైననారదుం డిటు, లనె నని భాషించి రోమహర్షణుఁ డెలమిన్

మునులను గన్గొని పలికెను, దనమది సంతోషవార్ధి । తద్దయు మునుఁగన్. 33

వ. విప్రేంద్రులార! పిదప నుత్తమనాగహ్రదమున కరుగవలయు నచ్చటఁ దత్పుం
డరీకజలమందు స్నాతుండై యాగఫలంబు నొందు నాతీర్థంబునఁ జైత్రశుక్ల
దశమీవాసరంబునందుఁ జేసినస్నానపానజపశ్రాద్ధంబులు ముక్తిమార్గదంబులై
వెలయు, నచ్చోటునను నిర్జరసేవితమగు త్రివిష్టపతీర్థంబు పాపనాశనియుఁ
గలవు వాని నీటఁ గ్రుంకి శూలపాణియు వృషభకేతనుఁ డగుశంకరుని శంక
లేక పూజించినమనుజుఁడు పాపరహితుఁడు నిర్మలాంతరంగుఁడై పరమగతి
నొందు, నంత నుత్తమ మగురసపావనతీర్థంబుఁ జేరు బొప్పు దానియందు భక్తి
యుతుండై మునిఁగినవాఁడు భవ్యసిద్ధిఁబడయు నాస్థలమందె రాజిల్లునట్టి లేపర
హితతీర్థమందుఁ జైత్రశుక్లచతుర్దశీవాసరంబునఁ గ్రుంకి యటనుండు పరశివుఁ
బూజించినవానికిఁ బాపలేశమైన నుండదు 34

సీ. గంధర్వసహితులై । క్రాలెడియప్సరులు సాధ్యులు సురలు । సరవి వేయి
మేటివర్షంబులు । మించునట్లుగ గొప్పతప మెటఁ జేసిరో । తాల్మి నట్టి
ఫలకీవనంబున । కిలమిఁ బోనగువరుఁ డట దృషద్వతియందు । నధికభక్తి
స్నాతుండై పితరుల । సంప్రీతి నొందించి వేల్పులఁబూజించి । విశ్వవినుతుఁ
ఆ. డై వసంతకాల । మం దైదుదినముల, ముగియునట్టి యాగ । మునఁ దగుఫల
మధికపుణ్యకరము । నొనలి రాత్రఫలంబు నొందు నిజము । సంబరమున. 35

క. చంద్రోపరాగమందును, జంద్రుని తిథియందె వందు । శ్రాద్ధము నట ని
స్తంద్రపుభక్తి నొనర్చునొ, సాంద్రమతి న్వానిఫలముఁ । జక్కఁగ వినుఁడీ. 36

తే. పుణ్యకరమైన గయయందు । భూరిభక్తి
చెలఁగుచుండఁగ శ్రాద్ధంబు । చేసి మిగులఁ
బితరులను దృప్తులంజేసి । వెలయువాని
ఫలముఁ బొందును నిత్యము । భవ్యులార! 37

తే. ఎట్లు గయయందు శ్రాద్ధంబుఁ । బృథులబుద్ధి
తోడఁ గావించి పితరులఁ । దుష్టిపఱచు
నట్లె ఫలకీవనంబున । నమరునట్టి
వారు శ్రాద్ధంబుఁ బెట్టినా । వాంఛతోడ 38

క. ఘనమగుఫలకీవనమును, జనుఁ డెవ్వఁడు తలఁచెనేని । సంతృప్తులునై
తనరుదురు రాతని పితరులు, మనసున సందియము లేదు । మతిమతిచూడన్. 39

చ. మునివరులార! యక్కడనె । పుణ్యము గణ్యము దేవమండితం
బును నగుతీర్థముం గలదు । పూనికఁ దజ్జలమందుఁ గ్రుంకు స
జ్జనుఁడు సహస్రగోఫలముఁ । జయ్యనఁ బొందును దేవఖాతమం
దును గురుభక్తిఁ గ్రుంకి పితృ । తుష్టి నొనర్చిన పూరుషుం డిలన్. 40

చ. నిరతము రాజసూయమును నిర్మలసాంఖ్యమునొందుఁ బిమ్మటన్
గురువరతీర్థమిశ్రకముఁ గార్చి జనం బగు నందుఁ బూజ్యతన్
బరఁగెడివ్యాసమౌని సుర భాన్వయుఁడు నైనమరీచికోస్తమై
కర మిట సర్వతీర్థములఁ గాలిఁగార్చెను నేర్పుమీఱఁగన్. 41

క. ఏవాఁ డీతీర్థంబున, వావిరి సుస్నాతుఁ డగుచు వసుధం గలతీ
ర్థావిష్కృతఫల మెల్లను, భావం బలరార వాఁడు పడయును బ్రాపిన్. 42

క. అంతట నియమగతాశన, వంతుండై వ్యాసమౌని వరవనమున క
ర్త్యంతమనోరథయుతుఁడై, సంతసమున నేఁగ నాను సంయములారా! 43

క. జనుఁ డట నుండుమనోజవ, మనుతీర్థమునందు మునిఁగి హతకల్మషుఁడై
ఘనబుద్ధి నొనరు దేవునిఁ, గని భావస్థితఫలంబుఁ గ్రక్కునఁ బడయున్. 44

క. భూవర! మధువనమునకుం, బోవలయున్ శుచియు నగుచుఁ బురుషుం డందున్
దేవీతీర్థముకల దా, పావనతీర్థమున మున్గి పాపచ్యుతుఁడై. 45

తే. పితరులను వేల్పుగుములనుఁ బ్రీతినొందఁ
జేసి యాదేవి మొదలను శిరమునందుఁ
బూని కోనకోర్కెలఁ బొంది లోక
విశ్రుతుండై చరించును వేడు కలర. 46

సీ. కమ్రపృషద్వతీకౌశికీసంగమమందు సేపూరుషుఁ డతులభక్తి
నొగడుచునుండఁగ నియమితాహారుఁడై స్నాతుఁడై గురుతరసర్వపాప
ముక్తుఁడౌ నటఁ డంత మొనసి యొక్కడఁ దొల్లి పుత్రశోకంబున భూరిదుఃఖ
హతుఁడు మహాత్ముఁడౌ వ్యాసుఁడు దేహంబు విడువను సమకట్టి విబుధులతనిఁ
తే. జూచి వలదని భాషింప శోకమెల్ల, విడిచి లేచెనౌ తద్వ్యాసవిమలభూమిఁ
జేరినట్టిమనుష్యుఁడు చిత్తమందుఁ, బుత్రశోకంబు నెప్పుడు పొందఁ డవని

తే. నరుఁడు కింద త్తరూపము వకునుఁ బోయి
పుణ్యబుద్ధిఁ దిలప్రస్థముమ ద్విజన్మ
వరున కిడి నిర్మలాత్ముఁడై పరమసిద్ధిఁ
జెంది ముక్తిని జెందునుఁ జెలువ మమర 48

చ. అనిశము లోకదుర్లభము లౌ సుదినాన్నసరోవరంబులం
దనితరబుద్ధిఁ గ్రుంకి నరుఁ డర్కునిలోకమునందుఁ బిమ్మటన్
ఘనకృతపుణ్యతీర్థమునఁ గల్మషరీతినిఁ జేరి తజ్జలం
బునఁ గడుశ్రద్ధతో మునిఁగి పూతుఁడు నై నివసించి కాంతితోన్ 49

క. పురహరునకు నభిషేకముఁ, గరమర్థి నొనర్చి పుష్పగణములతోడం
బోరిఁ బూజించి తురంగా, ధ్వరఫలముం జెందు నిజము తాపసులారా! 50

క. అట నొక్క కోటితీర్థము, పటుపుణ్యకరంబు నగుచు । భాసిల్లును ద
త్తటమునఁ గోటీశ్వరుఁ డు, త్కటతేజస్తోముఁ డగుచుఁ । గ్రాలుచు నుండున్.
ఆ. కోటితీర్థమందుఁ । గ్రుంకి కోటీశునిఁ
బూజచేసి మనుజ।పుంగవుండు
కోటియాగఫలముఁ । గుతుకంబుతో నొందు
మాన్యు లెన్నుచుండ । మౌనులార! 52

సీ. విశ్వేశ్వరుఁడు ప్రభ।విష్ణుఁ డౌ వామనదేవుఁ డెక్కడ నున్న । ధృతితలిర్ప
బలిరాజ్యముఁ గొని । పాకశాసనునకు నారాజ్య మొసఁగె న।త్యాదరమున
వామనకమునకు । వాంఛతోఁ జని విష్ణుపదమందు మునిఁగి యా।వామనునకు
సంప్రీతితోఁ బూజ । సలిపినమనుజుఁడు బహుళపాపాళుల । వాసి ముక్తిఁ
ఆ. గాంచుఁ బిదప విగత।కలుషమౌ జ్యేష్ఠాశ్ర
మంబు కలదు దాని । మానవుండు
పావనాత్ముఁ డగుచుఁ । బరికించి ముక్తికి
నరుగు; వలదు సంది।యమ్ము మీకు 53

ఆ. జ్యేష్ఠమాససంస్థ।సితపక్షగతరుద్ర, వాసరమున నరుఁడు । పరమభక్తి
తనర నుపవసించి । ద్వాదశినిం గ్రుంకి, మనుజగణ్యుఁ డగును । మౌనులార!

క. ముం దాచోటున శ్రీహరి, పొందికతో నిలిపె విప్ర।పుంగవులను వా
రందఱు దీక్షాగౌరవ, వందితులు రమేశ! తుష్టి।పరు లరయంగన్ 55

తే. ఆద్విజన్ములకొఱకు నై । యాచరింపఁ, బడినసచ్ఛ్రాద్ధములు దాన । పంక్తు లెంత
దనుక మన్వంతరస్థితిఁ । దనరుచుండు, నంతవఱకు క్షయంబులై । యమరఁగలవు.

క. మునులార! కోటితీర్థం, బనునది కల దొకటి దాని।యందు సభక్తిన్
మునిఁగి మఖకోటిఫలమున్, జనుఁ డొందును నిజముగాను । సంతస మలరన్.

క. కర మట నుండెడుకోటీ, శ్వరుఁ డైనమహేశుఁ జూచి । పాపచ్యుతుఁడై
నరుఁ డాశంకరుకృపతోఁ, బౌరి గాణాపత్యమతిముఁ । బొందును ధాత్రిన్. 58

క. అరమ్యస్థలగతమౌ, సూరునితీర్థంబునందు । సుజనుఁడు భక్తిం
జేరి మునింగి విభాకరు, సారపదంబునకు నేఁగు।జను లరుదందన్. 59

సీ. సంయమీశ్వరులార! సర్వవర్ణాశ్రమజనతారణమునకై । చక్రిచేత
నొకతీర్థ మచ్చోట । నొనరింపఁబడెఁ దొల్లి బ్రాహ్మణక్షత్రియ।వైశ్యశూద్ర
జాతిసంభూతులౌ । జనులును స్త్రీలును వర్ణి వానప్రస్థ।వరులు యతులు
గృహమేధులందఱు।స్పృహవాంఛ దత్తీర్థమునుఁ బొందిస్నాతులై । మోక్షపదము
తే. గాంచుచుందురు మనుజుఁడు । కలుషహరణ
మగుచుఁ బెంపారు తత్తార।ణాఖ్యతీర్థ

వరమునకు నేఁగి మునిఁగి నిర్వదియొకండు
కొలములనుఁ దన్పి ముక్తికి నెలమి జనును 60

తే వరకురుక్షేత్రమును దివ్యవామనేశు
నాత్మ నెన్ననొ దూరస్థుఁ డయ్యు నెవ్వఁ
డట్టినరుఁ డందు ముక్తిని నచట వెలయు
వాఁడు సుగతినిఁ బొందఁడె పలుకనేల. 61

వాయుతీర్థప్రభావము.

చ కరువలి పుత్రశోకమునఁ గ్రక్కునఁ దాఁగినఁ జూచి వేల్పులున్
వరదుఁడు నా విరించియును వచ్చిసమీరుని వేఁడ మెచ్చి దు
ర్భర మగుదుఃఖము న్విడిచి భక్తియుతుండై విధాతనున్
బోరి నెట సన్నుతించె గురుబుద్ధిని నాయెడ నుండునట్టిదా. 62

క తెమ్మెరమడుఁగునఁ బురుషుఁడు, సమ్మతితో మునిఁగి మేటిశంభునిఁ గని పా
పమ్ముల వెడలం ద్రోచి ర, యమ్మున శివలోకమునకు నరుగును దీప్తిన్ 63

క హనుమద్దేవుం డెక్కడ, మును గంధర్వాదిదేవముఖ్యులచేతన్
ఘనముగఁ బ్రకటీకృతుఁడై, తనరెనొ యాతీర్థమందుఁ దరుగనిపూన్కిన్ 64

క మునిఁగి నరుం డమృతత్వము, ననిశముఁ గైకొనును నిశ్శ్రేయము కావున దా
నిని నేఁగు టొప్పు నది శివ, హనుమత్స్థానంబు నగుచు నమరుటవలనన్ 65

ఉ పిమ్మట శాలిహోత్రుఁ డనుపేరఁ జెలంగెడుతేని తీర్థరా
జమ్మున కేఁగ నా నదియు సర్వజగత్తులయందు విశ్రుతిన్
బమ్మినదై వెలుంగు నతివాంఛ చెలంగుచు నుండ దానియం
దిమ్ముగఁ గ్రుంకి పాపముల నెల్లను బాయు నరుండు ధాత్రిపై. 66

ఆ భువనవిదిత మగుచుఁ బొలిసరస్వతిని శ్రీ, కుంజతీర్థ మొండు కూడి యుండు
దాని నీటఁ గ్రుంకి మానవుఁ డధ్వర, ఫలము నొందు నిజము భావ మలర

తే. నరుఁడు నైమిషకుంజంబునకును బిదపఁ
బోయి తత్తీర్థమునఁ గ్రుంకి పూతుఁ డగుచు
నైమిషంబున మునిఁగిన నరునిఫలముఁ
జెందు సత్యము పలుసార్లు చెప్పనేల 68

వేదవతీతీర్థమహిమము.

ఉ వేదవతీనిషేవితము విస్తృతపాపహరంబు పుణ్యసం
పాదక మైనతీర్థ మట భాసిలు నొక్కటి తొల్లి యక్కడన్
మోదముతోడ వేదవతి పూర్ణపుభక్తి నిజేశుఁగా మదిన్
శ్రీదయితున్ మది న్నిలిపి సేయుచునుండెఁ దపంబు నిష్ఠతోన్ 69

క. భూమినిఁ దిరుగుచు రావణుఁ, డామానిని యున్నచోటి కరుదెంచి మహా
ప్రేమమున దానిఁగని పటు, కామాతురుఁ డగుచుఁ బట్టఁగా గమకింపన్
తే. వేదవతి వానితో ననె విశ్వవిభుఁడు, నైన శౌరిని విభునిఁగా నాత్మ నెంచి
విపులమైనట్టి తపముఁ గావించుచున్న, దాన ననుఁగోర ధర్మమె దానవేంద్ర!
క. అనిపల్క దైత్యుఁ డాగ్రహ, మున నాపూఁబోఁడికేశములఁ గరములతో
డనుఁ బట్టి లాగ శోకము, మనమునఁ బెనుఁగొనుచుండ మహితోద్ధతితోన్.
క. వాని వధించుట కసుసం, తానంబుల విడిచి జనకధరణీపుగృహామం
దానలినాక్షి జనించెను, మానితసీతాఖ్యనొండ మాన్యులు మెచ్చన్ 73
తే. ఆపతివ్రత రాముని కాత్మపత్ని, యై వనంబున నుండ దైత్యప్రభుండు
నైనరావణుఁ డాత్మనాశైకకాంక్ష, నాలతాంగినిఁ గైకొని యరిగెఁ బురికి.
సీ. అంత రాముఁడు రావణాసురు ననిఁ గూల్చి సంతోషమున విభీషణుని లంక
కును రాజుఁ గావించి కులసతియౌ సీతఁ గైకొని వానరకలితుఁ డగుచు
సాకేతపురిఁ జేరి సకలసుఖస్థితి నిజరాజ్యమును నేలె నీటుగుల్క
నట్టితీర్థమునందు నవగాహుఁ డగువాఁడు పరమకన్యాయజ్ఞఫలమునొంది
ఆ. కాయశుద్ధిఁ జెంగి కలుషమ్ములను బాపి, పరమపదముఁ జేరి భాసమానుఁ
డగుచు జన్మరహితుఁ డై విలసిల్లును, బరమమౌనివరులు ప్రస్తుతింప. 75
క. మౌనీంద్రులార! బ్రహ్మ, స్థానంబున శూద్రుఁ డెలమి స్నాతుం డగుచున్
మానుగ బ్రాహ్మణ్యంబు న, మానస్థితిఁ జెందు మేటి యుత్సవ మొదవన్ 76
క. సమమతి విప్రుం డాతీ, ర్థమునందున్ గ్రుంకి పాపరహితుం డగుచున్
విమలపదంబున కరుగును, సుమనస్తతియొల్లఁబొగడ సుస్థిరదీప్తిన్ 77
క. మునిచంద్రులార! వినుఁడీ, జనుఁ డటమీఁదటను మూఁడుజగములయందున్
ఘనతం జెందినదగునో, మునితీర్థముఁ జేర నోను ముద మొప్పారన్ 78
క. ద్విజరాజు తపము మున్నట, సుజనులు మెచ్చంగఁ జేసి సొంపెసలారన్
ద్విజరాజ్యముఁ గైకొనె నారజనీపతి దైనతీర్థ రాజమునందున్. 79
ఆ. జగతిఁ గార్తికమునఁ జక్కఁగ వామనుఁ
బూజచేయ ముక్తి పొసఁగినట్లు
వేడ్కనట మునింగి పితృతుష్టిఁ గావించి
పురుషుఁ డమలుఁ డగుచుఁ బోవు దివికి 80

## సప్తసారస్వతతీర్థమహిమ.

క. ఏడుసరస్వతు లెక్కడఁ, గూడినవై పాఱుచుండు గుంభిని వడిఁగా
నాడ జగత్త్రయదుర్లభ, మై దంబగుతీర్థ మొండు హరువుగ నుండున్. 81
వ. ఋషులార! యది సప్తసారస్వతం బని పేర్కొనఁబడు సుప్రభయముఁ, గాంచ

నాతటియు, విశాలయు, మనోహరయు, విమలోదకయు, సరిత్తోయయు, సువర్ణయు, ననునామంబులతో నేడుతెఱంగుల సరస్వతీనది రాజిల్లును నొకతఱి మునులందఱు పుష్కరస్థుఁడై యడిఁచు నలువంజూచి నమస్కరించి మహాత్మా! సరిద్వరయగుసరస్వతీనదిపురః స్థితిరై కనఁబడదు ఈజన్మము ఫలదాయకమై నది కాదని పలికిన నమ్మునులమాటల విని భగవంతుఁడగు ద్రుహిణుఁడు సంతసించి మనంబున ఘనంబుఁగ సరస్వతినిఁ దలంప నది పుష్కరస్థితుఁడును సవకరుఁ డగుతమ్మిచూలిచేఁ బిలువఁబడినదై సుప్రభ యనుపేరున నట ప్రవహించుచు వాసికెక్క నంత నతివేగమునఁ బొలుపసరస్వతినిఁ గాంచి మునులు సంతసించి మేలుమే లని తలఁచుచుఁ బరమేష్ఠిని వినుతించిరి ఇట్లు నదీవర్య యగు సరస్వతి పుష్కరస్థితయై కురుక్షేత్రమునకు మహాత్ముఁడై నమార్కండేయునిచేఁ దేఁబడె నని పులస్త్యుఁడు చెప్పి మరల నిట్లనియె. 82

క. నారద! నైమిశమునఁ బెంపారుచు నున్నట్టి శౌనకాదిమహర్షుల్
కూరిమి నడిగిరి మనసొప్పారగ నత్తఱిని రోమహర్షణుఁ గనుచున్ 83

క మునినాథ! సత్పథంబున, నవయము వర్తించు మాకు నధ్వరమందుం
దనరెడుసత్త్వల మెట్లగు,వినుపింపు మటంచుఁ బలుక వేడుక లూరన్ 84

తే ఆమహాభాగుఁ డంతట నఖిలమునుల
కెలమి నభివందన మొనర్చి యెట సరస
తీధుని చెలంగునో యట్టి దివ్యభూమి
యందు గురుయజ్ఞఫలము పెంపొందు మిగుల. 85

క అని యిట్లు రోమహర్షణుఁ,డన బహులామ్నాయవేత్త లైనమునీంద్రుల్
వినివచ్చి యాసరస్వతి,ననితరమతిఁ దలఁచి రప్పు డాస్థలమందున్. 86

ఉ అంతట సత్రయాజకులు నైనమునీంద్రులచేత నద్ది బల్మంతుఁగ ధ్యాతయై సకలమానులఁ బ్లావనహేతువై తమిసంతసమొప్ప నైమిశవిశాలమహాస్థలమందుఁ బాతె నత్యంతరయమ్ముతోడఁ గనకాక్షి సమాఖ్యచెలంగు చుండన్. 87

ఆ. భూరితేజుఁ డగుచుఁ బొల్పారు మంకణమౌని పుణ్యతోయమహిత యగుచు
రహిఁ జెలంగు నాసరస్వతీనది కురుక్షేత్రమునకు భక్తిఁ జెర్చె నంత. 88

సీ. యాజకుం డగుగయుఁ డడరు మహాధ్వరమందు సరిచ్ఛ్రేష్ఠయగు సరస్వతినిఁ దలంచిన నది దీప్తితోఁ గని సంశ్రితవ్రతులు నా సకలమానులావడికిని విశాలాఖ్యనుఁ బెట్టిరి మాన్యుఁడౌ మంకణమానిచేత నంత నాహూతయై యామహానది కురుక్షేత్రంబునకువచ్చెఁ జెలువ మమర

తే. దివ్యదుత్తరకోసల। దివ్యభాగ
ధర్మదేశంబునందు ను। ద్దాలకాఖ్య
మౌని సద్భక్తితోఁ దన। మదిని మిగులఁ
దలఁచి ప్రార్థింప నంత సం। తసము చెలఁగ 89

క. సరిదాఖ్యయైన యానది, కరమాదేశంబు మౌని। కృతమునఁ జొచ్చెం
బోరివల్కలాజినాన్విత, వరమునిపూజితయు నగుచు। భాసురదీప్తిన్ 90

తే. అనఘ! కేదారమం దెద్ది। యఘనివార
కంబునై యొప్పుచుండునో। కడఁగి యాస
రస్వతీనది మునిసుగ। రాజసేవ్య
మైనదని యెన్నఁదగినదా। నాత్మలోన 91

తే. ఆమునీంద్రుఁడు సద్భక్తి। యతిశయిల్లఁ
బురహరుం డగుపరమేశుఁ। బూజచేసి
దానినంతఁ గురుక్షేత్ర। ధర్మభూమిఁ
జేర్చె మౌనులు మేలునఁ। జెందుకొఱకు 92

క. ధీరతదక్షుఁడు గంగా, ద్వారంబున మఖ మొనర్చు। తఱి గురుభక్తిన్
గోరి సరస్వతిఁ దలఁప న, వారితగతి నది చెలంగి। వచ్చెనుఁ బేర్మిన్ 93

క. మనసార దక్షుఁ డానతిఁ, గని యిది విమలోద యనుచు। గణుతించెను దా
నినిఁ గాని మంకణుఁ డాకురు, జనపతివాసంబునకును। సరవినిఁ జేర్చెన్ 94

క. సారకురుక్షేత్రంబున భూరమఖం బైనకురువు। పూని యజింపన్
సారె సరస్వతిఁ దలఁచిన, గారవమున నద్ది వచ్చె। గమనీయరతిన్ 95

క. సొరిది న్మార్కండమునీ, శ్వరుఁ డావది నంత వేఁడి। సరసీదివ్యాం
తరగతఁ జేసెను నిర్జర, వరు లానందించుచుండఁ। బరమోత్కంఠన్ 96

సీ. ప్రబలతపోభాగ్య। బంధురుండై యొప్పి మంకణుం డనుపేర। మహిని వెలయు
ముని సార్వభౌముండు। పుణ్యతోయములతో రాణించునట్టి స। రస్వతిని స
ద్భక్తితోఁ బ్రార్థించి। పావనసప్తసారస్వతంబున సిద్ధి। రమణ నొంది
సర్వలోకములందు। సంపూజ్యుఁడై ముక్తిపదమందు భాసిల్లెఁ। బ్రౌఢిఁ గుల్క
తే. నట్టి దాతీర్థరాజ మ। టంచు రోమ
హర్షణుఁడు పల్క మునిచంద్రు। లాలకించి
సంతసించుచు నామౌని। చంద్రుతోడఁ
బల్కి రాయెడ సంతోష। భరితు లగుచు 97

మంకణమునిచరితము.

క. మునిచంద్ర! మంకణుం డె, వ్వనివలనం బుట్టె నెట్లు। వరసిద్ధుం డ
య్యెను నర్తకుఁడై శ్రీశం, భునివారితుఁడయ్యె నెట్లు। భూస్థలమందున్. 98

క. విను నారద! ఋషివర్యులు, మనమునఁ దమి నిట్లు పలుక । మహితశ్రద్ధన్
మునినాథుఁ డంత వారిన్, గని భాషింపంగఁ దొడఁగెఁ । గమ్రోక్తులతోన్. 99

క. మౌనీంద్రులార! వినుఁ డీ, మానసమున సంభవించె । మంకణుఁ డనుస
త్త్వానుఁడు కశ్యపునకు ఋషు, లానందము చెందుచుండ । నతిశయదీప్తిన్. 100

క సునిశితమతి యగుమంకణ, మునివర్యుఁడు వల్కలముల । ముదమునఁ గొని వా
రినిఁ గ్రుంకులాఱు నై తమిఁ, దనమదిఁ దలఁపోయుచున్న । తరుణమునందున్.

ఆ ఇష్టదర్శనముల । నింపారు రంభాది, వారకాంతలెల్ల । వస్త్రహీన
లగుచు మునుఁగుచుండి । రట ననిందితలు నై, భవ్యరూప లగుచుఁ । బాలివచ్చి

ఉ మంకణుఁ డంత వారిఁ గని । మన్మథుబాణికిఁ జిక్కి స్రుక్కి బల్
సంకటపాటున న్వెలయఁ । జయ్యన నాతనివీర్య మయ్యెడన్
లంకెయు లేక వేగ సలి । లంబున జారిపడంగఁ జూచి ని
శ్శంకను దానిలుబ్ధకుఁడు । సంతస మొప్ప గ్రహించి పేర్మితోన్ 103

చ. కలశజలంబులోన నిడఁ । గ్రక్కున నద్ది తదీయకుంభమం
దలరుచు సప్తభాగములు । నై చనె నందె మహర్షిసప్తకం
బెలమిఁ జనించె నామునుల । నెల్ల మరుత్తులఁ గాఁగ నీమదిన్
దెలియుఁడు తత్కుమారులను । దెల్పెద వేడ్క వినుండు భక్తితోన్ 104

వ వాయువేగ, వాయుబల, వాయుహా, వాయుమండల, వాయుజ్వాల, వాయు
చక్ర, వాయువీర్యు లని పేర్కొనంబడుదురు. 105

క ఘనమతులు వీరె యాముని, తనయులు గురుబలులు భూరి । ధైర్యులు పూన్కిన్
బనిఁ గొని సర్వచరాచర, మునుఁ దాల్చుచు నుంద్రు నిత్య । మును దృఢశక్తిన్

క. మును గుశల మొనలతోడను, మొనసె న్మంకణునిహ । స్తమునఁ గాయము దా
నని వేగ సంభవించెను, ఘనశాకరసంబు చిత్ర । కరముగ నంతన్. 107

క ఆరపమును మంకణుఁ డిం, పారం గని యాడసాగె । నంతట సర్వం
బారితి నృత్యమును వి, స్తారగతిన్ జేయఁదొడఁగె । నత్యుత్సవతన్ 108

ఉ అమ్మునివీర్యమోహితము । నై కడువేడుకతోడ నాడు స
ర్వమ్మునుఁ జూచి దేవతలు । బ్రహ్మయు దివ్యతపఃప్రభావచి
త్తమ్ములు కల్గు మౌనులును । దద్దయు నారయుడ నమ్మునీంద్రు కా
ర్యమ్మునుఁ బార్వతీపతికి । నంతయుఁ దెల్పి వచించి యాదృతిన్ 109

సీ. దేవ మహాదేవ! । దివ్యదయాభావ! యిమ్మునినృత్యంబు । నింకఁ జేయ
కలరు నట్టు లొనర్ప । నర్హం డవనివేడ నంతట శర్వుండు । హర్షయుక్త
మానసుం డౌనట్టి । మంకణుఁ గని పల్కె నమరహితంబును । నాత్మఁ గోరి
మునివర్య! సత్పథ । మునను౦డి తపసివై యుసఁగెదు నీకేల । యిట్టిహర్ష

తే. మనిన నతఁ డామహేశుతో నాద మేమిఁ, గాన నైలిని నాదగు కరమునందు
జారసాగెను శాకరసంబు దానిఁ, గాంచి గురుహర్షయుతుఁడనై క్రాలితభవ.

చ. అన విని భూరికాంతియుతుఁ డౌ శివుఁ డమ్మునిరాగమోహితుం
గను వడిఁ జేసి పల్కె మునిగణ్య! విచిత్రముఁ నేనుఁ జెంద నీ
వనితరబుద్ధి నన్నుఁ గనుమా కనులార నటంచు నిట్టు లా
మునివరుతోడఁ బల్కె సురపుంగవు లందఱు చూచుచుండఁగన్ 111

క. అంగుళ్యగ్రముతోఁ దన, యంగుళినిఁ గొట్టి నట్టి దాశుతివలనన్
మంగళహిమసమభస్మము, రంగారుచు వెడలె మౌనిరత్నములారా! 112

క. అంతట దానినిఁ గని ముని, కాంతుం డగుమంకణుండు కడుసిగ్గరఁగన్
భ్రాంతిలినిఁ జెంది మృడానీ, కాంతునిపదములకు నెరఁగి గణుతించి యనెన్.

క. శూలాయుధ భక్తరక్షా, శూలాయుధహస్త దేవ సారిది నీ చే
లీలలఁ బొడమె నన్యుని, చే లలి నిటులౌనె యాత్మఁ జింతింపంగన్ 114

ఆ. శూలహస్త నీవు చూడఁ జరాచర, సహిత మగుచు వెలయు జగతి కెలమి
గివ్యగురుఁడ వగుచు దీపించుచున్నావు, మేటి కాంతి దిశల మించి వెలుఁగ.

క. అనఘ! త్వదాశ్రయు లగుచుం, గనఁబడుచున్నారు దేవగంధర్వాద్యా
సనకన్న రాదు లఖిలం, బనిశము నీవగుచునుందు వాత్మఁ దలంపన్ 116

క. గురుఁడవు కారయితవు మఱి, వరకర్తవు వేల్పులకును వారందఱు నీ
కరుణకుఁ బాత్రులు నై భయ, విరహితులై మోదమునను వెలసిరి భర్గా!

క. సురదైత్యనాథ! మత్కృత, గురుతపము విశేషవృద్ధిఁ గానుపదియా నీ
కరుణ నటంచని మునిపతి, పరమేశ్వరు నిట్లు పొగడి ప్రణతుం డయ్యెన్ 118

ఉ. అంతట శంభుఁ డామునికులాంబుధిచంద్రునితోడఁ బల్కె బల్
సంతస మొప్పు చిత్తమునఁ జక్కఁగ నీతప ముర్విలోన న
త్యంతము పెంపుచెందు సతతంబు మదీయకృపారసంబుతో
సంతత మేను నిం గలసి సంయమిచంద్ర! వసింతు నిక్కడన్ 119

తే. సప్తసారస్వతంబున స్నాతుఁడైన
పురుషునకు దుర్లభంబు నై పొసఁగునట్టి
కార్య మేమాత్రమైననుఁ గానరాదు
నాకభూలోకములయం దనారతంబు 120

క. సారస్వతతీర్థంబునఁ, గోరికతోఁ గ్రుంకునరులు గురుమోదమునన్
సారస్వతలోకోన్నత, సారస్థితి నొందఁగలరు చతురులు మెచ్చన్ 121

క. గురుపాపంబుల నెల్లనుఁ, బరువడిఁ గొండాడి కీర్తిపరిపూర్తు లగుచున్
బరమేశానుగ్రహమున, వరుఁ డొందునుఁ బరమపదము నాకులు మెచ్చన్.

### ఔశనతీర్థమహిమ.

క. మునులార! తొల్లి యొక్కఁడ, దనుజాచార్యుండు సిద్ధిఁ దనరి గ్రహత్వం
బును జెందె నట్టికానా, శనతీర్థముఁ జేర నాను జనుఁ డటమీఁదన్ 123

సీ. శ్రద్ధాసమేతుఁడై జనుఁ డాకురుక్షేత్రపుణ్యభూమినిఁ జేరి భూరిజన్మ
సంభవకల్మషచయవర్జితుండు నై వఱలి పరబ్రహ్మపదము నొంది
మరలి రాకడలేక మలయు రహోదరనాముఁడౌ మునికులనాథుఁ డొకఁడు
పరవిఁ దీర్థమహత్త్వసందర్శనంబున నధికశిరోగ్రస్తుఁడయ్యె ననఁగ

తే. మాను లంతటఁ బల్కిరి మానసీయుఁ
డౌరహోదరుఁ డేమాడ్కి నవని మస్త
కాళితుం డయ్యె నెట్లు మోక్షంబుఁ జెందె
నట్టితీర్థప్రభావంబు నధికభక్తి 124

క. వినఁ గోరుచున్నవారము, ఘనదయఁ బల్కుము మునీంద్రగణ్యా! యని యా
మునులాడ రోమహర్షణుఁ, డని నామునివరులతోడ నారయుడఁ బ్రీతిన్. 125

### ఔశనతీర్థప్రభావము.

క. ఘనులార! దండకావన, మునఁ దొల్లి మహాత్ముఁ డధికపుణ్యుఁడు సీతా
వనితాపతి యగురాముఁడు, జనకాజ్ఞను దలనుదాల్చి సాహస మొప్పన్

క. కనలుచు శరములతోఁ బటు, దనుజాలబాధించె నట్టిదానవతతియం
దును దుష్టుం డగునొకదితి, జునితల శితధార నొప్పు సురియన్ వెలుచన్.

క. దురమునఁ దెగి పుడమినిఁ బడు, తరుణమున రహోదరాఖ్యతాపసుమెడపై
సొరిది యదృచ్ఛన్ బడి త, చ్ఛిర మమ్మునిశల్యములను ఛేదించి వడిన్ 128

చ. కరకరిఁ జొచ్చె నంత మునిగణ్యుఁడు తత్పటులగ్నభారతం
ధరఁ దిరుగాడలేక గురుదారుణదుఃఖముతోడఁ దీర్థభా
సురచిరపుణ్యపద్మములఁ జోటులఁ జేరుచుఁ దత్స్రవంబుతోఁ
గరమపు డార్తిఁ జెందుచునుఁ గాసిలెఁ దాపసులార! యయ్యెడన్ 129

మ. ధరయందుం గలసర్వతీర్థములలోఁ దాఁ జొచ్చి సుస్నాతుఁడై
పొరిఁ దత్కష్టము నీఁగలేక పిదపన్ బుణ్యాత్ములున్ గణ్యులున్
బరతత్త్వజ్ఞులు భావితాత్మకులు నై భాసిల్లు మౌనీంద్రులన్
దరిశింపన్ జని వారితోడ బలికెన్ దన్మస్తకత్వస్థితిన్. 130

ఉ. అంతట మౌను లాతనికి నత్తఱిఁ జెప్పిరి మౌనివర్య! నీ
కింత దురంతచింత వల దింతట నౌశనసంబు చూర్చి య
త్యంతము భక్తి నేఁగు మన నమ్మునినాథుఁడు వారిమాటలన్
పంతువహించుచిత్తమునఁ బాగొరవ న్వని వేడ్కమీఱఁగన్. 131

మ. చని తత్తీర్థజలంబులోఁ మునుఁగఁ ద।త్కాసారోదకస్పర్శచే
తనుఁ దన్మార్గము జారి పుణ్యజలమ।ధ్యం బందుఁ గూలె న్మహా
నినదం బేర్పడ నంతట న్విరజుఁడై । నిర్ధూతపాపుండు నై
ఘనసంశుద్ధుఁడు నై రహోదరుఁడు వే।డ్కన్ జెందు మాన్ జెచ్చెలన్ 132

తే. ఆశ్రమంబున కరుదెంచి । యఖిలమునుల
కఖిలమునుఁ దెల్ప నమ్మును । లంక అమిత
పుణ్యతీర్థమహత్త్వంబుఁ । బూర్ణభక్తి
తనర నాలించి యరుదెంచి । దానికపుడు. 133

వ. కపాలమోచనతీర్థం బనునామ మొనర్చిరి తత్థ్సలమందె దివ్య మగువిశ్వామి
త్రతీర్థంబు కలదు మున్ను గాధిసూనుఁ డగువిశ్వామిత్రుఁ డక్కడ వసిష్ఠము
నీంద్రునితో ద్వేషించి ఘోరతపం బొనర్చి బ్రాహ్మణ్యముఁ జెందె నట్టితీర్థమున
మునింగిన నరుఁడు నిక్కముగ బ్రాహ్మణ్యము నొందు విప్రుఁ డట నవగాహ
నుండైన శుద్ధాత్ముఁడై పరమపదంబుఁ బొందుఁ బిమ్మటఁ బురుషుఁడు నియతుం
డును నియమితాశనుండై పృథూదకతీర్థంబున కేఁగ నగు దాని ప్రభావంబును
వక్కాణించెద వినుం డని చెప్పఁ దొడంగె 134

## పృథూదకతీర్థమహిమ

సీ. మున్ను ఋషంగనా।ముం డగుమునివరుఁ డాపృథూదకతీర్థ।మందు మునిఁగి
జాతిస్మరుండు నై । సతతగంగాద్వారసంస్థితి నొప్పారి । జగతి సిద్ధుఁ
డగుచు నంతటఁ దన । కంత్యకాలము రాఁగ సర్వతీర్థంబులఁ । జాలఁ దలఁచి
మునిగణ్యులై నట్టి । పుత్రుల కనె సర।స్వతి కుత్తరస్థమై । వఱలునదియు
తే. నా పృథూదకమం దెవ్వఁ।డాత్మతనువు
విడుచునో జప్యమానుఁడై । విపులభక్తిఁ
జెలఁగునో యట్టిమనుజుని । కెలమి మరణ
గలియు వెండియుఁ మునులార! । కలుగఁబోదు. 135

ఆ. బ్రహ్మయోనియొకటి।భాసిలు నక్కడఁ, దత్ప్ర।భావమెన్నఁ।దరముకాదు
భక్తితోడ నేనుఁ।బాటించి చెప్పెద, నాలకింపుఁ డిప్పు।డాదరమున 136

సీ. మునులార! పరమేష్ఠి।మున్నొటఁ బనిబూని దివ్యసరస్వతీ।తీరమందుఁ
గడఁగునట్టిపృథూద।కమ్మును శ్రద్ధతో నాశ్రయించినవాఁడు।నగుచు నాల్గు
కొలములవారినిఁ।గోరిసృష్టించు నిమిత్తమై విజ్ఞాన।మిశ్రితుండు
నయ్యెండ నాలోన।నవ్యక్తసంభవుఁ డలఘుయోగసమాధి।కలితుఁ డాద్యుఁ
తే. డైనపరమేష్ఠిముఖమందు । నగ్రజన్మ
నికరమెల్లను భుజముల । నృపులు తొడల

యందువైశ్యులు పాదము । లందుశూద్ర
గణముపుట్టెను దోర్ద్రోడఁ । గాంతి మిగుల 137

క. చాతుర్వర్ణ్యముఁ గని వి,ఖ్యాతినిఁ జెన్నొందు నలువ । హర్షముతో నా
జాతులకునుఁ జతురాశ్రమ, రీతులఁ గల్పించె నంతఁ । బ్రీతిని ధాత్రిన్ 138

ఆ. మహానులార! యిట్లు । మహిఁ బ్రహ్మయోనియఁ, చనెడు సంజ్ఞ నొప్పు । నట్టిదైన
తీర్థవరము సుప్రతిష్ఠితమయ్యె మోక్షంబుఁ గోరునట్టి । జనుఁడు భక్తి. 139

క. ఘనబుద్ధి నాజలంబున, మునిఁగి విశుద్ధాత్ముఁ డగుచుఁ । బూర్ణానందా
బ్ధినిఁ దేలి వెండి యా నిం,గన కనిశము ముక్తినొందిఁ । గ్రాలుచు నుండున్

మ. బకదాల్భ్యుండు నృపాలధర్షితుఁడు నై । వైరంబునన్ బ్రాహ్మణ
ప్రకటశ్రేణినిఁ గూడి యొక్కఁడను రాష్ట్రచ్ఛేదముం జేసి యా
టికి హోమం బొనరింప రాజు మునిధాటిం గాంచె నాభూమియం
దొకతీర్థం బవకీర్ణనామయుతమై । యొప్పారునం చాడినన్. 141

అవకీర్ణతీర్థ మాహాత్మ్యము

క. విని తాపసేంద్రు లామునిఁ,గని రక్కడ నెట్టులో వి । నవకీర్ణాఖ్యన్
దనరినతీర్థము సుస్థిర,తను నిలుపన్ బడినదగుచుఁ । దద్దయు నొప్పెన్ 142

క. ధృతరాష్ట్రవిభుఁడు తన్ముని, పతిసేలఁ దిరస్కరించెఁ । బలుకుము కరుణా
యతమతివై యన వారికి,నతిముదమునఁ బల్కె రోమహర్షణుఁ డెలమిన్ 143

క. మును దక్షిణార్థమై యే,మునిచంద్రులు నైమిషమునఁ । బూనికతో డన్
జనిరో యామునులందొక,ముని యగుబకదాల్భ్యుఁ డంతఁ । బూర్ణస్పృహతోన్

క. ధృతరాష్ట్రనామవిభుఁ గని,క్షితిలేశా! నీకు శుభము । కూడును వడి నీ
వతిదయ మాకిడు శ్రద్ధం, గ్రతుదక్షిణకొఱకు ధనము । గణ్యులు మెచ్చన్

శా. మానీంద్రుం డిటు వేఁడ జూచి కడుదుర్వాక్యోక్తులన్ బల్కి యా
భూనాథుండు తిరస్కరింప నతఁ డాభూపాలు నిందాస్థితో
దీనాత్ముండయి వచ్చి కోపము మదిన్ । దీవ్రస్థితిన్ జెందఁగా
నానారీతుల నంత మాంసముల నెన్నన్ బట్టి యుత్కంఠమై 145

మ. అవకీర్ణాఖ్యఁ జెలంగి పాపహరమై । హర్షించుచున్ దేవతా
కవిసంసేవ్యము నా పృథూదకమహాగణోత్కరతీర్థంబునం
దవనీనాథునిదై నరాష్ట్రమును స్వాహాయంచు హోమంబుచే
సె వడి న్మానివిభుండు దీక్షితరమై । చిత్తంబులోఁ జెన్నొనన్. 147

ఉ. అంతట యజ్ఞకర్మమున । నాతని రాష్ట్రము సంహృతంబు నై
సంతతసంప్రవృత్తి నటఁ । జాల వెలుంగఁ దదీయదేశము
త్యంతము భగ్నమయ్యెఁ గలుషాలిశయంబున నంత మేదినీ
కాంతుఁడు విప్రచేష్టితము । గాఢముగా మదిలోఁ దలంచుచున్. 148

క. వారక సపురోహితుఁడై, ఘోరమణుఁడు సర్వరత్నపూగింబులవి
స్తారధనంబులఁ గొని పెం,పారెడిసద్భక్తి చిత్తమందుఁ దిగుర్చన్ 149

సీ. అవకీర్ణతీర్థమం దలరెడిబకదాల్భ్యదివ్యమౌనీంద్రునిఁ దేర్చ నేఁగి
భక్తితోఁ బ్రణమిల్లి బహువిధంబుల వేఁడ మునినాథుఁ డంతఁ బ్రమోదితాత్ముఁ
డగుచు నానృపతితో ననె భూతలాధీశ జ్ఞానయుతుండు నా జనునిచేత
ధరణీసురేంద్రులు ధర నవమంతవ్యు లగ్రజన్ముండు భంగాత్ముఁడైనఁ
తే. బుడమిఁ బురుషత్రయమ్ముతోఁ బోలునట్టి
వంశమును నాశమొనరించు పడిని ననుచు
మౌని యారీతి రాజుతో మాటలాడి
కోపమును వీడి ముదమునఁ గూడి యపుడు 150

ఉ. రాజహితంబుఁ గోరి మునిరాజు వినాశము నొందియున్న త
ద్రాజసుగోత్రసంభవులఁ దద్దయు నాజ్యపయస్సుల న్వెసం
రాజితజీవయుక్తులయి రాజిలున ట్లొనరించె దేవతా
రాజియు రాజసత్తములు రమ్యమతిం దనరారఁ గ్రమ్మఱన్ 151

క. మునులార! దానియందుం, జనుఁడు జితేంద్రియత నొప్పి శ్రద్ధాన్వితుఁడై
మునిఁగి మనస్సునఁ గలిగిన, ఘనఫలమునుఁ జెందు నిజము కౌతుక మమరన్.

ఉ. అక్కడ నొక్కతీర్థము యయాతిసమాఖ్యఁ జెలంగుచుండు బ
ల్మక్కువ నేసరిద్వరము మాన్యుఁడు నా మఖకర్త కెక్కడం
జక్కని తేనె నిచ్చె నట స్నానమొనర్చినమానవోత్తముం
డక్కజమైనపాపముల నన్నిటి నాశముచేసి యుంతటన్ 153

క. సురకిన్నరాదు లాతనిఁ, బరిపరివిధములనుఁ బొగడ బహుతోషముతోఁ
బోరి దివ్యసైంధవాధ్వర,గురుఫలమునుఁ జెంది మేటిగుణుఁడై వెలయున్ 154

క. మునులార! యట మధువ్రత, మనుతీర్థము కలదు దానియందును శ్రద్ధం
మునిఁగి పితృగణము మధువునఁ, దనుప నగు స్నానవుండు తఱుఁగనిభక్తిన్.

వ. అట వసిష్ఠోద్వాహసంజ్ఞిత మగుమేటితీర్థము కలదు దానియందు భక్తియుక్తుఁడై మనుజుఁడు స్నాతుఁడై వాసిష్ఠలోకము నొందునని చెప్పిన విని శౌనకాదిఋషులు రోమహర్షణముని కిట్లనిరి. 155

అరుణాసరస్వతీనదీప్రభావము.

సీ. భవ్యవసిష్ఠాపవాహమై యది గురువేగంబు కలదై వెలసె నెట్లు
సరిదాఢ్య యగుసరస్వతి యేల మునినాథుఁ డగువసిష్ఠునిఁ గొని యరిగెననుచు
భాషించుమునులతోఁ బలికె నంతట రోమహర్షణుఁ డలిమోదమమరఁ దొల్లి
మునులార! రాజర్షిముఖ్యుఁడై వెలయువిశ్వామిత్రునకుఁ దపోభాగ్యుఁ డగుచు

తే. నెసఁగునట్టి వసిష్ఠముని । నింద్రునకును
బటులతపస్స్వర్గమునకుఁ బుట్టె । బహుళ మగుచు
వఱలు వైరంబు కృతమందు । స్వర్గవిభుని
మానసంబున గురుభీతి । మలయుచుండ 157

క. మునులార! స్థాణుతీర్థం, బున నుండువసిష్ఠమౌని । పుణ్యాశ్రమ మా
ఘనవాసమునకుఁ బశ్చిమ, మున గాధిసుతాటజంబు । పొదలు న్దీప్తిన్. 158

తే. షడ్గుణైశ్వర్యముల నొప్పు । శంకరుండు, శౌరి సరస్వతి నెక్కడఁ । బూజచేసి
భక్తి చెన్నార నాసర । స్వతిని లింగ,రూపమున నిల్పె నాయెడ । రూఢి నిగుడ

క. మునిచంద్రుఁ డౌవసిష్ఠుం, డనితర మగుబుద్ధి వెలయ । నతిదారుణమై
పొనరెడితపస్సుతో నటఁ, బనిఁ గొని వర్తించుచుండె । భాస్వద్దీప్తిన్. 160

ఆ. గాధితనయుఁ డగుచుఁ । గ్రాలు విశ్వామిత్రుఁ, డావసిష్ఠమౌని । దైనభీష్మ
తపముతోడ విగత । దర్పుఁడై వరసర, స్వతినిఁ బిలిచి యిట్లు । పలికెఁ గినిసి

క. మునిసింహుఁ డగువసిష్ఠుని, ఘనవేగముతోడ నీవు । కైకొని రా వ
చ్చినమౌనినాథు నిట నే, చని చంపంగలను నిజము । సరిదాఢ్య! యనన్ 162

సీ. అమ్మునిమాటల । నాలించి సరిదాఢ్యయౌ సరస్వతి విహ్వ । లాత్మ యగుచు
నట్లు వ్యవస్థితి । నలరి కంపముతోడ నవయు సరస్వతీ । నదినిఁ గోప
మడరుచు నుండ వి । శ్వామిత్రుఁ డంతటఁ గని వసిష్ఠుని నాదు । కడను నీవు
చేర్పు నా నని యిట్లు । చెప్పిన విని ధునీవరయౌ సరస్వతి । వడిని మౌని
తే. సత్తముఁడు నౌ వసిష్ఠుని । సరస కరిగి, నిలిచి దుఃఖించుచునుఁ గండ్ల । నీరు వెడల
గాధిసుతుఁడాడినట్టివా । క్యములనెల్లఁ, బలికె మైత్రావరుణితోడ । భయముదోఁప.

ఉ. అంత వివర్ణయై తనరి । యత్యధికం బగుశోక మొప్ప వే
వంతనుఁ జిక్కి స్రుక్కి కృశ । బంధుర యైనసరస్వతీనదిన్
బంతువహించు చిత్తమునఁ । బాలి వసిష్ఠుఁడు చూచి దేవి! నీ
కింత దురంతచింత వల । దిత్తఱి నన్ను గ్రహించి దీకతోన్. 164

క. ఆవిశ్వామిత్రునికడ, కీవు వెసఁ జేర్పు మనుచు । నిట్లాడఁ గృపా
భావయుతుఁ డౌ వసిష్ఠుని, పావనవాక్యముల నెల్ల । భక్తి న్మిగులన్. 165

క. అనది విని తత్స్నానము, నానికి లేకుండ ముంచె । నచ్చెరు వొలయన్
మానగుజలప్రవాహము, చే నమ్మునినాథు డంతఁ । జెడనట్టిమతిన్. 166

క. కూలాపహారమునఁ గడుఁ, జాలిమికలపూన్కినుండి । తగఁ బ్లావితుఁడై
లాలితమగుగురుపుష్కర,శాలపర్వతిని వేడ । సమకట్టెఁ దమిన్. 167

ఆ. దేవి! నీవు బ్రహ్మ । దివ్యసరస్సున, సరవి నుండు వెపుడు । సంతసమున
సకలజగము నీదు । జలముతో వ్యాప్తమై, మేటిభోగములను । మించియుండు.

క. కామగవై జలమును గురు,భీమాతములందు మిగుల । స్పృష్టింతువు నీ
వేమహిఁ గలిగినజలములు, మేము వహించెదము నిన్ను । మించినభక్తిన్. 169

క. కాంతిస్వాహాస్వధలును, శాంతిక్షమలును సుపుష్టి । సద్వాణిమే
ధాంతస్థధైర్యకీర్తులు, దాంతిజగత్సిద్ధు లీవె । ధర్మాకారా! 170

ఆ. సకలదివ్యభూత । సముదాయమందు వా, ణీస్వరూపమునను । నెగడి మిగుల
వన్నె నలరునట్టి । భవ్యాత్మ వటు కాన, నిన్నుఁ బొగడఁజాల । నేను దేవి! 171

చ. భగవతి యా సరస్వతిని । భక్తిని నిట్లు వసిష్ఠుఁ డత్తఱిన్
బొగడిన నద్ది యత్తపసిఁ । బొంకికఁ దాల్చి కృపాత్తదత్తయై
సుగమన మొప్ప గాధివర । సూనుని వాసముఁ జేర్చి తాపసేం
ద్రు గడనచేసి తెల్పె మది । దొట్రిల నాతనితోడ నయ్యెడన్ 172

సీ. అంత విశ్వామిత్రుఁ । డాసరస్వతిచేత నానీతుఁడై యల । రారునట్టి
వరవసిష్ఠునిఁ గాంచి । బహుకోపకలితుఁడై కడిమి వసిష్ఠాంత । కరమునైన
విలసదాయుధమును । వ్రేయ నుద్యోగించుచతి రోషయుతుఁడు నై । తనరునట్టి
గాధిపుత్రునిఁ జూచి । కళవళపడి సరిద్వరయా సరస్వతి । బ్రహ్మహత్య
ఆ. భయమున వసిష్ఠు । వారిమధ్యముతో వ
హించి యుభయమునుల । కింపు నిచ్చు
నట్టి భాషణముల । నాడి యా రాజర్షి
నవుడు మోసపుచ్చి । యలరుచుండ 173

క. పిమ్మట విశ్వామిత్రుఁడు, నెమ్మనమున నీటనుండి । నెగడు వసిష్ఠున్
బమ్మినఁ గిన్కన్ గని ర, క్తమ్ముగ కనుదోయి చెలఁగ । ననె నానదితోన్. 174

క. సరిదాఢ్య! నీవు న న్నీ, తరుణంబున మోసపుచ్చి । తంత్రముతోడన్
గర మరిగినకతమున నె, త్తురు దాల్చి సురారిగణము । తోఁ జేరి వెసన్. 175

తే. ఉరుతరార్తిని మెలఁగుము । యుర్వి ననిన
నామహానది తచ్ఛప్త । యగుచు నొక్క
వత్సరముఁ దాల్చె రక్తార్త । వారి నధిక
తరమనోవ్యథతోడనుఁ । దల్లడిలుచు. 176

ఉ. పిమ్మట వేల్పుబానిసలు । వేల్పులు సిద్ధులు మానిసాధ్యసం
ఘమ్ము సరస్వతీనదినిఁ । గన్గొని హా! యని శోకయుక్తచి
త్తమ్ములనుండి రంత శివ । దమ్ము మనోజ్ఞము నైననాసుతీ
ర్థమ్మున శోణితమ్ము కడు । రాజిలెఁ దాపసులార! యంతటన్. 177

శా. నానాభూతపిశాచరాక్షసులు వి । న్నాణంబుతో నాయెడన్
దానిం జేరి విశేషకాంక్ష చెలఁగన్ । దద్రక్తముం గ్రావి సం

ధానర్వస్థలినుండి స్వర్గతిఁ దుచుందం జొప్పవే యాడుచున్
గానంబు న్వడిఁ జేసి నవ్వరి మహోత్కారూహాలోత్కర్షతోన్ 178

సీ. మహితాత్ములార! పిమ్మటఁ గొంతసేపుని బరమమునీంద్రులు వరసరస్వ
తీఘనియందొగిఁ దీర్థయాత్రను సల్ప యోచించి చని శతయోజనములఁ
బరఁగు దవ్వనముండి వచ్చి ఘోర సురపీతమ్ము పటుశరశ్రీలి నలరి
నలియుండు నామహానదిఁ గాంచి మదియందు దానిని రక్షింపఁ దలఁచి మిగుల
తే. యత్నమును జేసి పిదప మహావ్రతోరు
దీక్షితులు భూరిసుభగులై తేజరిల్లు
నమ్మునీంద్రులు తుటుములై యాపగాస్య
యా సరస్వతితో ననిరి రాశ్రయించి 179

క. సరిదాఢ్య! శోణితంబున్, గరము వహించితివి వింత కారణ మేమో
గురుదుఃఖకలిత వగు నిను వరుసగ నిటు పలుకుచున్న వార మనంగన్ 180

క. విని యది విశ్వామిత్రుని, ఘనచేష్టితమును వచింపఁ గళవళపడి యా
మునులు సరస్వతియందొగి, మనము దయారసముతోడ మతిమతి వెలయన్.

ఆ. అరుణపుణ్యతోయభరితయై సర్వపాపములనెల్ల మిగులఁ బాపఁజాలి
రమణఁగుల్కు నాసరస్వతిఁ బుణ్యజలాఢ్యఁ జేసి రప్పుడాఢ్యులార! 182

ఉ. అంతట నానది న్వెలయునట్టి జలంబును దైత్యదానవుల్
వింత జనించుచుండఁ గని వేసటనొందుచు హా! యటంచు బ
ల్వింతను సర్వమానులను జెచ్చెఱఁ జేరి నమస్కరించి య
త్యంతవినమ్రభావముల నాడిరి మాటికి మాటికిన్ దగన్ 183

క. మేమెల్ల నిత్తతిని క్షుధ,చే మలసితి మిందు దుష్టచిత్తులము మహా
భీములము ధర్మనాశన,ధాములము సుశాశ్వతులము తాపసులారా 184

ఆ. కలుషకర్మములను గావించి చెడుబుద్ధి, నలరునట్టి వార మైలి మెట్టు
లట్టు భవదనుగ్రహంబున మాకిద్ది, కామకరయుఁ గాక కాల నగును. 185

క. ఏకరణి బ్రహ్మరాక్షసు, లీకాశ్యపివృద్ధికోడ నెసఁగిరో యట్లే
మాకిఁకఁ బక్షము వృద్ధిం, జేకొనునది కాంక్ష చెలఁగు జీతి మీదయతోన్.

ఆ. పొరిది రాజవైశ్యశూద్రులం దెవ తెల్లి, పాపకర్మములను బ్రాహ్మణులకుఁ
జేసిరేని వారు శీఘ్రమె దైత్యులై, సంభవింపఁగలరు జగతియందు. 187

క. గురుజననీజనకులతో, నిరతము ద్వేషించునట్టి నీచజనంబుల్
ధర బ్రహ్మరాక్షసులు నై, తిరుగాడుచు నుందు రెపుడు ధీవరులారా! 188

క. చెడిపలఁగాడినవారును, గడుదయతో లోకములను గావనిజనులున్
బుధమిని రక్కసు లగుచున్, ద్రొడఁబడుదురు నిజము మేటిదుఃఖముతోడన్.

క. అని యిట్లు దైత్యదానవు, లనితర మగుబుద్ధితోడ నాడినపుడు లా
విని యామాతులు వానిఁ, గని కరుణాశీలు రగుచుఁ గడుఖేదమునన్ 190

సీ. అన్యోన్యవేదనా యయ తచి త్రంబుల నలరారి కీటకు త్రాపపన్న
మైయశిష్టాశిత మై కేశవులఁ గూడి శ్వాసదూషితమానై శ్వసనధూళి
కలితమౌ కూడు రాక్షసభాగమై యొప్పు నాకారణంబున నవని వానిఁ
దెలిసి విద్వాంసుండు తినఁడు పాడ దట్టియన్నంబునుఁ దినినట్టి నరులు రక్క
తే. సులను భక్షించువారు నై క్షోణి నుండు
రనుచు నాదివ్యతీర్థము నంత మిగుల
సొరిది శోధించి రాక్షస స్తోమమునకు
మోక్ష మొప్పారఁ గూర్చెను నై మొనసి పిదప 191

క. పొంగారుచిత్తముల ముని, పుంగవు లట సంగమంబుఁ బొందికతోడన్
రంగుగఁ గల్పించిరి గురు, సంగతి దీపింప మేటిసంయములారా! 192

తే. అరుణరూపసరస్వతి సమరునట్టి
దివ్యసంగమమున మూఁడుదినములందుఁ
బస్తుతో నుండి స్నాతుఁడై వఱలుపురుషుఁ
డఖిలకిల్మషరహితుఁడై యలరు నిజము 193

క. కలియుగము ఘోరమగుచు, న్వెలయ నధర్మంబు మించి వెలుఁగుచు నుండన్
లలితారుణాసంగమమునఁ, గలజలమున మునిఁగి నరుఁడు గాంచును ముక్తిన్.

క. అని చెప్ప సర్వదనుజులు, ఘనభక్తి న్మునిఁగి విగతకల్మషులై స
ర్వనితలఁ గూడి యథేచ్ఛన్, జనిరి లసద్వస్త్రహారసంయుతు లగుచున్ 195

ఆ. మునులు నాల్గుసంద్రములు ల నట నిర్మించి, రధికభక్తి వాని యందు నరుఁడు
వేఱువేఱ మునిఁగి వేయిగోవుల నిచ్చు, ఫలముఁ జెందుఁ బుణ్యమి భవ్యచరిత!

క. ఆతీర్థమందుఁ జేసిన, దాతప మత్యల్పమగుచు నలరిన నది వి
ఖ్యాతినిఁ బరిపూర్ణంబై, భూతలమున వెలయుఁ బాపపురుషులకైనన్ 197

క. మునులార! లక్షతీర్థం, బున మఱి శలికాఖ్యతీర్థమున మునిఁగినవాఁ
డనఘుండై శరశోధన, మును నిచ్చినఫలముఁ జెందు బుధు లగ్గింపన్ 198

చ. అరుల సరస్వతీతటమునందు హిమాంశునితీర్థమందుఁ ద
ద్విమలజలంబులో జనుఁడు విస్తృతభక్తినిఁ గ్రుంకి రాజసూ
యమఖఫలంబు నొందు నరుఁ డంతటఁ బూనికతో జితేంద్రియ
త్వమునను రేణుకాష్టకముఁ దద్దయు శ్రద్ధను జేరి యక్కడన్ 199

క. జననినిఁ గొలువంగలిగెడు, ఘనఫలమును జెందు విప్రగణసేవితమై
తనరు ఋణమోచనంబున, మునిఁగి కుమారుని భజించి మోక్షము నొందున్.

క. జనుఁ డోజస్సనుతీర్థం, బున మునిఁగి యశఃప్రదీప్తిఁ బొల్పారుచు స్కం
దునిపురిఁ జేరి సుఖోన్నతిఁ, దనరారుచు నుండు విప్రతల్లజులారా! 201

ఆ. మనుజుఁ డెలమిఁ జైత్రమాస పాండురపక్ష, షష్ఠి దివసమందు శ్రాద్ధమును స
భక్తితోడఁ జేసి పరమగయాశ్రాద్ధ, పుణ్యఫలమునందుఁ బుడమి నిజము.

ఉ. అనిలుఁడు పూన్కి సన్నిహితియం దెటు శ్రాద్ధముఁ దొల్లి చేయఁగాఁ
బనిఁగొని పల్కి నట్లు గురుభక్తి పెనంగొని పెంపు సెంద స
జ్జనుఁ డట నాచరింప నగుశ్రాద్ధముఁ జైత్రికశుద్ధషష్ఠిని
న్మన మలరారఁ బెద్దలకు మానగుబుద్ధి జనింపుచుండఁగన్ 203

ఆ. మునుఁగ శక్తుఁడేని వినుఁ డామహాత్ముని, పితరులకును మిగులఁ బ్రీతి నొసఁగి
యక్షయంబు నగుచు నలరు నాజలమంతఁ, దాపసేంద్రులార! తథ్య మరయ.

సీ. పొలుపొంద వినుఁ డట ముజ్జగంబులయందు నధికవిఖ్యాతితో నలరు పంచ
వటి యనుతీర్థంబు భాసిల్లు నెట మహాశివుఁడు ముదంబునఁ జెలఁగి దివ్య
మూర్తిధరుండు నై మొనసె నాస్థలమందుఁ దివిరి సుస్నాతుఁడై దేవదేవుఁ
డగుమహేశునిభక్తి నర్చించి మనుజుఁడు మహితగాణాపత్యమతము నొంది

తే. దేవతలఁగూడి నిత్యముఁ దేజరిల్లుఁ
బురుషుఁ డంతట ముల్లోకములఁ బ్రసిద్ధిఁ
బొందినట్టి కురుక్షేత్రమునకు నేఁగ
వలయు నెటఁ దొల్లి కురురాజు భక్తితోడ 205

## కురుతీర్థప్రభావము.

తే. క్షేత్రమును దున్నుకొనుచు నై స్థిరతరాత్ముఁ
డగుచు నతిఘోర మగుచుఁ బెంపారునట్టి
తపముఁ గావించె నాఘోరతపమువలన
నింద్రుఁ డతితుష్టుఁ డై వచ్చి యిట్టు లనియె. 206

క. కులినాథ! యీతపంబున, నతితుష్టుఁడ నైతి నెవ్వ రిలభక్తిశత
క్రతు వగుయజ్ఞము నిట స, మ్మతిఁ జేయంగలరొ వారు మాన్యులు మెచ్చన్.

చ. కలుషహరంబు నై పరఁగి కన్యతఁ గాంచిన ధర్మవిష్టపం
బులఁ గడుఁ జెందఁగా గలరు భూస్థలిపై నని చెప్పి నవ్వుచుం
బలరిపుఁ డైనయింద్రుఁడు దివంబునుఁ జేరి నృపాలునిం గనం
బలుమరు వచ్చివచ్చి తమిఁ బల్కుచుఁ బల్కుచు హర్ష మొప్పఁగన్ 208

ఆ. పోయివచ్చుచుండి భూపాలకృతతపో
దారుణాగ్నిచేత దగ్ధ మగుచు
నెప్పు డాత్మగాత్ర మెసఁగె నప్పుడు శక్రుఁ
డనియె నృపునితోడ నాదరమున 209

క. జననాథ! నీకు నెయ్యది, ఘనతఁ జికీర్షితము నగుచుఁ గ్రాలెనొ దానిన్
వినిపింపు మనిన శక్రునిఁ, గని యాకురురాజు పలికె గాంభీర్యమునన్ 210

క పురుహూత! యేమనుష్యులు, ధర నీతీర్థంబునందుఁ దఱుగని శ్రద్ధా
గరము వసింతురొ వారా, పరమాత్మగృహంబుఁ జెంది వఱలుదురు తగన్.

మత్తకోకిల. పంచపాతకదూషితుండయి వాసిఁ గాంచినమానవుల్
వంచితాత్ములు నై వికల్మషవాంఛ నుండినవార లీ
మంచితీర్థమునందు స్నానము మానితం బగుబుద్ధితో
మించి చేయఁగ ముక్తిఁ గాంతురు మేఘవాహనదీప్తిమై 212

క జననాథుఁ డిట్లు పలికిన, విని యట్లా ననుచు దేవవిభుఁ డాడి నృపా
లునిఁ బ్రస్తుతించి యంతటఁ, జనె ముద మొప్పారుచుండ స్వర్గంబునకున్.

క మునులార! పుణ్యతమమై, తనరు కురుక్షేత్రమందుఁ దళ్కొత్తెడిదై
యొనరు కురుతీర్థముం గని, ఘనమోక్షముఁ జెందు నరుఁడు గతకల్మషుఁడై.

క కురురాజతీర్థజలమునఁ, బురుషుండు మునింగి పాపముక్తుం డై యా
ధరణీశానుజ్ఞను గురు, తరపరమపదంబు నొందుఁ దజ్జ్ఞులు మెచ్చన్. 215

వ విప్రేంద్రులార! పిదప ననరకతీర్థమునకు నేఁగ నగు; నట నలువ ప్రాగ్భాగమం
దును, వలిమలల్లుఁడు దక్షిణమందును, ముక్కంటివెలఁది పడమటికడను, వెన్నుం
డుత్తరఁపుతట్టుననుండిరో తన్మధ్యస్థలమందు నరకతీర్థంబు త్రిభువనదుర్లభంబయి
రాజిల్లు నట్టితీర్థంబునఁ గ్రుంకినపురుషులు పంకరహితు లగుదు రట్టి నరకపుణ్య
తీర్థమున వైశాఖమాస శుభదాష్టమి సంప్రాప్త మగుతఱి నరుండు మునింగి
విగతపాపుఁడై రత్నసంయుక్తకరకములతో నమరులసంప్రీతులఁ జేయనగు.
మఱియుఁ జతుర్థభాగకలిత మగుకనకము నపూపపూర్ణ మగుబంగారుకలశమును
సకలదుష్కృతహరము లగు, మఱి రెండుకలశముల నధికభక్తి నగ్రజన్ముల కిడ
వలయు; నిట్టి విధానమున నెవ్వఁ డట మునుంగునో వాఁ డఖిలపాపములఁ
బాసి పరమపదంబు జెందు, నన్యస్థలమందైన నెప్పుడు మంగళషష్ఠి సంభవింపఁ
గలదో యాకాలమం దాతీర్థముఁ దలఁచి చేసినకృత్యము కైవల్యపదకరమై
యుండు. సర్వతీర్థములలో నేతీర్థమం దాయెడ నెవఁడు మునుంగునొ యట్టిఁడు
సర్వదేవానుజ్ఞాతుఁడై కైవల్యస్థానగతుం డగునని చెప్పి మరల నిట్లనియె. 216

తే దేనిఁ జెందినమాత్రమె దృఢతరాఘ
ముక్తుఁడై మర్త్యుఁ డొప్పారు భూమినట్టి
పాపనాశనకరకామ్యవనమునకును
భక్తి జనుఁ డంత నేఁగ నా భవ్యమతిని 217

చ మునివరులార! యావిమలపుణ్యవనంబున వేఁడివేల్పు చే
ఘనుఁ డగుపూషుఁ డింపు చెలఁగఁ బ్రకటస్థితుఁ డయ్యె నట్టిభా

ముని వరదర్శనంబున మనుష్యుఁడు నిర్గతపాపజాలుఁడై
తనరుచు ముక్తినొందు బుధతల్లజులందఱుఁ బ్రస్తుతింపఁగన్ 218

ఆ. మౌనులార! దివ్యమార్కండవాసరం
బరగుదెంచుచుండ నాసుతీర్థ
మందు మునిఁగి నిర్మలాత్ముఁడై మహిలోన
వెలయు కోర్కె నొందు వేడ్క నగుడు 219

ఉ. నారద! రోమహర్షణుఁడు నర్మిలి నిట్లు వచింప మౌను ల
త్యాదరబుద్ధితోడ నపు డాడిరి కామ్యకపూర్వమందు సాం
పారెడికుంజరంబు త్రిదశార్చితమై చెలువొందునట్టి పు
ణ్యాకరతీర్థసంభవము నాదటఁ బల్కుము మౌనిశేఖరా! 220

క. అని పల్క రోమహర్షణుఁ, డనె న్మౌనులార! మీరు హర్షముతోడన్
వినుఁడు వచించెద నే ద, ద్ఘనవరతీర్థప్రభావకథ నింపారన్ 221

క. మునిచరితంబుల నెల్లను, వినినట్టినరుండు పాపవితతులవడి నా
శన మొనరిచి పుణ్యుం డై, మనుచు ధరాభాగమందు మాన్యులు మెచ్చన్

క. మును లెవ్వా రొగి నైమిశ, మున నుండిరొ యట్టి మౌనిపుంగవు లెల్లన్
మొనసి కురుక్షేత్రస్థలఁ, మునుఁ జేరినవారు నగుచు ముద మొదవంగన్.

సీ. స్నానార్థమై సరస్వతిలోఁ బ్రవేశంబు నందఁజాలనివారు నగుచు నంత
యజ్ఞోపవీతులై యలరు తీర్థంబునుఁ గల్పించి, రన్యులై క్రాలుమౌను
లటఁ బ్రవేశము నొందరైరి సద్రంతుకాశ్రమమువనుండియుఁ జక్రతీర్థ
మెందాఁక వెలసెనో యందాఁక వరవిప్రగణపూర్ణమై యది క్రాలఁ జూచి

తే. దివ్యయైనసరస్వతీదేవి సకల
విప్రులకుఁ గుండములఁ దమి వెలయఁజేసి
భూరిహితసంస్థయై పోయెఁ బూర్ణబుద్ధి
వారిపతిమార్గమునుఁ గార్చి భాసురముగ 224

తే. భక్తి నెవ్వఁడు పూర్వప్రవాహమందు
స్నాన మొనరించునో యట్టిజనుఁడు విష్ణు
పదిని మునిఁగినఫలమునుఁ బడసి ధర్మ
మహితుఁడై ముక్తినొందును మౌనులార! 225

క. సరిదాఢ్యలైనసత్మద, కర మావాఁకకును జమునికడ వెల్లువయం
దు రహించు పశ్చిమాశా, వరభాగమునందు యమున వఱలును దీప్తిన్ 225

క. మానుగ సింధువు వెలయును, వానిను విభాగమునఁ బ్రవాహయునై యి
ట్లానదిపుణ్యయు నగుచున్, గానంబడు నానియందుఁ గడుభక్తిమెయిన్ 227

క. మనమున మాధవుఁ దలఁచుచు, మునిఁగిననరుఁ డఖిలతీర్థముల స్నాతుండై

తనరెడు మనుజునిఫలమును, గను నిక్కముధాత్రియందుఁ గమనీయగతిన్

— కామవిహారతీర్థమహిమము —

ఉ. సంతతమన్ని లోకముల సన్నుతి మిన్నగఁ జెందినట్టి దై
కంతువిహారనామమునఁ గ్రాలినతీర్థముఁ గూర్చి యంతట
సంతసకట్టి పో నగును సర్వసుపర్వులు గూడి పార్వతీ
కాంతునిఁ జూచుకోర్కె మది గాఢమునై చెలువొందుచుండఁగన్ 229

తే. వచ్చి గౌరీయుతుండు నై వఱలు శివునిఁ, గానఁజాలనివారు నై కడిమిభక్తి
నామహాదేవనంగగాధిపతులఁ, సంస్తుతించిరి గురుభక్తి సహితులగుచు

ఉ. అంతఁ బ్రసన్నుఁడై సురల నందఱఁ గన్గొని నందిదేవుఁ డ
త్యంతముదంబు పెంపెసఁగ నయ్యెడ నోసురలార! పార్వతీ
కాంతనుఁ గూడి శంకరుఁడు కామవిహారసుతీర్థభూతలా
భ్యంతరమందుఁ గ్రీడ సలుపారుచు నుండె నటంచుఁ జెప్పినన్ 231

శా. ఆవాక్యంబుల సర్వదేవతలు ప్రత్యాసక్తి నాలించి బల్
ఠీవిం గుల్కు నిజాంగనావితతి మేల్చేకూర రప్పించి స
ద్భావానందముతోఁ జరింపఁ గని దేవవ్రాతఖేలావినో
దావాప్తిం దనివోయి శంభుఁ డని నగ్యాకాంతు నిట్లత్తతిన్ 232

క. జనుఁడు మనోజవిహారా, ఖ్యను భాసిలు నిట్టి తీర్థమందుఁ శ్రద్ధ
స్నానిగి ధనధాన్యయుతుఁడై, జనసంబును జెందు ననుచు సంయములారా!

క. జను డట్టి తీర్థమందు, స్నానిగి దుస్సంగాఘరాశిముక్తుండై త
న్మనసిజవైరిపదంబునుఁ, గను సత్యము సర్వబుధులు గణుతింప ధరన్ 234

సీ. అంత దుర్గాసేవ్య మగుచు శ్రేష్ఠంబు నై మొనయు దుర్గాతీర్థమునకు నేఁగ
నగు నెక్కడ జనుండు యత్నంబుతోఁ గ్రుంకి పితరుల బూజించి పృథులదుర్గ
తినిఁ జెందఁడో యట్టి దివ్యస్థలం బందె భువనప్రశస్తినిఁ బొంది దీప్తిఁ
దనరు సరస్వతీతటము తద్దర్శనమున ముక్తి చేకూరుఁ బురుషునకును

తే. బుడమి నెవఁ డక్కడను శ్రద్ధఁ బొదవి భక్తి
తోడ వేల్పులఁ బితరులఁ దుష్టిఁ జెందఁ
జేయునో వానికృత్యంబు చెడని దగుచుఁ
బితృహితామలతీర్థమై వెలయుచుండు. 235

వ. మునిశ్రేష్ఠులార! వినుఁ డీస్థలంబున దేవమార్గప్రతిష్ఠకొఱకుఁ బ్రాచీసరస్వతి
నిర్జరమార్గనిర్గత యై వెలసె, నట్టిపుణ్యస్థలమందుఁ దలిదండ్రులను విప్రులను
జంపినవాఁడును గురుతల్పగుఁడు నగువానుజుఁడు మునింగి ఘోరకలుషరహి
తుండగు, నాప్రాచీసరస్వతి దుష్కృతకర్ములకైనఁ బుణ్యము నిచ్చునది యై

రాజిల్లుచుండు నట్టిప్రాక్సరస్వతిఁ జేరి త్రిరాత్రదీక్షతోఁ దజ్జలమందుఁ గ్రుంకిన
పురుషులగాత్రములందుఁ బాపలేశమైన నుండదు. 236

క. నరుఁడును నారాయణుఁడును, బరమేష్ఠియు దేవరాజభవ్యమునీంద్రుల్
పురహరుఁడు చంద్రసూర్యులు, కరమానది నెపుడు గొలిచి క్రాలుదురోలిన్.

తే. వసుధ నెవ్వరు ప్రాక్సరస్వతిని భక్తిఁ
జేరి స్నానంబు లమవాస్యఁ జేయఁగలరొ
వారి కిహమందుఁ బరమందు వాస్తవముగ
లేదు దుర్లభ మగుపని లేశమైన. 238

క. ఆకారణమున నానది, పాకారిప్రముఖదేవపదసేవ్యం బౌ
వీఁక నొగి దానిఁ బంచమి, నేకాత్మగ గొలువ లక్ష్మి యొసఁగు నరునకున్. 239

ఉ. ఎక్కడ భార్గవుండు పరమేశు భజించి సుసిద్ధి నొందె న
న్నక్కడ లోకదుర్లభము నా కవితీర్థము వెల్గుఁ బూరుషుం
డక్కఱతోడ దానిఁ గని యంత గ్రహాంతరపూజ్యుఁడౌను సొం
పెక్క వెలింగె నిట్లది మునీంద్రుఁడు నా కవిచేత ధాత్రిపై. 240

ఆ. శ్రద్ధధాను లగుచు జనుఁ డట్టితీర్థంబు
దివ్యభక్తిఁ గొలిచి దీప్తిముక్తి
కరుగు నిజము శ్రద్ధ నట శ్రాద్ధ మొనరింప
వేడ్కనుండు రతని పితరులెల్ల. 241

సీ. ఉపవాసయుక్తులై యందె యేమనుజులు చైత్రమాసంబునఁ జెలఁగు బహుళ
పక్షచతుర్దశీ భవ్యాష్టమీవాసరంబులయందు మర్యాదతోడ
పరఁగు చతుర్ముఖబ్రహ్మతీర్థంబును భక్తి సేవింతురో వారు మిగుల
సూక్ష్మమై ఎ.తి రఁనిచోటుఁ గన్గొనుచుందురట నుండునట్టి సహస్రలింగ

తే. రాజితం బగుశంభుతీర్థమ్ముఁ జేరి
పురుషు లట స్థాణువటము సంపూర్ణమతినిఁ
గాంచి కిల్బిషదూరులై క్రాలి కాంతి
మహితులై వెల్గుచుందురు మానులార! 242

క. వనజాసనపుత్రా! యిటు, లనగా విని వేడ్క శౌనకాదిమహర్షుల్
ఘనుఁ డైనరోమహర్షణుఁ,గని పల్కిరి భక్తిమిగులఁ గ్రాలుచు నుండన్ 243

క. మునినాథ! లింగదర్శన, మునఁ దత్స్పర్శనమువలనఁ బొందెడిపుణ్యం
బును లోకవిశ్రుతాఖిల, ఘనసరసీపుణ్యఫలముఁ గడకన్ మతియున్ 244

తే. పాంసులతిపూరితంబు నై పరఁగునట్టి
సన్నిహత్యాఖ్యకాసార సంభవంబు

నాఁడు మని వేఁడ నా రోమహర్షణుండు
పలుకసాఁగెను దత్ప్రభావములఁ జేర్చి 245

మార్కండేయుఁడు తీర్థలింగప్రభావముల తెల్పుమని సనత్కుమారు నడుగుట

సీ. మానవుం డెట్టి వామనపురాణము విని వామనానుగ్రహపాత్రుఁ డగుచు
కైవల్యమునుఁ జేరఁగలుగునట్టిది వినుఁ డెనయ మార్కండేయమునిసభక్తి
సరసిజాసనసుతుల్ సత్తపోధనులుమహాత్ములౌ వాలఖిల్యాదిమునులఁ
గలిసి స్థాణువటంబు కడఁ జెలంగు సనత్కుమారునిఁ గననేఁగి మహితవినయ
తే. సహితుఁడై నిల్చి సకలశాస్త్రప్రవీణు, పంకజాసనవరసుత! పరమయోగ
భోగదివ్య సదానందపుణ్యకంద, నవ్యగుణవారదివ్యసనత్కుమార! 246
చ. పురుషుఁడు చూచినంతటనె పుణ్యము నిచ్చెడునట్టిదై నిరం
తరమును గృహ్యదృశ్యములఁ దద్దయు నొప్పెడితీర్థపుంజముల్
బరువడిస్థాణుసన్నిధినిఁ బర్వెడిలింగవిశిష్టపుణ్యముల్
వరవటపుణ్యసంభవము వావిరి బ్రహ్మకుమార! పల్కుమా 247
తే. తెలుపుఁ డద్దాని వలఁగొని తిరిగినందు
వలనఁ గలిగెడుపుణ్యంబు భవ్యతీర్థ
గాహన మొనర్చినందునఁ గలుగునట్టి
పుణ్యమును దేవతలఁజూడఁ బొసగు శుభము. 248
సీ. దేవదేవుండునై దీపించు భవుఁ డేల సరసీగతుండయ్యె శక్రుఁ డెందు
కొఱకు వెండియు నట్టికొలనుఁ బాంసునఁగప్పె స్థాణుచక్రరవీందుచంద్రతీర్థ
ములఁ గలమాహాత్మ్యములను మానాయక చక్రి గుప్తోన్నతస్థానములను
సరిదాఢ్య యగుసరస్వతియందుఁ గల ప్రభవంబునంతయు నాకు బలుకు మీవు
ఆ. దేహివయ్య బ్రహ్మదేవునికరుణతో, దేవదేవుమహిమ దెలిసినట్టి
వాఁడ వందువలన వాంఛతో నిన్నిపు, డడిగినాఁడ నే మహర్షివర్య! 249
క. అనిఁగొని మార్కండేయుఁడు, వినయంబున నిట్లు పలుక విని బ్రహ్మసుతుం
డు నయినసనత్కుమారుఁడు, విని తీర్థాసక్తబుద్ధి వెలయుచునుండన్ 250
క. ఘనభక్తినిఁ బర్యంకం, బును వదలి మహేశుఁగూర్చి మ్రొక్కి శతానం
దునిచేత నెద్ది వినఁబడె, మును దానిని జెప్పఁదొడఁగె మునివరులారా! 251
క. వరదుం డీశానుఁడు పుర, హరుఁ డగుచున్నట్టి యామహాదేవునకున్
బారి మ్రొక్కి బ్రహ్మభాషిత, పరతీర్థోత్పత్తి నేనుఁ బలికెద భక్తిన్. 252

సనత్కుమారుఁడు మార్కండేయునకు సృష్టితీర్థలింగప్రభావములఁ దెల్పుట.

ఆ. అనఘ! వినుము దారుణార్ణవంబునఁ జరా, చరయుతంబునైన జగతియెల్ల
నాశమై చెలంగ నరబీజసంభవ, కరమహాండ మొకటి గ్రాలెఁ దొల్లి. 253

క. ఆయండం బిటులుండను, దోయజసంభవుఁడు నైన । ద్రుహిణుం డోలిఁ
వేయియుగంబులదాఁకను, బాయని సుఖనిద్ర నొంది । పాలి న్మతియున్ 254

తే. మేల్కాని రజోగుణంబున । మించినట్టి
వాఁడునుఁ బ్రపంచమునుఁ జేయు । వాంఛతోడ
నలరునట్టి విరించికి । నపుడు శూన్య
మైనలోకంబు కనఁబడె । నంత నతఁడు 255

క. గురుసత్త్వోద్రేకంబునఁ, బరఁగి సమస్తంబు లౌ భు।వనములయం దా
తరుణంబునఁ బుట్టింపను, గరమాత్మఁ దలంచె సారె । గణ్యమునీంద్రా! 256

సీ. అనఘ సృష్టించెడు । నది రజోగుణమగు; నఖిలంబుఁ భావించు । నట్టిదైన
గుణము సత్త్వం బని । కొనియాడఁబడుచుండు సర్వలోకంబులు । సమయఁజేసి
మలయుగుణమ్ము తామసమగుఁ దద్గుణావ్యతిరిక్తుఁ డైనట్టి। వాఁడు దేవుఁ
డతఁడె సర్వంబును । వ్యాపించుపురుషుఁ డౌ, నని చెప్పఁబడుచుండు। నతనివలన

ఆ. బీజసంజ్ఞ నొప్పి । వెలయు నీసర్వంబు
కడిమి వ్యాప్తమగుచుఁ । గ్రాలుచుండు
నతఁడె నలువ విష్ణుఁ । డతఁడె నిత్యుండైన
శంకరుం డతండె । సత్య మరయ. 257

క. మునినాథ! వేదనిశ్చితుఁ, డనఘుం డగుచక్రి నాత్మ । యందుం గనుస
జ్జనుఁడు గుణరహితుఁ డౌ శ్రీవనమాలియు నై చెలంగు । భాస్వద్దీప్తిన్ 258

క. వరదుఁడు మహాత్ముఁ డగుశ్రీ, హరిఁ దెలిసిననరుఁడు చిత్త।మం దఖిలంబుం
శౌరిఁ గని మోక్షవిదుం డై, నిరతానందుండు నగుచు । నెగడుం ధాత్రిన్.

తే. ఎవరిచిత్త మనంతమై । యీశునందు
నడరునో యట్టిపురుషుల । కాశ్రమాఘ్య
సకలతీర్థాళితోఁ బ్రయో।జనము లేదు
తథ్య మిది యని నీమదిఁ । దలఁచుటొప్పు 260

మ. అనఘా! సంయమపుణ్యతీర్థములతో । హర్వొంది సత్యామృతం
బున సొంపొంది శమాదిసంయుతయు నై । పొల్పారుహృద్ధాత్రి దనిర్
దనివోవంగను గ్రుంకి పూతుఁ డగుచుం । దళ్కొత్తుజీవుండు నీ
రునఁ దా నెన్నఁడు శుద్ధుఁడౌనె చెపుమా । రూఢి న్విచారించినన్ 261

తే. ఆత్మసంబోధసుఖమందు । నరయ నరుని
కట్టివని సుప్రవిష్టమై । యొసఁగుతీరు
లగిరొ సుజ్ఞేయ మనిపల్కి । రట్టిదానిఁ
బొంది వాంఛల విడుచునుఁ । బురుషుఁ డవని. 262

సీ. తాపసోత్తమ! యిట్టి । ధనము విప్రునికేక సమసత్యములతోడ । సంతతంబు
కలుగకుండినయెడఁ । గడువడి నాతనిశీలసంస్థితులెల్లఁ । జెడును సర్వ
శిష్టకార్యములందుఁ । జెలువొందును పరమ మంత దండవిధాన।మందు నార్జ
వంబు విసర్జితో । వాసిఁ గాంచునటంచు బమ్మదేవర చెప్పెఁ । బాలిదాని
తే. జెప్పితిని నీకు నేను సం। క్షేపముగను
బరమపదమును నీవింకఁ । బడయఁగలవు
సంశయము లేదు నామాట । సత్య మనుచు
నాత్మలోపలఁ దలపోయ । నగును బ్రీతి 253

## బ్రహ్మసంభవము.

క. వనజాజన్మము నిత్తఱి, విను నారాయణునిఁ గార్చి । విపులంబగుచున్
దనరెడి యీశ్లోకం బిట్టనయము దృష్టాంత మగుచు । హరువును గాంచున్.
క. అప్పులె నారము లనఁ బడు, నప్పులె నరసుతులు వాని । యం దీశుఁడు సొం
పొప్ప శయనించుకతమున, నెప్పుడు నారాయణాఖ్య । యొసఁగె నతనికిన్ 255
క. ఆ తేటనీటినడుమనుఁ, బాతరలాడెడుజగంబుఁ । బరికించి బుధ
జ్ఞాతుఁ డగుచక్రియండము, నా తఱి భేదింపఁ బ్రణవ । మటఁ గల్గె మునీ! 256
తే. అంత నుద్ధలిదానిచే । నలరె భూసు
శబ్ద మఱిముఱి నద్దాన । సంభవించె
భువము మఱి దానిచే స్వంబు । పుట్టె నిట్లు
భూర్భువస్స్వయనుసంజ్ఞ । పొలువు మిగిలి. 257

వ. మార్కండేయ! దానియందు సవితృవరేణ్య మగుతేజస్సుగలిగి భూనిర్గత జలంబు శోషింపఁ జేసె మిగిలిననీరు గర్భపిండాకృతినిఁ దాల్చె నాపిండమున నీరుబుగ్గ జనించి పిదప గట్టిపడి సకలభూతధారిణి యగుధరణియయ్యెఁ; దదండ స్థానమందు నాకలోకలను సన్నిహితమయ్యెఁ, బూర్వోక్తతేజస్సు సూర్యుఁడుగ నేర్పడె నని చెప్పుదురు అండమధ్యమందు లోకపితామహుం డగునలువ సంజాతుఁడయ్యె మావి కొండలయ్యె గర్భోదకము నానావిధనదీసముద్రంబు లయ్యె, బ్రహ్మ నాభిస్థానమువలన నిర్గమించినతేటనీటితో నమ్మహాకాసారంబు నిండింపంబడెఁ, దత్సరోమధ్యమందు స్థాణురూపమును వహించి మహామనస్సున నుండువటవృక్షము కలదు దానినుండి బ్రాహ్మణ క్షత్రియ వైశ్యు లుద్భవించిరి బ్రాహ్మణసేవకులగు శూద్రులు పుట్టిరి పదఁపడి సృష్టివాంఛాపరుండును సంతతావ్యక్తజన్ముఁ డగుపరమేష్ఠికి మానసోద్భవులును నిర్మలాకారులు నూర్ధ్వరేతు లగువాలఖిల్యాదు లష్టాదశసహస్రంబులు సంభవించిరి క్రమ్మఱ నఖిలలోకనిర్మాణకౌతూహలుం డగువిరించికి మనోద్భవు లగుసనకాదిమౌనులు కలిగిరి మరల సృష్టిచింతాపరుఁ డగువిధాతకు సప్తర్షులు జనించి ప్రజాపతు

లైరి. పునశ్చింతుఁడును రజోమోహితుఁ డగువిధికి జపతపస్స్వాధ్యాయ సంపన్ను లగుతాపసోత్తము లుద్భవించి సంతతవ్రతోపవాసకృశీభూతగాత్రు లగుచు వారు పరమేశ్వరార్చనాసక్తులై వేయిదివ్యసంవత్సరములు గడచుదాఁక భక్తలోకవశంకరుఁ డగుశంకరునిఁగూర్చి ఘోరతపం బొనరించిరి, కాని తత్త పంబువలన భవుఁడు సంతుష్టుఁడు కాకుండె, నిట్లు కొంతకాల మరుగునెడ 268

ఉ. గౌరినిఁ గూడి శంకరుఁడు గౌతుకియై వినువీథియందు నిం
పారఁ జరించుచుండునెడ నంబిక వారితపంబుఁ గాంచి వి
స్తారముగాఁగ ఖేదపడి సత్కృపకల్గి నిజేశుఁడౌ శివుఁ
సారెకుఁ బ్రస్తుతించుచుఁ బ్రసన్నునిఁజేసి వచించె భక్తితోన్ 269

సీ. భాస్వదున్నతదారువనతలాశ్రయులు నై తాపసోత్తములెల్లఁ దల్లడిల్లి
రయ్యరో కనుఁగొను మధికతపోనిష్ఠతోనుండు వారికి దుష్కృతంబు
పారంబు లేకెట్లు భాసిల్లు శుష్కశల్యస్నాయుశోషితు లగుచు మాని
శిష్టు లిప్పటికైన సిద్ధినిఁ జెందరు కారణం బేమొకో కానఁజాల
తే. నైతి నాకొఱకై యిపు డైనవారి, కిమ్ము క్లేశక్షయమ్ము శుభమ్ము వెలయ
భక్తమందార! నతజనపాపదూర!, సర్వభూతాత్మసంచార! సర్వహార!

చ. అనియిటు వేఁడుచున్న గిరిజాత్మజమాటల నాలకించి దు
ర్జనహరుఁడు న్మనోజ్ఞతరచంద్రమయూఖవిరాజితుండు స
జ్జననుతుఁ డైనశంకరుఁడు సంతసమాత్మఁ జెనంగి వేఁడఁగా
దనసతిఁ బ్రీతిమీఱఁగను దద్దయుఁ గన్గొని పల్కెఁ దాపసా! 271

తే. ధర్మగతి చూడ గహనమై తనరుచుంట, దానితత్త్వంబుఁ గనలేవు ధర్మదూరు
లధికమూఢులు కోపకామాత్తచిత్త, కలితు లీమౌను లోదేవి! కనుఁగొనంగ.

మ. అన దాని న్విని ప్రాణనాయకునితో నాదేవి భాషించె నో
ఘనదేవేశ్వర! నీపదాంబుజములన్ గాంక్షించి సేవించు నా
కును దచ్చిత్రముఁ జూచువేడ్క మిగులన్ గూడె న్మదిన్ దానిసొం
పొనరం జూచెదున ట్లొనర్పుము పవిత్రోత్కృష్టచిత్తాయనన్ 273

తే. దేవమునిరాజ! పార్వతీదేవిచేత, నిట్లు పలుకంగఁబడి భవుఁ డెలమిమొగము
నందుఁ జిఱునవ్వు సొంపెస లారుచుండఁ, బలికెన ట్లతి సంతోషభరితమతిని.

క. ఇట మెలఁగుము మునినాథులు, పటుతప మొనరించు భూమిభాగంబునకున్
దటుకునఁ జని తద్గతి నీ, కటఁ జూపెద జూడుమిప్పు డగజా! పేర్మిన్ 275

శివుఁడు మునిరూపమున దారువనస్థమునిభార్యలకడ కేగుట.

ఆ. ఇట్లు భవుఁడు చెప్పఁ బృథుతరసంతోష
భరితచిత్త యగుచుఁ బాలి నతనిఁ

పొమ్మటంచుఁ బలికె । భువనేశ్వరియు నగు
చండికాంబ యపుడు । సంయమీంద్ర ! 276

ఉ. అంతట శంభుదేవుఁడు కృ।తాగ్నిగృహాశ్రయులు న్నిరంతరా
త్యంతతపోధురంధరు ల।హస్కరతేజులు భావమార్గవి
శ్రాంతులు కాష్ఠలోష్టచయ।సన్నిభులై గురుదారుసద్వనా
భ్యంతరవాసులౌ మునుల । నారసి నేర్పు చెలంగుచుండఁగన్ 277

సీ. సకలలోకేశుఁడై । చాల వెలిం గెడివలిమలల్లుఁడు దిగం।బరుఁడు కోడె
వాఁడును రీవితో । వర్తించువాఁడు నై సర్వాంగములయందు । సౌరు వెలయ
సిగయందు వనమాల । చెన్నారఁ గరమున భిక్షాకపాలంబుఁ । బ్రీతిఁ దాల్చి
తివిరియాశ్రమభూమిఁ।దిరుగాడుచును మౌని పర్ణశాలలఁగూర్చి । పరఁగ నేఁగి

ఆ. ధర్మయువతులార ! । దయతోడ భిక్షమ్ము, నిడుఁడు నాకు ననుచు । నిట్లు పలికి
వేడ్క నటఁ జరించి।పిదప నాశ్రమభూమి, భాగమునకుఁబోయిఁ।బరమమౌని !

ఆ. అంత బ్రహ్మవాదు । లైనమునీంద్రుల, తెఱవ లాశ్రమమునఁ । దిరుగు కుటిల
రుద్రుఁ జూచి తత్స్వ।రూపసకౌతుక, హర్షమోహగాత్ర । లై కడంగి 279

క. ఓయమ్మరో ! యీభిక్షుని, నీయెడఁ గనుఁగొనెద మనుచు । నీతీరున నా
తోయజనేత్రలు గుములై, పాయనితమి నొకరినొకరు । పలికిరి మౌనీ ! 280

క. మునివనిత లిట్టులాడుచు, ఘనముగ ఫలమూలములనుఁ । గరకమలములం
దునుఁ దాల్చి పేర్మి బిచ్చముఁ,గొనుమని భాషించి రతనిఁ।గార్చి యలరుచున్.

తే. అంత భిక్షాకపాలంబు । హరుఁడు చాచి
బిచ్చమును సాదరంబునఁ । బెట్టుఁ డో త
పస్విసతులార! మీకింక । భద్రము లొనఁ
గూడు ననుచును బలికితాఁ । గోర్కిఁ జెలఁగ 282

క. దేవేశుఁ డైనశంభుఁడు, వావిరి శివచేతఁ జూడఁ । బడి హసితాస్యుం
డై వేడ్కతోడ నుండఁగ, నావేళఁ గపాలమందు । నధికప్రీతిన్ 283

క. ఆయువిదలు బిచ్చము నిడి, కాయజుకోలలకు జిక్కి । కళవళపడుచున్
వేయివిధమ్ముల నాముని, నాయకుతో నిట్టు లనిరి । నమ్రోక్తులతోన్. 284

సీ. విమలాత్మ ! యీవ్రత।విధి యెట్టిదై యుండు? సేవితంబయ్యె నీ।చేత నిద్ది
భావింపఁజిత్రమై।పరఁగ నగ్నంబగుచిహ్నంబు చేతనుఁ।జెలఁగుచుండి
మానితవరవన।మాలను లలిమీఱఁ దాల్చి సుందరుఁడగు।తాపసివగుచు
నలరెద విధి ధర్మ।కుగున నీవేమని తలఁచెదవో దానిఁ।దథ్య మొప్ప

ఆ. నాడు మనుచునిట్టు।లాపాలంతులు పల్క, హసితవదనుఁడగుచు।నపుడు కుటిల
మౌనిరైనచంద్ర।మౌళి యంతట ముని, సతులతోడఁబలికె।సంతసమున 285

క. వినుఁడిది నాకును గుప్తం, బును సూక్ష్మంబైన వ్రతము । భువిపై మిగులన్
వినిపింపరాదు దోసం, బొనఁగూడును యువతులార! । యూహింప మదిన్ 286

మునిపత్నులు హరుని మోహించుట

క. పెక్కండ్రటనాలించెద, రక్కడ నీవ్రతవిధాన । మాడుట కట్టా
నక్కజ మరసిన మానుడు, లెక్కడనుండకయి మానర । లేగుఁడు వడిమై 287
క మానుగ నిటు లావేళను, సూనాస్త్రుని వైరిచేత । సురుచిరగతిన
మ్మానినులు పలుకఁబడి త, న్మానినిఁ గని పల్క రంత । మమత చిగుర్పన్ 288
చ. మునివర! మేము పోఁగలము । మోదము మిక్కిలిఁ గల్గెఁ గ్రమ్మఱన్
గనికర ముంచి మాకడకుఁ । గ్రక్కున రమ్మని పల్కి యావరా
నన లతనిన్ గరాబ్జముల । నాఁడె గ్రహించిరి వారియందు సొం
పున నొకబోఁటి కంఠమునఁ । బుష్పశరాన్విత యయ్యె సంతటన్. 289
తే మదనతత్పరయయ్యెను । మగువ యొకతె
జానువుల నొక్కచేడియ । చరణముల నొ
కర్తు కటిరంధ్రమందొక । కలికి కేశ
ముల నొకవెలంది లలితయై । వెలసె ననఘ 290
సీ. అంతట మౌను లాత్మసతు । లారయుఁడఁ జెందు కలంతఁ జూచి బ
ల్వంతేనుఁ గుంది చంపుఁ డని । పల్కుచు తాలను గఱ్ఱల న్వెసన్
బంతముతోఁ గరంబులనుఁ । బాగుగఁ బూని మహాత్ముఁడౌను మా
కాంతుని యూర్ధ్వలింగమునుఁ । గాశ్యపఁ గూల్చిరి కోపయుక్తులై 291
ఆ. అనఘ భీషణంబు । నగు లింగ మవనిపైఁ, బడిన దగుచునుండ । భర్గుఁ డఖిల
మౌనివరులు చూడ । మాయమై కైలాస, గిరినిఁ జేరె నంత । గిరిజఁ గూడి.
చ. ఘనశివలింగపుష్ట మిలఁ । గ్రక్కునఁ గూలఁగ భావితాత్ములై
తనరెడి మౌనినాథులకు । దారుణమైన కలంత పుట్టె దా
నిని బోరి నా మునీంద్రులు మ । నీషలయందు నెఱింగి వ్యాకులం
బునుఁ గలవారునై వనటఁ । బొందుచు నుండిరి మౌనిశేఖరా! 293
తే. వారియం దొక్కతాపస । వరుఁడు పలికె, నామహాతాపసేంద్రుని । దైనదివ్య
భావము మనము తెలియని । వారమైతి, మందుచే నిట్టికష్ట । మొప్పారె మిగుల.
క. మన మిర్తితి గురుభక్తిని, బొనరుచుఁ బరమేష్ఠి శరణ । మున కేగుద మా
వనజాసనుండు కనికర, మున నానినిఁ దెలియఁగలఁడు । మునివరులారా! 295
వ అని వక్కాణించె నంత 296
ఆ వార లిట్టు చెప్పఁ । బడినవారై జతేం, ద్రియులు నగుచు వెడలి । త్రిదశవర్గ
సేవితంబు నగుచుఁ । జెల్వొందు శతధృతి, భవనవరముఁ జేరి । భక్తితోడ 297

చ. కరయుగ్మంబులు మోడ్చి మ్రొక్కి వినుతుల్ గావించుచున్ సిగ్గుతో
శిరము లవంచి నటించుచుండిరి మహాసృష్టీశుఁడా బ్రహ్మ దు
స్తరశోకంబున నున్న తన్మునుల సంతతిఁ జూచి డెందంబులోఁ
బోరి యోచించి వచించెఁ జిత్రమనుచున్ బోధంబు గా మాటలన్ 298

## బ్రహ్మ మునులకు వేదాంతవిధి చెప్పుట.

క. మునులార! మీరు దుష్టులు, ఘనరోషావేశచిత్తకలితులు ధర్మం
బును మఱియే సత్కార్యం, బును దెలిసినవారు కారు మూఢత్వమునన్

సీ. దారుణకర్ములై తనరెదు మునులార! బుధుఁ డెట్టిధర్మంబు బుద్ధి నెఱిఁగి
పుణ్యఫలంబునుఁ బొందునో మొనసి తద్ధర్మత్వమును మీరుఁ దాల్మి వినుఁడు
దేహాత్మలం దెట్టి దేవుఁ డవ్యయుఁడు నై గీపించుచుండునో తెలివిరి యట్టి
వాఁ డనాదివిభుండు వాఁడె సుస్థాణుండు సొరిది నాతఁడె పృథక్సూచితుండు

ఆ. మంచివన్నె నుండు నతి యుపబర్హంబు
చేతఁ దాల్పఁబడిన రీతి దన్మ
యాత్ముఁ డాత్మకృతుఁడు నై మనోభేదంబు
నాశ్రయించి కర్మ ఫలరు మిగుల 300

వ. అంతఁ గర్మవశంబున సఖలస్వర్గనరకభోగంబుల ననుభవించుచుండు, బుద్ధిశాలి యగువాఁ డట్టిమనస్సును జ్ఞానయోగోపక్రమములతో నిరోధింపనది నిర్మలం బగుచుండ నంతరాత్ముఁడు తనంతనె వ్యాకులరహితుం డగుచుఁ గాయక్లేశములతో బాధితుఁడు కాకుండును సతత మెవనిచిత్తము సంశుద్ధినొందకుండునో వాఁడు సంశుద్ధుఁడు కాఁడు మనుజులు కార్యనియతిఁగోలుకై పాటుపడుచుఁ బాపప్రకీర్తితు లయ్యెదరు గురుకలుషయుక్త మగుమేను సత్వరంబుగ శుద్ధి నొందదు. వినుఁ డాకారణంబున లోకములందు సత్ప్రవర్తనము మేటిత్రోవయై యుండు. నీ వర్ణాశ్రమవిభాగంబు లోకాధ్యక్షునిచే నేర్పరుపఁబడె. మోహప్రభావమెల్ల నిహ్నవోత్తమభాగినులకు నిమిత్తమైయుండు మీరు కామక్రోధములచేఁ దిరస్కరింపఁబడి యాశ్రమముల మెలఁగుచున్నారు జ్ఞానులకు నాశ్రమమె గృహంబై యుండు. యోగరహితులకు గృహమాశ్రమమై యొప్పు నని చెప్పి వెండియు నిట్లనియె 301

సీ. ఎలమిఁ దపఃకామ మెటఁ బొలంతులమీఁది వలఁ పెట మీఘోరబహుళకోప
మెట సమంజసమగు నే మీరుఁ బరమాత్ముఁ జూడంగఁజాలరు సొరిది కోప
కలితుఁ డౌ జనుఁ డేది కావించినను మఱి జనులకే మిడినను సంతతంబు
మొనసి యెయ్యది హోమ మొనరించినన దంతయును నిష్ఫలంబునై తనరియుండు

ఆ. నందు వెలయుచుండు । ననిశమ్ము వానికిఁ
గోప మెవర్లైనఁ । గూడ దెపుడు
మిగులఁ గోపమునను । మించితి రందునఁ
దపము చెడియె నిజము । తెలఁచిచూడ. 302

వ. ఇట్లు వనజాసనుండు పలుక నయ్యెడ 303

క. మునులు పరమేష్ఠిమాటల, విని సర్వులు సంతసించి । వినుతించుచుఁ గ్ర
న్నన నడిగిరి జనులకు శివ, మునుఁ గల్గెడికారణంబు । మునికులచంద్రా! 304

క. మన మిపుడు శూలపాణియు, మునిరక్షకుఁ డై చెలంగు । ముక్కంటిగృహం
బున కేగుద మాదేవుని, ఘనకృపతోఁ బూర్వరీతిఁ । గాఁగల మనుచున్ 305

తే. ఇట్లు భాషించి ఋషులు వాణీశయుక్తు
లగుచుఁ గైలాసగిరిఁ జేరి । యార్యుఁ గలిసి
హర్ష మొప్ప సుఖాసీనుఁ । డైనహరుని
శోభనాకారుఁ జూచిరి । చూడ్కు లలర 306

క. లోకపితామహుఁ డగువా, ణీకాంతుం డంతఁ బ్రభుఁడు । నిత్యుఁడు త్రిజగ
చ్ఛ్రీకరుఁ డమరేశుఁడు సు, శ్లోకుం డగుభవునిఁ బొగడఁ । జొచ్చె న్భక్తిన్.

బ్రహ్మ భవుని నుతించుట.

క. పురహర కరుణాసాగర, వరద మహాదేవ దేవ । భర్గానంతా
సురుచిరపినాకహస్తా, పరమస్థాణుస్వరూప । భవ! జోత తమిన్. 308

ఉ. సంతతతారకుండవయి । శాంతుఁడవై భువనేశ్వరుండ వై
మంతు వహించు చిత్తమున । మానితభక్తుల కెల్లఁ దెల్పి న
త్యంత మొసంగునట్టి పురు । షార్థ్యుఁడ వీ వాకరుండవే యుమా
కాంతుఁడ నీకు మ్రొక్కెదను । గాఢదయారస మొప్ప నేలుమా 309

ఆ. విగతఘోరపాప । విధ్వస్తబుధపాప, మానసాబ్జశయన । మంజుసదన
బహుళదీర్ఘకోప । భాసురసద్రూప, వనజగర్భ! నీకు । వందనంబు. 310

మత్తకోకిల శూరనాయక భద్రదాయక । సుందరోజ్వలమాయికా
సూరిపాలన దుష్టనాశన । సూక్ష్మభావనపావనా
సారశూలకరా మహేశ్వర । సత్యమార్గసుఖోత్కరా
కోరి మ్రొక్కెద నీకు భక్తినిఁ । గూర్మి న న్పాలింపుమా 311

సీ. శ్రీపార్వతీసతీ । చిత్తాబ్జసంచార! చారణాదిసురాళి । సతతవినుత
చరణ! రణోజ్వల । సాహసచాతుర్య! తుర్యమూర్గా వేశ । తోషసుకర!
కరశూలవిధ్వస్త । కర్బురగణ! గణ । నాయకప్రమథజ । నప్రయుక్త!
యుక్తసంబోధసు । యోగదివ్యాలయ! లయకాలకాల! కా । లప్రకృష్ట

ఆ. గర్వభంగ! భంగ । కలితకంధిగభీర! భీరుకావనాఢ్య । వీర! వీర
భద్ర! భద్రరూప! । పాలింపు మీవేళఁ, గరుణతోడ మమ్ముఁ । గరళకంఠ! 312

క. దేవా! నీదాసులమై, వావిరి వర్తించుచున్న । వారము గాన
భావించి ప్రోవు మని యిటు, లావనజజముఖాదు లాడి । రతులితభక్తిన్ 313

క. ఓ మార్కండేయా! భవుఁ, డీగూఢి నుతింపఁబడుచుఁ । బృథుతోషముతో
నామౌనివరుల కిట్లనె, సామంజసభణితివలనఁ । జతురులు మెచ్చన్ 314

క. మునులార! చనుఁడు క్రమ్మఱ, ననితర మగుసుఖము నెల్ల । నాలింగమె మీ
కొనకూర్పఁగలదు నా వా, క్యము శీఘ్రమె వినుఁడు శ్రద్ధ । గొమరొప్పంగన్.

క. లింగప్రతిష్ఠయందుఁ, బొంగారెను ప్రీతి నాకుఁ । బుద్ధినిఁ దగఁ ద
త్సంగతినిఁ జేయుఁ బహుళవర, మంగళ మగు సందియమ్ము । మానుఁడు మతులన్.

ఆ. అధికభక్తియుక్తు । లౌనట్టిపురుషులు, నాదులింగపూజ । నలినిఁ జేయ
గలరొ యట్టిజనుల । కిల నసాధ్యము లేశ, మైన లే దొకప్పు । డైన నరయ

క. మనసార సర్వదుష్కృత, మునుఁ జేసిన నరుని కైనఁ । బూర్ణజ్ఞానం
బనయము నిర్మలమౌ నా, ఘనలింగార్చనముతోడఁ । గాశ్యపిలోనన్ 318

ఉ. పాతితలింగతారణము । బంధురవాంఛనుఁ జేసి భూమిపై
ఖ్యాతినిఁ గాంచు సన్నివాతి । యం దలరారెడిదా కొలంకులో
నీతతి నిల్పుఁ డావెనుక । నేత్తరమై హృదయస్థవాంఛలన్
బాతరలాడఁ బొందఁగల । వారు మునీశ్వరులార! మీరిలన్ 319

సీ. అది భువనత్రయ । మందు వేల్పులకెల్లఁ బూజనీయంబునై । పొసఁగి వెండి
లివిరి స్థాణ్వీశ్వర । స్థితమైనకతమున స్థాణ్వీశ్వరుండని । జగతిఁ జెప్పఁ
బడుచుండు నాస్థాణుఁ । బటుభక్తి నిత్యమేజనులు తలంతురో । సర్వపాప
నిర్ముక్తులై వారు । నెగడుచు నుందురు కైవల్యకాములై । క్రాలు నరులు

ఆ. దానిఁ జూడ నమల । తనుశోదు రని యిట్లు
శంభుఁ డాడ మునులు । సంతసించి
దారువనిఁ జెలంగు । దర్పకారాతిలిం
గంబుఁ దెచ్చుకొఱకు । కడఁగి రపుడు 320

క. ఆలింగముఁ గదలింపనుఁ, జాలక దేవతలు మునులు । చతురాననుది
వ్యాలయమునకును బోయిరి, వాలాయం బైనపాటు । వర్తింప వెసన్. 321

వ. అంత. 322

క. సుగుడియు నగుదుగినుఁడు బలు, వగతోడను భ్రాంతితోడ । వఱలెడువారై
పొగలెడివేల్పులమౌనుల, దిగులుఁ గని యిట్టులాడె । దివ్యమునీంద్రా! 323

ఆ. దేవదేవుఁడైన । దివ్యశంభునిచేత, లింగ మవనిమీఁద । లీల వ్రాలె
నట్టిదానిఁ దాల్ప । నసమర్థులైరి రా, పాటుకోఁడ నేమి । పరిఢవిల్లు 324

క. ఘనమండల మాకారణ, మున వేల్పుల నెల్లఁ గూడి । పురిహరుశరణం
బును బొందుద మాదేవుఁడు, కనికరమునఁ దాని చేర్పఁగలఁ డట దానిన్.

చ. ఇటుల వచింప నిర్జరముకనీశులు బ్రహ్మనుఁగూడి యంత ధూ
ర్జటిఁ గనుకోర్కెతో రజతశైలముఁ జేరి సమస్తఘోరసం
కటహరుఁడైనశంకరునిఁ గానక డెందములందుఁ బెద్దవే
సట బటువై పెనంగొన విచారముతో నని బ్రహ్మయోనితోన్ 326

క. దేవా! శంభుం డెక్కడ, వావిరినున్నాఁ డనంగ । వనజజుఁ డంతన్
దేవేశుఁ డా మహేశ్వరు, భావంబున మిగుల నరసి । భవుఁగని పలికెన్ 327

ఉ. ఓమునులార! యీశుఁడు మహోన్నతమాస్తిశరీరుఁడై ముని
స్తోమము సన్నుతింపఁ గడుతోషముతో సరసీతటస్థమా
భూమిని నున్నవాఁ డనఁగఁ బూర్ణపుభక్తిని ధాతఁగూడి వా
రామహిమాత్ము జూడ మతులందుఁ దలంచుచుఁబోయి భక్తితోన్ 328

ఆ. స్వయముగా భవుండు । భాసిల్లు పుణ్యకా, సారతటముఁ జేరి । సకలమైన
వాసములను వెదకి । భర్గునిఁ గనలేక, భూరిచింతతోడఁ । బొగిలి పిదప 329

బ్రహ్మాదిసురులు శివుని వెదకుట.

క. పరమేష్ఠిఁ గలిసి యంతటఁ, బరమేశ్వరు నరసి యరసి । భాస్వత్కుండిన్
కరమునఁ దాల్చి ముదంబునఁ, బరగెడి శివఁ జూచి ప్రీతిపరివృతు లగుచున్.

చ. పరిపరి మ్రొక్కి యోజనని! । భావజగర్వతమఃపతంగుఁడున్
సురపతియున్ సదాసముఁడు । సుందరవేషుఁడు దేవదేవుఁడా
హరుఁ డట మాకుఁ గన్పడును । హర్షముతో వచియింపు మావిభున్
విరివిగ నఁతట న్వెదకి । వేసటఁ జెందితి మంచు బల్కినన్ 331

ఉ. అంతఁ గృపాసమన్వితయు । నై పరమేశ్వరి వారిఁ గాంచి శ్రీ
కంతువిరోధి నిత్తతినిఁ । గన్గొనఁజాలుడు దీక్షలంబునన్
జింతిల నేల మీరమృతసేవనులై యటమీఁద శంభునిన్
బంతుఁగ నాత్మలం దెలిసి । వర్తిలఁగల్గుదు రింపుపెంపునన్. 332

క. ఈ విధమునఁ బరమేశ్వరి, భావం బలరారుచుండఁ । బల్కిన విని యా
దేవమునీంద్రస్తోమము, లావచనంబులను మిగుల । నాలించి తగన్ 333

ఆ. కూరుచుండి వేడ్క । గొమరారఁ దచ్చుచి
సుధను ద్రావి పిదప । సొంపుతో సు
భాసనాత్ము లగుచు । నంబికఁ బొడగాంచి
భక్తితోడ నిట్లు । పలికి రపుడు. 334

త్రా, పరంధామనిష్కామసంపూర్ణ కామా, నిరాకార, నిత్యోదయా, శర్వ, సర్వేశ్వరా, సంతతానంతయోనీ, సమస్తోరుభూతాధివాసా, మనోవాస, సచ్ఛర్మవాసా, నిరాభాస, సత్యస్వరూపా, దురారాధ్య, సర్వజ్ఞ, సంప్రార్థ్య, సంవర్త, సంకర్షణా, హంసరూపా, మహాహంసరూపా, మహారాజికా, సర్వదేవార్చితా, ముండికేశా, సురేశా, మహాయజ్ఞసంస్తుత్య, భద్రాత్మకా, శూలహస్తా, దురంతోరుసంసారదూరా, వహావీర, కైలాససంచార, భక్తార్తిహారా, మహాధీర, సాకార, ఘోరారిసంహార, మానీంద్రహృత్పద్మసంచార, నిత్యేశ్వరా, యాజకా, సర్వయజ్ఞేశ్వరా, యజ్ఞకర్తా, త్రినేత్రా, స్వయంభూస్వరూపేశ, యుష్మత్ప్రభావం బచింత్యం బజం బప్రఖండం బవాచ్యం బభేద్యంబునై యుండు, నీలోకజాలంబులన్ ధాతృరూపంబుతో సృష్టిఁ గాంచి విష్ణుస్వరూపంబుతో వృద్ధినొందించి కాలాగ్నిరుద్రోరురూపంబుతో నాశముం జేసి త్రైగుణ్యరూపాభరాముండ వై నిన్నుఁ బ్రార్థింపఁగా శక్తులన్ గాము నాగేంద్రభూషా, ఎదాధ్య స్తవోషా, సుధాతుల్యభాషా! నమస్తే నమస్తే నమః. 342

తే ఇట్లు బ్రహ్మాదిదేవము నీంద్రులెల్ల
భక్తితో వేఁడ భవుఁ డంతఁ బరమతుష్టి
హస్తిరూపంబు విడిచి సాంపార లింగ
సన్నిధానంబుఁ గావించి సరవి నపుడు. 343

హరుఁడు స్థాణులింగరూఁడై తల్లింగతీర్థమహిమఁ బలుకుట

సీ బ్రహ్మపురోగమ బర్హిర్ముఖులఁ జూచి మహితమానీంద్ర సమక్షమునను
బలికె. దీర్ఘప్రభావంబుఁ జెంగట నుండినట్టి యీ వరసరస్సధికపుణ్య
దాయకం బని చెప్పఁ దగు మఱి మన్ని వేశితమున మోక్షసంసిద్ధి నిచ్చు
నిట నెట్టివాఁడైన నీలింగదర్శనమునఁ గాంచుచుండురు మొనసి పరమ
ఆ పదసుఖంబు మిగులఁ బ్రతిదివసం బందు
నబ్ధి దాక నుండునట్టి సరసి
నర్థిఁ దెలమి నడుమ నలరార స్థాణుతీ
ర్థంబుఁ బొందు నిజము రమ్యదీప్తి 344

క ఈనుతిచేతను సతతం, బెనయఁ దలిభక్తి నొప్పి యింపుతలిర్పఁ
గా నన్నుఁ బొగడఁగలఁడో, వానికి సులభుండ శంకరవల దిఁక మీకున్ 345

చ అని భగవంతుఁ డౌ గిరిశుఁ డాదట నిట్లని యంత వారికిన్
గనులకుఁ గానరాక చనె గ్రక్కున నయ్యెడ బ్రహ్మదేవుఁడున్
మునులును సర్వదేవతలు పొందుగ శర్వునిఁ బ్రస్తుతించుచున్
జనిరి నిజాలయంబులకు సంతసమొప్పఁగ చుండ నోమునీ! 346

ఉ అంతట నాకలోకము జనావళిలోఁ గడు మిశ్రితంబునై
సంతత మొప్పెఁ దన్మహిమఁ జాలఁ గనుంగొని నట్టిపూరుషుల్

వంతలనెల్లఁ బోవిడిచి ǂ పాపవులోకము నొందుచుండె ర
త్యంతము దానిఁ జూచి సురులందఱు తల్లడపాటుతో వెసన్ 347

క. పరమేష్ఠి శరణుఁ జొచ్చినఁ, గరుణన్ బద్మజుఁడు వారిఁ ǂ గనుఁగొని యో ని
ర్జరులార! యేల యిచ్చటి, కరుదెంచితి రనుచుఁ బలుక ǂ నాలించి వడిన్ 348

క. సురు లిట్లని పల్కిరి యో, సరసిజభవ! మర్త్యులెల్ల ǂ స్వర్గంబున నిం
డిరి వారివలన క్షితిఁయు, నిరతము గల్గెడిని దీర్పు ǂ నేర్పున దానిన్ 349

చ. అనవుఁడు పద్మజుం డనిమి ǂ షయ్యమరావలికెల్ల ముఖ్యుఁడై
తనరు పురందరుం గనుచు ǂ ధాగణి పాంసువుచేతఁ దీర్థ మె
య్యన నమరంగఁ గాడి హిత ǂ మారసి పూడ్చు మనంగ నింద్రుఁడే
పున ఘనపాంసువర్షమున ǂ పూడఁగఁ జేసెను దీర్థ మత్తఱిన్ 350

క. దానికిఁ దోడ్పడిరి విబుధులు, మానితతీర్థంబు నట్టి ǂ మహిఁ బ్రుంగంగా
నూనిన శ్రద్ధం జేయఁగ, దానిం గని వారుఁడు క్రోధ ǂ తపశ్శాత్ముం డై 351

క. కర వజ్రము డిచియు దానిని, ధరఁ బడఁగొట్టంగ నిల్చి ǂ తత్తీర్థముఁ బా
హారలింగము వటవృక్షము, నుకుతిక్షీం గాచె మాను ǂ లోహా యనఁగన్

సీ. కావున నత్యంత ǂ పావనం బయ్యె నాతీర్థము భవపాదతీర్థ ǂ మగుట
నందు స్నానముఁ జేయ ǂ నఖిలతీర్థంబులఁ గ్రుంకినయట్టు లగుట నిజంబు
న్యగ్రోధలింగవ ǂ ధ్యక్షి శ్రాద్ధంబుఁ జేసినఁ బితరులు ǂ చిత్తతృప్తి
గాంతురు, దుర్లభ ǂ కాంక్షలఁ గూర్తురు, పాంసువర్షముఁ గాంచి ǂ పరమ మాను

ఆ. లందు నవయవముల ǂ నభిషిక్తములఁ జేసి, కొని పవిత్రు లగుచు ǂ జనుల కెపుడుఁ
బొందరానిపదవిఁ ǂ బొందిరి పరమేష్ఠి, యవ్విధం బెఱింగి ǂ యద్భుతగతి 353

వ. శిలామయలింగం బా పాంసుతలంబున నిలిపి యద్దేవు నరిగె 354

క. హారుతేజంబున లింగం, బురుతరతేజమున వెల్గ ǂ నొగి సద్దానిన్
నరులు స్పృశియించి విచ్యుత, దురితులునై పరమపదముఁ ǂ దోఁప్రొఁ జెందన్

ఆ. బ్రహ్మదేవ! వినుము ǂ పరువడిఁ దల్లింగ, దర్శనంబువలన ǂ ధాత్రియందు
సకలమైనభూత ǂ చయములు ముక్తినిఁ, జెందుచున్న విపుడు ǂ చెప్పనేల? 356

క. అన విని భగవంతుం డో, వనజజుఁ డమరులకు హితము ǂ వాటిల్లుటకై
యొనరించె నేడులింగము, లనుఁ బైపై దానియందు ǂ లాలితతేజా! 357

ఆ. అంత మోక్షవాంఛ ǂ నలరు సర్వులు పాంసు సేవఁ జేసి పరమ ǂ సిద్ధి కలిగి
రనిలుఁ డట్టి ధూళి ǂ నా కురుక్షేత్రంబుఁ, జేర్చె దానివలన ǂ తీరిన మిగుల

చ. గురుతరపాపయుక్తులయి ǂ క్రుమ్మలునట్టి జనంబులెల్ల శ్రీ
కర మగుశంభులోకమును ǂ గాంతురు నిత్యముఁ దెల్వి దెల్వి లే
మి రమణికిన్ మనుష్యనకు ǂ మించినపాపము స్థాణుతీర్థమున్
బొరిఁ గనినంతమాత్రమునఁ ǂ బోవును నిక్కము మానిశేఖరా! 359

క. విను లింగదర్శనముచే, తనువటనుఁ భక్తి నొనరఁ ॥ దాకుటచేతన్
పొనరు స్మృతియు జనులకు, ఘనముగ నంతయ యఘములదు ॥ మాన్యచరిత్రా! 360

ఆ. సతత మూర్తిదాని ॥ సన్నిధినుండిన, జలములో మునుంగు ॥ జనుఁడు బుద్ధి
వలయ ఫలము నొందు ॥ నట్టిజలంబుల, వలన నెపుడు భక్తి ॥ వఱలుచుండ 361

వ. పితృతర్పణముఁ గావించునోవాఁడు ప్రతిజలబిందువువలన ననంతఫలంబు నొందు నెవఁడేని స్థాణులింగపశ్చిమంబునఁ గృష్ణతిలలతో శ్రద్ధకలిగి శ్రాద్ధము పెట్టునో యాపురుషుఁడు తనపెతరుల మూఁడుయుగంబులదనుక సంతోషపెట్టినవాఁడగు నింతియకాదు మన్వంతరలింగస్థితు లెందాఁక వెలయు నంతదనుక నతని పితృదేవతలు తన్నిర్మలోదకముఁ ద్రావుచుందురు కృతయుగంబున సన్నిహితతీర్థము, త్రేతాయుగమందు వాయుహ్రదంబు, కలిద్వాపరమధ్యంబున రుద్రకరతీర్థము పుణ్యతమంబులై యుండుఁ, జైత్రబహుళచతుర్దశియందు నరుఁడా రుద్రతీర్థమున స్నానముచేసి పరమపదంబుఁ జెందుఁ, గార్తీకమాసమున రేయి వసించి పరమేశ్వరుని ధ్యానించినమనుజుఁడు తీర్థస్నానమువలన నాత్మగలఫలంబుఁ బెందు నని చెప్పి వెండియు నిట్లనియె 362

స్థాణులింగాశ్రితాన్యలింగప్రతిష్ఠావివరణము.

సీ. భవ్యవటోత్తర ॥ పార్శ్వభాగంబున నఖిలకామప్రదా ॥ యకము నగుచు
మొనయు మహాలింగ ॥ మునుఁ దక్షుఁడు నిల్పె నావటంబునకు నిం ॥ ద్రాశ విశ్వ
కర్మకృతం బగు ॥ ఘనలింగ మొప్పారు నది పశ్చిమాశను ॥ నద్భుతముగ
దానిఁ జూచినవాఁడు ॥ తద్దయు సంసిద్ధిఁ బొందు నక్కడ మహా ॥ పుణ్యలింగ

తే. భాసురాకారమున సర ॥ స్వతి యెనర్చు, నాయుర్భావలేని మ్రొక్కి ॥ నట్టి జనుఁడు
పొందుచుండును మేధను ॥ భూమిలోన, మానికులచంద్ర సద్గుణా ॥ వహితసాంద్ర!

క. వనజజుఁడు దానిపార్శ్వం, బున నిల్పెను వ్యా ॥ సలింగమును బూనికతో
జనుఁ గోట్రలింగదర్శన, మునఁ జెందును బరమపదము ॥ మోదం బలరన్ 364

క. విను నాస్థాణువటంబునుఁ, గని వలఁగొని నట్టిజనుఁడు ॥ కాశ్యపి నెల్లన్
బని గొని తిరిగినవాఁ డగు, మునినాథా! నిజము నిజము ॥ బుద్ధినిఁ దలఁపన్.

సీ. సంయమీశ్వరులార! ॥ స్థాణువటోత్తరమున శుక్లతీర్థంబు ॥ పొదలుచుండుఁ
దత్పూర్వదిశయందుఁ ॥ దనరుఁ బుష్కరతీర్థ మద్దానికిని పశ్చి ॥ మాశయందుఁ
దక్షతీర్థం బొప్పు ॥ స్థాణుతీర్థంబున కుత్తరదిక్కున ॥ నలరు నకుల
గణతీర్థ మివి పుణ్య ॥ కరములు వీనికి నడుమ స్థాణుండుండు ॥ నవ్యదీప్తి

తే. సప్తమిని ద్వాదశిని నెఱఁ ॥ దధికభక్తి
మొనసి యాతీర్థములయందు ॥ మునిఁగి స్థాణు
దర్శనముఁ జేయునో వాఁడు ॥ స్థాణుదయనుఁ
బరమపదమును జెందును ॥ భాసురముగ. 366

క. హరుపార్శ్వంబునఁ బార్వతి, పరమం బగులింగమూర్తి భాసిల్లును ద
ద్ద్వారలింగదర్శనంబున, బురుషునకును మోక్షమబ్బుఁ బుణ్యనిధానా! 367

వ. స్థాణు పశ్చిమభాగమందు నకులీశ్వరుండు గలఁడా మహేశునిఁ బూనిక నర్చిం
చినపురుషుఁడు సర్వపాపముక్తుం డగుఁ, దద్దక్షిణదిశయందు రుద్రకరతీర్థముండు,
దానిలో మునింగినవాఁడు కృతస్వార్థుం డగు. దానికుత్తరదిశయందు
మహాత్ముఁ డగు రావణాసురునిచేఁ బ్రతిష్ఠింపఁబడినదియు గోకర్ణాఖ్యకలిగిన మ
హాలింగము వెలయు నక్కడ నాషాఢశుక్లచతుర్దశియందు సోపవాసుండై మను
జుఁడు స్నాతుండై సకలకలుషహరుం డగు, నక్కడనె మేఘనాదుఁడు సిద్ధలిం
గముఁ బ్రతిష్ఠచేసె నట్టిలింగముఁ బ్రయత్నమునఁ బూజించినమానవుఁడు సిరిఁ
జెందు దానికిఁ బడమరదెసయందుఁ గుంభకర్ణునిచే స్థాపింపఁబడిన దివ్యలింగ
మొప్పారుఁ, దల్లింగమును జ్యేష్ఠశుద్ధాష్టమీవాసరంబున నుపవాసయుక్తుండై
యర్చించి వసించుపూరుషుఁడు సకలాభీష్టఫలంబు నొందు నందియమ్ము వలదు
సతత మీలింగములు మునిసాధ్యాశ్వివసుమరుద్వహ్నిభాస్కరాదులచేఁ
బ్రయత్నపూర్వకంబున నర్చింపఁబడుచుండు ననిపల్కి వెండియు నిట్లనియె 368

క. పెఱవా రగు మతిశూన్యులు, తెలుగనిచిత్తములతోడ స్థాణ్వీశ్వరునిన్
నెఱి నిల్పి పరమపదవికి, నెఱిఁదప్పకఁ జనిరి వేడ్క నిష్పంకులునై 369

తే. దేవదేవుఁడు శూలియు దివ్యవాసుఁ, డౌ మహేశునిసన్నిధియందు నెట్టి
లింగ ముండునో దానికిఁ బ్రీలఁ బార్శ్వ, గతయునై లింగరూపుతోఁ గ్రాలుదుర్గ.

క. మానితగోకర్ణముఁ గను, మానవునకుఁ బుణ్యఫలము మహిఁ జెంపారున్
మానుగఁ గోరియుఁ గోరకఁ, దానుర్విన్ జేయుపాపతతులు నశించున్. 371

క. వరదుఁడు పాపవిదూరుఁడు, కరుణాకరుఁ డైనభవునిఁ గాంతను గొలువన్
దురితములు సమసిపోవును, బరమపదంబును లభించుఁ బరమమునీంద్రా!

సీ. బ్రహ్మచర్యముతోడఁ బరఁగి కౌమారంబునం దెట్టిపుణ్య మొప్పారునట్టి
మహితపుణ్యంబు కుమారేశ్వరుని భక్తిఁ బూజించినందునఁ బొసఁగు మఱియుఁ
దత్ప్రసాదంబునఁ దద్దయుఁ గోరినధనరూపసౌభాగ్యతతులు వెలయు
దానికుత్తరమందు దైత్యేశుఁడౌ విభీషణుఁ డొక్క లింగంబు సరవి నిల్పె

తే. భక్తి దానినిఁ బూజించి ప్రా- నమరుఁ
డజరుఁడై వెల్గు నాషాఢమందు శుక్ల
పక్షమం దష్టమిని భక్తిభవునిఁ బూజ
చేసి యమృతత్వమును జెందు శిష్టచరిత! 373

క. ఆలింగమునకుఁ దూర్పున, లీలన్ బూర్ణేరితాఖ్యలింగము వెలయున్
శీలించుమతిని మనుజుఁడు, వాలాయము దానిఁ గొలిచి వాంఛలఁ బొందున్

తే. దుష్టదానవు లైనట్టి దూషణత్రిశిరులు సద్భక్తితో నట శివుని నిల్పి

పూజచేసి మనోభీష్టములను జెంది, సంతతంబున నలరిరి । త్తాస్థలమున 375

చ. పరమునీంద్ర! చైత్రసితపక్షమునందు మనుష్యుఁ డక్కడన్
విరివినిఁ గొల్చెనేని కడు । వేడుక వానికి నామహాత్ము లా
పురహరు లాత్మలో వెలయు । పూర్ణఫలంబులనెల్ల నిత్యమున్
బోరిఁబోరి నిచ్చి కాచెదరు । భూరిసుఖాత్మునిఁ జేసి చెచ్చెఱన్ 376

వ. స్థాణువటప్రాగ్భాగమందు హస్తిపాదేశ్వరుండు కలఁడు. నరుఁ డాశంకరుని దర్శించి జన్మాంతరకలుషరహితుండగుఁ, దద్దక్షిణాశయందు హారీతముని ప్రతిష్ఠితలింగ మొకటి కలదు అట్టిలింగమునకుఁ బూనికతో నమస్కరించిన పూరుషుఁడు పరమసిద్ధిఁ జెందు నట్టిలింగమునకు దక్షిణపార్శ్వంబందు నమ్మునివరుని నడబావి కలదు దానియందుఁ త్రైలోక్యవిశ్రుతం బగులింగ ముండు నది మహాత్ముఁడును గాలరూపుఁ డగురుద్రునిచేఁ బ్రతిష్ఠింపఁబడినదై సర్వపాపంబుల నశింపఁజేయునదియు శివంకరమైనదియు భుక్తిముక్తిఫలప్రదంబై రాజిల్లును. తల్లింగదర్శనంబువలన నరునికి నగ్నిష్టోమాతిరాత్రఫలంబులభించు, దానికిఁ బశ్చిమదెసన సిద్ధలింగము కలదు సతత మది సర్వసిద్ధిప్రదాయక మగుసిద్ధేశ్వరలింగ మని వన్నెకెక్కుచుండుఁ దద్దక్షిణాభాగమందు మార్కండేయప్రతిష్ఠితలింగము వెలఁగు, దానిదర్శనము సిద్ధిదాయకం బయియుండు నాలింగమునకుఁ బ్రాగ్దిక్కున సూర్యప్రతిష్ఠితలింగ మొప్పారునది సకలకలుషహారమగుదివ్యలింగ మని పేర్కొనంబడుఁ; జిత్రాంగదుం డనుగంధర్వుఁడు వేల్పువెల్లాటకత్తెలలో మేటి యగురంభయుఁ బరస్పరానురాగమున స్థాణుదర్శనంబుఁ గోరివచ్చి తన్మహేశ్వరునిఁ గని భక్తి నర్చించి పిదప నన్యోన్యానురాగులై తత్థ్సలమందు రెండుమహేశ్వరలింగములఁ బ్రతిష్ఠచేసిరి వానిఁ జూచిన మనుజులు సుభగులు దర్శనీయులు సత్కులసంజాతు లగుదు రని పలికి సనత్కుమారుఁడు వెండియు నిట్లని వక్కాణించె 377

క. మునివర! దానికి దక్షిణ, మునఁ బురహూతుండు నిల్పి । పురహరులింగం
బును నరుఁడు తత్ప్రసాదం, బున నాత్మేప్సితము నొందుఁ । బుధు లుల్లసిలన్

శా. పారాశర్యమునీశ్వరుం డట శివున్ । బ్రార్థించి దర్శించి వి
స్తారోదారకవిత్వమున్ బడసె వేదవ్యాసమౌనీంద్రుఁ డిం
పారంగా భవు వేఁడి తత్కృపను సర్వజ్ఞత్వమున్ బ్రహ్మ వి
ద్యారజ్ఞానము నొంది వేడ్క నలరెన్ । త్తాభాగమం దున్నతిన్ 379

తే. స్థాణు పశ్చిమదిక్కున । దనరుచుండు, హిమవదీశ్వరలింగము । హీనదీప్తిఁ
బుణ్యకరులకు నాయగు । పూర్ణసిద్ధి, దాయకం బై చెలంగును । దాపసేంద్ర!

క. విను దానికిఁ బడమరఁ గను, వినుతుం డగు కార్తవీర్య । విభుఁ డురుభక్తిన్
దనరుచు నొకశివలింగం, బును నిల్పినవాఁడు నయ్యుఁ । బూర్ణేచ్ఛుండై. 381

ఆ. అద్ది సకలపాప హారమై చెలంగును
నరుఁడు దానిదర్శనమున విగత
పాపుఁ డగుచు వెలసి భాసురదీప్తితోఁ
బరమశివునిపదముఁ బడయునపుడె 382

క. అనఘా! దానికి నుత్తరమున నిల్పె సుపార్శ్వుఁ డొక్క పురహరులింగం
బును దానిఁ గొలిచి శ్వాసనుని,తనయుఁడు సంసిద్ధినొందెఁ దత్కృపవలనన్

సీ. మునినాథ! తల్లింగమునకుఁ దూర్పునఁ బ్రభవిష్ణుఁడౌ విష్ణుండు విపులశక్తి
దనుజభంజనుఁడు సుదర్శనుం డనుశివుఁ జక్రాంతకంబుగా సగనినిల్పి
పూజించె మున్నుఁ దత్పూర్వభాగంబందు వాసవవరుణులు భవ్యతరము
లగులింగముల రెంటి నట నిల్పి రవిసర్వకామప్రదంబులై క్రాలుచుండు

తే. దత్తవర్గాకులైనట్టి తాపసులు స్వస్వతిశ్వర శంకరదివ్యలింగ
ములను నిల్పిరి వానికి భూమిలోన,సంఖ్యలేకుండు నిజముగ సంతతంబు

క. మునివర! ఘోషవతీవ , తనరునో యొండాక ధరణిఁ దదుదీచినెగ
గన స్థాణునికినిఁ బశ్చిమ, మున లింగము లొక్క కోటి పొదలుచు నుండున్

క. దానికిఁ బూర్వస్థలమున, మానితు లగువాలఖిల్యమహామునులు సు
జ్ఞానఫలసిద్ధికొఱకు భ,వానీపతిలింగకోటిఁ బరమప్రీతిన్ 386

తే. సన్నిహితదివ్యవారకాసారభూమి
దాఁక నిలిపిరి స్థాణ్వీశు దక్షిణమున
యక్షగంధర్వకిన్నరు ల్వారుని లింగ
ముల నసంఖ్యాకముల నిల్పి రెలమి తాని! 387

క. పోడిమి నొప్పిన వగుచుఁ, మూఁడున్నరకోటిలింగములు పొందికతో
నాడఁగల వనుచు శ్వాసనుం డాడె బుధేంద్రులు వినంగ నతిహర్షమునన్ 388

తే. సంఖ్య లేనట్టి లింగము స్థాణు దేవ
భవ్యవాసాశ్రయంబులై పరఁగుచుండుఁ
గనిరి దీనిని మగిలోనఁ దెలిసి స్థాణు
నాశ్రయించంగ నా నరుఁ డవనిఁ బూని 389

క. కారణ మేమన స్థాణుని, సానుగ్రహముతోడఁ జనుఁ డాత్మనుఁ బెం
పారుఫలంబునుఁ జెందును. బారము లేకుండ మునివర! ధాత్రిపయిన్ 390

తే. కోర్కె కలిగినమానవు లోర్కె లేని
పురుషు లాస్థాణుమందిరమునకుఁ జేరి
రేని నిర్ముక్తపాపులై యీశులోక
మందు భాసిల్లుచుండురు హర్షమొప్ప 391

సీ. వర్తితమధుమాస । పాండునక్షత్ర త్రయోదశీతిథియందు । యోగ్యశుక్ర
చంద్రార్కయుతయోగ । సత్పుణ్యవాసరమందు లోకేశ్వరుఁ । డైననలువ
కడుభక్తి స్థాణులిం । గము నిల్పె ము న్నటఁ జిరకాలముననుండి । సిద్ధసాధ్య
మునిపూజితంబు నై । భువి నవి యొప్పారె నా కాలమున నరు । లశనహీను
ఆ. లగుచు శ్రద్ధతోడ । నాస్థాణులింగమ్ముఁ, బూజచేసిరేని । పురహరేశు
పరమపదమునకు నెగులఁ । బొత్తురై యుండుదురు, నెంచి చూడ్మ లేదు । సంశయమ్ము.
క. మనుజులు పెయ్యారుఁ నం, దనమవముఁ దెలిసి భక్తి । తత్పరుఁ డగుచున్
దనరి ప్రదక్షిణమునుఁ జేసిన విను మాఘునిఁకలను । చిత్తం బలరన్. 393
క. ఎరి నధిపతివగ గానన, వరప్రదీప్తమూర్తి । వసుమతి నెల్లన్
దిరిగి కడుఁ బూన్కి వలఁగొను, నరుఁ ఫలమును జెందు పూని । నాయక కీర్తిన్.
క. పరమేశ్వరపదసేవా, పరులౌ సజ్జనులు విగత । పాపులు నై దు
ర్భరసంసారసముద్రముఁ, బోరి దాఁటుదు రంత్యకాల । మున నురుదీప్తిన్. 395
క. అనిన మునిఁ దన్నుఁ దలంచెను, మనుజుల సత్కారుణతో । నుమాపతి ప్రోచున్
గనుక సమస్తజనంబులు, మనసిజహరుఁ దలచు టొప్పు । మాటికి భక్తిన్ 396
క. లలితాంబరమణివనితో, జ్వలసుతవేశ్యాదు లెల్లఁ । జరించుచుఁ గాఁ
గలలోఁ గన్నపదార్థం, బులవలె నస్థిరము లగుచుఁ । బొల్పారు ధరన్. 397
తే. అనఘ! సంసారసాగర । మందు మునిఁగి, తీర్పఁ దలఁపక నిత్యంబు । సంతసమున
విఱ్ఱవీఁగుచు నున్నారు । వెఱ్ఱిమనుజు, లకట! వారలకిష్టమే । మని వచింతు.
వ. ఇట్లు సనత్కుమారుఁడు భాషింప నాకర్ణించి మార్కండేయుండు తరువాత
వృత్తాంతంబుఁ బలుకు మని యడుగుటయు 399
క. నిరుపమమంగళ చరిత, కరుణాకర పరమధీర । భాసురహారా
పరమసుఖాకర మురహర, నిగమాంతచార । నిఖిలోద్ధారా! 400
చ. పురహరచాపఖండన । విభూషణ సంతతి గాత్రమండనా
వరసురసిద్ధసాధ్యముని । వర్యముఖోత్కర నిత్యభావనా
ధరణిసుతా మనస్సదన । దారుణరాక్షసచక్రభేదనా
నరపతిసన్నిధానభవ । నాశన భాస్కరవంశపావనా 401
మందాక్రాంతవృత్తము సర్వాతీతా సకలవినుతా । సర్వవాక్యాభిపూతా
సర్వాధారా సుగుణనిలయా । సర్వగీర్వాణధీరా
సర్వాధీశా సరసవచనా । సర్వవిశ్వప్రధానా
సర్వాచారా సమధికతరా । సర్వకార్యప్రచారా 402

గద్య. ఇది శ్రీరామచంద్రకరుణాసమాసాదితకవితాప్రభవ, హారితసకులాన్వయ ప్రభవ, రామవజ్ఝలవంశదుగ్ధసాగర సుధాకర కొండయకుమార బుధజనవిధేయ కొండయనామధేయప్రణీతంబగు తెలుఁగువామనమహాపురాణమందుఁ బంచమస్కంధము.

---

శ్రీరస్తు

శ్రీసీతా లక్ష్మణ భరత శత్రుఘ్న హనుమత్సమేత శ్రీరామచంద్రాయ నమః.

# తెలుఁగు వామనపురాణము

## షష్ఠస్కంధము



రఘువరకులసోమా!
సోమాదిదిగీశ వినుత। సుందరనామా!
నామావళీస్మృతాసుర
ధామా ధామాభిరామ। దశరథరామా! 1

తే. అవధరింపుము రామచంద్రా! సనత్కు
మారుతోడ మృకండసు।మారుఁ డనియెఁ
దానేశ్వర స్థాణుతీర్థప్రభావ
మును వినఁ గోరుచున్నాఁడఁ। బూర్ణభక్తి 2

క. ధారణిపై నఖిలాఘుని, వారక మగుసిద్ధి నొందఁ। బడె నెవ్వనిచే
నారమ్యపుణ్య సుస్థలి, గారవమునఁ దెలుపు మిపుడు। కరుణాసింధూ! 3

సీ. ఇట్లు మార్కండేయుఁ। డెలమిఁ బ్రార్థించిన మాన్యుఁడై నసనత్కు।మారుఁ డనియె
మునిచంద్ర యేతీర్థ।ముఖ్యప్రభావంబుఁ బురుషుఁ డాకర్ణించి। భూరిపాప
ముక్తుఁడై చెలఁగునో। మొనసి యాస్థాణుతీర్థప్రభావం బెల్లఁ। దాల్మి వినుము
సర్వచరాచర।సహితప్రపంచ మంతయు వారిమయము నై। తనరుచుండ
ఆ. విష్ణు నాభినుండి। విశ్వకరుం డగు, బ్రహ్మ కలిగె నతని।వలన దివ్య
పురుషుఁడౌ మరీచి। పుట్టె నాతనికిఁ గ, శ్యపుఁడు సంభవించె। జగము లెన్న

క. ఆకశ్యపునకుఁ గల్గె వి, భాకరుఁ డాతనికిఁ గల్గెఁ। బ్రభతో మనువా
శ్రీకరుఁ డోకతతిఁ దుష్మిర, నాకస్మికముఁ గను మొగము।వందు మునీంద్రా! 5

క. చతురంత రైయవపుడమికి, పతియు సుధర్మావనుండు। భవహారుఁ డగుభూ
పతి యొకఁడు కలిగె దీప్తిఁ, గురునరపతి యనెడిపేర। క్షోణీస్థలిపై 6

తే. భయకరయుఁ గాలపుత్రియు। భయసమాహ్వ
యాన్వితయు నై చెలంగెడి। యతివ వాని

నెలఁతకై యొప్పె మృత్యుసన్నిధివలనను
విబుధులెల్లనుఁ గనుఁగొని వింత నొంది 7

మృతసుతుఁ డగు వేనునిచరితము

ఉ. దానికిఁ బుట్టె వేదములఁ బద్దయు నింద నొనర్చువాఁడు దు
ర్మానసుఁ డైన వేనుఁ డనుమానవనాయకుఁ డొక్కఁ డామహీ
జానియు నా తుతుండు నిజజాతుఁడు దుష్టజనాభిరాముఁ డౌ
వేనునిఁ జూచి చింత మది వేండ్రమునై వెలుఁగొందుచుండఁగన్ 8
క. ఘోరవనిఁ జేరి యక్కడ, దారుణతప మాచరించి ధర్మోద్ధతితో
సారెకు రోదసి నెల్లన, పారంబుగ నిండఁజేసి ప్రాజ్ఞులు మెచ్చన్ 9
మ. పునరావృత్తి విహీనమైనపదమున్ బొందె న్మహాదీప్తి గ్ర
న్న వేనుండు సమస్తరాజ్యమునకు న్నాథుండునై సర్వప
త్తనజాలంబులఁ బాడుచేసి శ్రుతినిందాతత్పరుండై మహా
జనులన్ గాఱియపెట్టి దుష్టమతియై త్యాగాగమం దంతటన్ 10
చ. అరదము నెక్కి భూగగనమం దతఁ డొక్కఁడె యొంటిపాటునం
దిరుగుచు దుష్టకార్యములఁ దెంపున జేయుచుఁ గ్రాలి మత్తసిం
ధురగతి విజృంభించుచును దూషితవర్తనయుక్తితోఁ జనో
త్కరములఁ జూచి పల్కెఁబటు ధైర్యము మీఱఁ గ్రమక్రమంబునన్ 11
క. అవ్వ్యయగతి నే నుడివెద, సువ్యక్తస్థితిని వినుఁడు సొంపార *నయ
ష్టవ్య మదాతవ్య మహో, తవ్యము భూదేవదేవతతి కెపుడు ధరన్ 12
క. నే నొకఁడ నీజగంబున, మానుగఁ బూజ్యుండ మీకు మఱి యందఱకున్
మానితుఁడ సిద్ధకిన్నర, దానవసురసేవితుండఁ దథ్యం బరయన్ 13
క. నాచేఁ బాలితు లగుచున్, భూచక్రమునందు సుఖముఁ బొందుఁడు తమినే
సూచించుపలుకు నాత్మల, వాచస్పతివాక్య మనుచు భావింపఁదగున్ 14
క. ఏకడ నైనన్ బ్రాహ్మై, వీఁక న్వరియించుచుంట విబుధులలోనన్
నాకంటె నన్యదైవము, మీ కెక్కడఁ గలఁడు చూడ మేదినియందున్ 15
క. అని యీకైవడి వేనుఁడు, జనులకు బోధింప సకలసంయము లాదు
ష్టునిభాషణంబు విని తమ, మనసులు చింతాబ్ధి మునిఁగి మల్లడి నెందన్. 16
క. కనలి పరస్పరమున నా, జనవాథుని చెంతఁ జేరి సరసోక్తుల ని
ట్లనిరి ప్రమాణము ధర్మం, బున కామ్నాయంబు కాదె భువనాధీశా! 17
క. ఆకారణమున జన్నము, నాకేశప్రముఖదేవనాథుల కెలమిన్
లోకముల సుప్రతిష్ఠిత, మై కడువిలసిల్లుచుండు నతిశోభనమై 18

* అయష్టవ్యము = దేవతలసేవింపరాదు. అదాతవ్యము = బీదసాదులకీయరాదు. అహోతవ్యము = యజ్ఞాదులందు దేవతాప్రీతిగా హోమములు చేయఁదగదు.

సీ. అవనీశ నాకస్థు । లైనసుపర్వులు మఖములు లే కెట్లు । మహితతోష
సంయుక్తు లగుదురు । సంతతగతహార్ష్ణు లై వేల్పు లఖిలసౌ । ఖ్యాభివృద్ధిఁ
గావింపకుందురు । క్రతునిర్జరులచేత వసుధయెల్ల భరింపఁ । బడుచు నుండు
నని యిట్లు మౌనీంద్రు । లాడినవాక్యముల నాలించి వేనుఁ డ । త్యుగ్రహత్త
తే. సహితుఁడై క్రోధదృష్టిచే । సకలమౌని
వరులఁ గన్గొని భూసురో । త్తముల కెవ్వఁ
డైన నిడఁగూడ దమరుల । కధ్వరములఁ
జేయఁ దగదని పలుమారుఁ । జెప్పుచుండె 19

ఆ. అంత సర్వమౌను । లతికోపభరితులై, వజ్రయుక్తభూరి । పరమమంత్ర
కుశలవలన వేను । కుంభినీశుని గత, జీవుఁ జేసి రపుడు । చిత్ర మొదవ 20

ఉ. పిమ్మట సర్వలోక మతి । భీతి నరాజకమై తమస్సుతోఁ
గ్రమ్మిన దయ్యె మానవులఁ । గౌతుక మొప్పఁగ దస్యులెల్ల వే
గమ్మున నొవ్వఁ జేయఁ గని । గాఢభయంబున వారు మౌనిసం
ఘమ్ముల ప్రాపుఁ జేరి తమ । కష్టపురీతులఁ జెప్పి రంతటన్ 21

మ. మును లావేనుని వామహస్తమును బ । ల్పున్ మథింపన్ జనిం
చెను హ్రస్వాంగుడు నైనపూరుషుఁడు వి । స్మేరంబుగాఁ దత్క్షణం
బున వానిం గని సర్వమౌనివరులో । మూఢాత్మ! భూభాగమం
దు నిషాదుండవె యూరుదు వీ వనుచు దో । ట్రో బల్కి రో తాపసా! 22

క. ఆ కారణమున వేనుని, డా కల్మషమున జనించి । రధికోద్ధతులై
భీకరరూపనిషాదు ల, నేకులు తత్కాలమందుఁ । బృథ్వీస్థలిపై. 23

సీ. అంత మౌనీశ్వరు । లానృపునతుని హస్తంబుఁ బలుమాఱుఁ । లదిమి త్రచ్చ
దివ్యమహీధ్రప్ర । తీకాశుఁడును ధనుర్బాణాంకితాయత । బాహుఁ డతుల
చక్రధ్వజోత్కర । సహితుఁ డౌ నతియోగ్యపురుషుండు పుట్టె నా । భుజమువలన
వానిఁ గన్గొని వాస । వప్రముఖామరు ల్పుడమి కాసుజనుని । భూమిపాలుఁ
ఆ. డైన రాజుఁగాఁగ । నభిషిక్తుఁ జేసిన, నావిభుండు భూమి । నంత ధర్మ
రతుఁడు నగుచు మిగులఁ । రంజింపఁ జేసెను, సకలజనులు చూచి । సంతసిల్ల.

చ. జనకవిరంజితంబు నయి । చాలఁ గలంగెడి రాజ్యమెల్ల నా
జనపతిపాలితం బగుచు । సంతతభూరిసుఖాకరస్థితిన్
దనరెను వెండి యాతనికి । ధారుణిఁ బంజనుఁ డోటచేత రా
జనురమణీయశబ్దము ప్ర । యాణమున న్నిక్కలఁ బర్వె దీప్తితోన్ 25

సీ. ఆవైన్యపార్థివుఁ । డఖిలరాజ్యము నొందినట్టివాఁడై యుండి । యధికభక్తి
దంలించె నీరీతి । తలితిని యజ్ఞనకుఁ దాధర్మిష్ఠుఁడును స । త్ప్రతంతు నాశ
కరుఁడు నై వర్తించె । గడిమి నాతని కెట్టు లాముష్మికసుఖావ । హంబు నగుచు

దనరెడినిం జేయఁ దగియుండు నని మదిఁ దలఁపోయుచుండిన తఱినిఁ దనదు
అ కడకు నారదుండు కరమర్థి రాఁజూచి, హర్ష మొప్పు నతని శాసనంబు
నిడి నమస్కరించి పృథుభక్తి నను ముని, వంశదీప వినుము పరమదయను
వ మునీంద్రా! నీవు సకలలోకశుభాశుభము నెఱిఁగినవాఁడవు, నాతండ్రి యగు వేనుఁడు దురాచారుఁడును దేవబ్రాహ్మణదూషకుఁడును స్వధర్మరహితుఁడై వెలసి పరలోకగతుండయ్యె నన విని నారదుం డపుఁ డాత్మజ్ఞాననేత్రమున నా మహీపాలునిగతి నెఱిఁగి పిదప రాజేంద్రున కిట్లనె; భవజ్జనకుఁ డగు వేనుఁడు మ్లేచ్ఛులనడుమఁ బుట్టి క్షయకుష్ఠురోగములతోఁ బీడింపఁబడుచున్నవాఁడయ్యె అని యిట్లు మహాత్ముఁడైన నారదుఁ డాడు నావాక్యము నాలించి నృపలలాముఁడు మిగుల వగచి నాచేఁ గార్య మెట్లు చేయఁదగిన దగు నని కొంతదనుక నాలోచించుచుండ నామహాత్మునకు లోకమందు దేవఁడు భయమువలనఁ బిత్రురక్షణముఁ గావించునో యట్టినరుఁడు సుపుత్త్రుఁడు కాని తక్కినవాఁడు కాఁ డను బుద్ధి పొడమె, నంత నారాజు నిజమనోగతభావంబు నారదునకు విన్నవించిన నామునివర్యుఁడు హర్షించి ప్రశ్రయముఁ గాంచి రాజవర్య! నీ వాతనికళేబరము తీర్థములయందుఁ బవిత్రమైనదానిఁగఁ జేయుము; మహాతీర్థ మగుసన్నిహిత సరస్సునకుఁ బొమ్మని చెప్పి నారదుం డరిగె అంత నృపాలుఁ డమ్మునినాథువచనమును విని యాదేశమునకు నేఁగ నరసి గమనోన్ముఖుండై చని యట కుష్ఠక్షయరోగములతోఁ గృశించుచున్న తండ్రిం గని ఖిన్నమనంబున ఘనంబగుశోకంబు వ్యాప్తంబై మిన్నందుచుండఁ బొగులుచు నమస్కరించి మ్లేచ్ఛులం జూచి. 27

సీ. అయ్యయో మ్లేచ్ఛులారా నేఁడు నాతండ్రి కెంతకష్టమువచ్చె నేను యందు
నితని నాగృహమునకుఁ గొనిపోయి గతరోగునిఁగ జేయఁగల నటంచు
దలఁపుడీ మీరని ధరణీశుఁ డాడినఁ బ్రణతపాంగులై పరఁగి మ్లేచ్ఛు
లంద ఱాపురుషు దయామూర్తిఁ గాంచి యట్లనీకుఁ దెలిసినదానిఁ జేయు

ఆ. మన నతండు వేడ్క నంతటఁ బల్లకి
మోయఁ జాలినట్టి పురుషవరుల
సొరిఁ బిలిచి దివ్యగుణశుల్కము నిడి సుఖ
గతిని జనకుఁ జేర్చెఁ గడగు గొల్ల 28

క అని యిటుల దయాపరుఁడౌ, జననాథుఁడు పల్కు నతని సరసపువాక్యం
బును విని మ్లేచ్ఛులు వేనుని, ఘనశిబికావాహు లగుచుఁ గదుపడితోడన్.

తే. భూరిపుణ్యకురుక్షేత్రభూమి కరిగి
సరవి నట నుండునట్టిదా స్థాణుతీర్థ
వర్యమున్ దాఁటి యవ్వలి వసుధ కేఁగి
రట్టియెడ వేనసుతుఁడు మహాధ్యాత్మ్యుడుండు 30

క. తనజనకుని నాతీర్థం, బున భక్తి న్ముంచుటయును । బుద్ధిఁ దలంపన్
గని వాయుదేవుఁ డాకస, మున నుండి వచించె నిట్లు । భూపతి వినఁగన్. 31

క. ఓతండ్రి! సాహసము నీ, వీతనికిఁ గావింపవలదు । హృష్టతరశ్రద్ధా
జాతోత్కర్షను దీనినిఁ, జేతఃప్రీతిఁ గనుఁ బ్రోవు । శివమగు నీకున్ 32

సీ. వినవయ్య యీతఁడు । విపులదారుణపాపసంహతితోడను । జాల వెలసె
నామ్నాయనింద య । త్యధికపాపం బగుదానికిఁ దుద లేదు । తలఁప నట్టి
కలుషాత్ము నీతనిఁ । గడఁగి ముంచినయట్టి నీపుణ్యతీర్థంబు । నిపుడె చెడుపఁ
గలఁడు నిశ్చయమని । గురువలి భాషింప నావాక్యములను నృ । పాత్మజుండు

తే. విని మహాశోకమూర్తిలో । వెలయ జనకు
దుఃఖమునుఁ జూచి గురుతర । దుఃఖసహితుఁ
డగుచుఁ నిర్వేదపాటుతో । హా యటంచుఁ
బలుక సాగెను భక్తితోఁ । బరమపావని! 33

మ. ధరపై నీతఁడు ఘోరపాపయుతుఁడై । తానుండె నీకాలమం
దరయన్నాకపురస్థులెట్లిపుడు ప్రాయశ్చిత్తముల్ సత్కృపా
కరులై నాకు వచింపఁగాఁ గలరొ నేఁ । గావించెదన్ దానిసు
స్థిరచిత్తస్థితి నంచు వేఁడ విబుధు । ల్చిత్తంబులం బొంగుచున్ 34

శా. ఆరాజన్యునితోడఁ బల్కిరి మహీశా! సర్వతీర్థంబులన్
సారెన్ మున్గి విశుద్ధవారిఁ గొనుచున్ । సద్భక్తియుక్తుండవై
చేరన్ వచ్చి సమస్తపాపములు ని । శ్శేషంబులై దాఁకఁ జ
న్నారంగా నభిషిక్తుఁ జేయు మితఁడా । నత్యంతపూతుం డిలన్ 35

చ. అనఘ! సరస్వతీజలము । లం దతిభక్తినిఁ గ్రుంకి ముక్తికిన్
జను నితఁ డాత్మపోషణుఁ డ । సత్యచరిత్రుఁడునై సురౌఘమున్
బనిఁగొని నిందచేసి గురు । పాపవిముక్తుఁడునై ధరాస్థలిన్
దనరుటచేత నెన్నటికి । దద్దయు నిర్మలుఁ డౌనె చూడఁగన్ 36

సీ. నరపాల! యాకార । ణంబున నీ విప్పు డితని నుద్దేశించి । పృథులభక్తి
మెనసి తీర్థములందు । మునిఁగి యాజలములచే వీని నభిషిక్తుఁ । జేయు మవలఁ
గతకల్మషుండు కాఁ । గలఁ డని భాషింప నాలించి యతనికి । నాశ్రమంబుఁ
నిర్మించి నృపుఁ డంతఁ । నిజపితకొఱకునై తీర్థయాత్రకుఁ జని । దినదినంబుఁ

తే. తీర్థములఁ గ్రుంకి యాతీర్థ । దివ్యపుణ్య, వారితో నాత్మజనకు న । వారిఁగాఁగ
స్నాతునిగఁ జేసె నత్యంత । కౌతుకమున, తాపసామలకులచంద్ర । ధర్మసాంద్ర!.




ఆ. అట్టితరుణమందు । నచ్చోటి కొకశున, కంబు వచ్చె దాని । కథను వినుము
పూర్వమందు స్థాణు । పుణ్యమఠంబున, నద్ది ధర్మకర్త । యగుచు నుండు. 38

క. అనిశము పరిగ్రహంబై, తనరెడివిత్తంబు దేవధనసందోహం
బును దమిరత్మ యొనర్చెడి, జనుఁడై విలసిల్లి మఱియు జగములకెల్లన్. 39

క. సరసప్రియుఁడై నిర్జర, వరకార్యరతిన్ జెలంగువాఁడును నై సు
స్థిరబుద్ధితోడ నతఁ డట, బొరిఁబొరి వర్తించుచుండెఁ బుణ్యనిధానా! 40

తే. ధర్మమార్గస్థితుండు నై తనరి పెద్ద, కాల మీమాడ్కి నాతండు గ్రాలుచుండ
నతని కాయెడ దేవర్షి తాపహర, లిగ మా చిత్త మెప్పారెఁ గడిమి మౌని!.

ఉ. అంతనె వాఁడె ధర్మమున నట్టి ధరాస్థలిఁ గూలి శ్యామలా
కాంతుని చెంగట న్నిలువఁ గ్రౌర్యముతోడ నతండు కోప మ
త్యంతరయంబునన్ బెరుగ నాతనిఁ గన్గొని యోదురాత్మ! నీ
వింతటఁ గుక్కవై పెఁగి పృథ్వి జనింపు మటంచుఁ బల్కినన్ 42

సీ. సంయమీశ్వర! వాఁడు సౌగంధికారణ్యమున సారమేయమై పుడమిఁబుట్టి
పెద్దకాలం బటఁ బ్రీతితో విహరించి తద్దయు శునకయూధములవలన
నంతఁ బరిత్యక్తుఁడై పరిభూతితో వెలయుచు నాకుక్క విపులశోక
మునఁ బొగలుచు దైవతపుణ్యవనంబును విడిచి వేగంబున విమలపుణ్య

ఆ. సన్నిహత్యనామసరసికిఁ జని నంత, మాత్రముననె స్థాణుమహితవీర్య
శక్తి నధికకామసహిత డై యనసర, స్వతినిఁ గ్రుంకి విగతపాప యగుచు

క. అనఘా! భక్షణలోభ, మ్మున నాశునకంబు మిగులఁ బొగలుచు స్థాణ్వీ
శుని దైనపుణ్యమఠమున, కును జనె నా కాలమందు ఘోరపుఁ దృష్ణన్. 44

ఆ. భయముతోడఁ గూడి వచ్చినకుక్కను, వేనుఁ డప్పు డంటి వేగ స్థాణు
భవ్యతీర్థమందు భక్తితో స్నానంబు, చేసె నట్టితటినిఁ జిత్తశుద్ధి 45

చ. పలితుఁడు నయ్యు నాతఁ డతి పావనపుణ్యదపూర్వతీర్థబిం
దుతలిని సంప్లుతుండు నయి దోషవిముక్తినిఁ జెందెఁ నామహీ
పతితనుజాతవారివర బంధురశీకరసిక్తుఁడై విర
క్తత సువిలోకనత్వమునఁ గ్రాలినయయ్యను కుక్క పం బటన్ 46

ఆ. వేనుఁ డపుడె స్థాణువిపులప్రభావంబు, తోడ బుత్రతారితుండు భవ్య
తనుఁడునై చెలంగి స్థాణునకును మ్రొక్కి, సన్నుతింపఁ దొడఁగె సత్యనియతి.

### వేనుఁడు స్థాణునిఁ బొగడుట

క. ఈశ నచంద్రభూషా, ధీశా లోకేశ పార్వతీరమణీశా!
కేశవవినుత మహాదేవా శంకర సత్యనికరపందన మభవా!. 48

సీ. సర్వశత్రువినాశ సర్వదేవాధీశ బలవైరిసంహార పరమశూర
సర్వదైత్యామరసంఘసంపూజిత రాజరాజప్రియ రమ్యగేయ
చారుసహస్రలోచన విరూపాక్ష నేత్రత్రయ నీవు సర్వంబు నగుచు
బహుపాదబహునేత్ర బహుశీర్షముఖుఁడవై వేదమయస్థితి వెలయుచున్న

ఆ. వాఁడ వద్ధి సదన వరద మహాకర్ణ, శంకుకర్ణ నాగ చటులనాథ
కర్ణ కుంభకర్ణ కరకర్ణ గోకర్ణ, వందనంబు నీకు వంద్యవంద్య! 49

క. శతదశపటుశీర్షంబుల, శతదశపాదాంబకముల సర్వస్థలమం
దలిదీప్తి వెలయు నీకును, సతతము మ్రొక్కెదను భక్తి సర్వాభరణా! 50

క. దేవా! గాయత్రీముఖ, దేవీచక్రంబు నిన్ను దృఢతరభక్తిం
భావించి పాడుచుండును, భావంబలరారుచుండఁ బ్రత్యహమందున్. 51

క. హరిదశ్వాయననిరతులు, సురనాథుని మూర్ధ్నమందు సురుచిరలీలం
గరము వసించుచు నుండెడి, పరమేష్ఠిని గాఁ దలంతు పటుభక్తి నినున్. 52

ఆ. భూరిరూప! నీదు మూర్తియం దబ్ధిభూ, సర్వదేవచయము సరవి నెప్పుడు
గోష్ఠభూమియందుఁ గొమరొప్పు గోవుల, వలె వసించుచుండు ఫాలినేత్ర!

సీ. భగవానుఁడా! నీదు భవ్యకాయంబున వాణీశగురుసూర్యవరుణసోమ
పద్మనాభాగ్నుల బహుకార్యకారణ లత్యంతయోన్నతహేతు సర్వవిశ్వ
సంభవలయవృద్ధి సకసతులను దైవతంబును పర్వభూతముల నెల్లఁ
గనుఁగొంటి భవశర్వ వరదోగ్ర బహురూప పాపాంధకాసుర ప్రాణహరణ
తే. శివలోకేశ త్రిజట త్రిశీర్షశూల,సక్తకర పురసంహార సర్వహార
వామదేవ త్రినేత్ర విభావ్యవంద్య, వందనార్పిత నీకు నే నాగభూష! 54

క. డిండిమయుతకరయుగళా, దండాంచితమండమమ్ముండాదారుణ విలయో
ద్దండపరాక్రమ పటుతర, చండాఖిలజన్మహేతు సమధికభావా! 55

క. శ్వేతోర్ధ్వకేశదంష్ట్రా, పాతకహర విశ్వశఘూర్ణ పాటలనీలా
జాతాప్రతిరూప శివా, చేతోభవహరణ వినుతి సేసెద భక్తిన్ 56

క. నిజరూపధ్వజమాలా, సుజనాకరసూర్యసూర్య సుందరమాలా
కుజనవిదూరశుభప్రద, రజనీకర చూడ ఘోరరక్షఃమథనా! 57

క. నానాభిరామపటుకర, మానితగజరాజరాజ మంజులతేజో
ధాన వృషాంసగమస్తర, దీనావన నీకు జోత దృఢభక్తిమెయిన్ 58

క. వరపర్ణధారపుట గురు, కరుణాకర కనకవర్ణ కనకాభ దయా
కర సంక్రందన సంస్తుత, సరదేవస్తుత్య వందనము నీ కభవా! 59

క. సర్వస్తుతి సమ్యక్స్థిత, సర్వేశ్వర సర్వభూత సంఘశరీరా
సర్వాదనహరణ మహా, సర్వశ్వేతోగ్రకేతు పంచయుతదేవా 60

సీ. గతమాయ కృశనాశ కటకటోత్థిత శివ ధామసారస్థిర ధైర్యపదన
వరచండకుల్పిత వాదిత్రసంయుత నర్తనశీలవినాశకాక
రమ్యనాట్యోపహార ప్రసక్తమహాబలనాశ పుష్కల ప్రథమకాల
గర్వసంక్షయరూప కాలసంహారహిమాచలజాహృదయామలాబ్జ
తే. హంస దశకరనిత్యోగ్ర హారకపాల, సక్తహస్తవిభీషణ చారుచిత్య

భస్మవిప్రియబహుహిమ।వారసతత, ధరమహేశ్వర నీకు వం।దన మొనర్తు. 51

క. దేవా! వృషాంకవర్షణ, దేవేశ్వర పచపచా।దీపిత భీమా
గోవాత్సల్యకటంకట, భావజ్ఞా భావదూర । వందనము లగన్. 52

క. ప్రాలేయ వ్రతధర సుర,జాల విరక్తాన్యభావ।సంహార మహా
శీలాజపమాలాభే, ఢాలఘుఘేరప్రభిన్న।హార నతి నీకున్ 53

తే. ఘోరఘోరతరాఘోర।ఘోరరూప, శాంతతమశాంత హుళవి।శాలనేత్ర
యాగభాగప్రియైకమ।హాశరీర, నీకు నే మ్రొక్కుచున్నాఁడ । నియతితోడ 54

తే దివ్యయమనియమాన్విత।దేవ పంచ, సదనశుభ్రాంగలుబ్ధ వి।స్తారభోగ
భాసురక్షుద్రచిత్తోరు।భద్రఘంట, వందనము నీకు కైలాస।వాస మిగుల. 55

క. ఘంటాఘంటనిఘంటా, ఘంటామాలావిభూష।కానితవేషా
వంటించక నన్నేలుము, మింటను జేజేలు నిన్ను । మేలనిపొగడన్ 56

సీ హుంకార సతత హుం।హుంకారః శుగణాసంఘుట్టఘుట్ట వి।స్తారహూర
కిలకిల ప్రియపార।కృత్తివస్త్రప్రియ సమసమవేశ్మవృ।తుప్రశస్త
సదన సద్గగ్ధ మాం।సప్రగాలకతరోరుతారకప్రహ్లాతసం।దహనయాగ
యజ్ఞవాహావ్యయ । యజ్ఞేశ హుతహవ్యతఃనతప్యనిరాశ । దైత్యనాశ
తే తుండ నాయకభవతుండ । తుండ్యభక్త, నాథ నానాన్నభోజనా।న్నప్రదేశ
భక్తమందార నతజన।పాపహార, వందనము నీకిదె సహ।స్రవదనభక్తి 57

క. పరమసహస్రాభరణా, వరదసహస్రోద్యమా।త్తభాస్వచ్ఛూలా
గురువృద్ధబాల నీకౌఁ, కరముడి వందన మొనర్తు । నతులితభక్తిన్ 58

సీ. బాలానుచరగోత్ర । బాలలీలావిలాస।శోభనాధిక । సత్యపాల
గంగాలులితకేశ । కమనీయతరముండివాలస్థవిరబాల।వారపాల
షట్కర్మసంతుష్ట।సమధికత్రిక్రియానిరతనగ్నప్రాణ । నిపుణబాణ
బంధురాస్ఫోటన । బహుధర్మకామార్థమోక్షకాధ్యాపక।మురహరాప్త
తే సాంఖ్యయోగముఖామల।సాంఖ్యముఖ్య, సాంఖ్యరూపాభిరామసు।చారుసీమ
సకలపాతకహరనామ।సత్ప్రికామ, వామదేవ మహాదేవ । వందనంబు 69

వ సర్వజ్ఞ, స్థవిరరథరథ్య, చతుష్పథరథ, నీలోత్తరీయ, హరిచికుర, త్ర్యంబ
కాంబికానాయక, వ్యక్తావ్యక్త, పరబ్రహ్మస్వరూప, తర్ష్యాతర్ష్య, తుష్టాతుష్ట
విచార, సర్వపాపవినాశ, కల్పసంధ్యావిలోకన, మహాసత్త్వ, మహాహస్త, మహా
బల, మహాభృద్ధర, ప్రఖ్య, మహాకాల, మహాప్రభ, మేఘావర్త, చంద్రార్కాశ
నీకౌఁ నమస్కార మని వెండియు నిట్లని స్తుతించె 70

క అన్నము నీవభవాయా, యన్నము భక్షించువాఁడ । వైయుండువు ప
ర్యాన్నావనదహనా నీ, కున్నతమతి మ్రొక్కువాఁడ । నుజ్జ్వలభక్తిన్. 71

సీ భూమిని భేదించి పుట్టులతాదులు మావితోఁ గలిగెడిమానవాదు
లండజోద్భవములై యలరు పక్ష్యాదులుస్వేదోద్భవంబులై చెలఁగు సూక్ష్మ
జీవు లీ వైయుండి చెన్నారుచుండుదువు సర్వచరాచరసహిత మైన
విశ్వంబుఁ బుట్టించి వేడ్కతోఁ బాలించి విలయంబుఁ గావించువిభుఁడ వీవ
తే బ్రహ్మవేత్తలు నినుఁ బరబ్రహ్మ మనుచుఁ
గడిమి భాషింత్రు చిత్తంబులందు బయల
వెలుఁగు విలసిల్లుచుండు నావెల్గు నీవు
వెలుఁగులకు వెల్గు నీవునై వెలయు దభవ! 72

చ పరమబుధేంద్రులెల్లనినుఁ బాదపషట్పదహంసమూర్తిగాఁ
గరము వచింత్రు యాజకులు గణ్యులు సజ్జనుఁగాను నిన్ను సు
స్థిరగతి నెంచి పల్కుదురు శ్రేష్ఠతరోపనిషచ్ఛ్రుతీడ్యభా
సురనుతులన్ బఠింపఁబడి శోభిలుచుండుదువు నీవు శంకరా! 73

తే బ్రాహ్మణులు క్షత్త్రియులు వైశ్యపాదజాత, జలధరాశనిగర్జితచంచలాబ్ద
పక్షయుగమాసనక్షత్ర పటలసృష్టి, హాదు లీవని పల్కుదు రార్యు లభవ!

చ. గిరిపతిపుత్త్రికారమణ! గీష్పతివంద్య! ద్రుమాళిలోపలన్
వరవటవృక్ష మీవు పటుపర్వతసంతతులయందుఁ బర్వతే
శ్వరుడవు సర్వఘోరమృగవారములోపల వ్యాఘ్ర మాదు నీ
వరయ బిలేశయావళులయం దహిరాజవు కోరి చూడఁగన్ 75

తే అబ్ధులం దీవు క్షీరాబ్ధి వగుచు నుండు
వఖిలమైనట్టి యంత్రౌఘమందు దివ్య
కార్ముకాభిఖ్యయంత్ర మై క్రాలుచుండు
వనయ మీవన్నిచోటులయందు భర్గ 76

క ఆయుధములలో వజ్రం, బై యుందువు వ్రతములందు నతిశయసత్య
ప్రాయుండవు బుధగేయా, మాయామహితాప్రమేయ మంజులకాయా 77

సీ వైరక్షమాక్షమ వ్యవసాయతంద్రాగధృతిజయాజయములు పృథులలోభ
కామమోహక్రోధఘనదైన్యములు నీవ చటులగదాశరశస్త్రచాప
ములు నీవ భేత్తవు మోక్షప్రదుండవు నేతవుచేత్తవు నిఖలహర్త
వగుచు మంతవ్యుఁడ వై చెలంగెద వీవ దశలక్షణాన్వితధర్మపర్వ
తే తార్థకాసారసరిదర్ణవాబ్ధి పక్ష, రాశి బహుకర్మగుణగణాగంభకాల
పుష్పఫలదోషధీలతాపుంజజీవ, మనుజుఁడ వీ వోమహేశ! యుమాసతీశ! 78

తే ప్రణవగాయత్త్రు లాదిత్యభద్రసిద్ధ, సాధ్యగంధర్వకిన్నరచారణాది
నిర్జరులు నీవ సర్వేశ నిత్యవీర, పండితాత్మాబ్జభాస్కరభాగ్యనికర! 79

వ. రేవా, సిత, పీత, హరిత, లోహిత, కపోత, కాల, నీల, కపిల, కద్రు కృష్ణ వర్ణంబులును, సర్వవర్ణావర్ణంబులును, వాసవాగ్నియమనిరృతివరుణపవనధనేశేశానాద్యష్టదిక్పాలురును, స్వర్భానుహంసోపద్రవంబులును, శిష్యులును, యజుస్సామవేతపద్రీయంబులుఁ బవిత్రాతిపవిత్రంబులును, శుభాతిశయశుభంబులు ద్విజములందుఁ దుమ్మికిచెట్టును, సర్వశుగణాధార మగుముద్గంబును, బ్రాణంబులును రజస్సత్త్వతమోగుణంబులు సకలపతిత్వంబుఁ, బ్రాణాపానవ్యానోదానసమానవాయువులును, నిమేషోన్మేషజృంభితక్షుతములును, లోహితాంతర్గతదృష్టియును, మహావక్త్రులును, మహేశ్వరులును, శుచిరోమంబులును, హరిశ్మశ్రువులును, భవోర్ధ్వకేశంబులును, మానజాలంబులును, జలౌకంబులుఁ, గాలకేళికళాకళలుఁ, గాలాకాలదుష్కాలశివకాలంబులును, మృత్యువును, మృత్యుకర్తయు, సర్వస్వంబులుఁ, దద్విఘ్నకరులును, సంవర్తకాంతకసంవర్తబలాహకఘంటలును నీవై రాజిల్లుచుందువు మఱియు ఘంటధరుండవు, మహాఘంటివి, సంచరుండవు, మాతలివై యుందువు, శతానందయమదివానులకు దండసుండి త్రిదండకుండవు, మహేశ్వరా! చతుర్యుగంబులు, చతుర్వేదంబులు, చతుర్హోత్రంబులు, భవద్రూపమయంబులై రాణించు, మహేశా! నీవు చతుర్హోత్రప్రవర్తకుండవును, జతురాశ్రమనేతవును, జాతుర్వర్ణ్యకరుండవును, నిత్యలక్షణప్రియుండవును, గణాధ్యక్షుండవును, గణాధిపుఁడవును, శోణితమాల్యవసనధరుండవును గిరికుఁడవును, గౌరీకిఁ బ్రియుండవును, శిల్పులలో శ్రేష్ఠశిల్పి వైనవాఁడవును, సర్వశిల్పప్రవర్తకుఁడవును, భగనేత్రాంశకుఁడవును, శంభుఁడవును, బూష్ణోదంతనాశకుఁడవును, స్వాహాస్వధావషట్కారనమస్కారమయుండవునై రాణించు నీకు వందనం బని వేర్కొని వెండియు నిట్లని స్తుతించె 80

సీ. గాఢతపశ్చర గూఢవ్రతానిశ తారక తారకాధార వీత
ధాతవై నీవు సంధాతవై పరమవిధాతవై తవరి భూధరణపరుఁడ
వగుచు మహాదీప్తి నలరారుచుందువు సత్యార్జవంబులు సద్వ్రతంబు
లతులితవ్రతచర్య లనఘ నీవే కద భూతాత్మభూతేశ భూతభవ్య
తే. భూతకరసంతతోద్భవ పూర్ణభావ, భూర్భువస్స్వరాత్మక ముక్తిధామ
భవ్యదంష్ట్ర ధ్రువోన్నత పరమజాత, నిన్ను వర్ణింపఁజాలను నిఖిలనాథ! 81

తే. దాంత సంభవదుర్దాంత దాంత శాంత, దీక్షితాదీక్షితోద్భవ దివ్యభావ
కర్ణికారసుమప్రియ గాఢమాయ, మౌని జనకామ సమధిక మంజుసీమ! 82

క. స్థూలాణుబిందుకాంతా, జాలయుగావర్తభూరిసంవర్తమహా
శీలాజ్ఞావర్తగురు, కాలహర సంప్రవర్తక ప్రమథేశా! 83

క. శ్రీమహితనందివక్త్రా, శ్రీమాస్యకమ్రవదన విమలాచరణా
సోమార్ధమకుట సర్వ, స్తోమాధికరాజరాజ సురుచిర తేజా! 84

క. శకునివి హిరణ్యగర్భుఁడ, వకళంకుఁడ వీవు ధర్మ । హరణఘ్వంసా
సకలగణోత్కటదుష్కట, సకలేశాదండధర్గ । సత్యవిహారణా! 85

క. గోవర్ధ గోప్రణాం, మానిత గోనాథ రాజ । మంజులవాహా
దీనావన బహు పావన, గానాత్మిజ్ఞ కృశేస్త । కలుషాహర్తా! 86

సీ. గోవిందకనక । గోమాన్ గార్గ్యత్రిషు నాదవాదిన । పూర్ణ గాన
సత్తమ సుస్థిర । స్థాణుగూఢ గోప పటుకోపదుర్విష । వంశనాశ
దురతిక్రమానిశ । దుర్వారణాధిక దుస్సహ దుర్ధర్ష । దుష్ప్రకాశ
దుర్జయ దుర్దర్శ । దుఃఖవినాశనకుబ్జ గామయవహ్ని । సోమతృష్ణ
తే. లాదు లైనట్టి రోగము । లణఁగ నీవె, తన్నివారకుఁడవు నీవె । తలంచి చూడ
నాదిదేవుండ వజరుండ । వతులుండ, వచ్యుతుండవు నీవు సర్వామరేశ! 87

చ. అని కరము ల్సమున్నముగ । హర్షము సత్క్రియలన్ని నీవు నై
తనరుదు వబ్జలోచన వి । తత్క్రతుపద్మవనాలయా మహా
జనసుత దండహస్త జయ । సంభృత త్ర్యంబక దుష్టదూర పా
వన వరదోగ్రదంష్ట్ర ముని । భావన ప్రోవుము నన్ను సత్కృపన్ 88

క. మనుదధిప నీవు సర్వా, మరపతివి సుసోమపాన । మహితుఁడవు సుధా
వరభోజనుఁడవు దేవే, శ్వరుఁడవు గణాధిపతివి సత్య । సంధుండవజా! 89

క. శ్రీ రాజ్యవిహాగ్నిపవి, స్ఫార మధుచ్యుతకదంబ । సన్మధుపజయా
ధార మధుచ్యుత నిస్తుల, వీరా బ్రహ్మస్వరూప । విశ్వాధారా! 90

ఆ. సకలభువనభోక్త । సర్వలోకపితామహ, హా హిరణ్యవీర్య । యుత్తకార్య
పురుషులందు బుణ్య । పురుషుండ వీవెందు, డవె తేజ చూడ । భవవిరహిత! 91

ఆ. పుణ్యదేవ పుష్ప । పుంస్త్రీమూర్తి, ధర గిరీశ బాల । తరుణజీర్ణ
దంతవృద్ధరూప । తతవిశ్వధర విశ్వ, తార ఘోర ఘోర । కలుషహరణ! 92

క. లోకంబుల సృష్టించెది, లోకేశుఁడ వీవు సాధు । లోకార్చిత ని
న్నాకేశాదులు ప్రణతులు, నై కడు పూజించుచుందు । రనవరతంబున్. 93

తే. తరణి చంద్రులు నీకు నేత్రములు దేవ, పార్వతీదేవి నీకు సద్భార్య యగును
నీవు వైశ్వానరుండవు । నీవు ధాత, తాత వఖలేశ పాలింపు । దయను నన్ను.

సీ. పురహరవాగ్బల । మూలభూతయు నగు వాణి నీవాణియై । వాసిఁగాంచె
రాత్రిందివములకు । రవినిమిషాద్యష్ట కాలంబునకు నీవు । కర్త వనఘ
పరమేష్ఠి గోవింద । పరమమునీంద్రులు మాహాత్మ్యముఁగను ని । న్నరయునట్టి
శక్తి లేకుండుదు । రనకోటి యెద్దాని వ్యాపించి యుండుదునా । యట్టిలిమిర
ఆ. పారమందు నీవు । భాసిల్లుచు నిరంతరంబు నంతవగుచు । ధరణాంబు
చేయుచుండు వధిక । శివమహాసుందర, సాధుహృదయలోల । సత్యశీల 95

ఆ. సంయతేంద్రియులును । సత్త్వస్థు లపగత, భూరినిద్రు లైన । బుధులు యోగ
దృష్టి నెవని హంస । రూపుఁ గాఁ గందురో, భక్తి నట్టి నీకు । వందనంబు 96

చ. సురుచిరరూప! నీ తనువుఁ । జూచుట కెట్టి సుసూక్ష్మవర్ష్మముల్
పొరిఁబొరిఁ జాలకుండునో వి । మోహితభావనిరూఢినట్టి శ్రీ
కరవరమూర్తుల న్మిగులఁ । గావుము నన్ను నిజాత్మజుం దమి
న్నిరతము నేలు తండ్రిగతి । నీవు కృపారస ముల్లసిల్లఁగన్ 97

క. నే నిపుడు రక్షణీయుఁడ, మానుగ రక్షింపు మీవు । మానస మలరం
గా నన్ను; నీకు మ్రొక్కెద, దీనావన విశ్వభవన । దేవ మహేశా! 98

క. నీయందు భూరిభక్తి, న్నాయక వర్తించుచున్న । వాఁడ న్నన్నీ
త్రోయంబున భగవానుఁడ, సాయమ్మొనరించి ప్రోవు । సాధులు మెచ్చన్ 99

సీ. జడలతోడను మహా । చటులదండముతోడఁ బొడవు నాలుకతోడ । భూరిభయద
దీర్ఘదంష్ట్రలతోడఁ । దేజరిల్లుచు జన్మమందు గణేశుఁడ । వైనరుద్ర
కాయ నీకును నమ । స్కార మేశర్వనికుంతల సర్వాంగ । కుక్షిభాగ
గతము లై జలధర । ఘననదీచతురపాంపతు లుండునో యట్టి । వారి రూపుఁ
ఆ. దైన హరున కిప్పు । డభివందనము యోగాం
తంబునందు భూత । తతుల మ్రింగి
నీటి నడుమనుండు । నీరశాయియు నగు
వామదేవునకును । వందనంబు 100

ఉ. రాతిరియందు నే విభుఁడు । రాహుముఖంబునఁ జొచ్చి చంద్రునిం
ఖ్యాతిఁగ మ్రింగునో యెవఁడు । కాండజమిత్రు గ్రసించుచు న్మహా
భీతిదగాహురక్షితుఁడు । విస్తృతతేజుఁడు నై వెలింగె నా
భూతగణాధినాథునకు । మ్రొక్కెద భక్తి చెలంగుచుండఁగన్. 101

క. అనుపాలితగర్భములే, వనయం బెద్దాని కభవు । వలనను రక్షిం
దన రెనో యాస్వాహాస్వధ, లనిశము మోదంబుతోడ । నలరు న్మిగులన్ 102

ఆ. దివ్యదేహు లగుచు । దీపించి యంగుష్ఠ, మాత్రులై చెలంగు । మాన్యు లెల్ల
భూతతతులఁ బ్రోచి । పూర్ణదయ న్నాకు, నధికతోషకారు । లగుదు రెపుడు.

సీ. దేవ! ఉర్ణోద్యాన । ధిష్ణ్యనదీవృక్షమాలాశ్వరథహస్తి । ముఖ్యవాస
సాగరకాంతార । సకలచతుష్పథరథ్యాసభాచత్వ । రములయందు
దిక్కులయందు వి । దిక్కులయందును బంచభూతములందు । భాస్కరాబ్జ
మధ్యస్థలంబందు । మతిసూర్యచంద్రదీ । ధితులందు నిరతము । తిరుగునట్టి
ఆ. భవ్యమతులకేను । బలుమరు మ్రొక్కెద, విగతరూపసంఖ్య । వెలసి మేరఁ
దప్పినట్టి రుద్ర । తతికి నిత్యం బేను, వందనం బొనర్తు । వాంఛతోడ 104

ఆ. శర్వ! నీవు సుప్ర । సన్నుఁడ వగు మింక, యుష్మదీయభావ । యుతుఁడ నగుటఁ

జేసి భద్రమగును ౹ వెలుఁగు నీయందు నా, హ్లాదయమానసంబు ౹ లధికభక్తి.
క ఘనముగ నిట్లావేనుం, డనితరమతి యగుచుఁ బొగడి ౹ యంతట విరమిం
చెను జితసర్వేంద్రియత, న్మునివర గతవాతదీపముం బోలి ధరన్ 106

ఈశ్వరుఁడు వేనునకు వరంబు లిచ్చుట.

సీ త్రిభువనాధీశుఁడు ౹ దేవదేవుఁడు వాక్యవేత్తయగు భవుఁ డంత ౹ వేనుతోడ
నాశ్వాసకరమునై ౹ యత్యుత్తమం బైనవాక్యంబుఁ బలికెను౹ వ్రతమహీశ!
చిత్రమయ్యెను నీవు ౹ చేసినస్తుతితోడ నీకొఱ కిప్పుడు ౹ నేను మదిని
నధికమోదంబున ౹ నలరితిఁ బలుమాట లేటికి నాకడ ౹ నీవు భూరి
తే కాలపర్యంత ముండి మహాత్ముఁ డగుచుఁ
వగుచు నీ వంతటను హిరణ్యాక్షుసద్మ
మందు నంధకదైత్యుండ ౹ వగుచుఁ బుట్టి
విబుధవైరత్వమున విఖ్యాతిఁ గాంచి పెరిగి 107
క. సర్వామరనిందాకృత, పర్యంబై ఘోర మగుచు ౹ వర్తించెదికా
పూర్వాధర్మముతో నని, వార్యుండవు నాదు వంతఁ ౹ బటుభక్తిమెయిన్. 108
ఆ భువనమాత యగుచుఁ ౹ బొల్పారు పార్వతి
సతినిఁ జూచి కామ౹సస్పృహుండ
వగుచు నెప్పు డవని ౹ పడరెదవో యట్టి
తరుణమందు నేను ౹ దర్ప మొప్ప 109
చ అరుదుగ ఘోరశూలమున ౹ నబ్జము లర్బుర మాతటి న్నినున్
ధరఁబడఁ గొట్టితో యఁగలఁ ౹ దద్దయు దాన సమస్తభూరిదు
ష్కరకలుషంబుల న్విడిచి ౹ క్రన్నన నన్గని భృంగిరూపునన్
బరఁగి గణేశ్వరుండ వయి ౹ వాసి వహింతువు నీవు భూవరా! 110
క మన్నికటస్థుఁడ వగుచున్, బన్నగ సిద్ధాదిదేవ౹పతులెల్ల నినున్
సన్నుతి నొనర్ప సిద్ధి, న్మిన్నగఁ బొందెదవు బుధులు ౹ మే లని పలుకన్ 111
క. భూవర! భవదుక్తస్తుతి, భావించి పఠించునట్టి ౹ భవ్యుండు మహా
భావుకమును దీర్ఘాయువు, వావిరిఁ జెందంగఁ గలఁడు ౹ వసుధాస్థలిపై 112
క. భగవంతుఁడ నగు నే నొగి, నగణితదేహాంబులందు ౹ నతిభవ్యుఁడ నై
పొగడొందురీతి నీ స్తవ, మగపడు నఖిలస్తవంబు౹లం దాఢ్యంబై. 113
మ. ధనవిద్యాసుఖరాజ్యకీర్తులు యశో౹ధర్మార్థసంభూతులున్
ఘనమానాత్మజపౌత్రసంతతులు వేడ్కం గోరువా రీస్తవం
బును శ్రద్ధాయుతులై వినం దగును సం౹భూతార్తదుఃఖంబులన్
వనటన్ జెందినదీనమానవులు సద్భక్తిన్ వినంగా నగున్ 114

తే. నృపతి కార్యవిముక్తులై । నెగడువారుఁ
దస్కరేశ్వరు భయమునఁ । దల్లడిల్లు
మనుజులును స్తోత్రరాజంబు । మహితభక్తిఁ
జదివి గతభీతు లగుదురు । సంతతంబు. 115

క. వేనకృత స్తవము న్విని, మానవుఁ డీమేనితోడ । మహిపై దీప్తిన్
మానితవర్ణశ్రేష్ఠుఁడు, నై నిర్మలమానసమున । నలరును జుండీ 116

సీ. ఎవ్వనిసద్మమం । దీస్తుతి పఠితమై సొంపారుచుండునో । సారిది నట్టి
సదనంబునందు రా । క్షసపిశాచోరగభూతవినాయక । పుంజ మెల్ల
విఘ్నంబుఁ జేయక । వెలయు; ధవాజ్ఞనుఁ బొంది యీ స్తవరాజ । మును వెలంది
తమి విని తనతల్లి । దండ్రులపక్షములందు సంపూజ్యయౌ । నార్య మాడ్కి
ఆ. మనుజుఁ డెవ్వఁ డిట్టి । మాన్య స్తవంబు ప
మాహితాత్ముఁ డగుచు । మమత వినునొ
సార భక్తితోడఁ । జదువునొ వానికి
నఖిలకార్యసిద్ధి । హరువు నొందు. 117

క. మానసవాణీచింతిత, మైనట్టిఫలంబు నొంది । హర్షాన్వితుఁ డౌ
మానుగ నీ స్తవపఠనము, చే నరుఁడు నిజంబుగాను । సిద్ధులు మెచ్చన్ 118

క. నరవీర నీకు శివ మగుఁ, బొరిఁబొరి నీచిత్తమందుఁ । బొంగారెడి దా
వరమునుఁ గోరు మొసంగెదఁ, బరమానందంబు మిగుల । వఱలుచు నుండన్.

క. మునినాథ! యిట్లు శంభుం, డన వేననృపాలుఁ డంత । నభవుండును దు
ర్జనగణహరుఁ డగుశంకరు, వినుతించుచుఁ బల్కె నపుడు । విస్తృతభక్తిన్ 120

తే. ధరణి నీలింగమాహాత్మ్య । దర్శనముల
నిన్ను దర్శించినందున । నేను విగత
కల్మషుఁడ నైతిఁగద తుష్టి । కలిగెనేని
వరము నొసఁగంగఁ దగు నాకుఁ । బార్వతీశ! 121

శా. దేవా! దేవధనాపహారి యగుచున్ । దీపించినీసేవకుం
డివిశ్వంబున శ్వానయోనిజుఁడు నై । యేపారెఁ బల్గానితో
నీవేళన్ దయతోడ నీతనికి నీ । వింకన్ బ్రసాదత్వమున్
భావస్ఫూర్తినిఁ జేయ నర్హుఁడవు గో । వాసస్థు లారాయనన్. 122

సీ. వరద! యేతత్సరో । వరవారిజలమధ్యమునఁ బూర్వకుండు నే । మునుఁగఁబోయి
సురనివారితుఁడ నై । శోకింప నీతఁడు బహుళోపకారి యై । పరఁగె నాకు
నాకారణంబున । నడిగెద వరముఁ దద్విషయమై యని యిట్లు । విభుఁడు పలుక
నావేనువచనంబు । నాలించి తుష్టుఁడై భవుఁ డాడె నోరాజ । వరమదీయ
ఆ. భవ్యలింగసంభ । వమును సరఃకురు, క్షేత్రమహిమ నెల్ల । శిష్టమతిని

విని సమస్తపాప। విరహితుండై ముక్తి, కరుగు ననుచుఁ బలికి । యాక్షణమున

తే అఖిలలోకనమస్కృతుఁ। డా మహేశుఁ
డట నదృశ్యుండు నయ్యె బ। శ్చాత్సమస్త
నరుల కంతట నాశ్వాన । మరయ నాత్మ
పూర్వజన్మగతస్థితి । బుద్ధి నెఱిఁగి 124

చ అనుపమమూర్తితో నలరి । యానరపాలునిఁ జేరియుండె నా
జనపతిపుత్త్రుఁ డంతటను । స్నాతుఁడు నై పితృదర్శనాభిలా
షనుఁ జనుదెంచి స్థాణుతల। సంగతతీర్థమునందు శూన్యమై
తనరు కుటిం గనుంగొని యొ।దర్ గతశోకుఁడు నయ్యె నంతటన్ 125

చ మునివర! వేనుఁ డత్యధిక। మోదముతో ననెఁ బుత్త్రుఁ జూచి స
త్తనయుఁడ వైన నీవలనఁ । దద్దయు నే నభిషేక మందుచుర్
బొనరి దురంతనారకస। ముద్రము నెల్లఁ దరించి స్థాణుపా
వనసరసీమహాపులిన। వాసమునందు విముక్తిఁ జెందితిర్ 126

తే వసుధ నీపుణ్యసత్కృప। వలన స్థాణు
మూర్తి సందర్శనంబున । ముక్త సకల
కల్మషుఁడ నై శుభంబునఁ । గ్రాలు నాక
పురమునకు నేఁగఁగలను నేఁ । భూరిదీప్తి 127

శా. ఈమాడ్కిర్ సుతుతోడఁ బల్కి యటఁ బృ।థ్వీశుండు నా వేనుఁ డా
భూమిర్ భక్తవశంకరుండు నగుశం। భు న్నిల్పి సర్వామర
స్తోమంబు ల్నుతిచేయ నాస్థలమునం। దుర్ బుత్త్రసంతారితుం
డై మౌని క్రియసిద్ధి నొందెను మహా। హర్షంబుతోఁ దాపసా! 128

ఆ దివ్యభక్తి స్థాణు। తీర్థప్రభావమ్ము, వలన శ్వాన మప్పు । డఖిలఘోర
పాపములను వీడి । భాసురదీప్తితో, స్వర్గమునకు నేగ । సరవి నంత 129

క విను వైన్యుండు పిత్ర్యాణం,బుననుండి విముక్తుఁ డగుచు । భూమిని ధర్మం
బున నేలి కీర్తికరు డై, తనరారెడిసుతులఁ బడసి । తజ్ఞులు మెచ్చన్ 130

చ. క్రతువు నొనర్చి కామముల । బ్రాహ్మణవర్యుల కిచ్చి పేర్మి వి
స్తృతవివిధాఢ్యభోగగణ। సిద్ధుల నొప్ప భుజించి ద్రావిణో
న్నతవరకామయుక్త లగు। నాతులఁ దుష్టినిఁ జెందఁజేసి శం
సితుఁ డగుపుత్త్రవర్యు నభి। షిక్తునిజేసెను రాజ్యమం దొగిన్ 131

ఆ పార్థివుండు పిదపఁ । బరమకురుక్షేత్ర
మునకు నేగి భక్తి । భూరితపము
చేసి హరునిఁ గొల్చి । బాసె స్వేచ్ఛ శరీర
మంతఁ జనియె దివికి । నమలుఁ డగుచు. 132

క. ఈతీర్థ దివ్యమహిమమును, భూతలమున నెవఁడు వినునొ ౹ భూరితరాఘు
వ్రాతముల వీడి ముక్తికిఁ, జేతోమోదమున నతఁడు ౹ చేరు మునీంద్రా! 135
క అన విని మార్కండేయుం, డని ననఘా నృపచతుర్ము౹ఖాద్యోత్పత్తి
న్వినఁ గోరెదఁ బలుకు మనం, గనికరమున నతఁడు చెప్పఁ౹గడఁగెఁ గ్రమమునన్.

—— సృష్టిచరిత్రము. ——

సీ వినుము తామరచూలి ౹ వృత్తంబు వినుపింతుఁ గడిమి సముగ్రంబు౹గాను దొల్లి
భగవంతుఁ డైనట్టి ౹ బ్రహ్మదేవర పుట్టి సకలచరాచర౹సహిత మైన
భూతజాలంబునుఁ ౹ బుట్టించి క్రన్నన సృష్టిచింతాధిక౹స్పృహుఁడు నగుచు
రాణించు నలువకు ౹ రమ్యనీలోత్పలపత్త్రాభగాత్రయు ౹ భావ రమయు
ఆ. కమలనేత్ర యైన ౹ కన్యక జన్మింప
నామనోజ్ఞరూప ౹ నబ్జజుండు
కన్నులారఁ జూచి ౹ కడుఁ దమితో దానిఁ
గలియ నాత్మఁ దలఁచెఁ ౹ గౌతుకమున. 135
క. మునివర! యాపాపముతో, వనజజాతల శీర్షమయ్యె ౹ వడి నంతటఁ దా
నినిఁ జూచి శతానందుఁడు, ఘనముగ మదిలోనఁ జింత ౹ గ్రాలుచు నుండన్.
ఆ. సకలపాపములను ౹ సమయించి పుణ్యంబు, గలుఁగఁ జేసి లోక౹గణ్య మగుచు
వెలయుసన్నిహత్య ౹ విమలసరోవర, పుణ్యతీర్థమునకుఁ ౹ బోయి భక్తి 137
మ సరిదాద్యోత్తరతీరరాజితము నై ౹ సన్మాని సిద్ధామరో
త్కరసంసేవిత మై సుపుణ్యకరమౌ ౹ స్థాణ్వీశుతీర్థంబునన్
గిరిశాధీశుఁ బ్రతిష్ఠచేసి గురుభ౹క్తి న్నిత్యమున్ గొల్చె భా
సురపుష్పాదులరుద్రసూక్తముల సం౹శుద్ధోపహారంబులన్. 138
మ అనఘా! యిట్లు భవార్చనారతుఁడు నై ౹ యత్యంత మౌ భక్తితో
ననిశంబున్ వెలుఁగొందు ధాత కడకున్ ౹ వార్షంబుతోడం దనం
తనె భూతేశుఁడు గాఁ గనుంగొని జగ౹ద్గణ్యుండు పుణ్యుండు పా
వనుఁడౌ వేల్పులతేడు మ్రొక్కి భవునిన్ ౹ బ్రార్థింపసాగె న్మునీ! 139

—— బ్రహ్మ శివుని బొగడుట. ——

సీ దేవ భవాశ్రయ౹దివ్యమహాదేవ భూతభవ్యస్తుతి ౹ పూర్ణనిత్య
విష్టపత్రయపాల ౹ విగతకల్మషజాల నిర్మలశుభకాయ ౹ నిత్యగేయ
సకలవిపన్నాశ ౹ సద్వైద్యబహురోగహారణ బిలేశయా౹భరణ నిపుణ
ఘోరవాజినవీత ౹ రౌద్రాఘకల్లోల బుద్ధిసంఘట్టన ౹ పుణ్యసదన
తే హరభవన్నామజాపకు ౹ లైనమర్త్యు
లెల్ల భావాశ్రయులు గారు ౹ పృథ్వియందు

నిత్యనిత్యమహోదార । నిఖిలలోక
నాథ! మ్రొక్కెద రక్షింపు । నన్ను దయను 140

ఆ. వరద గుహ్యగుహ్య । బంధురాతపకర, భాసమానగాత్ర । భావజైత్ర
విశ్వగురువరేణ్య । విస్తృతాఖిలపుణ్య, వంద్యగణ్య నీకు । వందనంబు. 141

క. శేషోత్తమహిమ! సంతత, శేషాంగదశేషహార । శేషాభరణా
దోషాకర నాశనసుర, వేషాగతబాధ మౌని । విభుగణనాథా! 142

ఆ. శంకరాప్రమేయ । సర్వభూతప్రియ, సిద్ధవందివినుత । శిష్టచరిత
భూతభావదుర్గ । మోక్షేశ స్థాణ్వీశ, పరమహేశవరద । పాపదూర! 143

క. వనజాననుఁ డేకైవడి, ననితరమతిఁ బొగడ శంభుఁ । డని నన్నటకై
నను మది భవిష్యదర్థం, బునఁ గినుకనుఁ జేయఁదగదు । పొరి నీచేతన్ 144

సీ. భూసురజ్యేష్ఠ! నీ । మూర్ధంబు నాచేతఁ బ్రాఁకి వరాహక । ల్పంబునందు
ఛేదింపఁబడె నట్టి । శీర్ష మెన్నటికైన నగునె శిక్షిత మైన । దయ్య నీకు
నరయ నీసన్నిహా । త్యాఖ్యతీర్థం బందు మల్లింగములభక్తి । మలయుచుండ
నిలిపి నీ వంతట । నిర్గతాఖిలఘోరకిల్బిషయుతుఁడ వై । క్రాలఁ గలవు
తే. సృష్టికాముఁడ వైన నీ । చేతఁ బ్రేరి
తుండ నై నిన్నుఁ గూర్చి సం । తోషి నగుచు
నట్టు లగునని పలికి భూ । తాళికెల్ల
దివ్యదర్శనగతుఁడ నై । దీప్తి నలరి 145

క. నేసన్నిహాత్యసరసీ, వాసుఁడ నై తపమొనర్తు । వాంఛాప్తికినై
వాసిఁ గను తపమున న్నీ, వాసించి యుపేక్ష నుండు । మనితరకాంతిన్ 146

ఆ. శిష్టచరిత! నీదు । చిత్తంబుతో నేను, సర్వభూతములకు । స్రష్టఁ గాఁగ
గల్పితుండ నాడు । ఘనతరదీప్తితో, విబుధవరులు చూచి । వింత నొంద. 147

శా. ఆవందుష్యం డొగి నిన్ను నంత జలమ । ధ్యస్థుండ నౌ నన్ను బల్
విన్ గన్గొని సర్వభూతములకం । టెన్ బూర్వసంజాతుఁ డౌ
దేవాధీశుఁడు లేనిచో బిదప నే । దీప్తిన్ బ్రజాసర్గమున్
భావోల్లాసుఁడ నై సృజింతు ననఁగాఁ । బా గొప్ప నీ వత్తఱిన్ 148

సీ. అపుణ్యుఁ గనుఁగొని । యనఘాత్మ! నీకంటె నగ్రజాతుండ నై । యలరునట్టి
పరపూరుషుఁడు లేఁడు । పరముఁడౌ స్థాణుండు జీవనమగ్నుఁడై । చెలఁగి వివశుఁ
డయ్యె నాకుహితంబు । నాచరింపఁ దగు నని యిట్లు భాషింతు । వాతఁ డప్పు
డఖిలభూతంబుల । నాధ్యదక్షప్రజాపతుల నిర్మించుచుఁ । బాలి నంత
ఆ. నాల్గురీతులైన । నరులెల్ల క్షుధితులై
వచ్చి పూనికతోడ । వాని మ్రింగఁ
గడఁగ నతఁడు వెఱచి । వడి వచ్చి శరణా
యగుచు నిన్ను గూర్చి । యపుడు పలుకు, 149

క. సురసేవ్యా! బ్రతుకఁ జెరు వీ, పురుషులకు విధించు టొప్పు । బుధు లగ్గింపన్
గర మటు చేయని చో నన్, గరకరి భక్షింత్రు వీరు । గాఢక్షుధతోన్. 150

వ. ఇట్లా పురుషగణ్యుఁడు పలుక విని నీ వంత నా ప్రజలకు నన్నంబును స్థావరంబు లగు పర్వతములకు మహౌషధులు బలిష్ఠభూతములకు దుర్బలజంగమజీవులు జగ్ధిగా విధింపఁగలవు పిదప నా ప్రజ లిట్లు నీచే విహితాన్నులై వచ్చినదారిఁ బట్టి చని పరస్పర మతిప్రీతియుక్తు లగుచుఁ జెంపు సెందెదరు భూతగ్రామవృద్ధి యందు లోకగురుండ వగు నీవు తుష్టుఁడ వైయుండ నే నపు డాజలమునుండి పైకివచ్చి ప్రజలఁ జూచి పిదప స్వకీయతేజస్సుతో వారిని వివాహితులఁ జేసి గురుకోపసంయుక్తుఁడ నై లింగముఁ బెకలించి కొలఁకునడుమ దాని నూర్ధ్వ మగునటుల నుండఁజేసెద నదిమొదలుకొని యాలోకమం దది స్థాణులింగ మని ప్రసిద్ధికెక్కును సకృద్దర్శనమున నఖిలమానవులు గతకల్మషు లగుచుఁ బునరావృత్తిరహిత మగు పరమపదంబు నొందుదురు కృష్ణాష్టమియం దీతీర్థమున సమాహితుఁడై వసించువాఁ డగమ్యాగమనోద్భవము లగు సమస్తపాపముల వలన విడువంబడు ననుచు నిట్లు వక్కాణించి భగవంతుఁ డగు భవుం డంతర్హితుం డయ్యె నంతట వాణీశ్వరుండు విశుద్ధపంకుఁడై చతుర్ముఖుఁ డగు శంకరునిఁ బూజించి తల్లింగముల నాల్గింటిని శగాంతరమాదుఁ బ్రతిష్ఠించె వానియందు

సీ. భవుని పార్శ్వంబున । బ్రహ్మసర స్సునామంబుతోడను । నలిఁ జెలంగి
పుణ్యదాయకము నై । పాల్పారు లింగంబు । మొదటిలింగంబు నై । మొనయు బ్రహ్మ
సదనాఖ్య లది యై । స్వస్థానమున ద్వితీ । యంబు నై నట్టిలిం । గంబు వెలయు
దానికిఁ దూర్పునఁ । దళుక్కొత్తుచుండుఁ దృతీయమౌ లింగంబు । దీప్తితోడ
తే. గణ్య మైనచతుర్థలిం । గము సరస్వ
తీనదీకూలమందునఁ । దివురుచుండు
నామహాలింగముల నిరా । హారు లగుచుఁ
గనెదుమనుజులు మోక్షంబుఁ । గాంతు రనఘ! 152

క. శితికంఠపార్శ్వలింగము, కృతయుగపూజ్యంబు నగును । గీర్తిలు త్రేతన్
జతురానవాశ్రమస్థల, గతలింగము సేవ్య మగుచుఁ । గ్రాలును ధాత్రిన్. 153

క. మానుగ ద్వాపరయుగమున, దానికిఁ దూర్పునను దీప్తిఁ । దనరారినదా
మానితలింగము పూజ్యం, బై నరులకు వెలయుచుండు । ననిశం బనఘా! 154

ఆ. కలియుగంబునందుఁ । గడిమి సరస్వతీ, తీరగతము నగుచుఁ । దేజరిల్లు
నట్టిలింగ మెప్పు । డర్చనార్హంబు నై, తనరుచుండు నెపుడు । ధాత్రిలోన 155

క. నరు లీలింగములను గని, గురుభక్తిన్ బూజచేసి । గోపతి కరుణన్
దురితముల నీగి పోదురు, పరమపదంబునకు వేడ్క । భాసిలుచుండన్. 156

ఆ. అఖిలసృష్టికాల । మందు సరస్వతీ
దివ్యదుత్తరస్థ । తీరమందు
నలువచేతఁ దొల్లి । నాల్గుమోములతోడ
వఱలు భవుఁడు నిలుపఁ । బడెను మౌని! 157

క. పురుషుఁడు జితేంద్రియుం డై, పరఁగి నిరాహారుఁ డగుచుఁ । బరమశ్రద్ధా
పరుఁడై యాలింగము గురు, తరభక్తినిఁ బూజచేసి । ధన్యుం డగుచున్. 158

ఆ. నిర్మలాత్మ నొప్పి । నిఖిలపంకంబుల, నెఱిని బాఱఁదోలి । నీలకంఠుఁ
డైనహరుని లోక । మందు రాజిల్లును, సంశయంబు లేదు । సంయమీంద్ర! 159

సీ. గణ్యాత్మ! త్రేతాయు । గంబు సంప్రాప్తమై । తనరారుచుండ నా । స్థాణుదేవ
నికటగతంబు నై । నెగడు మహాలింగ మతిపూజితంబు నై । యలరునట్టి
ఘనచతుర్ముఖలింగ । మునకు శ్రద్ధాన్వితుఁ డై మానవుండు సా । త్యంతభక్తి
మ్రొక్కి సర్వాఘని । ర్ముక్తుఁడై రాజిల్లు నుర్వి లీలాశంక । రోద్భవుండు
ఆ. ఖ్యాను శంభుఁ డైన । పరమేశుఁ బూజించి, సర్వదుష్టజాలి । సంకరోద్భ
వాధిఘోరరాజ । సాత్త్వభావవిముక్తుఁ, డై చెలంగు మనుజుఁ । డార్యు లెన్న.

క. మనుజుఁడు కృష్ణచతుర్దశి, ననితరమతి నభవుఁ గొలిచి । యంత నభోజైత్ర
దనజాతకలుషములచే, తనువిడువంబడును నిజము । తజ్ఞులు మెచ్చన్ 161

క. మునివర! కలికాలము రా, జనులు వసిష్ఠాశ్రమమునఁ । జతురాస్యుఁడు నా
మనసిజహరు నిలిపి ముదం, బున నేగుదు రభవు లోక । మునకుం దీప్తిన్. 162

తే. ఆవసిష్ఠాశ్రమంబున । నతులభక్తి
నలరి నరులు నిరాహారు । లై జితేంద్రి
యత్వమున శివుఁ బూజించి । హర్ష మొప్ప
నమలపదమున కేగుదు । రనఘు లగుచు. 163

క. స్థాణునితీర్థమహత్త్వము, మానుగఁ జెప్పితిని నీకు । మహిపై దీనిన్
మానవుఁ డాలించి యుమా, జానిదయ న్విగతపాప । చయుఁడౌ ననఘా! 164

సీ. నారద! యిట్లు స । నత్కుమారుఁడు తీర్థమాహాత్మ్యముల నెల్ల । మందలించి
మగుడ మార్కండేయ । మౌనినిఁ గనుఁగొని దేవమునీ! నీవు । తీర్థయాత్ర
కేఁగఁ దలంచితి । వేకత్వమునఁ బృథూదక మనువేర సీ । ధరణి నమరు
తీర్థంబు శ్రేష్ఠమై । తేజరిల్లుచునుండుఁ బుణ్యమౌ తత్తీర్థ । మునకు నేగ
ఆ. సర్వ మనుచుఁ బల్కె । నమరులారా! యది
కలుషహరము పుణ్య । కరము గాన
దానిఁ గోరి మీరు । దద్దయు భక్తితోఁ
జనుఁడు భావికార్య । సరణిఁ దలఁచి.

క. శీతకరసూర్యగీష్పతు, లేతిథియం దింపుఁ గుళీర । మృగశీర్షగులై
ఖ్యాతిగ నుండురో యాతిథి, భూతలమున నక్షయత్వ।మున గణ్యముగున్

చ. సురవరులార! దానఁ గడు।శోభనమై యది గ్రాలుచుండు నా
వరతిథియందుఁ బోయి పితృ।వర్యుల నందఱ శ్రాద్ధసత్క్రియ
న్నిరతము ప్రాశ్నరస్వతిని । నిశ్చలభక్తులు నై యజింప నా
గర మని చెప్పిపోయె హరి । గ్రన్నన దేవత లంతఁ దాపసా! 167

{ దేవతలు బృథూదకమున కేగి పితృదేవతలఁ బ్రార్థించి మేనకం దెచ్చి హిమవంతునకు భార్యగా నిచ్చుట. }

క. పురుషోత్తమువాక్యంబుల, గురుబుద్ధుల నాలకించి । గోపతియుతులై
కురుభూమిస్థపృథూదక, వరతీర్థమునకును భక్తి । వాటిల్లఁ దమిన్. 168

క. చని తజ్జలమజ్జనులై, ఘనగురుచోదకులు నగుచుఁ । గమలాప్తుని భ
క్తినిఁ గని భగవంతుఁడ వై, తనరెడు నోసూర్యదేవ! । దయ తలోఁక త్తన్

క. పనిఁ గొని యీనక్షత్రం, బును మృగశీర్షంబు గానుఁ । బుణ్యాకర మై
పొనరెడుకీలి బృథూదక, మునుఁ జేయుము తీర్థరాజ।ముగ బుధు లెన్నన్.

తే. ఇటుల ప్రార్థించి తారకా।ధిపు వేఁడి
విబుధులందఱు భక్తితో । విబుధగురుని
గాంచి వినుతెంచి వినయసం।కలితు లగుచుఁ
బలికి రాకాలమందున । భవ్యచరిత! 171

క. దేవాచార్య! చంద్రవి, భావసులామృగశిరోదు।వాసులు నై స
ద్భావమున వెలసి రతి మతి, నీవిపు డీతారఁ జేరు । మింపొందంగన్. 172

క. మాకార్యము నీవశమై, ప్రాకటముగ నొప్పుచుండుఁ । బరమప్రీతిఁ
జేకొని దానిం జేయుము, నీకు మహాకీర్తి వచ్చు । నిజముగ ధాత్రిన్ 173

క. సురవర్యు లిట్లు నుడివిన, సురగురుఁ డాలించి వారిఁ । జూచి వచించెఁ
గరమేను వృష్టిపతి నై, పరగినఁ బోఁగల నటంచుఁ । బరమమునీంద్రా! 174

క. అంతట సర్వామరు ల, త్యంతముదం బొప్పనట్టు । లగు ననఁ దారా
కాంతుఁడు మృగశీర్షపదా, క్రాంతుఁడు నై సంతసమున । రాణించెఁ దమిన్

సీ. మార్గర్క్షసంయుక్త । మానితశుచిమాసమున నెట్టి తిథిచంద్ర।ముక్త యగుచుఁ
దనరారునో యట్టి । దర్శఁ బురందరుఁ డధికసంతుష్టుఁడై । యలరి సర్వ
పితృదేవతలకును । విమలాజ్యతిలమధుసహితాన్నపిండంబు । సరవి నిచ్చెఁ
గరుణ నందిన పితృ । గణము లాత్మజయునై చెన్నారుమేనతోఁ । జెప్పి రంత

తే. నమరు లామేన నప్డు నీ।హారయుక్తుఁ
డైననగపతి కిడ నతఁ । డట్టిమేనఁ

జెంది సురలందుఁ బ్రీతుఁడై చెలఁగి దానిఁ
గలిసి క్రీడించె స్వేచ్ఛతో గిన్కు లెన్న 176

మేనయందు రాగిణి కుటిల కాళీ సునాభులు పుట్టుట.

చ. పరమముదంబుతో నగరి పర్వతరా జఖిలేంద్రియంబులన్
బొరిఁ దనివోవఁ జేసి బుధపూజితురై వెలుగొందు మేన భా
సురవరదేహ కాంతులను శోభిలి మోదముతోడ నొప్పి ని
ర్జరవనితోపమానలయి రాగిలుకూఁతులఁ గాంచె మూఁగురన్ 177

క. నారద! విను పిమ్మట నా, నారీరత్నంబు కనె సునాభాఖ్యుఁ బెం
పారుకుమారున్ సద్గుణ, వారున్ బటుధీరు శాంతభవనాధారున్ 178

తే. అపుడు మేనాత్మజలయందు నాదిపుత్రి
రాగిణీనామయుతయును రక్తదేహ
నేత్రయును రక్తవసనయై నెగడుచుండు
సకలవిబుధులు తనుఁ జూచి సంతసింప 179

సీ. పరిశుభ్రదేహయు భాస్వదాయతపద్మపత్రనేత్రయు మహాభాగ్యశీల
లక్షణసద్గుణలక్షితాఖ్యయు నీలవక్రకేశయు శుభ్రవసనమాల్య
పుంజరంజితయు నై పొల్పారి కుటిలాఖ్యవలన రెండవపుత్రి వఱలుచుండుఁ
గాలాంజనోపమగాత్రయు మేచకేందీవరనయనయు దివ్యభావ

ఆ. కలిత యగుచు మేన కన్నట్టిమూఁడవ, పుత్రి కాళినామమున వెలుంగు
సరవి వారు నభ్రషట్పూర్వజాతలై, తప మొనర్పఁ జనిరి తాల్మి నపుడు. 180

చ. సురవరు లాశుభాంగనలఁ జూచిరి ద్వాదశసూర్యు లంత భా
సుర శశిసన్నయూఖునదశోభితగాత్రయుఁ జారుశీలసుం
దరయుఁ దపోవిలాసినియు ధన్యయు నా కుటిలాఖ్యభామినిన్
బొరిఁ బరమేష్ఠి లోకమునుఁ బొందఁగఁ జేసిరి తాఁ సోత్తమా! 181

ఆ. పిదప విబుధులెల్ల విధినిఁ గన్గొని మహా
మాన్యచరిత యీమె మహిషు నాశ
కరుఁడు నైనసుతునిఁ గన నేర్చునా దయఁ
బలుకఁ దగుదు వీవు పాలి ననఁగ. 182

చ. విని వనజాసనుం డపుడు వేల్పులఁ గన్గొని యీతపస్వి నీ
వనిత పురారివీర్యమును వాసినిఁ దాల్చుట కెట్లు శక్తయై
పొనరువరాకిశాన నిది ముక్తయు నా నని పల్కె నావరా
నన పరమేష్ఠితో నని మనంబునఁ గోపము పిచ్చలింపఁగన్. 183

మత్తకోకిల. వారిజాసన! శార్వవీర్యము వాహ్యమై తనరారినన్
ధీరభావముతోడ దానినిఁ దెంపుపెంపునఁ దాల్చి వి

స్తారఘోరతపస్స్వరూ గురు । తప్తనై హరిఁ గొల్చి యా
మార వైరి శిరంబు వంచెద । మాన్యులెల్ల నుతింపఁగన్. 184

క. ఇనచంద్రులు గతిదప్పిన, బనిఁ గాని నే నుడివినట్టి । పలుకు నిజంబై
తనరారుచుండు నని పొగ, రునఁ బల్కిన నలువ యపుడు । రూక్షేక్షణుఁడై.

క. కటకటము లదర భ్రూకుటి, నిటలస్థలమందు నాడ, నేత్రములందున్
జిటచిట నిప్పులు రాలఁగఁ, గుటిలాత్మం గనుచుఁ బల్కెఁ । గోపస్ఫూర్తిన్.

బ్రహ్మ కుటిలకు రాగిణికి శాప మిచ్చుట

తే. దారుణం బైనమూర్తితోఁ । దనరునట్టి
కుటిల! వతి! వినుశంభుండు । గుణగణాఢ్యుఁ
డక్షరుండు మహేశ్వరుఁ । డాద్యుఁ డమిత
బలుఁడు భగవంతుఁ డగుచును । వెలయుదీప్తి 187

క. మునులెల శార్వశక్తిని, గనఁజాలక వెఱ్ఱు లగుచుఁ । గ్రాలఁగ గర్వం
బున విఱ్ఱవీఁగి యాకన, ననిఁ బల్కుట ధర్మ మగునె । నెలతా నీకున్. 188

సీ. పాపాత్మురాల! నా । పలుకు నీచేతను తొంతమైనది కాక । సమనె నందు
వలన మచ్ఛాపరో । వహ్ని నిర్దగ్ధవై సర్వభాగములందు । సలిలరూప
కలితవై యొప్పారఁ । గలదాన వని పల్కెఁ । జోణీధరకుమారి । కుటిల పిదపఁ
బరమేష్ఠిశప్తయై । వారిరూపంబునఁ గదువడి బ్రహ్మలో । కంబు ముంచె

తే. నుద్ధతజలాభియుక్తయై । యొనరుకుటిలఁ
గని చతుర్వేదములతోడఁ । గమలభవుఁడు
కడిమి నద్దాని బంధించెఁ । గదలకుండ
మానికులచంద్ర సద్గుణ । మహిత! మౌని! 189

ఉ. అంత హిమాద్రిపుత్త్రి యిటు । లాఘనశాపముచేత బద్ధయై
వంత మదిన్ జిగుర్పఁగను । వారిమయాకృతినుండి వాక్సతీ
కాంతునిదా నిశాంతమునుఁ । గ్రక్కున ముంచుచునుండె నింత బల్
సంతసకట్టి నిర్జరులు । చయ్యన నయ్యెడ కేగి రాగిణిన్. 190

క. పరమేష్ఠి లోకమునకును, గరమర్థినిఁ దెచ్చి నలువ । కడ నత్తరుణిన్
గురుభక్తి నిల్పి తెలిపిన, సరగున నీక్షించి పద్మ । సంభవుఁ డంతన్ 191

క. ఆరాగవతినిఁ గని యో, సారసముఖి! నీవు శార్వ । సద్వీర్యంబున్
గోరి భరింపఁగఁజాలవు, చేరకు మిటఁ బొమ్ము వేఱు । చెప్పక తరుణీ! 192

తే. మండిపడి మహిషాంతయై । మామకాఖ్యఁ
దనరు పుత్త్రుండు కలుగునం । దాఁక ఘోర
తపముతోఁ దప్త నయ్యెదఁ । దాల్మి ననిన
విని విరించి మహాకోప । వివశుఁ డగుచు. 193

వ నారదా! విను మారాగిణినిఁ జూచి దుష్టాత్మురాలా, దేవతలకైన దాఁటరాని నామాటను నీవు గర్వించి ధిక్కరించితివి. కాన సంధ్యారాగరూపిణివై భాసిల్లఁ గల వనిదానికి శాప మిచ్చె నాభామినీలలామ మావిధిశాపసంవర్ధ యై రాగవతి యగుచుఁ గృత్తిభాగమున శైలేయధృతవిగ్రహము నపేక్షించుచుండె నంతఁ దపస్విని యగు మేన తనకూతు లిద్దరు బ్రహ్మశాపమున నెదుటఁ దెలిసికొని చింతాసాగరమగ్నురాలై తల్లడిల్లి తపోధురంధరయగు మూఁడవకొమరితెను నగు కాళికడ కరిగి యుమా యని పిలిచి తపమునుండి దాని నివర్తింపఁజేసి యాపుత్రికి నుమ యనునామం బొనర్చె తండ్రియైనహిమవంతుఁ డట్లె యాపుత్రినిఁ బిలుచుచుండె నంత 194

ఉమ పరమేశునిఁ గూర్చి తపంబుఁ జేయుట

ఉ. ఆయుమ దీక్షతోడను మహాతపముం సుర లెల్ల మెచ్చ నా
తోయమునందుఁ జేయు మనిఁ దోఁచఁ దపోవని కంత భక్తితోఁ
బోయి పినాకపాణియయి బూర్జటుఁడు గోధ్వజుఁడై మహేశుఁడై
కాయజ వైరియౌ హరునిఁ గాఢముగా మది నిల్పి తాపసా! 195

క. గురుతర మైనతపంబును, గరమర్థి నొనర్చుచుండఁ గమలాసనుఁ డా
తరుణీమణి యోగోన్నత, సరణినిఁ గని సురలఁ జూచి చయ్యన నుడివెన్! 196

చ. సరసర లేఖులార! చని సాహస మొప్ప హిమాలయంబునన్
బరమతపఃప్రభావమున భాసిలు కాళిని నాసమీపమున్
సగుడుఁ జేర్పు డన్న విని చయ్యన నిర్జరు లెల్ల నా యుమా
తరుణినిఁ జేరి తద్వ్రతుల భార్గ్యతపోబలనిర్జితాత్ములై 197

క. ఆలలనను గదలింపను, జాలకఁ జింతించుచుండ శక్రుండు వారు
జాలుండై చని దానిన్, గిలించెడిశక్తి లేకఁ గెలుచుఁ బిదపన్ 198

చ. క్రతుభుజనుల్ క్రుద్ధులై వెడలి గ్రక్కునఁ బద్మజుఁ జేరి దేవయా
సతిఁ గొనివచ్చునట్టి దగుశక్తియు మాకును లే దటన్నఁ గి
న్నతి యగుపద్మజుం డపుడు వారిఁ గనుంగొని మీరు తత్తపో
జితరుచులై యడంగితిరి చిత్తములం దతిభీతితోఁ దగన్ 199

బ్రహ్మ దేవతలకుఁ గాళి శివభార్య యగు నని చెప్పుట

క. సురలార! యాతపస్విని, పరశివసతి యగును నిజము భావింపఁగ మీ
రరయఁగ నిత్తఱి విగత, జ్వరులై స్వాలయములకును జను డింపొందన్

క. తారకయుతమహిషునిఁ బటు, దారుణరణమందు మిగుల దర్పించి వడిన్ 200
ధారణిఁ గూల్పం గలరని, కూరిమి భాషింప విష్ణుఁ గూడి ముదమునన్ 201

తే. వేల్పులెల్లనుఁ దమతమ । వేశ్మములకుఁ
జనిరి మేనాసమేతుఁ డై । క్ష్మాధరేశుఁ
డైనహిమవంతుఁ డావేళ । నధికయోగ
పరయుగా నున్నయుమనుఁ దపంబువలన 202

చ. మరలెడు నట్లుచేసి తన । మందిరభాగముఁ జేర్చె; రౌద్రమై
పరఁగి నిరాశ్రయం బగుచు । భాసిలునట్టి వ్రతంబుఁ బూని సు
స్థిరమతి యైనశంకరుఁడు । సిద్ధసుమేరుమహామహీధ్రసుం
దరవనభాగసీమను ము । దంబునఁ గ్రుమ్మరుచుండి యాతఁడున్ 203

క. భూరిహిమాచలమునకును, గోరికి నొకనాఁడు వచ్చి । కుధరేశ్వరవి,
స్తారశ్రద్ధార్చితుఁ డై, యారాత్రి నట వసించె । నంతటఁ బ్రీతిన్. 204

క. మనసిజహరుఁ డెందవదిన, మునుఁ దగమంత్రితునిఁ జేసి । భూధరవిభుఁ డిం
పున నిట నుండుతపోసా, ధనమునకు మహేశ నీవు । దయ తలఁకొత్తన్ 205

క. అని హిమవంతుం డాడిన, మనసార మహేశుఁ డాయు । మాసతియందున్
దనమతి నిల్పి తదాశ్రమ, మున విగతనిరాశ్రయత్వ । పూర్ణవ్రతుఁ డై 206

సీ. తనరారుచుండిన । తతిని దదాశ్రమమున నుండ వాఁడును । బుణ్యరూప
పరివృతుఁ డగుశూల । పాణి యుండినచోటి కగరాజపుత్రి యై । యలరి మిగులఁ
గళ్యాణి యైనట్టి । కాళి యేతెంచినఁ జూచి గిరిశుఁడు । చోద్య మొంది
పదఁపడి పుట్టిన । భార్యగా మది నెంచి స్వాగతంబునఁ బూజ । సల్పె యోగ

ఆ. తల్పరుండు నగుచుఁ । దనరారుచుండినఁ, జెలులఁ గూడివచ్చి । చేతు లెత్తి
భక్తితోడ భవుని । పాదంబులకు మ్రొక్కె, శైలతనయ యష్డ । శైలమందు

ఉ. పిమ్మట నావధూవణిని । బ్రీతి చెలంగుచునుండఁ బెద్దకా
లమ్ము నిజాత్మలో హరుఁడు । లాలితదృగ్గతిఁ జూచి యుక్తి కా
దిమ్మెయి నంచుఁ బల్కె ప్రమ । థేశులఁ గూడి యదృశ్యుఁ డయ్యె నా
కొమ్మయు నట్టివాక్యమును । ఘోరముగా విని విహ్వలాత్మయై 208

క. సగ్గస్థలి తనమదికిని, దుర్గమమై తోఁచ మిగుల । దుఃఖాకులతన్
దుర్గ చని తండ్రితోడను, భర్తని వాక్సరణిఁ జెప్పి । పదపడి పలికెన్. 209

ఉ. తాత మహాటవీస్థలిని । దద్దయు భూరితపంబు చేయ నే
ఖ్యాతి తలిర్ప నేగి సుర । గణ్యుఁడు శంకరుఁడున్ బినాకియున్
ఖాతకహారుఁ డా హరుని । భక్తి భజించెద నంచు దీక్షతో
నాతతిఁ బల్కెఁ దండ్రి విని । యట్లె యొనర్పు మనంగఁ బ్రీతితోన్ 210

— ఆ కాళి లలితాఖ్యఁ గొని శివునిఁ గూర్చి తపంబుఁ జేయుట —

చ. మునివర! యాలతాంగి పటు । మోదముతోడఁ దదీయపాదమం
దనితరభావ మొప్ప లలి । తాఖ్యయు నై శివు నాత్మ నిల్పి పెం

పునుఁ గనునట్టిదా తపముఁ । బొందుగ సల్పుచు నుండె నిర్జరు
ల్గనుఁగొని వింతతో నపుడు । గ్రాలుచు నుండిరి వేడ్క నంతటన్. 211

సీ. నిజసఖీమణు లెల్ల । నిర్మలకుశసమిత్ఫలపుష్పములఁ గొని।వచ్చియిచ్చి
నిత్యసపర్యను । నేర్పుతోడ నొనర్ప నాలలితాదేవి । యధికభక్తి
తేజోమయుండయి।దీపించు మృత్యుంజయశివునిఁ గావించి యా।శివుఁడె నాకు
గతి యని భావించి । కరశుద్ధి నాతుద్రుఁ బలుమఱుఁ బూజించి । వామదేవు

తే. సారెఁ గనుఁగొనుచుండె నా।సారసాక్షి
యంత శ్రద్ధాగరిష్ఠుఁడై । యఖిలపతియు
నైన త్రిపురాంతకుండు మ।హాముదంబుఁ
జెంది వటురూపమునుఁ దాల్చి । చిత్త మలర 212

ఉ. హస్తమునందుఁ గుండి యల।రారను మోదుఁగుకోలమూఁపుపై
శస్త్రినిఁ జెందఁగా నొడుగు । జందెము రంజిల భక్తపాలనా
సక్తుఁడు భూతిపాటలిత।చారుశరీరుఁడు ముంజమేఖలా
న్యస్తకటిప్రదేశుఁడు మృ।గాజినధారియు నై శివుం డొగిన్ 213

శివుఁడు వటురూపమునఁ గాళికడకు వచ్చి సంభాషించుట.

ఆ. వార్ష మొప్ప నప్పు । డఖిలాశ్రమంబుల, యందు సంచరించి । యద్రిరాజ
పుత్రి మెలఁగునట్టి । పుణ్యాశ్రమమునకు, వచ్చె దీప్తిఁ గుటిల।వటుఁడు నగుచు

క. అరుదెంచిన గని పార్వతి, సరగునఁ దనచెలులఁ గూడి।సర్వాత్ముండౌ
పురహరుఁ బూజించి యనెఁ, బరమానందమున నిట్లు । పరమోక్తులతోన్.

ఉ. ఎక్కడనుండి యిక్కడికి । నింపునఁ జేరితి వాశ్రమంబు నీ
కెక్కడనుండునో యిచటి । కేగదవో కరుణించి భిక్షుఁడా!
మక్కువతోడ నా శివుడు । మానుగఁ దెల్పు మటన్న నాతఁ డా
చక్కనికల్కితోఁ బలికె । సంతస మొప్పుచు నుండఁ దాపసా! 215

ఉ. కన్నెరొ! మామకాశ్రమము । కాశినిఁ జెన్నలరారుచుండు నేఁ
డున్నతతీర్థయాత్ర మది । నొప్పఁ బ్రసాదకదివ్యభూమికిన్
బన్నుగఁ బోఁ దలంచి యిట।వచ్చితి నే ననఁ గాళి సత్యసం
పన్నుఁడు నైనధూర్జటినిఁ। బాలిఁ గనుంగొని పల్కెఁ గ్రమ్మఱన్ 217

సీ. అనఘ పుష్కరాదిక।మందు నేపుణ్యంబుఁ బొందఁ బోదువో దాని।పుణ్యఫలము
నయనపత్రీకము।లందు మునింగి ఫలమును భావింపుము । లలిన నంగ
నంగన నేమఁ బ్ర।యాగలో మును మున్గి యంతటఁ గుబ్జామ్ర।మందుఁ గోటి
తీర్థమందున జయం।తినిఁ జండికేశ్వరమునఁ గొనటం బను।ముఖ్యతీర్థ

ఆ. మందు బంధుబృంద।ముందుఁ గర్కంధము, నందుఁ గనఖలంబు।నందు నటు

లగ్నికుండమందు । నాపగేశ్వరియందు, భద్రతటకముల । భక్తితోడ. 218

క. వనితా! నిష్కాముఁడ నై, మునిఁగి త్వదాశ్రమతలంబుఁ జొందితి నిట నుం
డినదానవైన నీతో, మన మలర న్మాటలాడి । మంజులపరణిన్. 219

క. నేనుఁ బృథూదకమునకును, మానిని పోఁగలను వినుము । మతియొకమాటన్
మానుగ నడిగెదఁ గ్రోధము, బూనకు మొగి దానియందు । బుద్ధి న్మిగులన్

క. ఓసూక్ష్మోదరి! నీతో, ద్భాసిత నుగుతపముతోడఁ । బరువడి నాత్మన్
గాసిలఁ జేయుచు యోగా,భ్యాసంబున నున్నవాఁడ । భావం బలరన్. 221

క. భూసురులకు బాల్యంబున, నే సంయుత మైనగాత్ర । మెలమిని శ్లాఘ్యా
వాస మగుచుండుఁ దలఁపన్, భాసుర మగుదీప్తితోడఁ । బ్రత్యహమందున్.

క. భామా! ప్రథమవయస్సున, భీమం బైనట్టితపముఁ । బ్రేమం గాని నీ
వీవాడ్కి నుంటఁ గినుఁగొన, నామదిలో విస్మయంబు । నలిఁ బెంపారెన్ 223

తే. వనితలకు నెల్ల మొదటి జవ్వనమునందుఁ
గవ్ర భోగాస్పదంబు లౌ । కాలములు సు
భోగితంబులు నై చనుఁ । బుడమిలోనఁ
బాసులతోఁ గూడి వర్తింపఁ । బద్మనేత్ర 224

క. విరిబోఁడిరా! నీ వస్థిర, తర మగుయౌవనమునందు । దారుణతపముం
గరమర్థిఁ గోరితివి దుర్భర మని నామదికిఁ దోఁచె । భావింపంగన్ 225

శా. నానాస్థావరజంగమాళులు తమి । న్నవ్యాభి రూపోన్నతా
ధాన ప్రాభవనిత్యసంపదలతోఁ । దల్గొత్తుచున్నట్టి వా
నానైశ్వర్యములందు సంతతము విన్యాణంబుతో నుండఁగా
హానిం గైకొన కేలఁ బెంజెడలతో । వర్తించెదో భామినీ! 226

క. కట్టి దుకూలాంబరమును, కట్టక తమి నారచీరఁ । గట్టితివి బలే
పట్టుదలతోడ నీమది, నెట్టన జెన్నార సాగె । నీరజనయనా! 227

సీ. మానీంద్ర! భిక్షుఁ జేయమాడ్కిన నన్విని శీలాభిరామమ్మై । చెన్ను మిగిలి
కాళికిఁ జెలియు నై । ఘనతపోవృద్ధయౌ సోమప్రభానామ । సుదతి యతనిఁ
గని విప్రసత్తమ! కడిమిఁ దపఃప్రీతిఁ గ్రాలె డిపార్వతి । రమ్యకథను
విను మామహేశ్వరి । విభునిఁగా శంభునిఁ దలపోసి నిష్ఠఁ । దపము మిగులఁ

గీ. జేయుచున్న దనుచుఁ । జెప్పినఁ దలయూచి, పెద్దగాను నవ్వి । విశ్వవిభుఁడు
నైనవామనేవుఁ । డాడె నంతట నుమా, కాంతతోడ నపుడు । కౌతుకమున

క. బోఁటిరో వినుమా! యేనొక, మాటాడెద నిట్టి బుద్ధి । మహి నెవ్వనిచేఁ
బాటింపఁబడెనో నీ కీ, పాటిఁ గనన్ విస్మయంబు । తెలుపంగ దమిన్ 229

క. ఆర్యా! పల్లవకోమల, కార్యం బగునీకరంబు । తర్కింపు మహా!
వార్యబిలేశయయుతమౌ, శార్వకరంబును వహింపఁ జాలునె చూడన్. 230

క. బాలా! చీనాంబరధర,వై లలి వర్తింతు వీవు హరిణాక్షి నవ
స్త్రాలంకృతుఁడై శంభుఁడు, వాలాయము మెఱయుచుండు భావింపంగన్
క. సుందరి! చందనయుతవై, పొందుగ రాజింతు వీవు పురహరుఁ డోలిన్
సుందరభూతివిభూషితుఁ, డుండగు కాయమున మిగులఁ జొలుపారుఁ జుమీ.
క. అనఁ బార్వతి భిక్షునితో, ననె నాతో నిట్లుపల్క ననఘా! తగునా!
ఘనుఁ డఖిలగుణాధికుఁ డా, మనసిజహరుఁ డైనభవుఁడు మది యోజింపన్
సీ. బ్రాహ్మణోత్తమ! విను భవుఁడు శివుండైన ధనియైన మిగుల నిర్ధనుఁడు నైన
రహి నలంకారుఁడై రాణించినను నలంకారవర్జితుఁడు నై కనఁబడినను
దారుణాకారుఁడై తలఁపఁ జిత్తహరుఁడైన నెటువంటివాఁడు నై యొనరుచున్న
మఱియుఁ జర్మాంబరసమహితుఁడైనను నాగభూషణంబులతోడఁ జొనరుచున్న
ఆ. నట్టిశివుఁడె నాకు నాత్మప్రియుండు గాఁ, గలడు పెదవు లదరఁ గడిమి నిట్లు
పలుకనిశ్చయించి భావనియోగిని, వెలయుచుండునట్టి భిక్షుఁ డింక 234
క. వారింపఁబడును శ్రోత్రియు, ఘోరాఘవిముక్తుఁ డగుచు గురుతరనిందా
ధారుఁడు కాఁడని యిటు బ, ల్తిరతతోఁ బలికి యపుడు తెంపు గనఁబడన్

శివుఁడు నిజరూపమునఁ గాళిని గృహంబున కనుపుట

ఆ. వరద యైనకాళి వడిలేచి పోనెంచ, రుద్రుఁ డంత భిక్షురూప మెడల
విలసదాత్మరూపవిభ్రాజితుండు నై, యాలతాంగితోడ ననియె నంత 236
చ. తరుణిరో! నీవు నీజనకుస్థానముఁ జేరుము నీ నిమిత్తమై
ధరణిధరేశుసన్నిధికి దాపసవర్యులఁ గార్యకుఁ బంచెదన్
బరశివకామవై యిట విభాసిలి మ్మృణ్మయరూపశంకరున్
నిరుపమభక్తి నిల్పితివి నీవు వినిర్మలచిత్త మొప్పఁగన్ 237
తే. అట్టి రుద్రుఁడు భద్రేశ్వరాఖ్యతోడ
భువనమందున విశ్రుతిఁ బొందు మిగుల
భక్తి నీ శర్వు సర్వదేవతలు దైత్యు
లోలి శుభకాములై కొల్వఁ గల రటంచు 238
చ. పరమమునీంద్ర! రుద్రుఁ డిటు పల్కనఁ బర్వతరాజపుత్రి భా
సురమతి నింగిదారి పితృసుందరసద్మముఁ జేరె నంతటన్
వరదుఁడు నై సశంకరుఁడు పార్వతిఁ బాసి పృథూదకాఖ్యతోఁ
బరఁగెడి తీర్థసన్నిధికి వచ్చి తదీయవిశుద్ధవారిలోన్. 239
చ. మునిఁగి విశుద్ధగాత్రుఁడయి మోదముతో వృషభంబు నెక్క నం
దినిఁ బ్రమథేశులన్ గలిసి దివ్యవహీధర మైనమందరం
బనుగిరిఁ జేరె నాయది గణాన్వితుఁడై చనుదెంచవట్టి శం
భునిఁ గని భూరికౌతుకము పొల్పెసలారుచు నుండ నత్తఱిన్ 240

ఆ. భవ్యకందమూల। ఫలశుద్ధజలముల, చేతఁ బూజచేసి। చేతు లెత్తి
వందనం బొనర్చి। భక్తితో నొప్పారి, సన్నుతించె మిగుల। సంయమీశ. 241

ఆ. అభవుఁ డంత మంద।రాద్రిపూజితుఁడు నై, తివిరి యాయరుంధ।తీసమేత
ముగ మునీంద్రవరుల।ముదమున నత్తఱిఁ, దలఁచె నాత్మ నట్టి।తరుణమందు

చ. పరశివుచేత నిట్లు ముని।వర్యులు సంస్మృతు లై సుచారుకం
దర యగుమందరాద్రికి ము।దంబున వచ్చిరి దేవదేవుఁడై
పరఁగు పురారి యాయెడను। వచ్చినమౌనులఁ జూచి లేచి సు
స్థిరగతిఁ బూజసల్పి గురు।శేముషితో నిటు లాడె నారదా! 243

ఉ. తాపసులార! మీచరణ।తామరసంబులచేత నిద్ది ని
ష్పాపత నొప్పి ధన్యమయి। పావనమై సురపూజితంబు నై
ప్రాపితపుణ్యయుక్తమయి। భాసిలె భానసముద్భవంబు నా
తాపము వాపునట్టిదయి। ధారణ సొంపెసలారె నియ్యెడన్. 244

క. అతులితశుభసమసద్వి, స్తృతగురుమందరమహీధ్ర।సానుస్థమహా
స్నతమృదుసారసువర్ణాం, చితశిలల వసింపుఁ డిపుడుఁ। జెలువము మీఱన్

చ. పరమమునీశ! శంభుఁ డిటు। పల్క నరుంధతితోడఁ గూడి మం
దరగిరి సానుసచ్ఛిలలఁ। దాపసు లెల్లనుఁ జేరి రంతటన్
స్థిరమతి నుండునట్టి ముని।శేఖరులన్ గని దేవముఖ్యుఁ డై
పరగెడునందికేశ్వరుఁడు। భక్తి చిగుర్పుచు నుండ నారయెన్ 246

క. వారల నర్ఘ్యాదుల వి, స్తారంబుగఁ బూజచేసి। సంప్రయతాత్ముం
డై రాజిలె నంతట జగ, దారాధితుఁ డైనశంభుఁ। డమలగుణాఢ్యా! 247

సీ. ఆత్మయశోవృద్ధి।కై వినయాన్వితు లైనట్టిఋషులతో।నపుడు ధర్మ్య
మై దేవహితము నై। యలరువాక్యంబును బలికె నో కశ్యప।వారుణేయ
గాధేయగౌతమ। గార్గ్యాత్రివరభరద్వాజులారా! మును। దక్షపుత్రి
యగుసతి నాభార్య। యైయుండి తనతండ్రిచే నవమానంబుఁ। జెంది ప్రాణ
తే. ములనుఁ బాసెఁ గదా యట్టి।ముగుద యిప్పు
డద్రిపతిపుత్రి యై యుమా।ఖ్యనుఁ జనించెఁ
గాన నగపతి నడిగి యా।కంబుకంఠి
నిపుడు మత్ప్రియఁ గాఁ గూర్పుఁ। డింపుతోడ. 248

సప్తర్షు లరుంధతీసహితు లై హిమవంతుని యింటికిఁ బెండ్లిపెత్తనము చేయఁబోవుట

చ. అని యిటు పల్క సప్తఋషు।లల్లి యొనర్చిర మంచు నోన్నమో
మనసిజనాశనాయ యని। మానుగ నాడివిశేషభక్తితోఁ
జనిరి హిమాచలంబునకు। శంకరుఁ డంత నరుంధతీసతిన్
గనుఁగొని వేడ్కమైఁ బలికెఁ। గార్యగతి న్మదినిం దలంచుచున్ 249

సీ. చాన! పురంధ్రులు । సత్పురంధ్రులకును ధర్మంబులకును సద్గతిగ నిన్ను
భావింత్రు చనుమని భవుఁ డాడవినియాపెపతిఁ గొండి యోన్న మోభర్గయనుచుఁ
కనెను లోకాచారసరణి నంతట మాను । లోషధిప్రస్థమహోర్వశైల
నాథుని శిఖరంబు చని నేఁగి యక్కడ వాసవుపురివలె । వఱలు తత్పు
ఆ. రంబుఁ జూచి దాని । రామణీయమునకు, మిగుల హర్ష మొంది । మించినట్టి
వింతతోడ నలరి । విభ్రమించుచు నుండి, రట్టియెడను భక్తి । యతిశయిల్ల 250

ఆ. అద్రికన్యలంద । రాయురుంధతిఁ బల్, శ్రద్ధతోడఁ బూజ । సల్పి కప్పు
డామునీశ్వరుల్ । లద్రీశ సుతుచేత, తదనుచరసుదేవతతులవలన 251

ఉ. పూజితులై నగేశ్వరుని । భూరిసువర్ణమణీంద్రసుప్రభా
రాజివిచిత్రమందిరము । రమ్యముగాఁ గని మెచ్చి సత్తపో
రాజితులైనసర్వమును రాజులు నిల్చిరి దానిముందు వి
భ్రాజితమైనద్వారమున । ద్వార్స్థనిరోధము నెంచి నారదా! 252

ఉ. ఆయెడ గంధమాదనసమాఖ్యఁ జెలంగెడిదొడ్డశైల మా
తోయముఁ జూచి విస్మయము । తోఁపఁ గరంబునఁ బద్మరాగసం
ధాయకభూరిదండమునుఁ । దాల్చి రయంబున రా మహాతపః
శ్రీయుతులై చెలంగు మునిశేఖరు లాడిరి వానితోఁ దగన్ 253

శా. సారోదారమహాశుభాకరుఁడు నా । శైలేంద్రుతో నీవు గౌ
మారాకా దయమీఱఁ దెల్పుము జగన్మాన్యక్రియాసక్తి మై
చేరన్ వచ్చితి మంచుఁ జెప్ప మనఁగాఁ । జిత్తంబులోఁ బొంగి యా
ధీరుం డాతఁడుఁ బర్వతేశు కడకున్ । దీపించు సద్భక్తితోన్. 254

ఆ. వచ్చి జానువులను । వసుధాస్థలి న్మోపి, మొగమునందు హస్తములను బెట్టి
పద్మరాగదీప్తి । భాసిల్లుదండంబుఁ, గక్ష నుంచి పలికె । గాంతతోడ 255

క. అనఘా! భవదీయాంగణ, మున నుండెడిద్వారమందు । మును ఋషికార్యం
బునఁ గల్గివచ్చి నీదు, ర్గుణలోలత నున్నవారు । సారె ననంగన్ 256

క. ఆవాక్యము నగపతి విని, భావం బలరార లేచి । పరమార్ఘ్యంబున్
దేవం గొని ద్వారంబున, కావేళ న్వచ్చి భక్తి । హరువొందంగన్ 257

క. ఎదురేగి యామునీంద్రుల, పదములకును మ్రొక్కి యర్ఘ్యపాద్యంబులచే
తఁ దమిం బూజించి సభా, సదనస్థులఁ జేసి తృప్తిసహితుం డగుచున్ 258

ఆ. భావనజ్ఞుఁ డైనపర్వతేశుండు స, ధ్యాగ్ర్యమాసనముల । భాసమాను
లై చెలంగుమునుల । నందఱఁ గని పల్కె, సరసభాషణముల । సంయమీశ!

సీ. ఘనులార! యుష్మదాగమనంబులో నిట వారివాహవిహీనవర్ష మొదవెఁ
బుష్పములేక బహుళఫలపుపొందె ఫలములు పాదపంబులయందుఁ । బొలిమీఱ

క. విను మెవ్వనిపుత్రిక శ్రీభవవరుని రూపగోత్రభాసురలక్ష్మిన్
దనరారం జెందునో యా, మనుజుండె ధన్యుండు కాని మఱియొకం డగునే? 269

మ. అనఘా! స్థావరజంగమాత్మకమునై హర్యాండ భూతౌఘ మెం
దనుక న్నాల్గుతెఱంగులన్ దనరునో తత్కాంప సందాక నా
ఘనభూతాళికి నీయకుమారమణి వీకన్ జలియా మేఘకే
తనుడౌ నీలగళుండు తండ్రియగుచున్ దల్లోకత్తు నిక్కంబుగన్ 270

వ. ఓనగాధిరాజా! అదియునుంగాక వినుము 271

చ. పురహరుఁ గూర్చి దేవతలు మ్రొక్క భవత్సుత యైనకాళికిన్
సొరిది నమస్కరించెదరు చూవె విభూతి పరిస్ఫుతంబు నా
చరణము శత్రుమూర్ధమునఁ జక్కఁగ నుండె నొనర్చునాను మే
మరయఁగ యుష్మదర్థులము మైలెసు భూరికృపారసంబుతోన్ 272

క. గిరివర! హరువిషయంబై, వరదుండ వగు మీపుత్రికఁ బార్వతి త్రిజగ
ద్గురుజననిఁగానుఁ జేయుము, చిరకీర్తియుఁ బొందుఁ గొందు తతితలఁ బొందున్

క. నారద! విను మంగిరసుం, డీరీతినిఁ బలుక విని నగేశునిసుత వి
స్తార మగుసిగ్గుతో ముఖ, సారసమును వంచి హర్షసహితయు నగుచున్ 274

క. ఘనసాహసమున గర్వం, బునుఁ గడిమినిఁ జెందియుండె భూధరపతి త్రి
న్నన గంధమాదనాద్రిన్, గని పల్కెను వేడ్క మదినిఁ గ్రాల మునీంద్రా!

హిమవంతుఁడు కులపర్వతంబులఁ బిలిపించుట.

క. ఓగంధమాదనా! నగ,పూగామంత్రణముతో జగుఁ బో మ్మీ వనఁగా
వేగయుతుఁ డగుచు నతఁ డను,రాగము మిన్నందుచుండఁ బ్రతిగృహమునకున్

క. చని సర్వపర్వతంబులఁ, గని నగవరులార! యద్రిగణనాథుండు వే
డ్కను మిమ్ము బిలిచి రమ్మనఁ, గను వచ్చితి ననుచుఁ బలికెఁ గౌతుక మలరన్

క. గిరినాథునివాక్యంబులఁ, గర మర్థి మనస్సులందుఁ గ్రాలుచు నుండెన్
సరగున స్థిరమగుపమ్మద, భరసంస్థితి నట్టితఱినిఁ బరమమునీంద్రా! 278

వ. హేమకూటోదయ రమ్యక మందరోద్దాలక వారుణ వరాహ గరుడాసన శుక్తిమ ద్వేగసాను శృంగి దృఢశృంగ చక్రకూట చిత్రకూట హేమకూటాదు లగిరిరులును మఱికొన్ని చిన్నపర్వతంబులు దిటుముగ్లై రూపంబు దాల్చి యేతెంచి హిమవంతుని సభామంటపంబుఁ జేరి యట నున్నవారలకుఁ బొందుగ వందనము లొనర్చి కనకరత్నమయాసనంబులఁ దగ సదాజ్ఞఁ గూర్చుండిరి అంత నగరాజు తపస్వినియు నిజభార్యయు నగు మేననుఁ బిలిపింప నామేనక పుత్రీపుత్రసహితయై వచ్చి సభాస్థలంబునందు నాఋషులునుల పాదపంకజంబులకుఁ బ్రణమిల్లి సకలజ్ఞాతులతోఁ గుశలభాషణంబులు భాషించియపు డ్వాస

నంబున వసించె; నంతఁ బర్వతేశ్వరుం డర్ఘాసనోపవిష్టు లగు బంధుగుల నెల్లఁ
గని తేమ ప్రశ్నంబుఁగా నుడివి పిదప స్వరయుక్త మగువాక్యముం జెప్పె
నవధరింపుము 279

సీ. ఈపుణ్యసత్కర్షు । లెలమి నాపుత్రిని హరుని నిమిత్తమై । యడిగి రట్టి
సద్వార్త తెలియదు । జ్ఞాతులారా! మీకుఁ దెలిపితిఁ గావున । దీనియందుఁ
గలధర్మగతినెల్లఁ । గని చెప్ప నగుమిమ్ముఁ గాదని సుత నియ్యఁ । గలనె చూడ
నని యిట్లు భాషింప । నాతనిపలుకుల నాలించి రత్నసిం । హాసనములఁ

ఆ. జెలఁగునట్టి సర్వ । శిఖరు లున్నతిఁ బల్కి
రద్రిరాజ! హరును । లర్థు లైరి
హరుఁడు మనకు నల్లుఁ । డయ్యె గావునఁ ద్రిపు
రాంతకునకు నియ్య । నగును బ్రీతి 280

క. ఇటు లాకులగిరులన్నియుఁ, బటుతరమోదంబుతోడఁ । బల్కుచు నుండన్
దటుకున మేనాసతి తమ, నటనుండినభర్తతోడ । ననియె మునీంద్రా! 281

చ. ధరణిధరేశ! నాపలుకుఁ । దథ్యము నీ విపు డాలకింపు మీ
పరమసుతామణిన్ బితృసు । వర్గము లీపనికోసమై దయా
కరమతు లొప్ప నా కిడిరి । కాన మహేశునివీర్యశక్తి నీ
తరుణికిఁ గల్గువీరుఁ డతి । ధైర్యసమన్వితుఁడై మహోద్ధతిన్ 282

క. ధీరతరరణరంగమ్మునఁ, దారకమహిషులను జంపి । ధారుణిపై వి
స్తారయశోరమతోఁ జెన్నారన్ గలవాఁడు నిక్క । మద్రిగణేశా! 283

క. అని వాక్రుచ్చిన మేనా, వనితామణివాక్యములనుఁ । బరమప్రీతిన్
విని హిమవంతుఁడు పుత్రిన్, గనుఁగొని యీరీతిఁ బల్కె । గాఢాదృతితోన్

క. బాలా! నిను సత్కీర్తిం, బాలాక్షుఁడు సతతసత్కృ । పాలుం డగునా
శూలికి నిచ్చితి నని ముని, జాలంబుల మ్రోలఁ బల్కె । సమరసభణితిన్ 285

హిమవంతుఁడు సుతను హరున కిచ్చెద నని మునులకుఁ దెల్పుట

క. పరమతపోధనులారా! తరుణీమణియైన మదీయ । తనయను నా నీ
విరిబోఁడి భవునిపతి గాఁ, బరఁగు ధ్రువంబుఁగను భక్తిపరయగు మీకున్ 286

క. మునివర యిటు లద్రీశుం, డనిన నరుంధతిపతీశ । హాసిగ్గున మో
మును వంచి యున్నకాళిన్, దనతొడపైఁ జేర్చి శిరముఁ । దడువుచు బ్రీతిన్ 287

క. హరనామోచితములు సైఁ, పరఁగి శుభప్రదము లగుచు । భావానందా
కరము లగునట్టిమాటల, గరమాశ్వాసించె నపుడు । గణ్యులు మెచ్చన్. 288

సీ. అంత సప్తర్షు ల । గాధీశులో నని రనఘ శుభావహ । మై చెలంగి
జామిత్రసద్గుణసహితోత్తరాఫల్గునీ యోగరూఢిని । నెగడు దివస,

మందహాభాగత్రయమునకుఁ జంద్రుఁడు చనుదేరఁ గడగినసమయమరయ
మైత్రాఖ్యతోడనుమలయుముహూర్తమై యలరుచుండును దానియందుఁ బ్రీతి

ఆ. శివుఁడు నీకుమారిఁ జేకొని వేదోక్త, సరణిఁబట్టఁగలఁడు జగము లెన్నఁ
గాలిఁ గూర్పఁబోవఁ గాతించుచున్నాఁగ, నాజ్ఞ నిచ్చి మమ్ము ననుపు మనిన.

వ. విని యప్పుడు. 290

చ. మునివర! యద్రిరాజు శుభమూలఫలాదుల నంత సన్నిధిన్
మునులను బూజచేసి మదిఁ బొంగుచు వారల మెల్లమెల్లనన్
బనుప మహానిశాంతమును బాలిని వేగమె వీటిమందరం
బునకును మాను లేగి సురపూజ్యుని నాహరుఁ గాంచి భక్తితోన్. 291

ఆ. చేతులెత్తి మ్రొక్కి శివ! నీకు నగపుత్రి
భార్య యగును నీవు భర్త వగుదు
వఖిలలోకవాసవాదులు కనఁగల
రభ్రకేతనుండ వైననిన్ను 292

క. అని మానుల్లాడఁ బురసూ, దనుఁడు ముదంబున సమస్తతాపసులను భ
క్తివరుం ధలిఁ దగ సత్క్రమ, మున నపు డర్చింప వారు పోయిన పిదపన్ 293

చ. హరుఁడు తలంచె దేవతల నప్పుడె పద్మజచక్రిచంద్రభా
స్కరముఖదేవతాధిపులు శంకరదేవునిఁ జూడ నేగి సు
స్థిరమతు లొప్పమ్రొక్కి నివసించిరి క్రమ్మఱ నాత్మలోపలన్
బురదమనుండు నందిముఖభూతతతిన్ దలపోసెఁ బేర్మిమై 294

శా. సారాచారవిశారదా! వినులపుచ్చారిత్రులై నట్టి యా
ధీరు ల్సర్వసుపర్వసంయుతుఁడునై దీపించు గంగాధరున్
జేరన్ వచ్చి వసించి రాయెడ జగత్సేవ్యుండు నారుద్రుఁ డిం
పారన్ వారలఁ జూచి సుందరతనుండై యంతయున్ రాజిలెన్ 295

ఉ. అంతట నంది వచ్చి యమరాధిపులన్ గని క్షేమవార్త న
త్యంత మొనర్చి లేచి జగదాధ్యుఁడు నా హరిఁ జేరి కౌఁగిటన్
బంతుపహింపఁ జేర్చి తనుబాధ నొనర్చి సరస్వతీమనః
కాంతునిఁ గూర్చి మ్రొక్కెఁ దలఁ గాంతుని వంచి విధాత్రునందనా. 296

క. తిరుగ నతఁ డింద్రుతోడను, సురుచిరగతిమాటలాడి సొంపున నుండన్
బురహరుఁ డఖిలామరతతిఁ, బోరి సన్మానించెఁ జూచి పొంగారుమనన్ 297

తే. సరవి పాశుపతాదిశాస్త్రములు దివ్య
వీరభద్రపురోగమవిమల శైవ
గణముల భవుఁడు జయముతోఁ గ్రాలు మిగుల
నని ప్రవేశించిరో తాపసాధివర్య 298

దేవపరివృతుఁడై శివుఁడు హిమవంతుని గృహంబుఁ జేరుట.

వ అంత భగవంతుఁ డగు శర్వుఁడు పార్వతిఁ బెండ్లాడ నెంచి సర్వసుపర్వపరివృతుఁడై సుందరబంధురకందరం బగు మందరనగంబుననుండి నానావైభవంబున శైలరాజసదనంబునకుఁ బోవ సమకట్టె. అట్టియెడ వేల్పులతల్లి యగునట్టి యదితియును శోభనయు సురసయు నగుసురభియు మఱికొందఱు చెలులు లాకైలాసంబు నలంకరించుటకై వెడలిరి ఆసమయమునం జందుధరుఁడు మహాస్థిమాలావిరాజితశేఖరుఁడును, మంజురోచనాతిలకోద్భాసితలలాటుండును, మృగేంద్రాజినుండును, కాకోదరకృతకర్ణకుండలుండును, సమున్నతజటాకలాపభాసురుండును, దగ్ధకాంచన మహారత్నస్థగితకంకణ కేయూరహారనూపుర రుచిశోభితుండును, గోరాజవాహనుండునై నాణెంచె ఆశివాగ్రభాగమందుఁ దమతమ వాహనములపై నధిష్ఠించి ప్రమథగణంబులు చనుచుండిరి అగ్నిపురోగములైన దేవతలు ముక్కంటి వెనువెంట నంటి పోవుచుండిరి 299

ఉ తోయజసంభవుండు బహుళోషపు వెల్గఁగ హంస నెక్కి యా
తోయమునందుఁ బోయె గతదోషుఁడు నా హరివంతెమూఁపునన్
పాయని భక్తితో వెలసి పాండుర ఛత్రసితాతప
త్రాయతదీప్తితో నడరి యత్తఱిఁ బోయె శచీసమేతుఁడై 300

క వరబాలవ్యజనంబును, సరిదగ్రణియౌ యమున సంతస మలరన్
గరమునఁ గొని కచ్ఛపమున, నరిగెను గురుభక్తితోడ నా కాలమునన్ 301

తే హంసకుందేందుసంకాశ మైన ఛత్త్ర
విసరమును జేఁబూని విమలకాంతి
నడరి వచ్చెను సరిదాఖ్యయౌ సరస్వ
తీతరంగిణి నిజకాంతి దిశలఁ గుల్క 302

ఉ తావులకెల్లఁ దావులయి తద్దయుఁ బంచసువర్ణకాంతితో
వావిరిఁ గుల్కుపువ్వులను వాలిని షడ్రుతువు లర్థిఁ జించి స
ద్భావనిరూఢి నేగ సురవారణపన్నగముఖ్యనాగముల్
విని నెక్కి ప్రాలుఁగొని రేవఁ బృథాగతి మేఁగ వాయుచున్ 303

సీ గంధర్వతుంబురుల్ కరమర్థి నెంతయుఁ గాంతస్వరంబునై త్రాలునట్లు
గానంబు చేయుచుఁ గదలిరి కిన్నరగతులు వాయించుచుఁ జాలి నడువ
నచ్చరలెల్లను ముచ్చటతో నాడ సర్వమునీశులు సరస నేగ
భూరితపోనిష్ఠఁ బొల్పారు మహానులు పరిపరివిధములఁ బ్రస్తుతింప

తే. మూఁడుకన్నులు కలవాఁడు పురహరుండు
నిర్జరేశుఁడు శూలపాణియు మహేశుఁ

దైనశంభుని సిద్ధు లత్యధికభక్తి
వెలయఁ గొలుచుచుఁ బోయిరి । విప్రవర్య! 304

వ. మఱియు నేకాదశరుద్రకోటులును, ద్వాదశాదిత్యులును, భాసురాష్టకోటివసువులును, సంతతోర్ధ్వవీర్యు లగుచతుర్వింశతికోటి ప్రమథులును, లెక్కలేని యక్షరాక్షసులు, శితికంఠునిఁ బెండ్లికొఱకై వచ్చుచుండిరి. మృత్యుంజయుఁ డిట్టివైభవంబున నలరారుచు నొక్కక్షణమాత్రమున వచ్చి హిమవన్నగతలంబుఁ జేరె. అంత నఖిలదిక్కులనుండి కుంజరస్థము లగుచు సర్వపర్వతంబు లరుదెంచి నిలిచె. అపుడు భగవానుఁ డగుముక్కంటి స్థావరాధిపుఁ డగుహిమవంతునకు నమస్కరించె. నగంబులెల్ల హరునకుఁ బ్రణమిల్లిన నామృత్యుంజయుండు హృష్యమాణుఁడయి పార్శ్వచామరగ్రాహకుం డైన నందీశ్వరుండు దర్శింపఁ జేయుదారినిఁ బట్టినగాధిరాజు దివ్యభవనంబుఁ జొచ్చె నంత 305

హిమవంతుని పుత్త్రికలు హరునిఁ గానఁ బోవుట

ఉ. ఆనగరంబున న్వేలయు । నంగన లంబుదకేశనుం డిటన్
సూనశరారివచ్చె నని । సొంపునఁ బల్కుచు నుండ నక్కడన్
మానుగఁ జేయుకార్యముల । మాని ముదన్వితలై చెలంగి యీ
శానుఁడు నైనశంకరునిఁ । జయ్యనఁ జూడఁగ వచ్చి రింపునన్ 306

చ. మునివర యొక్కచేడె కడుఁ । బొంగుచు నొక్కకరంబుతోడఁ గొ
ప్పును మఱియొక్కహస్తమునఁ । బుష్పలదండనుబట్టి వచ్చె శం
ఘాని కెదురేగ నవ్వలతి । పొల్పగులత్తుక నొక్కకాలఁ బూ
సినదయి యన్యపాదమునఁ । జేర్పక వచ్చె హరున్ గనన్ దమిన్ 307

సీ. కలికి యొకర్తుక । కంటికి మృదుశలాకమునఁ గాటుకఁ దీర్చి । కన్నెక శంభుఁ
డరుదేర నంజనాయత్తశలాకముఁ బూని వేగంబునఁ । బోయెఁ జూడ
సొంపుతో వేఱొక । సుందరి సరశనావస్త్రంబుఁ జేఁబూని । వామదేవుఁ
గనులారఁ జూచెడి । కాంత విపస్త్రయై వచ్చె వేఱొక । దివ్యవనిత యపుడు

ఆ. విశ్వవిభుఁడు రాఁగ । విని నిజకుచభరా
లసయు నగుచు నాత్మ । లలితతరుణ
నవ్యగురుతరస్తనంబుల నిందించెఁ
జిత్తమందు మిగుల । శిష్టచరిత! 308

క. పురహరుఁ డాపురిలోఁగల, వరిబోణుల కెల్లఁ గలఁత । విపులస్థితి నీ
కరణి జనింపఁగఁ జేసెను, బరిపరివిధములుగ నపుడు । భాసురలీలన్ 309

తే. సరవివృషవాహనుండు నై । శంభుఁ డట్టి
వైభవంబున నలరారి । శ్వశురదివ్య

దాలయముఁ జేరె నంతట । నటవసించు
భామలందఱు నగరాజు । వాసమునకు. 310

క. చను దెంచిన శ్రీశంభునిఁ, గని కాళీపదమునందు । గడు దుర్భరమై
తనరు తప మెల్ల సడలించె నితం డమరేశుఁ డనుచుఁ । జెప్పుచు మరలన్ 311

ఉ. ఈరమణీయగాత్రుఁడు రతీపతినాశుఁడు దక్షయాగసం
హారుఁడు దక్షహంతయు మహాత్ముఁడు శూలపినాకహస్తుఁ డా
నారయ నంచుఁ బల్కి రపు డన్యులు కొందఱు భక్తి నామహా
వీరునిఁ జూచి లేచి మది । వింత జనింపుచు నుండ నారదా! 312

చ. వరద ఫణీశచిహ్నితవిభాసితకుంతల శూలహస్త భీ
కరశమగర్వభంజన నగప్రభుజాధిప నీకు మేము సు
స్థిరమతు లొప్ప వందనము చేసెద మంచని పల్కి రిట్టు లా
సురపతి సంస్తుతిం గనుచు సొంపువ నుండెను వేడ్క నంతటన్ 313

చ. కరముల నాలపత్రమును । గైకొని పట్టుచు వాసవుండు బం
ధురగతి రాఁగఁ గిన్నరులు । తోషితులై వినుతించుచుండ భీ
కరఫణియుక్తసర్పకృతకంకణహస్తుఁడు భూతిలిప్తభా
సురవరకాయుఁ డా హరుఁడు । శోభిలె నిట్టులు తాపసేశ్వరా! 314

సీ. అంతట నగ్రస్థుఁ । డగ్రజాతుఁడు మహాకౌతుకయుతుఁ డనుగతుఁడు నైన
హరిఁ గూడి మంగళార్ఘ్యం బగ్నిమిళితమా పెండిలినిన్నపైఁ । బ్రీతిఁ జేరెఁ
బురహరుఁ డిటు చేరఁ । బొల్పారఁ గనుఁగొని సప్తర్షిసహచరసహితుఁ డగుచు
నద్రీశుఁ డతులితహర్షయుక్తుం డయ్యె నాతనిగృహమున । నలరు జనులు
తే. తివిరి కాళీసమాలంకృతిని జెలంగఁ
జేయుచుండిరి మేటి జేజేలు మిత్ర
వరులు కులపర్వతములు వైవాహికోత్స
వమున ముదమున నలరిరి । ప్రాయికముగ 315

ఉ. చానలు పార్వతీసతినిఁ । జారుదుకూలపశుద్ధవస్త్రసం
ధానశరీరఁ జేసిరి ముదమ్మునఁ దమ్ముఁడు నా సునాభుఁడా
మానినిఁ బెండ్లిపందుగును । మారవిరోధిసమీపసంస్థితం
గా నొనరించె నాత్మఁ గడుఁ । గౌతుక ముల్లసిల న్మునీశ్వరా! 316

చ. సురుచిర హేమదివ్యమణిశోభితసౌధమునందు వెల్గు ని
ర్జరు లొగిఁ బార్వతీభవు లచారుగతిం గనుచుండి రంత శం
కరుఁడు గిరీశజం గలిసి । కౌతుకియై భువనానుజుష్టమా
వరసదమందు భాసిలె నవారితదీప్తి చెలంగుచుండఁగన్. 317

సీ. తాపసేశ్వర! యటఁ । దనరు శ్రీదారామచిత్రపుష్పాగము । లెల్లపుమిగుల
గంధాఢ్యములు నైన । గంధచూర్ణములతోఁ బ్రవిరళవనము లై । ప్రబలికుంరి
తంబు లై గిండిలోఁ । దనరు పుష్కరబిందుపాతనంబులతోడ । భాసమాన
సింధూరపుంజవిశిష్ట ముక్తాదామములఁ బార్వతికి శుభాభిజాని కధిక
తే. మైనవేడుకఁ గావించినట్టి వరయ్యె, వార లంతట భూదేవి భావ మలరఁ
జేసి రావేళఁ గౌతుకచిత్త సరణి, మానులందఱు సంతోషసహితు లైరి

— శ్రీశంకరులు వివాహవేదిపైఁ గూర్చుండుట. —

ఉ. శంకరుఁ డిట్లు శ్రీడఁదమి । సల్పి నగాత్మజఁ గూడి శోభతోఁ
బొంకము నై దృఢత్వమునఁ । బొల్పెసలారి మునీంద్రసంస్థితిన్
వంకట మొందునట్టిదయి । చాలవెలింగెడు యాగ్యవేదిపై
సంకలితప్రమోదభరితాత్ముఁడు నై తగఁజేరె నంతటన్ 319

క. గిరిపతి శుద్ధినిశుద్ధాం, బరుఁ డై కుశపాణి యగుచుఁ బ్రత్యగ్విధినోఁ
బరఁగు మధుపర్కమును గొని, వరదీప్తిఁ జెలంగెఁ బార్వతీవదనుం జగుచున్.

తే. ఇట్లు లుపవిష్టుఁడౌ సర్వేశుఁ జూచట, నొప్పు సప్తర్షులఁ గాంచుచుండి గర్గ
నలరు శంభునకును మ్రొక్కి యాత్మసాధ, నాకరం బగువాక్యంబు నాడె భక్తి.

సీ. పురనాశకర విను । పులహాగ్రజునిపౌత్రి యై పితృకాహిత్రి యై మదుక్తి
యగుచు నాపుత్రి యై । యలరు నీకాళినిఁగోరుమా యని యిట్లు కుధరనాథుఁ
డాడి శంభునికర । మాత్మహస్తంబునఁ బట్టి నాకోమలిలిఁ । బాలి నీవు
దయఁ గొనుమని యిట్టు తెగఁబల్కి సుతనియ్యనటిముటిభవుఁడప్పు డాడెనంటి
ఆ. వాఁడ గిరిచయంపు । బాంధవపితృమాతృ, దాయవిరహితుండ । దపుని నేనుఁ
గోరుచున్నవాఁడఁ । గిరాత్మ నీదుకుమారి, భావ మలరుచుండఁ । బర్వతేశ

— పార్వతిని బరమేశ్వరుండు పెండ్లాడుట —

మ. వరదుం డిట్లు వచించి కాళి కరమున్ । భద్రంబుఁగా నాత్మసుం
దరహస్తంబునఁ బట్టఁ గోరి యపు డుద్యద్గాత్ర యా దేవి శం
కరసంస్పర్శముఁ జెంది హర్షయుతయై । త్రైలోక దరారూఢుఁ డై
కరమర్థిన్ భవుఁ డార్యఁ గూడి మధుపర్కంబు న్మహాప్రీతితోన్ 323

ఆ. కొని మనోజ్ఞశుక్ల । గుకులాజలనుసతి, కరమువంచుఁ బెట్టఁ । గమలజాతుఁ
డంత నగజఁ జూచి । హార్గంబు విన్నంచె, చెలఁగుచుండెఁ బలికెఁ । శిష్టచరిత.

క. గిరిజా చంద్రప్రభతో, బరఁగి మనోహరము నైన । భర్గునిమోమున్
బరికింపుము సమదృష్టిని, బొరి వలగొను మగ్ని కిపుడు । పూర్ణిపుభక్తిన్. 325

క. అనఁ బార్వతి శివవచనముఁ, గనుఁగొని పులకాంచితయయి । కాశ్యపికంజా
ప్తుని ఖరకిరణత్రయు నై, ఘనవృష్టినిఁ జెందు కరణిఁ । గనుఁగొన నలరెన్. 325

త్యంతరయంబుతోడఁ గుధ| రాధిపు కాననసీమనుండి యా
కంతువిరోధిభార్య యగు| కాళి వసించెడిచోటి కుద్ధతిన్ 346
క. ఖరనఖదంష్ట్రాయుధ రై, పరఁగెడి పులివచ్చి యేక| పాదముతోడన్
స్థిరగతి నుండినదేవినిఁ, బరికించిన దగుచు నిట్లు| భావించె మదిన్ 347
క. ఈమానిని కడ నెప్పుడు, భూమిని బడఁగలదొ యపుడె| పూనిక నస్మ
ద్భీమవ్యాపారంబును, గామించి యొనర్ప గలను| గడిమి నటంచున్. 348
ఉ. మానుగ వ్యాఘ్ర మాకరణి| మానససీమను జింతచేసి యా
మానవతీమణిపార్శ్వమున| మానని దృష్టిని జేర్చి నిత్యసం
ధానవిలోకనత్వమున| దద్దయు శోభిలెఁ గాలి నిష్ఠనుం
బూని తపస్వితిభవుని| పుణ్యపదంబును జెంది భక్తితోన్ 349
క. ధారణశౌచపసులనియతి, సాకోదామముగఁ జేయ| సకలేశ్వరుఁ డా
వారిజజాండాగిరిజన్, జేరన్ జని కరుణ మదినిఁ| జెన్నలరారన్ 350
ఆ. పరమభావమునను| భావించె నోదేవి, తపముతోడ నీవు| దగ్ధపాప
వైతి వ్యాఘ్రమందు| వలరెడివరము నే, నిత్తుఁ గోరు మనుచు| నిట్లు పలుక
క. గిరిజ వచించెను వాణీ, శ్వరు గని యీ విప్రుడు మిగుల| వ్యాఘ్రంబునకున్
వరదుఁడ వగుమందును దయ, బరఁగెద నే ననుచు నిట్లు| భాషింప మునీ 352

॥ బ్రహ్మ శార్దూలమునకుఁ బార్వతికిని వరము లిచ్చుట. ॥

సీ. పద్మసంభవుఁ డంతఁ| బరమార్థభూతత్ప్ర|యోపకబుద్ధి నలరారు| వ్యాఘ్రమునకు
భూరిగాణాపత్య|మును విజయత్వంబు హరునిమీఁదను భక్తి| నధికధార్మి
కత్వంబు నిడి భవ్య| కాంతతో నని దేవి శాశ్వతవరము| సరవి నిచ్చి
యడుగు మొసంగెద| నన నచలాత్మజవారిజాసనుతోడఁ| బలికె నిట్లు
ఆ. బ్రహ్మదేవ నాకు| స్వర్ణసన్నిభమైన, వన్నె నొసఁగు మనుచుఁ| బలుక నాతఁ
డట్లు లగును నీకు| నని చెప్ప చనె శైల, పుత్రి యైనకాళి| పొలుపు మిగిలి.
ఆ. కృష్ణవర్ణ మగుచుఁ| గాళికాకోశంబు, వదలి పద్మమధ్య| భాగకేళి
రక్తభాసమాన| రసస్వర్ణంబున, నలరె నట్టికోశ| మందు మరల 354
క. యసలికానామ్యయని నాయె, భాసిలె వేయికను దాని| బజ్జసఁ బ్రీతిన్
వాసవుఁడు వచ్చి దక్షిణ, నాసమయమునన్ గ్రహించి| యగజకనేఁ దమిన్
క. విను మగసుత నీకోశం, బున నీకౌశికి జనించె| బుధు లగ్గింపం
గను నేఁ గౌశికఁ యనునా, మను నిది పోదరియు నగుచుఁ| మాయానుఁదగన్
శా. కారుణ్యంబున నిట్టి కౌశికిని వేడ్కన్ నాకు నిమ్మంచు వి
స్ఫారప్రాభవుఁ డైనశక్రుఁడు లపత్చారిత్రయౌ దేవినిన్
స్వీకారత్వంబునఁ గొంచు వేగమె ప్రభన్| దీపించు వింధ్యాద్రినిన్
జేరంబోయి తదద్రిపై నిలిచి తాఁ| జెన్నారు సద్భక్తిమై 357

తే. కాశికిని జూచి యాదివ్య। ఘననగంబు, నందు నుండి సురార్చిత। యై చెలంగి
వింధ్యవాసిని యనుపేర। విశ్వమందు, వాసి కెక్కుదు వీవని। పలికి యంత.

ఉ. ఆనగమందు నావరద। నాదట నిల్పి మృగారి నిచ్చి దు
ర్దానవసంహారిణి దనుము। దానవు భక్తజనాళి కెల్ల వి
జ్ఞానదవై చెలంగుమని। సన్నుతిచేసి సురేశుఁ డంతటన్
మానిత నాకలోకమును। మానుగఁ జేరెనుఁ దాపసేశ్వరా! 359

క. గిరిజయు నట్టివరంబును, సరసిజభవువలన నొంది। సంతసమున సుం
దర మగునిజమందిరమున, కరుదెంచి విశేషభక్తి। యలరుచు నుండన్. 360

ఆ. ప్రాణనాథుఁడైన। భవునకుఁ బ్రణమిల్లి
వినయసహిత యగుచు। వెలయుచుండె
నంత నమరనాథుఁ। డగువాఁడు శ్రీమంతుఁ
డవ్వయుండు నైన। వారుఁడు వేర్మి. 361

## భవుఁడు భవానిం గూడి మహామోహన మొనర్చుట.

చ. వరసతి యైనపార్వతిని। భావము రంజిలఁ గూడి వేయి వ
త్సరములదాఁకఁ గాయజుని। సంగరమందుఁ బెనంగుచుండె నీ
కరణి పురారియుంట సుర। గణ్యులు భీతిలి రబ్బు లింకె దు
స్తరగతి సర్వలోకములు। సంచలనంబునుఁ జెందె నారా! 362

ఉ. అంతట వేల్పులెల్ల నమ। రాధిపుఁ గూడి సరస్వతీమనో
కాంతుగృహంబుఁ జేరఁ జని। గాఢపుభక్తిని మ్రొక్కి దుఃఖ మ
త్యంతరయంబుతో నడర। నాతని జూచి మహేశ! యేలకో
వంతను గుందె లోకములు। వావిరి నిత్తతి నంచుఁ జెప్పినన్. 363

చ. అనఘ! సురేశు లిమ్మెయిని। నాడినఁ బద్మజుఁ డంత వారితో
ననె ఘనులార! శంభుఁ డగ। జాసతిఁ గూడి సుమాస్త్రకేళిలోఁ
దనరెను దానలోకములు। దద్దయు నాక్రమితంబు లై పెనం
గొనఁబడుచున్న వీకరణి। ఘోరభయంబున విఱ్ఱవీఁగుచున్. 364

సీ. ఈరీతిఁ గను వాక్స। తీశుఁ డాడినసుర లనిరి శక్రునితోడ। నమరనాథ!
పోరిఁ బోరి శంభుని। మోహన మెందాక నసమాప్తి నొందిన। దగునో చూడ
నంతకుముందుఁగ। నరిగెద మారలి ముగిసినతోడనె। పుట్టునట్టి
బాలుఁ డవ్వయుఁడు నై। భాస్వదైంద్రపదమ్ము నపహరింపఁగలఁ। డనిరి; పిదప

ఆ. విబుధభాషణముల। విని భవిష్యత్క్రియా, చోదకప్రభీతి। సొరిది నఖిల
కర్బురేశ్వరులకు। జ్ఞానమెల్ల నశింప, సాగ నపుడు మిగుల। శక్రుఁ డోలి 365

క. సురదవానసహితుఁడై మం, దరముఁ బొందికనుఁ జేరెఁ। దచ్ఛిఖరముల
సురలుండి రామహేశా, చిరముఁ బ్రవేశింపలేక। చిడిముడిపడుచున్. 366

ఆ. పెద్దకాల మిట్లు । పెనుపగుచింతతో, నగరి వార లగ్ని । ననుప నాసు
పర్వసత్తముండు । భవునిముఖద్వారగ, మందుఁ జేరి నంది । నపుడు చూచి 367

శా. ఈ నందీశుఁడు దుష్ప్రవేశకుఁ డై । యేపారుచున్నాఁడు నే
నూనాస్త్రారిని నెట్లు గాంతు నకటా । క్షోభంబు మిన్నంద వి
జ్ఞానం బేమియు లేక దుర్గ్రాహిలో । గాఢంబుగా మున్గి సం
ధానోపాయముఁ గానకుండి మఱి బోల్దర్కించుచుం గ్రన్నవన్ 368

చ. హరుగృహమధ్యనిర్గతయు । నా పృథువాంసవిశుద్ధపంక్తినిన్
గరమటఁ గాంచి యిద్ది కడు । గర్వస్ఫురద్యుక్తి యటంచు నెంచి భా
సుర వరగుహాంసరూపమున । శోభిలి వంచనతోఁ నందినిన్
సరగున మీఱి పావకుఁడు । సెంచని ఱంగిలి జొచ్చె నారదా! 369

ఆ. అభవు శీర్షదేశమం దతిసూక్ష్మరూ
పముననుండి నవ్వి । భర్గుబుధ
వరులువచ్చి భక్తి । ద్వారస్థులై రని చెట్టి
దనుగఁ బెట్టె నపుడు । ధైర్యవృత్తి 370

క. పురహరు డామాటను విని, వరమతిని న్వెడిచి లేచి । పరువడి వైశ్వా
నరు డు తనవెంట రాఁ జ, త్వరనిర్గతు డగుచు వేగ । వారలకు వచ్చెన్ 371

చ. పరమమునీశ! శంకరుఁడు । వచ్చినఁ జూచి సురేశచంద్రభా
స్కరదహనాదిదేవతలు । కార్యమ మీఱను వ్రాలి మ్రొక్క నా
హరుఁ డనెఁ బ్రీతి నెట్టివి । నాత్మలఁ గోరి సురేంద్రులార! నా
సరసకువచ్చి నమ్రులయి । ప్రస్తుతిగుప్పుచు నుండు భక్తిమై 372

ఆ. నిలిచియున్నవారు, । నెఱి నట్టి కార్యంబుఁ
బలుకుఁ డిపుడు మీరు । భయముఁ దక్కి
కోరినట్టివరముఁ । గొనసాగఁజేసెద
ననఁగ విబుధు లనిరి । హర్షమొప్ప 373

క. పరమేశ! మేము కోరిన, వరము నొసంగుటకు నీకు । వాంఛకలిగినన్
నిరసింపుము మోహనమును, గరుణానతి నన్నభవుఁడు । కౌతూహలియై 374

సీ. బర్హిర్ముఖులతోడ । భాషించె నీరీతి వేల్పులారా! నేను । విపులమోహ
నంబును వదలితి । నలి నాకు నిస్తబ్ధతేజోత్వము క్రమమై । వెలసె; దానిఁ
గోర నానొక్కఁడు । కోర్కి మీలోనను । బుణపలోఁబడి చిక్కి । పొగలు ధేను
చయములచందాన । సర్వనిర్జరు లంత భయయుక్తులై యున్నఁ । బావకుండు

ఆ. చంద్రధరునిఁ జేరి । శర్వ రేతోమోక్ష, ణమ్ముఁ జేయు మీవు । నెమ్మి దాని
వలఁచివాడ ననిన । వడి జాలువీర్యంబు, నగ్ని విడిచె నభవుఁ । డంత బూన్కి.

మ. అనలుం డాభవువీర్యముఁ గొనెను నారాజ్యంబుఁ దమిఁ గ్రోలియుం
తనె బల్తృష్ణను నీరుఁ ద్రావునరుచందం బొప్ప నీ రీతి శం
భుని వీర్యమ్ము కృశానుపీత మగుచుం । బొల్పార దేవేశు లీ
శుని నామంత్రితుఁ జేసి స్వస్థమతులై । శోభిల్లుచుం బిమ్మటన్ 375

చ. అరిగిరి శంభుఁ డాయెడ నిజాలయసీమకుఁ జొచ్చి పార్వతీ
తరుణినిఁ జూచి దేవి! సురతల్లజు లందఱు వచ్చి పావకున్
మారువునఁ బంపి నీయుదరమందు సుతుం డుదయింపకుండ నా
సరస వచించి యాజ్ఞఁ గొని । చయ్యన నేగి రటంచుఁ బల్కినన్ 377

పార్వతి సురలకు శాప మిచ్చుట.

ఆ. గోత్రరాజతనయ । గోపతి నుడి విని, శోణనేత్ర యగుచు । సారిడిఁ బలికె
నస్మదుదరమందు । నావిర్భవించెడి, సుతునిఁ జూడలేని । సురలు రతిని 378

క. తనయులఁ గనఁజాలరు తమ, వనితలయం దనుచుఁ గోపవశ యై శాపం
బును బెట్టె శౌచశాలకుఁ, జని జలకము నాడఁ దలఁచి । సంతస మలరన్ 379

క. లాలితహేమాభయు గుణ, మాలినియు శుభాంగి యైన । మాలినిఁ దమి నా
కాలమున బిలువ నది శుభ, జలములు గొని లలితకడకు । సద్భక్తి మెయిన్ 380

క. చనుదెంచి శుష్కపరిమళ, మున నుండినవలుఁగు హస్తములఁ బార్వతి మే
నునఁ బెట్టఁ గిటగుణమునఁ, దనపుడిలో దానినగజ । తలఁపక యుండెన్ 381

క. ఆయుపిద దాని నొప్పని, దై యుంటం జూచి క్రొత్తకరాగంధద్ర
వ్యాయతపిష్టమ్మునఁ గా, త్యాయనికిని నలుఁగుఁ బెట్టి । హర్షము మీఱన్. 352

సీ. స్నానకారణమున । సద్మంబునకు నేగ నాసన యంబున । నద్రితనయ
యమలలక్షణలక్ష్మి । నాతిశోయుఁడు. జతుర్బాహుఁడు వరవేష । వరుఁ డైన
గజవక్త్రపురుషునిఁ । గాంతు స్వేదమలంబువలన నిర్మించి యా । వసుధ నునిచి
భద్రాసనంబుపై । భాసిల్ల నేతెంచి నవ్వుచు మాలిని । నగజ యపుడు

తే. నుష్ణజలముల స్నానంబు । నొగి నొనర్పఁ
గొంచె మగునట్టి నవ్వుతోఁ । గూడియున్న
మొగము కలమాలినినిఁ గాంచి । భూధ్రపుత్త్రి
పలికె నోచెలి! యేటికిఁ । బ్రాఁశి నిట్లు 383

క. మెల్లఁగ నవ్వుచు నీవిపు, డుల్లసనముతోడ మిగుల । నొప్పెద వన నా
పల్లవపాణి యుమాసలి, యుల్లమురంజిల్ల నుడివె । నుజ్జ్వలమూర్తి! 384

మ. వనితా! నందిగణేశ్వరుండు సుతుఁడై । భాసిల్లు నీవేళ నీ
కని పుత్త్రేప్సితవాంఛితుం డగుభవుం । డాడెన్ దవిన్ దాని నే
ర్పును నాలించుటచేత నాకుఁ గలిగెన్ । గాఢోల్లసద్హాస మం
చని చెప్ప న్విని దేవి స్నానము విధిన్ । హర్షాంచఁ జేసె న్మనీ. 385

క. ఈరీతి నలరి యపుడా, సారసముఖు లైనగౌరి స్నాతయు నై వి
స్తారపుభక్తినిఁ బురహరు, నారాధితుఁ జేసి స్వాలయమునకు నరిగెన్. 386

ఆ. అథవుఁ డంత వచ్చి యట్టిభద్రాసన
మందునుండి స్నాతుఁ డై చెలంగ
నట్టి నీటివలన నట నున్నసములుఁడౌ
నరుఁడు స్నాతుఁ డగుచుఁ బరఁగుచుండ 387

శ్రీ వినాయకోత్పత్తి

సీ. వరమునీ! పార్వతీపరమేశ్వరస్వేదవారితోఁ దడిసిన వసుధ చేరి
కను సముత్థితుఁడయ్యెఁ గజవదనుఁడు కరపుష్కర మొనరించి పాలుపు మీఱి
భువనేశ్వరుం డంతఁ బుత్త్రుఁగా నాతని భావించి సంతోషభరితచిత్తుఁ
డై వచ్చి నందికి నా విధమును జెప్పి స్నాతుఁడై పదపడి సకలదేవ

తే. తలనుఁ బూజించి జలమున దవాను సర్వ
పితరులనుఁ దృప్తులనుఁ జేసి వేయినామ
ములఁ జపించుచు నగపతి పుత్త్రికడకు
వచ్చి యాదేవినిం జూచి మచ్చికలర 388

క. ఓ నగపుత్త్రీ! గుణయుతుఁ, డౌ నీసుతుఁ జూడు మనుచు నాడిన విని యా
మేనాత్మజ చని యక్కడఁ, గానంబడు నట్టివింతఁ గనుఁగొను వేళన్ 389

క. మనసిజహరుఁ డంతటఁ దన, వనితను బోడఁగాంచి దేవి! భాస్వద్వ్యస్త
త్తనుమలజనితుం డీసుతుఁ, డన నావిరిబోఁడి మదిని హర్షము చెలఁగన్ 390

క. తనయునిఁ గైకొని తొడపై, మనసార న్నిల్పి యతని మస్తకమును మూ
ర్కొని కౌఁగిలించుచుండను, మనసిజహరుఁ డనియె మఱి యుమాసతితోడన్.

తే. మూర్తి నాచేతన వినాయకుండు నైన
సుతుఁడు నిర్మింపఁబడెఁ గాన శోకరయందు
నీతఁడు వినాయకాఖ్యతో నెపుడు కీర్తి
నీయుఁడై యుండఁగలవాఁడు నిజముగాను. 392

క. వనితరో వేల్పుల కోడవెడి, ఘనవిఘ్నసహస్రములను గరుణామతినిన్
దనరుచు నీగణపతి నా, శన మొనరింపఁగను జాలుఁ జంచద్భక్తిన్. 393

క. స్థావరజంగమకలితము, లై వర్తిలు విష్టపంబు లమరులు భక్తిన్
భావించి పూజచేయుదు, రీవారణవదనతనయు నెసఁగెడివాంఛన్. 394

క. అని పల్కి గిరిజకథవుఁడు, ఘనకుంభోదరుఁడు సర్వగణ్యుఁడు వినయా
వనతుఁ డుపకారి యగుసుతు, మనసార నొసంగె లోకమాన్యచరిత్రా! 395

వ. అంత విఘ్నకరంబు లగుదారుణమూర్తిగణభూతంబులు గంగాధరు నానతిఁ
బూని లలితకు నిత్యప్రీతిఁ జనింపఁజేయుచు సేవించుచుండ పార్వతి నిజ

సుతునిఁ గని ముదితయగుచుఁ జారుకందరంబగుమందరగిరిమందిరమ్మున నిందు
శేఖరునిఁగూడి మహానందమునఁ గ్రీడించుచుండె నారదా! మున్ను శుంభని
శుంభాదిదైత్యనాథులవధించినకాత్యాయనీదేవి మరల నీవిధంబునఁ గుధర
పుత్రియై జనించె నని చెప్పి వెండియు నిట్లనియె. 396

చ. వరమునిచంద్ర! నే నిటులఁ । బాగుగ నీకు వచించినట్టి భూ
ధరపతిపుత్రి దివ్యకథ । తద్దయు నాకపదప్రదంబు నై
పరమయశంబు నిచ్చి పటు।పాపవినాశ మొనర్చి యూర్జసం
భరితము నై నిరంతరము । భాసిలుచుండును వాసిమీఱఁగా. 397

క. ధర నీకథఁ జదివెడు నరు, లురుపాపాంబుధిని దాఁటి । యుజ్వలమతులై
పురహరులోకంబున సుస్థిరులై సొంపారఁగలరు । దీప్తిచెలంగా. 398

వ. ఇట్లు పులస్త్యుఁడు పార్వతీసంభవంబునుఁ దద్వివాహంబును వినాయకోత్పత్తిని
భాషించిన విని నారదుండు సంతసించి తరువాతి వృత్తాంతంబు నొడువు
మనుటయు. 399

క. కరుణారసభరితాంత:, కరణా! దుష్టారిహరణ । కమలాభరణా!
సురకిన్నరగణపూజిత, చరణా! నానాప్రపంచ । సన్నుతకరణా! 400

క. శ్రీజానకీ మనోత్పల, రాజా! రవికోటితేజ । రాజితచరణాం
భోజ! భవపూజ! విద్యా, రాజా! జితశత్రురాజ! । రాజబిడౌజా! 401

ఉత్సాహము సూరిసంఘపాలనిరత । శోభనాలవాల వి
స్తారఘోరదైత్యనికర । దర్పభంగతత్పరా
సారసాక్ష విబుధరక్ష । సాధుపక్షదీక్ష సం
సారఘోరకలుషదూర । చారురామభూవరా! 402

గద్య. ఇది శ్రీరామకరుణా సమాసాదిత కవితాప్రాభవ, హరితసకులాన్వయ
ప్రభవ, రామవర్యుల వంశదుగ్ధసాగరసుధాకర, కొండయకుమార, బుధజనవిధే
య, కొండయనామధేయ ప్రణీతమగు తెలుగు వామనమహాపురాణమందు
షష్ఠస్కంధము

శ్రీరస్తు.

శ్రీసీతాలక్ష్మణభరతశత్రుఘ్న హనుమత్సమేత శ్రీరామచంద్రాయ నమః.

# తెలుఁగు వామనపురాణము

## సప్తమస్కంధము.



సీతాహృద్వాసా!
భాసురకరవాల! ధర్మవాసా! నిత్యో
ద్భాసా! పటుచిద్విలాసా!
దాసావనలలితకామ! దశరథరామా! 1

తే. అవధరింపుము దయఁ భక్తవరద దివ్య
మౌని కైనపులస్త్యుఁడు మాననీయుఁ
డైననారదుఁ గని యిట్టు లాడఁదొడఁగె
సరసభణితిని సంతోషసహితుఁ డగుచు 2

క. విరజామాహాత్మ్యంబును, స్థిరమై చెన్నారునట్టి చిత్తంబున నేఁ
గర మది తెల్పెద వినుము, ప్రకరపాపహరంబుఁ బుణ్యకరమగు మౌనీ! 3

అంధకశుంభనిశుంభుల చరితము

సీ. పుణ్యుండు నా కశ్యపునకు భార్య యయ్యె దనునామసుందరి దానివలను
పుత్రులు మువ్వురు పుట్టిరి వారిలోఁ బెద్ద శుంభుండు ప్రఖ్యాతుఁడు నిశుంభుఁ
డనువాఁడు రెండవతనయుఁ డౌను వరించి మూఁడవపుత్రుఁ డౌ నము న్నతండు
బలసమన్వితుఁడు నై పరఁగి జగంబులయందుఁ బ్రఖ్యాతితో నలర శక్రుఁ

ఆ. డపుడు హస్తమందు ప్రౌఢిని గొని వానిఁ
జంప నెంచి రాఁగ జడిసి వడినిఁ
దపనురథమునందు దాఁగె విచ్యుతుఁడు నై
పాపదైత్యుఁ డంతఁ బరమమౌని! 4

తే. అపుడు సుమనస్కుఁడై నిష్ఠ రాఘనాథుఁ
డట్టి హేతువుతో వాని నస్త్రశస్త్ర
వితతితోఁడ నవధ్యత్వ విపులవరము
నిచ్చె సమయమ్ముఁ గావించి నెలమి నంత 5

క. ఘనవాహనుఁ డోసరించిన, ఘనసమయము నెఱిఁగి వాఁడు । కమలాప్త-
బును విడిచి నాగలోకం, బునకును జని వారియందు । మునిఁగి రయమునన్.

శా. పారావారసముద్భవంబు నగుచున్ । భాసిల్లుఫేనమ్ము నా
ధీరుం డాయుడఁ దాల్చి దృశ్యగతితో । దేవేంద్రు వాక్యంబు పెం
పారన్ న న్నిపు డంటు నీనురుగు సత్యం బంచు హస్తంబులన్
సారెన్ ఫేనముఁ బూని గాత్రమును స్వేచ్ఛన్ నిండఁజేసెన్ దమిన్ 7

క. కని కనలి శక్రుఁ డంతట, దనుజునిపైఁ బూన్కిఁ జేసె । దాచినవజ్రం
బును దాన భగ్ననాసా, ననుఁ డై యతఁ డీల్గె దేవనాథులు మెచ్చన్ 8

క. చెడనిది యై సమయంబు, ల్లడరిన యెడఁ గడిమి బ్రహ్మహత్య సురపతిన్
వడి వెంట నంట నాతఁడు, సుడివడి నీటిక్షయందుఁ । జొచ్చి సభక్తిన్ 9

క. మునిఁగి విశుద్ధత్వంబునఁ, దన నాకని దేహముఁ దగుచుఁ । దహతహపడుచుం
డిన మనసున సంకటపడు,చును మెలఁగుచు నుండె మిగుల । సుభగచరిత్రా! 10

ఉ. అంతట వానిసోదరులు । నై వెలుఁగొందు నిశుంభశుంభు ల
త్యంతదురంతచింత యల । రారుచు నుండ విశేషరోషులై
సంతతకట్టిపోయి సుర । సంఘముతో నెదురించి పోరఁగాఁ
జింతిలి వారు భీతిఁ గడుఁ । జెంది రయంబునఁ బాఱి పిమ్మటన్ 11

తే. హరిపురస్కరు లగుచు సై । న్యములఁగాచి
పాఱిపోయిరి తమతమ । పదములకును
పిదప నాదైత్యనాథులు । పృథులశక్తి
శక్రుగజమును యమమహి । షమును మఱియు 12

క. ధనదుని వగునవనిధులను, వనవిభురతనాలగొడుగుఁ । బద్ధాత్మునిదై
తనరారుగదను నిజభుజ, ఘనశక్తిని జూపి వారు । గైకొని రంతన్ 13

క. కన నాయెడ భువనము లా దనుజులవశగతములయ్యె । దర్పోన్నతితో
డను వారు భూమిపృష్టం,బునకు మహోత్కర్ష మొనరఁ । బోయి మునీంద్రా!

ఉ. దారుణరూపముం గలుగు । దానవు నొక్కడఁ గాంచి యోమహా
వీర! యెవండ వీ విచట । వింతఁగ నుండినవాఁడ వంచు నా
ఘోరనిశాటులాడ విని । కూరిమితోడను రక్తబీజలే
ఖారి వచించె వారిఁ గని । హర్ష మెలర్పుచు నుండ నుద్ధతిన్ 15

సీ. మానితాసురులార! । మహితవీర్యబలుండ రక్తబీజుం డను । రాక్షసుండ
మఱి మహిషాసు రామాత్యుండ వినుఁ డలిప్తులై నిరతముఁ । దేజరిల్లి
భువనప్రసిద్ధులై । పొంగారుచున్నట్టి చండముండులు వాని । సచివు లరయ
నట్టిమహాభుజా । లల్వాలం బిప్పుడ మగ్నులై యున్నారు । మాకు మేటి

ఆ. రాయఁడైనమహిష । రాక్షసాధీశుండు, విస్తృతంబు నగుచు । వెల్గునట్టి

వింధ్యశైలమందు । విగతవీర్యుండు నై, సమసె దేవివలన । సంగరమున 16

క. ఏ రీ దేవి యెవ్వనితనయులు, ధారణి నే నామములను । దనరారుదురో
సారపటుశౌర్యములు మీ, కారయ నేపాటిఁ గలవొ । యంతయుఁ జెప్పుఁడీ.

క. అన నాశుంభనిశుంభులు, ఘనబలుఁ డగురక్తబీజుఁ । గని పల్కిరి యో
దనుజేశ! వినుము నేఁడను, వనితకు జన్మించినట్టి । వాఁడనుఁ బేర్మిన్. 18

క. శుంభుం డనునామంబున, గుంభిని వెలసెదను వీఁడు । గురుసాహసుఁడై
జంభారిని సమరంబున, శుంభద్దర్పమునఁ దోలెఁ । జూవె దితిజా! 19

చ. సొరిది నిశుంభనామమున । సొంపెసలారుచు నాకుఁ దమ్ముఁడై
పరఁగును ధాత్రి నీఘనుఁడు । బంధురవిక్రమ మొప్ప నాటి దు
ర్భరబలశౌర్యవీర్యముల । భాసిలు నిర్జరు లన్యు లుద్ధతిన్
గర మురుదెంచి యోడి రనిఁ । గ్రక్కున నీతనిఁ దాఁకి చెచ్చెరన్. 20

క. పోరునఁ జచ్చె న్మహిషుం, డేరీతినిఁ జెప్పు మిప్పు । డేమాత్మ మహా
వీరబలశోభితుల మై, వారలఁ జెండాడఁగలము । వసుధాస్థలిపై. 21

క. ఇటు లాదైత్యులు యమునా, తటమున భాషింప దుష్ట । దైత్యేశ్వరులున్
గుటిలు లగుచండముండులు, పటుగతి జలమందునుండి । పఱతెంచి మునీ! 22

ఆ. వీరుఁ డైనరక్త । బీజునికడఁ జేరి, పల్కి రసురనాథ! । భాసురముగ
నగ్రసంస్థు లగుచు । నలరువా రెవ్వరు, పలుకుమనిరి శ్లక్ష్ణ । భాషణముల 23

క. అన నాలకించి యతఁ డా, దనుజులతోఁ బల్కె నన్న । దమ్ములు కన నీ
ఘను లాగి శుంభనిశుంభా, ఖ్యనుఁ గలిగినవారు నిర్జ । రామరు లరయన్. 24

శా. నే నీవీరులతోడఁ గూడి మహిషున్ । నేలన్ వడిన్ గూల్చి సం
ధానోత్సాహయు నైనదేవిఁ గనబ । ద్ధైర్యంబుతో నేగి స
న్మానత్వస్థితిఁ జారురత్నయుత యై । తళ్కొత్తుచున్ దీప్తితోఁ
గాన న్వచ్చెడి యాశుభాంగినిఁ దమిన్ । గామించి పెండ్లాడెదన్ 25

క. అని రక్తబీజుఁ డపు డి, ట్లనఁ జండుం డతనితోడ । ననియె స్త్రీచే
తనుఁ జెప్పఁబడినమాటలు విన నింపైనవియుఁ గావు । విను వివరింతున్ 26

తే. నృపుడు రత్నార్హుఁ డగుఁగాని । నీవు మణుల
కర్హుఁడవు కావు భావింప । నందువలన
నెలమి శుంభనిశుంభాసు । రేశు లధిపు
లట్లు కావునఁ దగుదు రా । యసురు లసుర! 27

మ. వినుతింపన్ ధర నిట్లు పుట్టినది యై । వెల్గొందుచున్ రూపయౌ
వనయోశాశికివారికిన్ దగినదై । భాసిల్లు నం చిట్లు వాఁ

దన శుంభుం డపు డాత్మ మెచ్చుకొని ప్రఖ్యాపకుండై దూత యా
దనుజున్ బంపెను దేవిసన్నిధికి మోదం బొప్పుచుండ న్మునీ! 28

— శుంభాసురుఁడు తన్నుఁ బెండ్లాడుమని కౌశికి సన్నిధికి సుగ్రీవాసురునిఁ బంచుట —

ఆ. అంత వాని దూత । డైనసుగ్రీవాసురుండు వెడలిపోయి । రుచిఁ జెలంగు
వింధ్యశైలమందు । వేడ్కఁ నుండినదేవి,కడనుఁ జేరి నేర్పు । కడలుకొనఁగ 29

క. తావచ్చిన కార్యంబును, భావం బలరారఁ బలికి । పరమేశ్వరి సం
భావించి పలుకు పలుకుల, వావిరి విని వాఁడు వచ్చి । పటుకోపమునన్ 30

వ. శుంభనిశుంభులఁ గని యిట్లనియె. 31

సీ. మానుపాశనులార! । మఱిమఱి మీచేత నేబోధితుండ నై । యిప్పు డేఁగి
కౌశికినిన్ గని । కరమర్థి నిట్లంటి దేవి! శుంభుఁడు మహాదీప్తయశుఁడు
కనుదుండు పటుశౌర్యశౌర్యేశ్వరులలో న్నట్టి డు నీతోడ । నాడుమన్న
విధము భాషింపెద । వేడ్కతో విను మీవు చానరో! నేఁడ్రివిశిష్టపవిభుండ

ఆ. నగుడు భూమి స్వర్గమందునఁ బాతాళ, మందు వెల్లువట్టి । వైనసకల
మానికములు హేమమయరుద్ధగృహాంతర,సీమకోశమందుఁ । జెలఁగుచుండు.

క. వనజాక్షి! చండముండులు, మణిమయకౌశికి యటంచు । మమతన్బలుకన్
విని కోరితి నిను గావున, ఘనమతిఁ బెండ్లాడు నన్నుఁ । గౌతుక మొప్పన్ 33

చ. నెలఁతరో! నన్నుఁ బొందుటకు । నీకు మనస్సున వాంఛ లేనిచో
వెలఁగిన నాదు సోదరుఁడు । శ్రేష్ఠుఁడు నైన నిశుంభుఁ గోరి సొం
పలర రమింప నా నను చు । నాడె నతం డని నేనుఁ బల్క నా
చెలి వినుమంచు నాకపుడు । చెప్పినమాటల నాలకింపుమా. 34

ఆ. నిజము చెప్పఁబడెను । నీచేత సుగ్రీవ, శుంభదైత్యవరుఁడు । శూరుఁ డఖిల
భువనవిశ్రుతుండు । భూరిరత్నార్హుండు, కానివాఁడు కాఁడు । గణ్యుఁ డతఁడు

క. విను దుర్వినీతవతితోఁ, దనరెడి నాకొకమనోరథం బలరును దా
నిని బూర్మి నీకుఁ జెప్పెద, నని నను నెవ్వండు గెలుచు । నాతఁడె మగఁడౌ 35

మ. ఇటు లాసుందరి పల్కఁ గ్రమ్మఱను నే । నిట్లంటి నాదేవితోఁ
బటుశౌర్యంబున శుంభుఁ డాజిని సురవ్రాతంబులన్ గెల్చి దు
ర్ఘటుఁడై యుండినవాఁడు నిన్నుఁ గెలువన్ రాగా లేఁడె గర్వించి బల్
పటిమన్ బల్కుచు నున్నదాన వన నాపద్మాక్షి రోషంబునన్ 37

ఆ. కనలి పల్కె నపుడు । కడిమి ననాలోచి, తంబు చేయఁబడెనుఁ । దలఁప లేచి
పోమ్ము నామనోరథమ్మును శుంభాసు, రునకుఁ దెలుపు మీవు । రూఢి మిగుల

కి. అన దహనకోటిసన్నిభ, గను దానిన్ దలఁచి తలఁచి । కంపించి వడిన్
జనుదెంచితి నీకడకును, దనుజేశా! యిపుడు చేయఁదగినట్టిపనిన్ 39

మ. ఒనరింపన్ దగునన్న శుంభదనుజుం। డుగ్రాత్ముఁడై ధూమ్రలో
చననామాసురదూతఁ బిల్చి పలికెన్। సంభ్రాంతుఁడై దానవా!
ఘనశౌర్యంబున విఱ్ఱవీఁగుచు మహా।గర్వంబు మిన్నంద సొం
పునఁ జెన్నొందెడి దేవిఁ గానఁ జని స।మ్మోదంబుతో నంతటన్. 40

ఆ. కుంతలములఁ బట్టి। కూయివెట్టఁగ లాగి, సాపరాధదాసి। చంద మొప్పఁ
జేసి తెమ్ము దాని। జెచ్చెఱ నందఱు, సంతసించి నిన్ను। సంస్తుతింప 41

సీ. ఉద్ధతి నీ వట్టు। లొనరింపఁ దత్పక్షకరుఁడు నై నినుఁ గాల్చు। కాంతవచ్చు
నట్టివాఁ డబ్జజా।ద్యైన విచారించి చంపెడ నతని ని।స్సంశయముగ
నని యిట్టు శుంభుఁడు। నాడినవాఁ డంత నాతండు పంప ధై।ర్యంబుతో న
క్షౌహిణీశత।దశరాశిసబలసహితుఁడై వింధ్యకు। సరవి నరిగి

ఆ. భూరిదీప్తితోడఁ। బొల్పారువిరజను, గాంచి భ్రాంతదృష్టి। గ్రాలి పలికె
దేవి రమ్ము రమ్ము। దితిజేశుఁ డౌ శుంభుఁ, డెందు మట్లు చేయ।కుందువేని 42

ఆ. నీ శిరోజములను। నెత్తి లాగి విహ్వలఁ, జేసి యతని చెంతఁ। జేర్తు నంచుఁ
బలుక దేవి మరల। భాషించె దత్ప్రతి, కుండ వగుచు నీవు। దుష్టదైత్య! 43

క. నను బలవంతముతోఁ గై, కొనిపోవుటకొఱకు నీవు। కుతుకంబున వ
చ్చినవాఁడ వబలనై యే, పని చేయన్ దగినదాన। భావింప మదిన్ 44

ఉ. ఓరి నిశాట! నీకు మది।నుండినకోర్కె నొనర్పు మంచు నా
సారసనేత్ర యా విరజ। సర్వసుపర్వులు పొంగుచుండ వి
స్తారబలుండు దుర్జయుఁడు। సైన్యయుతుం డగు ధూమ్రనేత్రు హుం
కారముతోడ నాయెడను। గ్రక్కున భస్మము చేసె నుద్ధతిన్ 45

క. అనఘా! యతిభీషణమై, తనరెను హాహాకృతంబు। ధారణి విరజా
ఘనశక్తివలన దనుజుఁడు, తనసైన్యముతోడఁ గూలు। తరుణమునందున్. 46

శా. శుంభుం డట్టి మహారవంబు విని సం।క్షుబ్ధాత్ముఁడై యుద్ధసం
రంభత్వస్థితి నొప్పి చండునిరుకన్। రక్తేశుఁ డౌ ముండునిన్
శుంభద్గర్వముతోడఁ బంప నపు డా।తుగ్రాసురుల్ వ్యగ్రహా
రంభాయత్తము లైన చిత్తములతో। రాగిల్లి సొంపారఁగన్. 47

చండముండులు శుంభాసురప్రేరితులై సేనఁగూడి కాళికపై యుద్ధమునకుఁ బోవుట

క. ఘనగజరథతురగంబులఁ, బొనరెడి సైన్యమునుఁ గూడి। పోయిరి రోషం
బున దేవి యున్నచోటికి, దనుజాధిపుశాసనమున। ధరణి చలింపన్. 48

క. కోటిశతాధిక మగుచున్, వాటంబుగ వచ్చునట్టి। వైరిబలంబున్
బాటించి కాంచి సింగం, బాటోపముతోడ వచ్చి। యతిధుతసటయై. 49

క. కొందఱఁ గరఘాతంబునఁ, గొందఱ నాస్యంబుతోడఁ। గొందఱఁ గాళ్లన్
గొందఱ నురమున నని లోఁ, జిందఱవందఱఁగఁ జేసి। చేవన్ గూల్చెన్. 50

వ ఇట్లు శైలకందరంబున వసించు వారిచే నాదైత్యులు హతు లగుచుండ దుర్గా
నుచరభూతగణంబులచేఁ బొదువఁబడిన చండముండులు వగతోఁ బొగలెడిదై
త్యసేనలఁ గని మనంబుల ఘనం బగుకినుక జనింపఁ బ్రస్ఫురితాధరులై నీటిపా
పనిమీఁది కరుగు పక్షులచందంబున గౌరికినిఁ గూర్చి చనుచుండి రట్లేతెంచు
చున్న ఘోరచండముండదనుజవీరులఁ గాంచి పరమేశ్వరి క్రోధఘూర్ణమాన
మానసయగుచుఁ ద్రిశిఖభ్రూకుటినిఁ జేయ నాకుటిలభృకుటికలితలలాటఫలక
ముననుండి కరాళముఖయుఁ బరమకళ్యాణియు యోగినియు నగుకాళి జనించి
దీప్తిఁ జెలఁగి యపుడు. 51

కాళిభ్రూకుటిఁ గాళి జనించి ముండాదిరాక్షసుల వధించుట.

సీ. కాలోగ్రఖడ్గంబు । ఖట్వాంగమునుఁ దనకరమునఁ గైకొని । కడిమి నంత
సంశ్లిష్టదేహయు । సంరక్తసిక్తాంగసహితయు నృపశిర।స్స్రజయు నగుచుఁ
దొడరి ఖడ్గంబునఁ । ద్రుంచెనుఁ గొందఱఁ ఖట్వాంగమున నవ్య।కర్బురులను
భస్మంబుఁ గావించి । పటుకోప మీపారఁ గరిరథగంధర్వ।కలితులైన
తే. రక్కసులఁ జంపి యంకుశ।ప్రథితచర్మ
చాపముద్గరఘంటికా।చక్రకూబ
రాశ్వసారథికరులతో । నలరు నరద
ములను యోధుల బలబృంద।ములనుఁ బట్టి 52
ఆ. ఘోరవదనమందుఁ । గూర్చి నటించుచు
మొనసి యొకనికేశ।ములను వట్టియుఁ
గరమునందు నొకని । గాలియం దొక్కని
సరవి నాక్రమించి । చంపె వడిని 53
సీ. కాళిచే నీరీతి । గణనాథయుతమైన సురవైరి బలమెల్ల । సొరిది ద్రుంగఁ
బడఁ దానిఁ గనుఁగొని । పదరుచు రుఁడంతఁ జండదైత్యుఁడు చూచు।చుండ చాతి
పోవంగ ఖట్వాంగ।మున శీర్షమును దేవి యడఁచిన నాతండు । హతుఁడయి వెస
ఆ. విగతమూల మైన।వృక్షంబు చాడ్పున, క్షోణిఁ బడిన నతనిఁ । జూచి వడి వి
భావరియు సకోప।వశ మైనచిత్తంబు, పెంపుఁ జెందుచుండ । భీషణముగ 54
క. చరణాదికరాంతము నై, పరఁగెడి కోశంబుఁ గినుకఁ । బశువుపకువలెఁ
బోరిఁ జీల్చి దానిఁ గొని తన, గురుసటలఁ గట్టి నద్ది । గొరఁగొను బలిమిఁ

చండముండవధము.

వ. ఒకజడకైనఁ గట్టుపడక పైకొగిరి భూతలంబునఁ బడె ఆకాశముననుండి పార్థ
కృష్ణశుక్లవర్ణస్వశరీరయును, స్నేహాసిక్తకేశయు భయంకరయు నగుదేవి యొక
ర్తు పాదమి మహాసురుని వధించుచున్నా నని వర మిచ్చి పలికె అంతఁ బరదేవి

యా దేవికిఁ జండమారి యను నామ మొనర్చి యో సుభగా! నీవు చని చండ
ముండాసురుల నిటకుఁ దెమ్ము నే సమయించెద వారిని గైకొని వచ్చుటకు
శక్తవై యుండుదువు పొమ్మని భాషించిన నావాక్యమును విని యా దేవి చండ
ముండులఁ గొని రా వెడలె 56

ఉ అంతటఁ జండముండులు భ। యార్తులునై వగఁ జెంది శ్యామలా
కాంతుని దిక్కుఁ గూర్చి చనఁ । గన్గొని కాళి విముక్తవస్త్రయై
యంతన కట్టి తార్క్ష్యగతిఁ । జయ్యన బోయెడి రాసభంబుపై
మంతుకనుండి యాదురభి।మానుల వెంబడిఁ బోయె నుద్ధతిన్ 57

క. వారెట్లు చనినఁ గని తా, నారీతిని దేవి పోయి । యటఁ జాముండాఖ్యన్
దారుణ మగుచుండిన యమ, వీరుని మహిషంబుఁ జూచి । వింత జనించెన్ 58

క ఘనపర్వతసన్నిభం బయి, పౌనఃపునితద్విషాణ।మును లాగి రయం
బునఁ బూని వారివెంటను, జనుచుండెను ఘోరరూప।సహితయు నగుచున్

తే అప్పు డా దైత్యసత్తము । లవని విడిచి, పుష్పకంబున కేగినఁ । బూని కాళి దేవి
జవము కలిగినవైన రా।సభములోడ, దరిగి విషధరసర్పంబు । లందు మిగుల.

సీ. ఘనతవహించిన । కర్కోటకునిఁ దార్క్ష్యుఁ డని యూర్ధ్వరోమయై । క్రాలె నంత
వినతాత్మజుఁడు భయ।విహ్వలుఁడై మాంసపిండోపముండునై । యుండ నతని
లలితోరుపక్షంబు।లను గుంజి వానినిఁ గొని వడిఁ గర్కోట।కుని గ్రహించి
వేగంబుతో నంత । వెడలి యా దైత్యుల వెనువెంటఁ జని భీతి । వెలయుచున్న
తే చండముండుల పైఁ బడి । గండు మిగిలి
పట్టి కర్కోటకునితోడ । నట్టె కట్టి
తెచ్చి వింధ్యాద్రిపైఁ జేర్చి । దీప్తయైన
కాళికాదేవికిని జెప్పి । కాంతి వెలయ 61

క ఘనభైరవనాదంబున, గొని గరుడునిఁ బక్షములను । ఘోరంబులు నా
దనుజుల తలలనుఁ దులఁదూ, గని మాల నొనర్చి యంటి।కను నిడి మరలన్ 62

క హరిచర్మభవ్యమృదుఘు, క్షుర మొప్పగన వేఁక నొంది । కాళిక దాసిన్
గరమున గైకొని తమఁ దన, శిరమునఁ దగఁ దాల్చి రోష।చిత్తం బలరన్ 63

చ పరువడి దైత్యరక్తమును । బంధురకాంతిఁ జెలంగఁ గ్రోలి దు
స్తర మగు కేకతో నడరి । సాహసవిక్రమశౌర్యసంపదన్
బరఁగిన చండముండులనుఁ । బట్టి ధరిత్రినిఁ గాల్చి యంతఁ ద
చ్ఛిరముల శేఖరంబు గను । జేసి సురేశులు సన్నుతింపఁగన్ 64

ఆ చండమారి యగాడి । చండికకడఁ జేరి, చండముండమూర్ధ।సహిత మగుచు
వెలసి సర్పనాభి। వేష్టితం బగు దండఁ, గొను మటంచుఁ బలికి । కూర్మి నొసఁగ.

గంతువిరోధియున్ భువన / గణ్యుఁడు భక్తవశంకరుం డుమా
కాంతుఁడు నైనశంకరుఁడు / గ్రక్కునవచ్చి విశేషభక్తితోన్. 72

శంకరుఁడు కాళికి దాస్యం బొసఁగుట.

వ. కాళికాదేవికి నమస్కరించి యి ట్లనియె 73

తే. దేవి! వచ్చితి నేను నీ / దివ్యమాత
నాదు నాకాజ్ఞ నొసఁగుము / హర్ష మొప్ప
ననుచు శంకరుఁ డీమాడ్కి / ననెడు తఱిని
శివ శివాంగంబునన్ బుట్టి / శివున కనియె 74

చ. పురహర! నీవు దాస్యమునఁ / బోయి దితిజులఁ గాంచి మాకు నీ
తరుణమునందుఁ బ్రాణములఁ / దక్కఁగ గోరిక గల్గెనేని యీ
ధర విడనాడి యేడవ / దంబగునట్టి రసాతలంబులోఁ
జోరుఁడు విశేషభోగములు / శోభిలు నక్కడె నంచుఁ జెప్పుమీ. 75

ఉ. వాసవునుండి పొందనగు / స్వర్గము నిర్గతదుఃఖరీతిగా
భాసిల నాను దేవతలు / బ్రాహ్మణవర్యులు యజ్ఞసద్విధిన్
జేసి సుఖింప నా నటుల / చేయుట కిష్టము లేనిదైనచో
వాసిని నే వచించెదిసు / భాషితమున్ వినుఁ డింపుమీఱఁగన్ 76

క. బలగర్వోన్నతితో నని, జెలఁగుటకునుఁ గోరి దండు / చెచ్చెర మీతోఁ
గలహించు దుర్గ నిజ మని, పలుకందగు నంచుఁ జెప్పు / భర్గుం డరిగెన్. 77

క. మనసిజహరుదాస్యంబునఁ, బనిచిన కారణమువలన / భవదూతి యటం
చను నామము కాళికిన్, దనరారెను విష్టపములఁ / దాపసవర్యా! 78

ఆ. చంద్రశేఖరుండు / చని దేవి చెప్పిన, వార్తఁ దెలుప దైత్య / వర్యులెల్ల
గర్వయుక్తమైన / గరళకంఠుసమాట, నాలకించి రోష / మతిశయింప. 79

క. కనలుచు హుంకారంబును, ఘనతన్ గావించి మించి / కాత్యాయని యుం
డినచోటికిఁ బటురయమున, జనుదెంచిరి రౌద్రరూప / సరణినిఁ దెలుపన్. 80

వ. ఇట్లసురు లరుదెంచి శరశక్తివజ్రాంకుశపరశ్వధశూలభుశుండపట్టసప్రాసతీక్ష్ణ
పరిఘాదిశస్త్రములవలన సరస్వతిని నొప్పించిన మాహేశ్వరి రౌద్రరసోల్లసిత
మూర్తిని దై నిజభుజదండమండితకోదండనిర్గతకాండకాండముల వైరిసకర
శరనికరముల బిరబిర ధరఁ గూలఁజేసె నంత 81

సీ. కాళిక కొందఱ / ఖట్వాంగమునఁ జంపె భద్రత్రిశూలమ్ము / వలన మారి
పడఁగొట్టెఁ గొందఱ / బ్రాహ్మి మహావారివిక్షేపమున గత / జీవులుగనుఁ
గొందఱఁ గావించెఁ / గొందఱ శూలంబువలన మాహేశ్వరి / బహుళభిన్న
వక్షులఁ జేసెను / వైష్ణవి కొందఱ దగ్ధముచేసెను / దర్ప మొప్ప

ఆ. వడిఁ గుమారిశక్తి। వలనఁ జండియుఁ గులి, శమ్మునన్ వరాహి। చక్రమునను
నారసింహి తీక్ష్ణ। నఖములతోడను, సమయఁజేసి రసుర। చయము నపుడు. 82

ఆ. అనఘ! రుద్రదూతి। య ట్టహాసంబు, వలన రక్కసులను। వసుధఁ ద్రోసె
శూలమున భవుండు। సుక్కించెఁ గొందఱ, నొక్కపెట్టనప్పు। డుక్కుమిగిలి

క. గణపతి పరశ్వథంబును, దనకరమునఁ దాల్చి శౌర్య। దర్పోన్నతుఁడై
పోనెడు దైత్యులఁ గొందఱ, నని గతజీవులను జేసి। యవనిని గూల్చెన్ 84

క. దానవు లిట్లా దేవీ, నానారూపములఁ జచ్చి। నల్దిశలందున్
మానుగఁబడి భూతంబుల, చే నలి భక్షితులు నగుచుఁ। జెడిరి మునీంద్రా! 85

క. హతశేషులైన రాక్షస, పతులు మహామాతృభూత। పటుతరబాధా
యతగాత్రులు సంచలలో, లితదృష్టి విముక్తకేశ। లేఖాయుతులై. 86

క. మనసులవగ పెంపగుచున్, దనరన్ గన్నీరువెడల। దత్తరపాటొం
దినగతి కలపదములతోఁ, జెనఁగాడుచు రక్తబీజ। విభునికడ కేగిన్. 87

క. చని శరణాగతులైనన్, గని కనలుచు రక్తబీజ। కర్బురపతి కి
న్కనుఁబోయి దివ్యబాణం, బును వింటనుఁ గూర్చి మాతృ। భూతశ్రేణిన్ 88

తే. చించిచెండాడుచును మహా। శీఘ్రగతిని
కోపవిస్ఫురితాధరో। ద్దీపితుండు
నై ప్రవేశింపఁ గని రోష। మతిశయించ
మాతృభూతము లావేళ। మౌనివర్య! 89

క. చను దెంచు రక్తబీజునిఁ, గని శితకోటిప్రకాండ। కాండంబుల నా
దనుజునిపై వర్షించిరి, ఘనతరకోపంబు మిగులఁ। గ్రాలుచు నుండన్. 90

వ. అత్తఱి. 91

ఆ. ఎట్టి రక్తబిందు। విలఁబడునో యట్టి
బిందువన్య రక్త। బీజదైత్యుఁ
డగుచు నుండఁ జూచి। యంబిక నగి మారిఁ
గాంచి పలికె నపుడు। క్రౌర్య మొప్ప. 92

వ. ఓచండీ! బడబానలోపమం బగునోరు తెఱచి వానిరక్తముఁ ద్రావు మన నాదేవి నవ్వి నిజవదనము నపుడు భూమ్యాకాశముల నంటునట్లుచేసి తత్తనునిర్గతరక్తమును గ్రోలుచుఁ జిరము వసించుచుండె అంతె మహేశ్వరి రక్తబీజునిఁ దన వెంట్రుకల నీడ్చి వికలవీర్యునిఁ జేసి నవ్వుచు ముఖమందుఁ బడఁద్రోచి శూలమున నొప్పింప నాతఁడు తత్తోద్భవరక్తసిక్తవత్తుండు నయి కూలె ఇట్లు విగతవీర్యుండు నై యున్న రక్తబీజుని దేవి కనకమయం బగుచక్రంబున నూఱుతునియలుగ ఖండించె నంత 93

ఘనచర్మావృతసాధనంబుఁ గినుకన్ గాత్యాయనీదేవి కూ
ల్చెను షడ్వర్గసమేతబాణములఁ దాఁ జిత్రంబు పెంపొందఁగన్ 102

— దేవి నిశుంభుని నవనిఁ గూల్చుట —

సీ. సంయమీశ్వర! వాఁడు చర్మయుతం బగుఖడ్గంబు చూర్ణంబు గాఁగఁ జూచి
గదఁ గొని పవమానగతితోడ దుర్గపైఁ జన నామహేశ్వరి శౌర్య మొప్ప
వచ్చెడియావీరుపటుసముల్లిష్టహస్తంబుల గదఁ దల సరవి నర్థ
చంద్రాస్త్రమునఁ గూల్చె శ్మాస్థలిలో వడి భయకరుఁడును సురవైరి యధిక
ఆ. రౌద్రుఁడౌ నిశుంభరాక్షసాధిపుండు
సమరమందుఁ జావ జండికాది
మాతృగణము చూచి మతిమతి కిలకిలా
ర్భటు లొనర్చె మిగులఁ బరవశమున 103

ఉ. ఉత్సాహము వైరి యా నిశుంభుఁ డవని వ్రాలఁగా సమస్తదై
త్యారు లంత శక్రుఁ గలిసి యంబరస్థులై మహా
ధీర! వేగ గెల్వ మఖలదివిజులన్ జయంబు వి
స్తారమగును నీ కటంచుఁ జాలఁ బొగడి రంతటన్ 104

క. భూతౌఘము తూర్యంబులఁ, జేతోమోదమున మ్రోయఁజేసెను విబుధు
ల్పాతరలాడుచుఁ గురిసిరి, భూతేశ్వరిమీఁద మేటిపువ్వులవానన్ 105

తే. అనఘ! యపుడు నిశుంభుఁ డయ్యవనిఁ బడినఁ
గాంచి బృందారకాఖ్యతోఁ గ్రాలు దంతి
నెక్కి ప్రాసంబుఁ జేఁబట్టి రక్కసులనుఁ
గూడి వెడలెనుఁ శుంభుండు కోప మొప్ప 106

ఉ. వారణయుక్తుఁడై వెడలి వచ్చెడిశుంభునిఁ జూచి దేవి సొం
పారెడి సత్తురప్రవరబాణచతుష్కముఁ బూని రెంట నా
వారణపాదయుగ్మమును భస్మముచేసి తదీయకుంభముల్
ఘోరశరద్వయంబునను గొట్టెను నవ్వుచు లీల నంతటన్ 107

— శుంభుఁ డవనిఁ ద్రెళ్లుట. —

చ. శరహతమైనదై గజము శ్మాస్థలమందునఁ గూలె నిర్జరే
శ్వరపలి మూర్ఛితంబు నగుశైలమహాశిఖరంబు చాడ్పునన్
సొరిదిని దంతినుండి పడుశుంభునిఖండలమండితోరుభీ
కరశిరముల్ హరించె వడిఁ గౌశికి శస్త్రములోడ నాయెడన్ 108

ఆ. భిన్నమస్తకమున వెలసినవాఁడునై
వాఁడు నీల్గెఁ గ్రౌంచపర్వతంబు

మహిషయుక్త మగుచు ౹ మహిఁ గుమారునిచేత
భస్మమయినమాడ్కిఁ ౹ బరఁగుమాని! 109

చ. దురమునఁ బండిచే నధిక౹దుష్టులు శుంభ నిశుంభదైత్యు లీ
కరణిని సైన్యయుక్తులయి ౹ కౌశ్యపిఁ గూల సురేశుఁ డాఁటయై
పరఁగెడు సర్వదేవతలు ౹ భక్తిని వింధ్యనగంబుఁ జేరి యీ
శ్వరిని నుతించి రాయెడను ౹ బాగుగ వేదహితోక్తులఁ దమిన్. 110

— దేవతలు కౌశికిని బొగడుట —

చ. హరిహరరాజ్యదాయినివి ౹ దైత్య దితిజేశులదర్పభంగముఁ
బోరిఁ బోరిఁ జేసి కిల్బిషస౹మూహములఁ సమయించి సంతతం
మరచయకార్యకర్త్రివయి ౹ మానుగ శక్రసుపూజితాంఘ్రి వై
పరఁగెడి నీకు వందనము ౹ భక్తి నొనర్తుము కావు మీశ్వరీ! 111

క. హరిహయభాస్కరనుతవై, కిరమస్తాదశవిశాలం౹కిరములతోఁ
నిరతము వెలుఁగుచు నుండిన, నరసింహి యొనర్తు మిపుడు౹నతిపసుదయముల్

సీ. వరశిఖగమనవు ౹ వరదవు మాలావికటవు సుకేశివి౹గాఢభీతి
గణనాశనివి దివ్య౹ఖగపతిగమనవు యోగసంసిద్ధవు ౹ యోగినివియుఁ
జర్మముండవు మతి ౹ శమగమనవు మహాధూర్వహగాత్రవు ౹ తుష్టికరవు
సంతతైంద్రివి లస౹చ్చారువక్త్రవు వజ్రసహితవు దుర్దర్శ౹శార్ఙ్గధరవు

తే. నై ప్రకాశించు నీచర౹ణాబ్జములకు
వినయమున మ్రొక్కి సద్భక్తి ౹ వెలసి గంధ
పుష్పములచేతఁ బూజించుఁ ౹ బుణ్యనుతులు
శుభము నొందుదు రెప్పుడు ౹ క్షోణియందు. 113

దండకము శ్రీమన్మహాదేవహృత్పద్మసంచారిణీ, ఘోరశూలాత్తపాణీ, సదాభక్త
కపాలిసంహారిణీ,దివ్యనారాయణీ,చక్రసంధారిణీ, దేవసంస్తూయవాణీ, మృడానీ,
మహాబ్రాహ్మణీ, నారసింహీ, ఐంద్రి వైష్ణవీ, సత్యవిశ్వేశ్వరీ, చారువింధ్యాద్రిసంవా
సినీ, నీవు వజ్రంబుఁ జేఁబట్టి నాగధ్వజం బొప్పఁ బైతామహాదివ్యహంసంబుపై
నెక్కి బృందారకారాతిబృందంబులఁ సర్వసర్వంసహాభాగమందు న్వెసఁ గూల్పు
చుఁ గ్రన్ననఁ శక్తినిఁ బూని బల్ఘోరవక్త్రంబునఁ మూఁడునేత్రంబుల న్మించి
పాలిఁ గరాళించి సింహంబుపైఁ జేరి భూరౌఘముఁ గూడి దుర్మార్గులౌ చండ
ముండాఖ్యదైత్యేంద్రులఁ శుంభునిఁ రక్తబీజుఁ నిశుంభాసురుఁ దద్బల
శ్రేణినిఁ జంపి గంధర్వనాగాదిబర్హిర్ముఖానేకమౌనీంద్రసంస్తూయచారిత్రవై
వాసిఁ గన్పట్టి యోయంబ! యీలోకజాలంబు నిర్మించి పాలించి నాశంబుఁ
గావించి త్రైగుణ్యరూపాత్తవై వెల్గుచున్నావు యుష్మత్ప్రభావం బచింత్యం

జంబప్రఖండంబు నై యుండ వర్తింప మా కెట్లు సాధ్యంబు నా సత్కృపాదృష్టితో
మమ్ముఁ బాలింపు సర్వేశ్వరీ! దివ్యదేవీ! నమస్తే నమస్తే నమః 114

ఆ. ఇట్లు వినుత యగుచుఁ । బృథుతోషమున దేవి, సర్వదేవసిద్ధ । సంఘములను
గాంచి నవ్వి పలికెఁ । గడఁగి యోసురలార!, భవదనుగ్రహంబు । వలన నిపుడు

క. దురమున దనుజుల నెల్లనుఁ, బరిమార్చితి నేను మీరు । భాషించిన నీ
వరనుతిఁ గీర్తించెడి స, త్పురుషులు దుస్స్వప్ననాశ । మునుఁ గాంతు రిలన్.

ఉ. కోరినకోర్కె నిచ్చెదనుఁ । గూరిమితోడను బల్కుఁడన్న నా
ధీరులు పల్కి రోజనని! । దివ్యవరంబు నొసంగు బుద్ధి చె
న్నారిన నిత్తెఱఁగ ద్విజసు । రాధిపధేనుహితార్థమై మహా
వీరుల నన్యరాక్షసుల । వెండి రణంబునఁ గూల్పు మా యనన్ 117

క. అనలోపమరూపంబునఁ, దనరారెడిచండి విబుధ । తల్లజులను వే
డ్కనుఁ గాంచి వేల్పులారా!, వినుఁ డని చెప్పంగఁ దొడఁగె । విమలగుణాఢ్యా!

వ. త్రిదశులార! మరల నే నందునిసుందరమందిరమందు యశోదాసుందరికి యోగమాయనై జనించి మహాసురు లగులవణాదిరాక్షసుల దంతప్రహారణాదులఁ బోకార్చెద, పదంపడి పురందరునిసద్మమున దేవ్యంశమువలన మారినై పొడమి శాకసంకరములతో నేడులెక్కంగుల నమరుల భరించెద, వెండి ఋషిపాలనము కొఱకును దైత్యమారణంబుకొఱకును వింధ్యశైలమందుఁ బుట్టి దుర్వృత్తి నేపారునక్తంచరులఁ బరిమార్చి విజయ మొందెద, క్రన్నన నరుణాక్షుఁ డను మహాదైత్యుండు సంభవించి లోకంబులఁ గాఱించుతఱి నమరహితార్థమై మహాకాళిరూపంబున నుద్భవించి యాపీనాసురుని సమయించి స్వర్గపురిఁ జేరెద, అని యిట్లాడి వరద యగుకాళికి దేవతావర్యులకుఁ బ్రమాణ మొనర్చి భూతవితతుల విడనాడి యక్షాదినిర్జరులు వెంటనంటి రా యింటి కరిగె నని మఱి యిట్లనిరి. 119

తే. కాళికాజయమ్ముతోడను । గ్రాలి పావ, నంబు నైనట్టి యీపురా । ణము సమస్త
మనుజాలకు నెల్ల నిత్యము । మంగళంబు, నగుచు భాసిల్లు మౌనికు । లాబ్ధిసోమ!

క. కర మిది దనుజవినాశన, కరమని భగవానుఁ డనియెఁ । గరుణామతితోఁ
బఠియింప నిద్ధి మోక్షా, కరమై పెంపొందుచుండుఁ । గాశ్యపియందున్ 121

చ. అన విని బ్రహ్మసూనుఁడు ప్ర । యత్నముతో ననె నో మునీశ్వరా!
ఘనమహిమాన్వితంబు నగు । క్రౌంచము స్కందునిచేత నెట్టు నా
శన మొనరింపఁగాఁబడెనొ । సత్కృప దానిని విస్తరించి నా
కును దగఁ జెప్పు మన్న విని । కూర్మి నతం డను సంతసంబునన్. 122

## కుమారస్వామి జన్మక్రమము.

సీ. తాపసేశ్వర! పురా।తనమైనదియుఁ బుణ్యఘనకీర్తివృద్ధులఁ । గ్రాలునట్టి
కార్తికేయునిదైన । కథఁ బల్కెదను విను భవనిస్రుతంబునై । పరఁగి యొట్టి
వీర్యంబు మున్నాగ।వీతిహోత్రునిచేతఁ బీతమయ్యెనా యట్టి।వీర్యమునను
బహుభారయుక్తుఁడై । పావకుఁ డంతట సమరులసన్నిధి । కపుడు మంద
ఆ. వీర్యుఁ డగుచుఁ బోయి । విబుధాళులనుఁ గూడి
బ్రహ్మలోకమునకు । బహుళ వేగ
మునను బోయి మార్గ।మున నున్న కుటిలాఖ్య
నదినిఁ గాంచి పలికె । నవ్యభణితి. 123

క. ఓకుటిల శంభునిర్గత! మై కడుదుర్భరము నగుచు । నలరెడిదగు నీ
భీకరవీర్యము కాల్పఁగ, బ్రాకట మగుచున్న విష్ట।పంబుల నెల్లన్ 124
ఆ. అందువలన దీని । నఖిలరక్షింపుము శక్తి, నెగడునట్టి సుతుఁడు । నీకుఁ గల్గు
నను చు నుత్తరంబు । నగుస్వమతముఁ దెల్పఁ, గుటిల సంతసించి । కూర్మి నంత
క. పావకుఁ గన్గొని వీర్యము, నీ వీ నా నీటవిడువు । మిష్ట మటంచున్
రేవన్ బల్కిన నతఁడా, దేవీగర్భమునఁ గ్రక్కె । దివ్యమునీంద్రా! 125
క. ఆవీర్యము నది కైకొని, వావిరిఁ బోషించుచుండె । భగవంతుండా
పావకుఁడు కామచారియు, నై వఱలుచుఁ గాంచె మిగుల । హరువును జెందన్

వ. పంచసహస్రవర్షములదాఁక నవ్వీర్యమునుఁ దాల్చినకతంబునఁ దదస్థిమాంసరుధిరమేదోమజ్జాశ్మశ్రురోమనఖకేశాదులు కనకమయంబు లయ్యె దాన నతఁడు హిరణ్యవీర్యనామంబున భువనప్రసిద్ధుఁడయ్యె నంత. 128
తే. అనఘ! కుటిలామహానది। యైదువేల, హాయనము లగ్నితుల్య । మైనట్టిదివ్య
గర్భమునుఁ దాల్చి బ్రహ్మని।కాయ్యమునకుఁ, నరుగ నంతట నావన।జాసనుండు.
క. గురుతరసంతాపంబునఁ, బరఁగెడి యాపెద్దనదిని । బరికించి తలో
దరి! నీ కీగర్భం బే, పురుషునిచేఁ గూర్పఁబడెనొ । పురుడింపు మనన్. 130

చ. విని యది పల్కెనో సకల।విశ్వవిధాయక! శార్వవీర్యమున్
ఘను లరుదందఁ బావకుఁడు । కైకొని దానిభరింపలేక పెం
పొనరెడిశ్లీతి నాకడకు । నుద్ధవిడెన్ జనుదెంచి దేవి! శం
భుని దగుదివ్యవీర్యమునుఁ । బూనినపూన్కి ధరింపుమా దయన్ 131

సీ. అనిచెప్పి దాని నా।యందు నాతం డుంచి పోయిన పిమ్మటఁ । బూన్కినట్టి
వీర్యంబు నే నైదు।వేలవత్సరములకాలంబు మోసితిఁ । గాని యొట్టి
పుత్త్రుఁ డొక్కండైనఁ । బుట్టఁగన్న విరించి తమినట్టి నుడి విని । దాని కనియు
భాషని! యుదయపూ।ర్వతమునకునుఁ జని దారుణావిస్తార।దశసహస్ర

ఆ. యోజనములతోడ ౹ రాజిల్లు తత్ప్రాను, శరవణమున దీనిఁ ౹ జాలభక్తి
వదలుమంత నిద్ది ౹ పదివేలవర్షముల్, దాఁట బాలుఁ డగుచుఁ ౹ దనరఁగలఁడు

చ. చను మని చెప్ప నాకుటిల ౹ సాహసనంభ్రమభాషణంబులన్
మన మలరారుచుండ విని ౹ మానినియై యుదయాద్రి కేగ నా
మనసిజవైరివీర్యమును ౹ మానసగుప్తముతోడ నాస్థలం
బున విడనాడి వాగ్విభిని ౹ పొంతకు వేగమె వచ్చి యుంతటన్. 133

తే. వారిరూపంబుతోడను ౹ వఱలు కుటిల
మంత్రవశమున సతియయ్యె ౹ మన్మథారి
వీర్యశక్తిని నచ్చోట ౹ వెలయు సర్వ
పత్రివృక్షాదులెల్లను ౹ బాళి మెఱసి 134

క. కనకమయశరవణచ్ఛవి, దనరెన్ బదివేలయేండ్లు ౹ దాఁటినసమయం
బున బాలభానుదీప్తిన్, గొనరారెడిబాలుఁ డొకఁడు ౹ పుట్టె మునీంద్రా! 135

చ. వెలికిలపాటుతోఁ నతఁడు ౹ వెల్గుచు విస్తృతమైన తెల్లుపై
నలరుచు నాననంబునఁ గ ౹ రాంగుళివెట్టి ఘనంబుకైవడిన్
పలుమఱు నేడ్వ నయ్యెడను ౹ భవ్యమనోహరకాంతిపంక్తితోఁ
జెలఁగెడి యాఱుకృత్తికలు ౹ స్త్రీతనువుల్ దగ వచ్చి యచ్చటన్ 136

వ. శరవణగతుండై ప్రలాపించుబాలునిఁ గని కృపాయత్తచిత్తంబులనత్తఱి 137

సీ. నేముందు నేముందు ౹ నేమందుఁ బాలిత్తు నడరి యాబాలుని ౹ గనుచు నిట్లు
వాదించుకొనుచుండ ౹ వారినిఁ గని యతఁ డాఱుమొగంబుల ౹ నలరె నవ్వ
డాసర్వకృత్తికలపగిదిభయులునై బాలకస్నేహంబువలన స్తన్య
మొసఁగి పోషించుచు ౹ నుండఁ దత్పరిపాలకుండునై యాడింపఁ ౹ గుండు ప్రీతి

ఆ. కరుఁడు నగుచుఁ బెరిగి ౹ కార్తికేయుం డను, పేరుతోఁ జెలంగి ౹ భీమబలులు
నైనవీరులందు ౹ నధికుఁడై విష్టప, త్రయమునందు వెలసెఁ ౹ దానవేంద్ర! 138

క. వనజజుఁ డంతటఁ బావకుఁ, గని నీసుతుఁ డెంత పెరిగె ౹ ఘనమగుదీప్తిన్
దనరారునొ కనుఁగొని ర, మ్మన నాతం డట్టిమాట ౹ నాలించి తమిన్. 139

క. తనయునికథఁ దాఁ దెలిసియు, వనజాసనుతోడఁ బల్కె ౹ వాణీశగుహుం
డనుపుత్త్రుఁ డెవఁడొ తెలియదు, ఘనదయ భాషింపుమనుచుఁ ౹ గడుభక్తిమెయిన్.

క. అన విని భగవంతుం డో, వనజజుఁ డనె నతనితోడఁ ౹ బావక! గౌరీ
శుని కగుశుక్రము నీచే, తను బీతం బగుచు మున్నుఁ ౹ దల్పోక్తైఁ దగన్.

క. శరవణమున నది లోకే, శ్వరుఁడౌ బాలుండు నగుచు ౹ భాసిలె నన నా
పరమేష్ఠివాక్యమును విని, పవనసఖ మేషంబు నెక్కి ౹ పావనుఁ డంతన్. 142

క. చనఁ గుటిల చూచి యనె నీ, వనఘ! యచ్చోటి కిప్పు ౹ డరిగెద నన నా
వనితకనె నగ్ని శరవణ, మున నుండెడిపుత్త్రుఁ జూడఁ ౹ బోయెద ననుచున్. 143

క. అని విని యతి నాతనయుం, డనె; దహనుఁడు నాకుమారుఁ । డౌనని; నీర
తిని వారు తర్కవాదం, బునుఁ జేయుచు నున్నకాల । మున మౌనీంద్రా! 144

సీ. చక్రి లేనంతటఁ । జనుదెంచి వారినిఁ గని యిట మీ రేమి । కారణమునఁ
గలహించుచున్నారు । కలకలఁ గేళిగింపుఁడన నని రాకుటి । లాగ్ను లభవ
పురహరువీర్యసం । భూతుఁ డౌ బాలుని । రోజకు నై మే మిటఁ । గూడి యిట్లు
వాద మాడెద మన్న । వైకుంఠుఁ డగుహరి చిత్తంబులోఁ గొంత । సేపు చింత
ఆ. చేసి యప్పు డనిరు । శివుసన్నిధిఁ జేరి, కార్యసరణిఁ జెప్ప । గరళగళుఁడు
చెప్పినట్లు మీరు । చేయుట సమమని, పలుక నాలకించి । వారు భక్తి 145

తే. ప్రమథనాథునికడ కేఁగి । ప్రస్తుతించి
దేవ! శరవణమందునఁ । బెరుగుబాలుఁ
డెవని తనయుఁడో తెలియదీ । విపుడు దెలుంగఁ
బలికి మాసంశయంబునుఁ । బాపు మనిన 146

చ. మునికులసోమ! యావచన । ముల్ త్రిపురాంతకుఁ డాలకించి బల్
పొనరెడి కౌతుకంబు మదిఁ । బొంపిరి వోవుచు నుండ వెండ్రుక
ల్దనువున నిక్క వర్ధిల ము । దంబు ముదం బని భార్యతోడఁ జె
ప్పెనఁ గుధరేశపుత్త్రి కడు । ప్రీతి జనించుచునుండ నాయెడన్. 147

చ. సురపతి యైనశంకరునిఁ । జూచి తదర్భకుఁ గార్చి పూన్కితో
నరిగెద మాతఁ డేఘనుని । యంశము నెక్కొనొ వానిసూనుఁడై
పరఁగి యశోరమన్ గనెడి । వాఁ డగునన్న వృషధ్వజుండు భా
సురకుటిలాద్రిజల్ కుచియుఁ । జొప్పెలుఁగన్ దనతోడ రా వెసన్. 148

ఉ. భావజవైరి పార్వతియుఁ । బావకుఁడున్ గుటిలాఖ్యదేవియున్
భావము లుల్లసిల్లఁ జని । ప్రాగ్గిరిసానుశిరస్థభూమిపై
వావిరిఁ గృత్తికాంకతల । వాసుఁ డునై చిఱునవ్వుమోమునన్
వావిరినున్న బాలకుని । వారితతేజునిఁ గాంచి రున్నతిన్. 149

చ. మునివర! యాస్తనంధయుఁడు । బుద్ధిని వారిమనోగతంబు నం
తను గని నాల్గుమూర్తులనుఁ । దాల్చి శిశుత్వమునన్ గుమారుఁడై
తనరి వరున్ ద్విశాఖుఁడయి । తద్దయుఁ గౌరిని నైగమేయుఁడై
యనలుఁ ద్రిశాఖుఁడై కుటిల । నందెను యోగముతోడ నత్తఱిన్. 150

తే. అంత వారంద ఱతులిత । వైనశుద్ధి
నలర షట్కృత్తికలుచూచి । హరునిపుత్త్రుఁ
డేమొ షణ్ముఖుఁ డని పల్క । నీశ్వరుండు
హర్షమునఁ బల్కె సవిశేష । మైనభణితి. 151

సీ. పావకసతులార! భవదాత్మజుండు నాఁ గార్తికేయాఖ్యతోఁ గ్రాలు వీఁడు
సారస్వతాహ్వయసహితుఁడై శరవణమునకుఁ బుత్త్రుండునై యొనయుఁ గుటిల
కునుఁ గుమారుం డనఁ గొమరుఁడై రాజిల్లు స్కంధాభిధానుఁడై పరఁగఁ గిరిజ
కును సుతుఁ డగును నాకును గుహుం డనుపేర వెలసె విప్రప్రియుఁడై వెల్గు జ్వలను
తే. నకు మహాసేనుఁ డనునట్టి నామమునను
నలరు తనయుండు నగును షడంశకలితుఁ
డగుటచేతను షణ్ముఖుఁ డగును సర్వ
మిట్టు లీతఁడు ప్రఖ్యాతి నెసఁగు ధాత్రి 152

క. అని గంగాధరుఁ డీవిధ, మునఁ బల్కి సమస్తదేవముఖ్యులవిధి నా
త్మను సంస్మరింపఁ జెచ్చెరఁ, జని వా రవు దధికభక్తిసహితులు నగుచున్ 153

సీ. శైలనందిని యగు శర్వాణికిని మారపరిపంథి యైనట్టి భర్గునకును
బ్రణమిల్లి పావకపత్నులౌ షట్కృత్తికలను వాలుతారలను గాంచి పిదప
నత్యుగ్రవీర్యుఁ డవార్పతితుల్యుఁడౌ పావనిఁ గని తీక్ష్ణభానుఁ గాంచు
కనులచందంబునఁ గ్రాలి తత్తేజంబువలన మోహితులునై వఱలి సంత
ఆ. సమున విఱ్ఱవీఁగి సర్వదేవోత్తము, లిట్టు పలికి రో మహేశ! దేవ
కార్యమెల్ల నిపుడు కవిచేత నీచేత, జేయఁబడెను దానఁ జెలువ మొప్ప

క. మనమందఱ మిత్తఱి నా, శనరహితం బయిన కావ్య సత్తీర్థముఁగా
ననుఁబోయి కురుక్షేత్రం, బునఁ బుణ్యయాన నగుచు మిగులఁ బూజ్యతమంబై.

దేవాదులు కుమారునకు సేనాధిపత్య మొసంగుట

వ. మునిజనస్తుత్యంబై సరస్వతీనదియందుఁ గిన్నరసిద్ధసాధ్యమునికింపురుషాది దేవతల కెల్ల సేనానాథునిఁగ నీకుమారు నభిషిక్తుఁ జేసెదము. ఇతఁడు భయంకరులగు తారకమహిషాసురుల దారుణరణమునఁ బరిమార్పఁగలఁడు నిజమనిన విని భవుఁడు వల్లె యని పలికె, అంత దేవతలు కుమారసహితులై మహాఫలదాయకం బగు కురుక్షేత్రమునకుఁ జని యట బ్రహ్మేంద్రాచ్యుతయుతులై షణ్ముఖాభిషేకంబుఁ జేయ సమకట్టి మునిగణంబులఁ గూడి పుణ్యదంబు లగు సప్తసముద్రవాహినీనదీజలంబుల నెల్లఁ దెచ్చి నానౌషధీసహస్రమూర్తులతో నతని నభిషిక్తుఁ జేసిరి దివ్యరూపశాలి యగు స్కందుఁ డట్లు దేవసేనాపతియై భాసిల్లె నంత. 156

క. వీడిరి భయమును నిర్జరు, లాడిరి రంభాదికాంత లానందమునన్
బాడిరి మునిగంధర్వులు, పోడిమిఁ దళుక్కొత్తుచుండఁ బుణ్యమునీశా! 157

తే. అద్రిసుత యప్పు డభిషిక్తుఁడైన స్కందుఁ
గాంచి తొడమీఁదఁ గ్రాలెడి కార్తికేయు

శీర్షమును సారెసారెకుఁ । స్నేహ మొప్ప
మూర్కొనెను మోద మాత్మలో । బొంగుచుండ 158

క మునివర! యభిషేకార్ద్రితుఁ, బౌనరారెడి కార్తికేయు । మూర్ధంబును మూ
ర్కొనుదేవి శక్రమూర్ధం, బును నాఘ్రాణించు నదితి । పోలిక వెలిఁగెన్.

క పురహరుఁ డభిషిక్తుం డై, పరఁగెడి సుతుఁ జూచి మోద । భరితుం డయ్యెన్
వరకుటిలాక్ష్యత్రికలునుఁ, గరువలి చెలికాఁడు ప్రీతిఁ । గని రాలోనన్. 160

వ అంత సుమహాకాంతుఁ డానందకందళితహృదయారవిందుఁ డై సర్వసుపర్వసేనాధిపత్యమున నభిషిక్తుం డగు కార్తికేయునకు ఘంటాకర్ణ లోహితాక్ష, నందిషేణ, కుముదమాలి, యనునాఖ్యల నొప్పువారును, జ్వలనార్కసన్నిభ లగు ప్రమథుల నలువుర నొసంగె. అట్టియెడ స్కందునకు హరుఁ డిచ్చిన ప్రమథగణవీరుల నవలోకించి బ్రహ్మాదిదేవత లతనికి నిజాంశప్రమథుల నిచ్చి రెట్లనిన 161

ఉ సారససంభవుం డొసఁగె । స్థాణుగణంబును సంతసంబునన్
సారసనాభుఁ డైన హరి । సంక్రము విక్రము సత్పకాక్రమో
దారగణత్రయంబు నిడెఁ । దామరసాప్తుఁ డొసంగెఁ బ్రోల్లస
త్సారసయుగ్మముల్ హరి యొసంగెను దండకపింజలంబులన్. 162

తే వేలుపులఱేఁడు వసుఁ డిడి । పేరఁ బరఁగు, శిష్టరత్నంబు నిడె జ్వల । జ్జిహ్వావలన
నలరు వెలుఁగనువగరంబు । నగ్ని దేవుఁ, డిచ్చె గుహునకు నత్తఱి । నెసఁగు పేర్మి

ఆ అనుచరత్రయంబు । నమలకుందముకుంద, కుసుమముల నొసంగె । గార్మి ధాత
వత్సనందినులనుఁ । బరమమోదంబుతో, నిచ్చి గాశ్వనేయు । లింపుమిగుల

సీ కడఁగి చక్రానుచక్రంబులఁ ద్వష్టయు నెతి నిచ్చె సుస్థిర । నిస్థిరముల
వేధ యొసంగెనుఁ । బ్రాదుబలులైనట్టి పాణితృజోత్కట । భద్రకాళి
కలనుఁ బూషుండు తా । గరమర్థి నిడె స్వర్ణమాలఘనాహ్వయ । మహితు లగుచు
నలరెడు ప్రమథుల । నద్రీశ్వరుం డిచ్చె నుచ్ఛ్రితవింధ్యాద్రి । యొఱఁగెఁ గృష్ణ

ఆ సాస్త్రదుని నొసంగె । బహువర్చసుని సువర్చసుని వరుణుఁ డంత । సంగ్రహాఖ్య
విగ్రహాఖ్యు లనెడి । వీరుల వఱె జయా, జయుల నాగరాజు । సరవి నొసఁగె.

క గిరిపుత్రి శంకుకర్ణుని, వరపుష్పదంతాదవీర । వర్యుల వైశ్వా
నరుఁడు ఘసాతిఘసాఖ్యులఁ, బరఁగెడి యనుచరుల నిడిరి । పరమప్రీతిన్. 165

వ సూర్యుఁడు పరిఘ, వట, భీమ, దాహ, విదహనులను, బంచప్రమథులను, యముఁడు ప్రమథో, న్మాథ, కాలసేన, మహాముఖ, తాలపత్ర, కాలజంఘాఖ్యల నొప్పు షడనుచరులను, ధాత సుప్రభ, శుభకర్మ, నందికేశ్వరులను, మిత్రుఁడు క్ష్వేజవర్యు లగుసువ్రత, సత్యసంధులను, యతులు శంకుపీడా, నంత, నికుంభ, కుముదోం, శ్వే, తాక్ష, కునటి, చతు, కిరీట, కలలోదర, సూచీవక్త్ర, కోకనద, ప్రాహాస, ప్రియకో, చ్యుతాఖ్యల నొప్పు పంచదశగణనాథుల గుహున కిడిరి

సీ. కాళిందికలకందుఁ । గడిమి నర్మదరణోత్కటుని గోదావరి । కడఁగి సిద్ధ
యాత్రునిఁ దమసామ । హానది సాద్రికంపనుని శీతసహస్ర । బాహు నొకనిఁ
దమిని వంజుల స్మితో । దరుని మందాకిని పరమసుగంధునిఁ । బాశప్రీతి
నిచ్చెఁ బ్రియంకరు । నైరావతీనది పొరిఁ జతుర్దంష్ట్రునిఁ । బుణ్య యగువి

ఆ తస్త షోడశాఖ్యుఁ । దగ బాహుదానది, శాతశీర్షవాహ । సారనంది
కులను బలుఁడు నైన । గోనందు నిడె మహా, సేనునకును వేష్క । చెలఁగుచుండ

క గౌతమి క్రోధక్రౌంచులఁ, జేతోమోదమున నిచ్చె । శిప్రానదివి
ఖ్యాతుఁ డగుచిత్రరథుసం, జాతోత్కర్షమున నొసఁగె । సంయమివర్యా! 169

తే భీమరథి భీము నిచ్చెనుఁ । బ్రీతి మిగుల
నిచ్చెఁ గౌశికి మారిరి । నెలమిఁగాళి
యష్టబాహునిగండకి । హర్ష మొదవఁ
గా నొసంగె సుబాహునిఁ । గాంతతోడ 170

వ సరయూనది వేగారిని, మహానది చిత్రదేవుని, గుహానది కువలయుని, మధూక
మధుపర్ణుని, ధూతపాప జంబూకుని, వేత్ర శ్వేతాననుని, మహార్ణవయగు రేవా
నది సింధువేగుఁడును, సన్నుతుఁ డగు ప్రమథుని, గాంచన ప్రభావార్థసమర్థుం
డగుకనకేతుణుని, మనోహర చారుపత్రుని, ధూతపాప మహారావునిఁ, గర్ణ
విశ్రమసన్నిభుని, విష్ణుమోఘవతి సుప్రసాదసుపర్ణులను, విశాల యజ్ఞవాహుని,
సరస్వతులు గణాధ్యక్షులను, గుటిల త్రింశచ్ఛక్రబలపుత్రగణంబులను, గృష్ణ
కరాళ సితకేశులను, జటాధర మేఘనాథ చతుర్దంష్ట్రి విద్యుజ్జిహ్వ దశా
నులను, సోమ సదాయశో గ్ర దేవయాలినులను, షట్కృత్తికలు హంసా
ఖ్యకుంఠ జరర ముద్గగ్రీవ హయానన కూర్మగ్రీవనామములగుపంచవీరులను,
సప్తర్షులు స్థాణుజంఘ లోహజంఘ కుంభవక్త్ర మహానన పిండకారులనుఁ,
బృథూదకతీర్థము నాగజిహ్వ చంద్రభాస పాణికూర్మా శితుకచామవక్త్ర
జంబూకులను, చక్రతీర్థము సుచక్రాఖ్య మకరాఖ్య గయాశీర్ష గణప శివ
కనఖలస్వకులను, నదీశర బంధుదత్త బాహుశాల పుష్కర సర్వౌజో
మహామహిష మానస పింగళులను శౌనసుడు రుద్రుని, మిగిలినమాతృగ
ణంబులు మతిక్రొందలను, సోమతీర్థము వసుదామునిఁ, బ్రభాసతీర్థము నందిని,
నింద్రతీర్థము విశోకను, నుదపానతీర్థము ఘనస్వనను, సప్తసారస్వతతీర్థము
చతురాద్భుతమాతలను, నాగతీర్థము గీతప్రియా మాఘవతీ తీర్థనేమి స్మితాన
నులను, విశేషపుణ్యప్రదంబగుకురుక్షేత్రమేకచూడను, భద్రయోని చండ
శీతను, భద్రకాళి త్రివిష్టపుని, ద్వీరదపావనుఁడు రోండీ సేండీ పోష భేండినులను,
భూదేవి మోపలీయను, మానసహ్రదము ఛాలికను, శతానంద శతఘంటకు
లను, ఉలూఖల మేఖలాదేవిని, బదరికాశ్రమము పద్మావతీమాధవినులను,

సుప్రభ మైకచూడను, దేవి ధమధమను, మత్క్రోధని వేదమంత్రను, కేదారా
మము మాతృభూతంబులను, రౌద్రమహాలయము సునక్షత్ర కలూలా, సుప్ర
భాత సుమంగళ దేవమిత్రా, చిత్రసేనలను, ప్రయాగ కోటరో ర్ధ్వవేణి శ్రీమతి
బాహుపుత్త్రికా పలితా కమలాక్షీ నామాఖ్యనలరు దేవతాంగనలను, సర్వపాప
మోచతీర్థము సుమయా మధుపింగళా తుఱంతి దహదహా పరా కోటికలను,
శ్వేతతీర్థము సంతానికా విమలా క్రముకాంబరవాసినీ జలేశ్వరి కర్కటిలా
సుదామా లోమమేఖలా వపుష్మత్యుష్ణకాక్షీ కోకనామా మహాసనీ రౌద్రా
కర్కటికాతుసాంగళాభిఖ్యల నొప్పువారినొసంగిరి 171

సీ. అనఘ! మహాత్ముఁడై | యలరు తార్క్ష్యం డట్టి గణమాతృభూతాళిఁ | గాంచిసంత
సించి పుత్త్రుఁడునై | చెలఁగి మహాజవు ప్రైసమయూరుని | నరుణుఁ డగుచుఁ
దామ్రచూడాఖ్యతోఁ | దనకుపుత్త్రుని నిచ్చెఁ బావకుఁ డిచ్చెను | భద్రశక్తి
దనుజ రిగురుఁ డిచ్చె | కంపింబు నొక్కటిఁ గుటిలామహాదేవి | కుండి నిడెను
ఆ. మాధవుండు మాల | మారారి తమిఁ బతా, కయును వాసవుండు | కంఠహార
సత్త్రమంబు నిడిరి | సంతోషభరితాంత, రంగు లగుచు మరల | రమ్యమతుల

తే. అపుడు సేనాధిపత్యమం | దాగుహుండు
హరునిచేఁ దగ నభిషిక్తుఁ | డగుచు శక్తి
హస్తుఁడై మాతృగణముల | నలరి నెమిలి
నెక్కి కదలెను రణమాడ్కి | నిద్ధచరిత 173

క. స్కందుఁడు సేనాపత్యము, నం దమరగణాభిషిక్తుఁ | డై శంభుశతా
నందగిరిజాగ్నికుటిలా, వందిత షట్కృత్తికలనుఁ | బ్రణమిల్లి యనెన్ 174

చ. భగవతి దైవపార్వతికి | భక్తిని మ్రొక్కెద మానులార! మీ
కొగిని నమస్కరింతు భవ | దుజ్జ్వలభూరికృపారసంబుతో
నగణితవీర్యుఁడై పరిహ | సత్యధికాహితుఁ డైవతారకున్
జగములు మెచ్చ నే నిపుడు | చంపఁగలన్ ధృషవీర్యసంపదన్. 175

క. వేలుపులారా! కడు పసి, బాలుఁడ నా కేమితెలియు | భాషించుటకై
చాల దయ నాజ్ఞ నిడుఁడీ, కాలంబునఁ బద్మయోనిఁ | గలిసి ముదమునన్

చ. పరమమునీంద్ర! స్కందుఁ డిటు | పల్కిన నత్తతి సర్వనిర్జరే
శ్వరులు తదాననంబుఁ గని | సంతసమొందుచు వీతభీతులై
పరఁగిరి స్నేహభావమున | భర్గుఁడు లేచి ప్రజేశుసవ్యమౌ
కరమునుఁ బూనివచ్చెఁ దమి | క్రాలఁ గుమారుని చెంత కాయెడన్ 177

సీ. నగజ యంతట స్కందు | నకు ననె రిపుహరుఁ | డవు నైనపుత్త్ర | రా | రా! జగత్త్ర
యంబులోఁ బూజ్యంబు | లైనశ్రీహరిపదముల కతిభక్తితో | మ్రొక్కుమన్న

నారదుఁడు నగి పల్కె । నంబ విష్ణుం డెవ్వఁ డెవని కాదరమున । నెసఁగి మర్త్య
ధ ప్రజాతతులచేఁ । దగ నీప్రణామంబు చేయనానో వానిఁ । జెప్పు మనఁగ
నంబిక యాతని । కని వెంచి నీ విపు । డొనరించుపనికి । నావనుజహరుఁడు

ఆ సాయుఁ డగు నటంచు । సరసిజాసనుఁ డనె
సత్యముగను నీదు । జనకుఁ డైన
హరుఁడు నన్నుఁ జూచి । హాటీకు కా రెవ్వ
రనుచు నుడివె నన్న । నారఁ డంత 178

చ కరములు మోడ్చి శౌరికిని । గాఢపుభక్తి చెలంగ మ్రొక్కి సు
స్థిరమతి లేచి నిల్చి సుర । సేవిత కేశవ! నాకు నావలిన్
బౌరి నిడు మంచు వేడఁగనుఁ । ఘాతఐభావ్యుఁడు నైనమాన నో
హరుఁ డవు డాసుమారుఁ గని । హస్త మొసర్చుచు నుండ నారయడన్. 179

క సంతతశుభవర్తనుని ధగ, వంతుం డగుచక్రి చేసి । భవసుతునకుఁ దా
నంతట నానతి నిడె బ, ల్వంతప ములరు రుచుండ । సంయమివర్యా! 180

చ అనుటయు నారదుం డనె న । హామునిరాజ! సుపర్ణకేతుఁడై
తన రెడు నట్టిమాధవుఁడు । తద్దయు స్వస్త్యయనంబు పార్వతీ
తనయున కొల్లొనర్చె మును । దారకదైత్యుని దుంతరక్కసున్
దునుమను బంపెనో చెపుమ । తోషముతో నన నారఁ డంతటన్. 181

ఉ నారదుఁ జూచి పల్కె ముని । నాయక! కాసరదానవేశునిన్
ఘోరరణోర్విభాగమునఁ । గూల్పఁ గుమారుజయంబుకోసమై
శౌరి వచించినట్టి దగు । స్వస్త్యయనంబును నీవు భక్తిపెం
పారఁగ నాలకింపు మని । యాడఁ దొడంగె నతండు ప్రేమతోన్. 182

హరి స్కందునకు స్వస్త్యయన మొసంగుట.

క శరజన్మ! రజోగుణుఁడై, పరఁగెడుదుగినుండు నీకుఁ । బరమశుభంబుల్
గర మిచ్చుఁ జక్రచిహ్నిత, కరుఁ డగుహరి నీకొసంగుఁ । గళ్యాణంబుల్. 183

క. గోరాజకేతనుండును, గౌరీయుతుఁ డైనహరుఁడు । శుభభద్రంబుల్
సూరిమి నిడు నీకొంటకుఁ గు, మారా! పావకుఁ డొసంగు । మహితశుభంబుల్.

క. హరిదశ్వచంద్రకుజబుధ, గురుభార్గవశనులు నీకు । గురుకుశలంబుల్
బరువడి నిత్తురు నిత్యము, కరుణాసాగరులు నగుచు । గాఢాదరణన్. 185

తే క్రతువసిష్ఠులు పులహుండు । గగనసంస్థు
లైనసప్తర్షులత్రియు । ననఘులైన
భృగుపులస్త్యమరీచులు । మృగకళంక
సంభవు లొసంగుదురు నీకుఁ । జాల శుభము. 186

సీ. అశ్వినేయులు మరు/ద్గణ్ములు సాధ్యులు ద్వాదశరుద్రులు / భవులు యక్ష
గంధర్వవసువులు / గరుడకిన్నరపిశాచతతి విశ్వేదేవ/సత్తములును
నాగనదీసుర/న్నప్రభాకాసారపుణ్యజలాశయ/భూరిసార
భూతగణంబులు / ముఖ్యగణేశ్వరచయచతుష్పదబహు/చరణజంతు
తే. చక్రము ద్విపాదంవులు / సారె శుభము
నిచ్చి ప్రోచునుఁ బ్రాగ్దిశ / నెలమి వజ్రి
దక్షిణంబునఁ గాలుండు / ధనదుఁ డుత్త
రాశఁ బ్రాచేతసుండు ప/రాశ నేలు 187

క. జ్వలనుఁడు దక్షిణపూర్వం, బుల దక్షిణవరుణాశలఁ / బురహరసఖుఁడు
జ్వలపవనుం డుత్తరోత్తర,ములఁ బూర్వోత్తరములందుఁ / బ్రోచు శివుఁ డోగిన్
తే. అద్రు లెల్ల నధోభాగ/మందు నేలు
నూర్ధ్వమునఁ బ్రోచు ధ్రువుఁడు మ/హోత్సవమున
ముసలలాంగలభిదుర కా/ర్ముకులు మేటి
కరుణఁ గోడను బాలింత్రు / కన్యచరిత! 189

క. నరహరికిరిదుర్గలు త్రి,కరసామశ్రుతిరవంబు / కమలేక్షణుఁ డై
పరఁగెడిమాధవుఁ డోముత, పరమదయాయత్తచిత్త/భరితులు నగుచున్. 190

క. పురహరసుతుఁ డగుగుహుఁ డ,క్రకరణిని స్వస్త్యయనుఁ డగుచు/ఘనమగుశక్తిన్
గరమునఁ గైకొని నిర్జర, వరులకుఁ బ్రణమిల్లి వ్యోమ/పదమున కెగసెన్ 191

స్కందుఁడు తారకాదిరాక్షసుల జంప నరుగుట.

క. అత్తఱి నన్యగణామర, సత్తము లాగుహునివెంట / సంయమియుతు లై
చిత్తములు పొంగ నెగసిరి, మొత్తముగను గామరూప/ముల ఖగములు నై
ఆ. సకలమాతృభూత/సంఘమ్ము లంతట
దానవులనుఁ జంపఁ / దలఁచి భూరి
బలుఁడు నై చెలంగు / పావకిసుతుఁ గూడి
నింగి కెగసి రపుడు / నెసఁగుశక్తి 193
ఆ. అంతఁ గార్తికేయుఁ / డలదీర్ఘమార్గపథ
మునకు శీఘ్రగతిని / బోయి భూత
తతులఁ జూచి యపుడు / తతవీర్యులార! మీ
రవని కేగుఁ డనుచు / ననఁగ నంత. 194

క. మునివర! యాతనిపలుకులు, విని గణములు భూమిఁ జేరి / వేగమె శైలం
బున కేగి పరిసరంబున, ఘనదారుణ మైనరవముఁ / గావించి రోగిన్ 195

క. ఆరావ మఖిలభూమి న, వారిగ వ్యాపించి కంధి/పటురంధ్రముతో

జేరెను దైత్యాలయమా, దారుణపాతాళమునకు । దర్పించి వడిన్ 196

ఆ. వజ్రతుల్య మగుచు । భాసిల్లు నానివాసము నికుంభకుంభ । తారకులు మ
హాసురేశ్వరుండు । నగువిరోచనుఁ డాల, కించిఖిలమతులఁ । గెరలుచుండె.

క. ఇది యెట్టి రావమో యని, పదరుచు యోజించి వారు । బలశాలియు నై
పొదలెడి యంధకదైత్యుని, సదనమునకు వేగ నేగి । సంయమిచంద్రా! 198

క. దనుజాధీశ్వరు లంధక, దనుజునితోఁ గలిసి మెలసి । తహతహపడి యా
ధ్వనిఁ గూర్చి మానసంబుల, ఘనముగ దర్కించుచున్న । కాలమునందున్.

పాతాళకేతుం డంధకుని చేరి శత్రుస్థితిఁ దెల్పుట.

సీ. వారాహవక్త్రుఁడు । పాతాళకేతుఁడన్ దానవపతి బలి । దైత్యవిభుని
విష్టపంబుననుండి । విశిఖవిద్ధాంగుఁడై పలుమరు ఫలిచేఁ । బదరి పదరి
గడగడ వడఁకుచుఁ । గదలి రసాతలమ్మునఁ జేరియంధకుఁ । బొంది మ్రొక్కి
దీనవాక్యముఁ బల్కె । దితిజేశ! గాలవాశ్రమభూమికిని నేను । సరవినొక్క

ఆ. మాసమునకుఁ గడఁక । మహితోద్ధతినిఁ బోయి
బలముతోడ దాని । బాడుసేయఁ
దలఁచి కోలరూప । ధరుఁడనై పోరిఁ దదా
శ్రమమునకును వేగ । చనితి నంత 200

క. గురుభయకర మగుబాణము, సొరిదిని నామేనియందుఁ । జొచ్చెన్ దానిన్
బరఁగించి వెలుఁగుచుండిన, పురుషునిఁ గనఁ జాలనైతి । భూరిబలాఢ్యా!

క. శరభిన్నగాత్రుఁడనై, పరిపరివిధములను భీతి । వణఁకుచు నుండన్
గురువేగంబున నాముని, వరుని నివాసంబు వదలి । పాఱి చనంగన్. 202

తే. అతఁడు ననుఁ గూర్చి వెనువెంట । నంటివచ్చి
నిలునిలు మటంచు భాషించె । నెఱిఁ దదీయ
వాజిఖురనాదమును విని । భయమువలనఁ
దక్షిణాబ్ధినిఁ జొచ్చితి । దైత్యనాథ! 203

క. నానావేషాకృతులన్, నానారీతులనుఁ జెలఁగు । నానాజనుల
న్నే నటఁ గనుఁగొను నంతట, మానుగ వారాడినట్టి । మాటల వినుమా! 204

ఆ. కడిమిఁ గొంద ఱభ్ర । గతిని గర్జించిరి
మఱియు మఱియు నల్లి । మలయు వేడ్క
కడలు కొనఁగ నొరులు । గర్జించి రావేళఁ
గొంద ఱపుడు మిగులఁ । గోప మొప్ప 205

క. త్వరితముగ మహిషదురమున, బరిమార్పం గల మటంచుఁ । బల్కిరి మఱియు
త్తరుణమునఁ గొంద ఱాడిరి, ధరఁ దారకుఁ గూల్తు మనుచు । ధైర్యస్ఫూర్తిన్.

ఆ. సకలగణవరేణ్యుఁ డగుపాకశాసన, సూనుఁ డాటలోన శూలసాధ
నమును బట్టి త్రిప్పి నాగాశ్వరథయుక్త, దైత్యదానవులనుఁ దరిమి చంపె

ఉ భీముఁడు భీమమై మిగుల వెల్లువలోన్నతవృష్టితోడ ను
ద్దామబలాఢ్యులౌ సకలదైత్యులఁ గూల్చెను వింత తోఁప సు
త్రాముఁడు మేటికొండలనుఁ దద్దయు వజ్రముతోడఁ గొట్టి యా
భూమినిఁ గూల్చునట్టి వడిని ఘూర్ణితపాథనవంశమండనా! 217

ఆ పంచశిఖుఁడు రౌద్రవంతుఁడు గురుబల, నాధుఁ డైనశకటనాముఁ డగ్ని
దీప్తముద్గరమునుఁ ద్రిప్పుచు దైత్యుల, ధరణిపాలుచేసెఁ దైర్య మొదవ

క. భూరి జవ మొప్పఁగా వృ, త్రారాతి రణోర్వి గూల్చె నతిదుష్టుండౌ
ఘోరాసురు నాతనికిని, సారధియుత మైనరథము శౌర్యస్ఫూర్తిన్ 219

క చాలుగ నాశీజంఘుఁడు, వాలాయం బైనముష్టిపాతంబున మో
కాల భిదురాభశరరుచి, కీలల నుగ్గాడె రిపులఁ గెరలెడిపూన్కిన్ 220

మ తురగగ్రీవుఁడు కూర్మకంధరుఁడు తోడ్తోలుంరన ప్రక్రియా
గురుశీర్షంబులచేత వైరిబలముల్ క్షోణిస్థలిన్ గూల్చి రా
తరుణం బందున వాజిదివ్యరథవిస్తారోగ్రదంతీంద్రభీ
కరదైత్యేంద్రయుతంబుగా సురలు వేడ్కన్ జెందుచుండ న్నృపా. 221

క పిండాకారుఁడు తలతో, భండనరతు లైనదనుజవరులనుఁ గూల్చెన్
జండపటుశృంగముల వడి, ఖండించెఁ గవిప్రియుండు కడిమి దనుజులన్ 222

క. అంతట గణనాధులచే, నంతముఁగను దైత్యసేన నారసి సేనా
కాంతుఁ డగుతారకుఁడు బల, వంతుం డగుమహిషుఁ డనికి వచ్చిరి మానీ

మహిషతారకులు స్కందునిపై యుద్ధమున కేగుదెంచుట.

క దనుజులు ప్రముఖుల నందఱ, సునిశితశరజాలములను సుస్కంచిన నా
ఘనుల సురల వారించుచుఁ, గినుకన్ బవరం బొనర్చఁ గెరలిరి పిదపన్ 224

క పరమానందము నొందుచు, శరచయములు కరములందుఁ జాల వెలుంగన్
దురమునఁ బోరిఁబోరి నిర్జరు, లురవడిఁ బోరాడఁ జొచ్చి రుద్ధతి చెలఁగన్

వ అత్తఱి హంసాఖ్యుఁడు పట్టసంబునను, పోకశాఖ్యుఁడు త్రిశూలంబునను, శత
శీర్షుఁ డసిచేతను, శుత్రాయుధుండు గదచేతను, విశోకుఁడు ముసలంబునను,
బంధుదత్తుఁడు శూలంబునను, మహిషుని మూర్ధంబుపైఁ గొట్టిరి తక్కినపార్ష
దులు శక్తిముద్గరపట్టిసాదుల బాధించిరి వాఁడు వానిని సరకుఁగొనక కలహో
ద్యుక్తచిత్తోద్యమానుఁ డగుచు మైనాకకుధరంబు చందంబునఁ జలింపఁడయ్యె
భద్రకాళియు నులూఖలయుఁ గోపించి తారకుని బంధింప, నేకచూడవానిఁ
బరమాయుధంబులఁ గాటించె అంత నావీరు లిద్ద ఱట్లు సురమాతృగణంబుల

వలనఁ గలహమందుఁ దాడ్యమానులై వెఱవక సమధికరోషులై గణనాథులఁ
జిందఱవందఱఁ జేయఁదొడఁగిరి మహిషుఁడు కరఘాతముల వడిఁ బ్రమథుల
భేదించి జయించి మించి బాణబాణాసనపాణియై కుమారునితో సమర మొనర్ప
విజృంభించె నంత. 225

క. శరసంజాతునిమీఁదికి, నరిగెడుమహిషాసురేంద్రు । నారసి కినుకన్
బరఁగుచుఁ జక్రాక్షుఁడు తన, కరమునఁ జక్రంబుఁ దాల్చి । క్రౌర్యం బొప్పన్.

సీ. ఆదైత్యనాయకుఁ । డడ్డగించెను వడి వా రిద్ద ఱావేళఁ । బవరమందుఁ
చక్రగదాంకిత।సహితోరువాస్త్రులై విస్మయలఘుతర।వితతరీతు
లడరఁ బోరిరి; తమి । నంతట మహిషుండు గణనాథుపైఁ దన।గదనుఁ ద్రిప్పి
వైచినఁ గనుఁగొని । వాఁ డుద్ధతుండునై చక్రంబు మహిషుని । స్యందనమ్ముఁ
ఆ. గార్చి వ్రేయ నద్ది । ఘోరంబుగాఁ జని
వాడి మొనలగదను । వసుధఁ గలిపి
వానిమీఁది కేగ । దానవు లయ్యయో!
కూలె మహిషుఁ డనుచుఁ । గూఁత లిడిరి 228

క. మునివర! బాణుం డాధ్వని, విని ప్రాసముఁబట్టి వచ్చి । పృథురక్తాక్షుం
బున నుండుచక్రమును భువిఁ, జనఁ జేసెను ముష్టిపంచ।శతమునఁ బెలుచన్.

క. పంచశతద్వయకరముల, నంచితబలుఁడై చెలంగు।నట్టి గణేశున్
మించినశక్తి గ్రహించె ను, తెంచుచు దానవులు వేడ్కఁ । దివురమునీంద్రా!

తే. అప్పు డొగి నాసుచక్రాక్షుఁ । డధికబలుఁడు
నయ్యె బాణునిచే నిష్ప్ర।యత్నుఁడుగను
జేయఁబడి దిక్కుతోఁచక । చిక్కి విగత
వీర్యుఁడై యుండె ఘనమగు । వెఱపుతోడ 231

క. ఘనబలుఁ డగుమకరాక్షుం, డని బాణునివలనఁ జిక్కి।నట్టి గణేశున్
గనుఁగొని గదఁగొని చని యా, దనుజుని తలదానితోడఁ । దద్దయు మోఁదన్.

శా. ఆలో బాణుఁడు తద్గదాహతియుతుం । డై యుద్ధమున్ బాసి యా
కాలం బందుఁ బరాఙ్ముఖుండు నగుచున్ । గంపించి బల్విగ్గునన్
శాలిగ్రామముఁ జేరెఁ । బిమ్మటను నా।సైన్యంబు నిర్నాథమై
జాలిన్ జెందె గణాధినాథులు మహా।శౌర్యంబు మిన్నందఁగన్. 233

క. ఆసకలాసురసేనను, గాసిన్ బెట్టుచును వారు । కడిమినిఁ గ్రోధో
ద్భాసితులై పరుగిడఁగాఁ, జేసిరి సమరముననుండి । శిష్టచరిత్రా! 234

ఉ. అంతఁ బ్రభగ్నసేనఁ గని । యుత్తతి తారకుఁ డాగ్రహంబునన్
బంతముఁబట్టి ఖడ్గమును । బావాలతలంబునఁ దాల్చి విక్రమా

క్రాంతులు నా గణేశ్వరులు। గ్రక్కునఁ దాకి శితాస్త్రసంతతి న
త్యంతము నొవ్వఁజేసె, దను।జాధిపు లందఱు సంతసింపఁగన్ 235

ఆ. అసిధరుండు మఱియు । నప్రతిముఁడు నైన, తారకాభిధాన । దనుజుచేతఁ
గదనమందు సకల।గణమాతృచయములు, విజితు లగుచు వెడలి । విపులభీతి

స్కందుఁడు తారకాసురుని శక్తితోఁ గూల్చుట.

సీ. శరజన్ముకడఁ జేరి । శరణుఁజొచ్చిరి తగ భవసూనుఁ డంతట । భగ్నగణము
నసియుక్తుఁడై యని । నరుదెంచు తారకుఁ గని వానిదీర్ఘ వ।క్షమును శక్తి
భేదింప నాతండు । భిన్నమర్ముండు నై క్షోణిపై నురవడిఁ । గూలె నపుడు
భగ్నదర్పుండును । భ్రాంతియగా నా తారకాసురుఁ డవనిపై । హతుఁడు నగుచుఁ

ఆ. బడినదుష్టుఁ డగుచు । వఱలెడిమహిషుండు, సమర భూమి వాసి । త్మాధరేంద్ర
భూరిగహనతలముఁ । బొందెనుఁ జిత్తంబు, నుత్తలంబుఁ జెంద । నొప్పగాను

క. మునివర భూస్థలిఁ దారక, దనుజుఁడు మృతుఁ డౌట మహిష।దైత్యుఁడు భీతిన్
దనరి కుధరేశుఁ జెందుటఁ, గని కదలిరిఁ దూరఁ బ్రమథ।గణములు వెంటన్

క. చని సాపరాధునిఁగ నా, దనుజుని బంధించి రపుడు । తారకు నని శం
భునిసుతుఁడు చంపి ఘనజవ, మునఁ బటుతరదివ్యశక్తిఁ । బూని ముదమునన్.

చ. అనఘ శిఖండిమండితము । నైనమయూరము నెక్కి కిన్క పెం
పున మదిఁ గ్రాల నామహిష।భూస్థలిఁ బ్రోయఁ దలంచి పోవ శ
క్తినిఁ గరమందుఁ దాల్చి గురు।దీప్తశిఖండిపతాక మొప్ప వే
డ్కను జనుదెంచు స్థాణుసుతుఁ । గ్రక్కునఁ గన్గొని వాఁడు నారదా! 240

తే. వలిమలను విడిచి క్రౌంచపర్వతముఁ జేరి
యామహాకందరంబున । నణఁగె, గుహుఁడు
వాని సమయింపఁ గోపించి । బంధువధను
జేయఁదగ దని మదిని తో।చించుచుండ. 241

క. పరమేష్ఠి చక్రి పురహర, సురపతు లరుదెంచి గుహునిఁ । జూచి కుమారా!
పొరిఁ గ్రౌంచసహితమహిషునిఁ, బరిమార్చుము శక్తి ననుచుఁ । బలికిరి పిదపన్.

స్కందుఁడు క్రౌంచగిరిని భేదింప నని పలుకుట.

క. శరజన్ముఁడు వా రాడిన, సురక్షత్యప్రియములైన । సూక్తుల విని శం
కర హరి విరించి వాసవ, వరులన్ గని నవ్వి యపుడు । పలుకఁ దొడంగెన్.243

తే. తల్లి తండ్రికి మనుమఁడై । తనరి మాతృ
సోదరాత్మజుఁడును నాకు । సోదరాభుఁ
డైనక్రౌంచుని నే నెట్టు । లకట! కూల్తు
ధర్మమా నే తలంప నో । ధన్యులార! 244

క. చిరకాలసంస్థితము నై, పరఁగెడిశ్రుతిఁ దెలిసినట్టి । పరమమునీంద్రుల్
పురుడించుచుందు రనిశము, గురుతరపుణ్యములనెల్ల । గుంభినిమీఁదన్. 245

క. ధరనుత్తమధర్మా! యన, పరులై సతతంబు మిగుల । భాసిల్లు మహా
పురుషులు నిర్జరపురికినిఁ, గరమేఁగుచు నుందు రధిక । కాంతి జిగుర్పఁగ. 246

క. గోవుల విప్రుల విలస, ద్దేవుల నాఢ్యులనుబంధు । బాలస్త్రీవృ
ణ్యావేకులనాచార్యుల, భావజ్ఞులఁ గురుల జంపఁ । బాడియె? చెప్పుఁడీ! 247

క. సుకవవర్యులార! నేనా, వరధర్మస్థితినిఁ దెలిసి । భావిత్రసముండై
బరగెడిమాతులతనయు న, కరుణఁగ సమయింతు నెట్లు । క్రౌర్యం బొప్పన్ 248

ఆ. కడిమి నాతఁ డిపుడు । గదతో హతుండు నై, వెడలి రాఁగలండొ । విపులశక్తి
వలన వాని నేను । వడిఁ గూల్తు నత్తఱి, ననిన శక్రుఁ డంత । నతని నుడిని.

వ. అంత. 250

### శక్రస్కందసంవాదము.

సీ. ఆలించి తనమది । యం దున్నతమతంబుఁ గీలించి వశిఁ గార్తి । కేయుఁ గాంచి
మాటాడె నాకంబు । మతిమంతుఁడవె నీవు భావింప నేటి కీ । పగిది మిగుల
భాషించెదవు మును । పద్మనాభుం డనినట్టివాక్యము విను । మనఘ యూరుని
కొఱకు నై పెక్కండ్రఁ । గూల్పరాదనియును । బెక్కండ్రకోసమై । యొక్కనరుని
ఆ. ధరణిఁ గూల్ప నొప్పు । దానఁ జూడ నరుండు
పాపికాఁ డటంచుఁ । బరమశాస్త్ర
విధియుఁ గలదు దాని । విని నేను సమయంబు
చేసినట్టివాఁడ । శిఖికుమార! 251

క. విను తొల్లి నముచి యనువాఁ, డనుజానిచే నీల్గె సోద । రాన్వితముగఁ బూ
న్కానిఁ జంపు క్రౌంచయుతమహి, షునిఁ బదమున నాక్రమించి । సుభగచరిత్రా!

క. అని యిట్లింద్రుఁడు పలికిన, విని స్కందుఁడు క్రోధరక్త । విశృతాయతలో
చనుఁ డై హరిఁ గంపింపం, గనుఁ జేయుచుఁ బల్కెసాగెఁ । గ్రౌర్యస్ఫూర్తిగ.

ఆ. మూఢ! లోకమందు । బుద్ధిమంతునివలె, నన్ను మిగులఁ జెనకు । చున్నవాఁడ
వరయ నీశరీర । హస్తసారం బెంత, వదర నేల ననుచుఁ । బలికె నంత. 254

చ. శరవణసూనుఁ డా గుహుని । శక్రుఁడు కన్గొని కార్తికేయ! సు
స్థిరనిజశక్తితో మిగులఁ । జెన్ను వహించెద వన్న! స్కందుఁ డా
హరి కనెఁ నంత నోసురగ । ణాధిప! రా వడిమీఱ యుద్ధముం
గర మొనరింపు దోర్బలము । గ్రాలినవాఁడవు నైనఁ దెంపునన్. 255

ఆ ఇట్లతండు పలుక । నెలమి నాలో నింద్రుఁ
డధికబలుఁడు నగుచు । నాడెఁ గ్రౌంచ

పర్వతంబుచుట్టు । వడి ముందుఁ దిరిగెడి
వాఁడె భూరిబలుఁడు । చూడ నిజము. 256

క. అని పలుకు నీలకంఠుం, బును దిగి వడిఁ గామరూపమున నగ్గిరికిన్
మును పూన్కితోఁ బ్రదక్షిణ, మొనరించెను వింత మిగుల । నుద్ధతిమీఱన్.

చ. కరిపతినుండి వాసవుఁడు । గ్రక్కున భూమికి డిగ్గి క్రౌంచ భూ
ధరమునకున్ బ్రదక్షిణముఁ । దత్క్షణమే యొనరించివచ్చి భా
సురముగ నుండె శంకరుని।సూనుఁడు చయ్యనవచ్చి మాధుఁడా!
తిరముగ నుంటి వెందు కని । తెంపున నాడిన నాతఁ డత్తతిన్. 258

సీ. పలికె నవ్వుచు నిట్లు । భవసుత! ముందుగఁ గౌటిల్యమున నేను।గ్రౌంచగిరికి
మొనసి ప్రదక్షిణ । మొనరించి నిలిచితి నన విని స్కందుఁడే । నద్రి చుట్టి
వచ్చితి మున్ననిఁ।పలికె వారిమాడ్కి నేమున్న నేమున్న । నిశ్చయముగ
నగముచుట్టుఁదిరిగి । నాఁడ। నేనడి నంచు నన్యోన్యవిధి వాద।మాడి బ్రహ్మ

ఆ. శివరమేశులకును । జెప్పిన పిమ్మట
నచ్యుతుండు గుహుని । కనియెఁ గ్రౌంచ
గిరిని నడుగు మద్ది । తొరలి యెవ్వఁడు ముందుఁ
దిరిగ ననునొ వాఁడు । దివ్యబలుఁడు. 259

క. అన విని స్కందుఁడు క్రౌంచం, బునుఁ గన్గొని యెవఁడు పొరిది । ముమ్మందర నీ
కును వలగొనెఁ దగఁ బలుకుము, యన నది గుహుఁ గాంచి పలికె।నమలగుణాఢ్యా!

క. అనఘా! గురుమానసమున, దొనరెడు శక్రుండు నాకు । మును వలఁ గొన్న వె
న్కను నీచేఁ జేయంబడెఁ, ఘనతఁ బ్రదక్షిణము నేఁడు । కడువడితోడన్. 261

—— గుహుఁడు మహాపరాక్రమమున క్రౌంచగిరిని భేదించుట. ——

చ. ఇటుల వచించుక్రౌంచకుధ।రేశునిపై గుహుఁ డల్గి యాయుధం
బటుతరకోపుఁడై వెలసి । ప్రస్ఫుటితాధర మొప్పుచుండఁగాఁ
గుటిలపుశక్తితో మహిమఁ । గూడినక్రౌంచుని సంహరించె నం
తట నిజసూనుఁ డీల్గఁ గని । తద్దయుఁ గోపము ప్రజ్వలింపఁగన్. 262

క. అగపార్థివతనయుండ, త్యగణితబలుఁ డౌసునాభుఁ । డపు డరుదెంచెన్
గగనమునకు సుర లేగిరి, సొగసున గుహునిహితమహిమఁ । జూచి మునీంద్రా!

క. ఘనబలుఁ డగుస్కందుఁడు శక్తిని వడిఁ జెకలించి పట్టి । తెగువన్ గాని వ
చ్చిన మేనమామఁ గూల్పన్, దనమదిఁ గాంక్షింపఁ జక్రధరుఁ డట్టితతిన్.

ఆ. అధికవేగుఁ డగుచు । నాతనిఁ గరములఁ బట్టి గౌఁగిలించి । భర్గతనయ!
గొరుఁ డితండు కూల్పఁ । గూడ దెన్నటికని, చెప్పి చంపకుండఁ।జేసె నంత.

క. గిరిపతివచ్చి సునాభునిఁ, గరమునఁ దగఁ బూని వానిఁ।గడఁ జేర్చి। భగ

శ్వరుఁడు హరిగుహాలలవడిఁ బురస్కారమునుఁ బొందించెనపుడు । కడు వేగమునన్.
వ. అత్తఱి సర్వసుపర్వులు ప్రమోదభరితాంతరంగులై యుండిరి. 267
సీ. అంత రుద్రాత్మజుఁ । డసురేశ్వరుం డగు శౌరినిఁ గన్గొని । సారసాక్ష!
పరమవివేకియు । భక్తిరతయు భగవంతుఁ డగుమాతులేయు నత్యాగ్రహమునఁ
జంపితిఁ గావునఁ । జటులతపస్సునుఁ గావింపఁగలవాఁడఁ । గాంత! యనిన
హరి వానితోఁ బల్కె । నవు డో కుమార! నీ వధికపాపహరంబు । నా పృథూద
ఆ. కాఖ్యతీర్థమునకు । నరిగి స్నాతుండవై, పాలినాఘువలిని । వఱలుహరుని
భక్తితోడఁ గాంచి । భాస్కరసమపరాక్రముఁడ వౌదు వనుచుఁ । గడిమి నిట్లు
చ. పలుకఁ గుమారుఁ డంత హరి । పల్కినతీర్థముఁ జేరి శ్రద్ధమై
నలరి మునింగి ధూర్జటియు । నా శివుఁ జూచి సమస్తనిర్జరే
శుల ముద మొందఁ జేసి రవి । శోభుఁడునై తనరారి భక్తితోఁ
జెలఁగి పురారిమందిరముఁ । జేరెను మానులు సంతసింపఁగన్. 269
క. మునినాథ! చక్రనేత్రుం, డనిలాశనుఁ డగుచు నాము । హాశ్రమశైలం
బున వృషభధ్వజుఁ డగుశంభునిఁ గూర్చి తపంబుసేయుఁ । బురహరుఁ డంతన్.
వ. తుష్టినొంది వరదుం డగుచు సాక్షాత్కరింపఁ గని వాఁడు భవునకుఁ బ్రణమిల్లి
దేవా! రణరంగమున నస్మచ్చక్రము బాణాసురకరవిద్ధం బయ్యె దానికి వానికరం
బుల ఖండించునట్టి వర మొసఁగు మని ప్రార్థించిన శంకరుఁడు గణేశునిఁ జూచి
ప్రమథేశ్వరా!, నీవు కోరినవిధంబున భవదాయుధం బగుచక్రంబునకు వరమిచ్చితి
పొమ్ము. మిగులఁ జెంపారినబాణబాహావనంబును ఛేదింపం గలదు. సందియం
బు వలదని పలికి యవు డంతర్హితుం డయ్యె ఇట్లు తండు భవదత్తవరుండై స్కం
దునిఁ జేరి యతనిపదములకు నమస్కరించి హరప్రసాదంబు నివేదించి ముద
మున నుండె నని చెప్పి వెండియు నిట్లనియె 271
క. నారద! గుహాలఁ డీమాడ్కిన్, ఘోరాసురుఁ డైనమహిషుఁ । గూల్చెను శక్తిన్
ధారుణి నీకథఁ జదివిన, వారికి స్కందుం డొసంగుఁ । బరమపదంబున్. 272
క. ఇటుల పులస్త్యుఁడు పలికినఁ, బటుతరసంతోష మొప్ప । బ్రహ్మాత్మజుఁ డా
దటఁ బల్కె నో మునీశ్వర!, కుటిలాసురు లెల్ల మిగులఁ । గూడినవేళన్. 273
క. ఏ రాక్షసవర్యుం డే, దారుణశస్త్రమునఁ గూలె । దయ నుడువు మనన్
నారదుఁ గన్గొని యాముని, ధీరుఁడు భాషింపఁ దొడఁగె । దివ్యోక్తులతోన్.

## ఋతధ్వజనృపచరితము.

సీ. అనఘ! రిపుత్రజ । హంతకుఁ డగురాజు రఘువంశమందున । రమణఁ జెలఁగెఁ
బరసైన్యదమనుండు । పటుశౌర్యవరుఁ డురుబలుఁడు మహోదయా । స్పదుఁడు సర్వ

విప్రదీనాంధక। వితతార్తినాశుండు సుగుణైకనిధి యతి। సుభగవర్యుఁ
డమలఋతధ్వజా।ఖ్యంగల పుత్త్రుఁ డాభూపాలమణికిని। బుట్టె దీప్తి

ఆ. నతఁడు గాలవార్థ। మై తురఁగారూఢుఁ
డగుచుఁ బూన్కి మిగులఁ। నర్ధచంద్ర
పరమశరమువలనఁ। బాతాళకేతుని
బృష్ఠమందుఁ గొట్టి। పృథివిఁ గూల్చె 275

క. అనఁ గలహాశనుఁ డపుడా, మునినాథునిఁ గూర్చి పలికె। మున్నాతం డా
దనుజాధ్యు నేల గాలవ, మునికొఱకై చంపె నెట్టి। ముల్కి మునీంద్రా! 276

ఆ. ఇట్లు నారదుండు। పృథుభక్తి ననఁ బల
స్తుత్యుండు నుడివె వెండి। సూనృతాత్మ!
గాలవుండు మున్నుఁ। గడఁగి స్వాశ్రమమందు
నుండెఁ దపసుతోడ। నొప్పి యపుడు 277

క. పాతాళకేతుఁ డనువాఁ, డాతాపసవరుఁ డొనర్చు।నట్టి తపోయో
గాతతనిష్ఠాభంగముఁ, జేతోమూర్ఛత్వ మొప్పఁ। జేయుచు నుండెన్. 278

ఆ. అసురుఁ డాచరించు।నట్టి విఘ్నములను, సరకుఁగొనక మౌని।సత్తముండు
తపముతోడ మిగులఁ। దనరియు దైత్యునిఁ, గూల్పఁజాల కధిక।కోపుఁడగుచు.

క. మినుఁ గన్గొని ఘోరస్థితిఁ, దనరెడి నిట్టూర్పువిడిచెఁ। దద్దయు దానన్
గన గగనచ్యుతమై యొక, ఘనతురగము వ్రాలెఁ దత్ర।గలి నంత మునీ! 280

ఆ. గగనవాణి యపుడు। గాలవుఁ గాంచి యీ
దివ్యతురగ మొక్క।దివసమునకు
నలిసహస్రయోజ।నములు పోఁగలదని
పలుక నామునీశ।వర్యుఁ డొంది. 281

క. ఆవారువరతనముఁ గొని, వావిరి నపుడాత్తబాణ।వంతుండు మహా
పావనుఁ డైనఋతధ్వజ, భూవిభున కొసంగి దివ్య।బుద్ధి చెలంగన్ 282

క. పరమతపోనిష్ఠారతి, నరుదుగ వర్తించుచుండె। నంతటఁ బృథ్వీ
వరుఁ డేతెంచి శరంబునఁ, నురవడిఁ బాతాళకేతు। నుర్విన్ గూల్చెన్. 283

మ. అన బ్రహ్మాత్మజుఁ డంతఁ బల్కె మునిచంద్రా! యశ్వ మెవ్వానిచే
తను వ్యోమంబుననుండి త్రోయఁబడెనో। తర్కింపఁగా వాఁడె యే
ఘనుదేహంబుననుండి పుట్టెనొ వినన్। గౌతూహలం బయ్యె నా
కని ప్రార్థింపఁ బులస్త్యమౌని పలికెన్। హర్షంబుతోఁ గ్రమ్మఱన్. 284

సీ. విను మునినాయక! । విశ్వావసుం డనువానితోఁ దనరారు।వాఁడు భూరి
బలుఁడు యశస్వియు।బంధురునోల్లాస।కరుఁడు నైనమహేంద్ర।గాయకాఖ్య

గంధర్వనాథుండు గంధర్వరత్నంబు భార్యార్థమై ఋతధ్వజునికడకు
నవనితలంబున కనిచె నం చనిచెప్ప నారదుఁ డని మునినాథ! యువఁడు
ఆ. పనిచె మేటి తేజిఁ బరువడి గంధర్వ, పతి యెందుఁ గొఱకుఁ బాలి నతఁడు
కువలయాశ్వనాముఁ డగుభూపాల, సుతుని కేల పనిచె సొరిదిఁ జెపుమ.
క. అన నతఁ డన విశ్వావసుఁ, డనఁబడుగంధర్వవిభుని కాలాకృతి సొం
పునుండ దానిసొగసును, మునునే భాషింతు వినుము పుణ్యమునీంద్రా!
ఉ. శీలగుణాభియుక్తయయి చెన్నలరారి జగత్త్రయంబునన్
లాలితరూపసుందరవిలాసములన్ సుభగత్వసంపదన్
జాల వెలింగి చంద్రరుచిసన్నిభయై సుమహాలసాఖ్యతో
నాలలితాంగి భాసిలు మదాలసమూఢ్కి నిరంతరం బొగిన్. 287
తే. ఆసొగసుకత్తె నందనోద్యానమందుఁ, దిరుగుచుండినఁ గన్గొని త్రిదశవైరి
యైనపాతాళకేతు డాయలివఁ గొనినఁ, జూచి గంధర్వనాథుఁ డుచోద్యమంది.
చ. సతిఁగొఱకై తురంగమును జయ్యన నిచ్చినఁ బార్థివాత్మజుం
డతిముదమొప్ప దానిపయి నాదట నెక్కి సురారిఁగూర్చి స
మ్మతిని తదంగనామణిని మానుగఁ గూడి శచీసమేతుఁ డై
సతతము వెల్గువాసవుని చాడ్పున నావిభుఁ డుండె నత్తఱిన్. 289
క. అని నుడివినఁ గలహాశనుఁ, డని యిట్లు మహాసురేంద్రులయి గర్వముతోఁ
దనరిన తారకమహిషులు, మనసిజరిపుసుతునివలన మడిసినవేళన్. 290

అంధకుఁడు మందరగిరియున్న పార్వతినిఁ జూచి మోహించుట.

ఆ. దివ్యతాపసేంద్ర ధృతిమంతుఁడును హిర
ణ్యాక్షసుతుఁడు నైన యంధకుండు
పిదప నేమిచేసెఁ బ్రీతిలో భాషింపు
మనిన నాతఁ డిట్టు లాడఁదొడఁగె. 291
క. అనఁ గూలినతారకమహి, షునిఁ గని దుష్టాత్ముఁ డఖిల సురసైన్యవినా
శనుఁ డగునంధకుఁ డత్తఱి, ఘనముగఁ గోపంబు మదినిఁ గ్రాలుచు నుండెన్.
సీ. కరమునఁ బరిఘంబుఁ గైకొని మితపరివారంబు వెనువెంట వచ్చుచుండఁ
బాతాళముననుండి పఱతెంచి భూస్థలి నిచ్చవచ్చినరీతి ముచ్చటలరఁ
దిరిగి పిమ్మటఁ జారుదివ్యకందర మగుమందరనగమందు మమతతోడ
సంచరించుచు నట సఖియలనడుమను శోభిల్లునదియును శుభయు గౌరి
ఆ. యను నగతనూజఁ గాంచి మనసిజబాణార్తుఁ
డగుచు నెట్టకేల కతఁడు చారు
సర్వగాత్రయైనసొమ్మాధరేశునికూర్మి
తనయ చెంత కేగి తాపసేంద్ర! 293

ఆ. చక్కఁదనముతోడ సర్వాంగసుందర
వైభవంబుతోడ వనమునందు
నెలమిఁ దిరుగునట్టి యీచాన యేవాని
రాణి యగునొ తెలియరాదు మదికి 294

ఉ. ఈవనజాయతాక్షి హృదయేశ్వరియై తనకౌఁగిట న్ననుం
వావిరిఁ జేర్పఁ జేని కనఁ బ్రత్యహముం గనుపొందునట్టి నా
జీవము నిష్ఫలత్వమును జెందును చక్కఁదనాలకెల్లనుం
ద్రోవగు నాస్వరూప మిలఁ దొందును ధిక్కృతి దాన మానుగన్. 295

క. నెలరా మొగమది నునువె, న్నెలరా వాల్గంటనవ్వు నెఱి నీలపువ
న్నెలఁగురు లెక్కడిమేల్కి ల్బెడ, నెలరాలసరాల మించు నెలఁత నఖంబుల్ 296

చ. జిగిబిగిజంకకన్నుఁగవచే నసితాతులకేశకాంతిచే
సొగసగుమేనిచే మిగుల శోభిలుదీని నెవండు పూన్కినై
తగ సమకూర్చెనో యతఁడు ధన్యుఁడు మిత్రుఁడు బంధుగుండు బ
ల్పుగముఁడు సాంపరాయికుఁడు సోదరుఁడై వెలుగొందు నాకొగిన్ 297

ప్రహ్లాదుఁ డంధకునకు నీతి బోధించుట

క. వెడఁగున నంధకుఁ డీకై, వడి నన ధీజలధి యైన ప్రహ్లాదుఁడు పె
న్వడిఁ జెవులుఁ గరయుగంబున, గడుమూసి శిరంబుఁ ద్రిప్పి కనలుచుఁ బలికెన్.

క. దనుజా! యీసతి త్రిజగ, జ్జననియు హరునాతి యగును సంతతి నాశం
బును గావించెడిదుర్బు, ద్ధినిఁ బూనకు పాప మొదవు దృఢముఁగ నీకున్.

క. పరభామ యగును నీ వీ, తరుణిమణి నాత్మఁ గోరఁదగునే? చూడన్
సరవి రసాతలమందున్, గరము మునుంగకుము మంచిగతిఁ గనుమసురా! 300

క. అనిశము సదసత్కల్పిత, ఘను మఱి పెరబోటిపొందు మూఢాత్ములు నా
జను లాచరింతు రిటు స, న్మనుజులు కావింపకుంద్రు మహినట్టిపనిన్ 301

సీ. కర్బురేశా! తొల్లి గాధిభూపతి పెఱచేడెలవిషయమై చెప్పినట్టి
దివ్యమౌ శ్లోకంబు లివిరి నీచే నశ్రుతము నయ్యెఁ గాఁబోలుఁ దానిఁబూన్కి
విను మానృపాలుఁడు విప్రియాంతాసక్త మైనసేనను గని యకట! పరుల
బాధపెట్టుటకన్నఁ బ్రాణంబులను వీడి విడుచుట మే లగు విపుల వెలయు

ఆ. సకలజనుల కహిత మైనవాక్యముఁ బల్క, వలదు షండులైన బరకళత్ర
రతిని బుద్ధిఁ దలఁపరా దన్యవిత్తాప, హర మొనర్ప దొప్పు దనుచు మరల.

తే. పరులధనములపై నాశ పడుటకంటె
హైతువృత్తిఁ జరించుట పరమధర్మ
మార్గ మనిచెప్పుచుండురు మాన్యు లనుచు
నిట్లు నరఁ దన నని చెప్ప నెసఁగుఁ దమిని. 303

## అంధకుఁడు భ్రష్టబుద్ధి వలన పార్వతిపై నేగి మూర్ఛ నొందుట.

క. మునివర! వాఁ డామాటను, విని గర్వాంధుండు కామ। విశిఖార్తుఁడు నై
తనమేనుఁ దెలియ కిది రిపు, జననియు యగు ననుచుఁ దలఁకి। చనె వేగమునన్.

క. ఘనయంత్రముక్తవై చ,య్యనఁ బోయెడి రాళ్లమాడ్కి। ననురేశ్వరు లా
దనుజానివెంటనె చనఁ గని, కనలుచు నందీశ్వరుండు। క్రౌర్యస్ఫూర్తిన్. 305

క. పటుచక్రోద్ధృతకరుఁ డై, పటపట దంతములు గీటి। బవరంబునకున్
జటులగతి వచ్చు రాక్షస, పటలంబులఁ దాఁకెఁ దోలె। బలిమి న్మౌనీ! 306

క. తారాదిలత్సురారులు, దారుణభిదురంబుచేతఁ। దద్దయు హతులై
చేరిరి దశదిశలకుఁ జెం, పారెడిసాధ్వసముతోడ। నదరి మునీంద్రా! 307

క. అని నంది కులిశహతు లై, పెనుభీతిన్ బోవుదనుజ। వీరుల నెల్లన్
గని యంధకుండు నందినిఁ, దనపరిఘముతోడఁ గొట్టి। ధరఁ ద్రోసె వడిన్.

క. వలితుం డగునందీశ్వరు, నతివేగముతోడ వచ్చు। నంధకుఁ గని పా
ర్వతి యాదానవుఁ దెగ, శతరూపయు నయ్యె నపుడు। సౌజన్యనిధీ! 309

సీ. అంత మహాసురుఁ। డైనయంధకదైత్యవరుఁడు దేవీమధ్య। భాగసంస్థుఁ
డై లోలదృష్టితో। నలరారి తమిమీఱఁ గరిణులనడుమను। గడిమిఁ దిరుగు
గజరాజు కైవడిఁ। గామియై తిరుగుచు మదలోభమునుజాల। మాడ్కి మఱియు
జాత్యంధ రాగాంధ। జనులవిధంబున నట నుండుసుదతుల। నరసి పూన్కి
ఆ. నగజ యువతి యగుట। నత్తతి భావించి, తెలియలేక కుంది। తివిరి తన్ని
రాకృతుండు నగుచుఁ। బ్రస్ఫుటశరగణ, బద్ధుఁ డై ధరిత్రి। వ్రాలె నంత. 310

చ. గురుబలుఁ డైనయంధకుఁడు। కూలఁ గనుంగొని నూఱురూపులన్
బరఁగిన దేవి యాస్థలము। వాసి రయంబున మాయమయ్యె నా
కరణి నటించు నాదనుజుఁ। గాశ్యపిఁ జూచి రణార్థు లైనని
ర్జరరిపు లెల్ల ఘోరతర। రావ మొనర్చుచు నేగి రంతటన్. 311

చ. చిరచిర నేగురక్కసుల। భీషణరావము నాలకించి సు
స్థిరబలుఁ డాగణేశ్వరుఁడు। తెంపున వాసవుమాడ్కి వజ్రమున్
గరమునఁ దాల్చి కంపమున। గ్రాలి వడిన్ జను దైత్యనాథులన్
గరముఁ జయించి వచ్చి భవు। కాంతనుఁ గాంచి విశేషభక్తితోన్. 312

ఆ. పాదకమలములకుఁ। బ్రణమిల్లె నాయెడ, గోత్రరాజపుత్త్రి। కూర్మి మిగుల
నాత్మరూపములను। నలరు వలంతులఁ, గాంచి పలికె వేడ్క। కదలుకొనఁగ.

చ. వలఁచినచోటి కత్తతిని। బాలిఁ జనుండు మహీతలంబులోఁ
జెలఁగెడుమానవోత్తముల। చేత సుపూజిత లై కడింది సొం
పలరెడుపూలతోటల మ। హామలదివ్యవనస్థలాములన్
లలితనగోరువృక్షచయ। లక్షితవాసములన్ జరింపుఁడీ! 314

ఆ. సంయమీశవిశాఖ! యిట్లు । శైలజ భావింప, నాలకించి వార । లంబికాంఘ్రి
పద్మయుగళమునకుఁ । బ్రణమిల్లి కిన్నర, స్తూయమాన లగుచుఁ । దుష్టి నొంది.
తే. అఖిలకిన్నరగణనుతే । లగుచు సర్వ, దిక్కులకు నేగి రంధకా । దితిజుఁ డంత
మూర్ఛఁ దేలి హిమాచలపుత్రి నాత్మ, దనుజబలమును గానక । తల్లడిల్లి. 315
క. ఘనభీతి రసాతలమున, కును జని యెూడుపడ దైత్య । కుంజరుఁ డహము
డు నశనమునుఁ గుడువక రా, త్రిని నిద్దుర లేక మిగులఁ । దికమకపడుచున్.
క. పరదేవి యైనగౌరిని, బరిపరివిధములను మదిని । భావించుచు దు
ష్కరమదనతాపయుతుఁ డై, నిరతము వర్తించుచుండె । నిర్మలచిత్తా! 318

హరుఁడు తపంబున కరుగుట.

చ. అని యిటు పల్కి బ్రహ్మసుతుఁ । డాడె మునీశ్వర! శంకరుండు నం
దిని గిరిజాసతిన్ గలిసి । దీప్తిఁ జెలంగుచుఁ బోయి చేసినా
పనిఁ గాని యంధకాసురుని । భస్మముచేసినా పల్కుమన్న నా
మునిపతి చెప్పసాగె గురు । మోదము డెందమునన్ చిగుర్పఁగన్. 319
సీ. శర్వుఁడు వేయివత్సరములు తమి మహా మోహాసక్తితోడ । మొనయుచుంట
నిర్గతసారుండు । నిస్తేజుఁ డయి నిజగతవీర్యసరణిని । గాంచి తపము
గావింప మది నెంచి । కరమర్థి నద్దానిఁ బూని హిమాచల । పుత్రి నంతఁ
గూర్మి నాశ్వాసించి । గోత్రాత్రియం దుంచి వసుధపైఁ దిరుగుచు । భద్రమూర్తి
ఆ. సహితకంధరుండు । చారుకటిన్యస్త, శంఖమేఖలుండు । సవ్యదివ్య
కరకమండలుండు । కమనీయదక్షిణ, కరకపాలుఁ డగుచుఁ । గణ్యు లెన్న. 320
క. త్రైలోక్యస్థానంబున, వాలాయం బైనభక్తి । వర్తించుచు స
న్మాలానిలఫలగణాశీ, లాలాశనుఁ డగుచు యోగ । లక్షితబుద్ధిన్. 321
క తరుకలితాద్రితలంబుల, వరశైలప్రస్థసుమహా । వనముల నొకవా
సరనియుతిని నవశతవ, త్సరములు విలసిల్లి మరల । వదనమునందున్ 322
ఆ. హితవిధము నునిచి । శ్వాసను బంధించి, సమశిలాతలాఢ్య । సారదీర్ఘ
పర్వతేశ పృష్ఠ । పదమందు నిష్ఠతోఁ, దనరుచుండె నంతఁ । దాపసేంద్ర. 323
క. పరమేష్ఠికపాలము నది, పరువడి ఛేదించి మించి । బహుదీప్తిమెయిం
బరఁగుచు శంకరజూటాం, తరతలమునుండి వ్రాలె । ధరపై నంతన్ 324

కేదారతీర్థోత్పత్తి

క. వరుసగ నాపీఠని భూ, ధరమతి కీడితము నగుచు । ధరణికి సమమై
బరఁగి తపించుచుఁ బుణ్యా, కర మగు కేదార మనెడు । ఖ్యాతిం గాంచెన్. 325
తే. పురహరుం డంతఁ గేదార । మునకు మోక్ష, సాధనము పీఠకల్మష । సహిత మధిక
పుణ్యవృద్ధికరంబు నై । భూదలు వరము, నిచ్చె దాని వచింపద । సిద్ధచరిత!

వ. అట్టి కేదారతీర్థమందు వెలయు జలంబు మనుజులు త్రావి మధుమాంసభక్ష
ణమ్ము వర్జించి బ్రహ్మచర్యవ్రతస్థితితో నియతులై వర్తింతురేని వారు స్వప్నాస
ములకు సకలదురితములఁ బాయుదురు. ఇంతియే కాదు వారిచిత్తకమలములం
దట్టిలింగ ముద్భవింపఁగలదు. దాని కొకతతి నైనను దురితాసక్తి కలుగదు.
ఆతీర్థమందుఁ జేసినపితృశ్రాద్ధం బక్షయం బయి రాణిల్లు. సందియంబు లేదు.
మఱియు నిట మృతులైనమనుజుల గుఱించి చేయుస్నానదానతపోహోమా
దిక్రియ లక్షయంబు లగునని వాక్రుచ్చె. అందువలన నాతీర్థ మభవునివలన నట్టి
వరంబుఁ బొంది తద్వచనప్రకారముగ దేవతలను నరులను బవిత్రులఁ జేయు
చున్నది. ఇట్లు మహాదేవుఁడు కేదారమునకు వరమొసఁగి పిదపఁ బాపనాశ
నియు భానుపుత్త్రియు నగు కాళిందీనది కేగి దానిం దాఁటి యామహాజలంబున
మునింగి యంతర్వారిస్థితుఁడై ద్రుపద యనుపేరుగల గాయత్రిని జపించు
చుండె మునీశ్వరా! వృషధ్వజుఁడు దేవి యైనకాళిందీవాహినియందు గాహ
మానుం డగుచు నొకటిన్నరయేడు జపించుచు లేచి రాకుండ నట్టియెడ. 327

ఉ. తారలతోడఁ గూడుకొని / తద్దయు రాలిలు ఋక్షరాసు ల
వ్వారిగ వ్రాలె భూస్థలిని / వార్ధులు విష్టపముల్ చలించె వి
స్తారపుభీతితో నడరి / శక్రపురోగులు నైన సర్వదై
త్యారులు తల్లడిల్లిరి నిజాసనవిచ్యుతులై రయంబునన్. 328

క. మునివర్యులు లోకంబుల, కనయము కళ్యాణ మొదవు / నని సద్భక్తిన్
దనరి జపించుచు నుండిరి, వనజాక్షుని నాత్మలందు / భావించి మునీ! 329

ఆ. వివిధభువనములను / వెలసినవిబుధులు, వెఱచి సర్వదేవ/విభుఁడు నైన
బ్రహ్మ నడుగుటకునుఁ / బరువడిఁ జని కని, భక్తితోడ మ్రొక్కి / పలికి రపుడు.

మత్త. సారసోద్భవ! యెందుకోసమొ / సర్వలోకము లార్తితో
సారెకుం జలియింపసాగెను / సంశయస్థితి మాకుఁ జెం
పారివచ్చితి మన్న బ్రహ్మయు / నాసురేశులఁ జూచి యా
కారణంబును నే నెఱుంగను / గాన శ్రద్ధను బూనుచున్ 331

క. వరదుఁడు చక్రగదాన్విత, కరుఁ డగుమురవైరి నడుగఁ / గదలుం డని యా
పరమేష్ఠిపలుక సురల, య్యరవిందాసనునిఁ గూడి / హరిగృహమునకున్. 332

సీ. చని రట నారద/సంయమి యనె నట్టిమురవైరి యెవ్వఁడు / మునివరేణ్యా!
దానవుఁడో లేక / దైత్యుఁడో కిన్నరవర్యుఁడో యక్షుఁడో / భవుఁడో లేక
దేవతయో యెంచి / తెల్పుమా యనఁ బులస్త్యుండు నారదమునిఁ / జూచి పలికె
సంయమీశ్వర! రజ/స్సత్త్వతమోగుణమయుఁడు నిర్గుణుఁడును / మధువిరోధి
ఆ. యు నగునాతఁ డన్న / నొగి వాఁడు నాముర
దైత్యుఁ డవ్వఁ డవని/తనయుఁ డాతఁ

దట్టు కౌరివలన । నీర్ష్యా దానినిఁ జెప్పు
మనఁ బులస్త్యుఁ డాది । నపుడు పేర్మి. 333

చ. పొరిఁ బొరి విస్మయంబునయి । పుణ్యదమై కలుషాపహంబునై
దనుజసురేశ పుంజమయి । తద్దయు రాజిలునట్టి యీపురా
తనకథ నే వచించెద సు । దారమనంబున నాలకింప నా
ననుచుఁ బులస్త్యమౌనివరుఁ । డాడఁ దొడంగెను భవ్యవాక్యములన్. 334

## మురదానవచరిత్రము.

సీ. కశ్యపునకు దను । కాంతకు మురనామదానవుఁ డుదయించెఁ । దనయుఁ డగుచు
వాఁ డాజి నిర్జర । వరులచే భగ్నులౌ దనుజులఁ జూడఁగాంచి । తల్లడిల్లి
మరణభయంబున । మలసి సరస్వతీవిభుఁడు నజేయుఁడౌ । విధిని గూర్చి
బహువత్సరంబులు । భక్తితోడఁ దపంబుఁ గావింప నంతటఁ । గమలభవుఁడు
ఆ. పరమతుష్టి నొంది । పలికెంచి యోవత్స!
వరము నిత్తు ననుచుఁ । బలుక నతఁడు
బ్రహ్మ కపుడు మ్రొక్కి । పలుమారు వినుతించి
పలికె సంతసమున । బరమమౌని! 335

క. కరుణాసాగర యెవ్వరిఁ, గరతలమున నంటఁగలనొ । కదనంబున నా
పురుషులు నిర్జరులైనన్, ధర నీల్గెడివరము నాకు । దయ నిమ్మనినన్. 336

క. విని లోకపితామహుఁడును, ఘనుఁడును భగవంతుఁడైన । కమలాసనుఁ డా
దనుజేశుఁడు కోరినవర, మును వేడ్క నొసంగి యాత్మ । పురి కరిగె మునీ! 337

ఉ. భూరితరప్రభావుఁడయి । పొంగుచు నంత మురాసురుం డొగిన్
ధీరుఁడునై సురాద్రికిని । దెంపున నేఁగి రణంబొనర్పదై
త్యారులఁ జీర నావిబుధు । లం దొకఁడైన నెదిర్చి వానితోఁ
బోర నశక్తుఁడయ్యె మదిఁ । బుట్టెడిదారుణభీతి నాయెడన్. 338

క మురదైత్యుఁ డంత నిర్జర, పురికిని గోపమునఁ బోయి । పురుహూతుని సం
గరమునకుఁ బిలువఁ గలహము, హరిహయుఁ డొనరింపకుండె । నాదైత్యునితోన్.

ఆ. కరములెత్తి పూన్కిఁ । గన వాఁడు సురపురి
యందుఁ జొచ్చె నంత । నమరులందు
నొకఁడైన వచ్చి । యుండిన మురదైత్యు
నడ్డగింపఁడయ్యె । నంత మౌని! 340

క. అరక్కసుఁ డమరేశా, గారంబునఁ జొచ్చి యతనిఁ । గని నాతోడన్
బోరాడుము రాదనినన్, సారస్వర్గంబు విడిచి । చనుమని పలికెన్. 341

చ. పరమమునీశ! వాఁ డిటులఁ । బల్కినశక్రుఁడు నాకరాజ్యమున్
బరబర వీడి పోవఁగను । క్ష్మాస్థలిపైఁ దిరుగాడుచుండ నా

తరుణమునందు నారదుఁడ । తల్లజుఁ డుద్ధతిఁ గుంజరేశునిన్
వరకులిశమ్ముఁ గైకొనియె । వాసవుఁ డాత్మను ఖేదమొందుచున్. 342

క. తనసతినిఁ గూడి పుత్త్రుఁడు, వెనువెంట న్వచ్చుచుండ । విస్తృతభీతిన్
జని కాళిందీదక్షిణ, ఘనతటగతభూమిఁ జేరె । గళవళపడుచున్. 343

చ. మురదైత్యేశ్వరుఁ డట్టి నాకమున సామ్మోదంబుతో నిత్యమున్
స్థిరభోగంబుల నొందుచుండెఁ బరులై । దీపించు తారాదిదు
స్తరదైత్యేశ్వరు లామహాసురుకడన్ । సంప్రీతితో నుండి రా
పురిఁ గ్రీడించెడిపుణ్యవంతులక్రియన్ । బొల్పారి మానీశ్వరా! 344

ఆ. ఆమహాసురుండు । హర్షంబుతో నొక్క, తఱిని దంతి నెక్కి । ధైర్య మొప్ప
సాయఁ డెవఁడు లేక । సరయూమహానదీ, తీరతలమునొంది । తిరిగి తిరిగి. 345

సీ. నారద! యామహానదికిని దక్షిణతటభాగమందు నధ్వరసుకర్మ
దీక్షితుఁడును గురుధీరుఁడు రవివంశజనితుఁడు రఘునామసహితుఁ డైన
పార్థివుఁ గని దైత్యారి! । బవరమ్మునకు రమ్ము రణ మొనర్పుట కీవు । రానియెడల
సవన మొనర్పకు । సర్వామరుల యజింపకు మని పలుమాఱుఁ । బలుకుచుండ
ఆ. మానసీయఘనుఁడు । మైత్రావరుణిగ్రామ్యున, వరవసిష్ఠుఁ డంత । వాని కనియె
నసురవీరవిజితు । లగుపూరుషులలోనఁ, బోర లాభ మేమి । పొసఁగు జూడ.

చ. ధరఁ గలమేటివీరులను । దండనచేయుట ధర్మమావిధిన్
గర మొనరించుచో నొక్క మదిఁ । గ్రాలినభూరిబలాధికస్థితిన్
బరఁగి త్వదాజ్ఞ మీఱుజనముఁ । బట్టి జయింపు మతండు చిక్కునా
సరవి నశేషభూతలము । చయ్యన లోఁబడు నీకు దానవా! 347

క. మునినాథ! యిటువసిష్ఠుం, డనవిని కడువేడ్కఁ గదలి । యాతఁడు దండం
బును దాల్చి యున్నభాస్కర, తనయునికడ కేఁగుచుండె । దర్పోద్ధతితోన్. 348

క. చనుదెంచు మురునిఁ గని వీఁడనిఁ జావం డనుచుఁ గాలుఁ । డంతట వేగం
బున దంతి నెక్కి భర్త్రావనుఁ డగుహరికడకు నేఁగి । భయభక్తులతోన్. 349

చ. కరములు మోడ్చి మ్రొక్కి ముర । కర్బురుచేష్టితము న్వచింప శ్రీ
ధరుఁడు దినేశసూనుఁ గని । దండధరా! చని యామహాసురే
శ్వరు నివు డీవు నాకడకుఁ । బంపు మటం చని పల్కె భార్గవీ
వరుని సుభాషితంబు విని । వానికి నంతకుఁ డాక్షణంబునన్. 350

క. చనుదెంచి కొలువుకూటం, బున నుండె మురాసురుండు । భుజబల మొప్పన్
గనలుచుఁ గాలుని నగరం, బునకును జనుదెంచుచుండెఁ । బుణ్యనిధానా! 351

మ. ఘనవేగంబున వచ్చు నారదుజనిన్ । గంజాప్తసూనుం డొగిన్
గని దైత్యాధ్రిచరేశ! యేపనిని నీ వొద్దన్ రయిఁ గాంక్షించి పొం

భువ సేవించినవాఁడ వైతివా మహా। ప్రసాదంబు చెన్నారఁ జె
ప్పనే దాని నొనర్తు నాఁడు మనుచు। స్వేదంగ వాఁ డంతటన్. 352

ఆ. దండధరునిఁ జూచి। దర్పించి పలికెనో, శ్యామలేశ! మనుజ।సంయమంబు
విడువ మట్టు లీవు। వినకున్న ధర నైతు, నీశిరంబుఁ ద్రుంచి। నేర్పుతోడ. 353

క. అన విని యాతం డనె నో, దనుజేశా! నీవు ప్రాణి।తతిసంయమనం
బునుఁ జేయవేని నే నటు, లనిశము వర్తించువాఁడ। నగుదుర గనుమా. 354

క. విను మొకవిషయము నుడివెద, ఘనబలుఁ డైనట్టిమురుఁడు। కలఁ డొక్కదతం
డనఘుఁడు నై పాలకుఁడై, యానరాదు నటన్న దైత్య।పుంగవుఁ డనియెన్ 355

తే. కాల! నీకంటె నధికుఁడై। క్రాలువీరుఁ
డున్నఁ బలుకుము నేవాని। నుక్కడంచి
పాఱఁదోలి నివారింతు। బాహుశక్తి
ననుచుఁ బలికిన విని యముఁ। డనియె నంత. 356

క. భూతాధీశ్వరుఁ డవ్యయుఁ, డాలతబలుఁ డతులచక్ర।హస్తుండు మహా
శ్వేతద్వీపనివాసియు,నై తనరెడివిష్ణుఁ డధికుఁ। డగు నాకంటెన్. 357

చ. అని యిటు లంతకుం డనిన। నామురదైత్యుఁడు పల్కెఁ గాల! యా
ఘనబలుఁ డేనివాసమునఁ। గ్రాలునొ పల్కుము నే స్వయంబుఁగన్
జనఁగలఁ దద్యమోద్యతను। జయ్యన నచ్చటి కంచుఁ బల్కినన్
విని యతఁ డంత నారదుని।వీరునిఁ గన్గొని పల్కె నారదా! 358

ఆ. పాలకడలికడకుఁ। బటుశక్తిఁ జను మట, భువనపతియు లోక।మూర్తిమేటి
బలుఁడు సర్వధనుఁడు। భగవంతుఁ డౌ హరి, తనరుచున్నవాఁడు। దైత్యవీర!

చ. పరమమునీంద్ర! యిట్లతఁడు। పల్కె మురాసురుఁ డాలకించి భీ
కరుఁడయి పల్కె నోకమన! । కంజదళాక్షునిఁ గూర్చి యిప్పుడే
నరిగెదఁ గాని ధార్మికుల।నార్తులఁ జేయకుమన్న శౌరి యా
కరణి నొనర్తు నే ననినఁ। గర్బురనాథుఁడు పల్కెఁ గ్రన్ననన్. 360

సీ. శ్రాద్ధదేవా! నీవు। సతతజయార్థమై యిటుచేయ నగునట్టు। లిపు డొనర్పు
మని యిట్లు భాషించి। యామురదానవుఁ డహిరాజశాయియు। నచ్యుతుండు
చారుచతుర్మూర్తి। సహితుఁడౌ విష్ణుఁడు భాసిల్లుచుండిన।పాలకడలి
చెంతకుఁ జని నని। చెప్పినారదుఁ డనెఁ బుండరీకాక్షుఁ। డఖిలలోక

ఆ. గతుఁడు నవ్యయుండు। ఘనుఁ డేకరూపుండు
నగు నటంచు నార్య।లాడి రెట్లు
నాల్గురూపములను। నలి నొప్పె హరిదానిఁ
బలుకు మన నతండు। పలుకఁదొడఁగె! 361

## విష్ణుచతుర్మూర్తులలక్షణము.

క. పరమాత్ముఁ డేకరూపుఁడు, వరదుం డవ్యక్తుఁ డఖిలవాసుఁడు నగుశ్రీ
ధరుఁడు చతుర్మూర్తులతోఁ, బరఁగినచందంబు వినుము పరమశ్రద్ధన్. 352

వ. కలహాశనా!, మున్ను బ్రహ్మాదులచేఁ దర్కింపరానిదియు, ననిర్దేశ్యమైనదియు, శుభ్రమైనదియు, శాంతమైనదియు, నవ్యక్తమయినదియు, ద్వాదశపత్రసహితమును, వాసుదేవాఖ్యమును నగుపరమపదంబు కథితం బయ్యె నన విని నారదుండు మునీంద్రా! ఆపరమపద మెట్లు? శుక్లము, శాంతము, సంతతాప్రతర్క్యము నిందారహితము నగునది యయ్యె దానికి ద్వాదశపత్రము లెవ్వియో! కరుణించి భాషింపు మన నతఁ డిట్లనె; నారదా! బ్రహ్మప్రోక్తమగుచు, మిగుల రహస్యమై భాసిల్లి సనత్కుమారునిచే వినఁబడినమద్వాక్యము నాలింపు మనఁ బరమేష్ఠిసుతుఁ డాపులస్త్యునిఁ జూచి మునీశా! సనత్కుమారుఁ డెవఁ డెట్లదివ్యయముఁగ బ్రహ్మోక్తమయ్యె సనత్కుమారుఁ డెట్లు బోధించె దానిఁ గ్రమక్రమంబుగ నాకు వివరించి భాషింపు మని పలుకునారదునితోఁ బులస్త్యుఁడు చెప్పఁదొడఁగె. 353

సీ. అనఘ! యహింసాఖ్య నలరారుభామిని ధర్మునిపత్నియయ్యె దాని కలిమిఁ
బుత్రులు నలువురు పుట్టిరి యోగశాస్త్రవిచారకులు మహాసత్యశీల
మహితులందు సనత్కుమారుఁ డగ్రజుఁడు నా నలిద్వితీయుండు సనాతనుండు
సనవిఁ దృతీయుండు సనకనాముఁడు సనందనుఁడు చతుర్థుఁడై తనరుఁ బుణ్య

ఆ. మాన్యుఁ డౌ సనత్కుమారుఁ డో కానొక, తతిఁ దపోధనుండు తత్త్వవిదుఁడు
సాంఖ్యయోగరతుఁడు సర్వజ్ఞుఁడును నగు, కపిలనామమౌనిఁ గాంచె నంత.

ఆ. పిన్నఁదనముతోడ వెలయుచున్న సనత్కు, మారుఁ జూచి కపిలమౌనివర్యుఁ
డాసనంబు నిచ్చె నతనికిఁ దావృద్ధుఁ, డగుచు నుండి యంత నతఁడు భక్తి.

క. మౌనియు గుమారుఁడు నిశ్చలమానసుఁడును సాంఖ్యయోగమహితుఁడు సర్వం
ధానుఁ డగుకపిలమునితో, మానితవచనములఁ గొన్ని మాటాడి తమిన్. 356

క. వనజాసనుసన్నిధికిని, జని యోగజ్ఞానసరణిఁ జక్కఁగఁ జెపుమా
యన నలువ ధర్మపుత్రునిఁ, గనుఁగొని భాషించె నిట్లు ఘనభక్తమెయిన్.

ఆ. ఓసనత్కుమార! యోగి సాంఖ్యమును నీకు
నాడఁగలను సుతుఁడ వైనయెడల
నస్మదుక్తసరణి నాలించి యాచరిఁ
చేసి యోగివగుచుఁ జెలఁగఁగలవు. 358

క. అన నతఁ డన దేవా! నేఁ, దనయుఁడ నీకాదు నట్లు తగు వగుశిష్యుం
డను నాడును శిష్యునకుం, దనయున కంతరము లేదు తర్కింపఁ దిలన్. 359

క. అన నతఁ డన నోధర్మజ!, విను పలికెడిధర్మకర్మవిస్తృతయోగం

బునఁ బుత్త్రునకును శిష్యున, కును భేదము కలదు దానిఁ । గోరి తెలుపుదుగా.

సీ. మునిగణాధీశ్వర! । పున్నామనరకంబువలనఁ బాలించెడి । వాఁడు పుత్త్రుఁ
డనియును ; శేషపం । కాపహారం బగు శిష్యుఁ డని వైదిక శ్రుతి । ఘనత జెప్పు
నన విని ధర్మజుఁ । డనె భూసురశ్రేష్ఠ! పున్నామమునుం బగు । పుత్త్రుఁ డెట్లుఁ
దద్దానిరక్షించు । నెట్లు శేషాఘంబు సొరిది హరించు శి । ష్యుండు దానిఁ

ఆ. బలుకు మన్న నతఁడు । భాషించె నీ పురా
ణమ్ము పుణ్య మగుచు । నలి సుయోగ
విలసదంగసరణి । వెలయుఁ బల్కెద విను
మఘము లణఁగు నీకు । నందువలన. 371

బ్రహ్మ సనత్కుమారునకుఁ బుత్త్రశిష్యవిశేషంబుఁ జెప్పుట.

ఆ. మునికులేంద్ర! సర్వ । భూతపారుష్యంబు, పానసేవనంబు । భాసమాన
పరకళత్త్రరతియుఁ । బ్రథమదుర్గతి యని, విబుధమతము కలదు । విశ్వమందు.

క. ఫలవృక్షచ్ఛేదనమును, ఫలహీనాటనము సర్వ । ఫలచౌర్యత్వం
బిల రెండవనరకం బని, పలుకం బడుచుండు నిజము । పరమమునీంద్రా! 373

ఆ. విడువఁదగినవస్తు । విరతి గ్రహించుటఁ, జంపరాని దుష్ట । జనునిఁ గట్టి
చంపుటయును బంధు । జనయుత వైవాహి, కము తృతీయనార । కంబు నగును.

సీ. భవభూతినాశంబు । బహుభూతభయదంబు నిజధర్మవిచ్యుతి । నెఱి చతుర్థ
నారక మగుచుండు । నలిమిత్త్రవంచనాసరణియు మిథ్యాభి । శంసనంబు
పంచమసంఖ్యతో । వఱలి విచిత్రకాంశ నాఖ్యవృయాతనం । బై చెలంగు
నఫలాదిహరణంబు । యమనంబు యానస్వ యప్రహరణకార్య । మాలవదియు

ఆ. నైన నరక మొప్పు । నవనీశ! భాగవ, తంబు రాజపత్ని । రతియు రాజ
పటలమునకుఁగాని । పనిసేఁత సప్తమ, నిరయ మనిరి బుధులు । నిజముగాను.

క. మునినాయక! లోలత్వము, ధనలుబ్ధత్వంబు లబ్ధ । ధర్మార్థవినా
శన మగునష్టమనరకము, ఘనలాలాకీర్ణ నామ । కంబయి ధాత్రిన్. 375

తే. బ్రహ్మహరణంబు ద్విజనింద । బ్రాహ్మణోక్తి
నిరసనము బంధువైరంబు । నిజము నవమ
నిరయ మని సత్యశీలత । నెగడు బుధులు
పల్కుచుందురు నిత్యము । వసుధయందు. 377

క. సారాచారవినాశము, సారజనద్వేషసరణి । శాస్త్రస్తేయం
బీరసము ధర్మచౌర్యం, బారయ ధర దశమనరక । మండ్రు మునీంద్రుల్. 378

క. ఘనషాడ్గుణ్యనిషేధక,మును నిత్యమదంగనాశ । మును మున్ను మహా
జను లేకాదశనరకం, బని భాషింతురు సతం బ । హార్యచరిత్రా! 379

క. వరసంస్కారవిహీనతఁ, జోరి । చౌర్యము సత్క్రియాత్యాగబుద్ధి యనాచా
రరతియు సజ్జననిందయు, ధరఁ బండ్రెండవది యండ్రు । తాపసవర్యుల్. 380

ఆ. అర్థధర్మకామ । హానియు నపవర్గభంగ మఖిలధీర । బహుళదుఃఖ
దము త్రయోదశాఖ్య । దారుణనారక, మనిరి పూర్వమందు । నార్యులెల్ల. 381

తే. ధర్మహీనంబు క్షపణంబు । దహనకంబు, గర్హితము వర్జనీయంబు । గనఁ జతుర్ద
శాఖ్యమైనట్టి నారక । మనిరి తొల్లి, సత్యపరులైన పెద్దలు । సంయమీశ!

సీ. అశుభంబు నైనట్టి । యాశౌచ మజ్ఞాన మసదుక్తియును నసూ । యత్వ మరయ
నెంతఁ బంచదశనామ । నిరయమౌ నాలస్య మధికరోషత్వంబు । నాలయాగ్ని
దాపన మఖిలాత్మ । తాయిత్వ మగుఁ బదియారవనరకమౌ । నవనివీడఁ
బరకళత్రేచ్ఛయు । బహుగర్హితోత్థత్వము శాస్త్రనిందయుఁ । దలఁప నరక

ఆ. దంబు గాన నిట్టి । దారుణపున్నామ
నరకవితతివలన । నరుఁడు వెలసి
విప్రవేంద్రుఁ డైన । విష్ణుఁ బూజించియు
నతఁడు భద్రదృష్టి । నలరి పిదప 383

క. దారుణపున్నామమహా,నారకము నశింపఁ జేయు । నది నిత్యం బా
కారణమునఁ బుత్రుం డని,ధీరులు భాషింత్రు మిగుల । దివ్యమునీంద్రా! 384

క. ఇఁక వీఁడట మిగిలినపా, తకములలక్షణముఁ జెప్పె । దను దేవపితృ
ప్రకరమునిసోదరులకుఁ, బ్రకటితముగ నియ్య నగును । బహుసంతుష్టిన్. 385

వ. సనత్కుమారా!, పరధనకాంక్షయు, సర్వవస్త్వైకతయుఁ, బరమోంకారనిర్వ్య లియు, గురువాదంబును, నిరతమగమ్యాగమనము, ఘృతాదిపదార్థవిక్రయము, ఘోరచండాలాదిపరిగ్రహము, స్వదోషాచ్ఛాదనము, పరదోషప్రకాశనము, మత్సరిత్వము, వాగ్దుష్టత్వము, నిష్ఠురత్వము, టోకిత్వము, తాలవాదిత్వము, ధర్మరహితనామభాషితము, దారుణత్వాధర్మత్వము లనునివి బహునరకము లని చెప్పంబడ నిట్టి నరకములతోఁ గూడినవాఁ డయ్యు నెవ్వఁడు శంకరుని సంతుష్టునిఁ జేయఁగలఁడో యట్టిపుత్రుఁడు జ్ఞానాధికుఁడై తత్కృతదోషములఁబాయించును పిమ్మటఁ గాయిక, వాచిక, మానసిక, భ్రాతృబాంధవకృతపాపంబు లాజన్మకృతకలుషంబు లెల్ల నతనికి నశించు నట్టిఁడు సుతశిష్యులందు సధర్ముఁడై చెలఁగు. అట్లు గానివాఁడు విపరీతపదక్రముండగు దానివలనఁ బుత్రశిష్యులు విద్వాంసునిచే నిర్దేశ్యులగుదురు ధర్మరాజా! యీయర్థమందు శిష్యునికంటె సుతుఁ డధికుఁడై యుండు నని తలంపుము. శిష్యుఁడు శేషపాపహారియగు. సుతుఁ డన్నినరకముల నంతట హరింపఁజేయు నని పల్కిన నలువపలుకుల నాలించి సాధ్యుఁడును దపోధనుఁ డగుసనత్కుమారుఁ డిట్లనియె, 386

ఆ. మాట సత్యముగను । బుత్త్రుడ నీ కేను
బలుకు మనఘ! నాకు । భద్రయోగ
సరణి ననుచుఁ బలుక । సరసిజాసనుఁ డంత
ధర్మసుతున కనియెఁ । దాపసేంద్ర! 389
క. నీతలిదండ్రులు యోగులు, నై తేనరిన నీవు దాయ । పై యుండినచో
ఖ్యాతిఁగ వా రాయోగముఁ, జేతోముద మొప్ప నీకుఁ । జెప్పెద రనఘా. 390
క. అన విని సనత్కుమారుం, డని నీచే నెవరు జ్ఞాతు । లనఁబడుదురొ వా
రిని నాకుఁ జెప్పు నచ్చుఁడ, వని సాధ్యశ్రేష్ఠుఁ డడుగ । నాలించితమిన్ 391
క. భగవంతుఁడు పరమేష్ఠియు, నగణితతేజోభిరాముఁ । డగుపద్మజాని
సుగుణిఁ గని వత్స! విను మని, సుగమోక్తి వచింప సాగె । సుస్థిరచిత్తా! 392
సీ. ఒగి నౌరసుఁడు క్షేత్ర । జాపవిద్ధులు గూఢసంభూతకృత్రిమ । జాతదత్తు
లనఁబడు నీయార్వ । రరయ బంధుగులును దాయలు నగుదురా । తనయులందు
నెలమిఁ బిండక్రియా । ఋణగోత్రసామాన్యస్వామ్యప్రవృత్తులు స్థిర । మా ప్రతిష్ఠ
తనరఁ దుల్యత స్వయం । దత్తసహోఢులు పౌనర్భవక్రీత । పారశవులు
తే. కన్యకాసంభవుం డని । కడలు నిట్టి, తనయు లార్గురు వారికిఁ । దలఁపఁ బిండ
తతఋణాదికకథ లేదు । ధాత్రిగోత్ర, సమ్మతావ్యయధారక । సరణి కలదు.
క. అనవుడు ధర్మజుఁ డంతట, వనజాసనుఁ డాడినట్టి । వాక్యము విని బ్ర
హ్మనుఁ గాంచి యావిశేషం, బును బల్కుము కరుణతోడఁ । బుణ్యనిధానా!

—● బ్రహ్మ సనత్కుమారునకు ద్వాదశపుత్త్రుల దద్భేదమును దెల్పుట. ●—

క. అనిసనకాగ్రజుఁ డాడిన, విని పద్మజుఁ డనియెఁ బుత్త్ర । విను మాభేదం
బును నేఁ బల్కెద నౌరసుఁ, డనువాఁ డాత్మజుఁడు నగుచు । నలరుఁ జాత్మా.
తే. మగతనము లేక చింతను । మలసి వెత్తి
వాఁడు నై యున్న పెనిమిటి । వలన నాజ్ఞఁ
గాని యనాతురరై భార్య । కామరుఁ గనిన
నరుఁడు క్షేత్రజుఁ డగునందు । రార్యులెల్ల. 396
క. జననీజనకు లొసంగిన, తనయుఁడు దత్తాఖ్య నలరు । ధారణిపై మి
త్త్రునిపుత్త్రుని స్నిగ్ధుండి, చ్చినసూనునిఁ గుటిలుగాను । జెప్పిరి పెద్దల్ 397
ఆ. ఇంటియందు నెవ్వ । రెఱుఁగకయే పుట్టి
నట్టి సుతుఁడు గూఢుఁ । డగును స్వేచ్ఛఁ
దెచ్చినట్టివాఁడు । లివిరి విద్ధుం డని
పల్కుచుంద్రు బుధులు । వసుధయందు. 398
క. మునివర! కన్నకుఁ బుట్టిన, తనయుఁడు కానీనుఁ డగును । దలఁప సగర్భో
ధుని భాత్రి సహోఢజుఁగా, ననఘుము భావింతు రార్య । లఘులగుణాఢ్యా!

వ. పుత్రా! వెలఁ గొన్నవాఁడు క్రీతుఁడగు. ద్వివిధుఁడు పునర్భవుండగు. తొలుత నొకని కిచ్చి మఱల నింకొకని కిచ్చినకన్న కుదయించినపుత్త్రుఁడు పౌనర్భవుం డనఁబడు. దుర్భిక్షవ్యసనములయందు నరునిచే సమర్పింపఁబడినసూనుఁడు స్వయందత్తుఁ డనఁబడు; మూఢామూఢ యగుశూద్రస్త్రీయందు బ్రాహ్మణునకుఁ బుట్టినవాఁడు పారశవుఁ డగుచుండు ఇట్టి కారణమువలన స్వయముగ నిన్ను నీ విచ్చుటకొఱ కర్హుఁడవు కావు. చెప్పెద నీతలిదండ్రులఁ బిలువు మన విని సనత్కుమారుఁడు తద్వచనప్రకారము నిజజననీజనకులఁ దలంచిన నారంపతులు లీశానుఁ డగుచతురాననుఁ దర్శింప నెంచి చనుదెంచి యతనికి నమస్కరించి వినుతించి యి ట్లనిరి. 400

సీ. అబ్జాసనా! మాకు । నానతి నిడనగు నగుచు నిచ్చోట సుఖాసనముల
వా రుపవిష్టులై । భాసిల్లఁగా సుతుఁ డాసనాగ్రజుఁ । డాత్మజనకుఁ
గని పల్కె నోతండ్రి! । పరమర్థి నేయోగవాంఛతో నొప్పారి । బ్రహ్మ నడుగ
నాసురాధీశ్వరుః । డాత్మజునకుఁ దప్పఁ నన్యున కెన్నటి । కైనయోగ
ఆ. భవ్యపరణిఁ జెప్పఁ । బాడికాదని పల్కె, దాన నీవు దాని । దయ నొసంగఁ
దగుదు వనిన వాఁడు । తనయునితోఁగూడి, భక్తియుక్తులగుచు । బ్రహ్మ కనిరి.
క. సురనాథ! యువఁడు సుతుఁడై, పరఁగెనొ మా కిట్టి సుతుఁడు । భవదాత్మజుఁడై
పొరిఁబొరి నీకవిరాఁడ నని వా, రరిగిరి నిజపురికి మరల । నబ్జజుఁ డంతన్. 402
క. వినయాన్వితుఁడై సుతుఁడై, ఘనుఁడైనసనత్కుమారుఁ । గనుఁగొని కృపతో
డను ద్వాదశపత్త్రకమై, తనరినయోగంబుఁ జెప్పె । దానిని వినుమా. 403

నలువ సనత్కుమారునకు హరిచతుర్మూర్తివిధిఁ దెలుపుట.

క. అగణితతత్త్వయోగమునకు, సిగఁ బ్రణవము వెలయుచుండు । శిరసున మేషం
బిగురొత్తు రాధమాసము, సొగసగు తొలిపత్త్ర మగుచు । శోభిలుచుండున్.
తే. వదనమందు నకారంబు । వఱలు దాని
యందు వృషభాఖ్యరాశి చెన్నారు దానిఁ
గూడి జ్యేష్ఠంబు నిత్యముఁ । గొమరు మిగులు
నెలమి రెండవపత్త్రమై । యిద్ధచరిత! 405
క. కరయుగమున మోకారం, బరలిని రాణించు మిథునమందు వెలుంగన్
నిరతము మూఁడవదళమై, సరవిని శుచి మాస మలరు । సజ్జనతిలకా! 406
ఆ. నేత్రయుగ్మమందు । నెగడు భకారంబు, దాని నాశ్రయించి । తమినిఁ గటక
రాశి యలరు నందు । శ్రావణంబు చతుర్థ, పత్త్ర మగును మాని । వంశదీప! 407
క. హృదయమునందుఁ గకారము, పొదలును హరిరాశి దానిఁ । బొంది సుకాంతిన్
బదిలపుఁ బంచమదళమై, విదితంబుగ భాద్రపదము । వెలయును దీప్తిన్. 408

సీ. వనజాగ్రజా! కవకచంబు వకారమై యలి దానిఁ గూడి కన్యయుఁ జెలంగు
నాఱవపత్త్రమై । యాశ్వీజ మలరారు దేకారమూర్త్యై । తేజరిల్లు
నట తులారాశి పెంపారుఁ గార్తికమాస మేడవదళము నై । యొసఁగు నాభి
నలరును వాకారమందు వృశ్చిక రాశి చెలఁగు నచ్చట మార్గశీర్షమాస

ఆ. మరయ నష్టమదళమగు సుకారము జఘనంబు నగును దానినడుమఁ గాంచి
గార్ముకాఖ్యరాశి । ఫ్రాలు నవమదళ, మగుచుఁ బౌష్యమాస । మలరుచుండు.

క. జానుద్వయగత మగుచున్, బూనితదేకార మలరు । మకరము దీప్తిన్
దానిం గలియును మాఘము, పూనగుదశమదళ మగును । భూనిలలామా!

క. వాకారము జంఘద్వయ, మై కదఁగును గుంభ మదరు । నట సొంపారన్
శ్రీకరఫాల్గుణమాసం, బేకాదశపత్త్ర మగుచు । నెసఁగుచు నుండున్. 411

క. లలిత యకారము చరణం, బుల నుండును దానిఁ బొంది । పొందుగ మీనం
బలరును జైత్రము ద్వాదశ, దళమై రాణించు మిగులఁ । దాపసనాథా! 412

వ. మునీంద్రా! కేశవున కిద్ది ద్వాదశపత్త్రకం బనియు, ద్వాదశాకారమనియుఁ, త్రివ్యూహమనియు, నేకమూర్తియగుపరమేశ్వరుఁడనియుఁ జెప్పంబడును అది నిత్యమై మృతిలేనిదై రాణించు; రెండవమూర్తి సత్త్వాద్యమై చతుర్వర్ణముల నలరి చతుర్ముఖచతుర్బాహుయుత మగుచు నవ్యయుత నొప్పి శ్రీవత్సాంకితో దారాంగమున భాసిల్లుచుండును; మూఁడవరూపము తామసాఖ్యతోడను, శేషమూర్తితోడను, సహస్రశీర్షులతోడను వెలసి సంపద్యుక్తమై సహస్రశీర్షముల నలరి ప్రజాప్రళయకరమై భాసిల్లును; నాల్గవమూర్తి రాజసనామంబునఁ జతుర్ముఖంబుల శోభిల్లుచు మాలాలంకృతంబు నగుసృష్టికృత్త్యాదిపురుషుఁడై యుండును; ఇట్లు వ్యక్తబ్రహ్మమువలన నీమూఁడుమూర్తులు వ్యక్తంబులయ్యె. దాన ననేకవిధంబుల మరీచిప్రముఖులు మతికొంద ఱుద్భవించిరి. పుత్త్రా! పురాతనమునై పటుపుష్టివర్ధక మగునట్టి యీవిష్ణుస్వరూపము నీకుఁ దెలియం జెప్పితి. సూక్ష్మదృష్టివలన దీనిఁ దెలిసికొని కృతార్థుండ వగుమని చెప్పి వెండియు ని ట్లనియె. 413

మ. మురదైత్యుండు కృతాంతువాక్యమును సమ్మోదంబుతో నంతటన్
సురనాథుండు చతుర్భుజుండు నగుచున్ । శోభిల్లుచున్నట్టి శ్రీ
ధరునిన్ గానఁగ నేగ నాతఁడు మహాదర్పంబుతో వచ్చు నా
సురవైరిన్ గని చోద్యమంది పలికెన్ । సొంపొప్ప మౌనీశ్వరా! 414

క. దనుజా! యేకారణమున, జనుదెంచితి వన్న వాఁడు । శౌరినిఁ గని యి
ట్లను; నీతోడను బోరన్, జనుదెంచినవాఁడ నేను । జగములు మెచ్చన్. 415

క. వరతాపస! వాఁ డిట్లన, హరి యను నసుఁ గల్వ దనుజ! । యరుదెంచితి వీ
తరుణమునఁ జిత్త కేలా, త్వరితమునకు త్వరిత సారె । జతయును జొచ్చెన్.

ఆ. అందువలన భీతి । నడరిన సీతోడ, ననినొనర్ప ననుచు । నచ్యుతుండు
పలుక నెవని కెట్లు । పదరె నెక్కడ మనం, బనుచు నాతఁ డద్భు । తాత్మకరము.

ఉ. బ్రొమ్మునఁ బెట్టి విస్మృతిని । బొప్పుచు నేడ్చి విపన్నబుద్ధితో
నిమ్మహిఁ గూలఁ బాచి కమ । లేక్షణుఁ డాయుధ ఘోరమైనచ
క్రమ్మును వైచె; నంత నది । గ్రక్కున వానిహృదబ్జముగా మృదు
త్వ మ్మగులాఘువస్థితినిఁ । దద్ద హరించెను వింత తోఁపఁగన్. 418

క. అంతట దేవత లపగత, చింతగ దనరారి మిగుల । శ్రీసతిపతియా
దంతీంద్రవరదుఁ బొగడిరి, సంతోషస్వాంతు లగుచుఁ । జంచద్భక్తిన్. 419

ఆ. చక్రపాణియుక్తి । చాతుర్యకృతము నై, కడిమి మురవినాశ । కరము నగుచు
వెలయు నిట్టిగాథ । వివరించి తెలిపితి, భక్తితోడ నీకుఁ । బరమపావని! 420

క. వనమాలికి నాకారణ, మున మురహరనామ మలరె । బుధు లగ్గింపఁగ
ఘనుఁడు నృసింహుఁడు సంతత, జనపతియా చక్రధరుఁడు । సజ్జనతిలకా! 421

వ. ఇట్లు పులస్త్యుఁడు దేవీమహాత్మ్యములం జెప్పిన నారదుండు తరువాతివృత్తాంతంబు నుడువు మనుటయు. 422

ఉ. రామ! నృపాభిరామ! ముని । రాజసుకామ! విశేషసద్గుణో
ద్దామ! సమస్తఘోరతర । దానవభీమ! విరతితామర
స్తోమ! విశాలవిక్రమ! వి । శుద్ధయశశ్శరదిందుచంద్రికా
ధామ! సదార్యభోగగణ । ధామ! జగన్నుతనామ! రాఘవా! 423

క. కరుణాసాగర! శుభకర!, గరుడోరగసిద్ధసాధ్య । గంధర్వముఖా
మరవినుతభవ్యమందిర!, పరమేశ్వర! భూరిఘోర । పాపవిదూరా! 424

ఉత్సాహము భానుకులవిశాలసింధు । భవ్యశీతభాస్కరా!
దీనజనగణార్తిహార । దీపితాంగబంధురా!
మాననీయకనకరత్న । మంజుహార! శ్రీకరా!
దానవప్రగోత్రభిదుర । ధర్మరామభూవరా! 425

గద్య. ఇది శ్రీరామకరుణాసమాసాదిత కవితాప్రాభవ హారితసకులాన్వయప్రభవ రామవజ్జలవంశదుగ్ధసాగరసుధాకర కొండయకుమారబుధజనవిధేయ కొండయ నామధేయప్రణీతమగు తెలుఁగు వామనమహాపురాణమందు సప్తమస్కంధము.

శ్రీరామార్పణమస్తు.



శ్రీ ర స్తు.

శ్రీసీతాలక్ష్మణభరతశత్రుఘ్న హనుమత్సమేత శ్రీరామచంద్రాయ నమః.

# తెలుఁగు వామనపురాణము.

## అష్టమస్కంధము.



రమ్యసుగుణనికరా!
కారుణ్యాకర! బుధేంద్ర | గణనుతసారా!
సారాచారవిచారా
ధీర! లసద్దివ్యధామ! | దశరథరామా! 1

తే. అవధరింపు పులస్త్యుఁ డబ్జాసనాత్మ, జుండు నైనట్టి నారదుఁ | జూచి పలికెఁ
బిదప నమరులు వైకుంఠ | విమలపురికిఁ, జని రమేశునిఁ గని మ్రొక్కి | చాలభీతి

దేవతలు జగద్భర్తనిఁ జెప్పఁ దత్కృపాబ్ధి వారికి హరి చెప్పుట

సీ. కడిమి సురలించి లో | కక్షోభహేతువు నాఁడ శ్రీహరి దాని | నాలకించి
పురహరుమందిరం | బునకు నేగెద మాతోఁ దరయ మహాజ్ఞాని | యగుచు లోక
కష్టంబుఁ దెలిసిన | ఘనుఁ డనిపల్కిన నట్టులే గని నిర్జ | రాధిపతులు
వాసుదేవునిఁగూడి | వజ్రపురోగములై యంత సుందర | మైనమంద

ఆ. రాద్రి కప్పు డేగి | యట శివపార్వతి, వృషభములను నందివిభుని శూన్య
మైనమందరాద్రి | నజ్ఞానగాఢాంధ, కారయుతులు నగుచుఁ | గాన రైరి. 3

ఉ. అంతట దేవదేవుఁడు మ | హాభుఁడు నా హరి మందదృష్టితో
వంతనుఁ గుందు వేల్పులను | వారిఁ గాంచి త్వదగ్రసంస్థుఁ డౌ
కంతు విరోధిఁ గాన కిటు | రాలేదరా యన వార లట్టులే
చింతిలుచున్నవార మని | చెప్పియుఁ గ్రమ్మఱఁ బల్కి రాయెడన్. 4

ఆ. అబ్జనేత్ర! దృష్టి | హాలమయ్యె మా కివు, దేమికారణంబొ | యిట్టుగనైతి
మనిన లోకమూర్తి | యగు హరి వారిని, జూచి పల్కసాగె | సుభగచరిత!

చ. అరయఁగ మీరు స్వార్థపరు | లై గిరిజోన్నతగర్భహంత లై
పురహరసాధరాధలనుఁ | బొల్పెసలారిరి రండుచేత శం
కరుఁడు హరించె మీకుఁ గల | జ్ఞానము నాతని మీరు ముందటఁ
గర మెుగిఁ జూచుచుండియునుఁ | గన్గొన రైతిరి నేఁడు పూనికన్. 6

సీ. అమరేశులార! మీ * రందఱుఁ దనుశుద్ధిఁ గాంచుటకు నీశునిఁ జూచు * కొఱకు నూఁద
రంబునఁ దప్తకృచ్ఛ్రంబుతోడ విశుద్ధులై స్నాన ముంచ నా * నతిపురాణుఁ
గౌరిని క్షీరస్నాన * మునకు నైసాగ్రకుంభశతంబు చేర్ప నా * భక్తి నడుమ
నర్హ్యదధిస్నాన * మందు హవిఃకుంభములను దొంబదియాఱు * మొనయఁజేయ
ఆ. వలయుఁ బంచగవ్య * పరిపూర్ణషోడశ, కుంభములను శ్రద్ధఁ * గూర్పు టొప్పు
భూరిమధుసమేత * ములు నైనకుంభంబు, లష్టసంఖ్య నుంచ * నగును వినుఁడు.

వ. దేవతలార! జలకలశంబు లన్నిఁటికి ద్విగుణంబులై యుండవలయు. అష్టోత్తరశతంబుగ రోచనాగంధహరిద్రాచూర్ణములు శివుని కలఁది మందారాతిముక్త పారిజాతసారసపుష్పములు బిల్వదళంబులు భక్తి నర్పించి కర్పూరాగరుధూపములిడి పదక్రమంబులవలన ఋగ్వేదోక్త మగురుద్రసూక్తము జపింపనగు. ఇట్లాచరించినచో హరునిఁ గందురుగాని వేఱుఁగఁ జూడఁజాలరని యిట్లు శౌరి భాషింప విని దేవతలు క్రన్నన నతని కిట్లనిరి మధుసూదనా! ఎద్ది చీర్ణమైన యెడల గాయశుద్ధి గాఁగలదో యాకృచ్ఛ్రవిధానము మా కానతిమ్మని ప్రార్థింప మాధవుండు వినుఁ డని వాక్రుచ్చె. వేల్పులారా! మూఁడుదినము లుష్ణోదకము దినత్రయము వేఁడిపాలను మూఁడువారము లుష్ణాజ్యముఁ గ్రోలి వాతాశనులై వాసరత్రయ ముందు టొప్పును. ఆజలక్షీరాజ్యములు ద్వాదశాష్టషట్పలక్రమంబునఁ బ్రతిదినమును గ్రహింప నగునని వైకుంఠుఁడు నుడువఁగా
నంతట 8

క. పురుహూతపురోగములై, పరఁగెడు నిర్జరులు దేహ * పరిశుద్ధతకై
గురుతప్తకృచ్ఛ్రగుప్తిని, నిరుపమ మగుపూన్కితోడ * నెఱపిరి మౌనీ! 9

ఆ. అంత వ్రతము పూర్ణ * మైనవేల్పులు దేవ
గుఱుఁ డైనహరినిఁ * గాంచి విష్ట
పేంద్ర! పార్వతీశుఁ * డట మెలంగుచు నున్న
వాఁడొ కరుణతోడఁ * బలుకు మిపుడు. 10

క. క్షీరాబ్ధ్యాదుల విశ్వా, ధారుని నభిషిక్తుఁ జేయఁ * గడఁగితి మనుచున్
సారకు వేఁడినఁ గరుణా, ధారుండయి చక్రధరుఁడు * దయ తళుకొత్తన్.

మ. అని నాదేహమునందు శంకరుఁడు యో * గారూఢుఁడై దీప్తితోఁ
గొనరారఁగా గన నైతి రేమొ యన నో * భూతేశ! మాయంతటా
ఘనుఁ డౌ శంభునిఁ జూడఁ జాల మెట నా * కామారి భాసిల్లు మా
కును బోధింపు మటంచు నిర్జరవరు * ల్గూర్మి న్వచింపఁగా దయన్. 12

హరి దేవతలకు దనహృదయమున శివునిఁ జూపుట.

ఆ. నాశరహితుఁ డైన * నారాయణుం డంత, నిజహృదబ్జసీమ * నెగడు కాంతిఁ
గొనరు భవుని లింగ * ముఁ దమిఁ జూపించె, సకలదేవతతి * కట్టెదుర. 13

సీ. అంతట విబుధు లవ్యయుని శాశ్వతు నైనపార్వతీకాంతుని భవ్యలింగ
మును భావనాద్యములను గ్రమంబుగ నభిషేకించి శ్రద్ధతోఁ దెలుఁగ గంధ
బంధురచందనవారిజగోరోచనాబిల్వదళముల నైజభక్తి
నర్పించి పిమ్మట నగరుధూపం బిడి వివిధౌషధుల సమర్పించి దీక్షఁ
తే. బొనరుచును నష్టశతనామములఁ జపించి
మ్రొక్కి రని చెప్ప నారదముని పులస్త్యుఁ
జూచి పలికెను మునినాథ! సురలవలన
దివిరి హరిహరు లిట్లు చింతితులు నగుచు. 14
తే. శిష్టసత్వతమస్సులచేతఁ గలిసి
నట్టి ధూర్జటిమాధవు లరయ నెట్టు
కలితయోగంబుఁ జెందిరో కరుణఁ బల్కు
మనఁ బులస్త్యుండు బ్రహ్మజు నాడఁదొడఁగె. 15
చ. మునివర! దేవచింతితము బుద్ధి నెఱింగి సమస్తభూతశో
భనగుణసంయుతుండుఁ బటుబాణధరుండు విశేషతేజుఁ డా
మనసిజతాత యత్తతిని మాన్యులు చూచుచు నుండ విశ్వరూ
పునుఁ దగఁ దాల్చెఁ జెప్పెదను పొందుగ నీ విపు డాలకింపుమా. 16
వ. సార్ద్రద్వయనయనమండితంబై బంగారుకుండలమ్ములతోడను, జటాగుడాకేశ గరుడధ్వజంబులతో వెలసి మాధవయుతమై, హారసర్పభూషణంబుల రాజిల్లి, గౌరాదినాచ్ఛాదితకటిస్థలమున నొప్పి సుదర్శనాసిహాలశార్ఙ్గరాజితంబయి, పినాక శూలాజగవంబులఁ దేజరిల్లి, కపర్దఖట్వాంగకపాలశంఖారావసహిత మగునా హరిహరమయస్వరూపంబుఁ జూచి దేవత లచ్చెరువంది యవ్యయా! సర్వ గతా, నీకు నమస్కార మని పలికి మ్రొక్కి తదేకాగ్రమనస్కులైరి; మాధవుఁ డట్టిదేవతలఁ గైకొని వేగమున స్వాశ్రమం బగుకురుక్షేత్రమునుఁ జేర్చెనంత.
ఆ. పుష్కరమున స్థాణుభూతుఁడౌ భవుని దే
వతలు గాంచి పొంగి వందనములు
భర్గ! నీ కటంచుఁ బల్కుచు నుపవిష్టు
లయి చెలంగ శక్రుఁ డపుడు పలికె 18
క. సురలార! రండు మనకును, గరుణాభవుం డొసఁగు వరముఁ గనుఁగొనఁ గలఁతి
బరఁగెను లోకము లకటా!, హరుఁడు జలాంతరమునందు నలరుటవలనన్. 19
సీ. అని యిట్లు నిర్జరు లాడుచుండిన నిరంజనుఁ డవ్యయుండు వృషధ్వజుండు
సర్వాంతరస్థుఁడౌ శర్వుఁ డామాధుర్యవాక్యంబు నాలించి వడిఁ బైకిఁ
జనుదెంచి నవ్వుచు సర్వనిర్జరులకు వందనం బని యిట్లు పలికె శక్ర
సంయుక్తులైనట్టి సకలామరులఁ గూడి వినయంబుతోడను వెలసి ప్రణతుఁ

ఆ. దగుచు వచ్చె నంత । సకలామరులు పల్క
రభవ! యిట్టి ఘోర । మాత్రతంబు
విడు; భవత్తపోగ్ని । విష్టపత్రయమును
గలఁతఁబొందఁజేసెఁ । గడిమిఁ జూడ. 20

మ. ఇటు లా దేవత లాడుచుండ విని స।ర్వేశుండు నా శంభుఁ డా
దట వారిం గని నేను నీవ్రతము స।ర్వం బొప్పఁ జాలించితిం
బటుమోదంబున నేగుఁ డన్న విబుధు।ల్పల్మారుఁ గీర్తించి యం
తట స్వర్గంబునకుం జొచ్చి పోయిరి మహా।ధైర్యంబుతో నారదా! 21

హరుఁడు శుక్రునకు సంజీవినీవిద్య నిచ్చుట.

క. అంతట నద్రిద్వీపా, క్రాంతం బగుపుడమి యదరఁ । గని యేలకో బ
ల్పంతప్తయయ్యె ధర? యని, చింతార్ణవమందు మునిఁగి । శివుఁ డట్టితఱిన్. 22
క. కురుభూమినిఁ దిరుగాడుచుఁ, బరమాఘవతీసుతీర।భాగం బందుం
స్థిరఘోరతపోనిష్ఠం, బరఁగెడి భార్గవునిఁ జూచి । పలికె న్మానీ! 23
క. దనుజాచార్యా! జగముల, కును క్షోభకరంబు నైన । ఘోరతపంబుం
ఘనదీక్ష నేల చేసెద, వనితరమతి దానిఁ బలుకు । మన నతఁ డనియెన్ 24
సీ. అనఘ! భవారాధ । నాభిలాషార్థమై చేయఁ గాఁబడెను నా।చేత నిట్టి
గాఢతపఃక్రియ । కాన సంజీవిని యనువిద్యఁ దెలియుట । కలదెఁ గోర్కె
యని వేఁడ శంకరుఁ । డని నీవు చేసినతపముతోడను నేను । విపులతృప్తిఁ
జెలఁగితి నీవు సం।జీవినీవిద్యను గడఁగి యిప్పు డెఱుంగఁ । గలవు? నిక్క
ఆ. మనిన నట్టివరము । నటఁ జెంది కావ్యుండు, బహుతపంబు వదలి । స్వభవనంబుఁ
జేర మఱి ధరిత్రి । శిఖరి సాగరవృతి, గణములోడ మరలఁ । గదలసాగె. 25
ఆ. శంభుఁ డంతఁ గదలి । సప్తసారస్వత
శుద్ధభూమిఁ జేరి । సౌరిది నృత్య
మానుఁ డై చెలంగి । మంకణసంజ్ఞతోఁ
గ్రాలు మానివరునిఁ । గాంచి మఱియు 26
క. వరయోగభావరూఢిం, బరఁగినవాఁ డగుచు శాల।పత్రాంచితస
త్కరముల నిగుడ్చి నృత్యముఁ, గర మర్థి నొనర్చుచుండ । ఘను లెదమెచ్చన్

మంకణమునిచరితము.

క. ఘనగతి నావేగముతో, వనవిధి నగకలిత మైన। వసుమతి శీఘ్రం
బునఁ గదలఁ జూచి హరుఁ డా, తనిఁ గరమునఁ బట్టి నవ్వి । దయమీఱ ననెన్.
క. అనఘాత్మ! యేమికారణ, మున నెటు భావితుఁడ వగుచుఁ । బుడమిని నృత్యం
బొనరించెద విపు డేమద, మొనఁగూడునొ నీకు? దాని । నొగిఁ బల్కనగున్!

చ. అని యిటు శంకరుం డడుగ నాతఁడు పల్కె మహేశ! నాకుఁ బెం
పొనరిన తుష్టికారణము నాయ్యనఁ జెప్పెద నాలకింప నేఁ
డను పటుశోషణార్థమయి దారుణమైన తపంబుఁ జెక్కహా
యనములు దాఁకఁ జేసితిని యత్నముతో నటమీఁదఁ జూడఁగన్. 30

ఆ. తులజశాకరసము సొంపున నాచెయి, నుండి వెడలె దాన నోగిఁ బ్రమోద
కలితచిత్త మొప్ప గడువడి నృత్యంబు, సేయుచున్నవాఁడ శిష్టవిప్ర! 31

క. మునివర! మంకణుఁ డీవిధ, మునఁ జెప్పిన నాలకించి పురసూదనుఁ డి
ట్లనెఁ గరమున శుచిభస్మము, పొనరెను నాకొలఁకుఁ జూడు పుణ్యనిధానా!

క. మునిచంద్ర! నాకుఁ దాదన, మున హర్షము లేదు నిజము పొరి మత్తుఁడవై
తనరితి వన నతఁ డానుడి, విని యావృషకేతనునకు విస్తృతభక్తిన్. 33

ఆ. కరయుగంబు మోడ్చి గణుతించి నృత్యంబు
వదలి మిగుల వింత వఱలుచుండ
భవుని పాదములకుఁ బ్రణమిల్లి నతనితోఁ
బలికె నిట్లు శివుఁడు పరమదయను. 34

సీ. ద్విజ! దుర్గమంబునై దీపించు పరమేష్ఠి విష్టపంబున శివు వేడ్క నరుగు
మీపుణ్యతరతీర్థ మిలఁ బృథూదకసంజ్ఞఁ గ్రాలు మహాఫలకరము నగుచు
నాతీర్థసన్నిధి కరిగిన మాత్రమె గంధర్వకిన్నరగుహ్యకదితిజ
విద్యాధరానేకవిబుధులకెల్లప్పు డతిపాపహరము నై యఖిలధర్మ

ఆ. సన్నిధానమైన సప్తసారస్వత, ఫలము నది యొసంగుఁ బ్రత్యహంబు
వినుతమైనదాని విధముఁ జెప్పెద నీవు, భక్తి మిగుల వినుము భద్రమూర్తి!

వ. మునీంద్రా! సుప్రభా కాంచనాక్షి సువేణి విమలోదకా మహోదరా విశాలా ఘువతి సరస్వతి నామంబుల నొప్పు నీయేడుసారస్వతు లిందు నివసింపఁ గలవు. ఈనదు లతిపుణ్యదములై సోమపానఫలంబు నిచ్చుచున్నవి కురుక్షేత్రమందు నీఘనమూర్తిని స్థాపించి, దుర్లభమైనదియు బహుపుణ్యకరం బగు బ్రహ్మలోకమున కేగఁగలవని శివుఁ డాడిన విని మది హర్షించి మంకణుం డంతట

తే. అతులమైన కురుక్షేత్రమందు నాత్మ
మూర్తి స్థాపించి పరమేష్ఠి భువనమునకు
వశియునై దీప్తితో నేగ వసుధ యపుడు
విగతకంటకంబుతోడను వెలసె మిగుల. 37

చ. హరుఁ డొగి నిర్జనావసథమై శుచి నొప్పెడి మందరాద్రికిం
బరమముదంబుతోడఁ జని భద్రతపోరతినుండి శూన్యమై
పరఁగెడి శైలభాగమున భాసిలు గారినిఁ జూచు బుద్ధితో
సరవి నటించె నంత నని చక్కఁగఁ బల్కెలి ధాత్రినందనా! 38

క. అన నారదుఁ డను నామునిఁ, జనతిలకా! యంధకుండు చని పాతాళం
బున నేమిచేసె సుందర, మున నేని హరుం డొనర్చె ముదమునఁ జెపుమా! 39

ఆ. ఇట్లు నారదుండు పృథుభక్తి ననఁ బుల, స్త్యుండు పల్కె నంధకుండు నాఁగ
భువనమందు నుండి భూరికామాగ్నిచేఁ, దప్తకాయుఁ డగుచుఁ దల్లడిల్లె. 40

మ. దనుజాధీశులతోడ నిట్టు లని గోత్రస్వామికిం బుత్రికై
ఘనతం జెందిన గౌరి నాకడకు వేదక్కం దెచ్చువాఁ డుర్వి నా
జనకుండుం బరబాంధవుండును మహాచాతుర్యమిత్రుండు నా
నని కామాతురుఁడై వచింప విని ప్రహ్లాదుండు కోపంబునన్ 41

ప్రహ్లాదుఁ డంధకునకు హిత బోధించుట.

క. ఘనగంభీరధ్వనితోఁ, దనరెడువాక్యంబు నుడివె దైత్యేశ్వర! నీ
కును భవుఁడు జనకుఁ డద్రిజ, జననియు నగుచుండు రెపుడు సత్యముఁగాఁగన్.

క. విను మందునఁ గలకారణ, మును గురుధర్మాయనుండ పుత్రుండగు నీ
జనకుని చేతను మును హరుఁ, డనిశము పుత్రార్థముగను నర్చితుఁ డగుచున్.

క. ఘనతుష్టిఁ జెంది యంధక, దనుజుం డగుసుతు నొసంగి తనయేచ్ఛనుఁ జెం
పొనరారెడి నీజనకునిఁ, గని యిటు వాక్యంబుఁ జెప్పె ఘనుఁ డొగి మెచ్చన్.

తే. ఓహిరణ్యాక్ష! నాకు నింపొసఁగుతనయ
వలన నగుయోగసరణితోఁ బరఁగునట్టి
నేత్రములు మూఁడు హితములై నెగడ దాన
దివిరె నామీఁద దమసలి దృష్టి మెప్ప. 45

క. దానం గురునీలాభ్ర, స్వానం బగుభూత మొకటి సరవినిఁ గలిగెం
మానుగ నాయది యుష్మ, త్సూనునిఁ గైకొనుము నిజము చూపె కిరీశా! 46

సీ. దర్పించి వీఁ డెప్డు తతలోకవిధ్వస్తకార్యంబుఁ గావింపఁ గలఁడొ మూఁడు
జగములకును మహాజననియౌ పార్వతిఁ గాంక్షింపఁ గడఁగునో కడిమి నెప్డు
మఱియు నెవ్వఁడు విప్రు మడియింప నెంచునో కర మవ్వడితని కాయశోష
ణముఁ జేయఁగలవాఁడ సమధికశక్తితో నని యిట్లు శంకరుఁ డాడి నిజగృ
ఆ. హంబు నైన మందరాద్రికిఁ జనెను నీ, తండ్రి నిను గ్రహించి తాల్మితో ర
సాతలంబునకును జనె మది సంతోష, మావహిల్లుచుండ నసురరాజ! 47

క. విను మట్టిదైనకారణ, మున నీ కగుఁ దల్లి గిరిజ భువనంబుల కె
ల్ల నగుం దండ్రియుఁ బురసూ, దనుఁ డగుగంగాధరుండు తథ్యం బరయన్.

క. నీ వరయ శాస్త్రవేత్తవు, పావనసురశీలభూరిభాస్వద్గుణసం
భావితవిస్మయుఁడవు బుధ, భావుండవు నయి ధరిత్రిఁ బరఁగితి వసురా! 49

ఆ. సరవి నిట్టి పాపసంకల్పమున భవ, త్సదృశుఁ డైనజనుఁడు సమయుఁ గాని
మఱిని చెట్ట నగునె మారారి సర్వజ్ఞ, మస్కృతుండు చూచె మందచిత్త! 50

క. అతనికి నీదాక్షాయణి, సతి యగు నాశుభదర్శయైన / శైలాధిపుని
తృప్తిఁ బొందక శక్తుఁడవు గా, వతిదోషమువచ్చు నర్హ / మగునే తలఁపన్! 51
ఆ. సగరుపుత్రుఁ గెల్వఁ / జాలని యాకోర్కి, పొందరానిదగును / పురుషుఁ డవ్వఁ
డబ్ధిదాఁటి మేరు / హరులఁ గరంబుల, గుంజి త్రోసినేని / కువలయమున. 52
క. ఆవీరుఁ డోర్చు శంభుని, వావిరి నీపనినిఁ జేయ / బటుతులుఁ దైనన్
భావింప శక్తుఁ డగునే, కావరమున నిట్లు పల్కఁ / గడఁగితి వకటా! 53
క. పరమాత్ముఁడు పరమేశుఁడు, పురసూదనుఁ డమరమాని / పూజ్యుండు మహా
వరదుం డతఁడుఁ దగుశ్రీ, హరుఁ దెలియఁగ శక్యమా? నా / యాలోచింపన్. 54

దండనృపాలుచరితము.

సీ. కర్బురేశా! పర / కామినీకాముఁడు నలిమూర్ఖుఁ డైనదం / డావనీశుఁ
డఖిలరాజ్యముతోడ / నబలార్థమై ధర నీల్గినవిధమును / నీవు విన్న
వాఁడవు గా వట్టి / వార్తఁ జెప్పెదఁ బ్రాజ్యబలవాహనుండు నై / ప్రజ్వరిల్లు
దండాఖ్యభూపతి / ధరనుండు నతఁడు పురోహితత్వమునకై / రూఢభక్తి
ఆ. దైత్యగురునిఁ గోరి / తత్పాలకుండు నై, వివిధయజ్ఞములను / వేడ్కఁజేసె
గవికి నరజనామ / కలితయా నొకపుత్రి, వెలయుచుండె దీప్తి / విబుధు లెన్న 55
క. దనుజాచార్యుం డొకతఱి, ఘనుఁ డగువృషపర్వుఁ డనెడి / కర్బురనాథుం
గన నేగి తదర్చితుఁడై, పనిగొని చిరకాల మచట / భాసిల్లెఁ దమిన్. 56
క. అరజ నిజాలయమందుం, గరువలినచ్చోటికి సేవఁ / గావించుచు సు
స్థిరమతి నుండెను నాథా, వరుఁ డసురాచార్యుఁ గూర్చి / వచ్చి ముదమునన్.
క. గురుఁ డైనకావ్యుఁ డక్కడఁ, బరఁగుచు నున్నాఁ డనంగఁ / బరిచారికలా
డిరి యాజనమునకై యతఁ, డరిగెను దనుసుతునికడకు / నని వినయమునన్.
క. జనపతి యపు డాయువతులఁ, గని యువ్వతి కలదు నేఁడు / కావ్యాశ్రమమం
దనఁ బల్కిరి వా రోనృప!, ఘనకవిసుత యైనయరజ / కలదని ప్రీతిన్. 59
క. అన విని యపు డాయుత్స్వా, మునిపుత్రుం దట్టి శుభ్ర / కాంతుం గన నెం
చినవాఁడై చని నటకిం, తనరాని తలంపుతోడ / నసురాధీశా! 60
మ. కని వాఁ డాక్షణమందె మన్మథుని బాణాకాండంబులం దప్తుఁడై
ఘనకాలప్రబలోచితుండు నగుచుం / గావ్యప్రశిష్యాఘమున్
దినభృత్యాస్త్రములఘ్రాతల న్విడిచి యా / తన్వంగినిం జేర వే
చని నేఁటి యూ నయ్యో చెన్నొనుచు సం / జాతోంధదండుండు నై. 61
క. మునివరు! వచ్చెడి యానృపుఁ, గని కీర్తిం దనరుచున్న / కావ్యాత్మజ యా
జనపతి కెదురేఁగి ముదం, బునఁ దగఁ బూజించె ఘాత్రిభ్రు / ద్బుద్ధి న్మిగులన్. 62
వ. ఇట్లు పూజితుండై. 63

సీ. శ్రోణీశ్వరుం డంత శుక్రపుత్త్రినిఁ జూచి బాలరో! మనసిజబాణజాల
తప్తుఁడ నగుచును దయతోడ నిత్తతి నీదు పరిష్వంగనిత్యసుఖము
ననుఁగూర్చి సంతోషమును ఘటింపు మటంచు నాడిన నవనతి రైనయరజ
మూఢాత్ముఁడైనట్టి భూపతితో ననెఁ బాపిష్ఠ నాతండ్రి బహుళకోపి
ఆ. యగును దేవవరుల నైన దహించును
సోదరుఁడవు నాకుఁ జూవె నీకుఁ
జెలియ లగుదు నేను శిష్యుండ వగు దీవు
కరము నాదు తండ్రి కరయ నిజము. 64

ఆ స్వయముగాను నీవు చనుదెంచి నాచేత, నర్పితుండ వగుచు వలరువిల్తు
కఱకుటమ్ములకును గాసిల్లి వెఱ్ఱివై, కడఁగి యిట్టులాడఁ గర్జ మగునె? 65

శా. హా! నాసన్నిధివీడి నీ వనుచు నాపూఁబోఁడి యిట్లన్న నా
భూనాథుం డని సూక్ష్మమధ్య వగుచున్ బొల్పొందు నారీమణీ
సూనాస్త్రాగ్ని దహించుచున్నది ననున్ శుక్రుం డొగిం గోపసం
ధానంబు న్ననుమానసంబున వడిన్ దండించుఁ గాలంబునన్ 66

క. అన శుక్రపుత్త్రి వానిం, గని యొక్కముహూర్తమాత్రకాలమునను దే
ర్మని నేలుము గురుఁ డగుటను, క్రుని వేఁడు మతం డొసంగు గురుతరకరుణన్. 67

ఆ. అనఁగ నానృపాలుఁ డనియె; నేఁ గాలయా
పనము నోర్వఁజాల బహుళవిఘ్న
ముడకు సమయభంగ మైనచోఁ బాలింపు
సుందరాంగి యనిన సుదతి పల్కె. 68

క. జననాథపుత్త్ర! నను నీ, కును నే నిడ శక్తిలేదు కుంభినియుం దం
గన లస్వతంత్రశక్తిన్, దనరారెడి లోకసరణిఁ దలఁపఁగవలదే. 69

క. మనుజాధమ! కవిశాపం, బున జ్వాలిభార్గవభృత్యపుంగవతతితో
డను నాశము నొందెద వీ, వని యరజ వచింప నాతఁ డని నట్టతతిన్. 70

దండరాజు చిత్రాంగదకథ నరజకుఁ జెప్పుట.

క. వనితరో! శుభదేవయుగం, బునఁ జిత్రాంగద యటంచుఁ బొల్పారినమా
నిని యొనరించిన చేష్టిత, మును నే భాషింతు వినుము మోదం బలరన్. 71

సీ. చిత్రాంగదాఖ్యతోఁ జెన్నారుభామిని మును విశ్వకర్మకుఁ బుట్టి నద్ది
వరరూపయౌవనపరివృతయై గరపద్మయా పద్మిని పగిదిఁ జెలఁగి
చెలువంబుతోఁ దనచెలికత్తెలనుఁగూడి స్నానార్థమై యొకసమయమందు
నిమిషనామముతోడ నెగడు మహారణ్యమునకును జని యట మొనయు తీర్థ
ఆ. మందు మునుఁగుచుండ నపుడు సుదేవుని
పట్టియై చెలంగునట్టి సురథ

పార్థివుండు రాఁగఁ | బరికించి మోహించి
పలికెఁ జెలులతోడఁ | బాలి మెఱయ. 72

చ. సురుచిరరూపభాగ్యముల | శోభిలి కంతునిరీతినుండు నీ
నరపతి కాత్మదేహమును | నర్మిలి నిచ్చితి నన్నుదాదులా
తరుణినిఁ గాంచి పల్కిరి స్వ|తంత్రత లేదు భవత్ప్రదానమం
దరయఁగ నీకుఁ దండ్రి కలఁ | డాతఁడు శాస్త్రవిశారదుండు నా. 73

ఆ. ధర్మరాజు తనర్చు | తండ్రిని మీఱి భూ
పతికి నిన్ను నీవె | స్వయముగా నా
సంగ యుక్తమగునె | జనులు నవ్వరె యని
దాదులాడుచున్న | తతిని వేడ్క. 74

చ. ఘనుఁడును సత్యరక్షకుఁడు | క్ష్మాపతియైన సురథుండు వచ్చి యా
వనితనుఁ గూర్చి పల్కె స్మర|బాధితుఁడై మదిరాక్షిరో! నన్నుఁ
గనుఁగొని నీవు మోహమును | గంటివి నీనయనాంతశస్త్రఁడా
మనసిజుచేత నే నిపుడు | మల్లడిఁజెందితిఁ జూడు మీఱెదన్. 75

క. భామా! సద్గుణసీమా!, కామాతురమానసమునఁ | గ్రాలిన నన్నుం
గాముని బారిని త్రోయకు, వేమరు నినుఁ బ్రస్తుతింతు | వివిధవిధములన్. 76

సీ. తన్వరో! నీకుచ|తలతల్పమున నన్నుఁ జెలిమితో శయనింపఁ | జేయ నర్హ
వగుదు వావిధమున | నాచరింపక నీవు మసలితివో నేడు | మన్మథుండు
ధర్షించుఁ బలుమరు | ధట్టించి యతిదర్పనంబుతో నన్నని | నరవిభుండు
పల్కఁ జార్వంగయుఁ | బద్మాక్షియైనట్టి విశ్వకర్మాత్మజ | వేడ్కఁ దాని
ఆ. తన్ను మున్నె సంగ | ధాత్రీశునకు సఖి
వార్యమాణ యగుచు | వాంఛ నిట్టు
లావెలంది చేత | నరఁడు పాలితుఁడయ్యెఁ
గాన నేలు నన్నుఁ | గరుణతోడ 77

వ. ఇట్లతఁ డాడి యాత్మగతంబున 78

క. నగవు చిగురెత్తు మోమును, నిగనిగమెఱుఁగారుకురులు | నిద్దపుకన్నుం
బ్రిగి రవణించెడుచను లీ, మగువకుఁ గల్పించె నలువ | మమతన్మిగులన్. 79

క. జడసౌరు మేనిచందము, నడుమునఁ జెన్నారుహారములు | నడుగులచెడఁగుం
దొడలఁ గలతీరు మత్తేభ, తిడ కెక్కడ లేదు చూడఁ | బృథ్వీస్థలిపై. 80

అరణ దండునకుఁ జిత్రాంగదకలిఁ చెప్పుట.

క. దనుజేశ! దండభూపతి, తనమనమున నిట్లు తలఁచి | తల్లడపడ శు
క్రునిపుత్త్రి దాని దగునద, తను వానికిఁ జెప్పఁదొడఁగె | దమిమై నంతన్. 81

ఆ. రాజ! యాలతాంగి / రమ్యవృత్తము నీకుఁ, దెలియ జేసెద దానఁ / దెలియునట్లు
నే వచింతు వినుము / నాతి నది స్వయముగ, సురథుఁగూడి రతుల / సొరిదిఁ జెలి.

క. వనితాస్వభావమున నది, జననాథుని స్వేచ్ఛఁ జెంది / సత్కుల ధర్మం
బును విడిచి మందబుద్ధిని, దనరారినకారణమున / ధారిణి యందున్. 83

ఆ. అవశపత్నియయ్యె / నంతఁ దాఁ దనుఁ దమి
నిచ్చినందువలన / నెలమిఁ బెండ్లి
జరుగదయ్యె మగని / సౌఖ్యంబు సున్నయ్యె
పుత్రఫలము లేక / పొగిలె నపుడు 84

సీ. శాప ముత్పన్నమై / దీపింపఁగా సరస్వతి యకృతార్థుఁడై / వఱలునట్టి
ధారుణీశుని త్రయో / దశయోజనంబులు జలవేగమునఁ గాని / చనియె నాతఁ
డపకృష్టుఁ డగుచుండ / నామె మూర్ఛనుఁ జెందె నంతటఁ జెలికత్తె / లాసరస్వ
తీనదీజలములు / తెచ్చి పైఁజల్లిన నాశీతవారితో / నపుడు తడుపఁ

ఆ. బడినదయ్యెఁ దెలివిఁ / బడయనికై మృత
కల్ప యగుచు విశ్వ / కర్మపుత్రి
విగతసంజ్ఞతోడ / వెలయ దాదులు మృత
తన్వఁగాను దానిఁ / దలఁచి తలఁచి. 85

తే. కొంద ఱేఁగిరి కట్టెలఁ / గూర్చుకొఱకు
నగ్ని గొనిరాఁగఁ గొందఱు / యత్న మొప్ప
వనమునకుఁ బోయి రంత నా / వనజనేత్ర
తెలివిఁ బొందినదై దశ / దిశలఁ గాంచి. 86

క. జననాథుని స్నిగ్ధసఖి, జనమునుఁ బొడగానలేక / సంతాపముతోఁ
బొనరి సరస్వతిఁ బడె నది, వనకంపితనేత్ర యగుచుఁ / బరువడితోడన్. 87

ఆ. కాంచనాక్షి దాని / ఘననది యైనగో
మతిని వెలయు కుటిల / మహితభంగ
జలమునందు ముంచె / సరవి నానది దాని
తెలుఁగునంత మిగులఁ / దెలిసి యపుడు 88

క. హరిశార్దూలాదిమృగో, త్కరములఁ బెంపొందు ఘోర / గహనమునందుం
బరువడిని వదలె నిట్లా, తరుణికి నటనీవ్యవస్థ / తనరె నటంచున్. 89

క. జను లాడ వింటి దానర్, ఘనశీలము వదలి నన్నుఁ / గర మర్థి నిడం
గనుశక్తి లేదు నా కని, వినయోక్తులతోడఁ బల్కె / వింత జనింపన్. 90

క. హరిసముఁ డురుబలుఁ డగునా, ధరణీనాథుండు కావ్య / తనయోక్తుల నా
తరుణమున విని యొగడుచు, కర మగుసార్థంబుఁ దెల్పఁ / గమునించి యనెన్.

సీ. ఉవిదరో! చిత్రాంగదోత్తరవృత్తంబు తజ్జనకునికథ ధరణిపాలుఁ
డగుసురథునిగతి నాలింప మనసయ్యె నారిదిఁ జెప్పు మటన్న శుక్రపుత్రి
భాషించె సురథుండు వడిఁ బ్రకృష్టం బైనవిశ్వకర్మాత్మజ విపినమందు
వగచుచుండఁగ నింటి భాసిల్లు గుహ్యకుఁ డాలతాంగినిఁ జూచి యచటికేగి
ఆ. పూన్కి ననునయించి పొలఁతి రాసురథుని
నెలమిఁ జెందఁజాల విందు వానిఁ
గలయఁగలవు పిదపఁ గాన శ్రీకంఠునిఁ
గాన నీవు వేగఁ గదలి పొమ్ము 92
వ. అని యతండు చెప్పి చనిన పిమ్మట. 93
క. జననాయక! గుహ్యకుఁ డి, ట్లన విని యామగువ భక్తి యమునాకూలం
బున దక్షిణోత్తరాంతర, మున నుండెడిపుణ్యాదికెను మొనసెడిదీప్తిన్. 94
క. పరఁగెడు శ్రీకంఠుని గుడి, కరిగి మహేశ్వరుఁడు నీలకంధరుఁ డగుశం
కరుఁ గని భాస్కరపుత్రీ, వరపుష్కరమధ్యదివ్యభాగమునందున్. 95
క. పరమశిరోనామంబున, హరిమధ్యస్థుండు నగుచు నలరినదాఁకన్
గురుభక్తితోడ మ్రొక్కుచుఁ, గరమర్థి మెలంగుచున్న కాలం బందున్ 96
ఆ. పరమసామవేదపారగతుండును, శుభగలక్షణుండు సుగుణయుతుఁడు
భవ్యశీలరతుఁడు పాశుపతాచార్యుఁ, డగుఋతధ్వజుండు నక్కడకును. 97

ఋతధ్వజుఁడు చిత్రాంగదను గోదావరీతీర్థమునకుఁ బొమ్మని చెప్పుట.

క. మునుఁగుటకు వచ్చి నిర్గత, వనితాంతర యగుచు వగచు భామినిఁ గని యీ
వనితోఁడి యువతి యని తన, మనమునఁ దలఁచుచుండె మనుజాధీశా! 98
క. గురుభక్తితోడ నాసుందరి యత్తఱి నామునీంద్రతల్లజునకు సు
స్థిరమతిఁ గృతాంజలియు నై, పరఁగ నతం డపుడు దానిఁ బరికించి యనెన్.
తే. సురసుతోపమ! యువ్వనిసుతవు నీవు
ఘోరమృగములతోడను గూడి విగత
పురుష యగుచున్న యీవనమునకు నేల
వచ్చితి వటంచుఁ బలుక నావనరుహాక్షి 100
వ. కన్నీరుమున్నీరయి ప్రవహింప వినయంబుతో నత్తఱి. 101
సీ. జరిగినవిధమెల్ల సత్యస్థితిగఁ జెప్ప నాలించి మునివరుఁ డాగ్రహించి
నిజతనుజాతరై నగెడి యీసతి కరదేయరైనను బాపి ధవుని
చే నగాడిలయు నై చెన్నారెఁ గావున నవనిపైఁ గపి యగు ననుచు శిల్పి
వరుని శపించి యాపరమర్షి క్రమ్మఱ సవిధాన మొప్పార స్నాతుఁ డగుచు
ఆ. నుపవసించి సంధ్య నురుభక్తి హరువిధిఁ, బూజచేసి వచ్చి భూరిశోక
భరిత యగుచు భర్తృవాంఛ రాణించెడి, యాలలనఁ జూచి యనియె నిట్లు.

క. తరుణీమణి! విను గోదా,వరశుభదేశమున కేగి । వస్తుండి జగ
ద్గురుఁ డాఢ్యుం డగుభర్తే,శ్వరుఁ గొలుచుచు నుండు మధిక । భక్తి దలిర్పన్.

సీ. కదళీకాస్తంభోరు । కర్బురేశుండైన కంధరమాలికిఁ । గలిగి యచట
వర్తించుచున్న దే । వవతియు నంజనగుహ్యాకపుత్రియై । కొమరు మిగులు
దమయంతియును శక్ర । తనయయు నగు వేదవతియు నీమువ్వురు । భక్తితోడ
సప్తగోదావర । జలమందు రాజిల్లు దివ్యహాటకమహా । త్రిపురహరు

ఆ. నెపుడు పూజసేయ । నెంచి వత్తురా వారిఁ
గలియఁగలవు నీవు । కాంతు నప్పు
డనుచుఁ జెప్పు బాల । లైనచిత్రాంగద
మునిజనేంద్రునకును । మ్రొక్కి యంత 104

క. త్వరితముగ సప్తగోదా, వరతీర్థముఁ జేరి కంద । ఫలభక్షణులై
హరుఁడుఁ ద్రినేత్రుం డగుశం, కరునిఁ బూజించుచుండెఁ । గడుభక్తిమెయిన్

క ప్రాకటమౌ జ్ఞానంబును, జేకొన్న ఋతుధ్వజుండు । శ్రీకంఠునకై
శ్లోకం బొకటి లిఖించెను, వీఁకనుఁ జెప్పెదను దాని । విను మవనీంద్రా! 106

క సురదైత్యయక్షమాన, వరులం దేవఁడైన నాత్మ । పటుశక్తిని నీ
హారిణాక్షినేత్ర దగువగ, ధరఁ గలుపునొ వాని కేను । దండ మొనర్తున్. 107

ఆ. ఆమునీంద్రుఁ డిట్టు । లాడి పయోష్ణియై, పరఁగి సర్వమాని । వంద్యదీర్ఘ
నయన లైనదివ్య । వందినిఁ దలఁచుచు, గన్యాపుష్కరేశుఁ । గాన నేఁగె 108

దండుఁ దరణికి విశ్వకర్మగతిఁ జెప్పుట.

తే దండుఁ డంతటఁ బలికె నో । తరుణి! వీర
సురథుఁ జింతించుచును యథా । సుఖముతోడఁ
బెద్దకాలమ్ము గడచెను । విశ్వకర్మ
తనయ లైనట్టి చిత్రాంగ । దకు ధరిత్రి 109

సీ. పరమర్షియౌ ఋత । ధ్వజుని శాపము నొంది విశ్వకర్మయు మేరు । విపులశృంగ
భాగచ్యుతుండయి । వసుధాస్థలిం బడి శాలూకినీనదీ । సన్నికర్ష
తటతరుగుల్మాఢ్య । దారుణవనమందు విలసిల్లుతలమున । వెలయుచుండి
ఫలమూలములఁ దిని । బహుకాలమట నుండి కంధరాఖ్యుండునౌ । కర్బురాధి

ఆ. పుఁ డొక్కనాఁడు । ప్రియనిజాత్మజయైన, దేవవతినిఁ గూడి । దీప్తితోడ
సంబరమునను నుండి । యట కేగుదెంచెను, భూరిమోద మార్మిఁ । బొదలుచుండ.

చ. జనకునితోడ నా యువతి । సంతస ముల్లసిలంగవచ్చు నా
వనితఁ గపీశ్వరుండు గని । బల్మిఁ గరంబునఁ బట్టుకొన్న యం
తన కపిసంగృహీతయయి । తద్దయు ఖేదము నొందు పుత్రినిం
గనుఁగొని కంధరుండు పటు । ఖడ్గముఁ గేల ధరించి క్రుద్ధుఁడై. 111

క. సరసర రాఁ గని వానరవరుఁ డాసుందరినిఁ గొనుచు । బహుజవమున నం
ధురకనకగిరికిఁ జని భాసురయమునాతటమునందు । శోభాధికతన్. 112

క. తనరెడి శ్రీకంఠేశ్వరుఁ, గని తత్సన్నిధిని వెలయు । గహనంబున నుం
డినమునివాసమునం దా, వనితామణి విడిచి కపివల్లభుఁ డంతన్. 113

ఆ. కందరాసురుండు । కనుఁగొన యమునలో, మునిఁగి దాఁగఁ గపి । పుంగవుండు
వచ్చి నాత్మపుత్రి । శాఖామృగంబుచే, నని తలంచి శోక । మడరుచుండ. 114

క. తనయి ల్లగుబలిగృహమున, కనుఁ జని రవిపుత్రి వానిఁ । గాని చని వేగం
బున బహుజవాశ్రితము నగు, ఘనశివదేశంబుఁ జొచ్చెఁ । గపివరుఁ డంతన్.

క. గురుబలమున నాదేశముఁ, బరువడితో దాఁటి దేవ । పతియుండినభా
సురకాపిలవనభూమికిఁ, గర మేఁగెడికోర్కెఁ దలరి । క్రమ్మఱ నబలా! 116

తే. వినుము దమయంతి యనుసుత । వెంట నంటి
యరుగుచున్నట్టి యంజనా । ఖ్యప్రగుహ్య
కాధిపునిఁ జూచి కపివర్యుఁ । డతనిఁ జంప
నరిగి తత్సుత యగుసతి । నచటఁ గాంచి. 117

సీ. వారి మున్గినబాధ । వ్యర్థమయ్యెను నాకు సొరిది సీయులనాఁగఁ । జూడ దేవ
పతియు నిజంబని । భావించి రాఁగ హిరణ్వతీనదియందుఁ । బ్రబలభీతి
నాతన్వి పడ నంత । నాపగాజలమందుఁ గాలినసుతఁ జూచి । గుహ్యకుండు
భూరిశోకంబుతోఁ । బొదలి యంజనగిరి కరిగి యక్కడ రుచి । యగుచు మిగుల

తే. మౌనమైనట్టి వ్రతమున । మలసి బహుళ
వత్సరంబులదాఁకను । బరమతపము
నమరనాథులు కని విస్మ । యమును జెందఁ
జేయుచుండెను బటుతర । చిత్తశుద్ధి. 118

వ. అంత గుహ్యకసుత యగుదమయంతి హిరణ్వతీనదీజలవేగమునఁ బుణ్యాకరమును సాధుసంకలితమును నగుకోసలదేశమును జేరి వగపునఁ బొరలుచుండి మిగులఁ జిగురుటాకులతోఁ గప్పఁబడి గొప్పనీడతో రాణించుచు జటాధరుఁ డగుము క్కంటి మాడ్కి నుండువటవృక్షంబుఁ గని యావృక్షంబుక్రింద నందమునఁ గ్రందుకొనుశిలాపీఠమునం దాసీనయై యుంత. 119

సీ. పరమతపోధన । భాగ్యుఁడా నాతండ్రిఁ గని సీకుమారుఁడు । కడఁక నిపుడు
వటవృక్షశాఖాని । బద్ధుఁ డయ్యె నటంచుఁ బల్కెడిపురుషుఁ డే । వ్వాఁడు లేఁడు
వసుధపై నని యిట్లు । పల్కునశిష్టాక్షరాన్వితవాక్యంబు । నాలకించి
యాయింతి యంతట । నన్నిదిక్కుల మతితిర్యగూర్ధ్వంబులఁ । దివిరి భువినిఁ

ఆ. గని పిశంగవర్ణ । కలితజటాబద్ధుఁ, డగుచు వృక్షశిఖర । మందుఁ జూడఁ
బంచవత్సరముల । భాసిల్లి భాషించు, బాలుఁ గాంచి శోక । భరిత యగుచు,120

క. అని నో బాలక! యేను, ర్గసుఁ డిట బంధించె నిన్నుఁ । జయ్యన నాతో
దను బల్కు మన్న నలఁడా, వనితకు నిజవార్త నంతఁ । బలుక దొడంగెన్. 121

జాబాలి తనవృత్తాంతము దమయంతికిఁ జెప్పుట

క. సుందరి విను మీవృత్తం, బందుఁ గవీశ్వరుఁడు కోప । మలరుచునుండన్
గ్రందుకొనిపట్టి నను వడి, బంధించినఁ జిక్కు స్రుక్కు । ప్రత్యహమందున్. 122
క. చనుచున్నాఁడఁ దపోబల, మున మును బరశివునివలనఁ । బొల్పారెడి యా
మనుపురమునఁ గలఁ డస్మ, జ్జనకుండు బురధ్వజుండు । సారసనేత్రా! 123
తే. తతతపోయోగనిష్ఠతోఁ । దప్యమానుఁ
డైన యతనికి సూనుండ । నగుచు దీప్తి
సంభవించితి నే సర్వశాస్త్రవేత్త
నగుచు గర్వాయమాణభృంగాళిఁ గలిసి. 124
క. నవతోఁడిరో జాబాలిఁగ, నను దలఁచి నమస్కరించి । నాతండ్రి వచిం
చినమాటల నీ కెత్తతి, వినిపించెద శ్రద్ధతోడ । విను విశదముగన్. 125
వ. బాలుఁడా! నీ వయిదువేలసంవత్సరములు బాల్యావస్థ నుండెదవు పదివేలహాయ నంబులు కౌమారదశ నలరెదవు వింశతిసహస్రవత్సరములు జవ్వనంబున నివ్వటిల్లెదవు నలువదివేలసంవత్సరములు వృద్ధత్వంబున నటించెదవు విను వాని యందుఁ గ్రమంబుగఁ బసితనమున నైదునూతేఁడులు దృఢబంధనంబును, కౌమారావస్థయందుఁ బదినూతేఁడులు కాయశోషణంబును, జవ్వనంబున నిరువదివేలవత్సరంబులు సకలభోగంబులను, ముదిమివచ్చినతతి నలువదినూతేఁడులు నేలఁ బవళించుచుఁ జెడుకూడుఁ దిని పెద్దకష్టంబులఁ బొందఁగల వని నాతండ్రి వాక్రుచ్చె నంత 126
క. ఓయువిదరో! యయిదేఁడుల, ప్రాయంబున దేశికత్వశాలుఁడ నగుచున్
బాయనిపూన్కి ధరాస్థలి, పాయం బెవ్వాఁడు లేక । చని తిరిగి తమిన్ 127
చ. వనిత! హిరణ్వతీవిమలవారి మునుంగ మదిన్ దలంచి నేఁ
జని కపిఁ గంటి నంత నది । చయ్యన నన్ గని మూఢ! నీ వెటన్
జనఁగొల వందు నుంపఁబడి । చారుశరీరవిమాత్మ శోభతోఁ
దనరెదునట్టి దేవవతిఁ । దద్దయు నీవు గ్రహింపు మంచునన్ 128
చ. అని యిటు లాకపిప్రవరుఁ । డాడి శిరత్వమునన్ జెలంగు నన్
గాని చని యావటాగ్రమున । ఘోరజటాపటలంబుతోడ బం
ధన మొనరింప బల్వగలఁ । దద్ఘనయంత్రితలాంతరంబునన్
ఘన మగుదుఃఖవేదనను । గ్రాలుచు నుండినవాఁడ నిత్యమున్. 129
తే. అబల! కాంచనధైర్యమై । యలరు దీని
దాటఁగారాదు ఛేదింపఁ । దరముకాదు

సకలదిఙ్ముఖముల లతా । సంఘయంత్ర
కలితమై సంతతం బిద్ది । త్రాలుచుంట 180

క. ఇటు లాకపి నను వడి సం, కటపడ బంధించి స్వేచ్ఛ । కడలుకొనఁగ దు
ర్ఘటమేరుగిరికిఁ జన నే, నిట వగచుచు నిన్నుఁ గాంచి । కులమిఁ బలికితిన్.

సీ. అబల! నీ వెవ్వతె । వధికాటవికి భర్తృవనితావిహీనవై । వాంఛ నెట్టి
పనిఁ జేయ మదినెంచి । పఱతెంచితివొ దాని భాషింపు మన నది । పలికె విప్ర!
తల్లి ప్రమ్లోచన । తండ్రి యంజనగుహ్యుఁ డగును నాబాలక । మందు దివ్య
మునినాథుఁ డైనట్టి । ముద్గలుఁ డీతన్వి పార్థివేశ్వరునకుఁ । బత్ని యగును
ఆ. నిక్క మనుచు వ్రాసె । నెతి సెల్లవేలుపు, లట్టిమాట నప్పు । డాలకించి
కూర్మి దుందుభులను । ఘోషింపఁజేసిరి, పంచతాళి వార । వములు వెలసె. 182

క. మునినాథుఁ డంత నన నీ, వనితామణి బాల్యమందు । బవాంతరకష్టం
బును జెంది పిదప భూమీ, శునకు మహారాణి యగును । శోణి నిజముగన్.

తే. ముద్గలుం డిట్లు భాషించి । పోయె వడిని
నంత నాతండ్రి ననుఁ గొని । యమల మాహి
రణ్వతీ ప్రాదినీతట । రమ్యతీర్థ
మునకుఁ బోయెను వాంఛతో । భూసురేంద్ర! 184

చ. వనచరుఁ డంతఁ గోపమున । వావిరి రాఁగ నదీజలంబునం
దునఁ గడుభీతి నేఁ బడఁగఁ । దోడన యానది నిర్జనస్థితిం
బొనరెడియట్టిదేశమును । బొందుగఁ జేర్చెనటంచుఁ బల్క నా
వనరుహనేత్ర పల్కిన సు । భాషితము న్విని యాతఁ డయ్యెడన్. 185

క. అని శోభామామణిరో, ఘనయమునాతటమునందుఁ । గ్రాలెడి శ్రీకం
ఠునిఁ జేర నరుగు మట నా, జనకుఁడు మధ్యాహ్నమందుఁ । జంచద్భక్తిన్

ఆ. భవుని భక్తిఁ గొలువ । వచ్చు నత్తతి నీకుఁ
గలిగినట్టి కొఱఁకుఁ । గ్రమముగాను
తెల్పు మతని కీవు । చెచ్చెర మేలును
బొందఁగలవు పొమ్ము । పువ్వుబోఁడి! 187

క. అని యిటు జాబాలి వచిం, చిన విని దమయంతి మాని । శేఖరు రతిం
పను ద్వరపడి హిమనగమునఁ, బొనరెడి కాళిందిఁ గూర్చి । పోవుచు దారిన్.

చ. నిరుపమదీక్షచే నగడి । నిర్మలకందఫలాశనంబుతోఁ
బరఁగి బులితధ్యానం బపుడు । బంధురభక్తిగ నేగునట్టి దా
పురమహారు దివ్యవాసమును । బొంది శయంబున సర్వనిర్జరే
శ్వరుఁడును బార్వతీశుఁ డగు । శంభునకుం బ్రణమిల్లి యంతటన్. 189

సీ. పరమర్షి యాఋతధ్వజుఁడు వ్రాసినవర్ణములఁ జూచి దమయంతి । ముదము నొంది
సొంపారునగవుతో । శోభిల్లి యత్తటి ముద్దులొత్తంబునై । మొనయునట్టి
నిజకథాశ్లోకంబు । నేర్పుతోడ లిఖించి యీమునీంద్రునిచేత । నవనిపతికి
నాలితి యగునని । యూడఁగాఁ బడినట్టి దానినా నేనాగి । దారుణార్తిఁ
తే. బొందితిని నన్నుఁ బ్రోచెడి । భూతలాధి
వర్యుఁ డెవ్వాఁడొ యని శిలా । పట్టమందు
వ్రాసి స్నానార్థమై లేచి । భానుపుత్రి
యైన యమునానదిం గూర్చి । యరిగె నచట 140

ఉ. కోకిలనాదితంబు నయి । గొజ్జఁగిపువ్వులలోని తావులం
గైకొని వీచు తెమ్మెరలఁ । గ్రాలెడి యాశ్రమభూమిఁ జొచ్చి సు
శ్లోకుఁడు నాఋతధ్వజుఁడు । శోభిలు నిక్కడనంచు నాత్మలో
వీఁక మెయిం దలంచుచును । వేగమె దానిని జొచ్చి యక్కడన్ 141

తే. అమరసంస్థయు శుభదయు । ననిశపుష్ప
వదనయును లోలనేత్రయై । పరఁగుదేవ
వతిని వాడినపద్మిని । వలెను జూచె
నాపె వచ్చెడి యాదమ । యంతి నంత. 142

క. కనుఁగొని యెవ్వతె యిది? యని, మనమునఁ జింతించి లేచి । మమత న్నెలతం
బనిగొని గాఢాలింగన, మును బిమ్మట వారు స్నేహ । మును గాంచి రొగిన్ 143

సీ. మొనసి పరస్పర । ముగను బ్రశ్నించుచు క్షేమవార్తల నంతఁ । జెప్పికొనుచుఁ
దమతమపాటులుఁ । దమసంగతులనెల్లఁ దేటతెల్లంబుగాఁ । దెలిసికొనుచు
బహురూపములతోడ । భాసిల్లుచున్నట్టి కథలతోఁ గాలంబుఁ । గడపుచున్న
తతిని ఋతధ్వజ । తాపసశ్రేష్ఠుండు పురవైరిఁ బూజింపఁ । బూర్ణమైన
ఆ. భక్తితోడ వచ్చి । వ్రాసినయక్షర
ములను జూచి చదివి । బుద్ధి దాని
తత్వమును గ్రహించి । తగమహార్తము ధ్యాన
సహితుఁడగుచుఁ దెలిసి । సత్వరమున 144

క. సురనాథుఁ డైనశంభుని, వరభక్తి భజించి పిదప । వాంఛ నయోధ్యా
పురపతియగు నిక్ష్వాకుని, పరిసరమున కేఁగి చూచి । భాషించెఁ దమిన్. 145

ఉ. జనపతిసింహ! విన్నపము । సత్కృపతో విను శాస్త్రవేత్తయై
ఘనగుణుఁ డైననాసుతునిఁ । గైకొని నీవిషయాంతమందుఁ గి
న్నను వటశాఖలందుఁ గడుఁ । గట్టఁ గపీంద్రుఁడు దాని మాన్ప నీ
తనయునికంటె వేఱొకఁడు । ధాత్రిని శక్తుఁడు గాఁడు చూడఁగన్. 146

క. ఘను తెన్న శకునినాముం, బనసుండిన భూవిభుండు । పౌర నీకార్యం

బును దీర్పఁగలఁడు నిక్కం, బన నాతం డంతఁ దాపసాధిపుమాటన్. 147

ఇక్ష్వాకుఁడు తనసుతుఁ డగుశశుని జాబాలిబంధనములు విడిపింప ఋతధ్వజునివెంటఁ బంపుట.

క. విని ప్రియుఁడును సత్యాత్ముఁడుఁ, దనసూనుం డైనశశునిఁ । దచ్ఛాంతికిఁ బో
మ్మన జనకప్రేరితుఁ డై, ఘనముద మేపార నతఁడు । కదలి రయమునన్ 148

చ. పరమమునీంద్రయుక్తమయి । భాసిలువావనసీమఁ జొచ్చి యం
కురసితదిఙ్ముఖంబునయి । ఘోరలతాకృతినొప్పి పెద్దదై
పరఁగెడి మఱ్ఱిచెట్టుఁ గని । వావిరిఁ దద్విటపాంతరంబులో
సొరిది జటానిబద్ధుఁడయి । సోలుచు స్రుక్కెడి మౌనిపుత్రునిన్ 149

సీ. కని లతాపాశసం । కలితయంత్రస్థితి నంతటఁ జోడఁగాంచి । యవనివిభుఁడు
కరమున విలుఁబూని । కడువడి మోపెట్టి మును కపికృతమునై । మొనసి నాల్గు
దిగ్భాగములయందు । దీపించునట్టి లతాపాశముల వేగ । దారుణోరు
బాణాలి వెసఁగూల్చెఁ । బంచవర్షశతంబు కడచనుతతిని లాఘవమువలన

ఆ. నప్పు డతనితండ్రి । యైనట్టి యాఋత, ధ్వజుఁడు ప్రతిచేత । వ్యాప్తమైన
వటమహీరుహమును । వాంఛతోఁ బ్రాఁకుచు, వడిని వచ్చె నంత । వచ్చుచున్న

క. జనకునిఁ గని బంధనమునఁ, దనరుచు జాబాలి మిగులఁ । దనమూర్ధము వం
చిన వాఁడు నగుచు నయ్యెడ, వినయాన్వితుఁ డగుచు మ్రొక్కె । విస్తృతభక్తిన్

క. వనితా! మ్రొక్కినపుత్రునిఁ, గని యపుడు ఋతధ్వజుండు । కౌఁగిట వానిన్
మనసారఁ జేర్చి మూర్ధం, బున నాతనికాయమెల్ల । మూర్కొని పిదపన్. 152

ఆ. కపికృతంబు నయిన । గాఢలతాయంత్ర, చయము పీడఁజేయు । శక్తిలేక
కడిమి దల్లడిల్లఁ । గని బలవంతుఁడౌ, శకునిభూవిభుండు । సత్వరమున. 153

క. కరమున నుండిన విల్లును, శరనికరము ధరను బెట్టి । జడదారి గనన్
గురుజటల విడువ నావట, తరుశాఖాతలముఁ జేరి । ధైర్యముతోడన్. 154

తే. కపివరునిచేత దృఢముగాఁ । గట్టఁబడిన
భూరియంత్రంబులను జటా । పుంజములను
విడువ సమకట్టి వానిని । పీడఁజేయ
శక్తుఁ డిటుఁగాక వగచుచు । శకునివిభుఁడు. 155

చ. కనలుచు మానితోఁ గలిసి । గ్రక్కున దానిని డిగ్గి శక్తితోఁ
దనరెడితార్క్ష్యశాస్త్రములఁ । దాల్చి మహోద్ధతి రేగి యుత్తతిన్
ఘనమగు నర్ధచంద్రశిత । కాండయుగంబున నామహావటం
బున నలరారు కొమ్మలను । భూస్థలిఁ గూల్చెను లాఘవంబునన్. 156

క. వరమతి తపోవిభవంబునఁ, బరఁగెడి జాబాలి యంతఁ । బటుకృతశాఖా
గురుభారవాటి యగుచున్, శరపోషానాయనమున । శాఖను డిగ్గెన్. 157

క థానుష్కుం డగుపార్థివ, సూనునిచే నిజసుతుండు । సుఖ యగుచుంటన్
మానుగఁ జూచి ఋతధ్వజ, మానీంద్రుఁడు సంతసంబు । మది నుప్పొంగన్.

ఆ అధికభారవాహి । క్షైనజాబాలితోఁ
గూడి వేడివేల్పు । కూఁతురైన
యమున కరిగె ననుచు । నవనీశుఁ డగుదండ
మనుజనాథుఁ డాడి । మఱలఁ బలికె 159

క వనితా! విను మాసమయం,బున దానవయక్షసుతలు । పుణ్యుండు మహా
మునినాథుఁ డౌఋతధ్వజుఁ,గనుటకు మతులోలయ వేడ్క । గడలుకొనంగన్.

క అరిగి ఋతధ్వజుఁ డేగిన, తతి వాఁడినపూలతోడఁ । దతనిర్మాల్యో
త్కరములతోడను వెలసెడి, పురహరుఁ బొడఁగాంచి శ్రద్ధ । పొదలుచునుండన్.

సీ అమరాధిపుండు నా । హరుని స్నాతునిఁ జేసి బగళుల రేలను । భక్తిఁ బూజ
గావించుచుండిరా । కాలమందునఁ గాలవాఖ్యమునీంద్రుఁ డవ్యక్తుఁ డైన
భవుని దర్శింప నా । వనమున కేతెంచి కన్యకాద్వయమునుఁ । గాంచి యువని
తనయలో! యని మదిఁ । దర్కించుచునుతోయి యమునానదీజల । మందుమునిఁగి

ఆ. సుస్వరంబుతోడ । సురదైత్యతనయలు, పాలిఁ బాడునట్టి । పాట విని ము
దంబుఁ జెంది వీరు । తథ్యంబు గంధర్వ,కన్య లనుచుఁ దెలిసి । గాఢభక్తి

చ ఘనమగు సంవిధానమునఁ । గామవిరోధినిఁ బూజచేసి శ్ర
ద్ధను మదిలో జపించుచు వి । శంకగతి న్వెలుగొంద నంత నా
వనితలు వచ్చి మ్రొక్కి తన । ప్రక్కను నిల్చి విశేషభక్తితో
బొనరుచునుండ వారిఁ గని । పొంగుచు నాతఁడు పల్కె భామినీ! 163

క. ననబోఁడులార! మీ రె,వ్వనితనయలొ! భవునియందు । బహుభక్తిమెయిన్
దనరి నిజాన్వయమండన, మున కనుగువగునట్టి కార్య । మున నుంటి రనన్.

చ. వరశుభవక్త్ర! యిట్లతఁడు । పల్కినమాటల నాలకించి యా
గరితలు యోగనిష్ఠుఁ డగు । గాలవమౌనికి వాస్తవస్థితిన్
సరగునఁ జెప్ప నంత ముని । సత్తముఁ డాత్మఁ దదీయమైనదు
ర్భరతరవార్తనంతయును । బాగుగఁ దాను నెఱింగి వారిచేన్. 165

ఆ. పూతితుండు నగుచుఁ । బోలుపొంద నటరాత్రి
నుపవసించి యుండి । యుదయకాల
మందు లేచి మునిఁగి । యద్రిజాధిపునకు
శాస్త్రవిధినిఁ బూజ । సలిపి యంత 166

క ఆమెలఁత లున్నకడకుఁ, బ్రేమఁ జనుదెంచి పలికె । బిత్తరులారా!
నే మహితదివ్యపుష్కర, భూమాటవిఁ జేర నేఁడు । పోఁగలవాఁడన్. 167

ఆ. అఖిలలోకనాథుఁ డావాహుఁ గొలుచుచుఁ,దథ్యముగ నటింపఁ దగును భ ర్త
నిడుఁడనుజ్ఞ నిష్వ దేఁజోయి వచ్చెద, నన్న నాపొలంతులనిరి తమిని. 168

చ. మునికులచంద్ర! నీవిపుడు పుష్కరకాననసీమ కేలకో
చనఁగల వాదరంబునను జక్కఁగ దానిఁ దెల్పు నీసుద
ర్శన మతిదుర్లభంబు నయి రాగిలు నన్న మహాప్రభావతం
దనరుచు నాతఁ డిట్టులనెఁ దద్దయు గర్వము పిచ్చలింపఁగన్. 169

ఉ. అంగనలార! కార్తికము నందుఁ జెలంగెడిపుష్కరంబులం
దంగు చెలంగుచుండఁగను దాఁగలకార్తికి భూరిపుణ్యస
త్సంగద మాను నిక్కమనఁ దర్పతు లాడిరి తాపసేశ్వరా!
పొంగెడి బుద్ధి నెక్కడికిఁ బోయెద వచ్చుట కేము పూనికై 170

తే వచ్చెదము నిన్ను విడనాడి వాస్తవముగ
నిటఁ బ్రవర్తింప మే ముత్సహింప మనిన
మంచిదని పల్కి మునిపతి మన్మథారి
కెఱిగి మునిపుంగవులఁ గూడి యింపుతోడ 171

క చనెఁ బుష్కరగురుగహనం, బునకట్టులె వేలకొలఁది భూపాలురు స
న్మునివరులు జనులు పోయిరి, ఘనుని బురధ్వజాని విడిచి గాఢప్రభక్తిన్ 72

సీ అంతఁ గార్తికమున నలరు పుష్కరమందు మునుఁగుటకై మహాభుజబలిష్ఠు
లైన నాభాగాదు లగురాజు లిక్ష్వాకుసహితులై చని రొగి సంతసమునఁ
గడఁగి గాలవుఁడు నకాంతలతోఁ గూడి కార్తికప్లుతమునై త్రాలుమధ్య
పుష్కరనిర్మలపుష్కరములలోన స్నానంబు చేయను జని మునింగి

తే మత్స్యకన్యాయుతంబునై మాటి కధిక
హర్షమున నీట నొప్పారు నట్టి పెద్ద
మీనమునుఁ గాంచె నంత నా మేటిఋషము
మలసి వేర్వేఱ దిరుగాడు మత్స్యసతుల 173

చ కనుఁగొని యుట్టిధర్మమునుఁ గానరు మీరు సముల్బణంబునం
దనరి జనాపవాదమునఁ దద్దయు దారుణమైనదీని నే
జనుఁ డొనరించు గాలవుఁడు సమ్మతితోడనుఁ జేసె నన్న నా
వనితలు మీనరాజుఁ గని పల్కిరి వింత జనింపఁ గోమలీ! 174

తే. మత్స్యరాజేంద్ర! స్వేచ్ఛతో మలసి సతుల
గలిసి తిరిగెడిగాలవుఁ గాన మట్టి
హాని ధర్మాత్ముఁ డైయుండి మానవాప
వాదమున భీతి నొందక వఱలుచుండ 175

క, నీరాంతరమున దిరుగం, జేరిన నీవేల భీతిఁ జెందెద వనవే

సారిణము గోత్రభామలఁ, గూరిమిఁ గని పల్కె నపుడు । కువలయనేత్రా. 176

ఆ. ఆతపోధనేశుఁ । డధికరాగాంధుండు, బాలిశుండుఁ గాఁడు । పరమధర్మ
గలిగిఁ గానలేక । గర్వించి నిర్భయ, భావములర నున్న । వాఁడు పూన్కి. 177

క. అన గాలవుఁ డామాటల, విని జలమధ్యస్థుఁ డయ్యు । వెలిఁ జేరక సి
గ్గునను౦డి జితేంద్రియములఁ, బొనరారుచు నుండె నపుడు । బుధు లగ్గింపన్ 178

సీ. కదళికాస్తంభోరు । కాంతలతో నాచెలు లిద్దఱు జలమందు । నెలమి మునిఁగి
వారిని విడనాడి । వచ్చి తీరముఁ జేరి గాలవు దర్శించు । కాంతవలన
వెలయుచుండఁగ నంత । విమలమౌ పుష్కరయాత్రయుఁ బూర్ణమై । యుల రెనట్టి
తతిని మౌనీంద్రులు । ధారుణీశులు జానపదు లన్యు లార్తి యు । పదములకును
ఆ. బోవ నిర్జనముగఁ । బొల్పారుతీరస్థ, కమ్రవారియందు । గాలవుండు
దారుణంబునైన । తప మొనరించుచు, నట వసించుచుండె । నంత వినుము.

ఆ. మిన్ను చెన్ను దన్ను । సన్ననినడుమున
మేటిసొరుఁ గలుగు । మేన మిగులఁ
బొనరి విశ్వకర్మ । పుత్త్రి యాచిత్రాంగ
దాఖ్య నొప్పుపొలఁతి । యట వసించి 180

క. జననాథుఁ డైన సురథుని, దనమదిలోఁ దలఁచి తలఁచి । తహతహపడి యా
జనపాలచంద్రు రాకను, గనుఁగొనఁ గాంక్షించుచుండె । గంజదళాక్షీ! 181

సీ. అంత గంధర్వక । న్యయు ఘృతాచీగర్భసంభవయును మహా । సాధ్వి దేవ
వతిపుత్త్రి యగు వేద । వతి భక్తి నాపుణ్యమహితతీరముఁ జేరి । మధ్య దివ్య
పుష్కరాంతరమందు । మునిఁగి తీరద్వయమున నుండుమువ్వురి । ముద్దరాండ్రఁ
గాంచి చిత్రాంగద । కడఁ జేరి మృదుమధురాలాపములతోడ । ననియె నవ్వు
ఆ. డవతి వీవు? బుద్ధి । నేపనిఁ గావింపఁ, దలఁచి నిర్జనముగ । దనరునట్టి
వనమునందుఁ బూన్కి । వఱలెద వేలకో? పలుకు మనిన నద్ది । పలికె నిట్లు.

— చిత్రాంగద వేదవతికిఁ దనకథ నెఱిఁగించుట. —

క. మానిని! చిత్రాంగద యను, దానను నీ విశ్వకర్మ । తనయను భక్తి
స్నాన మొనర్పఁగ నైమిశ, కానన సీమకును జెలులఁ । గలిసి యథేచ్ఛన్. 183

క. చని కాంచనాక్షనామం, బునను౦డి విశేషదివ్య । పుణ్యాకరస
జ్జనయిత్త్రి యాసరస్వతి, మునిఁగి తటోపరిని నేనుఁ । బొదలుచు నుండన్.

క. ధరణీశుఁడు వైదర్భుఁడు, సురుబలుఁ డైనట్టి సురథుఁ । డొగి నను మదనా
తురతగా గని నాపజ్జకు, నరుదెంచి నయోక్తివాణి । ననియెను వినుమా. 185

తే. కలికుటమ్ములఁ గంతుండు । గాసిఁ బెట్టఁ
గరుణ రక్షింపు మన సతి । గానివార్య

మానవయ్యాను నన్ను నా । మనుజపతిఁ
గాంచుతోడ నొసంగితిఁ । గమలనేత్ర! 186
క. జనకుం డంత శపింపఁగ, మనుజేశ్వరముక్త నగుచు । మగని స్మృతియం
దునఁ దలఁచి గుహ్యకునిచే, గను వారితనగుచు భక్తి । తళుకొత్తంగన్ 187
క. ధనసిజహరు దర్శించుట, కును జని పూజించి పిదప । గోదావరినిం
గని మునిఁగితి నద్దానం, జనుదెంచితి నిట్టితీర్థ । సత్తమమునకున్ 188
క. నామానసప్రియుండును, భూమీశుం డైనసురథుఁ । బొడఁగానక నే
నేమరు వగచుచు నిక్కడ, నీమాడ్కి మెలంగుదాన । నిప్పుడు తన్వీ! 189
తే. వృత్తయాత్రాఫలంబున । నీవు వేడ్క, నిపుడు వచ్చినదాన నీ । వెవతె? వట్టి
వార్తనెల్ల నిజంబుగఁ । బలుకుమన్న, నాతలోదరి తనగతి । నాడఁ దొడఁగె

— వేదవతి చిత్రాంగదకుఁ దనకథఁ జెప్పుట. —

సీ. ఓకృశోదరి! విను । మొప్పారుపుష్కర విపులయాత్రాఫల । వృత్తమందు
నపగతభాగ్య నై । యదరితి నే ఘృతాచికిని దేవేశుఁడౌ । తష్ణనకును
వరపుత్రినై వేద । వత్యాఖ్య నొప్పారి భాసురశృంగార । వనమునందుఁ
గ్రీడింపఁ గని యొక । కీశుఁ డేతెంచి పూఁబోఁడి నీవెట్లు । పోవుచున్న
తే. దాన వని యామహాశ్ర । మధరణినుండి, హాటకాద్రికి నన్నుఁ జేర్చి । నంత నేనుఁ
బలికినట్టి కపీశుని । వలన నట్టి, యద్రియందుఁ గృతాశ్రయ । నై చెలంగి
తే. వేదవతి యనుపేరున । వెలయుచుండి, పిదప నాదుష్టవానర । వీరుఁ గాంచి
భయముతోఁ బాఱి బంధుజీవ । ప్రశస్త, శాఖపై నెక్క నాతఁడు । సత్వరమున.
క. చనుదెంచి పదంబులచే, తను దానిఁ దన్ని కూల్పఁ । దఱుఁగనిభీతిఁ
దనరి తదీయాయతశా, ఖను గౌఁగిటఁ జేర్చి నేను । గదలక యుంటిన్. 193
శా. అంత న్మర్కటనాథుఁ డాగ్రహముతో । నావృక్షముఁ గంధితో
యాంతర్భాగమునందు వైచె నపు డే । నాచెట్టుతోఁ గూడ న
త్యంతార్తిఁ బడ నద్ది యంబరతలం । బందుండి తా స్వేచ్ఛలోఁ
గ్రాలెం జెందుచు వ్రాలునట్టితరువుఁ । గారుణ్యమేపారఁగన్ 194
తే. సకలమైనట్టిస్థావర । జంగమాది
భూతములు చూచె లోకము । ల్పొక్క నోలి
పడెడునన్నుఁ గాంచి హాహా । రవముల మిగులఁ
జేయుచుండినవయ్య నో । చిగురుబోఁడి! 195
సీ. చారణగంధర్వ । సాధ్యాదిసురవర్యు లత్తఱి నన్నుఁగని । యార్యనుతుఁడు
మహితశూరుండును । మనుపుత్రుఁడు సహస్ర యాగకర్తయును మ । హాత్ముఁ డధిక
దర్పుఁడైనట్టి యిం । ద్రద్యుమ్న భూపతి యాలిది యని యడఁ । డాడె నట్టి
కాంతామణికి నిట్టి । కష్టంబు వాటిల్లె నక్కటా! యనియట్టు । లాడునట్టి

ఆ. విమలమధురవాణి । విని యాధరేశుని, యందు మోహితాత్మ । నైతి నట్టి
వృత్త మెవనివలన । వేయివిధంబులఁ, దివిరి చెడినగతినిఁ । దెలియ లేను. 196

వ. చింతించుచున్నతఱి. 197

క. ఘనుఁ డగునలమిత్రుఁడు రయ, మున నన్నుఁ బరిగ్రహించి । పుణ్యోన్నతితోఁ
దనరెడి యీపుష్కరధర, ణినిఁ జేర్చె న్నన్నుఁ గంటె । నెమ్మితలిర్పన్. 198

తే. తన్వి! చూడుము పుష్కరో । త్తరతటంబు
నందు నుండినబిత్తరు । లరయ నిద్ద
తెవ్వ? రాకోటులనుఁ జూడ । నివుడు లేచి
వెడలిపోదము రా యని । వేడ్కఁ బలికె. 199

చ. కనకశరీరయా సుతను । గన్యకతోడను గూడి వాంఛమైఁ
దరరుచు నాపాలంతులను । దద్దఁ గనుంగొని పృచ్ఛచేయఁగాఁ
జని తమి వారి వేఁడ విని । చక్కఁగ నత్తఱి నాలతాంగు లా
వనితలతోడ నాత్మకథ । వాస్తవరీతినిఁ బల్కె రోసతీ! 200

తే. అంత నానల్వు రటనుండు । నట్టిదైన, సప్తగోదావరీనదీ । జలములోన
మునిఁగియాలీరతుండునఁ । బోదలుకనక, భవునిఁ బూజించుచుండిరి । భక్తితోడ

క. వనితా! బహువర్షంబులు, చన నాపూజోండ్లకాలకు । శకునియు మఱి స
న్మని యగుఋతధ్వజుండును, ఘనుఁ డగుజాబాలికూడి । కాంతు జనింపన్. 202

ఇంద్రద్యుమ్నాదులు చిత్రాంగదాదివనితల వెదుకఁ బనుట.

తే. అరిగి రత్తఱిఁ బంచశ । తాబ్దములును, దాఁట గతబంధనుండు నై । తండ్రిఁగూడి
పోయి జాబాలి శాకల । పురమునకును, గౌతుకము చిత్తమందునఁ । గ్రాల నంత

క. మనుపుత్త్రుఁడు శ్రీమంతుఁడు, మనుజేశుఁడు భూరిశౌర్య । మహితుండు యశో
ధనుఁ డగునింద్రద్యుమ్నుఁడు, తనమనసున వారిఁ దెలిసి । తతభక్తిమెయిన్.

వ. సార్ఘ్యపాద్యుఁ డగుచు నెదురేగి 205

సీ. వరముని యగుఋత । ధ్వజుని దత్తనయుఁడౌ జాబాలిఋషిపలి । త్తాలతేంద్ర
తల్లజుండును భాగిత్య । తనయుండు నిక్ష్వాకుసుతుఁడు నా శకునిని । సారిది విధినిఁ
బూజించె నంత నా । మునినాథుఁ డగుఋతధ్వజుఁడు నింద్రద్యుమ్ను । పార్థివేంద్రుఁ
గని పల్కె నోరాజ । కాంత! మాపుత్రియై దమయంతి యనుపేర । ధాత్రి వాసి

ఆ. నడరుకన్నె నష్ట । మయ్యెఁ దదర్థమై, వసుధనెల్ల మేము । వడినిఁ బట్టి
నట్టివారమైతి । మద్దాన మార్గస, హాయుఁ డవును గమ్ము । యన్నె మొప్ప.

క. అన విని యింద్రద్యుమ్నుం, డనె నోమునినాథ! యువతు । లం దుత్తమయా
వనిత యొకర్తుక నష్టం, బున వెలసెను నాకు నేఁడు । పొందుగ వినుమా 207

క. గురుతరబాధం గూర్చుచుఁ, బరఁగెడి తచ్చరితమేను । భామినిశ్రమ నేఁ
డరయ వచించెదఁ । దరువం, బరవిచ్యుతి మగుచు ఘోర । పర్వతనిభమై. 208

ఆ. వ్రాలె ననుచు సిద్ధ। వర్యులాడినమాట, నాలకించి ఘోర। మైనవిశిఖ
పంక్తివలన దాని। భస్మంబుచేసిరి, వేయివిధము లగుచు। విపులఁగూల. 209

క. కనుఁగొన నాశరలాఘవ, మున నాచెలి చెడనికయ్యె। ముగుదను వెదుకఁగా
బనిఁగానిపోయెద నని యా, మనుజాధీశుండు పల్కె। మమత తలిర్పన్. 210

తే. పరమశాశ్వతిని బుభ్ర। ధ్వజమహర్షి
చంద్రునకు భార్యసూనుఁడౌ। శకుని విభుని
కరదముల నిచ్చె వారలా। స్యందనముల
వేడ్కతోడ నధిష్ఠించి। వెడలి పుడమి. 211

సీ. వరుసఁగాఁ దిరుగుచు। బదరికాశ్రమభూమి కరిగి తపోనిధి। యగుచు మేటి
తపసుతోడఁ గృశించి। తద్దయు డీనుఁడై మలపంకసహితమై। మలయు జడల
నొప్పారు మునినాథు। నొక్కనిఁగని చేరి పార్థివేంద్రుఁడు మహా। భావుఁ డధిక
ధార్మికుఁ డైననిం। ద్రద్యుమ్నుఁ డను మునిచంద్ర! నీవేలకో। సాహసించి
ఆ. భీమయావనమునఁ। బెంపొంది మది నెద్దిఁ, గోరి దుర్ఘటములఁ। గూడుతపము
భక్తిఁజేయుచున్న। వాఁడ వాడుము దాని, నన్నుఁ బల్కె నాతఁ। డపుడు పేర్మి.

క. ఘన మగుశోకస్థితితోఁ, జానరి తపోనిష్ఠవలనఁ। జాగిలెడి నన్నుఁ గా
గని కరుణఁబలుకు నీ వె, వ్వనివాఁడవొ చెపుము వాస్తవస్థితి ననఁగన్. 213

ఆ. ఆలకించి యాతఁ। డనికాని నే శాకల, పురము నేలునట్టి। భూవిభుండ
మనుసుతప్రియుండ। మానుగ నిక్ష్వాకు, సోదరుండ ననిసఁ। జోద్య మొదవ.

క. విని సురథుఁడు సంతసమునఁ, దనకథ నెఱిఁగింప నతఁడు। తమితో ననె నీ
తనువును విడు నాసోదర, తనయుండ నై యుంటివేని। తథ్యముగాఁగన్. 215

క. వనితను వెదుకను రాఁగల, నని యిటు భాషించి కూర్మి। నరదముకయి నా
జననాథు నధిష్ఠితుఁగాఁ, గనుఁ జేసియుఁ దెలిపె మాని। గన్యలకెలమిన్. 216

ఆ. పుత్త్రుఁగూడి తోషముమున నొప్పుచున్నబు, తధ్వజుండు రాజ। తల్లజుండు
నైనసురథుఁ జూచి। యవనీశ! రారమ్ము, కడిమి మేలు చేయఁ। గలను నీకు. 217

సీ. చిత్రాంగదాఖ్యతోఁ। జెన్నారు చున్న యీసుందరి నీచేతఁ। జూడఁబడనొ
నైమిశంబున నట్టి। నాలి నాచేతను సప్తగోదావరి। చారుతీర్థ
మందు వివర్తిత। యయ్యెను బోఁగల మాభూమికిని మేము। హర్ష మొప్ప
నందున నక్కడి। కరుదేర నగునీవు కన్నులు మూఁగుముఁ। గాంతుఁ గొంద
ఆ. తాస్థలంబులోన। నలరెడి మాకడఁ
జేరఁగల రటంచుఁ। జెప్పి యతని
మూర్ఛడించి శకుని। నొగి ముందరను నిల్పి
చిత్తమునందుఁ బ్రీతి। చెలఁగ నంత. 218

క. ఘనుఁ డగు నింద్రద్యుమ్నునిఁ, దనతనయునిఁగూడి వాఁడు తల్లజములతోఁ
దనరెడి తేపల నెక్కియు, మనముల సంతసము మిగుల మతిమతి వెలయన్.

క. అవనితలు కలిగిన గో, దావరితీర్థంబుఁ జేరఁ దనమదిలోనన్
భావించి పోఁదొడంగను, వావిరి నాయెడ ఘృతాచి భావం బందున్. 220

క. తనసుతను దలఁచి దుఃఖం,బున నుదయనగంబు నంతఁ బొరి వెదకి వగన్
జనుదెంచి వానరేంద్రునిఁ, గనుఁగొని యావేళ నిట్లు గడక వచించెన్. 221

తే. కపికులాధీశ! నీచేతఁ గానఁబడదె
బాల యొక్కటి? నిజముగ బల్కు మనిన
నాతలోదరి వాక్యంబు నాలకించి
వానరుం డిట్టు లత్తఱిఁ బలికె వినుము. 222

క. వనితరో! నే దేవవతిన్, గని కొని మృగదివ్యరథగణములతోఁ జె
న్నున నలరారెడి యమునా, ఘనకూలాశ్రమమునందు గన్యస్థితితోన్. 223

క. పరఁగెడి జా శ్రీకంఠే, శ్వరుపదనమునకును ముందు వదలితి నన నా
విరితోఁడి యపుడు వానర,వరునిఁ గొడగాంచి ప్రీతి వాటిల్ల ననెన్. 224

సీ. వనచరేశ్వర! దేవవతి గాదు సత్యము భావింప నది వేదవతియు నగును
గాన వే చనెదము కదలి రమ్మనిపల్కు నామాట నాలించి యాకపీంద్రుఁ
డతిలఘుక్రముఁడు నై యాపె వెన్వెంటన కౌశికి పొంతను గాంచి నరిగ
నాన్నృపర్షులు మూఁగు తానదికడఁ జేరి సంయమిద్వయముతోఁ జాల వెలిఁగి
ఆ. పంచతురగవేగ పరివృతములు నైన
నరదములను డిగ్గి యాసరిత్తు
నందుఁ గ్రుంకుచుండి రపుడు ఘృతాచి యా
పుణ్యనదిని భక్తి మునుఁగుచుండె 225

తే. అంత జాబాలి యాకాంత నాశ్రయించి
కాంతనుండిన వానరఘనునిఁ దఱచుఁ
గాను గని యాత్మజనకునిఁ గడుబలుండు
నైనపార్థివుఁ గని యిట్టు లాడఁ జొచ్చె 226

క. జనకా! బలమున మును నగ, మున జడలను నన్నుఁ గట్టి పోయిన కపి ద్రు
న్నన వచ్చె వేగమున నన, విని కకుని విభుండు క్రోధవివశుం డగుచున్.

చ. శరయుత మైనవిల్లుఁ గాని శౌర్యముతో ననిఁ దాశసేంద్ర! యా
గురుబలుఁ డైనవానరుని ఘోరశరంబునఁ గూల్చుదాఁక బ
ల్కరుణ ననుజ్ఞ నా కిపుడు గమ్ము లెఱ మెచ్చనొసంగు మంచు నీ
కరణిని బల్కె భూతహితకాముఁడు నైనఋతధ్వజుం డొగిన్. 228

క. వినుతయశో బలసద్గుణ, ధనుఁ డగుచున్నట్టికుని | ధరణీశ్వరునిన్
గని పల్కె హేతుయుతమై, పావనరాకెడిమాట నొకటి | బుధు లగ్గింపన్.

క. జననాథ! యీవనిచే నే, జనుఁ డవనిన్ బద్ధుఁడగుచు | జచ్చును; వధ బం
ధనములు ప్రాక్తనకర్మం, బునకు నధీనములు కావె | బుద్ధిఁ దలంపన్. 250

క. అని యి ట్లతఁ డన విని నృప, తనయుం డనె మానినాథ! | దర్పోద్ధతి నుం
డినకపిఁ గాతించెద నా, కు ననుజ్ఞ నొసంగు మనిరయిఁ | గోపముతోడన్. 251

చ. వనిచరా! యిట్లు పార్థివుఁడు | పల్కె బుతధ్వజుఁ డట్టి వానరున్
గని ప్లవగేశ! నాసుతునిఁ | గైకొనిపోయి వటోరుశాఖలన్
ఘనమగుచున్న పెంజడలఁ | గట్టితి వక్కట! దానినుండి బం
ధనమును బాపఁజాల కటఁ | దద్దఁ గృశించుచు నుంటి నాయడన్. 252

చ. ఘనుఁడగు నీనృపాలమణి | గ్రక్కున నావటశాఖలన్ శిరం
బున ధరఁగూల్చి వింతఁగను | మూఁడుతెఱంగుల నొప్పరీతి నా
తనయుఁడు వానిఁ దాల్చి వ్యథ | దాల్కెనిఁ బంచశతాబ్దము ల్చనెన్
బనిఁగొని దానిఁ బాపఁగల | వాఁ డొకఁడైనను లేఁడు చూడఁగన్. 253

కపిరూపమున నున్నవిశ్వకర్మ వాలబంధనము వదలించుట.

క. మునుకొని నీ వాలబంధనమును పీడం జేయు మనుచు | మునివర్యుం డా
డినమాటల విని యాతఁడు, ఘనుఁ డగుజాబాలిజడలఁ | గడుయుక్తిమెయిన్.

ఆ. వెలఁది తిన్నగాను | విడిచె నాకొమ్మలు
వసుధఁ జ్యోతము లగుచు | వ్రాలె వానిఁ
గాంచి ప్రీతినొందె | కరుణ బుతధ్వజుఁ
డాడ వరదుఁ డగుచు | నప్పు డిట్లు. 255

క. వనచర! నీమదిఁ గలవరమును గృపతో నిత్తు నడుగు | ముదమున నన నా
మునినాథునివాక్యంబును, విని యిట్టివరంబు ప్లవగ | విభుఁ డడిగెఁ దమిన్. 256

సీ. దివ్యతాపస! మహా | తేజోధికుఁడ విశ్వకర్మనై యున్న నేఁ | గనఁ గపిత్వ
మున నున్నవాఁడను | మునినీ నాకు వరంబు నిచ్చుటకొఱకు నీ | విచ్చగించు
చున్నవాఁడవు కాన | సురఘోరతర మగు నాశాపమును బాపు | నన్ను మదినిఁ
దగఁ దపోనిధినిఁ గా | ద్రష్టగా మఱియుఁ జిత్రాంగదాకన్యకుఁ | దండ్రిఁగాఁగఁ

ఆ. చేటతెల్ల మెప్పఁ | దెలియుము నీశాప, మునను వానరత్వ | మును వహించి
చటులపాపములను | జపలతఁ జేసితి, వానిఁ బాపి కీర్తి | వసుధఁ గనుము. 257

తే. అంత నతఁ డనె నోప్లవ | గాధినాథ!
తతబలుం డగుఋత్ర ఘృ | తాచియందుఁ

గలుగ నెప్పుడు చేయఁగాఁ । గలవా? నీకు
నడరు నప్పుడు శాపాంత । మై ధరిత్రి. 238

చ. మునివరుఁ డిట్లు పల్కఁ గపి । ముఖ్యుఁడు వేగమె యామునానదిన్
దాన రెడినీటిలో మునుఁగఁ । బోయి ఘృతాచియు నర్వ లంత భ
క్తిని గాని మున్ను పుణ్యతర । దేవచయంబునుఁ జైత్రముం దగన్
దనివి మదంబు నెంది యర । దంబులఁ గూర్చొని పోయి రాయెడన్. 239

కపిరూపి యగువిశ్వకర్మ ఘృతాచిఁ గూడుట.

చ. ఘనమగుసంతసంబు మదిఁ । గ్రాల ఘృతాచిసురేఖపత్తనం
బున కరుగంగ నాప్లవగ । పుంగవుఁ డత్తఱి నాపెలంతి చెం
తన బహుచేష్టలం దిరిగి । తా వరరూపవిలాసరేఖలన్
గనఁబడునట్టి యాకలికిఁ । గాంచెను గామము పిచ్చలింపఁగన్ 240

ఆ. అద్రి బిలయులందు । నత్యుపమస్థితి, నామరుమిగులు కేశ । కుంజరేంద్రుఁ
గాంచి బుద్ధి విశ్వ । కర్మనుగా నెంచి, కూర్మిరతుల వానిఁ । గూడ నెంచె. 241

క. వానరవీరుం డాయెడ, నానాతినిఁ గూడి ధాత్రి । ఖ్యాతి నిమ్మగులం
గానంబడుకోలాహల, మానితనగమందుఁ గ్రీడ । మమతను సలిపెన్. 242

క. అరమణిమణి వానర, ధీరుని రతులందుఁ దేల్చెఁ । దివి రెడికోర్కెన్
వా రిటు చిరకాలం బట, గూరిమిఁ గ్రీడించి వలపు । కొమరారంగన్. 243

ఆ. వింధ్యఁ జేరి రంతఁ । బృథుతరదీప్తితో
నరదములను మిగుల । నలరునట్టి
పార్థివాదు లట్టి । పరమతీర్థమునకుఁ
జేరి యింటఁ బ్రొద్దు । చెలఁగువేళ. 244

సీ. సప్తగోదావర । సజ్జలంబులఁ జెంది యధికతుషార్దితు । లగుచు శ్రమముఁ
బాపుకొంద మటంచు । భావించి తేరుల డిగి రట్టియెడ వారి । దివ్యవాజి
సారథు లట్టిదు । జలములలోఁ గ్రుంకి యానీట దమిఁ గ్రోలి । యధికతుష్టి
గనఁ గని వాని నా । కమ్రవనంబులఁ దిరుగఁ బోవిడిచిరి । కరుణవార

ఆ. లవియు నొకముహూర్త । మందె శాద్వలదివ్య
దేశములఁ జరించి । తివురుకోర్కె
వెలసి మేటరైన । వేల్పుకోవెలకడ
కరుగుచున్నవయ్యె । నపుడు వడిని. 245

క. తురగఖురధ్వానము నా, విరిబోణులు విని యిదెట్టి । విధమగు సడియో
నరయుగ నగునని కనకే, శ్వరుగుడికినిఁ బోయి కాంచ । గాపంయుఁ జేరి రమిన్. 246

తే. సకలదిక్కులఁ బరికించి । సాధుతీర్థ
దిక్పథలమున నాప్లుత । దేహములను

గడఁగు మానవగణ్యులఁ గాంచి రట్టి
రతినిఁ జిత్రాంగదయు జటాతతినిఁ దాల్చి. 247

సీ. శోభిల్లుచున్నట్టి సురధునిఁ దోడఁగాంచి దానితో బలికెను దరుణి మేటి
నీలాభ్రకాంతితో నెగడి సురూపుఁడై దీర్ఘభుజంబులఁ దివిరి తోడ
తాఁడునై రాణించు ఘనుఁడె రాజసుతుండు కూర్మి నా చే మున్ను కోరఁబడిన
పతి యగు; సత్యము బంగరువన్నెతో వఱలి పాండురజటాభారమునను
తే. బరఁగుచున్నట్టి వరబుతధ్వజమునీంద్రుఁ
డనియె; దమయంతి యంతట నాత్మసఖినిఁ
జూచి యట వేఱుగా నున్న సుభగుఁ డతని
సూనుఁ డైనట్టి బాల చూడవె నిజము. 248

క. అని పల్కె నంత నా చెలు, లనితరచిత్తముల వలభి నప్పుడు వేగం
బున డిగ్గి శంకరాగ్రంబును జేరి సుభక్తిగీతములఁ బాడి రోగిన్. 249

చిత్రాంగదాదివనితలు హరుని స్తుతించుట.

క. పురహర! హతదక్షాధ్వర!, కరుణాకర! భావదూర! కంధిగభీరా!
పరిపాలితసురనికరా!, పరమేశ్వర! సద్విచార! పరమోదారా! 250

ఉ. పన్నగభూషణా! సకలపండితపోషణ! భక్తరక్షణా!
పన్నగ మూఁడుకన్నులను భాసిలి చారుశరీర మొప్ప నా
పన్నుల నేలి మన్మథుని భస్మము చేసి జగద్విభుత్వముం
జెన్నలరారు నీకు నతి చేసెద మెప్పుడు భక్తి మీఱఁగన్. 251

తే. సర్వసత్త్వభయంకర చారుచంద్ర, శేఖరా! భీమసేనేశ! చిత్ప్రకాశ!
శూలధర! జీవగణనాథ! సుభగచరిత!, చకితదేవప్రజాధ్యక్ష! సత్యదీక్ష!.

క. సురుచిరపింగజటాధర!, పరమశుభంకర! మహేంద్ర! భస్మప్రియ చ
త్వరవాస! కటభయకర!, శరనిధివరశయన! భీమశత్రువినాశా! 253

క. వరభగనేత్ర! శివా! త, త్పురుషమహోద్భవ! ప్రియావిముక్తకవార భూ
ధరకాళిందీప్రియకర!, వరదకృపాణాత్తహస్త! పంకజనేత్రా! 254

సీ. లలితకపాలమాలావిభూషిత! మహాపురుష! వృషధ్వజ పుణ్యచరిత
సకలతీర్థనివాస! శమనగర్వధ్వంస! మానితముచుకుంద! మధునివాస
పరమాప్తరాజిత! పరిపూర్ణసుందర! శతదళవక్త్రాక్ష! చారుచరణ!
సర్పసంఘవిభూష! సజ్జనగణపోష! వితతచారిత్ర! సంతతపవిత్ర
తే. సురుచిరాకార! మునిసురస్తుతివిహార!, భక్తమందార! నతజనపాపదూర
భవ్యకైలాససంచార! బహుళసార!, నిన్ను నెవ్వరు వర్ణింప నేర్తు రభవ! 255

దండకము. శ్రీపార్వతీమానినీ దివ్యహృత్పద్మసంచార, ఘోరోరుబాధాఘసంహార, మాహేశ్వరా, శంకరా, ప్రాధనాద్యేశ్వరా, రుద్రరౌద్రేశ్వరా, భద్రభద్రేశ్వరా, శర్వసర్వేశ్వరా, భవ్యకామేశ్వరా, సంతతాధిక్యఘోరామరాధార, కేదారతీర్థేశ్వరా, దైత్యసంహార, సంతోషనాథా, జగన్నాథ, శ్రీకంఠ, సన్నీలకంఠా, భవా, వామదేవా, లసద్దివ్యభావా, గణాధీశ, సర్వేశ, వాణీశ, సోమేశ, లోకేశ, భూతేశ, నానాభిరూపా, హరా, భూరిహంసస్వరూపా, మహాకోప, విద్యాధిరాజా, కళారాజ, రాత్రీశరాజా, నగాధీశరాజా, సమస్తప్రబీజా, మహోల్లాస, సత్యాధివాసా, నిరాభాస, స్వేచ్ఛానుచారిత్ర, శ్రీవామనేత్రా, జనాధీశ్వరా, ఘోరరూపా, శివా, స్థాణుగాత్రా, త్రినేత్రా, పవిత్రా, సదారౌద్ర, సర్వంసహాభార, భీమాతిభీమా, మహోద్దామ, నిష్కామ, సంపూర్ణకామా, కవీంద్రాంతరంగాబ్ధిసోమా, పరంధామ, నీదాప్రభావంబు వర్ణింపమా కెట్లు సాధ్యంబు నై యుండు భర్మేశ్వరా, దేవదేవా, నమస్తే నమస్తే నమః.

క. మొనసెడుపూనిక నిట్లా, వనితలు శ్రీకంఠుఁ గూర్చి । పాడెడిసమయం
బున నాతాపసవర్యులు, మనుజగణాధీశు లెలమి । మానితబుద్ధిన్. 257

చ. గురుఁడును లోకకర్తయును । గోపతిపూజితుఁ డైనహాటకే
శ్వరుగన నేగి స్నాతులయి । శంభునిముందటఁ గూరుచుండి సు
స్వరముగ మేటిగానమును । వావిరిఁ జేయుచు నున్నకాంతలన్
స్థిరమతిఁ జూచి రంతట సు । దేవుని పుత్త్రుఁడు విశ్వకర్మకున్ 258

క. తనయయు నఘచిత్రాంగదఁ, గని తోషం బాత్మ యందుఁ । గ్రాల స్నేహ
ఘనముగఁ బులకలు పలుమఱు, జనియించిన యట్టిఁ డయ్యె । సారసనేత్రా!

క విమలతపోధనవిభవం, బున నున్నఋతధ్వజుండు । పొంగుచు నట నుం
డునెడియుఁ దనుగాత్రంబున, దనరెడిచిత్రాంగదాఖ్య । తరుణినిఁ గరుణన్. 260

క. కనుఁగొని యోగాత్ముం డై, తనబుద్ధిని బాలఁగాను । దగఁ దెలిసి ముదం
బును జెందెఁ ద్ర్యంబకుం డగు, కనకేశ్వరు నంత వారు । కదలని భక్తిన్. 261

వ. చేరి పూజాద్రవ్యంబుల సమకూర్చుకొని దివ్యపుష్పాక్షతలఁ గరంబులఁ గైకొని.

సీ. శ్రద్ధతోఁ బూజించి । సారెకు వినుతించి రాసమయంబునం । దట్టిజులను
దమిఁ గని చిత్రాంగ । దయుఁ గృశగాత్రి తా సకలాంగనలతోడఁ । జటులభక్తి
కదలుచుండఁగ మ్రొక్కఁ । గని ఋతధ్వజుఁ డట్టిసుందరులకుఁ దన । సూనుతోడ
గడిమిమర్యాదనుఁ । గావించి పార్థివసహితుఁ డై హాటకే । శ్వరునిగుడిని
ఆ సుఖము మీఱఁ జేరె । సొంపుతోడ ఘృతాచిఁ
గూడి యపుడు కేశి । కుంజరుండు
కామరుఁ గలుగుసప్త । గోదావరోత్తమ
పుణ్యతీర్థవారి । మునిఁగె నంత, 262

ఆ. వాడినట్టిమేన । వఱలినదై భద్ర, దర్శనమున నున్న । తనయు నట ఘృ
తాచి చూచె నంతఁ । దల్లినిఁ గని దేవ, వతి ముదంబుతోడఁ । బరఁగుచుండె.

క. అంత ఘృతాచి మనంబున, సంతస మొప్పారుచుండ । స్వతనయునపు డ
త్యంతము కౌఁగిటఁ జేర్చి, యంతఁగ మూర్కొనెను స్నేహ।బాష్పంబులరా.

తే. అపుడు శ్రీమంతుఁడై యట । నలరునట్టి
యాఋతధ్వజుఁ డతిబలుఁ । డైనకపినిఁ
గాంచి చెంతకు రమ్మని । కౌతుకమునఁ
బిలిచి మర్యాదతో నిట్లు । పలుకఁదొడఁగె 266

ఋతధ్వజుఁడు వానరాదులఁ బిలిచి రమ్మని కపివర్యునిఁ బంపుట.

క. తరుచర! యంజనగిరిపైఁ, బరఁగెడిగుహ్యకుని నాగ।భవనుఁడు దైత్యే
శ్వరుఁడును వీరుఁడు నగుకం, దరమాలిని నాకవిభునిఁ । దతభక్తిమెయిన్. 267

ఆ. పిలువఁబొమ్ము వారిఁ । బ్రీతిఁ దోడ్కొనిరమ్ము, వడి ననంగ దేవ।వతి కపీశుఁ
గాంచి పలికె నీవు । గాలవమునినిటఁ, జేర్పుమా యటంచుఁ । జెప్ప నతఁడు

సీ. అతివిక్రముండు నై । యంజనగిరిఁ జేరి గుహ్యకాధీశునిఁ । గూర్మిఁ బిలిచి
వేల్పులకొండకు । వేడ్కతోఁ జని యింద్రు నామంత్రణము సేసి । యమలమైన
సప్తగోదావర।సాధుతీర్థాశ్రమసారభూమికి నీవు । సరవి నరుగు
మా యని పనిచి కీశాధీశుఁ డంతట దర్పంబుతోడఁ బా।తాళమునకు

తే. మానుగను బోయి కందర।మాలిఁ బిలిచి
బలిభువనమును విడనాడి । బహుళవేగి
యగుచుఁ బుడమినిఁ దిరిగి యో।గాధిరూఢ
చిత్తుఁ డైనట్టిగాలవుఁ । జేరి భక్తి. 269

వ. దేవవతి చెప్పిపంపిన వృత్తాంతమును జెప్ప యామునిచంద్రునిఁ గాని పై కెగసి మాహిష్మతీపురి ననుసరించి రయంబున సప్తగోదావరజలంబుఁ జేర్చె. అంత గాలవుం డాజలంబున సవిధానమున మునింగి హాటకేశ్వరుని దర్శించి యట నలరు దమయంతిని, వేదవతినిఁ గాంచె; నపు డామునీంద్రునిఁ జూచి వేదవతి లేచి నమస్కరించె. నారాజపుత్రులు పరమతపోధురంధరుఁ డగు గాలవునిఁ బూజించి మిగుల సంతసించి యథాసుఖస్థితిఁ గూరుచుండిరి. ఇట్లా పార్థివులు సుఖోపవిష్టులై యున్నతఱిని. 270

వానరాదులు సప్తగోదావరితీర్థముఁ జేరి పుత్రికలఁ గాంచుట.

క. వనచరనియంత్రితులు నై, ఘనతఁ జెన్నారు యక్ష।గంధర్వమహా
దనుజు లరుదెంచి రాస్థల, మును కలిమోదంబు పెనఁగి । పొంగార నతి!. 271

క. చనుదెంచినజనకులఁ గని, ఘనలోచనయుగళములను । గడువెలిఁగెడు నా

వనితలు స్నేహార్ద్రంబున, దనరారెడికనుల వారిఁ । దడిపిరి పిదపన్. 272

ఆ. జనకసహిత లగుచు । సంతోషబుద్ధితో, మలయుచుండునట్టి । మానినులను
జూచి విశ్వకర్మ।సుత బాష్పయుతనేత్ర, ములను దుఃఖవార్ధి । మునిఁగె నంత.

క. ముని యగుబుధత్వజాం డా, వనితామణిఁ గాంచి పుత్త్రి । వగఁజెందకు నీ
జనకుం డీవానరవిభుఁ, డని సత్యం బైనమాట । నాడెను గూర్మిన్. 274

క. వనితరో! యది తద్వాక్యము, విని సిగ్గున బద్ధమగుచు । వెలసెడిచిత్తం
బున నని నేలాగో యిపు డీ, ఘనబలుఁ డగువిశ్వకర్మ । కపి యయ్యెఁ గనన్.

సీ. అధికకల్పషపుత్త్రి । నై నేను బుట్టితి నాకారణంబున । నాత్మదేహ
మును వదలెద నని । బుద్ధితో నూహించి పలికె నంతట బుతో।ధ్వజానిఁ గూర్చి
యనఘ! మహాపాప।హతచిత్త నగునన్ను సత్కృపరక్షింపు । జనకుఁ గ్రోలిఁ
జేసిన దానను । జీవంబు విడిచెద నా కాజ్ఞ నిడ నగు । నంచు నట్టు

ఆ. లన నతండు పల్కె । నబల! శోకించుట, తగదు భావ్యమైన । దానియందు
హానిలేదు చూడ । నటు గాన నీమేను, వగచి వగచి విడువ।వలదు వినుము

క. జనకుఁడు క్రన్నన సురవ, ర్ధనుఁడై పుట్టంగఁగలఁడు । తనయాకృతితో
డను నీకొఱకు ఘృతాచీ, వనితకు సత్యంబు చింత । వలదని గూర్మిన్ 277

క. సుగుణియు భావితచిత్తుం, డగుసత్యధ్వజుఁడు నిట్టు । లనుతతి వగతోఁ
బొగలెడి యాసతికడ కొగి, నగణితరుచియా ఘృతాచి । యరుదెంచి తమిన్.

తే. కౌఁగిటను జేర్చి యిట్లనెఁ । గలికి! నీవు
మాను మీదుఃఖమును బది।మాసములకుఁ
బుట్టుఁ బుత్త్రుఁడు జనకునిఁ । బోలువాఁడు
సత్య మాత్మను నీకు సం।శయము వలదు. 279

క. గరితరో! ఘృతాచి యపు డీ, కరణిని భాషింప విశ్వ।కర్మాత్మజయుం
సురుచియు నగుచిత్రాంగద, పరమానందమునఁ దాను । భాసిల్లె పిదపన్ 280

క. మనసున వైవాహికమును, జనకునిఁ గనఁ గోరె నట్టి । సమయంబునఁ ద [న్.
క్కినచోటులు ప్రియవాంఛగ, దనరుచు డెందములఁ జెండ్లి।దలపోసి తొగి

—— నలజన్మము. విశ్వకర్మశాపనివృత్తికథ. ——

తే. అంత దశమాసములు పూర్ణ । మై తనర్పు
తతిని నాతీర్థమందు ఘృ।తాచితండ్రిఁ
బోలుపుత్త్రుని గనెఁ గపి।ముఖ్యుఁ డపుడు
తనయుఁ డుదయింప వానర।త్వంబు వాసి 282

క. చనుదెంచి ప్రియాత్మజఁ బ్రేమను దనకౌఁగిటనుఁ జేర్చి । మానగుభక్తిగ
దనరెడిబుద్ధిని సురవర్ధనుఁ డగునలుఁ డాత్మయందుఁ । దల్పమయమునన్. 283

క. సురకిన్నరసహితంబుగఁ, బరమేష్ఠిని సర్వదేవ / పతి యైనపురం
దరుఁ దలఁచె నంత వాణీ, శ్వరుఁడు శచీధవుఁడు ముదము / వాటిలుచుండన్.
క. సురయుతులై యాహాటక, వరతీర్థముఁ జేరి రిట్లు / వాసవముఖని
ర్జరు లరుదెంచినతఱి నప్సరసలు గంధర్వపతులు / వచ్చిరి పిదపన్ 285
క. ఇంద్రద్యుమ్నుఁడు మునికుల, చంద్రుఁడు సత్యాత్ముఁడైన / సత్యధ్వజుతో
నింద్రాదిదేవతలు కన, సాంద్రంబగు భక్తి ననిరి / సరసపుభణితిన్. 286
సీ. మునికులనాథ! నీ / పుత్త్రుఁ డౌ జాబాలిమానికిఁ గందర / మాలి పుత్త్రి
యగు దేవవతి నిడ / నగు నది నీసుతుకరమును సవిధాన / సరణిఁ బూనఁ
దగు; సుందరంబునఁ / దల్లోకకుతుశకునిభూపాలుని దమయంతి / పాలివాఁడఁ
బెండ్లాడ నగు నేనుఁ / బృథుభక్తి హవ్యంబు సవిధి చెన్నారఁగ / జ్వలనులోన
తే. వేల్వ యా వేదవతిని సం / ప్రీతిఁ బెండ్లి
చేసికొనిర నటంచని / చెప్ప నాతఁ
డపుడు మనుసూనుఁ గని మంచి / దనుచుఁ జెప్పె
నంద తా విధిఁ గొనిరంత / నధికతుష్టి 287

## చిత్రాంగదాదివసతుల వివాహక్రమము.

తే. గాలవాదిమునీంద్రులు / కౌతుకమున
హవ్యమును వేల్చిరట నగ్ని / యందు మిగుల
నపుడు గంధర్వవరులాడి / రచ్చరలును
బాటఁ బాడిరి యంతట / భావమలర. 288
క. మును జాబాలికరంబును, మనుజాశను పుత్త్రి తాల్చె / మనుసుతుకరమం
తన వేదవతియుఁ గొనె య, త్తునిసుత మఱి శకునికరము / సారిది గ్రహించెన్.
క. మంగళయగు చిత్రాంగద, పొంగడుమదినంత సురథ / భూవిభుకరముఁ
గంగుఁగఁగొని నీక్రమమున, రంగద్వైవాహికంబు / రాణించెఁ జెలీ 290
ఆ. పెండ్లి ముగియ మౌని / విభుఁడౌ ఋతధ్వజుఁ, డంత వాసవాదు / లైనసురలఁ
గని విశేషసరణిఁ / గ్రాలెడి వైశాఖ, మందు నిట్టితీర్థ / మందు మీరు. 291
చ. అరుదుగ నుండనా ననుచు / నాదటఁ బల్కిన నాలకించి ని
ర్జరవరు లట్ల నర్తు మని / చయ్యన నయ్యెడ నాడి తుష్టితోఁ
బొరయుచు మింటికిం జనిరి / పుత్త్ర సమన్వితుఁ డౌ ఋతధ్వజాం
గరమనురక్తిఁ దాపసులు / కైకొనిపోయిరి రాజు లంతటన్. 292
సీ. భార్యలఁ గొని తమ / స్వపురంబులకు నేగి సంతోష మేపార / సతులఁ గలిసి
భూరిసుఖంబులఁ / బొరిసమ్ముఖంబున ననుభవించుచునుండి / రతులితముగఁ
చిత్రాంగదాపూర్వ / చిత్రవృత్తాంతంబు సరవి నీకైవడి / జరిగె మున్ను
కాన నోకమలాక్షి / కరుణ నగ బెండ్లాడు మని యిట్లు కవిసుత / యైనయరజఁ

ఆ. గూర్చి దండవిభుఁడు । కోమరారుచున్నమ్ర
దుక్రమంబులోడ । స్తుతిని మిగులఁ
జేయ నాలకించి । తుటిపాలుఁ డౌదండుఁ
గాంచి యాపోలంలి । కనలి పలికె. 293

క. నను నే నిడ బహాంభాషిత్వమున నెట్టిఫలంబు నీకు । మొనయునో శాపం
బొనరించి తైన నను నేఁ, బనిఁగొని పాలించుకొందుఁ । భార్గవ! కంటే. 294

— దండుఁ డరజను బల్మి భోగించుట. —

చ. అని యిటులాడుశుక్రసుత । నాతఁడు కామమహాత్ముఁడై బలం
బునఁ బడఁద్రోసి కూడి గత । పుణ్యచరిత్రను జేసి యామహా
మునివరువాసము న్విడిచి । పొందుగ భృత్యులఁగూడి తేరిపైఁ
దనరి స్వపత్తనంబునకుఁ । దాఁ జనె మోదముతోడ నత్తటిన్. 295

ఆ. శుక్లసంప్లుతమున । శోభిలుకవిసుత
పోరి రజస్సుతోడఁ । బొదలి వగను
వెలసి యాశ్రమంబు । విడనాడి వెలిఁ జేరి
మొగమువంచి చూపు । భూమి నునిచి 296

చ. జనకుఁడు నైనభార్గవుని । సారెకు సారెకు నాత్మ నెంచి హా!
యని కడుసోలి రాత్రిపతి । యైనహిమాంశునిఁ బాసి దీనతన్
దనరి మహాగ్రహంబులకుఁ । దద్దయుఁ జిక్కినదైనరోహిణిన్
దనితను బోలి పెన్వగను । వాపిరి వర్తిలుచుండె నంతటన్. 297

క. దనుజ! పెక్కుదినంబులు, చన జన్మము పూర్ణమగుచుఁ । జాలవెలుంగన్
గని శుక్రుఁడు పాతాళం, బును విడిచి నిజాశ్రమస్థ । భూమికి వేడ్కన్. 298

క. చనుదెంచి యాశ్రమాంతం, బుననుండి రజస్స్రవలనఁ । బొనరుచు సంధ్యా
జని రాగసంభృతం బగు, ఘనరేఖనుఁ బోలుసుతనుఁ । గని రోషమునన్. 299

క. అనెఁ బన్నగసమరోషం, బున నిను ధర్షించి యెవఁడు । భోగించెనో దు
ర్జనుఁడును పాపియు నగునా, జనుఁ డెవఁ డెచోటి కిపుడు । చని నేవడితోన్.

క. చనెదను శుద్ధాచారం, బున నుండిననిన్నుఁ జెఱచి । పోయినపాపా
త్మునిఁ బల్కు మనిన నది తన, జనకునిఁ బొడఁగాంచి భయము । సారెకుఁ బొదమన్.

చ. ఘనమగుదుఃఖవేదనను । గ్రాలుచు సిగ్గు మనస్సులోనఁ బె
న్గొన వచియించెఁ దండ్రి! విను । కుత్సితభావుఁడు నీకు శిష్యుఁడున్
జనపతి యైనదండుఁ డురు । సైన్యయుతంబుగ నీమహాశ్రమం
బున కరుదెంచి నన్నుఁ గని । పూవిలుకానికిఁ జిక్కి స్రుక్కుచున్. 302

ఆ. వలఁపుపుట్టునట్టు । పలికి నాతోఁ దలిఁ
జేయ నెంచఁ జూచి । చేటువచ్చు

ననుచు నేను బల్కఁ । నరుఁడు నానుడి మీఁతి
బలిమి నన్నుఁగూడి । పాతిపోరు. 303

క. జనకా! నే నాతనిచే, తను భంగము నిట్లుచెంది । తలుగనిదుఃఖం
బున నున్న దాన ననఁ దన, తనయోక్తుల నాలకించి । దనుజగురుఁ డొగిన్. 304

— శుక్రుఁడు దండునకు శాపమిచ్చుట. —

సీ. నలిఁ గోపసంరక్తనయనంబు లేపార నాచమనంబును । యత్నమొప్పఁ
జేసి శుచిర్భూతచిత్తంబుతో నపు డీలాటినుడిఁ బల్కె । నిల మఱియు
ముఖ్యశాసనభయంబును గౌరవస్థితి నడఁకువ లేని దండాఖ్యవిభుఁడు
గరువంబుతోఁ దిరస్కారంబుఁ గావించెఁ గాన దిగంబరఁ । గాంచి సప్త

ఆ. నిశలు కడచుతతని । నిఖిలాశ్వరథబల, మంత్రిగణముతోడ । మఱియు నిక్క
మనుచు నిట్టుపలికి । యాతనికిని శాప, మిచ్చి పుత్రిఁ జూచి । యొలమి ననియె.

క. తనయా! పాపవిమోచన, మునకై యిటఁ దపముతోడఁ । దొల్పౌరుము నీ
వని యిట్లాత్మజకును నీ, తిని శుక్రుఁడు గఱపి పిదపఁ । దివిరెనకాంతున్ 306

చ. దనుజవరిష్ఠగేహముల । దగ్ధ వెలింగెడి నాగవిష్టపం
బునకును బోయె దండుఁడును । భూరిమదంబున సైన్యరాష్ట్రవా
హనబలరాశితో మడిసె । నాయెడ దేవత లట్టిదండకా
వని నెడఁబాసి పోయి రతిపాపపదం బని దైత్యశేఖరా! 307

క. కరిచర్మవసనుఁ డగుశం, కరుచే నది చేయఁబడెను । గర్వరగణమం
దిరముగ నిటు పెలుకాంతలు, గురుపుణ్యములఁ గ్రహించికొనిపోదు రొగిన్.

మ. దనుజా! ప్రాకృతు లైనమానవులు సత్యంబిట్లు గర్వంబుచే
తను బూబోఁదులపొందుఁగోరి ధర విస్తారావమానస్థితిం
గని దుష్కీర్తినిఁ జచ్చి రక్కట! మహాకళ్యాణియౌ పార్వతీ
వనితం గోరుట నీకుఁ బాడియగునే । పల్మారు భావించిదన్. 309

చ. పొరిఁబొరిఁ బ్రాకృతాంగనయు । భూమిని నిట్లు దహింప నిర్జరే
శ్వరునకు భార్య యైనగిరిజాసతి కాల్ప దటంచుఁ జెప్ప న
చ్చెరువగుఁ గాదె; శంకరుఁ డజేయుఁడు దానవదేవకోటికిం
గర మతనిం జయించుటకుఁ । గాదు రణస్థలి నెట్టివారికిన్. 310

— అంధకుఁడు ప్రహ్లాదునిమీఁది నిరసించుట. —

తే. అనఘ! ప్రహ్లాదుఁ డిట్లాడ । నాలకించి
యంధకుఁడు కోపతాపరక్తాంబకుండు
నగుచు నిట్టూర్పు నిగుడించి । యధికవీర్యుఁ
డగుచు నాతనిఁ గని యపు । డలుకఁ బలికె. 311

క. వినుము నాచేతను సంగర, మున శక్తుఁడు గాఁడ గెలువ । ముక్కంటి కనం
గ నధర్ముం డసహాయుఁడు, ఘనభస్మారుణితదీప్త । కాయుం డరయన్ 312
క. దనుజాధీశ్వర! యంధకుఁ, డని వాసవువలన భీతి । నందునె చెపుమా
వనచరులవలన నతనికి, జనియించెడిభయ మదెంత । చర్చింపంగన్ 313
తే. అతఁడు పురవీథులందున । నడరునట్టి, భవ్యవృషపత్రనాముని । వలన భయముఁ
జెంద లేదేమొకో! యని । చెప్ప నాతఁ, డంధకుని ఘోరవాక్యంబు । నాలకించి.

ప్రహ్లాదుఁ డంధకునకు నసితముని చెప్పినరీతి బోధించుట.

క. అని నీపలు కలిగర్విత, మున నలరి యసహ్యాసరణిఁ । బొలుపొందినదై
కన ధర్మార్థవిరుద్ధం, బును నయ్యది విననేఁడు । బుద్ధివిహీనా! 315
క. ధర సింగమునకు నక్కయుఁ, గరికి న్మశకమునకగ్ని । ఖగములకును బం
గరునకు రాతికిఁ గల దం,తర మని భాషింపఁబడెను । దజ్ఞులచేతన్. 316
ఆ. అట్టి దైనమేర । యభవునకును నీకుఁ, గలదె? నీతిఁ జెప్పఁ । గా దటంచుఁ
దివిరి యనెద నీవు । దేవర్షియును మహా, మనుజుఁడైన యసిత । మహానివరుఁడు
వ. మంతనంబునఁ గొంతవడి లోకోద్ధరణహితబుద్ధిఁ జింతించి. 318
సీ. పలికినవాక్యంబు । భాషింతు విను మెవ్వఁ, డలిధర్మశీలత । నడరి విజిత
గర్వరోషంబులఁ । గ్రాలుచుఁ బరులకు హానిఁ జేయక యు వి। ద్యావినీతుఁ
డై స్వదారలఁ గూడి । వర్తించి పెఱకోంట్లఁ బొందు గోరఁ డో యట్టి । పురుషునకును
భయ మొకించుకయైన । వాటిల్ల దెవ్వఁడు పరుల నిత్యంబును । బాధపెట్టి
ఆ. పోరితమునఁ బ్రీతి । బొంగారఁ బరసతి, విత్తవాంఛతోడ । వెలసి శాస్త్ర
సరణి వీడి నీచ । సతులఁ గూడెడువాఁడు, పొందఁ డుభయలోక । ములసుఖంబు.
క. భగవానుఁడు ధర్మాన్వితుఁ, డగురవిసంతప్తకరోషుఁ । డయి కీర్తిఁ గనెన్
సుగుణముని యైనవారలె, జగములఁ గీర్తింపఁబడెను । సత్పురుషులచేన్. 320
క. తరణసుతుం డగుమను వ్రాగి, వరవిద్యాన్వితుఁడు నగుచు । వాసిని జెందెన్
సౌరిది వగస్త్యుఁడు మును నిజ,తరుణీసంతుష్టబుద్ధిఁ । దనరెన్ జుండీ! 321
క. ఇటు లీధీరులు మున్ని, కటులెరకలు పోఘదూర । బంధురధర్మో
త్కటపుణ్యంబులఁ జేసిరి, చటులస్థితి లేనివంశ । సక్రమభణితిన్. 322
క. కర మిట్లు వీరు నిర్జర, గరుడాద్యర్చితులు శాప । కరగణ్యులు దు
స్తరవీర్యకీర్తిగురుధన, పరివృతులై దీప్తితోడఁ । బరఁగిరి మిగులన్. 323
క. నీ వధిపుఁడవై నిత్యము, కావరమున ఘోరపాప । కార్యోద్యమసం
భావితుఁడవు కలహప్రియ, భావుండవు నైతి వకట! । పాపనిశాటా! 324
సీ. చెడుగగునడతతోఁ । జెన్నారి పరులను బాధించు నముచియు । బహుళగర్వ
మున నున్నసనకాఖ్య । భూపతియును బరార్థాభిలాషోన్నతి । నడరి దైత్యుఁ
డైనహిరణ్యాక్షుఁ । డతనికి సోదరుఁ డగుచు మూర్ఖస్థితి । నలరి పాప

కలితుఁ డైనహిరణ్య। కశిపుఁడు స్వర్ణాపహారుఁడు సుత్తముతేజుఁ। డైనయముఁడు

ఆ. మున్ను వీరు నాశ।మును జెంది రద్దాన, ధర్మసరణి దాఁటఁ। దగదు భవ్య
గతి నొసంగు సద్ధి। ఘనతరకము గత, ధర్మ లొందుచుండ్రు। తథ్య మసుర.।

ఆ. బుధులు రెండులోక।ములయందు ధర్మంబు, సద్గతుల నొసంగు। జనుల కనిరి
పారి సధర్మ ముభయ।భువనవాసంబులఁ, బాతనంబుఁ గొలుతు। వటులు సెప్పుడు.

క. గురుధర్మాన్వితు లగుస, త్పురుషులు విడువంగ నగును। భూభాగమునన్
బర లలనాసంగమమును, నిరతము గురుమానసముల। నిలిచి దితిజా! 327

క. పరకాంత లేకవింశతి, నరకంబులఁ జేరునట్లు। సలిఁజేయుదు రి
ధర నఖిలవర్ణులకు సు, స్థిరధర్మమె యుక్త మనుచుఁ। జెప్పిరి పెద్దల్. 328

మ. పరదారార్థములందు నిత్యము మహా।వాంఛన్ బ్రవర్తించు దు
ష్పురుషుం డారయ రౌరవాఖ్యనరకం।బుం జెందుఁ బెక్కేండ్లు వి
స్తరదుఃఖస్థితి నంచుఁ దెల్పె హరికిన్। సర్వాశనస్వామికిన్
సరవి న్మౌనివరుండు నా నసితుఁడో। సర్వాసురాధీశ్వరా! 329

క కనుకఁ గవి దూరముగఁ బర, వనితల విడనాడ నగును; । భామలు నిక్కృతా
త్మను బరిభవమును నరులకు, ననయము సమకూర్చుచుండు। రవనినిఁ గనుమా.

అంధకుఁడు ప్రహ్లాదునిఁ దిరస్కరించి శంకరుని మారునికడ కరుగుట.

క. మునివర! ప్రహ్లాదుం డిటు, లన నంధకుఁ డతనితోడ। ననె ధర్మరతిన్
దనరిలి నీ వొకఁడవె నేఁ, గన ధర్మముఁ జేయువాఁడఁ। గాను ధరిత్రిన్. 331

మ. అని ప్రహ్లాదునితోడ నంధకుఁడు ని।ట్లావేళ వాక్రుచ్చె చెం
తన వర్తించెడిశంబరున్ గని యనెన్। దైత్యేశ! రుద్రేశుఁడై
ఘనతన్ జెందినమందరాద్రికిని వే।గం బేగి గంగాధరున్
గని భాషింపు మదెట్టు లన్న విను కాం।తన్ దాని నేఁ బల్కెదన్. 332

మత్తకోకిల. ఓరిభిక్షుకుఁడ! సుందరంబుగ నొప్పి।నాకసమంబునై
భూరిదీప్తి వెలుంగుమందర।భూధరంబును నేలఁగా
వారకేఁ బరిరక్షఁ గూర్తువొ। వానిచే నిది దత్తమై
ధారణిన్ వొలుపారె నీకొగి। దానిఁ బల్కు నిజంబుగన్ 333

ఆ. వాసవాదిదేవ।వరులు నాయానతి, యందు బద్ధబుద్ధి। నలర నీవు
ననుఁ దిరస్కరించి। సతి నీమహాగిరి, నయి వసించుచున్న।వాఁడ వేల? 334

క. నీ కివరనగ మిష్టం, బై కడఁగినయడల నిప్పు। డాడడినుడులన్
కోని చేయుము నీసతి, నా కిడు మని పల్కు ప్రమథ।నాథునితోడన్. 335

మ. అని యిట్లాతఁడు పల్క శంబరుఁడు ప్ర।త్యాసక్తుఁడై మందరం
బునకుం బోయి యుమాసమేతుఁ డగుచుం। బొల్పారు గౌరీశునిం

గని వాఁ డన్న తెలుంగుఁబల్కు సతి యా । కాత్యాయనీదేవి సొం
పున నాలించుచు నుండ నయ్యెడను శంభుం డాడె నీకై వడిన్. 336

మ. దనుజా! వాసవుఁ డిచ్చె నీకునమహాచ్ఛత్రంబుఁ దమిఁ దాని నా
తని దౌనానతిలేక పీడ నగునే । తర్కించి నీ విప్పు డి
మ్మనుచుఁ బల్కిన శైలరాజసుత పో । నానే స్వకామంబుఁ దా
ల్పను శక్తుండను! గా నటంచుఁ గడఁక । న్భాషించె మానీశ్వరా. 337

ఆ. అంత నట్టిదనుజు । నంబిక పొడఁగాంచి, దైత్యయంధకాఖ్య । దనుజుఁ జేరి
నేను బలుకునట్టి । నీతిభాషణములఁ, బలుకు మనుచు నిట్లు । పలుకసాగె. 338

సీ. నేఁ గాలిబంటనై । నెగడుదు నని శంభుఁ డట్టివాఁడును నయి । యలరుమమ్ము
వడిఁ బ్రాణదూతను । బంపె యువ్వాఁడుచంపఁ గలఁ డోవాఁడు ఫలంబు । గాంచుననుచు
నాడ శంబరుఁ డంధ । కాసురుకడ కేఁగి పార్వతి చెప్పిన । పలుకు లెల్ల
వినిపింప దానిని । విని వాఁడు క్రోధాతుఁ డగుచు నిట్టూర్పుల । నదరఁ జేసి

తే. వినికి దుర్యోధనాసురుఁ । బిలిచి దుష్ట, శీల యగుపార్వతికి భీతి । చెలఁగ గాఢ
చటులసాన్నాహిక యనెడి । సమరభేరి, దెసలు ఘూర్ణిల్లఁగొట్టుము । ధీరులెన్న

దుర్యోధనాసురుఁ డంధకాజ్ఞాపితుండై రణభేరిఁ గొట్టుట.

మ. అనఘా! వాఁ డిటు లంధకాసురునిచే । నాజ్ఞాపితుండై మహా
దనుజాళ్వస్మయమంద నంత బలిమిఁ । దర్పించి ప్రాణంబుఁ
తిని భేరి న్వడిఁ గొట్టె నద్ది బలుఁడై । దీపించుచున్నట్టి యా
దనుజగ్రామణిచేతఁ దాడితమునై । తల్లోకత్తి చిత్రంబుగన్. 340

తే. భైరవాకారమునఁ జాలఁ । బరఁగుభయద, రావమొనరించె రాసభ । రవముమాడ్కి
నట్టి భీకరనాదంబు । నాలకించి, దైత్యదానవు లెల్లను । దల్లడిలుచు. 341

క. ఈనాద మేమొకో యని, మానుగఁ దర్కించుకొనుచు । మహితాశ్చర్యా
ధానమతు లొప్ప వడి నా, దానవపతి సభకుఁ జనిరి । తాపసవర్యా! 342

క. చను దెంచినరక్కసులను, గనుఁగొని సేనేశ్వరుండు । కలతెలుఁగును జె
ప్పిన నాపటుబలదానవ, ఘను లతిసన్నద్ధు లగుచుఁ । గలహేచ్ఛఁ దమిన్. 343

అంధకాసురుఁడు సబలుఁడై శివునిపై యుద్ధమున కరుగుట.

మ. ఘననాగోష్ట్రరథాశ్వులై వెడలి రా । క్రవ్యాదనాథుండు క్ర
న్నన దివ్యోన్నతపంచనల్వపరిమా । ణం బొప్పుచున్నట్టి స్యం
దనముఁ ధీరత నెక్కి శంకరునియు । ద్ధప్రక్రియఁ గెల్వ నెం
చినచిత్తంబున నేఁగ దేవతలు ని । శ్చేష్టాత్ములై రాయెడన్. 344

సీ. జంభాసురుండును । శుంభుఁడు హుండుఁడు బలవంతులైన శం । బరకుహుండ
ఖాణకా ర్తస్వర । భాస్కరరిపుహస్తి దైత్యనాథులు మహో । దరుఁడు శిబియు

కార్యుండు వృషపర్వ । శంకుకర్ణులు విరోచనహయగ్రీవులు । సంహ్రాదుండు
కాలనేమియు ఘోర । కాలాననుండును పలులులు నగుచున్న । సరభవృత్ర

తే. వలులు దుర్యోధనుండు విపాకపాక
దానవేశులు మఱి పటు । దర్పవీర్యు
లైనబహుదైత్యు లని సేయ । నఖిలశస్త్ర
పాణులై వేఁడ్క వెడలిరి । వసుధ కదల 345

చ. పరమమునీంద్ర! యిట్లసుర । పాలుఁడు దుర్జనుఁ డైనయంధకా
సురుఁడు రణస్థలిన్ బలిమి । శోభిల శంభునితోడ ఘోరసం
గర మొనరించుకోర్కె మదిఁ । గ్రాలఁగఁ గాలవిషాశబద్ధుఁ డై
గురునగ మైనమందరముఁ । గూడఁ జనె న్వరమాద్భుతస్థితిన్. 346

ఆ. శర్వుఁ డపుడు సమర । సన్నాహుఁడై నంది, గాంచి యుష్మదాజ్ఞఁ । గ్రాలునట్టి
పర్వతాదులైన । ప్రమథగణంబులఁ, బిలువు మన నతండు । ప్రీతి నంత. 347

క. గిరిశునివచనంబునఁ, బరువడిఁ జని జలము నంటి । భావములోనన్
స్థిరభక్తిని గణనాథులఁ, గరమర్థిని సంస్మరించెఁ । గమ్రుచరిత్రా! 348

చ. అతిముతి నందిసంస్మృతులు । నై గణనాయకులెల్ల సుస్థలిన్
వెలుఁగు జనింపుచుండఁగను । వేలకొలందిని బైకిలేచి చె
చ్చెఱ నరుదెంచి నందివిభుఁ । జేరి శిరస్సులు వ్రాల్చి మ్రొక్కి ర
త్తతిఁ జనుదెంచినట్టి ప్రమ । థప్రభులం గని భక్తి మీఱఁగన్. 349

నంది హరునకుఁ బ్రమథాదిగణనిరూపణముఁ జెప్పుట.

సీ. నాశంబులేనట్టి । నంది వారికి మ్రొక్కి యందఱ నభవుని । కపుడు తెలుపఁ
బూని భాషించెను । మూఁడుకన్నుల నొప్పి పావనులై జటా । పటలకాంతిఁ
గడఁగెడివీర లే । కాదశకోటిరుద్రులు మర్కటాననా । రుచులవలన
వెల్గుచు శార్దూల । విక్రమగురుయశోధనముల నెప్పుడు । ఘనత నొందు

ఆ. వీరు ద్వారపాల । వీరు లీశూరులు
షణ్ముఖముల ఘోర । శక్తిహస్త
ముల నెమిళ్ల టెక్కె । ముల నొప్పి యఱువది
యాఱుకోట్లు స్కందు । లగుదు రభవ!. 350

ఆ. శర్వ యట్ల యివ్వి । శాఖాఖ్యఁ గలమహా, నైగమేయగణము । లిగతి యగు
సరవి సప్తకోటి । శతసంఖ్య నొప్పారు, నట్టి ప్రమథవర్యు । లగుదు రోలి.

క. కల రొక్కకనికి శతమా, తలు కనుఁగొనుభస్మమిళితతనులును ముక్కం
టులు శూలకరులు నగువీ, రలు శైలగణాధిపతులు । రాక్షసదమనా!. 352

క. వరభూతిప్రహారణులై, పొరి దీప్తిగ భాసురతులు । పొంగారుచు నా
కరణి నసంఖ్యలుఁ గా వచ్చిరి సాయముగొలుకు నీకుఁ । దేవ చెలంగన్. 353

వ. దేవా! పినాకములం బూని మహాభయంకరులై కాలముఖంబుల నేపారి భవద్భక్తి నలరురుద్రగణవీరులును, రక్తచందనముల మేనుల నలందుకొని దిగ్వస్త్రులై దివ్యమాలల ధరించి గంటలవాయించుచుండు నిరాశ్రయాఖ్యయోధగణవీరులును, సార్ధద్వినేత్రములరాణించుచుఁ బద్మనేత్రముల విలసిల్లి శ్రీవత్సాంకితవక్షులై నాశములేక వృషభకేతనంబులఁ దేజరిల్లుచుఁ బతులపై నుండినభూతగణేశులును, చక్రశూలములఁ దాల్చినమహాపాశుపతగణంబులును, భేదరహితుఁడును సర్వపూజితుఁ డగునారాయణుఁ గూడినభైరవుండును, శూలచాపశరంబులఁ గరంబులఁ దాల్చి భవద్గోత్రసంజాతు లగుసింహావదనులును, మఱికొన్నిభూతజాలము లిపుడు సాహాయ్యంబుకొఱకై వచ్చిరని భాషింప నట్టియెడ భూతగణంబులెల్ల నేతెంచి భవునకు నమస్కరించి నిలిచినఁ గాంచి శివుఁ డాగణనాథుల సత్కారమునఁ గూర్చుండ నియోగించి మహాపాశుపతులఁ జూచి లేచి యెదురేఁగి గాఢాలింగన మొనర్చిన వారలిభక్తి మహేశ్వరునకు మ్రొక్కి పిదప నట్టిపెద్దవింతను జూడఁగాంచి గణేశ్వరు లట్టిచిత్ర మేమని చింతించుచు విస్మితులైరి అట్టితఱిఁ ద్రినేత్రు లగుగణేశుల నాలోకించి యోగివర్యుఁ డగుశైలాది నవ్విశూలహస్తుఁడును సర్వభూతాధినాథుఁడును నగు గంగాధరునకు మ్రొక్కి యిట్లనియె. 354

చ. పురహర! నీవు పాశుపత। పుణ్యగణంబులఁ గౌఁగిలించి నా
దరమలితో మెలంగినక। తంబున విస్ఫుటలోకబృంహకం
బరలి గణాలికిం జోడమె। నట్టులె జ్ఞానవిశేషరూపముల్
పరఁగును స్వేచ్ఛ వారికని। బాగుగ దానినిఁ దెల్పు సత్కృపన్ 355

— శివుఁడు హరికిని దనకు భేదములేదని ప్రమథులకుఁ జెప్పుట. —

క. అన భూతభావనుం డా, ఘనుఁ డాడినుడుల నపుడు। కరుణ న్వాని శం
కనుఁ జెందినగణనాథులఁ, గని యిటు భాషించె మౌని। గణ్యులు మెచ్చన్.

సీ. హరుఁడనా నునుభక్తి। నర్చించి వైష్ణవభవ్యపదంబు గర్వంబుతోడ
నలరి నిందించిరి। రట్టిదాజ్ఞానంబుచేత సాదృశ్యంబు। చెడను మీకు
నజుఁడును భగవంతుఁ। డగుహరి నే నాదు; నిత్యుఁడ నైనట్టి। నేన చక్రి
నగుదు; మాయిరువురి। యందు లేదు విశేష; మెసఁగ రెండుగ నిట్టి। లేకమూర్తి

ఆ. తాన భక్తిభావ। గణ్యులు నరసింహు
లైనభూతగణము। లార! నేను
తెలియఁబడితిఁ; జక్రి। లిచిరి మీచేఁ దెలి
యంగఁ బడనివాఁడు। నయ్యెఁ జూడ. 357

ఆ. హరి యనిందితుండు। నయ్యె మీచే నట్టి, కారణమున మీకు। జ్ఞానశూన్య
మయ్యె నందువలన। నాలింగనంబు నా, వలన లేనిదయ్యె। వాస్తవముగ. 358

సీ. అనఘ! యిట్లు పురారి । యన గణాధిపులు పల్కిరి పార్వతీ । ప్రాణనాథ!
నీవు మనోజ్ఞాన । నిర్మలుండవు నిరంజనుఁడ వక్షరుఁడవు । శాంతినిధివి
శుద్ధకాయుండవు । శుద్ధస్ఫటికవర్ణసముఁడవై యుందు వా । శౌరి విలస
దంజనసంకాశుఁ । డగునాతనికి నీకు నైక్య మేరీతితో । నడరె ననిన
తే. నభ్రకేశుఁ డాగణా । ర్థాధ్యవాక్య, సరణి విని నవ్వి మేఘని । స్వనము రీతిఁ
బలికెఁ జెప్పెద మీకు స । ర్వస్వకీర్తి, వర్ధనం బైనమాటను । భక్తి వినుఁడు.

— హరుఁడు ప్రమథగణములకు శివకేశవైక్యంబుఁ జెప్పుచు విశ్వరూపంబుఁ జూపుట. —

మత్త జ్ఞానమందున మీరు యోగ్యులు । కారె? యట్టిఁడు లైన నే
మానుగా నపవాదభీతిని । మానితంబయి ప్రీతి నా
మానసంబున నున్నగుహ్యము । మాన్యులెన్న వచించెదన్
గాన మీరట జ్ఞానవైఖరిఁ । గాంక్షతో వినుఁ డిత్తఱిన్. 360

క. నను నేకరూపకాయునిఁ, గను జేసియు జ్ఞానవాంఛఁ । గడఁగెడు మీ రిం
పున నభిషేకింపుఁడి పాలను హవ్యాదులను భక్తి । లాయుచు నుండన్ 361

ఆ. అమలదివ్యచంద । నాదులతో నాకుఁ
గలుగ దెపుడు ప్రీతి । కాన అంప
ముసు ధరించి కడిమి । పూన్కి నా కాయంబుఁ
గోయఁ డట్టులైనఁ । గొమరు మిగుల 362

క. కనఁబడు నస్మద్విగ్రహ, మున మధుసూదనుఁడు దివ్య । పురుషుండు మహా
దనుజహరుఁ డైన శ్రీహరి, ఘనతర మగుదీప్తితోడ । గణవరులారా!. 363

క. హరిభక్తుఁ డైనమానవ, వరుఁ డేకాహారమునను । భాసిల్లెడిస
త్పురుషుఁడు సము లీయిద్దఱు, ధరపై సంశయము లేదు । తర్కింపంగన్.

క. వినుఁ డీలోకము చెప్పను, నన నెవరికి నైన భేద । గతి వెల్లడిత్రో
వను విస్మయమగు మీకర, మున నర్థము నిడను భేద । మున నలరుటచేన్. 365

సీ. నళినాక్షుఁడును లోక । నాథుఁడు కందర్పసన్నిభకాయుఁడౌ । శౌరి మీరు
నిందింపఁదగినట్టి । నిత్యైశ్వరుం డప్పు సర్వస్వరూపుఁడు । సకలభూత
గణనాథుఁ డఖిలలో । కవ్యాప్తుఁ డగుచుండు నతనికిఁ దుల్యుఁడై । యవఘళించు
జనుఁ డెవ్వఁడును జరా । చరములలో లేఁడు పరికింప నాథగ । వానుఁ డలమిఁ
ఆ. పాండురక్తపీత । వర్ణుఁడు నగుచుండు
వానికంటె నన్య । వసు వెట్టి
దైనలేదు త్రిగుణ । రైయి సదాశివమూర్తి
నలరి లోకపూజ్యుఁ । డగుచు నుండు. 366

ఆ. శంభుఁ డిట్టు లనఁగ । శైలాదులౌ ప్రమ
థేంద్రు లాడి రోమ । హేశ! మాకుఁ

బరమదయ సదాశివప్రభావోన్నతి
విస్తరించి చెపుము । వీను లలర. 367

శివుఁడు ప్రమథులకు నద్భుతమూర్తిఁ జూపుట.

క. మునివర! ప్రమథేశులు చెప్పినమాటల నీలగళుఁడు । విని వారికిఁ జూ
పెను నాశివసద్రూపం, బును దెలిపెద దాని వినుము । పూర్ణప్రీతిన్. 368

సీ. శతసహస్రసుచక్రచరణదారుణదండ భుజముల రాజిల్లి । భువనభాగ
తలములయందెల్ల । దట్టంబుగాఁ బర్వి తాన నశక్యమై । గరళకంఠు
గాఢస్వరూపంబుఁ । గనుఁగొని దేవతాప్రహరణ దండోరుభద్రవాస
ములఁ జూచి యోగణముఖ్యు లేకముఖంబువలన రాణించెడిభవునిఁగాంచి

ఆ. పిదపఁ బార్వతీశ । విష్ణుచిహ్నంబుల, వేయివిధము లగుచు । వెల్లు రూపుఁ
గాంచి యర్ధవిష్ణు । కాలారివిగ్రహ, కలిత మైన మూర్తిఁ । గనిరి మఱియు.

వ. మునీంద్రా! విను మంత నాపరమేశ్వరుని లీలాస్వరూపంబు కొంతవడి వృషభారూఢగరుడకేతనవిరాజితంబై మఱికొంతదనుక నాగాంతకారూఢ వృషధ్వజవిలసితంబయి చూపట్టె. అయ్యెడ సద్గుణగణమణి యగు త్రినేత్రుఁ డేయే సమయముల నెట్టెట్టిరూపముల ధరించునో యన నట్టట్టి మహాపాశుపతగణంబు లుద్భవించిరి. పిదప నిట్లు పెక్కుమూర్తుల నక్కజంబుగఁ దాల్చిన ముక్కంటి యొక్కరూపమును ధరించి తత్కాలక్రమంబుగ శుక్లరక్తపీత నీల మిశ్ర వర్ణుండుగను విగతవర్ణుండుగను మహాపాశుపతరూపుడుగను రాణించి బ్రహ్మన రుద్రేంద్రశంభుప్రభాకరవిష్ణుపితామహసమమూర్తుల నలరె. అంతఁ దదద్భుత దివ్యరూపమును జూడఁగని గణేశ్వరులు విస్మితులై పరమేశ్వరుఁడు బ్రహ్మ శౌరి వాసవ భాస్కర తుల్యైక్య విగ్రహుండనియును సనాతనుఁడనియును దేవ దేవుండనియును భేదరహితుండనియును భావించిరి. దాన నాపార్షదులు నిర్ధూతకల్మషులైరి. వారిట్లభేదులును విగతపాపులు నై తేజరిల్లుచుండ హరీశ్వరుం డగుశర్వుండు సంతుష్టాంతరంగుఁడై భాషించె. 370

ఆ. సువ్రతాత్ములార! । సొరిది మీజ్ఞానంబు, చేత నేను ముదముఁ । జెందినాఁడ
నిడుదుఁ గోరుఁ డాత్మ । నెసఁగుకోరికతోడ, నలరి కొలఁదిలేని । దైవవరము.

ప్రమథులు భేదరహితపాపనిరసనవరంబుఁ గోరుట

చ. పరమమునీశ! శంభుఁ డిటు । పల్కఁ గణేశ్వరు లాడి రీశ్వరా
పొరిఁబొరి భేదదృష్టిమెయిఁ । బుట్టినపాపము లెండిపోవ నా
వరమును మాకు నిమ్మనుచుఁ । బ్రార్థనసేసిన మంచి దంచు శం
కరుఁ డొగి వారిని న్విగత । కల్మషభావులఁ జేసి ప్రీతితోన్. 372

క. విను తా వ్యక్తస్థితితోఁ, దొనరెడియాసుగుణగణముఁ । దొంగారెడిబు
ద్ధినిఁ దనకౌఁగిటఁ జేర్చెను, మనసిజమారుఁ డైనశివుఁడు । మానిలలాక్షా! 373

తే. అంతఁ బ్రణతార్తిసంహారుఁ । డఖిలనిర్జ,రావతంసుండు మేఘుర । ఘాన్వితుండు
నైనశంభునివలన వా । రట్టిమంద, రంబుపై మానితులునైరి । రహిఁ జెలంగ 374

చ. ప్రమథగణోత్తమై శివుని । పాదయుగంబున నొప్పి శ్వేతకా
యమునఁ జెలంగుమందర । గాఢ్యము నల్లనిలోలుతో విశే
షముగను గూడుకాయమునఁ । జాలఁ దనర్చుచు శారదాభ్రవ
ర్ణము కలపార్వతీశ్వరుని । రమ్యవృషంబును బోలి రాజిలెన్. 375

తే. కమలలోచనపార్వతీ । కాంతు లేక
రూపమున నొప్పి నిత్యము । రూఢి వెలయఁ
దెలివి లేనట్టిమనుజు లీ । తెలుఁగు నెఱుఁగ
రైరి భిన్నత్వపరణుల । నలరు మతుల 376

క. అని యుక్కివడి సతేఁ దన, విని నారదుఁ డామునీశ । విభుఁ గని పలికెన్
మునిచంద్ర! యంధకుం డే, పనిఁ బిమ్మటఁ జేసె దాని । భావం బలరన్. 377

వ. భాషింపు మనుటయు 378

క. నీరజలోచన సత్యా, ధార సువర్ణాద్రిధీర । ధర్మవిహారా
కారుణ్యాకర నిత్యా, చార మహాశూర రామ । చంద్రనరేంద్రా! 379

మానినీవృత్తము. పావనతాపస భావకులోశయ । భాస్కరబంధురకీర్తిధరా
ధీవర సంతతవీర మహోన్నత । దీప్తశరాసన దివ్యకరా
భూవర దుర్జనపుంగవకుంజర । పుంగమృగేశ్వర పాపహరా
పావనిసేవితపాదసుపుష్కర । భానుకులాంబుధిశీతకరా!. 380

తరల. వరదపావన భద్రమానస । భక్తసంచయపాలనా
గరుడకిన్నరసిద్ధచారణ । గణ్యవంద్యనికేతనా
పరమభూషణ పాపశోషణ । పండితస్తుతభాషణా
ధరణిజారమణా సురాధిప । తల్లజానిశభీషణా!. 381

గద్య. ఇది శ్రీరామకరుణాసమాసాదితకవితాప్రాభవ, హరితసకులాన్వయప్రభవ, రామవజ్ఝలవంశదుగ్ధసాగరసుధాకర, కొండయకుమార, బుధజనవిధేయ, కొండయనామధేయప్రణీతమగు తెలుఁగువామనపురాణము నం దష్టమస్కంధము.

శ్రీరామార్పణమస్తు.

శ్రీ ర స్తు.

శ్రీసీతాలక్ష్మణభరతశత్రుఘ్నహనుమత్సమేతశ్రీరామచంద్రాయ నమః.

# తెలుఁగు వామనపురాణము.

## నవమస్కంధము.



రఘువంశవిశాలో
దారాంబుధిచంద్ర! ధర్మ।తలినిస్తంద్రా!
కారుణ్యభావసాంద్రా!
సారమహాచార! రామ।చంద్ర నరేంద్రా!. 1

క. అవధారు పులస్త్యముని, ప్రవరుఁడు నారదునిఁ జూచి। పలికెను బ్రహ్మో
ద్భవ! యంధకుండు దానవ, నివహంబులఁగూడి యపుడు। నీటుచెలంగన్. 2

చ. కదలినవాఁడు నై ప్రమథ।గణ్యసమాశ్రితకందరంబులన్
గదిగొని శైలపత్యమునఁ। గ్రాలి లతాతరుపుష్పసంహతిన్
బొదలెడిమందరంబునకుఁ। బోఁ బ్రమథేశులు వారిఁ జూచి వే
పొదలెడికోపతాపములు। బుద్ధులఁ దద్దయు దందడింపఁగన్ 3

క. పలువిధములఁ గిలకిలరవ, ములుచేయుచుఁ బెక్కుతూర్య।ముల వడి సంర
బ్ధులు నై మొత్తిరి వేల్పుల, చెలు లచ్చర లెల్లఁ జూచి। చిత్రపడంగన్ 4

శా. ఆవిస్తారనినాద మంత లయకా।లారావతుల్యంబు నై
దీవన్ బుష్కరభూమిభాగములలో। డీకొల్పఁగా సాగఁ ద
ద్రావంబున్ దగఁ బుష్కరస్థలమునన్। దల్లోకత్రువిఘ్నేశ్వరుం
డావేళ న్విని క్రుద్ధుఁడై ప్రమథది।వ్యానీకసంయుక్తుఁ డై. 5

ఉ. భాసురకందరంబులను। భాసిలి శైలగణంబులందుఁ బ
ల్యాసునిఁ గాంచు మందరము। బంధురవేగముతోడఁ జేరి ది
గ్వాసుఁడు తండ్రి యైనహరు।భక్తినిఁ గాంచి నమస్కరించి యో
దాసశరణ్య! యంచు నులిఁ। దద్దయు నర్చుచుఁ బల్కెఁ దాపసా!. 6

గాణవిఘ్నేశ్వరు లంధకుఁ జంపు మాయనిఁ బొత్తునుట.

ఆ. భువననాథ! దైత్య।పుంగవు లనిసేయు, వచ్చి నిలిచియున్న।వార లూర
కుండు వేల విగ్ర।హోత్సవరతబుద్ధి, వెలయ లెత్తు ప్రమథ।వీరు లెన్న. 7

క. మునివర! విఘ్నేశ్వరుఁ డ, ట్లనఁ గంగాధరుఁడు పలికె । నని నంధకుఁ జం
పను బోవుచున్నవాఁడను, బనిఁ గాని నే నప్రమాద । పద్ధతి ననుచున్. 8

ఆ. అపుడు గౌరి సారె । కభవునిఁ గౌఁగిటి, యందుఁ జెలిమిఁ జేర్చి । యామహేశుఁ
గాంచి యంధకాఖ్య । కర్బురేశునిఁ గూల్పఁ, జను మటంచుఁ బలికె । సారభక్తి.

చ. అలరుచు రోచనోజ్జ్వలము । నై తనరారినచందనంబు ని
శ్చలమతిరైై పురారిపద । సారసయుగ్మమునం దలంచుచుఁ
బలుమఱు మ్రొక్కి సంతసిలె । భర్గుఁడు నెచ్చెలి యైనమాలినీ
లలనను జూచి యంత నని । లాలితసూక్తులతోడ నర్తితిన్. 10

సీ. వెలఁదిరో! నీవును । విజయయు జయయును నపరాజితయునా జ । యంతికూడి
మాటిమాటికి నప్ర । మత్తలై గిరిజను మానితరక్షి । తమందిరమున
భద్రముగా నుంచి । పాలింపుఁ డనియిట్టు లభవుఁ డాచెలులతో । నాడి వృషభ
మును నెక్కి తనగృహ । మునను౦డి ముదమున వెడలె నారుద్రుని । వెంటనంటి

ఆ. గణము లరుగుచుండ । గణనాథు లావేళ, నట్టిమందిరమ్ము । నందు నుండి
విజయశబ్దములను । వేడ్కతోఁ జేయుచు, వెసలి రలనివెంట । విపులశక్తి.

హరుఁ డంధకుపై నరుగుట.

క. జగదవనుండు మహేశ్వరుఁ, డగణితవీర్యుండు శూల । హస్తుండు మహా
సుగుణియు నగుఫాలాక్షుఁడు, పగతుర సమయింప ననికి । వచ్చెడివేళన్. 12

క. గురుతరశుభసౌమ్యస్థితిఁ, బరఁగెడిచిహ్నములు జయము । బాగుగ శ్రీకం
ఠునకుఁ గలిగెడిరీతిని, సరవిఁ బ్రశంసింపసాగె । సజ్జను లెన్నన్. 13

చ. సురసనినాదము న్మృగుల । శోభిలఁ జేయుచు నక్కలింపుతో
నరిగెను వామభాగమున । నామిషజగ్ధినిఁ గోరు రాక్షసో
త్కరములు శోణితార్థులయి । గాఢపుఁదృష్ణ జెలంగ నేగ శం
కరుని నఖాంతరక్షణవుఁ । గాయము కంపముఁ జెందెఁ దాపసా!. 14

తే. శకునిహారితపక్షులు । సత్వరమున
నరుగఁ జొచ్చెఁ బరాఙ్ముఖ । లగుచు నట్టి
వరనిమిత్తంబులనుగాంచి । బహుళభూత
భావనుం డాద్యుఁ డైనట్టి । భర్గుఁ డంత 15

క. తనమొగమునఁ జిరునగ వాగిఁ, చెనఁగొన శైలాదిఁ జూచి । విను మని పలికెఁ
గనఁబడె నిమిత్తములు జయ, మొనరుఁ బరాజయముకలుగ । దూహింపంగన్.

తే. అంత నలిఁడు మహేశ్వరుఁ । డాడినట్టి
భాషణంబుల నాలించి । భవ! మహేశ!
సమరమున గెల్వ శాత్రవ । సమితి నెల్లఁ
శాలి వని యిట్టు లారతిఁ । బల్కె యంత. 17

సీ. పరమమహాపాశుపతగణంబులనెల్ల నందీశరుద్రగణముల నెలమి
సమరంబులో నెదు నాజ్ఞాపించు వారంతఁజని బహుశస్త్రాస్త్రసహితు లగుచుఁ
బెదుగుతాఁ జెట్లను జెండి చేసినమాడ్కి వడి దైత్యబలముల బాధపెట్టఁ
దద్బాధితులును నై దైత్యదానవులనిఁ బ్రమథుల గాఁచింప బహుళకూట
ఆ. ముద్గరముల హస్తములఁ బట్టి తమి రాఁగ, వాసవాదిదేవవర్యు లట్టి
కలహచిత్రగతినిఁ గనులారఁ గనుఁగొను, వలఁపుతోడ దివిని వఱలి రంత.
క. దుందుభిభవ్యకవిప్రియ, బంధురగీతాదివాద్య భాసురమగుచుఁ
సుందరసుస్వరఘోషము, పొందికతో నభమునందుఁ బుట్టెను బిదపన్. 19

—ప్రమథరాక్షసులద్వంద్వయుద్ధము.—

క. సురవరులందఱు కనుఁగొనఁ, గరము మహాపాశుపతులు గణనాథాదు
ల్గురుకోపమడర రాక్షస, పరివారముఁ బడమిఁదోలఁ బడఁగొట్టి రాగిన్. 20
క. ధరగణనాథులచే నీ, సగణిక చతురంగబలము సమయుటఁ గని దు
ర్ధరకోపుఁ డగుతుహుండా, సురుఁ డనిఁ గావింపవచ్చె సుర లదరంగన్.
ఆ. కట్లు మూఁడుకలిగి కడు ఘోరమూర్తితో
నెసఁగుచుండునట్టి యినుపగుదెను
హస్తమందుఁ దాల్చి నది వెల్గె నింద్రధ్వ
జోపమాన మగుచు సురుగుణాఢ్య! 22
క. అట్టిదుపరిఘము నారఁడు, కట్టల్కను ద్రిప్పి ప్రమథగణనాథులపై
దట్టించి వైవ వెలచుచుఁ, గొట్టిరి వారలని మరల ఘోరాస్త్రములన్. 23
క. అని భగ్నమయినబలమును, గని సర్వగణేశుఁడైన గణనాయకుఁ డా
దనుజానిమిదికి రయమునఁ, జనుదెంచెను గోపమాత్ముఁ జాల వెలుంగన్
క. అరుదెంచుచున్న విఘ్నే, శ్వరుఁ గని యాదుష్టుఁ డశనిసమపరిఘంబున్
బిరబిరఁ ద్రిప్పుచు వైచెను, గవమాతని నెత్తి నడుమఁ గ్రౌర్యం బొప్పన్.
క. చని యది తత్కుంభాంతర, మునఁ బడి స్వర్ణాద్రిశిఖరమును దాఁకినశ
క్రునివజ్రముచందంబున, ననిఁబడె శతవిధము లగుచు నతిరావమునన్. 26
క. పరిఘము భగ్నస్థితితోఁ, బరఁగినఁ గని వచ్చు విఘ్నపతి నారఁడు దు
స్తరకరపాశముతోడను, బోరి వడి లాగుచును గట్టి భుజబల మొప్పన్. 27
క. దారుణముద్గరమున నా, వీరునితల నదర వ్రేయఁ బృథుకోపముతో
హేరంబుం డా రాక్షస, శూరుఁ బరశ్వథముతోడ స్రుక్కఁగఁ గొట్టెన్. 28
ఆ. అడఁచెఁ గట్టె పగిలినట్టుల రెండుఁగ, వాఁడు చీలి పుడమి వ్రాలియున్న
వాఁడు నయ్యు నాగవదనునిఁ గరముల, విడువకుండె నంత విఘ్నవిభుఁడు.
క. శరమోక్షణప్రయత్నము, సరసరఁ గావించి వికటశక్తిస్ఫూర్తిన్
బరఁగుచు నుద్దఁగఁ గుంఠో, దరనాయకగణేశుఁ డట్టి దైత్యుకరములన్. 30

క. నలిగెడుగణపతిఁ గనుఁగొని, చలమున ముసలంబుఁ బూని । చని వాని కరం
బుల వడి నామహనీయుండు, విలసిత మగుశక్తి నడిచె । విబుధులు మెచ్చన్.

ఆ. అంతఁ గలశకేతుఁ । డగుగణపతిపూన్కి
రాహునామఁ డైన । రాక్షసేంద్రు
హృదయతలముఁ జించెఁ । బృథుతరప్రాసంబు
తోడఁ బ్రమథగణము । తుష్టి నొంద. 32

క. మునినాథ! కుమాండాసురుఁ, డనిఁ గూలను రాహుదైత్యుఁ । డరరి విముఖుఁడై
చనఁ బంచవీరగణపులు, మనముల రోషంబు మిగుల । మల్లడిసెందన్. 33

చ. ప్రళయధనంజయోపములు । బాహుబలాఢ్యులు నై మహోద్ధతిన్
జెలఁగుచు రాక్షసేశ్వరుల । సేనలమధ్యను జొచ్చి యామహా
బలములఁ జంప భూరిబల । బంధురుఁడై బలిదానవుం డనిన్
మలసెడునార్తసేనఁ గని । మారుతవేగసమున్నతస్థితిన్. 34

సీ. గదఁ గరంబునఁ దాల్చి । గణనాథుకరకుంభకటములపైఁ గొట్టి । కలహవిముఖుఁ
జేసి కుండోదరు । శీర్షహస్తకపాలములఁ జించి కావించి । మోహరించి
కుంభధ్వజాఖ్యుని । ఘూర్ణితసంధిబంధనునిఁగ నొనరించి । లేమి ఘటోద
రాభిధేయుని గురు । హస్తాదిసంధుల భిన్నంబుఁ గావింప । బెదరి వారు

తే. విముఖులై పోయి రంతట । విశ్వవిభుని
గణములను గాంచి పటుశౌర్య । కలితుఁ డగుచు
నాశరేశుఁడు రేఁగి స్కం । ధాదియోధ
వర్యులనుఁ జంపఁ దిరుగుచు । వచ్చె నంత. 35

క. అరుదెంచెడు నారాక్షస, వరుఁ గని భగవంతుఁ డైన । భర్గుండు గణే
శ్వరుఁ డగు శైలాదిని దన, పరిసరమున కపుడు పిలిచి । పలికె మునీంద్రా!.

క. అనిలో నీవాఁగి నీకు, ర్జనుఁబట్టి వధింపుమన్న । శైలాదసుతుం
డనిశరమతి హరువాక్యం, బును విని చక్రంబు హస్తమునఁ గొని పెలుచన్.

చ. చని బలిదైత్యుఁ జేరి పటు । శక్తిని వానిశిరంబుఁ గొట్ట నా
దనుజుఁడు మూర్ఛనొంది వసు । ధాస్థలి వ్రాలఁ గుజంభుఁ డత్తతిం
జనిఁ దనభ్రాతృనందనుఁడు । చయ్యన మూర్ఛనుఁ గూలఁ గోప మా
త్మను చెనుగాడ ముద్గరము । మూనుగ హస్తమునందుఁ బూన్కిమై 38

తే. తాల్చి త్రిప్పుచు నందినిఁ । దరిమి చంప
నెంచి రాఁ జూచి యాదను । జేశుచేతఁ
బరఁగు ముసలంబుఁ గొని భగ । వంతుఁ డైన
నంది వానిశిరస్సును । నలియఁ బొడిచె. 39

క. మునివర ముసలముతో నా, దనుజుఁడు గరటివ్రుఁ డగుచు । ధాత్రినిఁ గూలఁగ

గని నంది వజ్రమున దిలి, తనయుల ఖండించె వడి శ।రవితతు లొనరన్. 40

తే. అపుడు గణపతివలన నా।యసురు లెల్ల, వధ్యమానులు నై మహా।భయముతోడఁ
గదలి దుర్యోధనాసుర।కడకు నేగి, శరణుఁ జొచ్చిరి కదుపడి । సంయమీశ!

క. శరణాగతులును లంటో, దరవజ్రాహతులు నైన । తద్దనుజాల న
త్తరుణమునఁ జూచి వాఁ డురు, తరకోపం బాత్మయందుఁ । దద్ద వెలుంగన్. 42

సీ. అఖిలదిగ్వాసిత । మగుపాశమును గేలఁ బూన్కితోడ ధరించి । పొలసె నంచు
నిటుపల్కి నందిపైఁ । దటుకునఁ బడవైవ నంత నందీశ్వరుఁ । డరుగుదెంచు
పాశంబు చూర్ణమై । పడఁజేసె గుహ్యాంబు చెనఁటియా పురుషుఁడు । చించురీతి
భగ్నమై పోయినపాశంబుఁ గని వాఁడు పిడికిలి పై కెత్తి । పృథులవేగ

ఆ. వంతుఁ డగుచు రాఁగ । వానిశీర్షము వజ్రి, తాటిపండుమాడ్కి । దర్పమొప్ప
వజ్రహతినిఁ గూల్చె । వాఁ డపగతజీవుఁ, డగుచు వడిని ధాత్రి । వ్రాలె నంత.

క. వెఱచుచుఁ బదిదెసలకు నత్తఱి రక్కసు లేగి రాత్మ।తనయుఁడు మృతుఁడై
వఱలుటఁ గని హస్త్యసురుం, డుఱికెను వడి నందిపైకి । నురుశౌర్యమునన్. 44

చ. అఱిగి శరాసనంబుఁ గర।మందు సముద్ధతిఁ దాల్చి కిన్క భా
స్కరసుతదండతుల్యపటు।శాతశరంబులతోడ సర్వశం
కరగణనాథులన్ ధర న।గంబును మేఘము వర్షధారలన్
సరవినిఁ గప్పుచందమునఁ । జయ్యన నయ్యెడఁ గప్పె నంతటన్. 45

తే. ఏకదంతాదిగణపతు । లెల్ల నీర
బలులు నై యుండి యాఘోర।బాణవృతులు
నగుచు సింగంబునకుఁ జిక్కి । నట్టి వైన
వృషభములమాడ్కిఁ దెసలకు । వెఱచి చనిరి. 46

వ. ఇట్లు సర్వగణేశులు విగతసారసంపన్నులై చనుచున్నసమయంబున. 47

చ. అనఘ! పరస్పరేక్షణులు । నై చనుచున్నగణాధినాథులన్
గని శితశక్తిహస్తమునఁ । గ్రక్కున స్కందుఁడు తాల్చి ధీరతన్
జని రిపువర్యునందుఁ గల।శక్తినిఁ గైకొని వానిదెందమున్
ఘననిజశక్తితో నడఁచెఁ । గార్య మవార్యము నై చెలంగఁగన్. 48

ఆ. సమరమందు శత్రు।సైన్యమధ్యంబున, శక్తి భిన్నహృదయ।సహితుఁ డగుచు
హస్తిదానవుండు । హతుఁ డైనతఱి భగ్న, శత్రుసేనఁ గాంచి । సంతసించి 49

క. కినిసి గణేశులు నందీ,శుని మ్రోలను నిల్చి రాక్ష।సులఁ గూల్పఁగ నా
దనుజాలు తహతహపడుచుం, జని రాహవభూమి విడిచి । సంయమినాథా!. 50

చ. ప్రమథులచేత బాధపడి । రక్కసు లెల్లఁ బరాఙ్ముఖస్థితిన్
భ్రమసి చనంగ భూరిబల।భాసితులై దితిజేశముఖ్యులన్

గ్రమమునఁ గూడి యాలికిని గ్రమ్మఱ రాఁ గని వ్యాఘ్రతుల్యవి
క్రముకుల నందివేషణుఁడు రద్దయుఁ గిన్కను నిశ్వసించుచున్. 51

క. కరమునఁ బట్టిసమును గొని, కర మని కరుదేరఁ గాంచి కాంతస్వరక
ర్బురుఁ డురుగదఁ గొని బిఱబిఱ, నరుదెంచె రణంబొనర్ప నత్యుద్ధతిమై. 52

సీ. వహ్నిసంతాపుఁడై వచ్చెడునాదైత్యవీరునిఁ గని నందివేషణుండు
పట్టిసంబును ద్రిప్పి వానినెత్తినిఁ గొట్ట గతదంతశబ్దుఁడై గాసిఁ గూలె
మేటిబలుండును మేనమామసుతుండు నైనకార్తస్వరుఁ డవని నీల్గ
వాలివక్త్రంబున వఱలురక్కసుఁ డొక్కఁ డలుకఁ బట్టి సయుక్తుఁ డధికవీరుఁ

ఆ. డైననందివేషణాఖ్యగణేశునిఁ, బాశమునను గట్టఁ బటుబలుండు
శక్తిహస్తుఁడైన షాణ్మాతురుఁడు గాంచి, బవర మొనరుపంగ వచ్చి నిలిచె.

వ. అట్టిరతి. 54

ఆ. అనఘ! లోహవక్త్రుఁ డధికబలాఢ్యుండు, నైనదైత్యవర్యుఁ డాగ్రహించి
కుక్కుటధ్వజుండు గురుశౌర్యుఁ డౌస్కంధుఁ, గదిసి బాణములను గప్పి కట్టె.

క. అనిఁ జిక్కనక్రౌంచారినిఁ, గని శాఖుఁడు నైగమేయగణవర్యులు పెం
పున గనుకోపముతోనా, దనుజేశునిఁ జుట్టుముట్టి తాఁకిరి కడిమిన్. 56

చ. పరువడి నైగమేయుఁ డొకభాగముఁ గ్రక్కునఁ బెంచుచుండ దు
ర్భరబలుఁ డౌకుమారునకు బాగుగఁ బ్రీతి నొనర్పుకోర్కెతోఁ
బరఁగి విశాఖనాముఁ డొకపార్శ్వము నొంప గణేశ్వరుండు భీ
కరపటుబాణసంఘముల గాసిలఁ గొట్టెను దానవేశ్వరా!. 57

ఆ. అపుడు వాఁడు శంకరాత్మజత్రయశస్త్ర, పీడితాంగుఁ డగుచు భీతితోడ
సంగరస్థలంబుఁ జయ్యన విడనాడి, శంబరాసురేంద్రసరస కేగి. 58

క. దనుజేశ్వర! గణనాథులు, ననువడితో నేఁచ మిగుల నలఁగి మహాభీ
తిని వచ్చితిఁ బాలింపుము, ఘనదయ నన శంబరుండు కనలి మునీంద్రా!. 59

చ. పొరిఁబొరి రోష మాత్మవడిఁ బొంగఁగఁ బాశముఁ బట్టి యాగణే
శ్వరులను నొంప నేగఁ గని శర్వుని నల్వురుసూను లాయెడన్
బిరుసున వానిపాశమును భీషణశక్తినిఁ గూల్ప నద్దియుం
బరమునుండి భూస్థలిని వ్రాలెను దేజము బ్రుంగ నత్తఱిన్. 60

క. ఘననిజపాశము భంగం, బును గాంచినఁ గాంచి భీతిఁ బొదలుచుఁ దమి న
ద్దనుజుఁడు కాతరవృత్తులఁ, దనరుచుఁ జనె దెసలకంతఁ దహతహపడుచున్.

వ. అట్టియెడ. 62

మ. శరజన్ముం డురుదైత్యసేన ననిఁ జంచచ్ఛక్తిమై నొంప శం
కరసూను ల్పెలరేఁగి పీచమడఁపన్ గాసిల్లి యాసేన దు

ర్భరభీవిహ్వలగాత్రులై విగతభాస్వద్వర్ణరూపంబులన్
బోరి నేఁపారుచుఁ బోయి శుక్రుశరణంబుఁ జెందె దైత్యస్థితిన్. 63

సీ. అనఘ! కుజంభుఁ డాకార్తికాలయమున కరుగ నేనయుఁ బ్రమథాధిపతుల
చేత హతంబయి చెలువొందు నంధకాసురుఁడు భీతిని జెంది శుక్రుకడకు
నరిగి పానుసయుండునై మ్రొక్కి యనె భక్తిభవదాశ్రితులమునై యువరమందు
నిర్జరులను మేము నిర్జించితిమి నేఁడు పాలితమద్దైత్యవర్యసేన

ఆ. కలహమందుఁ బ్రమథగణములచేఁ జిక్కి, మగఁడు లేక వెలయు మగువమాడ్కి
నడరె నాకు భీతి యలకుజంభాదిరా, క్షసులు నీల్గి రకట! క్ష్మాస్థలమున. 64

క. లలి నాప్రమథులసంఖ్యలఁ, జెలఁగి కురుక్షేత్రభూమిఁ జెన్నారెడి స
త్ఫలముల వలెఁ బెంపుతో నిప్పు, డలరుచు నున్నారు చూడు మటుకాన దయన్.

క. పగవారికి ననిఁ దెలియని, దగుమార్గ మొనర్పు మరుల ననిలో మే మ
త్యగణితశక్తి జయింతుము, తగ నాకై పడిని నీవు దయఁ జూడు మనన్. 66

క. దనుజగురుం డపు డంధకుఁ, దను నుడి విని యూఱడించి యూతనిచిత్తం
బును సంతసింపఁ జేయుచుఁ, బనిఁగొని భాషించె నిట్లు పరమమునీంద్రా!. 67

శుక్రుఁడు సంజీవనీవిద్యవలనఁ జచ్చిన రక్కసుల బ్రదికించుట.

క. దనుజా! వరతీర్థంబున, కును జని నీకోర్కెఁ బ్రీతిఁ గూర్పంగలఁ డా
త్మని పల్కి పుణ్యపుష్కర, మునకును సద్భక్తితోడఁ బోయి నియతుఁడై. 68

క. మునిఁగి శుచివ్రతదీక్షన్, దనరుచు సవిధానసరణిఁ దనమతి సంజీ
వనిఁ దలఁచె దాన నత్తఱి, వనిఁ బ్రమథులవలనఁ జచ్చినట్టి దితిసుతుల్. 69

క. వెండి సముత్థితులై వడిఁ, జండకుజంభాదిదైత్యసహితులు నగుచున్
భండన మొనరింప మహో, ద్దండగతి వచ్చి రపుడు తాపసనాథా!. 70

క. కనలుచు వచ్చెడిదనుజులఁ, గని నందీశ్వరుఁడు నీలకంఠునితో ని
ట్లనె హర! ప్రమథేశులు చం, పినదానవు లసురగురునివిద్య న్మఱలన్. 71

ఆ. ప్రాణయుతులు నైరి యవరంబునం దట్టి, విద్యవలన నిట్టి పెద్దకార్య
మలరె నద్ది చూడ నల్పంబు కాదంచు, నిట్టులాడఁ బార్వతీశ్వరుండు. 72

సీ. అనఘ! యానందదుఁ డగునందిఁ గన్గొని కడురోష మాత్మలోఁ గ్రాల స్వార్థ
వరసాధనం బగువాక్యంబు భాషించె; గణనాథ! శుక్రుని గడకు నీవు
నరిగి నాచెంతకు నాతనిఁ గొనిరమ్ము నే యోగరతినొంది నిక్కముగను
దంపెద నని యిట్లు శంభుఁ డాడిననంది కావ్యబద్ధతోఁ గదలి దైత్య

ఆ. బలముఁ జేర నంతఁ బటుబలుండును భయం
కరుఁడు నైనదైత్యగణ్యుఁ డతని

నడ్డగించె నడవి । నారిమార్గమును గిన్కఁ
బశువు పొదువుమాడ్కి । భద్రమూర్తి!. 73

క. పరువడి నంతన నంది, శ్వరుఁ డశనిసమంబు నైన । చక్రముతోడన్
గర మడచిన నిస్సంజ్ఞుఁగ, బరఁగి రణస్థలిని వాఁడు । పడె నావేళన్. 74

తే. అంత జంభకు జంభవృ । త్రాఖ్యదనుజ, వర్యు లాహవసింహులై । బహుళ ఘోర
చటులశస్త్రాస్త్రములఁ దాల్చి । చనిరి నంది, విభునిమీఁదికి సయ్యెడ । విపులశక్తి.

చ. అతుల మయప్రాదాదిదను । జాధిపు లెల్లను రోషయుక్తులై
పటపటఁ బండ్లుగీటుచును । బాహువులందు మహాయుధౌఘముల్
దటుకునఁ దాల్చి చివ్వ గణ । తల్లజుఁ దాఁకిరి పూన్కి నంత నా
కుటిలబలాసురాధిపతి । కోటనిరుద్ధుఁడు నై రయంబునన్. 76

క. పోరెడినందినిఁ గనుఁగొనఁ, గోరి ముదం బాత్మలందుఁ । గొమరార దివిన్
జేరి విలసిల్లుచుండిరి, వారిజసంభవుఁడు దేవ । వరు లావేళన్. 77

సీ. భగవంతుఁ డైనట్టి । బ్రహ్మదేవుం డంత నందినిఁ గని శచీ । నాయకాది
సురలతో నిట్లనె । సూనాస్త్రవైరికి సాయంబుఁ జేయుఁడీ । సాధుసమయ
మం దన్నవిధివాక్కు- । నాలించి వాసవప్రముఖామరోత్తము । లవ్వడిని గగన
భాగంబు విడనాడి । భర్గుసైన్యముఁ జేర రా వారివేగంబుఁ । బ్రమథనాథ

ఆ. సేనలోన వెలసె । సింధుపతన్నదీ, భూరిజవము మాడ్కిఁ । బొలుపుమీఱ
నంత నుభయసేన । లం దాఁగి హాలహాల, శబ్దముద్భవిల్లెఁ । జడి గొనంగ. 78

క. మునినాయక! యాసమయం, బున నందివిభుండు గినుకఁ । బోరఁ గడిమిమై
వనమృగమును హరి గొని వడిఁ, జనినట్టుల శుక్రుఁ గొనుచు । శర్వునికడకున్,

క. చనుచుఁ దద్రథకులా, దనుజులఁ జెక్కిండ్రఁ గూల్చి । దర్పకు గర్వం
బును బాపి । భర్గుకడ నిలి, పినశివుఁ డాశుక్రుమ్రింగె । విస్మయ ములరన్. 80

వ. అయ్యెడ. 81

చ. హరునిముఖంబునందుఁ గవి । వ్యాప్తుఁడౌటనుఁ గాంచి దానవే
శ్వరు లతిభీతులై రతఁడు । శంకరభావితుఁడై తదుత్తమో
దరముననుండి యంతఁ బుర । దాహకుఁడు న్గిరిజేశుఁ డౌమహే
శ్వరుని నుతింపసాగె గురు । భక్తి తనర్చుచు నుండ నారదా!. 82

శుక్రుఁడు శివునిఁ బొగడుట.

క. హర జీవనగుణనికరా, వరదాఖిలవిష్టపేశ । ప్రమథగణేశా!
పురహర వృషకేతన నీ, కురుభక్తి నమస్కరింతు । నుద్యమ ములరన్. 83

క. స్మరదహన కాలనాశన, నిరతగతి వామదేవ । నీరజసఖ యీ
శ్వర శర్వ భూరిదేవా, కరుణాకర నీకు జోత । కాపాడు ననున్. 84

చ. అవని మహాశ్మశాననిరతా కరశూల త్రినేత్ర సత్తమా
భవ భుజగేశనా గణపపర్వతరాజసుతామనోహరా
కవిజనపోష తత్పురుషకర్బురనాశన భూతిలేపనా
భవహర నీ కొనర్తు నతిబంధురభక్తిని బ్రోవు మాశ్రితన్. 85

క. మునినాథా! యిటు కవిచే, తను నుతుఁడై శివుడు ప్రీతిఁ దనరారుచు శు
క్రునిఁ జూచి కోరుమా వరమును నొసఁగెద ననుచుఁ బలికె ముదమున నంతన్.

క. దనుజాచార్యుఁడు శంభుని, గని నో జగదీశ! యుష్మదయులోదరమున్
దునునుండి వెలికి నిమ్ముగఁ, జనుదెంచు వరమ్ము నిమ్ము సజ్జను లెన్నన్. 87

ఆ. అప్డు శుక్రుఁ డిట్టులాడ శంభుఁడు తన
కనులమోడ్చి రమ్ము కావ్య! యనుచుఁ
బలుక నాతఁ డంత భవుగర్భమందుండి
నిర్గమించుచుండి నీలగళుని. 88

సీ. ఉదరకోటరమందు నొప్పు చరాచరసహితలోకంబుల సాగరముల
నాదిత్యవసుమరుద్దస్రరోగణముల సత్యవిశ్వామరసాధ్యయక్ష
మనుజకింపురుషాఢ్య మానిగంధర్వులఁ బశుసరీసృపముల బహుపిపీలి
కలఁ గీటకంబుల ఘననగఫలగుల్మశాకౌషధుల జలస్థావరస్థ

ఆ. భూతముల నిమేషముల నిమిషావ్యక్తములను గిరుల వ్యక్తములఁ జతుష్ప
దద్విపాదజంతుతతిఁ గని భయమొంది, కడిమి సంభ్రమింపఁ గావ్యునకును.

క. గిరిజేశునివదనంబున, సరగున దివ్యాబ్దమొకటి చన నంతంబుగా
గనలేక మలసి శ్రాంతిగా, బొనరెడితనుఁ గాంచి వెడలపోఁజాల కాగిన్. 90

చ. స్థిరమగుభక్తితో శివునిచెంతఁ జేరి నమస్కరించి తా
వరద! సహస్రనేత్రపద! పన్నగభూషణ! పాపశోషణా!
హర! శివ! శర్వ! శంకర! మహాగురుమూర్తిధరా! మహేశ్వరా!
పురహర! విశ్వరూపధర! పూర్ణకృపాకర! బ్రోవు మ్రొక్కెదన్. 91

క. గంగాధర! నీకుక్షిని, రంగారెడిసర్వభువనరాశినిఁ గని బ
ల్వాంగి భ్రమించుచు వెలుపలి, కిం గదలంజాల నేను గరలెడితగతోన్. 92

ఆ. సుభగ! నిన్ను శరణుఁ జొచ్చితి నని యిట్లు
భార్గవుండు నుడువ భర్గుఁ డతని
వినుతవాక్యములను విని నవ్వ ముదమాత్మ
యందు వెలయుచుండ ననిరు మానిని!. 93

శివుఁడు నిజకుక్షినున్న కవిని బయలునకు వదలుట.

క. భువభృగుకులచంద్రా! నా, తనయుఁడ విభుడైతి వరయఁ దగ మగుటత్రో
వను రాఁగ శుక్రుఁ డనుచుఁగా, నినుఁ బొగడుదు రార్యులెల్ల నిజముగ ధాత్రిన్.

క. అని భవుఁడు కోపమున విడి, చనఁ గవితా కొదలివచ్చి । సితవర్ణత్వం
బునుఁ దాల్చి హరుని వలఁగొని, చని సంగట దానవేంద్ర । సైన్యముఁ జేరన్. 95

ఉ. శుక్రుఁడు వెండి రా దనుజ । శూరులు శర్వగణంబుతో నని
విక్రమమొప్పఁ జేయుటకు । వేగముతోఁ జనుదేరఁ జూచి ని
ర్వక్రబలాఢ్యులౌ ప్రమథ । వర్యులు వేల్పులఁగూడి సంగరో
పక్రము లైనరక్కసులఁ । బట్టి వధింపఁగ నేగి రోమునీ! 96

వ. అట్టియెడ. 97

చ. ఇనుమడివాగు లుద్ధతజ । యేచ్ఛను సంకులసంగరంబులోఁ
బెనఁగుచునుండి రంతఁ బటు । విస్తృతశక్తి నొనర్చునట్టి యా
దనుజసురేశసైన్యముల । ద్వంద్వరణం బతిఘోరరూప మై
కనుఁగొనువారికన్నులకుఁ । గానఁబడె న్మునివంశమండనా! 98

వ. అత్తఱి నంధకుండు నందిని, లోహశీర్షుఁడు శంకుకర్ణుని, ధీమంతుఁ డగుబలి దైత్యుఁడు కుంభధ్వజుని, విరోచనుండు నందిషేణుని, హయవదనుఁడు విశాఖుని, వృత్రుఁడు శాఖునిఁ దాఁకిరి. అట్లె నైగమేయుఁడు బాణాసురుని, రాక్షసాధిపుఁడగుజంబుమాలి మహావీర్యుఁడును బరశుధరుఁడగువినాయకునిఁ గవిసిరి. దానవు లంతఁ గుపితులై రేఁగి దాయలగు షట్పురప్రమథనాథులతోఁ గలహించుచుండి రత్తఱి. 99

## త్రిపురాసురద్వితీయద్వంద్వయుద్ధము.

చ. కులిశముఁ దాల్చి వేగమునఁ । గ్రుద్ధుఁడు నై చనుదెంచి దీప్తితోఁ
జెలఁగెడియింద్రునిం దనుజ । సింహుఁడు నైనతుహుండు నుద్ధతిన్
గలిసియుఁ బోరసాగెఁ గడు । శౌర్యముతో బ్రాదుఁ డంత వీరుఁడై
మలయుఘటోదరుం గదిసి । మార్కొనుచుండెను దర్పమొప్పఁగన్. 100

క. కుండోదరగణనాథుని, ఖండనమున హస్తిదైత్య । పతి దాఁకె మహో
ద్దండగతి షట్పురాసుర, మండలమా ప్రమథగణము । మార్కొనుచుండెన్. 101

క. సురగణపరివృతుఁ డై సంగరమున కేతెంచుశక్రుఁ । గని శుంభదితీ
శ్వరుఁడు నివారించుచు వడిఁ, బరమేష్ఠినిఁ దాఁకె బాహా । బల మేపారన్. 102

క. మాయావి యాతుకజంభుఁడు, మాయారహితుండు నైన । మాపలిఁ దాఁకెన్
బాయని బల్కొనుకను వడి, ధీయుతుఁడగురవినిఁ గెల్వఁ । దెంపున నరిగెన్. 103

క. వరుణునిమీఁదికిఁ ద్రిశిరుం, డరిగె ద్విశీర్షుండు పెలుచ । ననిలుఁ గవిసెన్
వరమిత్రాన్వితుఁ డగుశశ, ధరుని విరూపాక్షుఁ డలుకఁ । దాఁకె న్బెలుచన్.

సీ. అపుడు విద్యున్మాలి । యనురక్కసుఁడు రౌద్ర దానవుండును మహా । దైత్యుఁ డైన
కాలనేమియుఁ బటు । కలహోత్కటాసురుఁ డేకనేత్రాసురుఁ । డలమి రోష

కలితులై కదలి దోశాదశకుత్రుల నెదిరింపఁ బోయిరి । పృథులశక్తి
నరకుఁ డశ్వినుల శంఖులఁ దర్కులను మరుద్గణముల సాధ్యులఁ । గడిమి గెలువఁ

ఆ. గాంతుతో నిశాలి । కవచాదిదైత్యులు
పోయి రిట్లు ప్రమథ । పుంగవులకు
దితిజవరులతోడ । ద్విసహస్రవత్సరా
మరకరత్తు లరిగె । మానిరాజ! 105

ఆ. వేల్పు లెపుడు పోర । వెఱచి పోయిరో యప్పు, డసురు లడరి వారి । నాసనములఁ
దెఱచి మ్రింగ దాన । దేవతాప్రమథేశ,బలము శూన్య మయ్యె । లవరమందు.

— బృంథాంబికోత్పత్తి. —

క. ధరఁ బ్రమథామరబలల విూ, కరణిఁ బోలవోయి మిగులఁ । గ్రస్తోరుగణా
మరుల వశికాద్రిసానువు, నరుదుగఁ గని వశియు నైన హరుఁ డావేశన. 107

తే. కడిమిఁ గలుషించి బృంధాంబికను సృజించె
నామహాదేవిచేత దేవారు లెల్ల
నప్పు డాకృష్టులై యని । నలసు లగుచు
మూఢవాక్కులతోడను । మొనయుచుండి. 108

క. తమతమమొగముల వగ విక్రృతములను గావించి శత్రు । తతులఁ ధరణిం
గ్రమమున విడుచుచు వెడవెడ, గుములై చెలరేఁగి రమల । గుణరత్ననిధీ 109

ఆ. అంతఁ బ్రమథవర్యు । లమరు లభ్రప్రభఁ, బొసరు దైత్యకాయ । ములను విడిచి
వడినిఁ గార్తెఱుంగు । వలన వెల్వడినట్టి, మెఱుఁగు గుములమాడ్కి । మించి వచ్చె.

క. సారసనేత్రులు నై పెం,పారుచు నాదేవనాథు । లని దనుజాల దు
ర్వారశరనికరముల న,వ్వారిఁ గ బాధించి మించి । వఱలుచు నుండన్. 111

క. ఆయెడ భవభుజపాలిత, కాయామరవితతులగుచుఁ । గర్వుర లెల్లన్
హాయని వగచుచు వెఱచుచుఁ, బోయి రహర్నిశలయందుఁ । బుణ్యానిధానా!

— శివుఁడు సంధ్య నుపాసించి నృత్య మొనర్చుట. —

సీ. అథవుఁ డంతన తుష్టి । నలరుచు సప్తాష్టశతకమా కాలంబు । చనుచు నుండఁ
గడఁగి యష్టాదశ । కరుఁ డవ్యయుండు నై పరమసరస్వతీ । వారి నంటి
నిష్ఠతో మునుఁగుచు । నిజసంధ్య సేవించి మించి కృతార్థుఁడై । మెఱసి మూర్ధ
మందుఁ బుష్పాంజలి । నలిదీక్ష నర్పించి వలగొని శిరముతో । వందనంబు

ఆ. చేసి కూరుచుండి । స్థిరబుద్ధి రవిఁ గూర్చి
హాటకోదరేతి । యని జపించి
నే నమస్కరింతు । నీకొఱ కిపు డని
భక్తి మిగుల నిట్టు । పలికె యంత. 115

తే. భావగర్భితుఁ డైనట్టి భావజారి, చేతులార్చుచు నృత్యంబు చేయుచుండఁ
గాంచి ప్రమథాదిదేవతా గణ్యు లల్ల, సంతసంబున నృత్యంబు సలిపి రపుడు.

శా. దేవాధీశుఁ డజాండు నిత్యుఁడు మహాతేజోభిరాముండు స
ద్భావుం డాహరుఁ డిట్లు నిత్యముగు సద్భవ్యన్న త్తి సేవించి బల్
రేవన్న త్యము సల్పె మోదము మది న్జీవుల్ప దైత్యాళితో
నావేళ న్సమరం బొనర్పుటకు నై యత్నించె నత్యుద్ధతిన్. 115

క. హరభుజపరిపాలితులును, బరివర్ధితభయులు భూరిబలు లగు ప్రమథే
శ్వరసురులచేత రాక్షస, వరు లందఱు జితులు నైరి బవరమునందున్. 116

—◉ అంధకుఁడు శివరూపుఁడై గిరిజఁ గలియ నేగుట. ◉—

ఉ. అంధకుఁ డంత నిర్జితము నా నిజసేనను జూచి డెందమం
దిం దుథరుం డజేయుఁడని యెంచుచు వస్తువులందు నమ్మిక
న్బొందినసుందుఁ బిల్చి దితిపుంగవ! భాగ్యతవు నాకుఁ గీర్తిని
బొందినవాఁడ వీ వగుటఁ జేసి వచించెద నొక్కవార్తనున్. 117

సీ. దయ విని చేయుము దాని నాశంకరు నరసి చూచినఁ గారణాంతరముల
వలన మహాత్ముఁడుఁ బటుకణాపొఁడు డటుకాన దుర్జయుఁ డగుచునుండుఁ
గడిమి నాచిత్తంబు కల్యాణియగు నగపార్థివపుత్రిపైఁ బత్యహంబు
భాసిల్లుచున్నది పరిపరివిధముల నాచారుహాసిని యలరుచోటి

తే. కరుగుదము పూన్కితోడ నే నభవుమూర్తి
నింపుగనుఁ దాల్చి దాని మోహింపఁ గలను
నీవు రుద్రానుచరుఁడును నిపుణుఁడైన
నందినాథుఁడ వగుము నేఁ బొంది కలఁక 118

చ. అతిముదితి దానితోఁ గలిసి యంగజకేళిఁ బెనంగి తుష్టితోఁ
వచలి సురౌఘముల్ ప్రమథవర్యులఁ గూల్చెదనంచు నాతఁ డీ
తెలఁగున నాడ వాఁడు విని ధీర! భళా! యని వేడ్కఁ బల్క యా
రతిఁ గన నంది యయ్యెఁ బ్రమథప్రభుఁ డంధకుఁ డయ్యె వింతగన్ 119

తే. అనఘ! వారట్టిమూర్తుల నదరి మంద
రంబునకు నేగి పటుతర బాణనిహత
కాయులై రంధకుఁడు నందికరముఁ బట్టి
భవునిగేహంబు దృఢబుద్ధివలనఁ జొచ్చె 120

ఆ. అపుడు గిరిజ శంకరాకృతి నొప్పు ప్ర, హారజర్జరాభుఁ డయిశిలాద
సూనుమూర్తి నలరుసుందుని కరముల, బట్టి దూరముఁగనుఁ బాలివెలయ.

క. చనుదెంచెడు నంధకునిఁ, గనుఁగొని వాఁ డంతలోన కడిమిఁ బ్రవేశిం

చినఁ గీర్తివిస్తృత యగువిజ, యను మాలిని జయనుఁ గూర్చి యనె గిరిజ తమిన్.

చ. కనుఁ డితఁ డస్మదర్థమయి కామవిరోధికి భీమరూపు లా
దనుజులతోడఁ బోరడరె దానని కర్గి వ్రణంబు ప్రాఁతనే
యని లవణంబు జీరమును యింపగుతక్రముఁ దెందు నేను నా
పెనిమిటమేనిగాయమును వేగమె మాన్పఁగఁ బూన్కి నిర్యుడన్. 123

క. అనియిట్టులాడి దివ్యా, సనతలమునుండి లేచి శంభుండని యా
త్మనుఁ దలపోయుచుఁ గడుఁదమిఁ, జని భర్తని నావ్రణంబు శరపత్రమునన్.

సీ. ఛేదించి క్రన్ననఁ జిహ్నంబులను నెల్ల నరసి యత్తఱిఁ బార్శ్వమందు దీప్తి
గడఁగువారిద్దఱఁ గని మాయతోఁ గప్పఁబడినట్టి మేనులఁ బఱికి ఘోర
విగ్రహా లౌ దైత్యవీరులఁ గా మదిఁ దెలిసి మహాభీతిఁ దివురుచుండఁ
బాఱిపోయిను వాఁడు పార్వతిచింతితమునుఁ గనలేక విమూఢబుద్ధిఁ

ఆ. దనరి సుందు విడిచి తద్ద నిందించుచుఁ, దల్లడిల్లి యుట్టిదారిఁ గాలి
నడక గిరిజ పోయి నలి నట్టిమార్గంబుఁ, బట్టి యాతఁ డరిగె వలపు చెలఁగ.

క. అరుదెంచునట్టియంధకుఁ, బురహారుసతి చూచి వెఱపుపొనర న్నిజమం
దిరమును వదలి సఖీజన, పరివృత యయి యుపవనంబుఁ బరువడిఁ జొచ్చెన్.

క. వెనుకొని యాదైత్యుం డ, వ్వనికరిగె మదాంధుఁ డగుచు వావిరి నటురాఁ
గనుఁగొని యగజ తపోగో, పనమునకు శపింపకుండి భయవిహ్వల రై. 127

తే. అమలశుక్లార్కపుష్పంబునందుఁ జొచ్చె
నంత గుల్మంబునడుమ జయాదు లైన
కామినులు దాఁగి యుండిరి కాలి కాన
రాని దగుచుండ నంధకరాతుసుందు 128

క. సుందాసురుకరయుగమును, దొందికఁ గొని యాత్మసేనఁ దొందెను శర్మా
గ్రందుకొని మరల నిర్జర, బృందంబుల కాహవంబు పృథుతర మగుచున్.

వ. ఇట్లు ద్వందసమరంబు వెర్గె. 130

హరిబ్రహ్మలు రక్కసుల వధించుట.

ఉ. అంత సురేశ్వరుండును మహాత్ముఁడు చక్రగదాధరుండు మా
కాంతుఁడు నైనశౌరి హరికామ్యుఁడునై దనుజేశసైన్యముం
సంతెనకట్టి కూల్చి పటుశార్ఙ్గధనుర్గళితాస్త్రశస్త్రముల్
పంతముఁ బట్టి వైవ నని బద్ధులునై దివిపుంగవు ల్వడిన్. 131

ఆ. భానుపాదబద్ధవారివాహంబుల
పగిదిఁ జిక్కియష్టపంచసప్త
సంఖ్యగొలఁది మెఱయ శౌరి రణోత్సాహ
శాలి యగుచు నపుడు శౌర్య మొప్ప. 132

క. కొందఱ గదతోఁ జంపెను, గొందఱఁ జక్రంబువలనఁ । గుంభినిఁ ద్రోసెన్
గొందఱ హలముసలంబులఁ, గొందఱ దృక్ఖడ్గములను । గూల్చె రయమునన్.

చ. గరుడుఁడు పక్షపాతమునఁ । గాళుల ముక్కున రొమ్మున న్వెసన్
ధరఁ బడఁ గొట్టెఁ గొందఱఁ బ్ర । తాపమహుఁ డాదిజనుండు దేవతా
వరుఁడు పురాణదేవుఁ డగు । పద్మజుఁ డుద్ధతిఁ బెద్దతమ్మినిన్
బరువడిఁ ద్రిప్పి యాకమల । వారి నవారిఁగ ముంచె నత్తఱిన్. 134

తే. అఖిలతీర్థమయంబు నా । నబ్జజన్ము, వారిసంస్పృష్టులై దేవ । వరులుఁ బ్రమథ
ధీరు లందఱు గణశతా । ధికులు నగుచుఁ, బెంపుసెందిరి క్రొత్తగ । వింతదోఁప.

క. కలుషహారం బగునావిధి, జలమున నాదైత్యులెల్ల । సంసిక్తులు నై
కులిశహతాద్రులకైవడి, బలవాహనయుతులు నగుచుఁ । బడిరి ధరిత్రిన్ 136

చ బవరమునందు రక్కసుల । భస్మముచేయుచు నున్నబ్రహ్మమా
ధవులనుఁ గాంచి యుద్ధమతిఁ । దాల్చి సురేశ్వరుఁ డేగ వచ్చువా
సవుని బలాసురుండు కని । సారవిమానగుఁ డైనపద్మసం
భవునకుఁ జక్రహస్తునకు । భక్తిని మ్రొక్కి క్రమక్రమంబునన్. 137

వ ఆరోధనోద్యుక్తుండై సంభ్రమించి చనుదెంచుచు. 138

క ఘనముష్టి నెత్తికొని వడిఁ, జనుదెంచెడువాఁడు నధిక । శౌర్యుండు మహా
దనుజసురాజేయుఁడు బల, ధనుఁడగు బలదైత్యుఁ గాంచి । తమి శక్రుఁడోగిన్.

ఆ. పటుసహస్రహస్త । బలమున శతకోటి, నపుడు త్రిప్పి యాసు । రారిశీర్ష
మందు వైచె నద్ది । యస్త్రాఢ్య మైయుండి, వేయితునుకలగుచు । విపులయందు.

క పడె బలుఁ డతిరౌద్రాకృతి, నడరుచు వెడవెడను వడిని । నడుగుల నిడుచున్
జెడికంపుగతిని రాఁ గని, గడగడ వడఁకుచును దేవ । గణవిభుఁ డంతన్. 141

క. అని వీడి పెడమొగంబున, జనుచుండిన జిష్ణుఁ గాంచి । దైన్యంబులతో
డను గూడి జంభుఁ డుద్ధతిఁ, బొనరారుచు నిట్టివాక్య । మును భాషించెన్ 142

క. నిలునిలు నీవు చరాచర, ములనేలెడిదొరవునయ్యుఁ । బోవచ్చునె? భీ
తిలి చనుట యధర్మం బని, పలుకంబడె బుధులచేతఁ । బాకవిరోధీ! 143

మ. అని యీకైవడి జంభుఁ డాడ విని దేవాధీశుఁ డావేళ భీ
తిని వైకుంఠునిఁ జేరి భక్తి మదిలో । దీపింపఁగా మ్రొక్కి యి
ట్లనె, దామోదర! భావ్యభూతపతివై । హర్షించుచున్నావు నా
వినయోక్తిని నాలకించి దయతో । వీక్షించి పాలింపుమా! 144

చ. అనఘ! నిరాయుధుండ నగు । నట్టినన్ గని జంభదానవుం
డని నదలించి నిల్వుమని । యాడఁ దొడంగిన భీతి నొంది నే
ననిలరబుద్ధి నీశరణు । నందితిఁ గాన మహాయుధంబు వే
డ్కను నిడుమంచుఁ బల్క విని । కంజదళాక్షుఁడు వజ్రితో ననెన్. 145

ఆ. అశని విడిచి యగ్ని । నతిభక్తిఁ బ్రార్థింపు, మారఁ డొసఁగు నీకు । నాయుధంబు
శంక లేదటంచు । శౌరి పల్కిన విని, శక్రుఁ డగ్నిఁ జేరి । శరణుఁ జొచ్చి.
సీ. పలికె నోపావక! । బలదానవునిఁ దాఁకి దంభోళి భిన్నమై । ధాత్రి నూఱు
విధములై పడ నట్టి । వీరాసురుఁడు నన్ను రక్షించుచున్నాఁడు । రణ మొనర్ప
గాన నాయుధమును । గరుణతో నిడుమని ప్రార్థింపఁ బ్రీతుఁడై । పావకుండు
తమిఁ బల్కె వాసవ! । దర్పంబు విడనాడి శ్రద్ధతో నిల్చినా । శరణుఁ జొచ్చి
ఆ. నట్టివాఁడవైతి । వని యిట్లు భాషించి, యాత్మశక్తితోడ । నపుడు శక్తిఁ
గాని పురందరునకుఁ । గూర్మితో నిడి విను, పీఠి కేగె నంత । విమలచరిత!
క. సురుచిరశతఘంటలతోఁ, బరఁగినదై ఘోరమగుచు । భాసిలునై శ్వా
నరదత్తశక్తిఁ గాని దు, ర్భరుఁడౌ జంభాసురేంద్రుఁ । బరిమార్పుటకై. 148
చ. పరబలమర్దనుం డయిన । వాసవుఁ డామహనీయశక్తినిన్
బోరిబోరిఁ దాల్చి త్రిప్పుచునుఁ । బొంగి బలంబులఁ గూడి యుద్ధతిన్
బరఁగి రణంబొనర్పఁ జనె । వచ్చుపురందరుఁ గాంచి దానవే
శ్వరుఁడగు జంభుఁ డల్గి హరి । వారణకుంభముఁ గొట్టె ముష్టితోన్. 149
ఆ. జంభదైత్యముష్టి । చటులనిపాతంబు, వలన నతనిగజము । భగ్నకుంభ
కటము నగుచుఁ గూలెఁ । గదువడి ముని హరి, వజ్రనిహతనగము । పగిది నంత.

ఇంద్రుఁ డంతరమునుండి తలక్రిందుగఁ బడుట

చ. కరిపతి కూలఁ బైకొగని । గ్రక్కున జిష్ణుఁడు ఖేలితోడ మం
దరగిరి పీడి భూమిఁ బడఁ । దల్లడ మొందుచుఁ గ్రిందు మీఁదునై
పొరలుచుఁ బోవఁ గిన్నరస । మూహము సిద్ధులు సాధ్యచారణో
త్కరములు చూచి చిత్రపడి । గ్రక్కున నిట్లు వచించి రాయెడన్. 151
క. వాసవ! తలక్రిందై బ, ల్వేసటమునఁ బడకు పడకు । విస్తృతధైర్యో
ల్లాసాపాదితసరణిని, భాసిల్లుచు నుండు మవని । భావంబలరన్. 152
చ. పరమమునీంద్ర! వారిటులఁ । బల్కినసూక్తుల నాలకించి యా
తరుణమునందు రోగివలెఁ । దా ఘనకాలముదాఁక నిర్జరే
శ్వరుఁడు వసించి యంత సుర । వర్యులతో నని వేల్పులార! దు
స్తరగతి వ్రాలు నే నకల । దైత్యుల నెల్లదిరించి పోరుదున్. 153
తే. అప్పు డతఁ డిట్లు నుడువ వా । రనిరి నీవు
పోరి విషాదంబు నొందకు । భువనరథముఁ
బనుపఁగల మట్టి రథముపైఁ । బాఱిఁ జేరి
కలహ మొనరింపు మత్యంత । కౌతుకమున. 154
సీ. సూనృతవ్రత! యిట్లు । సుర లాడి వానరధ్వజముతో సంహతా । శ్వములతోడఁ
గడఁగినదై చిఱు । గంటల గుములతోఁ బ్రజ్వరిల్లుచు మహా । ప్రభల నొప్పు

యముల హేమమయంబు। లగుచు స్వస్తికదివ్యలక్షణంబులతోడఁ । బలిఁ జెలంగు
తేరును బనిచిరి । దేవతాధిపుఁ డంత సారథి లేనట్టి। స్యందనంబు
ఆ జూచి యప్పు డనిమిషా। సురలారా! నేనెట్టు, లని నొవ్వఁ దత్తు స్యంద। వాహ్యములను
నడుపనేర్తు దైత్య। నాథుల నెదిరించి, గాఢశక్తి బోరఁగలనుఁ । జెప్పుఁడు 155

క. సారథ్యము నెవఁడైనను, ధీరతఁ గావించెనేని । దితిజాలనెల్లన్
ధారుణిఁ గూల్చెద నిక్కం, బారీతి పాసంగకున్న । నగునే పోరన్. 156

ఆ. పరమమానినాథ! వాసవుం డీమాడ్కిఁ
బల్కఁ విబుధు లపుడు । పల్కి రోసు
రేశ! సూతుఁ డొకఁడు। డేని మాలో లేఁడు
నీవె కలహమందు । నేర్పుతోడఁ. 157

క. వారువముల నడిపించుచు, దారుణరాక్షసులఁ జంపఁ । దగుదు వటంచున్
వారాడిన శక్రుండా, తేరును విడనాడి ధాత్రిఁ । దిరమకపడుచున్ 158

చ. పరువడిఁ గూలుచుండ నటు। వ్రాలెడివాఁడు విముక్తకేశజ
గరుఁడుఁ జలల్కిరీటుఁడును । స్కన్నశరాస్యుఁడుఁ దైనయాపురం
దరుఁ గని సారెసారెకునుఁ । దల్లడమందెను భూమి యట్లు దు
స్తరగతి నట్టిపాటునను । ధాత్రి నటించెడి కాలమందు నొగిన్. 159

—॥ మాతలిజన్మక్రమము. ॥—

క. అనఘ! శమీకునికులసతి, తనపతిఁ గని ప్రాణనాథ! । తనయుని వేగం
బునఁ గొని వెలిఁ జేర్పుము నీ, వన నావాక్యంబు నాతఁ । డాలించి తమిన్. 160

క. పలికెను బాలునిఁ గైకొని, వెలిఁ జేర్పు మటంచు నీవు । వినరామోక్తులతో
నలరుచుఁ బల్కెద వేలకొ, కలరూపెత్తిగింపు నాకుఁ । గంజదళాక్షీ! 161

సీ. మాన్యుఁడైన శమీక। మౌని యీచందాన భాషింప నాచెలి । పలికె నాథ!
కడిమి నీభూదేవి । కంపించినంతనె శిశువు బహిస్థలిఁ జేర్ప ద్విగుణ
మగునని దైవజ్ఞుఁ । డాడినపుడె విని చెప్పితి నన్న నా। చేడె పలికి
నట్టిమాటను విని। యాత్మజుం డగుబాలు ముదమునఁ గొని బహి। రుహ్యస్థలమున

ఆ. శంకలేక చేర్చి। సత్వరంబున గోయు, గార్థ మగుచు మరల । నాతఁ డేగ
నరుగవలదు హాని । యగునని నిజసతి, పలుక వెడలి మరల । వచ్చి ధాత్రి. 162

చ. ఘనసమరూపరేఖలనుఁ । గ్రాలుచు నుండినబాలకద్వయం
బును గురువిస్మయస్థితినిఁ । బొల్చెపలారెడి దర్శనంబుతోఁ
దనరుచుఁ బూజ్యరాలునయి । తద్ద వెలుంగుచు నున్న భార్యనున్
గనుఁగొని వింతచిత్తమున । గాఢముగాఁ జెనఁగంగ నిట్లనెన్ 163

ఆ. కెలవ! కలకెలంగుఁ । దెలియఁజాలక నిను
నడుగుచున్నవాఁడ । నాడు మాద్వి

తియశోకవ్రనకుఁ । దెజరిల్లెడిభవి
వ్యర్థనంబు లెట్టి । వగున్ మఱియు. 164

ఉ. కామిని గాలవుం డనిన । కార్య మదెట్టిది చెప్పు మన్న నా
భామిని పల్కెఁ; నీయడనుఁ । బల్కఁగరాదు నిజంబు జీవితే
శా! మఱి నీకు చెన్క మన।సార వచించెద నన్ను నాతఁడో
కోమలి! చెప్పకున్నఁ దినఁ । గూడును నే నని పల్కె నాయడన్. 165

చ. మిడికెడుబుద్ధితోడను శశిమౌకమునీశ్వరుఁ డిట్లు చెప్ప నా
పడతి వచించె నాథ! హిత।వాక్యముఁ బల్కెద నాలకింపు భీ
తుఁడు నగుమానవుం డడుఁగఁ । దోడన దాని నొనర్చునట్టు చెం
బడి వడిఁ జింతసేయఁదగు । వావిరి నం చని పల్కె నత్తఱిన్. 166

ఆ. ప్రాణరహితుఁ డగుచు । భాసిలునట్టి యా, చిన్నిబిడ్డఁ డపుడు । జిష్ణునకును
సాయపడుటకొఱకుఁ । జని రథవైశార, దత్వబుద్ధితోడఁ । దాపసేంద్ర! 167

వ. అపుడు విశ్వావసుప్రముఖగంధర్వపతులు చనుచుండినట్టి యాబాలుని శక్ర
సహాయునిగఁ దమతమచిత్తంబుల నెఱింగి నిజతేజస్సులవలనఁ జెంపొందించిరి
తత్తేజోయుక్తుం డై యాడింభకుండు వాసవుకడ యి ట్లనియె. 168

చ. సురగణనాథ! నీకుఁ బ్రియ।సూనుఁడ నై లిని రమ్మటంచు నీ
సరణి నన౯ బురందరుఁడు । సంతస మొందుచు నాలకించి య
చ్చెరువు జనింప నీ వెవని।చిన్నికుమారుఁడ వెట్లు యంతవై
తురగములన్ రణస్థలినిఁ । దోలఁగ నేర్తువు శంక కల్గెడిన్. 169

సీ. ఇటులన నాబాలుఁ । డింద్రునితో ననెఁ బాకశాసన! నేను।భద్రవాహ
యానవిశారదుఁ।డను భూమిభవుఁడను సుభగుఁ డై శశిమౌక।సుతుఁడ మఱియు
సారగంధర్వతే।జోయుతుండను మది శంకింప వలదని । సారె కిట్లు
భాషింప నతఁ డట్టి।వాక్యంబు విని యోగివిదుఁడు నై దివియందుఁ । బ్రజ్వరిల్లె
ఆ. పొరిది నట్టివిప్ర।సూనుఁడు మాతలి, యనెడిపేరుతోడ । హరువుఁ గాంచె
సమరపుంగవుండు । నట్టిదివ్యరథంబు, నెక్కె మోదమాత్మ । నెసఁగుచుండ. 170

మాతలి రథంబు నడుప నింద్రుఁడు జంభాదిరాక్షసుల వధించుట.

చ. మిలమిల వెల్గువాఁడును శశిమౌకునిపుత్రుఁడు నై చెలంగుమా
తలిని గ్రహించి మేటియర।దంబుపయిన్ వడి నెక్కె మందరా
చలమున కేగి శౌర్యభుజ।సారమదోత్కటజాతవృత్తితో
నలరెడిశత్రుసేనఁ గని।హర్షముచేఁ జెనుపొంది యక్కడన్ 171

ఆ. అరుణపీతశుక్ల।హరితసితోజ్జ్వల, పంచవర్ణమగుచు । బాణతతుల
నదరి దేవశథిల । మావిలుఁ గని దాని, సంగ్రహించి దేవ।సత్తముండు. 172

క. రణమదిలోఁ ద్రిగుణులు నా, వనజాసనపార్వతీశ వాణీశ్వరులన్
వినుతించి మ్రొక్కి భక్తిన్, దనరుచు శరచాపములను దాల్చి కడంకన్.
క. అంత శరంబుల సింగిణిఁ, బంతంబునఁ గూర్చి శస్త్రబలశాలిఁ దగుచున్
వింతే జనింప రణంబున, సంతస మేపారఁ దిరిగె శక్రుఁడు వెలుచన్. 174
క. తోయజభవహరిహరులా, తోయంబున నింద్రుఁడనును దోర్దై విలస
త్సాయకముల గర్వరసము, దాయమున ననిఁ గూర్చి రధికదర్పోద్ధతిమై 175
ఆ. అమరవిభుఁడు పుష్కరావని దశదిశల్, నిండి వెలుగునట్లు నేర్పు మీఱ
బాణములను బఱపి పరపక్షములఁ గప్పె, సమరభూమి నంత సంయమీశ!
క. తడఁబడి రథకరిహరులు లోగి, వడిఁ దచ్ఛరపాతనమున బలువిడిఁ జెడిరోగా
మడిసిరి సైన్యాళులు ; జం, భుఁడును మహామాత్యుఁ డయ్యెఁ బుణ్యనిధానా!
చ. కడిమిఁ దదస్త్రభగ్నుఁ డయి గాసిలెఁ గాల్బలమెల్ల సోలుచున్
బడి వగతోడ దిక్కుసెడి పాఱె దురాసదమైన నాబలం
బడరెడివాసవాస్త్రముల నార్తిఁ జెనంగొనఁ జంభుఁడున్ గుజం
భుఁడు కని ఘోరమౌ గదలఁ బూని మహోద్ధతితోడ నాయెడన్ 178
క. సురరహితుఁ డైననిర్జర, వరుమీఁదికి నేగ నపుడు వచ్చెడునాదు
ర్భరదైత్యులఁ గనుఁగొని శ్రీ, హరి కోపాయత్తబుద్ధి నార్చుచుఁ జెలుచన్.
ఆ. శత్రుహరము నైనచక్రంబుతోడఁ గుజంభు నేయ నతఁడు సర్వరముగ
నవనిమీఁదఁ గూలె స్యందనచ్యుతి నొంది, జీవరహితుఁ డగుచు శిష్టచరిత!
మ. హరిచక్రాహతితోఁ గుజంభదితిజుండావేళ నీల్గ న్మహా
సురుఁ డౌజంభుఁడు కోపమాత్మఁ జెడఁగై శోభిల్ల దుర్బుద్ధితో
హరి డాఁకన్ జనుదెంచ చండమున వృత్రారాతిపై కేగ సం
గరభూభాగమునందు హస్తవిలసద్గండుండు నై పూన్కితోన్. 181
క. చనుదెంచుచున్న జంభుని, గని సశరంబయిన కార్ముకము విడిచి రయం
బునఁ గాలదండసమమగు, ఘనశక్తిఁ బురందరుండు కైకొని వానిన్. 182
చ. సరసర నేయ నద్ది స్వర సస్వనమై విలసిల్లుగంటలన్
బరఁగి లయాగ్నిచందమున వచ్చుచునుండ గదన్ ధరించి వాఁ
డురువడి దాని త్రేయ నది యుద్ధతి నాగదఁ గూల్చి యామహా
సురుహృదయంబు దూరి ధరఁ జొచ్చెను వేల్పులు సంతసింపఁగన్. 183
మ. అనఘా! జంభుఁడు శక్తిభిన్నహృదయుం డై సోలుచున్ జచ్చె వే
ల్పనుఁ దద్వీర్యముఁ బ్రస్తుతించిరి జగద్ధన్యుండు నాశక్రుఁ డం
తన గోతీశ్వరుఁ డైనశంకరునిచెంతన్ జేరి సద్భక్తి బు
ద్ధినిఁ జెంపార నమస్కరించి నిలిచెన్ దీక్ష న్విజృంభించుచున్. 184

గూల్చు శత్రుఁ డసుర।గురునిచే నుద్రిక్తుఁ
డయ్యె నూరకుంట ।నర్హ మగునె. 195

చ. హరి యిటు లాడ నిర్జరస।మావృతు లై ప్రమథేంద్రు లుద్ధతిన్
బరఁగి శచీమనోహరునిఁ । బంకజనేత్రునిఁ గూడి ఘోరసం
గరమున నేగి రత్తతినిఁ । గాలుమెలుంగులచాయ నున్న భా
సురహయకోటి నారగద । శోణినిఁ గూల్చెను దెప్పపాటునన్. 196

చ. అరదముఁ బాన్కతో నడవు।నట్టి నియంతను లాగి పట్టి దు
ర్భరమగు శక్తితో నతని । వత్సము స్కందుఁడు గ్రుచ్చి చంపి స
త్వరముగఁ ద్రోసె నంత గణ।తల్లజు లా ప్రమథేశు లెల్ల ని
ర్జరవరయుక్తులై చటుల।సంగరభాగమునన్ జెలంగుచున్ 197

క. గురుకేతనాశ్వయుతమౌ, నరదమున విచార మొనర । నస్త్రంబులతో
నురవడి నుగ్గుగఁ జేసిరి, కర మార్తలయందు ముదము । కడఁగ మునీంద్రా!

తే. అంత వాఁడు మహావీర్యుఁ । డయ్యు విరథుఁ
డగుచు విల్లును వీడి గ।దాయుధంబుఁ
బట్టి త్రిప్పుచుఁ గ్రమమునఁ । బ్రమథదేవ
పతుల నెనమండ్రఁ దఱుముచు । భగ్నుఁ జేరి. 199

మ. ఘనగంభీరము నై సహేతుకము నై । కన్పట్టువాక్యంబుఁ జె
ప్పెను నోభితుఁడ! నీవు సైన్యములతో । వెల్గొందుచున్నావు సొం
పున నేసాయము లేనివాఁడ నగుచున్ । బోల్పారినన్ నిన్ను నే
ననిలోఁ బంపెదఁ జూడు మీవపుడు ధైర్యం బస్మదీయం బొగిన్. 200

సీ. అంధకుఁ డీమాడ్కి । నన విని పలుకుల భవుఁ డంతఁ బ్రమథుల । వాసవాది
సకలదేవతలను।జయ్యనఁ దనమేనఁ జొనిపి యాదైత్యునిఁ । జూచి పలికె
రారమ్ము దుర్మార్గ! । రాక్షసాధమ! నిస్సహాయుండ నై యని।నడరుచున్న
వాఁడ నే నని యిట్లు । పలికిన వాఁ డట్టిసకలామరత్వయ।సహితభూరి

ఆ. విస్మయంబుఁ గాంచి । విస్తారమగుగదఁ, బూని శివునిపైకిఁ । బో నతండు
బహుళగర్వమునను । వచ్చెడునంధకుఁ, గాంచి యుద్ధ డిగ్గి । క్రౌర్య మొప్ప.

హరుఁడు సత్త్వభైరవాకృతులఁ దాల్చి యంధకునిఁ ధరఁ గూల్చుట.

చ. కరతలమందు శూలమును । గైకొని భూధరఁ సానువందు దు
ర్భరగతితోఁ బడాలియయి । క్రాలి త్రివిష్టపభీకరుండు నై
సారిడిని భైరవాకృతిని । శోభ మొనర్చెదునాసురారి దు
స్తరహృదయంబుఁ జించె బుధ।తల్లజ! చెప్పెద నాలకింపుమా 202

సీ. దంష్ట్రాకరాళతఁ । దనరిభాస్కరకోటిసన్నిభమై హరి।చర్మసహిత
మగుచు జటాధర । మై ముళుఘంటంబుకళన రాణించుచు । భవ్యసర్ప

హారాళితోఁ గడు । హావళించి శార్దూలశరములతోడను । గ్రాలి చంద్ర
నేత్రయుగంబున । నెగడెడి యాదృశ మూర్తినిఁ దమిఁదాల్చి । పురహరుండు

ఆ. శివుఁడు శాశ్వతుండు । శివదుఁడు భగవంతుఁ, డజుఁడు భూతభావ । నార్హుఁ డైన
పార్వతీశుఁ డతని । వక్షంబుఁ జీల్చెఁ ద్రి, శూలమునను విబుధ । శూరు లెన్న.

చ. పరువడి వాఁడు భిన్నతర । వక్షుఁడు నయ్యు సశూలుఁ డౌమహే
శ్వరుఁ గాని క్రోసుదవ్వరుఁగ । వావిరి శంభుఁ డతి క్రమంబునన్
బోరలుచు వచ్చిశూలమున । భూరిగదాధరుఁడు న్మహాభయం
కరుఁడగువాని వక్షమునుఁ । గ్రక్కునఁ గ్రుమ్మెను సంగరంబునన్ 204

తే. అంధకుం డంత శివుమూర్ధ । మందు గదను, వైచి కరముల శూలంబుఁ । బట్టి కొట్ట
సవ్యమున కున్కిపట్టైన । శంకరుండు, పరమయోగివిధంబునఁ । బరిఢవిల్లె. 205

వ. అంత వాని దారుణగదాపాతక్షతిం జేసి నా ముక్కంటితలయందు నెత్తురుధారలు జాఱఁ దొడంగె. తొలిధారం గాలినచ్చెలివన్నె కలిగి తామరపూల దండలతోఁ బ్రజ్వరిల్లునట్టి భైరవుఁడు పొడమి విద్యారాజని ప్రసిద్ధికెక్కె. ద్వితీయశోణితధారవలన నఖిలభువనార్చితుండును, శూలమండితుండగు భైరవుం డావిర్భవించి రుద్రనామమున రాజిల్లె, నన్యరక్తధారం బుట్టిన నలుగురుభైరవులు చండాద్యేకకపాల్యనాములై రాణించిరి నేలఁగారిన నెత్తురుధారచే జనించిన భైరవుఁడు శోభాంజనాఖ్యుఁడు శూలరాజితుండునై లలితరాజాఖ్య నలరారె అట్లాశివుఁడు సప్తవిధభైరవరూపుఁ డయ్యె వినాయకుఁ డష్టమ భైరవుం డగు; నిక్షైరవాష్టకం బగు అట్టిమూర్తులుకలశంభునిచే మహాసురుఁ డగునట్టి యంధకాసురుఁడు శూలప్రోతుఁడై వాసవాయుధప్రభా పుంజరంజితుం డగుచు గొడుగుమాడ్కి ధారితుం డై విలసిల్లె నయ్యెడ. 206

ఉ. మునివర శూలపాతమునఁ । బుట్టినరక్తమునందు గొంతుదాఁ
కను మునిఁగెగా బరాక్రమము । గ్రాలమహేశ్వరుఁ డేకమూర్తులన్
గనలుచు నంతనావిభుని । కాయమునందు మహాప్రవాహమై
ఘనమగు స్వేదమాయెడను । గ్గైను మిక్కిలిఁ దండడించుచున్ 207

చర్చికాంగారకుల జన్మవిధి.

తే. గరళకంఠునిముఖఫల । కంబునందుఁ, గలిగె రక్తప్లుతాంగయౌ । కన్య ధరణిఁ
జెందినట్టివినాశక । స్వేదబిందు, వందు నంగారపుంజాభుఁ । డైనశిశువు. 208

క. కలిగి తదాసురరక్తము, బలితపుఁ దృషతోడఁ ద్రావె । బాలికయును తియం
దలరెడిశోణితమును మి, క్కిలిపానము చేసె నాశ । కిరలఁగ నంతన్ 209

క. బాలార్కసన్నిభాభుఁడుఁ, గాలారియు వరదుఁ డమర । గణనాథుం డా
శూలాయుధుఁ డత్తతి నా, బాలామణిఁ జూచి ప్రీతి । బరిఢవిలంగన్. 210

చ. పరమమునీంద్ర! లోకహిత/బంధురవాక్యముఁ బల్కె దేవి! నీ
నరసురమానిచారణులు / నాగులుయక్షపితృవ్రజంబులున్
గురుబలిపుష్పధూపములఁ / గార్తి నొసంగి నుతించి మ్రొక్కుచున్
నిరతముఁ గొల్చుచుండుదురు / నిక్కము మిక్కిలి నిర్మలాత్ములై. 211

క. విను శోణితార్చితవు నై, పౌనరినకతమునను నీకు / భువనంబులయం
దనిశముఁ జర్చిక యనుపే, రొనరును శుభదంబు నగుచు / నుజ్జ్వలరూపా! 212

చ. పురహరుఁ డిట్లు చెప్ప విని / పొంగుచుఁ జర్చిక వింధ్యశైలభా
సురతలమందు దీప్తిమెయి / శోభిలుచున్నను గూడి సర్వమా
ధర విహరించి హింగుళిక/ధాత్రి ధరోత్తమచారువాసమం
దురురుచితోడ భాసిలుచు / నుండెను నిత్యము సంతసించుచున్ 213

సీ. చర్చిక పోయిన / శర్వుండు సర్వవరాధ్యమై జగముల/కన్నిటికిని
బరమశుభాశుభ/ఫలద మౌ గాముల దొరతనమును మహా/తుష్టిఁ గుజాని
కవు డిచ్చి నీకు గ్ర/హాంతరవ్యసనంబు రాగలదని పల్కి / గాంతు నాతఁ
డరిగె నంధకు నంత / నాభైరవుఁడు దివ్యసాహస్రవర్షము/ల్సత్రినేత్ర

ఆ. వహ్నితోడ శుష్క / బలశౌర్యశక్తుని, గాఁ ద్వగస్థిశేషుఁ/గా నొనర్చెఁ
దత్త్రినేత్రవహ్ని / దగ్ధుఁ డై యవు డతఁ,డట విముక్తపాపుఁ/డగుచు నంత.

ఉ. సర్వచరాచరేశుఁడుఁ బ్ర/జాబహురూపుఁడు దేవనాథుఁడున్
గర్వితదైత్యమర్దనుఁడుఁ / గామవిరోధియు సర్వమానిగం
ధర్వపురందరాదిసుర/తల్లజసంతతవంద్యుఁ డైననా
శర్వుని నంధకాసురుఁడు / చక్కఁగఁ గన్గొని నీడ్యనాద్యుఁగన్ 215

క. మునివర! వాఁ డీక్షైవడి, మనసిజహరుఁ దెలిసి భక్తి / మాటికిఁ బొడమన్
వినయమున మ్రొక్కి యీవిధ, మునఁ బొగడం దొడఁగె దివ్య/బుద్ధి తలిర్పన్.

## అంధకుఁడు హరుని నుతించుట.

ఉ. భైరవరూప! లోకగణ/పాలన! హస్తకపాల! శుద్ధ! దు
ర్వారమహాత్రిశూల! భయ/భాసితమూర్తిధరా! మహేశ్వరా!
సారభుజంగహార! బహు / శత్రువిదార! విపన్నబుద్ధిఁ బెం
పారెడి నన్నుఁ బ్రోవు మన/సారఁగ మ్రొక్కెద నీకు భక్తితోన్ 217

క. గురువిశ్వరూప! కర్పుర, సురవందితపాదపీఠ / సుందర! విశ్వే
శ్వర! లోకజనక! నేని, శరణును జొచ్చితి జయింపు / సగవి వృషాంకా! 218

చ. హరుఁడని సిద్ధులున్ శివుఁడ/టంచని వేల్పులు నుగ్రుఁడంచు ని
ర్జరరిపులు న్మహేశుఁ డని / సర్వజనంబులు భీముఁ డంచు గిం
పురుషులు యక్షపుంగవులు / భూతగణేశ్వరుఁ డంచు భూతముల్
వరభవుడంచు నిన్ను పితృ/వర్యులు పల్కుదు రోమహాధిపా! 219

క. పరమేశ్వర! లోకేశ్వర!, హర! దాసుఁడ నైతి నీకు । నస్మత్పాపో
త్కరముల నడంచి దయతోఁ, బరిపాలనచేయు మిపుడు । భావంబలరన్. 220

వ. దేవా! నీవు త్రిదేవుండవుఁ ద్రియుగుండవుఁ ద్రిధర్ముండవుఁ ద్రిపుష్కరుండవుఁ
ద్రయ్యారుణివియుఁ ద్రినేత్రుండ వవ్యయుండ వామ్నాయమయుండ వఖిలవి
భుండ వగుచున్నాఁడవు నేను శరణాగతుఁడ నైతిఁ బునీతుఁ జేయుము. లోకే
శ్వరా! నీవు త్రినాథనాథుఁడవుఁ, ద్రిపదప్రవిష్టుఁడవు షడంగవిదుఁడవు లలనా
లంపటుఁడవు నగుదువు. దాసుండ నగునేను భీతుండ నై శరణుఁ జొచ్చితిఁ బవి
త్రునిఁ జేయుము. 221

క గిరిశ మహాశంకర గురు, శరభూతగణేశ! గర్వ । తత్పరమతితోఁ
బరఁగుచుఁ దప్పును నీకును, గర మొనరించితిని గావు । కరుణాధారా! 222

ఆ. అభవ! కామహీన । మాస్థిరబుద్ధితోఁ
బరఁగి నిన్ను వేఁడు । వాఁడ నగుచు
శిరము వంచి వినుతిఁ । జేసెద ననుఁ బునీ
తునిఁగఁ జేయు మిపుడు । తోషమొప్ప 223

ఉ. పాపుఁడఁ బాపకర్ముఁడను । బాపరతుండనుఁ బాపజాతుఁడన్
బాపమనస్కుఁడన్విపుల । పాపకరుండనుఁ గాన నో మహా
పాపవినాశనా! సకల । పాపచయంబుల నెల్ల నిర్తతిన్
బాపి దయానిరూఢి ననుఁ । బాలనచేయుము నీకు మ్రొక్కెదన్. 224

క. పురహర! నీచే నేనీ, శరణి నొనర్పంగఁబడియు । గలపంకమునన్
బరఁగితి నేలుము స్పష్టతఁ, బోరి నఘవృత్తాంతసరణిఁ । బొందితి వితమిన్

క. సురుచిరుఁడవు ధాతవు సు, స్థిరమూర్తివి కర్త వమర । శేఖరుఁడవు భీ
కరుఁడవు హరుఁడవు నగుశశి, ధర! నీవు జయింపు మధిక । దర్పోత్కర్షన్. 226

సీ. నీవు మంగళుఁడవు । నీవీశ్వరుండవు నీవవ్యయుండవు । నీవు సృష్టి
కరుఁడవు నీవు పంకజలోచనుండవు నీవు శివుండవు । నీవునాక
పార్థివుండవు నీవు । ప్రణవరూపుండవు నీవు ధర్ముండవు । నీవుకుశల
సత్తముండవు నీవు । సారవషట్కార మీవు సుసూక్ష్ముండ । వీవు ధీర
ఆ. వరుఁడ వీవు వ్యక్త । భాసురమూర్తి వ, వ్యక్త మగుదు వీవు । భవ్యవీర్య
భక్తలోకపాల । బంధురసద్గుణా, జాల! నన్నుఁ బ్రీతిఁ । జాల నేలు. 227

క. స్థావరజంగమకలితం బైవఱలెడి యీ ప్రపంచ । మంతయు నీచే
వావిరి వ్యాప్తం బయ్యెను, పావనసుతనామ మోఘ । భాస్వద్ధామా. 228

తే. ఆదిమధ్యాంతములు నీవె । హర్ష మావె
విజయుఁడవు నీవె భావింప । విశ్వరూప!

వేయిపడగులతోడను । వేయికనుల
తోడ రాజిల్లుదువు నీవు । దుష్టదూర! 229

ఉ. సారమహాభుజాండవయి । సర్వగతుండవు నై సుదీప్తితో
మీరి సమస్తభాగముల । మేమెయిఁ జొట్టి యనంతమూర్తివై
పారెదు హంసరూపమునఁ । జాల వెలుంగుచుఁ జిత్తవాక్యఁజె
న్నారెడి నిన్ను భక్తిచెలు । వార నుతించెద నేలుమీశ్వరా! 230

క. సురరాజ పుణ్యాధిక, పరమేశా వ్యగ్ర రుద్ర । పశునాయక దు
స్తరవీర్యవిజితరక్షా, కరుణఁ బవిత్రునిఁగఁ జేసి । కాపాడు శివా! 231

శా. త్రైవిద్యాన్విత శూలహస్త విజయా । రమ్యోదయా శాశ్వతా
భావజ్ఞా విజితేంద్రియా విజితదు । ర్వారాతిసందోహస
ద్భావా నిత్యనిరంజనా నిరుపమా । భద్రేశ! పాలింపు మా
దేవేశా! శరణాగతుండ నగుదు । దీపించు నన్నిత్తఱిన్ 232

చ. మునివర! యిట్లు దైత్యకుల । పుంగవుఁ డై చెలువొందు సంధకుం
డనితరబుద్ధితోఁ బొగడ । నత్తఱి బింగళనేత్రుఁడున్ మహా
ఘనుఁ డగు శంభుఁ డత్యధిక । కౌతుక మాత్మనుఁ జిందులాడఁగాఁ
గనకసులోచనంబులనుఁ । గ్రాలెడి యాసురవైరి కిట్లనెన్. 233

ఉ. దానవనాయకా! యిపుడు । తద్దయు హృష్టుఁడ నై చెలంగితిఁ
గానఁ ద్వదీయచిత్తమునఁ । గ్రాలుచునుండిన దావరంబునే
మానుగ నిత్తుఁ గోరుమని । మారవిరోధి వచింప నాతఁడా
దీనశరణ్యుతోఁ బలికె । దీపితవాంఛ లెలర్పుచుండఁగన్. 234

ఆ. జనని గిరిజ నాకు । శర్వ! తండ్రివి నీవు
మానితములు సతత । మంజులములు
నైనమాతృపాదు । లాబ్జంబులనుఁ గూర్చి
మ్రొక్కుచున్నవాఁడఁ । బూర్ణభక్తి 235

క. శారీరచిత్తకృతవి, స్తారము నై దుర్విచింతి । తంబును నగునా
క్రూరాఘము దనుజత్వా, ధారస్థితి వాపి యొసఁగు । త్వత్పదభక్తిన్. 236

హరుఁ డంధకుని భృంగీశ్వరుఁ డగునట్లు వరమొసఁగుట.

మ. అనఘా! వాఁడిటు లాడఁగాఁ బ్రమథదే । వాధీశుఁ డాశంభుఁ డి
ట్లనె నోదానవనాథ! నీకుఁ గలస । ర్వాఘంబు దైత్యత్వమిం
క నశింపఁ బోవు గణేశ్వరుండవు మహా । గణ్యుండ వౌభృంగి వై
ఘనకీర్తిఁ దనరారఁగాఁ గలవు నీ । క్కంబంచు నీకైవడిన్. 237

క. అని వాని నంగరస్థల, మునను౦డి తరింపఁ జేసి । ముద మొదవఁ గరం

మునఁ దుడిచి విప్రునిఁ జేసి నిలింపులఁ దలఁచె నంతఁ । జిత్తమునందున్. 238
క. మనసునఁ దలఁచినమాత్రమె, వనజాసనముఖ్యదేవ।వరు లతిభక్తిన్
జనుదెంచి భవునకును వం,దనములు గావించి రపుడు । తాపసనాథా! 239

ఉ. ఇందుధరుండు నందిని గ।ణేశుల నందఱ నిల్పి ప్రేమతో
ముందఱ నిల్పి యీయసుర।పుంగవుఁ డంధకుఁ డంచు భృంగినిన్
బొందుఁగఁ జూప విస్మయముఁ । బొందుచు వారెనలేనిమేనితో
నందు గణేశుఁడై వెలయు।నట్టి సురారినిఁ జూచి భక్తితోన్. 240

క. వరదుఁడు వృషభధ్వజుఁ డా, హరునిఁ బ్రశంసించి రంత । నలఁ డాసురలన్
బరికించి పలికె నీమం,దిరములకున్ బోయి వేడ్కఁ । ద్రివిధసుఖంబున్.

తే. అనుభవించుచునుండుఁడీ । యమరవిభుఁడు
మంగళప్రద మైనట్టి । మలయగిరికి
నరిగి నిజకార్యమును నెఱ । నాచరించి
చేరనగు వెండి స్వర్గంబు । శిష్టులార! 242

ఆ. ఇట్టు లాడి శంభుఁ । డెలమి సన్మానించి
పనుప నేగి రంత । వాసవుండు
హరినిఁ గౌఁగిలించి । యబ్జాసనునిచర
ణాబ్జములకు మ్రొక్కి । యంతఁ గదలి 243

క. ఘనమైన మలయగిరికిని, జని తనపనిఁ బూర్తిచేసి । సంతోషంబా
త్మను వెలయ దివికి నరిగెను, దను నెల్లరుఁ బ్రస్తుతింపఁ । దాపసనాథా! 244

సీ. శక్రాదిదేవత।ల్పన సుస్థిరుండయి భగవంతుఁ డైనట్టి । భర్గుఁ డపుడు
మానితతనుమధ్య।మార్గంబువలనను విడిచెను బ్రమథుల । వేడ్క వారు
తగ శంభునకు మ్రొక్కి । తమతమవాహనముల నెక్కి నిజవర।పుణ్యలోక
ములకును జని కామ।ముల నిచ్చు సర్వకామాకరంబులు నగు।నట్టియాల
ఆ. వలకాపులందు । నమృతప్రదాయగా
చారుతలములందు । సారహాయ
సప్రకర్దమములు । సరసంబు లౌ హ్రద
చయములందుఁ దిరుగఁ । జనిరి వేడ్క. 245

క. తమతమవసతుల కాయా, ప్రమథులు చన హస్తమందు । భవుఁ డంధకునిన్
సమమతిఁ గొని మందరశై,లమునకు శైలాదిఁ గూడి । లలి నరిగె మునీ! 246

ఆ. హరుఁడు రెండువేల।హాయనంబులకును, వేశ్మమునకు నేగి । శ్వేతభాను
కుసుమగతయునైన । కుధరజ గని జయ, లక్షణముల నంత । లలిఁ దెలంగి.

క. చనుదెంచు శివునిఁ గని గిరి, తనయయు శుభార్కపుష్ప।తల్లజమును జ

య్యున పీడి దాఁగియుండిన, తనచెలికత్తెలనుఁ బిల్చి దయ చిగురొత్తన్. 248

ఆ. అంత దేవిచేత నాహూత లై విజ, యాదు లైనచెలులు హర్ష మొప్ప
రాఁగ నట్టిసఖుల రహిఁ గూడి శివ శివ, దర్శనాభిలాషఁ దనరుచుండె. 249

మ. అనఘా! శంభుఁడు నంది నంధకసురేంద్రారాతినిన్ గౌరినిన్
గని యంతన్ సతిఁ గౌఁగిలించి మదిలోఁ గౌతూహలం బొప్ప ని
ట్లనె; నీదైత్యుఁడు దేవి! నీకిఁకను దాసాగ్ర్యుండు నై యుండు న
ట్లొనరింపంబడె యుష్మదాగతసుతున్ సోత్కంఠతోఁ జూడుమా. 250

ఆ. ఇట్టు లాడి కర్పూరేశులో ననెఁ బుత్ర
రమ్ము రమ్ము సత్వరమున నిప్పు
డగజశరణుఁ బొందు మది నీకు మంగళ
ప్రదయు నగునటంచుఁ బలికెఁ దమిని 251

మ. హరుఁ డీక్షింపఁ బల్కి భృంగియును దైత్యాధీశుఁడున్ సద్గణే
శ్వరుఁ డౌనంధకుఁ డంత వచ్చి గిరిజాపాదాంబుజాతద్వయిన్
శిరమున్మోపి నమస్కరించి పలికెన్ సేవ్యంబు పాపఘ్నమా
పరమశ్రీశ్రుతిసమ్మతస్తుతిని సద్భావస్థితి న్నారదా! 252

అంధకుండు పార్వతిని బొగడుట.

క. శ్రీరంజిల్లెడి మొగమున, సారెకు రాణించి మించి శర్వార్ధాంగా
ధారిణి వౌ నీకును మన, సారను మ్రొక్కెదను బ్రోవుమా పరదేవీ! 253

క. ధీరవు విలసచ్ఛుభదా, కారవు నిర్మలవు భూరికౌతుకవు సదా
చారవు మామోహాపాయా, ధారవు మ్రొక్కెదను గావు దయతో గిరిజా!

చ. పురహరురాణి వై దనుజపుంగవులన్ బటుశక్తితోడ సం
గరమున గెల్చి సర్వసురకాంతసమర్చితపాదపద్మ వై
నిరతము భక్తసంఘముల నేర్పున నేలుచుఁ బూజ్యపద్ధతిన్
బరఁగెడినీకు మ్రొక్కెదను భావమురంజిల నేలు మీశ్వరీ! 255

క. నారాయణసోదరి వై, దారుణపంకముల నడఁచి తత్త్వస్థితికా
ధారవగు నీపదాంబుజ, సారసములఁ గూర్చి జోతసల్పెద నార్యా! 256

సీ. నీవు శరణ్యవు నీవు మృడానివి నీవు విద్యవు నీవు నిపుణశక్తి
నీవు త్ర్యంబకసతి నీవు సంతతసర్వభూతార్చితవు నీవు భూధ్రపుత్రి
నీవు మహామాయ నీవు సుమాయవు నీవు లజ్జవు మతి నీవు శుభద
నీవు సరస్వతి నీవు ప్రీతివి నీవు వైజయంతివి మహాపావనివియు

ఆ నీవు దయయు స్మృతివి నీవు వేదము నీవు, దపము నీవు కాళరాత్రి నీవు
కామదవును నీవు కళ్యాణివియు నీవు, కరుణతోడ నన్నుఁ గావు దేవి!

వ ఓమాహేశ్వరి! నీవు భవానివి, భూతభవ్యప్రియవు, కౌమారివి, మాతవు,

మహాదేవప్రియవు, స్యందినివి, త్రైలోక్యజనయిత్రివి, ధాత్రివి, శేవధివు, నగు
దువు, శరణుఁ జొచ్చితిఁ గరుణాకటాక్షవీక్షణంబుల నీక్షణమందు దీక్ష నను
రక్షింపుమని వేఁడె. ఇట్లంధకుండు స్తుతించిన విభావరియగుపార్వతి సంతసిల్లి
పుత్రా! నీవాగడ్తకు నీభక్తికి మెచ్చితిఁ గావలసినవరంబుఁ గోరు మిత్తునన నా
దేవి కతఁ డిట్లనియె 258

క. గిరిజా మత్త్రివిధాఘము, హరిఁ బోరి నశియించునట్లు । పురహరుపై నా
కరణిని సంతతముగా స్థిర, తరమగుచున్నట్టిభక్తి । దయమై నిడుమా. 259

క. మునివర! యాతం డాయెడ, నన నట్లగునంచుఁ జేర్చి । నగసుత యన క్ర
స్ననవాడె మదగ్రంబునఁ, దనరారుచు భక్తిబుద్ధిరతభృశోత్తుంగన్. 260

క. హరునర్చించుచుఁ బ్రమథే, శ్వరుఁడవుగా నుండుమనుచుఁ । బరమవరంబుగ
గరుణ నొసంగిన వాఁడా, పరణిన్వర్తించుచుండె । సంతసపడుచున్. 261

సీ. హరుఁడు భయంకరాకారమైనట్టిభైరవమూర్తిని గైకొని । మోహరమున
యసురేశుఁ డైనట్టియంధకుఁ బరిమార్చి తనశక్తితోడ నా దనుజవిభుని
భృంగీశుఁ గాఁ జేసి రంగారునట్టియా హరకీర్తివర్ధన । మతులశుభద
కరము పుణ్యోదయకల్యాణంబు నగుగాథ నీకు నేఁ జెప్పితి । నమ్మి దీని

ఆ. వితతధర్మకామవిత్తాయురారోగ్య, వాంఛ నలరువారు । భక్తితోడఁ
జదివిరేని మోక్షసామ్రాజ్యముఖసర్వ, భవ్యఫలములెల్లఁ । బడయఁగలరు.

క. అని యిట్లు పులస్త్యుం డన, విని నారదుఁ డనియె దేవవిభుఁ డుద్ధతితో
డను మలయంబున సేవని నొనరించెనొ దానిఁ బల్కు । ముజ్జ్వలతేజా! 263

ఇంద్రుఁడు మలయగిరిపై నున్నహారాదిరాక్షసులఁ జంపుట.

ఉ. నారదుఁ డిట్లుపల్క మునినాయకుఁ డైనపులస్త్యుఁ డంత వి
స్తారదయన్వచించె! మునిసత్తమ! యామలయాద్రియందు దై
త్యారియు నైనశక్రుఁడు నిజాఖిలలోకహితార్థమై మహా
ధీరతఁ జేసినట్టిపని । దెల్పెద నీవిపు డాలకింపుమా! 264

క. సురవిజితు లగుచుఁ గర్బుర, వరు లఘుదైత్యోక్తివలనఁ । బాతాళమహా
పురగమనోత్సుకులై చను, తరుణంబున దారియందుఁ । దాపసనాథా! 265

సీ. భూసురమునిసిద్ధపుంగవసేవితకందరంబుల నొప్పి ఘనలతావి
మానావృతంబు నై మత్తజంతువ్యాప్తమగుచు శీతలము నై నలరి భూరి
భుజగగణాక్రాన్తములు నై ననిరవులచేత నిల్లప్పుడు । సేవ్యమగుచు
మాధవీసుమపరిమళగంధి యగునట్టి మంజాలతరమునా । మలయగిరిని

ఆ. దక్షిణస్థశిఖరతలముల గురుసాను, కలితఝరుల దివ్యకమలతతులఁ
గందశైలధాతుకర్ణుకుంజంబులఁ, జెలువుఁ గాంచి కుతుక । మెసఁగుచుండ.

క. చని క్రమకర్షితులయి యా, దనుజాలు మలయాద్రియందుఁ । దనరారెడిచ

ల్లనితాపులనస్సించుచుఁ, దనివిగా జెన్నొందునట్టులరుణాంబుదున్. 267

తే. ఘోరతమునకును ముదమునుఁ । గలుగఁజేసి
లేమినిఁ దాపులకెల్లను । దాపునగుచుఁ
బల్లఁదనమున నేపారి । మెల్లఁగాను
దక్షిణపుగాలి వీచె సుగంధములీల 268

వ. అంత సంతసంబున. 269

క. తారకమయాదిదానవ, వీరులు నాస్థలమునందు । వేడుకతోడన్
జేరి సమస్తసుధీజన, వైరులు నైయుండఁ దెలిసి । భవుఁ డమరేంద్రున్. 270

ఆ. కనిచె నపుడు నాక । పార్థివుం డరుగుచు
మార్గమందు ధేను । మారిఁ గాంచి
దాని కెరఁగి దీప్తిఁ । దనరెడుమలయాద్రిఁ
జేరఁ బోయి యుండుఁ । జెలువ మమర 271

ఉ. పెక్కుసుఖంబులన్ జెలఁగు । భీకరదైత్యులఁ గాంచి కిన్కబ
ల్పెక్కటిలన్ సురేశ్వరుఁడు । పిల్చెను రమ్మని వారిఁ జివ్వకున్
మిక్కిలి యానిశాచరులు । మేదుర సాయకపంక్తులన్ వడిన్
జక్కఁగ నేయుచున్ బృథుల । శౌర్యమునన్ జనుదెంచి రత్తఱిన్. 272

క. సురనాథుం డాబాణౌ, త్కరమునదృష్టుండుఁ జిత్ర । దర్పునుఁ డగుచున్
గిరిమొయిలు కప్పినట్టుల, శరములఁ గటికతెనిఁ గప్పెఁ । జటులోద్ధతితోన్

వ. ఇట్లు విజృంభించి తూఁపులఁ గప్పి వెండి శరాసనంబున శిరానఁ గంకపత్రసమం
బులగు కటికుటమ్ముల సంధించి వైచి మయతారకాదినక్తంచరులను బాకదాన
వునిఖండించి సకలదేవవిభుండగు వాస్తోష్పతినిజశాసనంబున నటఁ బాకశాస
నుండనుదృఢనామంబు లిఖించి క్రన్నన. 274

క. కరమావిధమునఁ బురక, ర్బురబాణాసురశతంబు । భుజబల మొప్పన్
గురుపుంఖాస్త్రంబులతోఁ, బరువడి భస్మంబుచేసి । వసుధన్ గూల్చెన్. 275

క. మునివర దాన పురందరుఁ, డనునామము హరికి నలరెనని విజయుఁడు నై
ఘనులందఱు వినుతింపఁగ, దనుజేశ్వరబలము నడఁచె । దర్పస్ఫూర్తిన్ 276

క. ఈకరణి దైత్యసైన్యము, పాతాళతలంబు నగుచుఁ । బాతాళమహా
లోకమును జొచ్చె నప్పుడు, భీకలితం బగుచు సోలి । వేగముతోడన్ 277

క. మునివర యాపనిపోఁ బిమ్మట, ఘనవాహనుఁ డనుపఁబడెను । గరకంఠునిచే
దను నీవిఁక నద్దానిన్, వినవలతువొ యదుగు నీకు । వినుపింతుఁ దగన్. 278

చ. అనుటయు నారదుండు ముది । హర్షము పెంపునుజెంద నాతనిన్
గని యను నేలాకో విబుధ । గణ్యుఁడు నాహరి గోత్రభేది యై

తనకెనా యట్టిసంధియము । లద్దయుఁ జెన్గొనసాఁగనన్న నా
ముని యనె దానిఁ జెప్పెదను । మోదముతో విను నీవు నారదా. 279

## మరుదుత్పత్తి.

సీ. కనకకశిపుఁ డనిఁ । గమలాక్షుచేఁ జావ దితి నష్టపుత్రయై । దీనబుద్ధిఁ
గశ్యపుతో ననె । గణ్యాత్మ ! నాకును బలివగుచున్నావు । పరమదయను
సురపతిఁ జంపెడు । సుతు నిడుముని వేఁడ । నాథుఁ డాడెనో । యతివ ! వినవె
నీవు సదాచార । నిపుణవై వెయ్యేండ్లు నివసింపఁగలవేని । నిర్జరేంద్రు

ఆ. గెలుచునట్టివాఁడు । కీర్తివంతుఁడు నగు, గణ్యపుత్రుఁ బడయఁ । గలవు నిక్క-
మట్లు చేయుదున్న । నాత్మేచ్ఛ తోనసాఁగ, దనుచు నిట్లతండు । ననియె నంత.

క. అనాటి నిష్ఠనుండెను, మానితుఁ డగుకశ్యపుండు । మమతను గర్భా
ధానము దాని కొనర్చియు, భానుండుదయించునట్టి । పర్వతమునకున్. 281

ఆ. అప్పుడేగ దేవ । తాధిపుఁ డాయాత్ర, మస్తభూమిఁ జేరి । మహితనిష్ఠఁ
గడఁగుచున్న దితిని । గని పల్కెఁ గడుభక్తి, చెలఁగుచుండ నిట్లు । శిష్టచరిత

క. ఓతల్లి నీకు సేవను, జేతఃప్రీతుండ నగుచుఁ । జేసెద నిష్టం
బీరతిఁ గలిగినచో నీ, వాతతమతి దానిఁ బల్కు । మార్యులు మెచ్చన్. 283

క. అన భావికర్మవశగత, యనమున నాదేవి యపుడు । నుంచిది శక్రా
యన నంత నతఁడు సంతస, మున నట వర్తించుచుండి । పుణ్యనిధానా. 284

క. విలయమును వెదకెడిసర్పము, వలెఁ దనపనిఁ గోరి దుష్ట । భావంబున నా
లలనకు సమిదాహరణా, దులఁ దోడయి తోలుచుచుండెఁ । దోడ్తోడఁ దగన్

చ. పరమగుణాఢ్య యైనదితి । బంధురదివ్యతపోవిలాసభా
సుర యగుచుండి భూరితర । శోకముతోడఁ జెనంగి వేయివ
త్సరములు దాఁట మూర్ధసహి । తంబుగ మున్గి విముక్తకేశయై
సరవి నిజోత్తమాంగమును । జానుయుగోపరిఁ జేర్చి యాయెడన్ 286

ఆ. శిష్టపాద యగుచుఁ । జెదరినవైనట్టి, కురులతుదలఁ దొడలి । కూర్కు నొందె
నిర్జరుండు నయ్యు । నిర్జరేశుం డట్టి, యదన నెఱింగి తుష్టి । యావహిల్ల. 287

క నాసాబిలమున నాదితి, భాసుర మగుకుక్షిఁ జొచ్చి । పదఁపడి జఠరా
వాసంబునఁ జెనుపునుఁ గని, భాసిల్లుచునుండి యపుడు । భావంబలరన్ 288

క. కరములు మొలయందిమ్ముఁగఁ, దొరలాడుచునుండ నూర్ధ్వ । ముఖుఁడై రుచిఁ దాం
బిరవోవు డింభకుని నా, కరణిఁ బటుమాంసపేశిఁ । గని మొగమందున్. 289

చ పటికఁపుత్రాలనై పడిని । భాసిలు నాగురుమాంసపేశిని
దటుకున బాహుయుగ్మమునఁ । దాల్చి మహేంద్రుఁడు దానినిన్మహో

త్కటపటుకోపుఁ డై పిసుకఁ । గ్రక్కున నూర్ధ్వగతం బధస్థమం
తట గతినంబునై వెలసి । తారసిలెఁ గనకద్రి వింతగన్. 290

ఉ. నారద! పుట్టెఁ దానివల । నన్మరుతోటులనొప్పినట్టిదా
దారుణవజ్ర మట్టిపవిఁ । దత్తణమాదితివృద్ధగర్భముం
ధీరుఁడు నై పురందరుఁడు । త్రెంచెను సప్తవిధంబు లొప్పన
వ్వారిగ నాస్తనంధయుఁడు । బాధితుఁ డై ప్రలపించె నాయెడన్. 291

క. పదఁపడి దితి మేల్కని హరి, యదయుఁడు నై చేసినట్టిదగు చేష్టితమున్
మదిఁ దెలియక రోదనమున, గొదలెడి సుతుఁ డాడువాక్యముల మాసింద్రా!

క. విని సురపతి యాబాలునిఁ, గనుఁగొని రోదుష్ట! నీవు । ఘుర్ఘురముఁగఁ జెం
పున నిటు ప్రలపింపకుమా, యని సప్తవిధంబు లొప్పనకనిన్మలన్. 293

వ. ఒక్కొక్కనిఁ గ్రమంబున. 294

సీ. నలుక వారలు దేవనాథుఁ డొనర్చిన సకలోపచారసంచయముతోడఁ
గడఁగి మరుద్గణాఖ్యను దేవభృత్యు లై వెలసిరి దీప్తితో । విబుధవరుఁడు
కులిశంబుఁ జేఁబట్టి । కుతుకచ్యుతుండు నై వచ్చుశాపభయంబువలన దితికి
దండమర్పించి యోతల్లి! నాయం దపరాధంబు లేదింక । బాధకుఁడని

తే. పట్టి చంపితిఁ గ్రోధంబు । వలదటన్న
నామె యనె శక్ర! సంపూర్ణమైనకాల
మందు నీలాటివధ మలరారెఁ జూడ
నిట్టిదుర్విధి మున్నయ్యె । నెంచ నకట! 295

క. అని యిట్టులాడి దితి నిజ, తనయుల నూరార్చి దేవనాథువెంటం
బనిచెను మును హరి యిటు తన, యనుజుల గర్భగులఁ జంపెనకనిని భీతిన్.

వ ఇట్లామునిపలుకఁ గలవాకనుఁ డతనిఁ గాంచి ఋషిపుంగవా! యిపుడు నీచేతఁ
జెప్పఁబడిన దితిజోత్తములగు మరుత్తు లెవరు? మరున్మార్గస్థులై మున్నున్నమరుత్తు
లేవారు? తొల్లి మన్వంతరముల వెలసినమరుత్తు లెవరు? కరుణించి వారినిఁ
దెలుపు మని ప్రార్థించిన మహానందకందళితహృదయారవిందుఁ డై పులస్త్యుఁడు
చెప్పఁదొడంగ. 297

స్వాయంభువమనుకాలమరుదుత్పత్తిక్రమము.

క. అనఘా! మన్వంతరముల, నానరుమరుత్సంభవంబు । నురుతరభక్తిం
బొనరారుచున్నబుద్ధి, న్వినుమా యనుమానమేల । వివరింతుఁ దగన్ 298

క. ఘనుఁ డౌస్వాయంభువునకు, జనియించెను సువ్రతుండు । సజ్జనవరుఁ డా
మనువాతనికిని సువనుం, డనుసుతుఁ డుదయించెఁ ద్రిభువనాధికకీర్తిన్. 299

క. అనపత్యుం డయి యాతఁడు, చనఁ బిత్రుగతి కంత నతనిసద్భార్యయు నై

తనరినసుదేవి దుఃఖంబున విహ్వలమైనచిత్తమునఁ దనరుగనిన్. 300

తే. కౌఁగిటను జేర్చి వెతపునఁ గ్రాలి నాథ
నాథ! యని సారె సారె కనాథరీతిఁ
గాను విలపించి యగ్నిలోఁ గాల్చుకొంటకు
నిడనిదయ్యెను బ్రాణేశు సిద్ధచరిత! 301

సీ. ఆసమయంబున ననె నశరీరిణి వినువీథిపైనుండి వింతచెలఁగ
భూపతిసతి! నీవు భోగలకు మీఁదుడ నధికసత్యము నీకు నలరెనేని
పతిఁ గూడి చిచ్చునఁ బడుమన్న నామాట నాచెలి విని తూవివాగకు! విగత
తనయుండు నగునట్టిధరణీశ్వరునితోడ నగ్నినేఁ బడఁజాలనని నద్ది

ఆ. పతికి నంత బాల! ప్రలపింపకుము వహ్ని
వడినిఁ జొరుము వాస్తవముగఁ బుత్రు
లేదు రావసుంధరేశునకుఁ గల్గఁ
గలరు శ్రద్ధఁ బూని క్రాలుమిపుడు. 302

క. అనఘా! యిట్లశరీరిణి, యన నాచెలి చితిని బతిని నతిమోదముతో
డనుఁ జేర్చి దహను మదిలో, వినుతించుచుఁ జిచ్చుఁజొచ్చె విస్తృతభక్తిన్.

ఉ. అంత మహార్తమాత్రమున గాఁడు శ్రీయుతుఁడై నిజాంగనా
సంతసమొప్పఁగాఁ గలిసి చయ్యన లేచి ధరిత్రిఁ జేరి ని
శ్చింత సునాథపుత్రియు వివశిష్టయు నాపతితోడ నాయుదా
గంతుని కేళిలో మెలఁగెఁ గౌతుకమాత్మఁ జెలంగ నారదా! 304

చ. వితతరజస్సుతోఁ గలిసి వెల్లునిజప్రియుఁ బొందినట్టియా
తులితపతిన్మహామతులు శ్రేష్ఠులు బంధురవీర్యయుక్తులుఁ
జతురమతుల్ మహీశ్వరులు సాహసశాలురు శౌర్యవంతులౌ
సుతు లుదయించి రత్యధికశోభితదేహులునై ముదంబునన్. 305

చ. మునివర! భవ్యయోగమున భూపతియా సువసుండునై మునా
దినములు జాయతో వెలసి దీప్తిని మింట వసించియుండి క్ర
న్నన ముద మొప్ప నాతవదినంబునఁ బూర్ణరజస్స్వ మేర్పడం
గని ప్రియురాలితోడ రతిఁ గాంతనొనర్చెను గామచారియై. 306

సీ. వినువీథివలన నావీర్యంబు జారె నావిధమైనపిడప నావిభుఁడు పేర్మి
భార్యాయుతుండునై బమ్మదేవరకడ కమలమా గలితోడ నరిగె సత్య
వాదులు భుజబలవరులు కృతాస్త్రులై తత్సూను లలరిరి ధాత్రిమీఁద
నత్రవర్ణంబునై యంబరచ్యుతమునై దీప్తి నాభూవరు దివ్యవీర్య

ఆ. మును గ్రహించి నలిని ముదమొందె నలినీల
చిత్రకద్విశాలశిష్టహారిత

విమలనామములను । వెలఁగెడిమునిసతు
ల్పుష్కరస్థ మగుచుఁ । బొదిలి మిగుల 307

క. ఒనరెడినృపుశుక్రము స్వే, చ్ఛను గని తదమృతమునెల్ల । సంతతతరుణం
బునవలరువలపుతోఁ గై, కొనఁదలఁచి తపోధనులను । గూర్చి మునీశా! 308

చ. అడుగనివారలై సవిధినంత మునింగి విశేషభక్తితో
నడరుచుఁ బ్రాణనాథచరణాబ్జయుగంబులఁ గొల్చి పిమ్మటన్
వెడవెడఁ బుష్కరస్థమయి । వెల్గుమహేశ్వరు దివ్యవీర్యమున్
గడునిజభర్తృశాసనముఁ । గైకొని క్రోలిరి కాంతతో మునీ! 309

క. మానవపతివీర్యంబును, మానితగతిఁ గ్రోలినంతమాత్రంబుననా
మానినులు బ్రహ్మతేజో, ధానవిహీనత్వసరణిఁ । దనరారి రాగిన్. 310

క. దానన్ దదఖిలమునివరు, లానారులు దోషకలిత । లగుదురటంచున్
మానసములఁ దలపోయుచు, మానుగ విడనాడి రట్టిమానినులు మునీ! 311

చ కనిరట సప్తసూనులను । గ్రక్కున వారతిదారుణంబుగాఁ
గను బ్రలపించి రట్టిగతిఁ । గ్రాలినఁ దద్రుదితారవంబు పెం
పునఁ జెలరేఁగి సర్వమును । బొంది సముద్ధతినిండ వారిజా
సనుఁ డరుదెంచి యావిపులశౌర్యవిలాసులతోడ నాయెడన్. 312

మ. అని నోబాలకులార! దుఃఖపడ నేలా రండు విన్వీథిపైఁ
బొనరారున్మరుదాఖ్య వీరుఁడి రమై । పొల్పారి సత్యంబటం
చని వారిన్ గొని యభ్రమార్గచరుఁడై । హర్షించుచున్ దీప్తితోఁ
జని వారంబులఁ గా మహాకరుణ నాజ్ఞాపించె మౌనీశ్వరా! 313

వ. నారద! ప్రథమస్వాయంభువమనుదిష్టమందు వారిట్లు మరుత్తులైరి. స్వారోచిష
మనుసమయమున నుద్భవించిన మరుదాఖ్యుల వివరించెద నాలింపుము. 314

స్వారోచిషమనుకాలమరుదుత్పత్తిక్రమంబు.

క. స్వారోచిషమనువునకును, ధీరుఁడు శ్రీమంతుఁ డధికదీప్తుండు మహా
వీరుఁడు ఋతధ్వజాఖ్యుఁడు, మారుఁడు జన్మించెఁ దొల్లి । మానిలలామా! 315

క. అతనికి భానుపరాక్రము, లతిబలులగు పుత్రు లేడ్వు । రలరి తపస్సం
గతులై స్వర్ణాద్రికిఁ జని, తతవిష్ణుపదంబుఁ గోరి । దక్షులు మెచ్చన్. 315

సీ. బ్రహ్మను భక్తి నారాధింప హరి భయాతురుఁడు విపన్నచిత్తుండు నగుచు
నచ్చరచేడియలందుఁ బొగడ్తతో నలరారుపూతనాఖ్యాప్సరసను
రమ్మని పిలిచి యోరామ! పెద్దపసిండికొండకు హాయలుబల్కుమరుమిగులఁ
బోయి యాయద్రిపై । భూరితపస్సునఁ దక్షులు నాఋతధ్వజానితనయు

తే. లతుఁ దపోభంగసరణి యేలాగుఁ బొనరఁ
గలుగునో యట్లు చేయుము । కార్యసిద్ధి

భంగమగు ఘారలకు నాకు । భావగతము
నైనభయమంతయును బోవు । ననుచుఁ బేర్మి 317

క. సురపతి యిట్లన విని సుం, దరవరరూపంబుతోడఁ । దనరెడియా ఋ
చ్చరయు ఋతధ్వజసూనులు, సొరిదిఁ దపోనిష్ఠనుండు । చోటికి వడితోన్. 318

ఆ. అరిగి నాశ్రమమున । కనతిదూరంబున, మందజలముతోడ । నమలసిపాలు
నట్టియేటియందు । నారాజసుతు లరి, గిరి మునుంగుటకును । గెరలుకోర్కె.

ఉ. చారుతనూవిలాసమునఁ । జాల వెలింగెడు నావెలంది యా
భూరినది న్మునుంగుటకుఁ । బోయి జలంబునఁ గ్రుంకుచుండ నా
వీరులు దానిఁ గన్నులను । వేడ్కఁ గనుంగొన వీర్య మయ్యలం
జేరెఁ దదీయశుక్రమును । జేకొని సంతస మొప్పుచుండఁగన్. 320

వ. శంఖాఖ్యగ్రాహవల్లభయు జలచారిణియు నగుశంఖిని త్రాగె. 321

శా. వారంతన్ జెడినట్టికాతపమున । న్వర్తించుచున్ జైత్యకం
ఠై రాజిల్లెడి రాజ్యభూమికిని బో । దాయత్తచిత్తంబు లౌ
వ్వారన్ బోయిరి శక్రుసన్నిధికి న । త్యంతానుమోదంబుతో
నారామామణి వోయి యాస్థితిని స । త్యంబొప్పఁ జెప్పెన్ దగన్. 322

ఆ. అనఘ! వార లట్టు । లరుగ నాగ్రాహిణి, పెద్దకాలమునకుఁ । దద్దఁ జిక్కి
ధాత్రినుండ దాని । దర్శించి బాలరు, లాత్మలందు విస్మ । యంబుపొదల. 323

క. చని తీరుల ఋతధ్వజ, తనయుల కెఱిఁగింప నోగ । ధనవరు లగునా
జనవిభు లాతఁడ నచటికిఁ, జని దాని గృహంబుఁ జేర్చి । సంతసమలరన్. 324

చ. ఘనపురవాపి నీడ నది । క్రన్నఁ బుత్త్రుల నేడ్వురన్ గనెన్
దనయులు పుట్ట మాతసుప । థంబున కాయది చేరెఁ దండ్రియున్
జననియు లేక వారు జల । సంస్థితులై చనుఁబాలకోసమై
పెనఁగొనుచింత నేడ్వ విధి । వేగమె వచ్చి వచించె గాదిలిన్. 325

వ. బాలకులారా, ప్రలపింప వలదు స్వస్థచిత్తులై యుండుఁడు. మీరు వాతస్కంధవిహారు లగుదేవతలు కాఁగల రని పల్కి వారినందఱను గొని మరున్మార్గమందు దైవతస్థితులఁ జేసి విరాజమానుఁడయి నిజసదనంబున కరిగె. ఇట్లు స్వారోచిషమనుకాలమరుత్తు లాఖ్యాసింపఁబడిరి ఉత్తమమనుసమయమున నెవ్వరు మరుత్తులైరో వారిని జెప్పెద నాలింపుము. 326

ఉత్తమమనుకాలమరుదుత్పత్తిక్రమము.

క. మునివర యుత్తమమనుకుల, మునను వపుష్మంతుఁ డనెడి । పుత్త్రుండు జనిం
చెను నిషధేశుఁడు రవిసమ, తనుఁ డొక్కఁడు మున్ను పండి । తప్రభు లెన్నన్.

క. అతనికిం బుట్టెను విఖ్యాతగుణోత్తముఁడు ధర్మ । యశాత్మజుం డా

జ్యోతిష్మంతుఁడు శ్రావ, భీతికరుం డగుచు దీప్తి । వెలయుచునుండన్. 328

ఆ. అతఁడు పుత్రకాముఁ । డగుచు మిన్నేటిని
దపముతోడ మిగులఁ । దన్పుఁ దయ్యె
నతనిభార్య యైన । నమరగురుప్రియ
పుత్రి యట్టి తివురు । బుద్ధితోడ. 329

క. మానితభూరితపోసం, ధానుం డగుపతికి భక్తి । దళుకొత్తంగా
గానసమిత్పులాళిని, మానుగ నర్పించి దాసి । మాడ్కి మునీంద్రా. 330

తే. వెలసి యాసారసాక్షి సం । ప్రీతి మిగుల
నతిథి సత్కారమును బ్రత్య । హంబు సలిపి
పతితధర్మాభిరతియు నై । చాలఁ జక్క
పతిని సేవించుచుండెను । భావమెఱిఁగి 331

ఆ. భూరితపమువలనఁ । బొల్పారి తేజోభి, రామ యగుచు సతత । రామణీయ
గాత్ర మొప్పునట్టి । కాంతను సప్తర్షి, వరులు చూచి యిట్లు । పలికి రనఘ 332

క. వనితామణి నీపతిసీ, వనితరమతు లొప్ప ఘోర । మగుచున్న తప
స్సునఁ జేసెద రేకారణ, మునవ్వై యన నామె పలికె । ముదము చెలంగన్.

చ. తనయులఁ గోరి మేమిపుడు । తద్దఁ దపఃక్రియనుంటిమన్న నా
వనితకుఁ బుత్రదానమును । వారిడ నాత్మలయందు నెంచి యి
ట్లనిరి మునిప్రసాదమున । నాధ్యులు నాసుతు లేడ్వురింక వి
కును జనియింత్రు సత్యమని । కూరిమి నిట్లు వచించి యాయెడన్ 334

క. పోయిన నానృపమణి నిజ, జాయామణిఁ గూడి భూరి । సంతోషముతో
నాయెడ నిజపురమునకు సు, ఖాయతమతితోడ నరిగె । నార్యులు పొగడన్.

సీ. అంతఁ బెక్కుదినంబు । లరిగిన నారాజపత్ని మహారాజ । వరుఁడు నగుచు
భాసిల్లు తననాథు । వలన గర్భముఁ దాల్చి భూరిభారంబునఁ । బొదలె నవ్వ
డాతఁ డుమ్మృతిఁ జెంద । నాపతివ్రత పతిఁ గలిసినదై యగ్నిఁ । గ్రాలుబుద్ధి
నలరి మంత్రులు వల । దనుచుఁ దన్వారింప వినక నిశ్చలభక్తి । వెలయుచుండఁ

ఆ. పతినిఁగూడి చితిని । బ్రాలఁగా నత్తతి, నగ్నిమధ్యభాగ । మందు నుండి
పడె నపత్యమైన । పరమశీతలవారి, దానసిక్త మగుచుఁ । దాపసేంద్ర. 336

వ. అంత నద్ది సప్తవిధంబులయ్యె నిట్లా నరిసవారోత్తమమన్వంతరమందు జనించి
నక్ష్యసనులు తామసాంతరోద్భవు లగుగంధవహుల నుడివెద నాలింపు. 337

తామసమన్వంతరమువృత్తాంతక్రమము.

తే. గానవాద్యకవిప్రియ । మానధనుఁడు
చారుకేతుఁడు గురుకీర్తి । సహితుఁ డైన

చిత్రకుఁడు క్ష్మాఁ దామస। శ్రేష్ఠ మనువు
నకును ప్రియసూనుఁడును జన।నాథుఁ డగుచు. 338

సీ. ఆరాజశేఖరుఁ। డార్తజాలముఁగోరి నిజదేహమందున। నెగడునట్టి
మజ్జాయకృద్రక్త।మాంసాస్థిశోణితస్నాయువీర్యములఁ గో।శములసప్త
వీతిహోత్రులయందు। వేల్చెను క్రమమున వీర్యపాతనమైన। వెనుకఁ దల్ప
వల దనుశబ్దంబు। వఱలె నానృపుఁ డిట్లఁ బదఁపడి యాయగ్ని।వలన నేడ్వు
తే. రర్భకులు సుప్రకాశిత। నలరి కలిగి, భయకరంబుగ నేడ్వ నా।బాలకోద
నారవంబును విని కమ।లాసనుండు, వచ్చి వారి విచారించి। పరమదయను. 339

క. మరుదమరులఁ జేసి సురే, శ్వరుఁ డగుపరమేష్ఠి వోవ। వారలశోభా
కరులై తామసమన్వం, తరమున రాజిల్లి రతుల। దర్పోద్ధతితోన్. 340

రైవతమన్వంతరమారుతోత్పత్తి.

క. రైవతమనుకాలంబున, నే వారు మరుత్తులైరొ। యలఘమి న్నారిగా
భావించి చెప్పెదను గురు,భావంబున నాలకింపు। పరమేష్ఠిసుతా. 341

క. మును శాత్రవజిత్తను సుతుఁ, డనఘుం డగురైవతునకు। నలిరి కీర్తిని గ
ల్గెను వాఁడు పుత్రహీనతఁ, దనరి రవిం గూర్చి భ।క్తితత్పరుఁ డగుచున్ 342

క. సారోదారతపఃక్రియ, నారాధనచేసి సురతి। యనుకన్యను జె
ల్వారంగఁ బడసి కొని చనె, నారమణీమణి ప్రియాల।యంబునఁ గూర్మిన్. 343

ఆ. వెల్గుచుండఁ బ్రాణ।విభు డంతఁ బోలిపోవ
నాపె వగను మిగుల। నడలుమేను
విడుచుటకును బూని। వెలసినఁ దల్పోరు
లగుచు సత్యబోధ। నాథ్యులైన. 344

క మును లేడ్వరు వలదని దా,నిని వారించినను వినక। నెలవగ నాజ
వ్యని తెగువ వెడద వెల్గున, బోనరెడి చిచ్చందునవుడు। పొగులుచుఁ గూలెన్.

క కనలుచునుండెడు నాసతిఁ, గనుచుం దచ్చిత్తు లగుచుఁ। గష్టం బకటా!
యని వాదించుచు నట నా, మునినాథులు శోకవార్ధి। మునిఁగిరి పెలుచన్ 345

ఉ. నారద! యంత నగ్నివల।నం సురసత్తమ ముద్భవించి చె
ల్వారుచుఁ దల్లిలేక గత।హర్షులు నై ప్రలపించుచుండ వి
స్తారదయానిరూఢమతి। దామరసోద్భవుఁ డట్టిచోటికిం
జేరియు నూఱడించి తమిఁ।జేసెను వారి మరుద్గణేశులన్ 347

క. ఎనిక స్వీరులు రైవత, మనుకాలమరుత్తులైరి। మానుగ నింక
న్వినుమా చెప్పెదఁ దామస, మనుకాలోత్పత్తి నీకు। మానిభలాభా! 348

తే. చెలఁగినట్టి హిరణ్యకశిపుఁడు విష్ణు
పత్త్రయంబందు వాసితో వాసవుండు
నగుచు వీరుండు నై యలరారుచుండ
నమరగణగణ్యుఁ డై నట్టి యచ్యుతుండు 358

క. నరసింహాకృతితో భీ, కరగతి నావీరుఁ జేరి కర్బురులెల్లన్
బరికించిచూడఁ గోల్లం, గరకరఁ దునియలుగఁ జీల్చి కాశ్యపిఁ గలిపెన్. 359

క. విను శూలియు ముక్కంటియు, మనసిజసంహారుఁడు శివుఁడు మచ్చరమున నీ
జనకుని రాజ్యపదచ్యుతుఁ, గను జేసెను సకలదేవగణములు పొగడన్. 360

సీ. హరిచేఁ గుజంభుఁడు హతుఁడయ్యెఁ బ్రత్యక్షపశుపుచందంబున వాసవుండు
నీకు సోదరుఁడు నై నెగడినపాకుని శంభుని జంభునిఁ జంపి మించెఁ
గాలె భవజ్జనకుండు చెప్పిలి మున్న శక్రునిచేతను సమసినట్టి
విగతవంశస్థితి విని బలిదైత్యుండు గురుదానవశ్రేణిఁ గూడి కడిమిఁ

తే. గలహ మొనరింప సమకట్టఁ గదులనిక్క
కొంతతేగిరి రథములఁ గూర్మిఁ జేరి
కొంద తేగిరి హయములఁ గూడి వడిని
జనిరి మఱికొంద ఱుద్ధతి సమరమునకు. 361

— బలిపురస్కృతు లై రక్కసులు వేల్పుల జయింప నేగుట. —

చ. అరిగిరి కాలిబంట్లు వడి నత్తఱి సర్వబలాధినాథుఁ డై
గరువముతో మయాసురుఁడు క్రాలుచుఁ బోయెను వేడ్క ముందు దు
ర్భరగతి నేగ వెన్క గురుబాహాబలుండగు కాలనేమియున్
బరువడి శాకలుండు కుడిప్రక్కఁ జనెన్ బటువిక్రమస్థితిన్ 362

క. మునివర! దక్షిణపుందెస, ఘనులు భయంకరులు దైత్యగణ్యులు నగుచుం
డినతారకాది దనుజాలు, కనలుచు వడి నేగిరపుడు క్రూర్యస్ఫూర్తిన్ 363

వ. ఇట్లసురు లాహవసన్నాహసంరంభు లై సహస్రాయుతార్బుదసంఖ్యలకొలంది నేపారి కడలితరఁగలమాడ్కి నడరెగని గలితోడఁ బోరల భగవంతుఁడును బలియు నగుపాకశాసనుండు తత్సమరోద్యోగము నాలించి జన్నంపు దిండులతోడ రక్కసులు చతురంగయుతు లై కలహకాంక్ష నలరి వెలువడుచున్నవారని పలికి రథారూఢుఁ డయ్యె అంత మాతలి రథాశ్వముల నడుపఁ బ్రయత్నించె నయ్యెడ. 364

సీ. స్యందనస్థితుఁడయి శక్రుండు రాఁజిల్ల నాదిత్యవసుమరుదాశ్వినేయ
సాధ్యవిద్యాధర చారణపన్నగగంధర్వయక్షగరుడరాజ
సిద్ధమాసీశ్వరశిష్ట కింపూరుషవర్యులు తమతమవాహనముల
నెక్కి రణేచ్ఛతో నేగిరి కరిరథాశ్వముల నధిష్ఠించి సరవిఁ గొంద

ఆ. అరిగి రథికదీప్తి । నలరారి యుద్ధవి, మానుసులు విహంగ।మప్రకాశ
లగుచుఁ గొంద తేగి । రసురబలంబున్న, సమరభూమిఁ జేరఁ । జటులశక్తి.
ఉ. ఆసమయంబునందు విన।తాత్మజుఁ డాగతుఁడైన నామహా
భాసురమూర్తిపై విబుధ।వర్యుఁడు నావారి యుద్ధకాంక్షతో
వాసిగ నెక్కి రాఁగ సుర।పార్థివుఁ డయ్యన వచ్చినట్టిశ్రీ
వాసుఁ డజాండు లోకగణ।వల్లభుఁ డౌహరిఁ గాంచి భక్తితోన్. 366

—ః దేవతలు యుద్ధమున కరుగుట. ః—

చ. అలరుచు సర్వదేవయుతుఁ । డై యెదురేగి శిరస్సు వంచి భూ
తలమున వ్రాలి మ్రొక్కి గదఁ । దాల్చి శిరోద్భవుఁ డంత దేవతా
బలమున కగ్రభాగమున । భాసిలి తత్పరిపాలకుండు నై
బలము చలంబు శౌర్య మని।వార్యము నై హావణింప నుద్ధతిన్. 367
వ. బలంబుల నాశ్రయించి 368
క. చని మానాథుఁడు జఘనం, బున శక్రుం డెలిగె నడుమఁ । బొంగారుచుఁ ద
త్తనయుం డేగెను గుడినై, పువ నెడమను వాశి చేరి । పోరు మునీంద్రా!
చ శరజనితామరేశహరి।శక్రసుతాప్తలిపాలితంబు నై
సురబలమాఢ్యకీర్తిఁ గని । శోభిలుచుగ్ బహుళాస్త్రశస్త్రసం
భరితకరీంద్రహస్తసమ।బాహుచయంబుల నొప్పి రాక్షసే
శ్వర! బలమున్నచోటికి న।వారితశక్తి చెలంగ నుద్ధతిన్. 370
ఆ. విగతవృత్తపత్త।వితతితోఁ జెలువొంది, సమశిలాతలములఁ । జాల నలరి
యుద్ధరమ్యసరణి । నొంపారు ప్రాగ్గిరి, తటమునందుఁ గడిమిఁ । దాపసేంద్ర! 371
వ. సురాసురులకుఁ బోరుపొసఁగె విను ముభయసేన లురవడి డాయ భైరవార
వంబు వాటిల్లె. అంత ధూళిలేని యక్కొండయందు నుద్దండగతి మెండొడ్డి
యాపెద్దరక్కసులదండు గండు మిగిలి నడచునెడ. 372

—ః దేవదానవయుద్ధము. ః—

క. శరజన్మపాలితులు నై, బిరబిర సురసేన తొడరి । వెడదశరంబుల్
పొరిఁబొరిఁ బఱగించి మహా, సురులను బాధించె రోలి । సురుచిరమూర్తి! 373
వ. ఇట్లు కలహంబునఁ బీడనొంది. 374
చ. అపుడు మయప్రగుప్తులు ప్ర।వర్తలునా కవిశిష్యులెల్ల బల్
కుపితులు నై శరౌఘమునఁ । గొట్టిరి వేల్పులఁ దొల్లి నాగిరిగ్
గపికరులార్చి పోరునెడఁ । గల్గినపాంసువిధంబుగా వడిగ్
విపులము నై రణస్థలిని । బింగళధూళి జనించి పెన్గుచున్. 375
తే. సంజకెంజాయతో మించి । చదలునందుఁ
దనరుచుండిన మొగులుచం।దాన వెల్గె

నట్టికలహంబు తుములంబు । నగుచుఁ గాంచి
మైనఁ దెలియ నశక్యమై । యలరె నంత. 375

క. ఛేదింపుఁడు భేదింపుఁడు, వాదము లింకేల ననుచు । వడిమీఱంగా
వాదించునట్టివారిని, నారం బంటటను నిండ । నలి నామీఁదన్. 377

క. అని సురలవలనఁ జావా, దనుజబలంబునకుఁ గల్గి । తలరక్తము పు
ట్టినదై శమింపఁ జేసెను, ఘనరణసంజాతధూళిఁ । గన విస్మయతన్. 378

ఆ. విగత మగుచు దుమ్ము । వెలసినలతి యుద్ధ, భగ్గణంబు దైత్య । భూరిబలము
శారఁ దోలి స్కంధ । పరివృత మై యార్చి, పేర్చి కూర్చె నపుడు । విపులకీర్తి.

వ ఇట్లు సురలు విజృంభించి పోరునెడ 380

క. పొరిది న్మయపాలనమునఁ, బరఁగినరక్కసులు విబుధ । వర్యులఁ గడిమిన్
శరనికరంబులవలనన్, బరువడి బాధించి రధిక । బలవిస్ఫూర్తిన్. 381

సీ. అంతవేల్పులు విగ । తామృతరసపాను లై సంగరస్థలి । నసురవరుల
చే జితులై రాగి । సేనలతోఁ గూడ నిర్జితు లైనట్టి । నిఖిలదేవ
గణములఁ బోడఁగాంచి । గరుడధ్వజుఁడు శార్ఙ్గచాపంబుఁ జేఁబూని । శస్త్రతతులఁ
గడుఁగూర్చి యక్కడ । క్కడ నున్న దనుజాలఁ గాండోత్కరంబులఁ । గనలఁ జేసె

ఆ. గరుడుఁ డాగ్రహించి । గరుడనిలంబున
గాఢతుండపాద । ఘాతమునను
జంపఁ గాలనేమి । శరణుఁ జొచ్చిరి దైత్య
వరులు భీతు లగుచు । వగను బొగిలి 382

క. అనఘా! వారికి నభయం, బును వాఁడావేళ నొసఁగి । యురసంహారుఁ డుం
డినచోటికిఁ జెనువృద్ధిన్, జన రుగపేతీతుఁడు నైన । జనుఁ దోలి వడిన్. 383

క. ఏరుఁ వేల్పులఁ గని వాఁ, డాయుధ హస్తములతోడ । నని దాఁకునో యా
తోయమువారిం గైకొని, పాయనితమి సాధ్యమందుఁ । బడవైచి మునీ! 384

సీ. అస్త్రహీనుం డయ్యు । నాటోపమున వాఁడు కలహమందున దైత్య । గణముచేత
నమృతంబునై శశి । హరిపాకశాసనసహిత మాసురసేన । సత్వరముగఁ
బావకాభంబు నా । పదకరనఖములవలనఁ బుష్కరమందు । వసుధయందుఁ
బయినఁ గ్రిందను నన్ని । భాగములందును వ్యాపించి సకలప్ర । పంచమయము

తే. నగుచుఁ గల్పాంతమం దల । రారువహ్ని
రూపు మగుదానిఁగాఁ జేసె । రూఢి నంత
వర్ధమానుండుఁ బగవాఁడు । బలియుఁ డైన
కాలనేమి నిశాచర । కాంతుఁ గాంచి. 385

చ. తరళము లైననేత్రములు । తద్ద వెలుంగుచునుండ సాధ్యకి
న్నరవరచారణాదిసుర । నాయకు లేగిరి భీతితో దిగం

తేరముల నెల్ల నుగ్గవిడి దర్పితు లై కవిశిష్యు లుద్ధతిన్
సురగణపూజనీయుఁడును సుందరమాలియు నైనమాధవున్. 386

ఆ. పటుతరాస్త్రశస్త్ర పాతనంబులతోడ
వికలమూర్తి మిగుల వెలయఁ జేసి
రట్టిమయముఖాదు లగురక్కసులఁ గాంచి
చక్రి శార్ఙ్గమందు సాహసమున 387

క. ఎద దూఱి పోవునవియును, భిదురసమానంబు లైన వివిధాస్త్రములన్
బదిలమునఁ గూర్చి కినుకన్, గొదలెడి వారక్తనేత్రముల నొప్పించెన్. 388

క. సరభాళికరులు నానా, గరువపురక్కసులదృష్టి గలపీఁడలఁ గాఁ
దర హేమపుంఖశరములఁ, గర మద్రిని మొగులుమాడ్కి గప్పె న్నలువచన్.

తే. కాలదండాభములు హరికరగతంబు
లైన నారాచములతోడ నర్ధచంద్ర
బాణములతోడ నాదైత్యవరులు కప్పఁ
బడి మహాభీతు లై వెసఁ బాఱి రంత. 390

చ. మునివర! కాలనేమి మును ముందు సమస్తసురేశుఁ డైనవి
ష్ణుని నదలించి యిట్టుల నోలనొనర్చి మహాబలుండు నై
ఘనసురసైన్యనాథుఁడు జగత్త్రయపాలుఁడు కేశవుండు నా
వనజదళాక్షుఁ డాఁకఁ జన వ్రాలినశౌర్యము విచ్చలింపఁగన్ 391

— శ్రీహరి కాలనేమినిఁ గూల్చుట. —

క. పదిపదులతలలతోఁ బటు, గదతో బృహదద్రిశృంగగణ్యాకృతితోఁ
గదనంబున నిట్టులం, గొదలెడునాకాలనేమిఁ గొడఁగని కినుకన్. 392

మ. హరి శార్ఙ్గంబును వీడి చక్రము వడిన్ హస్తంబునం దాల్చి నా
తరుణాంబుండు విశుద్ధమాలియు మహాదైత్యోఘనాథుండు సు
స్థిరుఁ డాశౌరినిఁ జూచి వాఁడు కడిమిన్ శిన్నారుచు న్నవ్వుచున్
గరమిట్లా వడిఁ బల్కె నభ్రరవుఁ డై గర్వంబు మిన్నందగన్. 393

క. దనుపుత్రనాశనుండును, దనుజబలత్రస్తకరుఁడు దలబంధురకో
పనుఁడు బహుళపుష్పపూజా, ధనరతుఁడు హిరణ్యనేత్రదానవహరుఁ డా. 394

క. అనిలోన నాకు భంగం, బును జేయుచు నసదృశత్వమున వెల్గెడునీ
వనజాక్షుం దస్మద్భ్రుకుటనఁ బడె నట్టిగ నా సకుంతితశక్తిన్. 395

సీ. ఈయంబుతోడఁ గుఱ్ఱఁ డెలమి నస్మద్గ్రామహితభూమినిఁ జెంది మఱలి మరల
నాత్మమందిరమున కరుగఁ జాలఁడు నిక్క మరయ నే నదరించునట్టిముష్టి
వలన బెండిఁగఁ జేయఁబడి భస్మమయిత్రాలు కాయంబులో నున్న కమలనాభుఁ
గాలరాక్షంబులఁ గడఁగి వెల్పులు చూడఁగలరంచు నీమాడ్కి గడిమి వాఁడు

తే. పలుకతోడను విస్ఫురితాధరోష్ఠుఁ
డగుచు నింద్రుండు శైలంబు నందుఁ బవిని
వైచుచందాన గరుఁడుని పయిని గదను
బటురయంబునఁ బరపె నవార్యశక్తి. 396

చ. మునివర! కాలనేమి భుజములు త్రయమై యతిదారుణాకృతిం
దనరుచు వచ్చు తద్గదను । దర్పితచక్రముతోడ శౌరి దు
ర్జనుని మనోరథంబు వెసఁ । బ్రాక్తనకర్మము ద్రుంచునట్లుగాఁ
గనలుచుఁ గోసి ధాత్రిపయిఁ । గ్రక్కునఁ గూల్చె సురల్ నుతింపఁగన్. 397

ఉ. దారుణమైనవానిగదఁ । దద్దహరించి మురారి పూన్కితోఁ
జేరి బలిష్ఠమౌ నతని । చేతులఁ జక్రముతోడఁ ద్రుంపఁ బెం
పారెడువహ్నిచేఁ దనరి । వర్తిలుచుండెడు కొండరీతి నా
వీరుఁడు యుద్ధరంగమున । వెల్గుచు నుండఁగ శౌరి పిమ్మటన్ 398

చ. కనలుచు వానిశీర్షమును । గ్రక్కునఁ దాళఫలంబుమాడ్కిఁ ద్రుం
చెను బటుచక్రసంహతిని । శీర్షకరంబులు లేక మొండమై
వనమున నుండు తాళగతి । వాఁడు కబంధుఁడునై గిరీశమౌ
కనకనగంబు కైవడిని । గాశ్యపిపై నలరారె నాయెడన్. 399

తే. మున్ను శక్రుండు పవిచేతఁ । బుష్కరమునఁ
దోడరు రాహు శిరస్సును । ద్రుంప నద్ది
గగనమునుండి పడుమాడ్కిఁ । గదనమందు
వక్షమున వాని గరుడుండు । వసుధఁ బడిరు. 400

క. అని వాఁడు చావ సురశర, ఘనపీడను జెంది సకలకర్బురు లతిభీ
తిని గేశంబులు వీడ వ, సనములు జారంగ విగతశస్త్రాస్త్రులునై 401

క. హా! యని సోలుచుఁ బడి యా, తోయంబున మిగుల బాష్పతోయము జారఁగా
బాయనివగ బాణునికడ, కాయెడఁ జని శరణుఁ జొచ్చి । రతిభీతిమెయిన్. 402

వ. ఇట్లు పులస్త్యుండు పలుక విని నారదుండు తరువాతి వృత్తాంతంబు నొడువు మనుటయు. 403

ఉ. శ్రీరఘువీర! రాజకులసింధుసుధాకర! సత్యభాషణా
ధార! భవాపహార! బుధతల్లజచిత్తవిహార! ఘోరసం
సారవిదూర! మేరునగసన్నిభధీర! నిరంతరాబ్ధిగం
భీర! దురంతసార! పరభీకర! రామనృపాలశేఖరా!. 404

గద్య. ఇది శ్రీరామకరుణా సమాసాదిత కవితాప్రాభవ, హరితసకులాన్వయప్రభవ, రామవజ్ఝల వంశదుగ్ధ సాగరసుధాకర, కొండయ కుమారబుధజన విధేయ కొండయ నామధేయ ప్రణీతమగు తెలుఁగువామన మహాపురాణంబు నవమ స్కంధము.

శ్రీరస్తు.

శ్రీసీతాలక్ష్మణభరతశత్రుఘ్నహనుమత్సమేతశ్రీరామచంద్రాయ నమః.

# తెలుఁగు వామనపురాణము.

## దశమస్కంధము



శ్రీసాకేతమహాపుర
వాస! సముజ్జ్వలితధర్మవాసా! ధర్మో
ల్లాస! వరచిద్విలాసా!
దాసజనాశ్రాంతపాల! దశరథబాలా! 1

క. అవధారు పులస్త్యముని, ప్రవరుఁడు నారదున కనియె బలిబాణులు మా
ధవజితులై వచ్చిన దివి, భవులకు నభయం బొసంగి బవరంబునకున్. 2

దేవతలపై బలిబాణాదిరాక్షసు లరిగి వచ్చుట.

క. గరువంబునఁ జనఁ గనుఁగొని, సొరిదిఁ శస్త్రాస్త్రలాలసులు నై దైత్యే
శ్వరు లుద్ధతిఁ గ్రమ్మఱ ని, ర్జరసేనను దాఁకి పోరఁ జనిరి మునీంద్రా! 3

వ. ఇట్లొక్కవడి రక్కసు లుక్కుమిగిలి పిక్కటిలుచు నొక్కుమ్మడి నురువడించి యురు
దెంచునెడ. 4

క. హరి బలిసుతుఁడౌ బాణా, సురు నలిబలుఁగా నెఱింగి సురరాజముఖా
మరవరులఁ బిలిచి విగత, జ్వరులై సమరం బొనర్పఁ జనుఁ డని పలికెన్. 5

సీ. అంత దేవతలెల్ల హరిసమాదిష్టులై దనుజులతోఁ గూడ దర్పమొప్పఁ
బోరుచునుండిరి మురహరుఁ డాయెడ నంతర్హితుం డైన నసురగురుఁడు
తద్గమనంబును దాఁ గనఁజాలక బలిఁ గాంచి యాతనిఁ బలికె వీర!
నారాయణుఁడు దేవనాథుల నని వీడి చనె నీవు దేవతాచయము నిప్డు

ఆ. సమరమందుఁ గొట్టి జయమును గొనుమన్న
వాఁడు శుక్రుమాటవలనఁ బ్రీతుఁ
డగుచు సాహసమున నట్టి కాలమునందు
గదను గరమునందుఁ గడిమిఁ బూని 6

క. ఉరవడి వేల్పులగుంపుపై, కరిగను బవరం బొనర్ప నంతట బాణా

సురఁ డాహవరతిబుద్ధిం, బరఁగుచుఁ బటు ధీరవృత్తి వర్ధిలుచుండన్. 7

శా. శూరుండై చెలరేగి శౌర్యబలముల్ శోభిల్ల మోదంబుతో
నారక్షుబలి వేయిబాహువుల శస్త్రాస్త్రంబులం దాల్చి దు
ష్పారం బా సురసేనఁ జుట్టుకొని తీవ్రబాణంబులం గొట్ట మా
యారమ్యాకృతి నొప్పునట్టి మయదైత్యాధీశ్వరుం డోమునీ! 8

క. ఆయా రూపంబుల వడి, నాయెడ నడరుచును దేవతాధిపులతో
వేయివిధంబులఁ బోరను, డాయుచుఁ జెన్నారఁ గప్పి దర్పంబలరన్. 9

వ. అప్పు డనిలోతణుం దగువృషపర్వుండును, భద్రవిద్యుజ్జిహ్వాద్యులు, విపాకవివర్ధనా
సురులు కినుక నురవడించిని 10

క. సురసేనఁ దాఁకి పటుతర, శరముల బాధింప శస్త్రచయపీడితులై
హరిసేనందునఁ దలఁచుఁగ, నరిగిరి పెడమొగము పెట్టి యమరులు భీతిన్. 11

క అని విడిచి పరాఙ్ముఖులై, చనుచుండిన సకలదేవసత్తములను గ
న్గొని బలిబాణాదిముఖు, దనుజులు త్రైలోక్యవిజయతత్పరబుద్ధిన్. 12

బలిదైత్యుఁడు స్వర్గాధిపతి యగుట.

చ. తొనయుచు వారి వెంటఁ బడి పోయినఁ దత్పరిపీడ్యమానులై
చనిచని నాకలోకమును జయ్యన వీడి విరించివిష్టపం
బునకుఁ బురందరాద్యమరపుంగవు లేగిన వాఁడు బందుగుల్
తనయులు మిత్రులుం సకలదైత్యవరేణ్యులు గొల్వుచుండఁగన్. 13

వ. నాకాధీశ్వరుం డయ్యె విను మయ్యెడ. 14

చ. పరమమునీంద్ర! భూరిబలబంధురుఁ డౌ బలి జిష్ణుఁ డయ్యెఁ బు
ష్కరపతి బాణుఁ డయ్యె మయకర్బురుఁ డయ్యెను జంభమాయ దు
ర్ధరుఁ డగు హ్రాదనామ దితివల్లభుఁ డయ్యె విధుంతుదుండు భీ
కరుఁ డగు సైంహికేయుఁడు వికర్తనుఁ డయ్యెను దీప్తి కుల్కఁగన్. 15

ఆ. అమరగురుఁడు శుక్రుఁ డయ్యె నన్యులు నైన, దితిజవరులు సర్వదేవనాథు
లైరి ద్వాపరాంతమందు దారుణపంచ, మాఖ్యనొప్పు కలియుగాదియందు.

క. బలవిక్రమశాలియు నా, బలి శక్రుం డగుచునుండ బంధురకీర్తిన్
వెలసె సురాసురయుద్ధం, బలరెను ఘోరంబు నగుచు నతివిస్మయమై. 17

సీ పరమేష్ఠిసుత! సప్తపాతాళలోకము లష్టపత్రియ మూవిధున గొనరె
భూర్భువస్స్వర్మహర్లోక బోల్పారుసీపదిభువనంబులకు నధిపుండు నగుచు
సంతసంబున వాఁడు స్వర్గంబునందుండి పూర్ణభోగంబులఁ బొందుచుండె
సిద్ధాదిదేవతాశ్రేష్ఠు లక్కడ భీతిఁ దొలఁగుచుండిరి ఘృతాచీతిలోత్త

ఆ. యాడిరి దేవవేశ్య । లట నాడుచుండిరి
చారణాదు లైన । సకలదేవ
వరులు వాద్యములను । వాయించుచుండిరి
కడిమిఁ గాలగతినిఁ । గ్రాలి యపుడు. 18

శా. త్రైలోక్యాయతభోగమున్బడసి యాతం డాత్మఁ బ్రహ్లాదునిన్
వాలాయంబు దలంప విష్ణుపదసే।వాజాతసంతుష్టుఁడున్
శీలాచారరతుండు నైతనరునా।శిష్టాత్ముఁ డావేళఁ బా
తాళంబు న్విడి వీడి స్వర్గమునకున్ । దల్కొత్త నేతెంచినన్. 19

క. చనుదెంచిన ప్రహ్లాదునిఁ, గని బలిపీఠంబు వీడి । కడుభక్తి నెదు
ర్కొని వచ్చి కృతాంజలితోఁ, దనరారుచు మ్రొక్కెఁ దత్ప।దంబుల కెలమిన్.

వ. అక్కాలమందు 21

శా. పాదద్వంద్వమునందు వ్రాలినబలిన్ । బాగొప్ప నాతండు మ
ర్యాదన్ గౌఁగిటఁ జేర్చి యుత్తి నవర।త్నాఢ్యంబు నాగద్దె పై
మోదంబొప్ప వసింపఁజేయ బలి తాఁ । బొంగారుచిత్తంబుతో
నాదైత్యేశ్వరుతోడ నిట్టులనె స।త్యంతానురాగంబునన్. 22

శా. తాతా! వేల్పుల నీకృపన్ గెలిచి బ।ల్దర్పించి యానిర్జర
వ్రాతాధీశుని నాఁడోలి విలస।త్స్వర్లోకరాజ్యంబు వి
ఖ్యాతిం బొందితి నిట్టిభోగపదమున్ । గన్యుల్లనుం బెక్కొనం
జేతఃప్రీతిని నేలు నీయుడుటనేఁ । జెల్వారుచున్నిత్యమున్. 23

సీ. తెల్లమేనుఁగునెక్కి । తిరుగుచు నీపాదనీరజార్చనతోడ । నగడి నీవు
కుడువ శోభించిన।కూడు భక్షించెద ధైర్యంబుతోడ నేఁ । దనరియున్న
వాఁడనై రాజ్యంబుఁ । బాలింప గురుపాద సేవయందు మదీయ।చిత్త మొదవె
నని యిట్లు బలిదైత్యుఁ । డన విని యాతఁడు ధర్మమార్గసా।ధకము దివ్య

ఆ. మైనపలుకు నుడివె । నసురేశ! నాచేత
మున్నకంటకత్వ । మొదవ రాజ్య
పాలనం బొనర్పఁ।బడెను మిత్రులు నిత్య
పూజ్యపాత్రులైరి । భూమియందు. 24

క. దనుజేశ! యుద్దిపుట్టిన, తనయులకు యథేష్టసరణిఁ । దగ దత్తం బు
ద్యోగను యోగసాధనంబునఁ, దనరితి నేనిపుడు ధాత్రిఁ । దర్కింపంగన్. 25

క. తనయుల విధిచొప్పునఁ గై, కొనఁబడి యడఁబడినదయ్యెఁ । గూరిమి నాచే
తను నీ కనుచున్మనుమునిఁ, దనదక్షిణాకరములవలనఁ । దయఁబట్టి మునీ! 26

క. హారిరత్నపీఠమందున్, ద్వారితంబుగ నునుప నతఁడు । వత్రవిధమునన్
బొరి రాణించుచు నయ్యెడఁ, గరములు ముకుళించి తాఁ।గనుఁగొని భక్తిన్.

నిరతులై పోఁడెఁబోరి । నృపులలాములు శస్త్రజీవులై ప్రజల రక్షించి ధర్మ
దారులై యుండుటఁ । దగు నధ్వరాధ్యయనాత్తులై దారులై । యలరి కృషిని

తే. చేయుచును బాశుపాల్యంబు । చేత విపణి
జీవనముచేత వైశ్యులు । చెలఁగవలయు
విప్రనృపవైశ్యసేవఁ గా । వించి యుష్మ
దాజ్ఞ నెప్పుడు శూద్రు లే । పారవలయు. 38

క. ధర నాల్గువర్ణములు సుస్థిరనిజధర్మస్థు లగుచుఁ । జెల్వొందుదురో
ధరమెపుడు ధర్మవృద్ధియు, సరవిని రాఁజల్లునపుడె । చటులోత్కర్షన్. 39

ఆ. పుణ్యవృద్ధి ధరయ । భూపులె గలి యగు, దాన వర్ణజాల స్వ । ధర్మపరులఁ
జేయు మట్టివృద్ధిఁ । జెన్నారుఁ బెంపు నీకునది చెడిన నేఁగి । కూడు నిజము. 40

మ. అనఘా! యిట్లరఁ డాడఁగా విని నరేం । ద్రాధీశ్వరుండుగా యశో
ధనుఁ డా నాబలి యూరకుండి మఱి యో । ధన్యాత్మ! నీవానతి
చ్చినమాడ్కిన్ గురుబుద్ధి నెప్పుడయినం । జెల్వొందెద న్నే నటం
చని నిశ్శంకను గొల్వుకూటమునయం । దావేళ బల్కెం దమిన్. 41

కలిపురుషుఁడు బ్రహ్మకడ కేగి మొఱవెట్టుకొనుట.

చ. పరమతపోధనా! సురలు । బ్రహ్మపదంబున కేగ నంత దు
ర్భరబలుఁ డాబలీశ్వరుఁడు । బంధురధర్మసమన్వితుండు నై
నిరతము ముజ్జగంబులను । నేర్పున నేలఁ గృతస్థధర్మసం
భరితజగంబుఁ గన్గొని స్వ । భావనిరోధకతోడ నాయెడన్. 42

వ. కలి నలువ శరణార్థియై చని యట. 43

తే. సొరిది నిజదీప్తితో సురా । సురసమేత
మైననిజవాసమును గన్గొ । నట్టివాఁడు
శక్రముఖదేవతాజాల । సహితుఁడైన
బ్రహ్మదేవునిఁ గనుఁగొని । భక్తి మ్రొక్కి. 44

క. అని దేవ మర్త్యభావం, బును బలి హరియించె నన్నుఁ । బుష్కరజాతుం
డును భగవంతుఁడు నిత్యుం, డనఘుం డగునలువ వాని । కని నీరితిన్. 45

క. తనధర్మము జగమున కది, ఘనతరశౌర్యంబువలనఁ । గ్రాలెడు బలిచే
తను నీస్వభావగలితై, కొనఁబడినది కాదు మది మి । గుల రోయింపన్. 46

క. బలవంతుఁ డైనబలివిభు, బలమున రవి విగతదీప్తి । భాసిలసాగ
బలసమరుద్యుతుఁ డై వగ, నలరెడివారి లేచి చూడు । మా! యీవేళన్. 47

సీ. బలివిభుం డొనరించు । పనిని నిరోధించువాఁడు ముజ్జగముల । లేఁ డెవండు
పాదశీర్షసహస్ర । పరివృతుఁ డాశౌరి త్రిదివరాజ్యంబును । దీప్తి దీప్తి

లక్ష్మిబలంబులు । లాలితధర్మగోచరగతి నిత్యత । సంగ్రహించె
సత్యయుగా నని । సరసిజాసనుఁ డిట్టు లన నాతరహితుఁ డై । నట్టికలివి

ఆ. ధుండు దీనబుద్ధిఁ । బొల్పారుశక్రాది
విబుధవరులఁ గని వి । భీతిఁ దాట
వికినిఁ బోయిఁ గృతము । వెలసెఁ ద్రైలోక్యంబు
నందుఁ గలి విహీనుఁ । డయ్యె నంత. 48

క. చరణచతుష్టయమున భువిఁ, బరఁగెను ధర్మంబు నాల్గు । వర్ణంబుల వా
రురవడి నింద్రియనిగ్రహ, పరులై యక్రూరభావ । పద్ధతిఁ దోడన్ 49

చ. తనరి యహింసయుఁ దయయు । దానము సత్యము యాగకార్యముం
వనజదళాక్షుసేవయు న । వారితశక్తిముదంబు లొప్పఁగా
ననిశము నుండి రెల్లెడల । నాశ్రమభూముల కేగి నిష్ఠతోఁ
బొనరి స్వధర్మయుక్తులయి । భూసురు లుండిరి బ్రహ్మనందనా!. 50

తే. పార్థివు ల్నరపాలన । పరమధర్మ, రతులు నై యుండి రిట్లు ధ । ర్మంబు మూఁడు
భువనములయందు నభివృద్ధి । బొదల సాగ, నంత నాలోకవిలసిత । మైనలక్ష్మి.

జయలక్ష్మి బలిం జేరుట.

వ. తత్కాలంబున. 52

క. దితిసుతసేవితుఁ డౌబలి, నతిముద మేపారఁ జేరి । నరుదెంచిన నా
యువిదను గని వాఁ డత్తతిఁ, జతురోక్తులఁ బల్కె నిట్లు । సౌజన్యనిధీ! 53

క. వనితా! నీవెవ్వతె వే, పనికై వచ్చితివొ దానిఁ । బల్కుమటన్నన్
విని పద్మమాలతోడను, బొనరెడు నాదేవి ప్రీతి । బొంగార ననెన్. 54

మ. బలిరాజా! విను మప్రతర్క్యుఁడు మహా । భాగుండు శ్రీవాసుదే
జలజాక్షుండు గదాధరుండు విలస । చ్చక్రుండు నాశించె
బలవిద్వేషి విముక్తుఁ డైనకతనన్ । భావించి నిన్నర్థిఁ గా
బలవంతుంబునఁ గోరి వచ్చితిని నే । బాగొప్ప నీభార్య నై. 55

క. నిగనిగ మెఱుఁగడిమేనుల, నగఁడదువెలఁదుల నతండు । నిర్మించెను నా
మగువల తెలుఁగును జెప్పెదఁ, దగు నాలింపంగ నీవు । ధన్యచరిత్రా! 55

చతుర్విధరమాస్వరూపనిర్ణయము.

సీ. పాండురదేహయుఁ । బాండురవస్త్రయుఁ బాండురపుష్పయుఁ । బాండుగంధ
పరిమళమిళితయుఁ । బాండుసత్త్వాఢ్యయుఁ బరిశుభ్రదేవతా । వాహయు నగు
రమ యొకర్తుక యుండు; । రతి మతియుకదేవి రక్తగాత్రాంబర । రక్తపుష్ప
గంధయు నై రక్త । గంధర్వమునకుండి కోమరారు రాజస । గుణముతోడఁ

ఆ. పీతదేహవస్త్ర । విలసిత లై పీత, గంధలేపపుష్ప । కలిత యగుచు
ధర్మరథమునుండి । భాసిల్లి తామస, గుణముతో నొకర్తు । కొమరుమిగులు.

క. నీలాంబరగంధయు నై, వాలాయము మేటిభృంగ । వర్ణాభయు నై
నీలవృషవాహ యగుచుఁ, నాలవచెలి యలరుఁ ద్రిగుణ । నవ్యస్థితితోన్ 58

ఆ. సర్వరూపదేవి । చంద్రవిప్రులఁ దదా
శ్రితులఁ జెందె నెఱుపు । సిరినిఁ బొలి
మనువునకును దక్షు । మారున కొసఁగను
సంతసంబుతోడఁ । జక్రధరుఁడు. 59

క. హేమాభతో వెలింగెడి, తామసగుణదేవి నిడెను । దయతో హరి సు
త్రామునకు మనుజనాథ, స్తోమమునకు వైశ్యులకును । సుభగచరిత్రా! 60

క. గురునీలయుఁ ద్రిగుణయు నగు, తరుణియుఁ గోణేశముఖ్య । దానవవిద్యా
ధరులకుఁ దదాశ్రితులకును, సరసీరుహనేత్రుఁ డొసఁగ । సంతోషమునన్ 61

ఆ. శ్వేతరూపమునను । జెలఁగెడునాదేవి, బాడబాదిసుకవి । వరులు బ్రహ్మ
వదనజనితవేద । వరమంత్రముల సర, స్వతిఁగఁ బొగడుచుంద్రు । భక్తితోడ 62

క జనపతులు రక్తవర్ణం, బున నలరెడిదేవి నెపుడు । భువనజయశ్రీఁ
గను మతి యశస్వినిఁగ నా, మనుజేంద్రులు పొగడుచుంద్రు । మాటికిఁ బ్రీతిన్.

క. కనకాభ నొప్పుదానిం, గనకాంబికఁ గాను వైశ్య । గణ్యులు భక్తిన్
వినుతింతురట్టి లక్ష్మిఁగ, జనపతులు గణింతు రెపుడు । సమరసభలలోన్. 64

క. నీలద్యుతి నలరెడునా, బాలామణి నెపుడు శూద్ర । వర్ణులు దైత్యుల్
వాలాయము ప్రియదేవినిఁ, గా లలి వర్ణింత్రు హర్ష । కలితాత్మకులై. 65

వ. ఇట్లావెలందు లీశ్వరేశుఁ డైనదామోదరునిచే విభక్త లైరి తత్స్వరూపస్థము లగుచు నవ్యయంబు లైననిధు లుండును వివరించెద విను పురాణేతిహాసములు, దేవసంగమంబులుఁ జతుష్షష్టిశుద్ధవిద్య లనునివన్నియు, మహాపద్మనిధిలై యుండుఁ; గనకరజతరత్న గజాశ్వరథభూషణశస్త్రాస్త్రంబు లనునివి రక్తపద్మనిధియని చెప్పఁబడును. గజోష్ట్రమహిషఖర సువర్ణాంబరవసుధౌషధిసంతతు లనునివి పీతమహానీలనిధి లై రాజిల్లు సకలజతుల లోకజాలిప్రతిష్ఠితమైయుండుఁ; బరహంత్రి యగునది మహానీలశంఖనిధి యగు. నీనాల్గునిధులతో జగంబులనలరారు నట్టిపూరుషులకుఁ గల రూపనిబోధమును భాషించెద సావధానచిత్తుండ వై యాలింపుము 66

సీ. బలసర్వదేవోత్స । వప్రసిద్ధులు మహాపద్మాశ్రితులు నైన । ప్రజలు నగుదు
రధికకతీన లగు । యజ్వలు సుభగులు మానితసర్వసా । మాన్యసుఖులు
మాలిను లైనట్టి । మానవవర్యులు పద్మాశ్రయంబునఁ । బరఁగుచుంద్రు
కరము ధర్మాధర్మ । కలితవ్యయులు దానముహితు లైనట్టిసో । మాసు లన్నుతి

తే. సత్యు లగుదురు శ్యామలాశ్రయులు నైన
నరులు శుద్ధులు కృపణులు నాస్తికు లన్న
తోరచోరకథాలాపయుతులు శంఖ
నిధిసమాశ్రితమనుజు లై నెగడుచుంద్రు 67

క. ఈనిధివిధులను జెప్పితి, మానుగ రాగంబుతోడ మలయజయశ్రీ
నా నే నరుదెంచితి నిను, మానసపుఁ గాను గోరి మాన్యులు పొగడన్. 68

ఆ. సత్యశీలసాధుసమ్మతశపథంబు, కలదు నాకు ధైర్యకలితుఁ డైన
వానిఁ జేరుచున్నదానఁ గ్లీబుండైన, పురుషు నెన్నటికిని బొందఁజాల. 69

క. కనుఁగొన నీభువనత్రయ, మున నీకు సముండు నధికభుజబలుఁ డెవ్వాఁ
డును లేడురుబలమున నుం, డిన నీచేఁ బ్రీతి నాకుఁ డీకొనసాగన్. 70

క. అని విక్రమించి భుజబల, మున శక్రునిఁ గెల్చి కీర్తిఁ బొనరారితి వం
దున నాకు సుస్థిరత్వం, బున నలరెడివలపు మిగులఁ బుట్టె దితీశా! 71

సీ. అంతటికంటె నత్యధికబలంబునఁ దనరు నీదివ్యసత్త్వంబుఁ గాంచి
శౌండీర్యమాని వై సంతతవీరుండ వగునినుఁ గూర్చి యే నరుగుదెంచి
నట్టిదానను హిరణ్యకశిపునకుఁ జేడ వగునీకు నిట్టి దైనట్టికార్య
మగున చిత్రంబు పరాహ్నాత మగునట్టి విష్టపత్రయమును విక్రమమునఁ
తే. జెలఁగి నైకొన్న నీచె వశీకృతుండు
నయ్యెఁ బ్రపితామహుం డౌర! యనుచు నిట్టు
లాడి శుభదయుఁ జంద్రాస్య యఖిలలోక
లలిత యగునట్టి యాజయలక్ష్మి బలిని. 72

వ. ప్రవేశించె నంత. 73

ఉ. ఆజయలక్ష్మి దీప్తి నట పొలివెలుంగ శ్రుతిప్రభాతమా
రాజిత భూతినీతిమతిరంజిత తుష్టిసుశాంతి సర్వవి
ద్యాజయ ముఖ్యదేవసతులంద ఱనాథలు నై సుఖస్థితిగా
రాజిలిరా బలీంద్రుకడఁ బ్రాకటహర్షము పిచ్చలింపఁగన్. 74

వ. మునీంద్రా, ఇట్టి సుగుణగణంబుల నొప్పె యాదనుజపుంగవుండు మహాత్ముండును, శుభప్రవృద్ధుండును, సోమాసియుఁ, దపసియు, మృదుమధురభాషణుండును, దాతయు, స్వజనపాలకుఁడు నై త్రివిష్టపము నేలుచుండ క్షుధార్తుఁడు దీనుఁడు మలినుఁడు ధర్మహీనుఁడు విగతతేజుఁడు కామోపభోగియు నగుమనుజుఁ డెవ్వాఁడు లేఁడయ్యె నని చెప్పి వెండియు నిట్లనియె. 75

ఇంద్రుఁడు బ్రహ్మకడకుఁ జని నిజరాజ్యచ్యుతిఁ జెప్పుట

క. మునివరకులదీపా! త్రిభు, వనరాజ్యం బేగ దేవపరివృతుఁ డగుచున్

ఘనవాహనుండు పోయెను, వనజాసను లోకమునకు । వగ పెనఁగొనఁగన్. 76

చ. చని యట దేవనాథుఁడును । సారససంభవుఁడు న్మహాతపో
ధనుఁడు మహాత్ముఁడౌ నలువఁ । దండ్రియుఁ బుణ్యుఁడు నైనకశ్యపుం
గని విబుధాళితోఁ గలిసి । గాఢవుభక్తిని మ్రొక్కి పల్కె నా
కును గలరాజ్యముఁ బలి యనుఁ కుంతిలశక్తి హరించె నో విభూ!. 77

ఆ. అన నతండు పల్కె । నమరేశ! మనసార
చేసినట్టి యట్టి । చెడ్డ ఫలముఁ
బొలిఁ గుడుచుచున్న । వాఁడ వైతివికదా?
యన సురేంద్రుఁ దలని । కనియె మరల 78

క. మునిసేవితపద నేఁ జే, సినదుష్కృత మెద్ది యొక్కొ । చెపు మని ప్రార్థిం
చినఁ గశ్యపుండు శక్రునిఁ, గనుఁగొని భాషించె నిట్లు । కమలజపుత్రా!. 79

ఆ. దేవనాథ నీవు । దితిగర్భమును బట్టు, బలమువలనఁ జెక్కుపద్ధతులుగఁ
జేసినాడ వందుచే భ్రూణహత్యసం, ప్రాప్త మయ్యె నన్ను । నమరవిభుఁడు 80

సీ. అంతఁ దండ్రినిఁ గూర్చి । యన నశోచంబునఁ దనరెను దితియు నద్దానివలన
గర్భ మాకరణితోఁ । గ్రాలె నయ్యది తల్లి చేసినతప్పు నగు । జెలఁగె నిక్క
మున్న నాతం డనె । నమరేశ! యది యట్టువెలసిన నీవేల । భృత్యవృత్తి
వఱలుచు నుండిన । వాఁడవై కులిశంబుతోడ నాగర్భంబుఁ । దునియలుగను,

తే. జేసితి కుటిలబుద్ధివై । చెప్పుమన్న, నట్టివాక్యంబు వాసవుఁ । డాలకించి
బ్రహ్మణో నన దేవ! యా । పాప మెట్టు, వేఁగిఁ గనునట్టిమార్గంబుఁ । జెప్పుమన్న.

క. వనజజవసిష్ఠకశ్యపు, లని రో దేవేంద్ర! నీకు । నఖిలం బగుచుం
డినవిష్టపములకును బలి, వనజదళాక్షుండు కాన । బంధురభక్తిన్. 82

ఆ. అతని శరణుఁ జొందు । మాశౌరి సర్వంబుఁ, జేయఁగలఁ డటన్న । జిష్ణుఁ డట్టి
ఘనుల భాషణములఁ । గరమర్థి లెస్సఁగా, విన్నవాఁడు నగుచు । వెండి పలికె.

క. ఘనత మహోదయ మొక్కటి, కనుఁగొనఁబడు స్వల్పమైన । కాలములో నా
కనిపల్కి యంతఁ దదను, జ్ఞను గొని భూపృష్ఠమునకుఁ । జని యచ్చోటన్

ఇంద్రుఁడు నరస్వతీతీరమందు హరిఁగూర్చి తపస్సుచేయుట.

క. ధరకాలాంజరమున కు, త్తరమయి హిమనగమునకు సుదక్షిణమై భా
సురవసుపుర పశ్చిమమై, పరమకుశస్థలమునకును । ప్రాగ్భాగమునన్ 85

వ. తనరి యేపుణ్యావాసము విలసిల్లె; మున్నట గయుఁ డనుతేఁడు పెక్కుదక్షిణల
లెక్కకు మిక్కుటమ్మున నిడి నరాశ్వ మహామేధంబుల నేయునెడఁ దద్యజ్ఞక
రులై రక్కసు లుక్కుమిగిలి రాఁగని సర్వసుపర్వ సేవితుండును మురదమనుఁ
డవ్యక్తుండు భగవానుఁడు సుమూర్తియు నగుమాధవుఁ డాభూపాలునకు

ద్వాదశ్యబ్దము నొనర్చి గదాధరుం డని ప్రఖ్యాతినొందె నెక్కడ విప్రవరులు వేదశాస్త్రరహితులై యుండి బ్రహ్మతుల్యులైరా స్థలమందు నరులు పితృపూజ నొనర్చి మహామేధఫలంబుఁ బొందెదరో యట్టి పుణ్యభూమియందు దేవర్షిగణ యగుమహానది సలిలాప్రదేశమున హిమనగముఁ బొంది దర్శనస్పర్శనమజ్జన ప్రాశ నంబులవలన నరులను జగంబునెల్లఁ బవిత్రంబుఁ జేయుచున్నది. అట్టి మహాసర స్వతీనదీవిస్మయతీరమందు. 86

సీ. హరిపదసేవార్థియై యాశ్రమంబును గల్పించి విగతేచ్ఛఁ । గ్రాలి యేక
భక్తుఁడై నిత్యము । భూశయనంబుతో రాజిల్లి హృదయసా । రసమునందు
శంఖగదాచక్ర । సహితుఁడౌ శౌరినిఁ బలుమరుఁ దలఁచుచుఁ । బరమనిరతుఁ
జేయుచు నింద్రియ । చేష్టలఁ గ్రోధంబుఁ గామంబు విడనాడి । కడిమి నిష్ఠ
ఆ. సలర సాగ్రమయిన । హాయనం బొక్కటి
గడచె నంతఁ బ్రీతి । గలితుఁ డగుచు
నచ్యుతుండు పలికె । నమరేశ! గతకలు
షుండ వైతి నీవు । సొరిది నిపుడు 87

క. సురుచిర మగునీరాజ్యము, తిరబిరఁ బొందెదవు నేను । భృగువర్షముతోఁ
బరఁగుచును భావిమంగళ, కరసరణిని నీకుఁ జేయఁ । గల నిక్కముగన్. 88

క. అనఘాత్మ! యిటుల జిష్ణుఁడు, వనజాక్షునిచేతఁ బలుకఁ । బడి వర్జితుఁడై
ఘనభక్తి నామహానది, మునిఁగినవాఁ డయ్యె నపుడు । మోదము మీరన్. 89

ఆ. అపుడు స్నాతుఁడయిన । హరి పాపజాలు నగు
మనుజా లతనిఁ జూచి । మమ్ము శక్ర
శత్రులనుగాను । జేయు మహోదయ
ననుచు నిట్టు వార । లాడి రంత. 90

క. పొరి దారుణకర్మంబులఁ, బరఁగు పులిందులనుఁ జూచి । పలికెను నష్ట
దురితపాపజనితు లగుచుఁ, దొరలెడి తాలాభ్యాధులార! । పూర్ణప్రీతిన్. 91

క. ధరఁగల హిమనగశాలాం, బరమధ్యస్థలమునందు । సంతసమున మీ
రురవడి వసింపుఁ డని యీ, కరణిని వారికినిఁ జెప్పి । గణ్యచరిత్రా!. 92

ఇంద్రుఁ డదితిని స్తవముఁ జేయుట.

ఉత్సాహ. చారణాదిసకలదేవ । సంఘపూజ్యమానుఁడై
చారుపుణ్యవాస మాచుఁ । జాలనీడ్యరమము నై
ధారణిని వెలుంగుచున్న । తల్లియున్నచోటికిం
జేరి యదితిఁ జూచి భక్తి । చిత్తమందుఁ జెన్నొనన్. 93

చ. శిరమున హస్తయుగ్మమును । జేర్చి వినమ్రుఁడునై యదీయసుం
దరశతపత్త్రసన్నిభపదంబులఁ గూరిచి మ్రొక్కి యాత్మడు

ర్భరగతి నంతఁ దెల్ప విని । వాసవుఁ గౌఁగిటఁ జేర్చి యంతఁ ద
చ్ఛిరమును దృష్టిమోదముల । చేతను మూర్కొని యామె పిమ్మటన్. 94

క. జరగిన హేతువు నడిగిన, సురనాథుఁడు తనకు సర్వ।సురలకు దైత్యే
శ్వరకృతమైన పరాజయ, సరణిని భాషించెఁ బొరలు । సంతాపమునన్. 95

క మునినాథ! యిట్లు శక్రుం, డన విని శుద్ధగకాయ । రై వృత్రుండా
ఘనవాహనుఁ డసురులచే, తను జితుఁ డని యామె తెలిసి । తహతహపడుచున్.

తే. స్తుతుఁ డనాద్యుండు సంతత।శోభనుండు
పరమదేవుఁడు నైన శ్రీ।వాసుదేవు
శరణమును జెందె నన విధి।జనితుఁ డైన
నారదుఁడు పల్కె నో ముని।నాథచంద్ర 97

క. వినుత చరిత్రయు నిర్జర, జననియు నగునట్టి యదితి । శౌరియు నగుచుం
డిన దామోదరు నెటు భ, క్తినిఁ బొగడెనొ నాకుఁ జెపుమ । కృప చిగురొత్తన్.

సీ. అన నతఁడిట్లను । నసురేశు డా బలిచే విజితుండు నై । జిష్ణుఁ డొప్పఁ
గర్బురగణములు । కనుఁగొని శుక్లపక్షంబున మకరన।క్షత్రగతుఁడు
నై రవి భాసిల్ల । నతికాంతి వెలిఁగిరి యదితి సప్తమిదిన।మందు రమణఁ
దనరుచుండిన మహో।దయమందు వాసవాశాధిరూఢుఁడు త్రిదశ।శాధినాథుఁ

తే దైనహరిఁ గాంచి నిరశన । యగుచు నియత
వాక్ప్రవృత్తిని నలరారి । భవ్యుఁ డయిన
నీరజాక్షుని మదిలోన । నిల్పి యిట్లు
పొగడసాగెను భక్తితో । మునివరేణ్య! 99

అదితి హరిని పొగడుట.

ఆ జలజదివ్యకోశ! । చార్వభావకురార!, చటులపాపకాష్ఠ । జాతవేద!
భానుదివ్యరూప! । పాలి జయింపుము, సంతతంబు నీవు । చారుకీర్తి 100

క. త్రైలోక్య శ్రీనాథా!, లాలితవనమాలధర్మ।లక్షణపాలా!
పాలితనిర్జరజాలా!, వాలాయము గెలువు మావు । ప్రాభవలీలన్. 101

క భూరిచరాచరమునకును, గారణుఁడవు పాలకుఁడవు । గణ్యుండవు వి
స్తారయశోధనుఁడవు నను, గారుణ్యముతోడ నీవు । కావు రమేశా! 102

వ. జగన్నాథా! జగన్మయుండవు సర్వనాథుఁడ వగునీవలన నింద్రుఁడు నిజరాజ్య
విచ్యుతిని బరాజయంబు నొందె నాకారణంబున నిను శరణుఁ జొచ్చితి నక్షీణ
కృపాకటాక్షవీక్షణంబుల నను రక్షింపు మని యిట్లుపలికి క్రన్నన 103

క. సుమనోగణసేవ్యము ర, క్తము వగు శ్రీఖండ మలఁది । కరవీరలస
త్సుమపటలంబులతో స, క్రమముగఁ బూజించి భక్తి । కడలుకొనంగన్. 104

ఆ. పూనికఁ ధూపదీపభోజ్యాజ్యనైవేద్య
పాయసాన్నములను । బంకజాక్షు
హితముగాను నిచ్చి । పృథులతరభక్తితోఁ
దెలుఁగునట్టి పనులె । చేయుచుండి. 105

క. నిరతసన్నై రెండవవా, సరమున సవిధిఁగను మునిఁగి । శ్రద్ధాన్వితయై
కరపీఠంబులతోడను, గర మాహరిఁ బూజచేసి । కదలని నిష్ఠన్ 106

వ. పలుమఱు ప్రార్థించి తిలాజ్యయుతహోమంబు విప్రుల కిడి నియతయై యుండ
రవిమండలనిర్గతుండు ధృతతేజుం డగు శ్రీధరుఁ డేతెంచి ప్రీతుండై ముందట
నిలిచి యిట్లనియె. 107

అదితికి హరి ప్రత్యక్షమై సంభాషించుట.

సీ. దక్షనందిని నేను । దవిలి ప్రీతుఁడనైతి నీకు నీవ్రతమున । నిజముఁ బొంద
గూడని దైనట్టి।కోర్కెఁ జెందెద నీవు మత్ప్రసాదంబున । మదిని శంక
వలదమ్మ! రాజ్యంబు । వాసవాదులు నైన నీకుమారులకును । నేర్పుతోడఁ
నిడఁగలదైత్యుల । నిలఁగూల్పఁగలవాఁడ నీగర్భమందున । నేను బుట్ట
ఆ. యనిన వాసుదేవుఁ । డాడినమాటల, నాలకించి సారె । కద్దిభీతి
నలరి లోకయోని । యైనట్టిమాధవుఁ, గాంచి యిట్టులనియె । గాఢభీతి 108

ఆ. అనిశ మెవనికుక్షి । నలరారునో చరా, చరమయంబు నైన।జగము దీప్తి
నట్టిదుర్ధరుండ । వగునిన్ను నేఁ దాల్పఁ, జాల జఠరమందుఁ । జక్రహస్త 109

క. గురుతరలోకత్రయమును, ధరియించెడు నిన్నెవండు । తాల్పంగలఁ డీ
ధరయందు నరసిచూచిన, సరసీరుహపత్రనేత్ర! । సత్యచరిత్రా!. 110

క. గిరియుతము లైనజలధులు, కర మే జగదీశుకుక్షిఁ । గాంచి స్ఫూర్తిం
బరఁగునొ యట్టినిన్నుఁ గను, స్థిరశక్తి ధరించు నెవఁడు । ఇలపై శౌరీ 111

ఆ. జలజనేత్ర! దాన । శక్రుఁ డట్లమరేంద్రుఁ
డగునొ; నాదుక్లేశ । మరయఁ జెడిన
దగునొ; యట్టు లీవు । నాచరింపుము దయఁ
బరమపురుష! సర్వ।భక్తపోష!. 112

క. మునివర! దేవారణియును, వనితామణి యైనయదితి । బంధురభక్తిం
బొనరుచు నిట్లు వచించిన, విని హరి యాదేవితోడ । వేడుకలూరన్. 113

సీ. భాషించె నోమహా।భాగ! నీవాడినవార్త సత్యంబయి।వఱలు దేవ
దైత్యుల కెను దుర్ధరుఁడ నట్టినను గూర్మి జనింతు నీ।కుక్షియందు
నద్రిసమన్విత । మైనలోకంబును గర్భయుక్తనై । ప్రాలునిన్ను
నను నేను తాల్చెద । ఘనయోగసరణితో నిపుడు ఖేదము నొంద।నేల వ్యర్థ

ఆ. మగుడ యుష్మదీయ । మైనగర్భమునందుఁ, గడిమి నే జనింపఁ । గలను రూఢి
నప్పు డసురులెల్ల । నపగతతేజులై, యుండఁ గలరు శంక । నూనవలదు. 114

మ. మునినాథా! భగవంతుఁ డాద్యుఁడు జగత్పూజ్యుండు దుష్టారినా
శనుఁ డా మాధవుఁ డిట్టు లాడి నిజతేజస్స్ఫూర్తితో నామెకుం
దనిఁ దద్గాత్రములందుఁ జొచ్చె హరికిన్ । శిక్షించె మేలయ్యె నం
చినవాఁడై మఱి సంతసంబు మదిలోఁ । జెల్వారుచుండం దమిన్. 115

తే. వామనాకృతితోడను । వాసుదేవుఁ, డమరజననీపిచండమం । దలరుచుండ
నసురులెల్లను నిర్వీర్యు । లైరి విశ్వ, యోని చెప్పినకైవడి । యోగ్యచరిత!.

వ. అయ్యెడ. 117

బలి దనుజలోకహానికారణముఁ బ్రహ్లాదు నడుగుట.

క. అనఘా! బలి గతదీప్తిని, దనరెడురక్కసులఁ గాంచి । దానవసింహుం
డును విజ్ఞుఁడైన ప్రహ్లా,దున కని యిటువంటిమాటఁ । దోడఁబడుబుద్ధిన్. 118

క. తాతా! నిస్తేజముతో, దైతేయులు వెలసి రేల । ధర్మజ్ఞుఁడవుగా
నీతిశుభాశుభవిదుఁడవు, నై తనరెడు నీవు నాకు । నాడుము దానిన్. 119

చ. అని యిటు పౌత్రుఁ డాడ విని । యాఘనుఁ డాయెడ వీర్యహాని యి
వ్వనిపలనగా దితిసుతులకు । వావిరి వాటిలె నేమికారణం
బన నని యెంచి ధ్యానగత । బుద్ధి వహించె మహార్తమాత్రమై
తనరెడివేళఁ దాఁక నియత । స్థితుఁడై వనజాసనాత్మజా!. 120

శా. ఆతం డాయెడ నిట్లు యోగరతితో । హర్యుంది శ్రీనాథుచే
దైతేయాళికిఁ గల్గినట్టిభయముల్ । దర్శించుచుం గాంచి యా
భూతేశుం డిటనున్నవాఁ డిపుడు సమ్మోదంబుతో నం చొగిన్
జేతంబందుఁ దలంచె భక్తిగదురన్ । జెల్వొంది మిన్నంటగన్. 121

సీ. ఆధారచక్రంబు । నందుండు సప్తపాతాళలోకంబుల । దానిపైనఁ
గడఁగుధరాదిజ । గంబుల నేఁడిటఁ గ్రమమున యోజించి । కమలరూప
మున నున్నభూమినిఁ । జూడఁగాంచి తన్మధ్యకమ్రస్థలంబునఁ । గమలమూర్తి
వెలసి నగేంద్రమై । వెల్గు బంగరుకొండఁ గని దానిమీఁదను । గ్రాలునట్టి

తే. పత్తనంబులఁ దత్పురీపాలకులను
దత్పురంబులపై దీప్తిఁ । దనరునలువ
నగరమును దానిక్రిందుగ । నాకవాస
జననిదివ్యాశ్రమముఁ గని । సంయమీంద్ర!. 122

క. సురనిత్యపూజితము భా, సురనగమ్యగణసంఘ । శోభితము శుభా
కర మగునదితినివాసముఁ, గరముట నివసించు నదితి । గనుఁగొని యంతన్. 123

క. అరయఁగ విభుఁ డమలా, చారుండగు మధువిరోధి । సంతతపర్వా
ధారుని వెదకుట కొఱకై, ధీరత నాస్థలమునందుఁ । దేజస్స్ఫూర్తిన్. 124

సీ. చని దేవతామాతృ । జఠరమందున సర్వభూతవరేణ్యుండు । పుండరీక
చక్షుండు గతశంఖ । చక్రుండు నఖిలామరాసురాధీశ్వర । వ్యాప్తకాయుఁ
డగు శౌరిఁ గని యతఁ । డట్టియోగంబున వామనాకృతిఁ దాల్చి । బహుళదైత్య
తేజోహరుండు నై । దీపించువిష్ణునిఁ గాంచి పెన్మాయలో । గ్రాలి పోలి

ఆ. పిదపఁ బెద్దబుద్ధి । వెలయఁ బ్రహ్లాదుండు, మాధవునకు మ్రొక్కి । మధురరీతి
ననియె దనుజ విరోచ । నాత్మజుం డగుబలి, దైత్యనాథుతోడఁ । దానవేంద్ర!

క. దనుజేశ! మాకుఁ గలిగిన, ఘనసర్వభయంబు నెట్టి । కారణమున నీ
దనుజాలు నిస్తేజోగతిఁ, దనరిరొ భావింతు వినుము । దానినిఁ ద్రీలన్ 126

క. పురుహూతరుద్రపావక, వరుణాదిసమస్తదేవ । పతులెల్లను సం
గరభూమిలోన నీచేఁ, గరము వినిర్జితులు నగుచుఁ । గడుభీతిమెయిన్ 127

ఆ. త్రిభువనేశ్వరుండు । దేవేశుఁ డౌహరి
చెంత కరిగి శరణు । చెంది లోక
విభుఁడు శ్రీధరుండు । వేడ్కతో నభయంబు
వారి కిచ్చి యపుడ । వార్యశక్తి 128

చ. సుగముఁడు దీర్ఘబాహుఁడును । శోభనుఁ డౌహరి వామనాకృతిన్
దిగి సురమాతృగర్భమున । దీప్తి వసించినకారణంబుతో
నగడను రాక్షసేంద్రులకు । నిర్గతవీర్యము ప్రొద్దుపుట్టఁ జే
జగిబిగినున్నచీఁకటిన । శించినకైవడి నో బలీశ్వరా! 129

బలి ప్రహ్లాదునితో హరిని నిందించి పలుకుట.

ఆ. అనఘు లిట్లతండు । నాడిన బలివిభుఁ, డట్టిభాషణముల । నాలకించి
రోషభావితాధ । రుండు నై యని భావి, కర్మవశుఁడు నగుచుఁ । గ్రూరవృత్తి.

క. ఏవానివలన మాకును, వావిరి సాధ్వసము మిగుల । వాటిల్లినొ సం
భావింప వాఁ డెవండో, నే వక్కాణింతు వినుము । నిజముగఁ దాతా!

సీ. అసురు లెవ్వరు సంగ । రాంగణమందున శక్రాదిసురలను । సాహసమున
భంజింప వారలు । భయమున స్వర్గంబు వీడి దర్పము లేక । వెలుపువలన
వడిఁ జనిరో యట్టి । వారును హరి బలాధికు లైనదనుజాలు । లివిరి నాకుఁ
గలరు కోట్లకొలంది । గణుతింప మఱి వేగ కలితమై పౌనరా । కమలమిత్రు

ఆ. భవ్యరథమువలన । బహువేగవంతమౌ, చక్రమును గ్రహించి । చటులశక్తిఁ
జెలఁగువిప్రచిత్తి । సేనాపురస్కృతుఁ, డయ్యె నాకు నెంచ । నసురనాథ! 132

క. సురపూర్ణరాజ్యలక్ష్మీ, తరుణీమణియుతుఁడ భూరి । ధైర్యుండ నికా

చరనాథుఁడ వగునను సం,గరమున సిరిమగఁడు గెల్వఁ। గలఁడే చూడన్. 133

వ. మఱియు నయుతసంఖ్యులు శిబివిరూపాసిలోమత్రిశీర్షమకరాక్షవృషపర్వాసికేతుణా
ఖ్యాసురులు బలాధికులు బహువిధశస్త్రాస్త్రవిశారదు లగుపెక్కండ్రు రక్కసులు
నాకుఁ గలరు కేశవుఁడు వారియందొక్కనికిఁ బడియాజివపాలున కీడగునే
యని బలిదైత్యుఁ డిట్లు గరువంబున నాడిన నతనిభాషణములఁ బ్రహ్మాదు లాలిం
చి క్రోధఘూర్ణితమానసుం డయి నారాయణనిందాకరుం డగుబలిఁ జూచి
సత్కారంబుఁ గావించి యిట్లనిరి. 134

బ్రహ్మాదులు బలికి శాపమిచ్చుట.

మత్తకోకిల. ఓరి బాలిశ! దుష్టమానస! ఘోరి పాపరతా! హరి
దూరసాగినవాఁడ వై బహుదోషి వైతివి దాన నీ
ధారణిన్ భవదీయజిహ్వయు ధ్వస్త మై పడునట్లు పెం
పారు నీ వెడమాట నియ్యెడఁ బల్కు నేల మహోద్ధతిన్ 135

ఆ. ఓరిదుష్టభావ! యోగి నీవు త్రైలోక్య
జనకుఁ డైనశౌరిఁ జాల నింద
చేసినాఁడ వందుచే శోచ్యుఁడవు భక్త
గర్హితుండ వగుచుఁ గనఁబడుదువు. 136

ఆ కర్కశుఁడవు దేవగణావమానక, రుండ వగుచు నలవిరోచనునకు
నాత్మజుండ వగుచు నలరారినందున, శోచ్యుఁడవు నిజంబు చూవె నిజము

వ. కుటిలచిత్త! వాసుదేవునికంటె వేఱగు ప్రియుఁడెవ్వండు లేఁడనునది నీకు నీర
క్కసులకుఁ దెలిసినదే కదా? సర్వేశ్వరుఁడును, జనార్దనుఁడును, నాకుఁ బ్రియ
తముఁ డగుచక్రపాణిని నీ వెఱిఁగినవాఁడ వయ్యు నెట్లు నిందించితివి; నీకు
నీతండ్రి పూజ్యగురుఁ డయ్యె నట్టినీతండ్రికి నేనుఁ బూజ్యగురుండ నైతి భగ
వంతుఁడు సకలభువనజనకుఁడును బుధార్చితుఁడును నగుమాధవుండు నాకు
గురుం డయ్యె నని మఱియు నిట్లనిరి 138

క. గురుగురుగురుఁడగువాఁడును, బోరిఁబోరి నర్చితులయందుఁ బూజ్యుండగు శ్రీ
పరమేశుని నిందించుచుఁ, బరుషోక్తుల నాడుచున్నవాఁడవు మిగులన్. 139

క. హరినిందవలనఁ గలిగిన, గురుపాపమువలన నెట్లు కుంభినిమీఁదం
బరువడిఁ బడకుందువు దు,ర్భరగతితో నీవు చూడఁ బాపనిశాటా! 140

సీ. కర్కశుఁడవు దోషకలితుఁడవును హరినిందాపరుండ వౌ నీవు సర్వ
కర్బురపతి వైన కారణంబున దురాచారులును నగునిశాచరేంద్రు
లంతలు నీవంకనలిశోచ్యు లగుదురు నిజముగాఁ బూజ్యుఁడు నిఖిలపూజ్యుఁ
డగునట్టిమాధవు నకట! నిందించితి వందున నీరాజ్యహానికలుగు

సీ. జగతి భావిప్రయో।జనము లవశ్య మెప్పటి। కరింపవు । బంధుపుత్ర
దారార్థ మయ్యు రా।జ్యప్రాగ్ర్యభోగవి।త్తంబులు ముఖ్యలేఁ । దనరుచుండు
నాగమనిర్గమ।ములకు భేదంబును గని యొనర్పఁడు పూర్వ।కర్మసరణిఁ
దోరి నెట్టు సుఖదుః।ఖములు వచ్చునో యట్టు లోర్వనా కడిమి నరో।త్తముండు
ఆ. పొసఁగుచుండు దుఃఖ।ములఁ గని దుఃఖింప
రాదు; విపులమైన । రమ్యలక్ష్మిఁ
బొంది పొగరునొందఁ । బొంగారఁ గూడదు
సతతశాంతభావ।సహితుఁ డగుచు 154

క. పురుషోత్తము లాపెద్దలు, కరము ధనక్షయముచేతఁ । గాసిల్లరు భా
సురలక్ష్మి వచ్చినప్పుడు, గరువంబును జెంద రెందుఁ । గదలనిపూన్కిన్. 155

ఆ. అసురవర్య! యిట్టి।దని దీనిఁ దెలిసిన, వాఁడ వగుచు నెప్డు । వాస్తవముగఁ
బరితపింపవలదు । పండితుండవు గావె, కవికి దుఃఖసరణి । గలదె చూడ. 156

క. కనుఁగొన మహార్థకంబునఁ, దనరుహితంబును వచింతుఁ । బూర్ణప్రీతిన్
విని సేవన్యులు నేఁ డె, ప్పినకరణి నొనర్పు టొప్పు । విస్తృతబుద్ధిన్. 157

క. వినుమా మాధవుఁ డభయ, మ్మున నుండియు భూరికరుణ । బొంగారఁగఁ బ్రో
చును నీవనన్యబుద్ధిని, వనజదళాక్షుని భజించి । వర్ధిలుము ధరన్. 158

ఆ. అజుఁ డనాదిమధ్యుఁ । డాద్యుఁ డీశుఁడు చరా
చరగురుండు భావ।జలధిగర్త
పతితతారకుండు । పరమేశ్వరుఁడు భక్త
పాలకుండు నైన । వాసుదేవు 159

క. నిరతము భక్తిశ్రద్ధా, పరులై సేవించునరులు । భద్రస్థితితోఁ
బరఁగినవారయి యగతి, జ్వరమున వాటిలుదు రెపుడు । వసుధాస్థలిలో. 160

క. వనమాలికి భక్తుండవు, ఘనుఁడవు శ్రీశౌరివినుతి।కలితుండవు స
జ్జనుఁడవు నగుమా కృప నా, వనజాక్షుం డిడఁగలండు । భద్రము నీకున్ 161

సీ. ఇఁకఁ దీర్థయాత్ర యం।దేను గల్మషహరణార్థమై భక్తి।నారాయణుని భ
జించినవాఁడ నై । శిష్టు లెన్న విముక్తపాపుఁడ నయ్యెదఁ । బరముఁ డఖిల
జగదవనుండును । శౌరియు నరసింహుఁ డచ్యుతుండును గాఁడె । యాఁడనుచు
బలినిట్లు రెండు నా।శ్వాసించి యోగాధిపతియైన మాధవు।పాదపద్మ
ఆ. ములను సంస్మరించి । భుజబలసర్వని, శాచరాధ్యభూరి।సైన్యవరులఁ
గార్తిమాఱ వీడు।కొని తీర్థయాత్రప, ల్పంగఁ జనెను మాని।వంశతిలక! 162

వ. ఇట్లు పులస్త్యుం డన నారదుఁడు ప్రశ్నించె నిట్లనియె. 163

క. అనఘా! ప్రహ్లాదుం డే, ఘనతీర్థమ్ములకుఁ బోయి । గరుణామతి వా
నిని దెల్పుమనఁ బులస్త్యుం, డనితరమగుబుద్ధితోడ । ననియెం బ్రీతిన్. 164

పులస్త్యుఁడు నారదునకుఁ బ్రహ్లాదతీర్థయాత్రాక్రమంబు సెప్పుట.

క. మునివర్య! పాపపంకం, బును బాపెడి దగుచు దీప్తిఁ । బొనరెం బ్రహ్లా
దునితీర్థయాత్రఁ జెప్పెద, మనమలరఁగ నాలకింపు । మానితభక్తిన్. 155

క. వినుతుండగు ప్రహ్లాదుఁడు, దనుజగణావ్యాప్తితోడఁ । దనరారెడి దా
కనకధరాధరమును వీ, డినవాఁడయి శ్రద్ధ మదిఁ గ । డిందిగఁ గడురన్ 156

మ. ఘనవైసారిణరూపశౌరియుతమై । కన్పట్టుచు న్మానసా
ఖ్యను చెంపారుచు ధర్మశైలతలగ । ణ్యాంబైనతీర్థంబుఁ జే
రినవాఁడై యట ముగ్గి పైత్రమును దాఁ । బ్రీతాత్ములం జేసి భ
క్తిని బూజించె శ్రుతిప్రయుక్తుఁ డగుచ । క్రిన్ సర్వలోకేశునిన్ 157

క. పెండియు నుపవాసము దా, నుండి దృఢంబుగను మాన । వోత్తమగణముల్
మండితమునిపితృనిర్జర, మండలి నినిపె నపుడు । మానితబుద్ధిన్ 158

సీ. అంతఁ గౌశికియందు । నలరారునదియును విగతపంకంబున । వెలయుకచ్ఛ
పముఁ గనఁ జని యట్టి । పావననదియందు మునుఁగుచుఁ బూన్కితో । మౌనిలోక
పూజ్యుఁ డౌమాధవుఁ । బూజించి పెండియు విగతభోజనుఁడు నై । విప్రులకును
దక్షిణ లిచ్చి శ్రీ । ధరుఁడు కూర్మాకార మహితుఁ డౌహరికి న । మస్కరించి

ఆ. పిదపఁ గృష్ణయందు । వెలుఁగొందుహయముఖుఁ
డయినశివునిఁ జూడ । నరిగి యాప్ర
దంబునందు మునిఁగి । దైత్యారి పితృతుష్టి
సలిపి దివ్యభావ । సహితుఁ డగుచు 159

క. తురగముఖుం డగుశంభునిఁ, గరమర్థిని బూజచేసి । గజసాహ్వయభా
సురతీర్థమునకుఁ జని యట, వరవిధిని మునింగి శ్రద్ధ । భాసిలుచుండన్ 170

క. గోవిందుఁడు జగదీశుఁడు, భావవిదూరుండు లోక । పతియగు చక్రిన్
వావిరిఁ బూజించి మహా, పావనయగు యమున కపుడు । భావంబలరన్. 171

క. చని యాదివ్యనదీజల, మున మునిఁగి విశుద్ధబుద్ధి । ముని దేవతలన్
దనపెద్దలఁ దనిపి జగ, ద్వినుతుఁ త్రివిక్రమునిఁ జూచె । విమలచరిత్రా!. 172

చ. అనుటయు నారదుండు ముద । మూర్తిఁ జెనంగొనఁ బల్కె దాపసా!
తన బలిబంధనత్వమునఁ । గ్రాలి జగత్త్రయమెల్ల నిండి పెం
పునఁ జెలువొందుకాయమును । బూజ్యుఁడు నైన త్రివిక్రముండుఁ దా
ల్చెను దమి నద్ది యెట్లు ముని । సేవ్యుఁడు నా హరి పెండి ధాత్రిపై. 173

క. అరయఁ ద్రివిక్రముఁ డగుచుం, గరమెవనికి బంధనంబుఁ । గావించెనొ దు
ర్భరశక్తి నట్టిదానిం, గరుణామతిఁ జెప్ప నన్నుఁ । గాపాడు మునీ!. 174

చ. అనుటయు నాతఁ డిట్టులను । నబ్జభవాత్మజ! యొట్టికాలమం
దనఘులు మెచ్చుచుండ దను । జారి త్రివిక్రముఁ డై జనించి యె

వ్వని వడి మోసపుచ్చి కడు / వాసి వహించినా డానినంతయు
న్నీవు వినిపింతు నీకనుచు / వేడ్క వచింపఁ దొడంగె నారయుడన్. 175

### ధుంధుదనుజుచరితము.

ఆ. మున్ను గశ్యపునకుఁ / బుట్టెను దనుగర్భ
సంభవుండు భూరి / సారశౌర్య
ధుర్యుఁ డౌసుతుండు / ధుంధ్వభిధేయుండు
దీప్తి దిక్కులందుఁ / దేజరిల్ల. 176

వ. ఇట్లుదయించి వాఁ డంతట 177

క. దేవతలవలనఁ జావని, దా వరమును జెందఁగోరి / యబ్జాసనునిన్
భావమున నిల్పి తపమును, వావిరిఁ గావింప మెచ్చి / వాణీశుఁ డొగిన్. 178

చ. కరుణను వచ్చి వానిమదిఁ / గ్రాలెడికోర్కె నొసంగి యాత్మ సం
దిరమున కేగ భూరిబల / దీపితుఁ డై యతఁ డంతఁ దుష్టితోఁ
బరఁగుచు సర్వదైత్యపరి / వారసమేతుఁడు నై మహోద్ధతిన్
సురపతిదివ్యపత్తనముఁ / జొచ్చి సుపర్వులఁ గ్రౌర్యమొప్పఁగన్ 179

ఆ. కదనమునఁ జతుర్థ / కలియుగాది జయించి, వాసవత్వ మొసఁగె / భర్మకశిపు
నకును వాఁడు పిదప / నైపుణీయలరఁగాఁ, గడిమి నాత్మముదము / గ్రాలుచుండ

క. నిరవధికశౌర్యయుతుఁ డై, గరువంబున ధుంధుదైత్య / కలితుఁడు నయి మం
దరనగసుంకరతరకం, దరబంధురతలములందుఁ / దాఁ జరియించెన్ 181

క. అంత దితీశ్వరు లాయెడ, సంతసమున స్వర్గమందు / సరవి నిజేచ్ఛా
క్రాంతస్వాంతంబులతో, వింతఁగఁ జరియించి రోలి / వేడ్క మునీంద్రా!. 182

ఆ. అప్పు డమరు లంద / ఱతిభీతితో బ్రహ్మ, సదనమునకు నేగి / చాల భీతి
వలన ధుంధుఁ డమరు / లబ్జాసభనుంట, నాలకించి కోప / మాత్మలోన 183

ఉ. కందడి సేయ నిట్టులన / దానవులార! పితామహాలయం
బందు శచీపతిప్రముఖు / లాసురు లుండిరి దాని దేవతా
బృందముల న్మహోద్ధతినిఁ / బెర్చి యదల్చి జయించుదీక్షనుం
బొందినవారమై మనము / పోయెద మన్న దితీశు లాయెడన్. 184

ఆ. అసురారిమాట / నాలించి పలికి రో, జగదధీశ! మాకు / జలజయోని
భువనమునకుఁ గదలి / పోయెడిశక్తి లే, దెన్నటికినిఁ జూడ / నెందులకని 185

సీ. అడిగెదవా విను / మబ్జాసనాలయ మతిదుర్గమస్థితి / నలరుచుంట
దితిజేశు లెవ్వరి / దృష్టలక్ష్యప్రచోదితదారుణేషణ / దీప్తి దగ్ధ
లగుచుండు రట్టిమ / హామునీశ్వరయుతమైనమహర్లోక / మతిసహస్ర
యోజనంబులయందు / రాజిల్లుదాని కూర్ధ్వంబున సురభియు / క్తంబునగుచు

ఆ. సరవి నొకసహస్ర । సంఖ్యయోజనదూర, మచ్చట జనలోక । మమరునందు
వెలయు వేల్పుగిడ్డ । విపులాగ్రహవ్యాప్తి, కెవ్వఁ డీల్గకుండు । నిల సురారి!

వ. అట్టిజనలోకమున కవ్వల ముప్పదికోట్లయోజనంబులందు భానుకోటి ప్రదీప్తమయినదియు, భవద్వరప్రదుఁడగు విరించికి నివాసమైన సత్యలోకంబు రాజిల్లుచుండు; విను మే దేవునిశబ్దంబు వేల్పులకు ముదంబును దైత్యులకు దుఃఖంబు నిచ్చునో యట్టి వాణీశుసదనంబున కరుగఁ దలంచునట్టి బుద్ధి నీకుఁ గలుగుట సమమగునే! పరమేష్ఠిభువనమునకుఁ జనుట దుస్తరంబయి యుండు నన నాభాషణంబుల ధుంధుఁడు విని యాదానవుల కిట్లనియె 187

ఆ. సరసిజాసనాఢ్య । సదనంబు గెలువఁ బోఁ, దలఁచునట్టి నరుఁడు । ధరణి నెట్టు
లెట్టిపని నొనర్చి । యేగు నింద్రుం డెట్టు, లక్కడికిని బోయె । నాకుఁ దనుచు.

చ. పనిగొని ధుంధుఁ డీకరణిఁ । బల్కిన సర్వనిశాచరేంద్రులా
దనుజునిఁ గాంచి నిక్కముగ । దానవనాయక! మేమెఱుంగ మా
పని సుశీనుం డెఱుంగు నని । పల్కిన నాదితిజాళివాక్యము
న్విని యతఁ డంత దైత్యవర । బృందపురోహితుఁ డైనశుక్రుతోన్. 189

మ. అన నో భార్గవ! యిట్టిదైనపని నే । యత్నించి స్వర్గేహంబుఁ జే
రనగుణ జెప్పుమటన్న నాతఁ డనె వృ । త్రద్వేషి యూ బాకశా
సనుఁ డా శక్రుఁడు నూఱువాజిమఖము । ల్సంప్రీతిఁ గావించి చెం
దెను వాణీశుపదంబు దానఁ గడిమిన్ । దీప్తి న్విజృంభించుచున్. 190

ఆ. అనుచు నిట్లు దేవ । తాధీశుచరితంబు, నసురగురుఁడు వాని । కపుడు చెప్పి
వాజిమఖశతంబు । భక్తిఁ జేయుము విధి, వస్త్యగతియు నీకు । వలఁ గలదు.

వ. ఇట్లు భార్గవుం డనియె నంత. 192

క. గురుపలుకుఁ దగుదితిసుతుఁ డా, సురశాత్రవగురునిదివ్య । సూక్తుల విని తా
స్థిరమతి శతహయమఖములఁ, బోరిఁబోరిఁ గావింప నెంచి । పూర్ణప్రీతిన్. 193

క. దనుజశ్రేష్ఠుల శుక్రునిఁ, గనుఁగొని తమిఁ బల్కె నేను । గడుదక్షతలన్
దనరెడిశతహయమఖముల, నొనరింపఁ దలంచినాఁడ । నొగి మీరు దయన్.

క. రానగు వసుధాస్థలికిని, బోనగు మనమిపుడు సకల । భూమీశ్వరులం
గానఁ జని గెల్చి ధనముల, మానుగఁ గైకొనుచు వచ్చి । మాన్యులు మెచ్చన్.

సీ. కాంతతోడను యథా । కామగుణంబులఁ దనరెడివాజిమే । ధములఁ జేయఁ
దగు సర్వనిధులను । దగఁ బిల్వఁ దగులగుహ్యకులకు నిడుఁ డాజ్ఞ । సవనిసురులఁ
బిలువుఁడు మనము దేవిక యనుపేరుతో వెలయుమహానదీ । విపులతటము
నకు నేగ నగునద్ది । సలి పుణ్యదము నదీవర మఖలార్థసం । భరిత మందు

ఆ. వలన దానిపూర్వ । భాగంబుఁ జేరి శ, తాశ్వమేధములఁ బ్ర । యత్న మొప్పఁ
జేయఁదగును మనము । స్థిరమతి నన దైత్య, యాజకులు విశేష । హర్షసరణి 195

క. శౌనరుచు నాతనిపలుకుల, విని మేలని పల్కి రంత । విరతోత్కర్షం
బనిగొని నవనిధిపతి యా, ధనదుని కానతి నొసంగి । ధరఁ బావనియా. 197

సీ. దేవికానదికిఁ బ్రాగ్దిశయందు భార్గవేశ్వరుఁ డైనకవిచేత । వాజిమేధ
దివ్యాధ్వరార్థ మై । దీక్షితుఁ డయ్యె వాఁ డట్టిజన్మంబందు । నట్టితతని
భార్గవకులజాశ్రీ । పరమద్విజాలు ఋత్విజాలు యాజకులునైరి । సౌరిది భార్గ
వాజ్ఞతోఁ బండితు । లగుసైంహికేయాది కర్బురులందఱుఁ । గడిమి సవన

ఆ. భాగముల గ్రహింపఁ । బడిరి ధుంధునిచేత, యజ్ఞమప్పు డిట్టు । లడర హయము
విడువఁబడెను దాని । వెంట శ్రీమంతుఁ డౌ, ఖడ్గరోమనాము । కర్బురుండు 198

క. చన యాగధూమ మారుడ, ఘనమై దశదిశలఁ గడిమి । త్స్మాధరవితతిం
దనరా రెడివసుధాస్థల, మును బుట్టినదయ్యె మిగుల । మునికులతిలకా! 199

ఆ. అంతరిక్షమందు । వ్యాపించివట్టి యా, మేటితావినెల్ల । మింటనెసఁగు
నట్టిగాలి సరసి । జాసనులోకంబు, నిండున ట్లొనర్ప । నిఖిలసురులు. 200

క. మూరుకొని భూరిచింతా, వారిధిఁ బడి వాజిమేధ । వరదీక్షను జె
న్నారెడి ధుంధునిఁ దెలిసిన, వారై సురనాథుఁ గూడి । వగ పెనఁగొనఁగన్.

ఉ. అంత జనార్దనుండును మహాత్ముఁడు లోకపరాయణుండు శ్రీ
కాంతుఁడు పద్మనాభుఁ డతి । గణ్యుఁడుండు శరణ్యుఁడు న్దయా
క్రాంతుఁడు నైనచక్రధరుఁ । గానఁగ నేగి నమస్కరించి య
త్యంతభయాతిరేకమున । నాసుర లందఱు పల్కిరో మునీ!. 202

క. ప్రాకటధీర! చరాచర, లోకపరాయణ! రమావిలోలా! విష్ణూ
నాకనివాసార్తిహరా!, కాకోదరరాజశయన! । కళ్యాణనిధీ! 203

ఆ. విన్నపంబు దయను । విను బలవంతుఁడు, దనుజపతియు భూరి । ధనముతోడ
నలరుధుంధుదైత్యుఁ । డఖిలామరుల గెల్చి, విష్టపత్రయంబు । విపులశక్తి. 204

చ. శౌనర గ్రహించె నాకవిభుఁ । బ్రోచెడివాఁ డెవఁడైన నారయన్
గనఁబడఁ డందుచే నతఁడు । గర్వమునం జెలువొందె నూరకుం
డినఁ బటుశక్తితోడ నడి । డీకొను రోగము మాడ్కి నిప్పుడా
దనుజుఁడు బ్రహ్మలోకగత । దైత్యవిరోధుల గెల్వ నాత్మలోన్. 205

చ. తలఁచినవాఁడు నై కవిమ । తప్రియబుద్ధి చెలంగ నియ్యెడం
గలితతురంగయజ్ఞవిధిఁ । గైకొని నూఱుమహాశ్వమేధముల్
నలి నొనరించి బ్రహ్మభువ । నంబును జేరి విశేషశక్తితో
నలరి సురౌఘముం గెలువ । నాతఁడు వేడ్కఁ దలంచె మాధవా! 206

ఉ. దాన నకాలహీనగతిఁ । దద్దయు నీమదిఁ జింతసేయనా
మానుగ నీవు వానిదగు । మానితయజ్ఞవినాశము౯ దాగి౯

దానవు లెల్ల భ్రష్టులయి / ధాత్రి పయిం బడునట్టిమార్గముం
జానుగఁ జేయుమా యనుచు / సర్వసురర్షులు పల్కఁ నయ్యెడన్. 207
క. భగవంతుఁడు మధుసూదనుఁ, డగు కేశవుఁ డంత నమరు / లతిభీతులు నై
వగ నన్నుతుల విని దయ, నెగడినభావంబు నిగుడ / నిర్మలచరితా!. 208
ఆ. అపుడు వారి కెల్ల / నభయం బొసంగి పోఁ, బనిచి సర్వములను / భవ్యతేజ
ములను వీడి దైత్య / పుంగవుండును ధర్మ, శాలి యధిక ధైర్య/సహితుఁడైన
క. ధుంధుమహాసురనాథుని, బంధింప మదిం దలంచి / వామనమూర్తిం
బంధురలీలనుఁ గైకొని, గంధర్వప్రముఖదేవ/గణ్యులు మెచ్చన్. 210

— వామనోత్పత్తి. —

క. విమలనిరాలంబనకే, హముఁ బూన్కిని విడిచి దేవి/కానదినీటం
భ్రమనొందు కాష్ఠవైఖరి, సముపేనస్థితిని గ్రాలి / సంయమినాథా!. 211
ఆ. ముక్తకేశపంక్తి / మొనయ నిశ్చేష్టతోఁ, గొంతసేపు మునుఁగుఁ / గొంతదాఁకఁ
దైక తేచి వచ్చు / భావింప నిటు కొరి, నీటియందు లీల / నెగడుచుండ. 212
క. పరమర్షులు ధుంధుఁడు ని, ర్జరరిపు లైనట్టి సర్వ/రాక్షసులాధా
సురడింభకుఁ గనుఁగొని య, ధ్వరకర్మము విడిచిపెట్టి / తహతహపడుచున్.
చ. కడుదయతోడ నాసరిద/గాధజలంబులఁ జొచ్చి యక్కడం
గడిమి సమర్థహీనగతిఁ / గ్రాలుచు నీటను మున్గి చింతతోఁ
గడఁగెడువాఁడు పొట్టిగను / గన్పడు పాలునిపట్టి నాయెడం
బడి నిజహస్తయుగ్మముల / భద్రముగాఁ గొని నేర్పుమీఱఁగన్ 214
క. దరిఁ జేర్చి సంతసంబునఁ, బరఁగుచు వారంద ఱట్టి/బాలునితో నీ
కరణి ననిరో మహీసుర, వరతనయా! నిన్నెవండు / వారనికనుకన్. 215
ఉత్సాహము. ఈనదీజలంబునందు / నేనరుండు త్రోసెనో
దాని నీవు మాకుఁ జెప్పఁ / దగునటంచుఁ బల్క నా
మాననీయమూర్తి వాని/మాట నాలకించి సం
భావకంపితస్వదేహ/ధారి యగుచు నయ్యెడన్. 216
క. అని నాధుంధ్వాదిమహా, దనుజాలఁ గని నాకు నిట్టి / దారుణదశగ
ల్గినకారణంబుఁ జెప్పెద, వినుఁ డని భాషించె మిగుల / వింత జనింపన్. 217

— ధుంధునకు వామనుఁడు నిజవృత్తాంతంబుఁ జెప్పుట. —

సీ. వారుణకులజాండుఁ / బండితుండును సర్వశాస్త్రార్థవేత్తయు / సత్యరతుఁడుఁ
బరమశాంతుండుఁ బ్ర/భాసనాముండగు జన్మిగట్టొక్కఁడు / జగతి నలరు
నతనికి దుఃఖిత/మతి యుండమానస మగునట్టిపుత్రద్వ/యంబు గలిగె
నందు నాకగ్రజుఁ / దదరు నేను గనీయసుండ నాదు మదగ్ర/జుండు నేత్ర

ఆ. భాసనాయకునను । బరఁగెరు గలిభాసుఁ, డనెడి పేరు నాకు । నాత్మజనకుఁ
డోసఁగెఁ గౌతుకమున । నుర్వి మాతండ్రికిఁ, గాంతసదన మొకటి । కలదు దీప్తి.

క. త్రివిష్టపగుణముల వసి, వావిరి విలసిల్లి స్వర్గ । వాసోపమ మై
రివి న్నిత్యముఁ గుల్కుచు, భావానందదము నగుచు । భాసిలుచుండున్. 219

ఆ. అంతఁ బెద్దకాల । మఱిగిన మాతండ్రి, కాలగతినిఁ జావఁ । గాంచి యూర్ధ్వ
దైహికము ముగించి । తగనాత్మగృహమున, కరిగి భేదబుద్ధి । నలరి నేను 220

సీ. సదనార్థములయందు । సగపాలుఁ బంచి యిమ్మంటి; నాపల్కుల । నాతఁ డాల
కించి యీకింతయుఁ । గృపలేక భాషించె నర్థాలయాదుల । యందు నీకు
భాగ మర్థము లేదు । వామనోన్మత్తాంధకులకు క్లీబశ్విత్ర । కుబ్జఖంజ
పురుషులకెల్లను । భోజనాచ్ఛాదన ప్రియవాక్యమందిర । ప్రీతివాస
ఆ. మాత్ర మిచ్చు టొప్పు । మహి నర్థమున సగ
పాలు లే దటంచుఁ । బలుకుచుండఁ
బితృగృహంబునందు । వెలసిన భాగంబు
ధనమహామణీంద్ర । తతులయందు 221

క. పాలెట్టి శాస్త్రపద్ధతి, చే లేదో నాకు ననుచుఁ । జెచ్చెఱ ననఁగా
నాలించి యాతఁ డురుబల, శాలియు నైనందువలనఁ । జటులోత్కర్షన్. 222

క. తనకరమున నాకురులం, గొని వడిఁ బైకెత్తి యిట్టి । గురునదిలో వై
చిన నే నవతారణమును, మనమునఁ దెలియంగలేక । మలసెడుగలితోన్. 223

క. మునుఁగుచు నుండఁగ నాకీ, ఘనసరిదంతరమునందుఁ । గడచెను నౌకహా
యన మిప్పు డేను వీచే, తను సలిలోద్ధృతుఁడ నగుచుఁ । దనరితిఁ బుడమిన్.

క. వీ రెవ్వ రిటకుఁ జెలిమిని, జేరితి రాప్తులనుఁ బోలి । జిష్ణూపముఁ డౌ
శూరుం డెవ్వం డగునో, వారనిదయ సర్వమంతఁ । బలుకుఁడు నాకున్. 225

తే. వీరు బ్రహ్మర్షితుల్యులై । మించుచుండి
కరుణ నాబోటివానినిఁ । గాంచి సాను
కంపచిత్తంబు లేపారఁ । గ్రాలి గట్టుఁ
జేర్చి రక్షించితి రటంచుఁ । జెప్పనంత. 226

క. అపలుకుల విని వారా, పాపనితో ననిరి మేము । భార్గవులము సం
ప్రాపితకులవర్ధనులము, దీపితుఁడగు వీఁడు ధుంధు । దితిజేశ్వరుఁడా. 227

ఆ. ఈమహాసురుండు । పృథుదానయును మహా, భోక్తదివ్యవిభుఁడు । భుజబలుండు
యజ్ఞకర్మమందు । హార్యాంక దీక్షితుఁ, డయ్యు ధర్మబుద్ధి । నలరుచుండ. 228

చ. అని యిటులాడి దేవుఁడు మహాత్ముఁడు నై వెలుగొందు వామనుం
గని యిటుపల్కె యంత బలిగర్భజనాథుఁడు నైనధుంధుతో

నని రాఁగి వామనార్థకర। మైనసుడిఁగ దనుజేశ వీనిఁగ
ఘనబహురత్నగేహముల। గాదిలి నీదగు నంచు నాయెడన్. 229

క మునివర ధుంధుం డాద్విజు, లనినట్టి సుభాషణముల। నాలించి మహా
వినయముతో నా వామనుఁ, గని యాకైవడినిఁ బలికెఁ। గౌతూహలియై 230

మ కరులో భూరిధనంబులోఁ బశువులో। గ్రామంబులో భూములో
వరరత్నంబులొ కన్యలో రథములో। వజ్రంబులో రాజ్యమో
హరులో మేడలొ హేమవస్త్రములొ నీ। యాత్మస్థమై యుద్ది భా
సురత న్వేల్గునొ దానిఁ గోరు మిడెదఁగ। సొంపార విప్రోత్తమా!. 231

క. అనఘా యిటువాఁడను నుడి, విని వామనుఁ డంత స్వార్థ। విస్తృతసిద్ధిఁ
దనరెడువాక్యముఁ బల్కెను, దనుజేశుం డైనధుంధు। దైత్యునితోడన్. 232

మ దనుజాధీశ! మదగ్రజాండు కడిమిం। దల్కొత్తు నాసంపదం
గాన నాయర్థవిచార మేల వినుమా। కూర్మి న్మహారత్నవా
హనదాసీగణదాసభృత్యజనగేహారామరాజ్యంబులఁ
ఘనులౌ విప్రుల కిచ్చి కీర్తిఁ గని వేడ్కం జెంద నా ధాత్రిపై 233

తే కర్బురేశ్వర! నామేటఁ। గాంచి నాకుఁ, దగిన దగునట్టిభూమిఁ బాదత్రయంబు
నీదిగా నాశసంగుము। నేను దాని, గనకగిరిమాడ్కి భావింతు। గణ్యులెన్న.

క. ఘనుఁడు మహాత్ముం డగువా, మనుఁ డిట్లనువాక్యములను। మనసారంగా
విని బులిస్రాఁ దగుధుంధుదు, వినయంబున నాసనంబు। విడిచినవాఁడై. 235

వామనుఁడు ధుంధునిఁ బాతాళమునకుఁ ద్రొక్కుట.

ఆ. వరదుఁ డైనహరికిఁ। బాదత్రయావని, భక్తి నొసఁగ దైత్య। పార్థివేంద్ర
దత్తమైనపుడమిఁ। దాఁ గ్రమత్రయముగ, నపుడు చూచె వెలియు। నైనశౌరి.

వ. ఇట్లు మాయామాణవకుం డగుమాధవుండు చూచి యంత. 237

చ. అనఘుఁ డనంతశక్తియుతుఁ। డైనరమేశుఁడు విష్టపత్రయం
బును గడు దాఁట నెంచి ద్విజ। పుంగవు లంతయు దానవేశ్వరు
ల్కని బహువిస్మయత్వమునఁ। గ్రాలఁ త్రివిక్రమమూర్తిఁ దాల్చి స
న్మునులకు సక్రమస్థితిని। మ్రొక్కఁ దిరిగులనెల్ల నాయెడన్ 238

సీ. చంపి సమస్తాద్రి। సహితయై వననిధి బహురత్నసందోహ। పరివృతాఢ్య
పత్తనరమ్యయౌ। వసుధ నొక్కపదంబుతో మీఱి దేవతా। తుష్టి నాత్మ
వలఁచి రెండవకాలి। వలన సోమార్కనక్షత్రమండితమైన। గగనతలము
నిర్జరావాసమై। నెగడు నాకపురంబు వడిఁ దాఁటి మూఁడవ। పదము పెట్టు

తే. భూమి లేనందువలనను। భూరిరోష
చిత్తుఁడై వామనుఁడు ధర్మ। శిఖరితుల్య

గాఢకాయంబు గల త్రివిక్రమసుమూర్తిఁ
దాల్చెవడి వానితల మహోద్ధతి చెలంగ. 239

వ. ఇట్లు త్రివిక్రముండునై హరి వానిపైఁబడ ముప్పదివేలయోజనంబుల నొక్క
పుడమి పాతాళమునకు నడఁగి యట దృఢంబుగనుండె నంత శ్రీధరుఁ డా
ధుంధుదైత్యునిఁబట్టి యెత్తి వడి నాగర్తమందుఁ బడవైచి సైకతవృష్టిఁ గురి
పించి దానివలన నామహాబిలంబు నిండఁజేసె నయ్యెడ. 240

క. హరిదయతో స్వర్గంబును, హరి వడసెను సకలదేవతాధీశ్వరులు
న్నిరుపద్రవగతివలనం, బరఁగి త్రివిష్టపమునందు భాసిలిరి మునీ!. 241

క. వరదుఁడు భగవంతుం డగు, పరమేశుఁడు ధుంధుదైత్యుఁ బట్టుసైకతసా
గరమందుఁ ద్రోసి యమునా, సరిదాకృతి నలరి దాఁగెఁ జంచద్దీప్తిన్. 242

చ. మును హరి యిట్లు ధుంధుదితిపుంగవుఁ గెల్వఁ త్రివిక్రమాకృతిం
దనరెనొ యట్టి ధర్మఫలదాయకమైనమహాశ్రమస్థలం
బునకును దానవాధిపుని పుత్త్రుఁడు మానసమందు భక్తి పెం
పును గనుచుండ బంధుజనపూగముతోడను గూడి వేడ్కనై 243

క. చని కాళిందీజలమున, మునిఁగి మహాశ్రద్ధతోడ మొనసియు నొకతే
యి నుపోష్యముండి వరవా, మనదేవునిఁ బూజచేసి మానిలలామా!. 244

ఆ. పరమలింగభేదపర్వతంబున కేగి, శాస్త్రవిధిగ నచట స్నాతుఁ డగుచు
శర్వునకును బూజ సలుపుచు నొకతేయి, నుపవసించి పిదప నుత్సవమున. 245

క. ఘనమగు కేదారమునకుఁ, జని యట సవిధిని మునింగి సర్వేశ్వరునిం
దినసప్తకంబునం దన, శనుఁడై పూజించి పొగడి శ్రద్ధ న్మరలన్. 246

తే. పుణ్యకుబ్జామ్రమునకును బోయి సవిధి
నట మునింగి జితేంద్రియుఁ డగుచు నశన
హీనుఁడై శౌరిఁ బూజించి పృథులభక్తి
బదరికాశ్రమమున కేగి భద్రబుద్ధి. 247

సీ. పుణ్యసరస్వతీపుష్కరంబున మున్గి వస్తుండి యధికమౌ భక్తితోడఁ
బొనరి నారాయణుఁ బూజించి వినుతించి సంతోషపరచియు శ్రద్ధతోడ
దివ్యమౌ వారాహతీర్థమందుండిన గరుడాసనంబును గాంచి పూజ
సల్పి విప్రోత్తమచయమునకును రత్నవిత్తాంబరాదులఁ బ్రీతి నొసఁగి
ఆ. వారిదీవనలను బడసి మోదంబున, వటలి పిదప దివ్యభద్రకర్ణ
మునకు నేగి శివునిఁ బూజించి వశియునై, చని విపాశనామచారునదికి 248

ఉ. ఆవిమలాపగాజలమునందు మునింగి ద్విజప్రియుండు నా
భావజవైరి నర్తతిని బాగుగఁ గొల్చి యుషావలీమహా

పావనభూమిఁ జేరి యట / భాసిలు లోకగురుండు దేవతా
దేవుఁడు భక్తపాలకుఁడు / దివ్యుఁడు నా హరిఁ గాంచి నారదా!. 249

ఉ. మున్ను గురూపియా భృగుఁడు / పుణ్యుఁడు శాశ్వతుఁ దక్షురుండు నా
పన్నశరణ్యుఁ డౌ హరిని / భక్తినిఁ గొల్చి సుదుర్లభస్థితిం
జెన్నలరారుచున్నసిరి / చిన్నికుమారుల దివ్యకాయముం
బన్నుగఁ జెందె నట్టిమురవైరినిఁ గొల్చె నతండు పూన్కిమై. 250

క. అన విని నారదుఁ డని యెటు, ఘనుఁ డైనపురూరవుండు / కమలాక్షునిఁ గొ
ల్చి నియతిమై వరరూపం, బును బుత్త్రులఁ బడసె చెపుమ / మునికులదీపా!.

ఆ. ఇట్లతండు నుడువ / హితమతితో బ్రహ్మ, తనయుఁ జూచి పాపతతులఁ బాపు
నట్టి దివ్యగాథ / నాదరమున భక్తి, చెలఁగ విను మటంచుఁ / జెప్పఁదొడఁగ

## సుధర్ముని చరితము.

సీ. తాపసాధీశ! త్రేతాయుగారంభంబునందు మున్ని కథ / యలరె మిగుల
విప్రసత్కృతి ధర / వెలసినట్టి మద్రదేశ మొక్కటి దీప్తి / దివురు దాని
యం దుత్తమస్థితి / నలరు శాకలమహాపుర మట్టిపట్టణమున విశేష
విపణిప్రవృత్తితో / వెల్గి సుధర్మాభిధేయుఁ డై నిత్యముఁ / దేజరిల్లి

తే. యఖిలశాస్త్రవిశారదుఁ / డగుచు భోగ
సహితుఁ డై గుణధనములఁ / జాల నొప్పు
నట్టివర్తకుఁ డేపారు / నాతఁ డొక్క
తఱిని నిజరాష్ట్రముననుండి / తమిని మించి. 253

శా. సౌరాష్ట్రాఖ్యను వెల్గుదేశమునకున్ / సంప్రీతిఁ బో నెంచి వి
స్తారానేకవిశేషవస్తువులతోఁ / దళ్కొత్తి సార్థుండు నై
ధీరత్వంబున నేగి నిర్జనముగా / దీపించుదేశంబులో
నారూఢేచ్ఛఁ జనంగ నావణిజు దివ్యానేకవస్త్రౌఘమున్ 254

క. రేయిని దొంగలు హైకొని, పోయిన గతసర్వవస్తుపుంజుఁడు నై యా
తోయంబున నతఁ డార్తిగ, బాయనివగ నెంపుఁ జెంకఁ / బరమమునీంద్రా!.

తే. మలసి మరుభూమియందు సున్మత్తుపగిది
నిస్సహాయుండు నై వగ / నెగడఁ దిరిగి
మేటి యై మంగళంబుల / మెఱయు జమ్మి
చెట్టుఁ దాఁ గాంచె నప్పుడు / చిత్త మలర. 255

క. కని మృగపక్షివిహీనతఁ, బొనరెడునాతరువు కడకుఁ / బోయి మహాతృ
ష్ణనిఁ జెందుచు తుత్తృష్ణలఁ, గనలుచుఁ దచ్ఛాయయందుఁ / గాసిని మౌనీ!.

తే. వేడివేలుపు నట్టింట / వెల్గువేళ, నిద్దురను జెంది విశ్రాంతి / నెగడి లేచి
యెండి ప్రేతశతంబుతో / వేడ్క నడరి, పాటితోఁ జాలఁ జెలువారి వచ్చువాఁడు.

క. నైరూప్యాయుధములతో, సారెకు విలసిల్లు మందు । సత్వరగతిఁ జె
న్నారెడు క్రాంత నిశాచర, వారంబులవలన మిగుల । వఱలుచు మఱియున్.

క. అటు లన్యప్రేతముతో, నట నీటున నుహ్యమానుఁ । డగుచుండిన దు
ర్ఘటధీరప్రేతాధిపుఁ, డటుకున నాతండు చూచెఁ । దాపసు! యంతన్. 260

క. అనుదుగ నాప్రేతాధీ, శ్వరుఁ డటఁ దిరుగుచును నట్టి । సాలము మొదటం
బరఁగువణిక్సుతుఁ గనుఁగొని, పరమానందంబు మిగుల । భాసిలుచుండన్ 261

ఆ. క్రొక్క స్వాగతంబు । పొల్పారు నొంపారు
ముక్కిలవార్తఁ జెప్పు । కొనుచు నట్టి
చెట్టునీడఁ బ్రీతి । చెలువొంది రంతఁ బ్రే
తాధిపుండు హర్ష । మాత్మ నొగడ. 262

సీ. వైశ్యాత్మజునితోడఁ । బలికె నోచెలికాఁడ! నీనివాసం బెందు । నెగడుచుండు
నందఱమృగహీన । మైనట్టి యీపెద్దవనమున కే వెట్లు । భయము లేక
చేరితివో నాకుఁ । జెప్పు నా నీకును మేలగు నని యిట్లు । మేటిదయను
బలుక నాప్రేతేశు । పరమభాషణముల విని వాఁడు సంతోష । వివశుఁ డగుచు

తే. నాత్మ కేశధనచ్యుతి । నంతఁ దెలుప, నాతఁ డారయుఁడఁ దత్కథ । నాలకించి
వానిదుఃఖంబు గాంచి తా । వగచి నైజ, బాంధవునిరీతిఁ బ్రలపించి । పలికె నిట్లు.

ఆ. ధనముఁ గోలుపోయి । తల్లడపాటులో, నలరుచున్న వాఁడ । వయ్య ఖేద
పడుటఁ దగదు ధైర్య । బలమున్న నర్థము, లోనరు నీకు మరల । సుగుణాఢ్య!

క. హాయకరిధనములు భాగ్య, ఉదయమునఁ జెడు మరల వచ్చుఁ । గళ్యాణమహో
దయమున నావిషయం బై, భయపడ రా దనుచు బుధులు । పల్కిరి ధాత్రిన్.

తే. అస్థిరంబగు మేనిపై । నలరునట్టి
చింత నర్థోదయము చెడు । చీలితలంబు
నందు నని యిట్టు లాడి భృ । త్యాళిఁ బిలిచి
సంతసముతోడఁ జెప్పంగ । సాగె మౌని! 266

క ఈతం డతిథి యఁ బూజ్యం, డాతతగుణశాలి సహజుఁ । డనఘుండుఁ గడుఁ
బ్రీతియుఁడు కేశజుఁడు వి, ఖ్యాతిని నాకనుచుఁ బలికి । క్రన్ననఁ బలికెన్ 267

వ. ప్రేతగణములారా! నేనీతనిఁ గనినంతమాత్రముననే స్వబంధువులఁ జూచి
నట్లయ్యె నింతియ కాదు వినుఁ డితఁడు నాకడఁ జేర నతులప్రీతి వెలసె నని
యిట్లాడుతఱి నాప్రేతనాయకుని చెంతకుఁ దధ్యోదనపూర్ణ మయినదియుఁ
గోరినకోర్కుల నిచ్చునదియుఁ గ్రొత్తదగు వృత్పాత్ర మొకటి వచ్చె; నట్ల
భవ్యోదకపూర్ణమయి నూతనమున రాణించు జలభాజన మొక్కటి తదగ్ర
భాగమున కేతెంచి నిలిచె నిట్లరుదెంచిన సలిలదధ్యన్నమృత్పాత్రముం జూచి
సంతసించి ప్రేతేశుఁడు మహాతులిత్యు వణిక్సూనునిఁ గని యంత. 268

క. అనఘా! లెమ్మిఁక మాధ్యాహ్నిక, మొనరింపు మటంచుఁ జెప్పి । యారుమతి సరేఁ డా
తనిఁ గూడి యాజలంబున, మునిఁగి కృతాహ్నికులు నైరి । ముద మొదవంగన్.

తే. అంతఁ బ్రేతేశ్వరుండు దధ్యన్నమును య
థేచ్ఛ నైగమసుతునకు । నింపుమీఱఁ
బెట్టి మిగిలిన కూడు సం। ప్రీతిఁ బ్రేత
సకలసందోహమున కిడ । శ్రద్ధ నపుడు. 270

క. అందఱు. దిని కడుపారను, చెందిక జలములను గ్రోలి । చెంగార మహా
నందంబున దివ్యాన్నం, బుం దగ నాతఁడు భుజించెఁ । బూన్కిగా మానీ! 271

క. ప్రేతాధీశుఁడు దిని బల్, చేతోమోదమున వెలయఁ । జిత్రముగా నా
పూతోదకదధిపాత్రము, లాతఱి నావైశ్యసుతుఁడు । నాలోకింపన్. 272

వ. అదృశ్యంబు లయ్యె నంత 273

క. మునివర! యాయద్భుతమును, గని వణిగాత్మజుఁడు మిగులఁ । గౌతూహలమా
త్మను దిందులాడఁ బ్రేతే, శునితో సిరిలిఁ బల్కె । సురుచిరభణితిన్ 274

సీ. సాధుసత్తమ! గహనజనమైనవనమందు నెట్లన్నసంభవ । మెసఁగెఁ బరమ
వారిసంపూర్ణమై । వఱలు పుష్కరపాత్ర మేరీతి నరుదెంచె । నీస్థలాంత
రంబునకును మఱి । రమణీయభవదీయవర్ణంబువలన నీబహుళభృత్యు
లపగతశాంతితో । నలరిరి నీవాఁగఁ దేజస్వి వగుచును । దివిరి కొంచె
ఆ. ముగను బుట్టి దేహమున నొప్పి ప్రేతాళి, పాలకుండ వగుచుఁ । బాండువర్ణ
వస్త్రమునఁ జెలంగువాఁడవు నైతివో, పలుకు మట్టిదాని । భావమలర. 275

క. అని సార్థవాహజుం డన, విని ప్రేతాధిపుఁ డాత్మ । వృత్తాంతము నా
తనికిని జెప్పఁ దొడంగెను, మనమున మోదంబు మిగుల । మల్లడిఁ గొనఁగన్.

క. విను నే బహుళాదేవిక, జనియించి ధరిత్రి సోమశర్మాఖ్యను జెం
దిన విప్రుఁడ నై శాకల, మనుపురిలో నుంటి మున్ను । హర్షము మిగులన్.

మ. ధనవంతుండును బ్రాతివేశ్యుఁడు యశోధన్యుండు సోమశ్రవుం
డను పేరం జెలువొందువాఁడు హరిభక్తాగ్రేసరుం డావణి
క్తనయుం డొక్కఁడు నాకు నెచ్చెలియు నై । తత్కృత్తి నేఁ గాంతతో
ధనముం దుగ్ గృపణుండ నై వెలసి మంత్రకప్రజ్ఞఁ జెల్వారుచున్ 278

వ నిజమందిరమందు వసించి యుండి. 279

క. నిరతము కూడు భుజింపక, ధరణీసురేశులకు నిడక । దధిమిశ్రితమౌ
పరమాజ్యభక్ష్యాన్నముఁ, బరపాటునఁ దింటి నేను । బూర్ణప్రీతిన్. 280

సీ. అనఘ! యారాత్రియం । దలిఘోరనాడీత్రయావాలి నెనాగి । నలర వేఁగు
బాముసఁ బటుమృత్యుసన్నిభంబగు విషూచివ్యాధి బాధనొందు । తేవ నొక్క

బరిదుగుం డైన నా। రక్షకుఁ జేరందరయ్యె బహుళప్రయాససం। భరితవృత్తి
నాచేతఁ బ్రాణముల్। నలిధారితములయ్యెఁ దెలియదెట్లొకొ యిట్లు। లివిర బ్రతికి

ఆ. నట్టివాఁడ నగుచు। నట నిర్ఘృణస్థితి, నొప్పి పాపినగుచు। నుండి నూఁగు
లిండిఁ బుల్లనీళ్లఁ। జేలాలుఁ దవుదును, గుల్సితాన్నములను। గూరఁ బ్రతి.

వ. కుడుచుచుఁ బెద్దకాలం బటనుండ నంత. 282

క. శ్రవణద్వాదశితోడఁగ, బ్రవిమలమై వెలయుభాద్ర। పదమాసమునం
దవహితమతులై నాగర, నివహంబులు గుంపుగూడి। నిశ్చలభక్తిన్. 283

సీ. సొరిది నిరావలి। శోభనసంగమతలమున కరిగె నుద్దామలీల
నంత నాచెలికాని। దా ప్రసంగంబుతో నాభూమి నేఁ జేరి। యమ్మహాన
దీజలంబునఁ గ్రుంకి। దివ్యకాయంబున నదరి యేకాదశి। యందు నియత
మైనవ్రతంబుతో। హవణించి తత్పుణ్యవారిపూర్ణంబు నై। వఱలి ఛత్ర

తే. పాదరక్షమ్ము లేపారి। పటువుతోడ, నదరి దధ్యన్నకలిత మై। నట్టి మృత్పా
త్రానికనుజాలికర్మసం। ధానుఁ డైన, విప్రవరునకు నిచ్చితి। విమలచరిత!. 284

వ. ఈదానముతప్ప నే నొకానొకతఱినైన నెవరికి నేమియు నిడక దెబ్బదివత్సరంబు
లిట్లు మని చచ్చి ప్రేతనై యుండి నీకిపు డీయన్నముఁ బెట్టితి మద్దత్తోదనమున
జీవించు నీప్రేతలు మున్నెవరికి నెద్దియు నిచ్చినవారు కారు నీకిక్కారణంబుఁ
జెప్పితి. నాచే మున్నిద్దిరత్తరయ్యె నట్టిజలాన్నవస్తు ప్రశస్తమృత్పాత్రములు
నిత్యము మధ్యాహ్నకాలమునకు నాకడఁ జేరుచున్నవని పల్కి మరల
నిట్లనియె. 285

క. అనయం బాపాత్రము లేఁ, దినుదాఁక నశింపకుండి। లిని గురుతుష్టిం
దనర నద్భుతస్థితితోఁ, జనుచుండును వింతగాను। సరసగుణాఢ్యా! 286

క. విను మారితపత్రదానం, బున నిట నీజమ్మిచెట్టు। పుట్టెను గడునీ
డ నిటం జెప్పుల నిడినం, దునఁ బ్రేతావాహనంబు। తోడ్తో వెలసెన్. 287

క. కీనాశబుద్ధితోడను, దూనుగ వర్తించినట్టి। మచ్చరితంబుగ్
మానితగతి నంతయు నీ, కే నిపు డాడితిని సత్య। మేర్పడ మిత్రా! 288

క. శ్రవణద్వాదశి మిక్కిలి, భవహర మగుచుండుఁ బుణ్య। వర్ధనకర మా
భువిఁ గలనరులకు నని యతఁ, డవిరళమతి వైశ్యపుత్త్రుఁ। డాదృతిఁ బలుకన్.

క. అనఘా! నాచే నేపని, యొనరింపం దగిన దగునొ। యురుమతి దాని
ఘనముగుదయ నానతి యిమ్మని వినయము తోఁపఁ బలికె। నమృతోక్తులతోన్.

ఆ. అంతఁ బ్రేతనాథుఁ। డాతనిమాటల, నాలకించి పలికె। నతనితో ని
జార్థసిద్ధికరము। నైనట్టివాక్యము, గూర్మి డెందమందుఁ। గొమరుమిగుల.

క. జనకా! నాకిపుడు శుభం, బును జేసెడిదైనవాక్య। మును జెప్పెద దా

నిని చేయఁదగును దయతో, నని చెప్పం దొడఁగ శ్రద్ధ యలరుచునుండన్.

క. అమలగయాతీర్థమునకు, సుమహితమతి నేగి మునిఁగి శుద్ధిని మన్నా
మముఁలను గూరిచి ప్రేతల్యము, సమరఁగ బిండముల నిడుము సజ్జనతిలకా!

సీ. అటఁ బిండములఁ బెట్టినట్టి నేను ప్రేతాభావసరణితో నలరి ముక్తిఁ
బొంది పైతృకలోకమునకేగదను భాద్రపదమాసగతసిత పక్షమందుఁ
దనరారునట్టి యుదశ్రవణాన్విత మైనట్టి ద్వాదశి యధికభద్ర
కరముని యటు పల్కఁ గౌతూహలంబాత్మయందు మిక్కిలి చిందులాడుచుండ

ఆ. నాలకించి శుచియు నగువణిక్పుత్రుండు, నట్లొనర్పు టుచిత మని వచించి
విపులకాంతి నంతఁ బ్రేతేశ్వరస్కంధ, భాగమందుఁ జేరి పాలికులుక. 294

క. మరుభూమి విడిచి గురుసుం, దరబంధురశూరసేనతలదేశము భా
సురగతిఁ జేరినవాఁడై, కరమట వసియించి భూరికౌతుక మలరన్. 295

క. తనకర్మధర్మయోగం, బున బహుమణిదివ్యధనముఁ బొంది పొగడ్తఁ
దనరారుచున్న గయకుం, జని యాతీర్థంబునందు స్నాతుం డగుచున్. 296

క. ప్రేతానుపూర్వకంబుగ, నాతతి బిండములఁ బెట్టి యంతట శ్రద్ధో
పేతమతి నాత్మపితృసం, ఘాతములకు సర్వబంధుగణముల కెలమిన్. 297

వ. పిండనిర్వాపణం బొనర్చి తిలరహితముగఁ దనకుఁ బిండముఁ బెట్టుకొని పిదప నాత్మేతరులైన నిజజ్ఞాతులకు నటులొనర్చె; నిట్లతండు పంచపిండముల సుభావమున నెలవేర్చిన నందఱు విముక్తపాపులై బ్రహ్మలోకమున కరిగిరి. వణిక్సూనుండు మరలి నిజాలయంబున కేతెంచి శ్రవణద్వాదశిఁ జేయుచుఁ గాలగతి నొంది గంధర్వలోకమందు సుందరదుర్లభభోగసందోహములఁ బెక్కుకాలముదాఁక మహానందకందళితహృదయారవిందుఁడై యనుభవించి యనంతరంబు. 298

క. మనుజత్వముఁ బొంది మహా, జనపతియై యాత్మధర్మసత్కర్మములం
దనరుచు శ్రవణద్వాదశి, ఘనభక్తిం జేసి కాలగతిఁ జెందె మునీ!. 299

క. భాసురతరమగుగుహ్యా, వాసంబును జేరి భోగవారంబు మనో
ల్లాసమున ననుభవించుచు, వాసినిఁ గని మరల ధాత్రిఁ బ్రకటితకీర్తిన్. 300

క. జననాథపుత్త్రుఁ డగుచుఁ, జనియించి నృపాలవృత్తిసహితుండు యశో
ధనదానభోగపరుఁడై, మన మలర నటించె నతఁడు మానిలలామా!. 301

ఆ. ఇట్లతండు సత్యహితవృత్తి నిత్యము, నలరుచుండి గోగ్రహంబునందు
సాహసమున వైరిసముదాయమును గూల్చి, కాలగతిని బొందెఁ గన్య యెన్న.

ఉ. నాకపదంబుఁ జేరి సురనాథముఖామరపూజనీయుఁడై
వీఁకఁ జెలంగుచు న్స్వగతవిస్తృతపుణ్యముతోడ భ్రష్టుఁడై

శాకలరాజధాని ద్విజసత్తముఁడై ప్రభవించి వైకృతిం
గైకొనునట్టిరూపమునఁ గ్రాలుచు శాస్త్రవిశారదుండు నై. 303

క. అనుపమరూపస్థితితోఁ, దనరారెడి విప్రసుతను దలఁతోషముతో
దను బెండ్లాడను నాసతి, తనవిభుని సుశీలుఁగాను దలఁచెను బిదపన్. 304

క. విను వైకృతరూపునిఁగాఁ, దనమదిఁ దలపోసి విసిఁగి ధరణిసురుం డా
వనితామణిరూపంబును, గని దుఃఖముతోడ మిగులఁ గ్రాలె మునీశా! 305

సీ. క్రన్నన వీరకోకంబున విలసితరావతీతటమందు రమణఁ గుల్కు
శిష్టాశ్రమస్థలిఁ జేరి సుందరరూపమును గోరి నక్షత్రపురుషసహితుఁ
డైనట్టిపరమేశు నతిభక్తి నర్చించి యాజన్మమందె శోభాభిరాము
తనువుతో భాసిల్లి తమి వచ్చి సతిఁ గూడి కూర్మి భోగంబులఁ గోటిఁ జెంది

ఆ. వశియు నగుచుఁ బుడమి వాసిఁ బూర్వాభ్యాస
సరణివలన నతఁడు శ్రవణసహిత
మై విశేషపుణ్యమాద్వాదశీవ్రత
భక్తియందు మిగులఁ బ్రబలుచుండె. 306

చ. మునివర! యిట్లు పూర్వమున భూసురసత్తముఁడై జనించి క్ర
న్నన వికృతస్వరూపమున నాఁడొగి వెన్నుని డా ననుగ్రహం
బున వలరాజురూపమును బొంది పురూరవుఁడై జనించెనీ
మనుజగణేశుఁ డన్న విని మానుగ నారదుఁ డంతఁ బ్రీతితోన్. 307

మ. అని విప్రోత్తము మున్పురూరవుఁడు దీవ్యత్తారకాఖ్యం బెటుల్
వనమాలిం దగఁ గొల్చె దానిఁ గరుణన్ వ్యాఖ్యింప నౌ నన్న నా
ఘనుఁ డాడెన్వ్యాసు మేను జెప్పెదను నక్షత్రప్రశస్తవ్రతం
బును వైకుంఠునితారకాంగముల సమ్మోదంబుతో నియ్యెడన్. 308

నక్షత్రపురుషవ్రతవిధి.

సీ. హరికిఁ బాదంబు లౌనసురనక్షత్రంబు జంఘ లౌ రోహిణి చక్రి కొప్పు
దశ్వినీనక్షత్ర మగుఁ గబంధంబస్థి యాషాఢ మలరు గుహ్యంబు ఫల్గు
నీద్వయం బతిదీప్తి నగడుఁ గటిస్థంబు లగుచుండుఁ గృత్తికల్ హరువుతోడ
ననురాధ తోదలందు నలరు ధనిష్ఠ పృష్ఠంబున నుండు విశాఖ భుజము

ఆ. లందు వెలయుచుండు హస్త యుత్తమకర
ద్వంద్వమందు దీప్తిఁ దనరుఁ గ్రింది
చీలమండజంటఁ జెలఁగుఁ బునర్వసు
తార మాధవునకుఁ దాపసేంద్ర! 309

క. ఉరగర్క్షము నఖతలమునఁ, బరఁగును గుత్తుకను జ్యేష్ఠ భాసిలుఁ జెవులన్
వఱలును శ్రవణము పుష్యమి, కరమోష్ఠమునందుఁ గాంతిఁ గ్రాలుచునుండున్.

వ. మునీంద్రా! దంతంబులయందు స్వాతియుఁ, జెక్కిళ్లఁ బునర్వసు తారయు, నాసికమందు మైత్రంబును, గన్నవయందు రోహిణియుఁ, దలవెండ్రుకల నార్ద్రంబు రాజిల్లు, నిది చక్రికిఁ దారకాంగ మగుచుండు. నావిధానమును యథాన్యాయముగఁ జెప్పెద వినుము ధీమంతుఁ డైనకేశవుఁడు పూజితుం డయి భక్తులకుఁ గోర్కె నొసంగును. చైత్రశుద్ధాష్టమియం దెపుడు చంద్రుఁడు మూలర్క్షగతుఁ డగునా యత్కాలమందు సవిధినిఁ బుండరీకనయను చరణంబుల నర్చించు టొప్పుఁ, బిదప నక్షత్రపురుషప్రీత్యర్థమై విప్రులకు భోజనం బిడనగు. రోహిణీయోగంబున జానుయుగంబుఁ బూజించి హవిష్యాన్నదోహదంబు నర్పించి బ్రాహ్మణుల కన్నప్రదానంబుఁ జేయనగును. ఆషాఢద్వయంబున విజ్ఞుఁడు స్ఫిగ్రూపమును బూజించి శీతజలంబు దోహదంబుగ నర్పింపనగు 311

సీ. తాపస! ఫల్గునీద్వయమందు గుహ్యంబుఁ బూజించి గోక్షీరములను భక్తి
హరికి నర్పించి విప్రాళికి భోజనము వెట్టనగు గతభోజనులును
విజితేంద్రియులునైనవిద్వాంసులొగిఁ గృత్తికలయందు శ్రద్ధతోఁ గటితలంబుఁ
బూజించి తావితోఁ గొల్పారుకుసుమజలంబు నర్పింప నా లలితముగను

తే. భాద్రపదయుగ్మమునను బార్శ్వముల సవిధ
నదరి పూజించి శాలేయ మాగుడాత్త
దోహదము దానవారికిఁ దుష్టిఁ గొలుచు
నిచ్చు టొప్పును భక్తితో నిద్ధచరిత్ర. 312

క. రేవతిఁ గుల్ఫద్వయమును, బావిరిఁ బూజించి ముద్గవరమోదకసం
భావిత దోహదమును గురు, భావంబున నిడఁగవలయుఁ బరమమునీంద్రా!

క. అనురాధయందు జొమ్మును, ఘనతను బూజించి షష్టికంబగుకూడున్
వనమాలికి దోహదముగ, నొనరింపం దగును బూన్కి యొనరుచునుండన్.

క. మునివర! యట్ల ధనిష్ఠనుఁ, బనిగొని పూజించి శాలిభక్తంబున నుం
డిన దోహదమును నిర్మల, మనమున నర్పింపనగును మానాథునకున్. 315

ఆ. అమలమతి విశాఖయందు భుజంబులఁ, బూజసేసి దివ్యభోజనంబు
దోహదమున హరికిఁ దోడ్తోడ నర్పింపఁ, దగును మేటిభక్తి నగడుచుండ.

క. కరతారగఁ గరయుగ్మముఁ, గరమర్థి యజించి యావకము దోహదమం
దురుతరమతితో నిడఁదగు, సురసేవితుఁ డైనహరికి సుభగచరిత్రా! 317

ఆ. అదితితారయందు నంగుళీయుగ్మంబుఁ, బూజచేసి శ్రద్ధ నొనయ దోహ
దమున బొట్లనుంచఁదగు హరినఖముల, సర్పతారఁ బూజ సలిపి పూన్కి.

సీ. కుటిదాఁ జిత్త్రరాతమును దోహదమందు నర్పించి జ్యేష్ఠయం దధికభక్తిఁ
గంఠంబు నర్పించి కాంతుతోఁ దిలమోదకంబు నిడందగుఁ గడిమి శ్రవణ

యందుఁ గర్ణంబుల । నలిదీశుఁ బూజించి దధ్యన్నమును దో । హదంబునందుఁ
జెట్టఁ గాఁ బుద్యమిఁ । బ్రీతిముఖంబును నర్చించి ఘృతయుక్త । మైనపాయ
తే. సంబు నర్పింపవలయును । స్వాతియందుఁ
బంక్తిఁ బూజించి తిలలతోఁ । బరఁగు పేటి
చక్కిలంబుల దివ్యభో । జనము నొసఁగ
వలయు హరితుష్టికై విప్ర । వరున కెలమి 319

వ. శతభిషయందు గండస్థలంబులఁ బూజించి మధువారమగు ప్రియంగుభోజనం బిడనగు. మఖయందు నాసికంబు నర్చించి మధురాజ్యంబు సమర్పింపఁదగు. మృగశిరఁ గన్నవను యజించి మృగమాంసము నివేదింపవలయుఁ. చిత్తయందు లలాటమును బూజించి మనోహరభోజన మర్పణచేయు టొప్పు భరణీనక్షత్రమందు హరిశీర్షంబును బూజించి దివ్యభక్ష్యంబుల నియ్యఁదగు, నార్ద్రఁ దల వెంట్రుకల నర్చించి గుడార్ద్రకాన్నంబు సమర్పించనగును ఇట్లినక్షత్రయోగములలో లోకేశుఁ డగునారాయణుఁ బూజించి వేదవేదాంగపారగు లగు విప్రులకు వస్త్రంబులు, గొడుగులుఁ, బాదరక్షలు, ఘృతపాత్రములుఁ, శాలిచ్చు మొదవులు, దక్షిణలు, దానము సేయనగును. ప్రతితారాయోగమందుఁ బుడమివేల్పులు పూజనీయు లయి యుందురు నక్షత్రజ్ఞఁడైన బ్రాహ్మణునకుఁ బ్రత్యేకముగ దక్షిణల నిడనగు నక్షత్రపురుషాఖ్య నలరారునదియును, సకల కలుషహర మగునట్టి యిట్టివ్రతోత్తమంబు ముని భృగువుచేత నాచరింపఁ బడెఁ; బూజ్యములగు వెన్నుని సర్వాంగోపాంగములఁ బూజించువారికి సురూపము లగు ప్రత్యేకాంగోపాంగము లాతని కృపవలనఁ బొడము నని చెప్పి వెండియు నిట్లనిరి. 320

చ. ఘనకలిసంగమస్థితినిఁ । గ్రాలెడి పాపము సప్తజన్మసం
జనితమహాఘము న్దనక । జంబగు కిల్బిషము న్మహోద్ధతిం
దనరిన మాల్యపంకమును । దారుణభూరిసమస్తకల్మషం
బును వెసఁ బాపు నీవ్రతము । పొందుగ నందఱకు న్మునీశ్వరా! 321

తే. తారకాంగుండు నైనట్టి । దానవారి, పూజితుండై మహోన్నత । పుణ్యములను
రమ్యరూపంబు వాఙ్మధు । రత్వసర్వ, కామకాంతుల నిచ్చును । గౌతుకమున.

క. పరవి నరుంధతి మున్నే, వరతారాయోగమందుఁ । బస్తుండి రమే
శ్వరుఁ బూజించి జగంబులఁ, గరమగ్ర్యఖ్యాతిఁ గాంచె । గన్యలు మెచ్చన్.

తే. అదితి నక్షత్రరూపుతో । నలరునట్టి
వాసుదేవుని రైవత । పర్వతమునఁ
బుణ్యపుత్రార్థ మై భక్తిఁ । బూజచేసి
వామనస్వామిఁ దనయుఁగాఁ । బడసె దీప్తి. 324

క. మును రంభ దివ్యరూపం, బును గాంచెఁ దిలోత్తమాఖ్యఁ । బొల్పారెడి యా
వనితయు నాత్మధురత్వము, ఘనుతెన్నఁగఁ గాంచె దీనఁ । గణ్యచరిత్రా! 825
ఆ. చందమామమాడ్కి । సత్కీర్తినిం బురూ, రవ్వఁడు భవ్యమైన । రమ్యకాంతి
రాజ్యములను బడసి । రాజరాజయ్యె సీ, వ్రతముఁ జేసినందు । వలన ధాత్రి.
క. అనఘా! యిట్టివిధానం, బునఁ దారాంగుండు నైన । పురుషోత్తము నే
జనుఁ డర్చించునొ వాఁడా, త్మను గలకోరికలనెల్లఁ । దద్దయుఁ బడయున్.
క. వినయము నారోగ్యముఁ గీ, ర్తిని శుభమును బావనత్వ । కీలిని బుణ్యం
బును నిచ్చెడునీవ్రతవిధి, వినిలివి కడ తీర్థయాత్ర । విను భాషింతున్. 828

## ప్రహ్లాదతీర్థయాత్రాక్రమము.

సీ. గాఢపుణ్యాయు మునికన్యయు నగునిరావతిఁ జేరి ప్రహ్లాద । పరమభాగ
వతుఁ డట స్నాతుఁ డై । భవ్యచైత్రాష్టమిఁ బావనం బైనయా । వ్రతము మేటి
భక్తిఁ గావించిన । వాఁడు నై నక్షత్రపురుషుఁ డౌశౌరినిఁ । బూజచేసి
పుణ్యకురుక్షేత్ర । మున కేగి యేరావతాఖ్య మంత్రంబుతో । నట సుకర్మ
ఆ. నాభిధేయమునను । హరువాండుచక్రతీ, ర్థమును మంతిరించి । దార్ఢ్యబుద్ధి
వేదకథితమైన । విధిఁ గ్రుంకి యొకరేయి, నుపవసించి యాతఁ । డుర్వరమున.
క. వినుతంబగు గోకర్ణం, బనకును జని తూర్పుదెసను । బొల్పారుచు నుం
డినదా తీర్థమునందు, న్మునిఁగి మహాపూజ్యుఁ డైన । పురహరుఁ బ్రీతిన్. 830
క. పూజించి దాని కవ్వల, రాజిలు కామేశతీర్థ । రాజముఁ గానం
గాఁ జని యట మున్గి మహా, తేజుం దగుహరునిఁ గొల్చి । దృఢభక్తిమెయిన్.
ఆ. భూరివారియందుఁ । బొదలెడిపుండరీ, కాఖ్యశివునిఁ జూడ । నరిగి యట్టి
జలమునందుఁ గ్రుంకి । సద్భక్తిఁ జెలరుఁ, గనిపి పుండరీకుఁ । దగ భజించి.
వ. మూఁడుదినంబు లాస్థలంబున నుపవసించి పిదప విశాఖయూపమున నిత్యుఁ డై యుండిన శంభుని దర్శించి యాకృష్ణతీర్థమందు మునిఁగి త్రిరాత్రము లవనిపై శయనించుచు నామహాదేవునిఁ గొల్చి పిదప హంసపదస్థుం డగుహంసేశునిఁ బూజించి పయోష్ణి నలరుశౌరిఁ గనుఁగొని యాజలంబులఁ గ్రుంకి జగత్పతి యగు నట్టి యఖండమాధవు నర్చించి వెండి విరక్తయందు రాజిల్లు కుమారిలతీర్థమున కరిగి యావారిఁ గ్రుంకి వాలఖిల్యాదిమునీశ్వరార్చితుఁడును బదివేలపాపముల హరించువాఁడగు చంద్రశేఖరునిఁ బూజించి నుతించి యంతట. 833
ఆ. కామధేను వెదటఁ । గపిలాఖ్యపుత్రిని, గనినా సర్వలోక । గణ్యమాని
పతిహితార్థముగను । బరమకృపాబుద్ధి, నట్టివేల్పుమడుఁగు । నందుఁ బూన్కి.
చ. మునిఁగి విధిప్రకారముగ । భూరిగణేశుఁ డు నైనశంభునిన్
ఘనమతిఁ బూజచేసి మునిగణ్యము నా మణిమంతతీర్థమున్

గనఁ జని యామునోజ్జ్వలతర । కాండములం గృతమజ్జనుండు నై
తనపితృదేవసంఘములఁ । దద్దయుఁ దృప్తులఁ జేసి యక్కడన్. 334

ఆ. శౌనకవరుని విధిని । బుండరీకాక్షుని
గాంచి కేలుమోడ్చి । గాఢభక్తి
సంస్తుతించి యచట । సప్తరాత్రము లుండి
పిదప వేడ్క మదినిఁ । బెంపు నొంద 335

క. వరమధునందినికిని జని, గర మట స్నాతుండు నగుచు । ఘనబాహుండు శ్రీ
ధరుఁ డగుగోవిందునిఁ గని, గురుమతిఁ బూజించి పొగడె । గుణరత్ననిధీ! 336

చ అని యిటు లామునిప్రవరుఁ । డాడిన నారదుఁ డంతఁ బల్కె నో
మునివర! యేల చక్రమును । మున్ను హరుండు ధరించె నేలకో
మనసిజవైరి శూలమును । మాధవుఁ డావ్హారి పట్టె దాని నా
కును దయఁ జెప్పుమన్న విని । కూరిమి నామునిపల్కె నిట్లొగిన్ 337

— జలోద్భవాసురునికథ. —

సీ. విను మేను భూమిపై । వెలసెద నని హరి యమరులతో నాడి । నట్టి యాపు
రాతనగాథను । రహి నాదెదను; జలోద్భవనాముఁ డైనట్టి । దనుజనాథుఁ
డబ్జాసనునిఁ గూర్చి । యతిఘోరతపమును గావించి మెప్పించి । కడిమి నతని
వలన సంగరమందు । స్వసురాసురాస్త్రాళి బహుళవిరించిశా । పములతోడఁ

తే జావులేనట్టి వరములఁ । జాలఁ దాను, బొంది గర్వించి మునిదేవ । భూపమనుజ
వర్గముల బాధ పెట్టుచు । భయదరూప, శాలి యై ముజ్జగంబుల । సంచరించె.

వ. ఇట్లాదుష్టదైత్యుఁడు విచ్చలవిడి గరువంబున ముచ్చటలరఁ దిరుగుచుండి. 339

క మునివర్యులు సజ్జనులును, జననాథులు చేయునట్టి । జన్నంబులఁ ద
క్కినపుణ్యకార్యముల నా, శనముఁ గావించుచుండెఁ । జంచచ్ఛక్తిన్. 340

వ. తత్కాలమందు 341

చ. సురలు విషణ్ణులై భువిని । సోలి శరణ్యుఁడు రాయఁ డైనశ్రీ
హరికడఁ జేరి వేఁడ నతఁ । డాయమరాళినిఁ గూడి పార్వతీ
శ్వరయుతమౌ హిమాద్రికిని । సత్వరబుద్ధిని బోయి జాహ్నవీ
ధరుఁ డగుశంభునిన్ గలిసి । తద్దయు నూహ యొనర్చె నాయుడన్ 342

చ సొరిది జలోద్భవాసురుని । క్షోణినిఁ గూల్చ మునీంద్రదేవతా
వరులకు మేలు చేయఁ దమ । భావములన్ దలపోసి యాసురే
శ్వరులు వినిర్గతాస్త్రు లయి । శౌర్య మవార్యము నై చెలంగ దు
ర్ధరమగునట్టి కృత్యమును । వావిరిఁ జేయుచుఁ బోయి రుద్ధతిన్. 343

ఉ. నారద! యింత నాదనుజ।నాథుఁడు తాఁ సమయింపవచ్చునై
త్యారి పురారులం గని మహాపటుశాత్రవకోటిచేత నీ
పీరు లకేయు కాదురని । విహ్వలభావముతోఁ దలంచి వి
స్తారనటీజలంబున నోస న్నడి దాఁగెను దర్పహీనుఁడై. 344

ఆ. వాటిమత్స్యరాశి।పరిపూర్ణమానసరి, ద్విరతవారియందు । వెలయుచుండు
నట్టివాఁడు నిర్ద।రారియు నగుబలో, ద్భవుని కెలసి శౌరి।భర్గు లంత. 345

సీ. ప్రచ్ఛన్నమూర్తుల । భాసిల్లి గట్టుపైఁ దిరుగుచుండిరి వానిఁ । దెలియకాలఁ
దారిలి వఱలుచు । నరిగి స్వర్గముఁ జూచి భయకంపితాత్ముఁడై । బహుళవేగ
మున దుర్గమస్థలిఁ । బోనరెడి వలిమల కరిగె నంతట హరి।హరులు వాని
నటఁ గనలేక హిమాద్రిశృంగముపైన నివ్వాటపాటున । నెగడి తిరుగు

ఆ. వానిఁ గానెఱింగి । వడిఁ ద్రిశూలము హరి
పురహరుండు చక్ర।మును ధరించి
శస్త్రపాణు లగుచు । సరవి నాదైత్యేంద్రు
పయిఁకి నుతికి బాహా।బలము మెఱయ. 346

క. సురసత్తము లగుహరిశం, కరు లాదైత్యేంద్రుఁ గాంచి । కదనంబున భీ
కరచక్రశూలములదు, ర్భరగతిఁ దూటాడి రపుడు । పౌరుషమొప్పన్ 347

చ. హరిహర శస్త్రభిన్నతనుఁ । డై యతఁ డంబరవిచ్యుతంబు లై
ధరఁ బడునట్టి వా మనుజ।తారలమాడ్కి హిమాద్రినుండి వే
వరకనకాభుఁడై ధరణి । వ్రాలెను శత్రునిఁ జంప నెంచి యా
సరతిఁ ద్రిశూలముఁ గ హరియుఁ । జక్రము శంభుఁడు తాల్చె నత్తతిన్ 348

ఉ. శూలభవాభిఘాతమున । సోలుచు వాఁడు హిమాద్రినుండి బ
ల్దూలుచు ధాత్రిమీఁదఁ బడి । తోయము వాసి నిజాత్మసీమలో
మాలలనామనోహరుని । మారవిరోధి నెఱింగి వారి నా
కాలమునందుఁ జెందె రుచి । గాఢము నై దిశలందుఁ బర్వఁగన్. 349

క. వనమాలి శంభుపోషిత, మునసుండిన నాసుతీర్థ।మునకును భక్తిం
జని ప్రహ్లాదుం డాజలమున మునిఁగి యుపోష్యముండి । మొనసెడితీటున్.

ఉ. మారమణాద్రిశేశ! వర । మార్గము నై గిరిపార్థివంబు నై
పారలతాప్రసూనఫల । పాలమహోన్నతసానుయుక్త మై
భూరి మణీంద్రజాలములఁ । బొల్పెనలారు హిమాద్రిఁ జేరి చె
న్నారెడి దానిధానమున । నాగిరి నర్చన చేసి యంతటన్. 351

వ. పెక్కుధనంబులఁ జెక్కండ్రు విప్రులకు సక్కజంబుగు భక్తి నిచ్చి పిదప
నెక్కడ మున్ను మక్కంటి దేవవరప్రదుండగు శౌరి శత్రునాశకర

మైనదియు నాయుధోత్తమంబగు చక్రమును నిచ్చెనో యట్టి హిమవన్నగస్థ
భృగుతుంగశిఖరాజమున కాదైత్యపుంగవుఁ డరిగె నని పులస్త్యుఁ డాద విని
కలహాశనుం డతని కిట్లనియె. 352

చ. అనఘ! మహాయుధంబు జగ । దర్చిత మైనసుదర్శనంబు దు
ర్జనహరుఁ డైనశంకరుఁడు । శార్ఙ్గికి నేల యొసంగె నావిధం
బును దయిఁ జెప్పుమన్న విని । పొంగి పులస్త్యమహామునీంద్రుఁ డా
వనజజసూనుతో మధుర । వాక్యముల నిట్లని పల్కె నారయుడన్. 353

ఉపమన్యుని కథ

సీ. పరమమునీశ్వర! । పార్వతీశ! మహాత్వవృద్ధికరంబు నై । పృథ్వి నలరి
దర్శితచక్రప్ర । దాననిబద్ధమై తనరారు నీపురా । తనచరిత్ర
చెప్పెద నాలింపు । చిత్తనిరూఢితో బ్రాహ్మణశ్రేష్ఠుండు । పరమభోగ
పరివృతుఁడును వేద । పారగుఁడును గృహస్థాశ్రమరతుఁడు కు । శాగ్రబుద్ధి
ఆ. శాలియును సమస్త । శాస్త్రవేదియు శాంత
కలితసర్వసుగుణ । కాంతుఁడు నగు
వీతమన్యుఁ డనెడు । పేరుతో రాణిల్లు
పురుషసత్తముండు । భువిని గలఁడు. 354

ఆ. అత్రిపుత్రి యధిక । హర్షమహాభాగ, శిష్టశీల ధర్మ । శీలనామ
భర్తృజీవరూప । పరమపతివ్రత, యైన పొలఁతి వాని । కలదు సతిగ. 355

క. సుతవాంఛ నలరి యాతఁడు, ఋతుకాలమునందు జీవి । తేశ్వరితోడా
రతి సల్పఁ గలిగె వారికి, సుతుఁ డుపమన్యుండు భూరి । సుగుణాకరుఁ డై. 356

సీ. శ్రీమంతుఁడును మహా । శిష్టుఁడౌ నాతనితల్లి దరిద్రతఁ । దల్లడిల్లి
చనుఁబాలు లేని దై । శాలిపిష్టరసంబు స్తన్యమిద్దియటంచు । సంతతంబుఁ
బాలించుచుండె నా । పాల శార్దూలుండు బాలయందుండిన । స్వాదు నెఱుఁగు
వాఁడును గాకుండి । పాలని తద్రసమును దలంచుచునుండి । జనకుఁ గూడి
ఆ. భూమిసురునిగేహ । మున నొక్కతఱిఁ బ్రాణి
గణములకును దుష్టి । కరమునైన
పాయసంబుఁ గుడిచి । పాల నుండినమంచి
తీఁపు నెల్లఁ దాను । దెలిసి యుండె.
తే. జనని మఱునాఁ డొసంగిన । శాలిపిష్టరసముఁ బానము సేయక । విసికి విసికి
పయసుఁ గ్రోలఁగఁ జాలక । పడి మూర్ఛఁ, బాల్యమునఁ గుయ్యిడో । వడినలేండు.
ఆ. అంతఁ దల్లి యేడ్చు । నట్టి నిజాత్మజుఁ
గాంచి దుఃఖయుతము । గద్గదంబు

ఆ. భర్గుఁ డంత మెచ్చి ప్రత్యక్షవీర్యయు
క్తము సుదర్శనంబుఁ గమ్రపదము
నైనచక్రమును సహర్షుఁడై భూతేశుఁ
డచ్యుతుని కొసంగి యనెను వెండి. 369

వ. గరుడధ్వజా! విను సుదర్శనం బనునట్టి యీచక్రంబు కాలచక్రతుల్యంబు. భవ్యాయుధంబు సర్వశస్త్రాస్త్రహరణంబుఁ బదిరెండుబండికన్నులు కలదియు నై రాణిల్లి వేగమందుఁ బతీవలెఁ జనుచుండు. దీనికిఁ గ్రిందుగ నాభులు, మీఁది వైపున నాభుఁగాఁ గలిసి మెలసి నెలలును, రాసులు నుండు శిష్టరక్షణము కొఱకు ఋతువులాఱును. సూర్యచంద్రాగ్నివరుణ శక్రానిల విశ్వేదేవ వైద్యధన్వంతరి తపోధన తపంబులు దీనియందుఁ బ్రతిష్ఠింపబడి యుండు నట్టి యీచక్రాయుధంబు నీకిచ్చితిఁ గానఁ గైకొని దేవతలకుఁ బగవాఁడగు శ్రీదామనామదైత్యుని నిశ్చయముగఁ జంపుము. సురపూజితమై యిదియుఁ దపోబలంబువలన మంత్రగతంబై నాచే ధరింపఁబడినదయ్యె నీపరమాయుధంబు మిగుల నమోఘమైనదని భవుఁడు భాషించిన విని విస్మయాకులమానమానసుఁడై గోవిందుఁడు పరమేశుండగు శంకరునితో మఱల నిట్లనియె. 370

క. హర! మోఘామోఘస్థితిఁ, బోరి నీచక్రంబునందుఁ బొసఁగుట నేనే
కరణిం దెలియుదు నిది దు, ష్కరమై యంతటను శక్తి వఱలినయెడలన్. 371

క. తెలియుటకొఱకై దీనిన్, బలిమిన్ నీమీఁద వైచి భావంబందున్
గలతెఱఁగుఁ గాంచఁ గోరెద, లెఁగను నాకిపుడు నాగశేఖర! శంభూ!. 372

శా. మానీంద్రాత్మజ! యిట్లు శంకమిగులన్ మన్నాథుఁ డాడన్ గృపా
ధానత్వస్థితి శంభుఁ డట్టిలతి నాదైత్యారివాక్యంబులన్
దానంతన్విని పల్కె శార్ఙ్గధర మోదంబొప్ప నిశ్శంకవై
దాని న్వ్రేయు మటన్న శ్రీధరుఁడు తద్దర్పోక్తులం బొందుగన్. 373

క. విని తేజోజిజ్ఞాస, న్మనసిజహరుమీఁద నట్టిమానిరిచక్రం
బును వడి వైచిన నాయది, ఘనతరమగుదీప్తితోడఁ గనలుచుఁ బెలుచన్. 374

ఆ. యజ్ఞయాజకుండు యజ్ఞేశ్వరుండు వి
శ్వేశుఁడునగు శివునిఁ బృథులగతినిఁ
బొంది మూఁడుభాగములు గాఁగ నత్తఱిఁ
గడిమిఁ జేసె నలని గణ్యచరిత!. 375

క. శ్రీహరి మూఁడువిధంబుల, తో హవణించెడిగిరిశుఁ దోడ్తోఁ గని ప్రీ
డాహతుఁడై యాచిత్రము, నూహించుట కలవిగామి సురుతరభీతిన్. 376

క. పదములపైఁ బడ నిర్మల, పదుఁడైన మహోత్కుఁడాత్మ । పాదంబులపైఁ
బొదలెడి దామోదరుఁ గని, పదయుండయి యంత । మిగుల । సరసోక్తులతోన్.

క. నారాయణ! లెమ్మా యని, సారెకు సారెకును బల్కి । జలజాక్షుని వి
స్తారమతిఁ, గరయుగమ్మునఁ గూరిమిఁ గూర్చుండఁ బెట్టి । గొబ్బునఁ బలికెన్.

సీ. అచ్యుత! బ్రహ్మంబు । నగునట్టినాదగు ప్రాకృతం బవికా । రంబు నిజము
భావింపఁ గా మత్స్య । భావ ముచ్ఛేద్యమదాహ్యంబు నానికృ । త్తంబు నగున
కడిమి నావికృతియు । కనుఁగొనఁగానిట్లు మూఁడంగములతోడ । మొనసె నవియు
బుణ్యాకరస్థితిఁ । బొనరు నీయూ గురియం దీతఁ డగుహాట । కాక్షుఁ డన్యుఁ
ఆ. దగుసువర్ణనేత్ర । హరుఁ డతనికి వేలు
గా వెలుంగునట్టి । ఘనుఁడు వికృత
నేత్రయుగళుఁ డైన । నీలగళుండు వీ
రందఱికిని బూజ్యు । లగుదు రెపుడు 379

క. అనఘా! లెమ్మా నాకును, ఘనశత్రుండగుచు మిగులఁ । గడఁగిన శ్రీదా
ముని జంపుము వాఁడీల్గినఁ, గని వేల్పులు సంతసమునఁ । గ్రాలుదు రోలిన్

ఆ ఇటుల శంభుఁ డనఁగ । నీశుఁ డా శ్రీహరి, ధర్మశిఖరిమీఁదఁ । బ్రజ్వరిల్లు
శిష్టస్థానుతటముఁ । జేరి శ్రీదామాఖ్య, దైత్యు దేవవర్గ । దర్పహరుని 381

క. కనుఁగొని తోడగు వెన్నుఁడు, దనుజా! చచ్చితి వటంచుఁ । దతవేగమునం
బొనరారుచున్నచక్రం, బును వైచెను వానిమీఁద । బొంగెడి పూన్కిన్. 382

తే. అర్భు డప్రతిపౌరుష । మైననాసు
దర్శనముచేతఁ దునిఁగిన । తలయుఁ గలిగి
కులిశహతమైనపర్వత । కూటగతిని
వాఁడు శైలచ్యుతుండు నై । వసుధఁ గూలె 383

ఉ. ఆసురవైరి ధాత్రిఁ బడ । నచ్యుతుఁ డంత విరూపనేత్రుఁ డై
భాసురసర్పహారుఁ డగు । భర్గుని వేఁడి మహాయుధంబునై
వాసి వహించు చక్రమును । భక్తిని గైకొని స్తుత్తపఃక్రియా
భ్యాసన మా గృహంబునకు । నాయుఁడఁ బోయెను సంతసంబునన్. 384

మ. అనఘా! యట్టిశివుండ నిక్కము విరూ । పాక్షాఖ్యదేవుండు నా
విను మాదేవునిఁ గొల్వు నీకు మదిలో । వెల్గొందు శ్రీరాన్నభో
జన మబ్బు న్వడిఁ దత్ప్రసాదమున వి । స్తారంబు నౌ భక్తి నా
పనిఁ గావింపు మటంచుఁ జెప్పు జననీ । భద్రోక్తుల స్థిత్తతోన్. 385

క. విని యావిరూపనయనుని, మనమున రం గొల్చి శ్రీర । మంజాతరాన్నం
బును దన్మనిసుతుఁ డత్తతి, ఘను లందఱు మెచ్చఁ బొందె । గాదెమునీంద్రా!.

వ. మహోత్తమం బయినట్టి యాతీర్థము పరమమును బవిత్రము నైనదియుఁ బాపతరు
చ్ఛేదనంబు నై యుండు నట్టి తీర్థరాజంబునకుఁ బుణ్యార్థియై ప్రహ్లాదుం డరిగె నని
పలికి వెండియుఁ బులస్త్యుఁ డతని కిట్లనియె. 387

ప్రహ్లాదతీర్థయాత్రాక్రమము.

తే. అపుడు ప్రహ్లాదుఁ డాతీర్థ మందు మునిఁగి
ధర్మలోచనుఁ డైనట్టి పరమశివుని
భక్తిఁ బూజించి మది నెంచి ప్రస్తుతించి
నైమిషాటవి కేగెఁ బ్రసన్న మునీంద్ర! 388

సీ. ఆనైమిషాటవి యందు గోమత్యాది కమ్రతీర్థంబులు కాంచనాభ
మొదలైనతీర్థము లొప్పుదివేలుండు నవి పాపములనెల్ల నడఁచు నాలు
నట్టితీర్థములందు నాతండు మునుఁగుచుఁ గనకచేలుండును గమలనయనుఁ
డచ్యుతుండును నగు హరిని భక్తినిఁ గొల్చి యాశాసనంబున నలరుమునులఁ

ఆ. దనిపి సర్వదేవ తల్లజాం డాధ్యుఁ డౌ
శివునిఁ బూన్కిఁ బూజ చేసి గయను
వటులు గోపితమును వాంఛతోఁ జూడంగ
నరిగె నచట కప్పు డమలతేజ! 389

క. చని యాబ్రహ్మాలటాకం, బున నాతఁడు మున్గి మ్రొక్కి పుణ్యాత్ముం డై
తనపితరుల కెల్లనుఁ బూన్కిని బిండంబులను బెట్టి నగజాడిఁ గ్రోల్కన్. 390

తే. మొనసి యుదపానమం దట్లె మునుఁగుచుఁ బిత్రు
పటలతుష్టి నొనర్చి గోపతియు నైన
భవుని గదతోడ రాజిల్లు పంకజాక్షుఁ
డైన మాధవు సేవించి యంత మౌని! 391

క. మునినాథ! యింద్రతీర్థం,బున నట్టె మునింగి పితృసమూహము సురలన్
దనిపి మహానదిలో దగ,ననితరముతోఁ గ్రుంకి యంత హర్షము మీరన్ 392

క. సరయూనదికినిఁ జని త,ద్వరవారి స్మునిఁగి గోప్రతారం బను తీ
ర్థరుఁ గొల్చి మొక్కి రాతిరిఁ, దొరి ననశనుఁ డౌచు నియతి బూని మునీంద్రా!

క. పరమరజస్తీర్థంబున, కరిగి తదంభసులఁ గ్రుంకి హరదేవుని సు
స్థిరభక్తిఁ గొలిచి పితరులఁ, గరమర్థిఁ దన్పి హరిని గనుఁగొన నేగెన్ 394

సీ. చని యటతుండును సారసనేత్రుఁడుఁ బరముఁ డక్షరుఁడు మహేశ్వర తేజుఁ
డగునట్టి వైకుంఠు నమలుఁ డై దర్శించి షణ్ణిశలం దనశనత నుండి
శిష్టమహేంద్ర దక్షిణభాగమున కేగి యర్ధనారీరూపి యైనవాఁడు
నమలుఁడు దేవుఁ డై నట్టి శంభుని గాంచి సేవించి పితృతుష్టిఁ జేసి యాన

తే. గోత్తరంబున కరిగి సుకోత్తముండు
గోపృఁడును చంద్రచూడుఁడు గోపవరుఁడు
నైనభర్గుని సేవించి యధికభక్తి
తోడఁ బలుమఱుఁ బ్రార్థించి తుష్టి నొంచి. 395

వ. అంత సోమతీర్థమున కరిగి. 396

క. ఆపాతతీర్థమందున, భాసురమతిఁ గ్రుంకి యాభవానీశు మహో
ల్లాసమునఁ గొల్చి యంతట, వాసింగన్నట్టి సహ్యవరగిరి కెలమిన్ 397

క. చని యాశైలమహోదక, మునిఁగి మహాభక్తితోడ మురహరుసేవం
దనిపి పితృదేవవర్గము,లను దృప్తులఁ జేసి యంత లాలితబుద్ధిన్. 398

తే. పారియాత్రాఖ్యతో నుండుపర్వతమున, కరిగి తత్ర త్ర్యలాంగలియందుఁ గ్రుంకి
శంభుఁ గొల్చి శకోరుకేశంబుఁ జేరి, విశ్వరూపుని దర్శించె వినుతచరిత! 399

క. విను మట్టదేశమందుఁగ, ఘనుఁ డగుశశిశేఖరుండు గణపూజితుఁడై
తనవిశ్వమూర్తి వారికిఁ, గనఁబడఁగాఁ జేసె మున్ను కరుణామతి యై. 400

ఆ. అట్టివిషయమందు నలరుమంకణకాఖ్య, వారియందుఁ గ్రుంకి భర్గుఁ గొలిచి
మహితసురభినాప్పమలయాత్రికిని బోయి, యానగంబునందు నలరుచున్న. 401

క. వినుతమహాప్రాదజలమున, మునిఁగి భవానీశుఁ గొలిచి పొందుగవింధ్యా
ద్రినిఁ గలపురారిఁ గానం, జనె మన సలరంగ నపుడు సాధులలామా! 402

క. చని యటనున్నవిపాశం, దనరారెడి నీటియందుఁ దద్దగుభక్తి
నున్నిఁగి హరుఁ గొల్చుచును నిర, శనతఁ ద్రిరాత్రంబు లుండి సంతసమలరన్.

వ. పరమపాశుపతతీర్థమున కరిగి యాతీర్థజలంబందు స్నాతుఁ డై కాళీనాథుండును
సాధుసంరక్షకుం డగుహరునిఁ బూజించి. 404

సీ. అంత నవంతికి నరిగి శిప్రానదీజలనిమగ్నుండయి శౌరిఁ గొలిచి
మున్ను శ్వేతకి యనుభూమిపాలుఁ గొనిపోవ వచ్చినకాలుని భర్గుఁ డపుడు
తామసతనువుతో దగ్ధంబుఁ గావించి ప్రమథార్చితుండు నై వానిఁ గాచి
మునిసురదేవర్షిపూజ్యుఁ డై యేచోట భాసిల్లెనో యట్టి భద్రభూరి

ఆ. పితృవనంబునకును ప్రీతితోఁ బ్రహ్మాదుఁ
డరిగి యాస్థలంబునందు వెలయు
పుణ్యతీర్థవారి మునిఁగి మహాభక్తి
చెలఁగుచుండ నంత శిష్టచరిత! 405

వ. దండధరసంయమనుఁడును, మృత్యుమృత్యురూపుండును, భూతార్థశ్మశానమంది
రుండును, జగన్నాథుఁడును, మహాకాలుండును, గాలకాలాంతకాంతకుఁ డగు

శివుని దర్శించి పిదప నిషధదేశమును గూర్చి చని యాదేశమందు మిగుల రాజించుచుండిన. 406

క. వరదుం డగుసోమేశ్వరు, నిరుపమమగు శ్రద్ధఁ గొలిచి । నిర్మలమతితోఁ
బరఁగి మహోదయమునకుం, గరమర్థిం జేరి యచటఁ । గాంచెసూర్యాప్తిన్. 407

తే. వ్రాలుచున్న హయగ్రీవుఁ । గాంచి యశ్వ
తీర్థమునఁ గ్రుంకి దీప్తితోఁ । దేజరిల్లు
వాలిశరుని శ్రీధర । స్వామిఁ గొలిచి
సొరిదిఁ బాంచాలదేశంబుఁ । జొచ్చి యంత. 408

క. ధనదుని సూనుఁడు ధూర్జటి, ఘనగుణయుక్తుండు సత్య । కలితుండు యశో
ధనుఁ డగుపాంచాలికునిం, గని త్రొక్కి ప్రయాగఁ జేరి । కడునిష్ఠ మెయిన్.

క. పరఁగుచుఁ బ్రయాగయామున, వరవిష్ణుపదీజలార్త్రి । బంధురపుణ్యా
కరతీర్థమందు నిష్ఠా, పరుఁడై స్నానంబు చేసి । పదపడి మౌనీ!. 410

ఆ. అట వటేశ్వరాఖ్య । నలరారు హరుయోగ
శాలి యైనవానిని । సాధుభక్తి
మలయఁ గొలుచుచుండి । మాఘమాసం బంత
ననశనుండు నగుచు । నంత భక్తి. 411

సీ. వారాణశికి నేగి । బహుళాఘహరమైన జాహ్నవీజలమున । స్నాతుఁ డగుచు
నట నున్నతీర్థంబు । లందు వేర్వేఱుగా మునుఁగుచుఁ బిత్ర్సుర । మునుల మిగులఁ
దనిపి యాపురికిఁ బ్ర । దక్షిణమ్మొనరించి యన్నపూర్ణాయుక్తుఁ । డైనభర్గు
నాదికేశవుని దీ । వ్యద్బిందుమాధవభైరవలోలార్క । పరమధుంతి

ఆ. గణపదేవవరులఁ । గని కొల్చి మధువన
భూమిఁ జేరి యందుఁ । బొదలువిధిని
బూజచేసి యంతఁ । బుష్కరాటవి కేగి
యాస్థలంబునందు । నధికదీప్తి 412

క. ఒనరెడి తీర్థత్రయమున, మునిఁగి సురావళులను బిత్రు । మునివరతతులన్
ఘనభక్తిఁ దనిపి ముదమునఁ, బొనరినవాఁ డయ్యె నపుడు । బుధు లగ్గింపన్. 413

క. అనఘా! యగస్త్యమునిచే,తను జెప్పంబడిన దగుచుఁ । దశోత్కృష్టిడి యా
వినుతపురాణముఁ జదివిన, వినినఁ బఠించినను ముక్తి । వెలయు నరులకున్.

తే. పావనంబు పవిత్రంబు । భద్ర మగుచు
నలిఁ జెలంగెడి యీపురా । ణమ్ము మనుజ
పుంగవులకును ధన్యత్వ । మును సమస్త
పాతకాలవినాశంబుఁ । బాలి నొసఁగు 415

బలిచక్రవర్తి కురుభూమి కేగుట.

సీ. మునిచంద్ర! దానవపుంగవుఁ డైన ప్రహ్లాదుఁడు తీర్థయాత్రాభిలాషి
యై చన బలివిభుఁ । డంతటఁ గురుభూమిఁ గనుఁగొనఁగా నేగెఁ । గాంచె నట్టి
పుణ్యస్థలంబునఁ । బౌనరుతీర్థమునందు ద్విజకులప్రవరుండు । దివ్యమూర్తి
యగు శుక్రుఁ డాయెడ । నఖిలభూసురులను బిలువ నాలించి సంప్రీతితోడఁ

ఆ. దర్శవిదులు దివ్య । తాపసప్రవరులా, గౌతమాదిమౌని । గణము లెలమి
గుంపులుగను జేరి । కురుజాంగలోత్తర, దిక్కునందుఁ బాతి । తేజరిల్లు.

క. వినుతశిలద్రవతీనది, కని జని తజ్జలమునందుఁ । గరలెడిభక్తిన్
మునిఁగి యట వివాసంబున, గుసు జని యట వెల్లురతిని । గొమరార మునీ!

మ. కని యాతీర్థమునందుఁ గ్రుంకి పితృవర్గంబుల్ సురశ్రేణులన్
దనివిం జెంద నొనర్చి పిమ్మటను మిత్రప్రాంశుసంపన్నమై
ఘనతం బొందుగభస్తినామనదిలో । గాఢంబు నాభక్తిచే
తను దా మున్గి దినేశుఁ గొల్చి కడుమోదం బొప్పఁగా నంతటన్. 418

క. గురుపుణ్యోదరం బగుచును, ధర నలరెడి వేగవతికి । దమితోఁ జని యా
సరిదమలతోయమందునఁ, గరమర్థి న్మునిఁగి భక్తి । గదురన్ మౌనీ! 419

క. దేవిక యనునదికిని స,ద్భావంబునఁ జేరి మునిఁగి । భద్రపయోష్ణి
పావనజలమున నాయెడ, వావిరి మజ్జన మొనర్చి । భక్తి దలిర్పన్. 420

తే. మాధవాఖ్యాదినదులందు । మహితరీతి
మునిఁగి భానుమతీనామ । పుణ్యనదికిఁ
బోయి యాపుష్కరంబందు । మునిఁగి వార
లాత్మబింబంబులను గని । యప్ప రేచి. 421

క. పరగున నిజబింబము లా,వరజలమునఁ గాంచి వింత । వడలి యమోఘం
ధిరమేశవాక్పతీశులఁ, బొరిఁబొరిఁ బూజించి యంతఁ । బుణ్యనిధానా! 422

వ. త్రిభువనంబుల వన్నెగన్న యిన్నెటితీర్థమందుఁ గోటితీర్థమం దామునులు స్నాతులై యాయాతీర్థముల రాటిల్లు రుద్రకోటి దర్శించి మఱియు నైమిషమాగధసింధుధర్మారణ్యపుష్కరకాననదండకారణ్యచాంపేయ భారకచ్ఛదేవికాతటాకాది మహాతీర్థస్థం బగుపార్వతీశునిఁ గనఁ జని నేముందు నేముందు భవుని దర్శింతు మని తద్దర్శనలాలసులై రాఁగా నపు డాశంకరుఁడు నిజదర్శనాభిలాషు లలరి వచ్చువారును గతదోషు లగునామునులఁ గని వారియందుఁ గరుణించి కోటిమూర్తుల ధరించె. అంత నామునులందఱు హర్షించి యట వేర్వేఱుతీర్థముల నిర్మించుకొని యాగిరీశునిఁ బూజించుచుండిరి. ఇట్లట ధూర్జటి కోటినాయకులతో వాటిల్లె. నట్టిపురారిని మఱియు మహాత్ముఁ డగుప్రహ్లాదుఁడు దర్శించి

తత్త్రత్యనిఖిలతీర్థములఁ గ్రుంకి దేవపితృమునిసందోహములఁ దనిపి యాశివ
కోటినిఁ బూజించి పిదపఁ గురుజాంగలదేశంబున కేగి యట. 423

చ. అమలసరస్వతీజలము లందు నిరుగ్ణుఁడు నద్రిజామను
కమలవరప్రియుండు సురగణ్యవిభుం డగుస్థాణుఁ జూచి యా
కమలమునందు గ్రుంకి మదిఁ గ్రాలెడిభక్తిని నామహేశునిన్
సమధికరత న్భజించి మఱి సారదశాశ్వముఁ జేరి నారదా! 424

శా. ఆతీర్థంబునఁ గ్రుంకి శుద్ధుఁ డయి దేవాధీశపిత్రాదులం
జేతఃప్రీతినిఁ దన్పి యాస్థలమునం జెన్నారుచున్ భూస్థలిన్
ఖ్యాతిం జెందినకోటిలింగముల దీవ్యద్భక్తి సేవించి సం
జాతోత్కర్షఁ గవిన్ భజించి దృఢమౌ శాంతంబు వాటిల్లఁగన్. 425

తే. సోమతీర్థంబునకు నంత సొరిది నేగి
యట మునింగి తదీశ్వరు నధికభక్తిఁ
గొలిచి పితృదేవగణములఁ గూర్మిఁ దనిపి
తివిరి చన శూరికావాస తీర్థమునకు 426

వ. ఇట్లతిభక్తి నాప్రహ్లాదుఁ డేగి యంత. 427

క. మునినాయక! యాజలమున, మునిఁగి మహావరుణనగముఁ బూజించియు గ్ర
న్నన వరపద్మావలికినిఁ, జని యాజలమందుఁ గ్రుంకి సజ్జను లెన్నన్. 428

తే. అఖిలలోకపూజ్యు వైనమిత్రావరుణాఖ్యభాస్కరులను నధికభక్తిఁ
గడఁగి కొలిచి యంతఁ గౌమారధారకు, నరిగి లోకనాథుఁ డైనశివుని. 429

వ. పూజించి యాకుమారధారాతీర్థమునందు. 430

శా. స్నాతుం డై పితృదేవమానవరులన్ సంప్రీతులం జేసి వి
ఖ్యాతుం డైన కుమారుఁ గాంచి వినుతిం గావించి పూజించి స
ద్యాతిప్రార్థ్యము నైన నర్మదకు నా రక్షోవిభుం డంతటం
బ్రీతిం జేరి తదీయపుష్కరమునన్ వీతాఘుఁ డై శ్రద్ధతోన్. 431

సీ. మునిఁగి శ్రీమాధవుఁ బూజించి క్రన్నన చక్రాయుధుండును క్ష్మాధరుండు
పుణ్యుఁ డైన వరాహమూర్తినిఁ గన నేగి కోశాముఖాఖ్యచేఁ గొమరు మిగులు
తీర్థంబులోఁ గ్రుంకి దివ్యవరాహేశు భద్రత్రిసౌవర్ణభద్రుఁ గొలిచి
మధుదేశమున కేగి మాన్యు డై రాటిల్లు నాశిప్రాకంబందు స్నాతుఁ డగుచుఁ

తే. త్రిమఠపతిఁ గొల్చి కాలాంజరంబుఁ జేరి
నీలకంఠుని దర్శించి నీలతీర్థ
మందును మునింగి భూతగణాధినాథుఁ
డైనశర్వునిఁ బూజించి యంత మౌని! 432

సీ. సరిదధిపానూన । చారుప్రభాసతీర్థముఁ జా పార్వతీ । ధవునిఁ గాఁచి
చని సరస్వత్యబ్ధి । సంగమస్థలమందు స్నాతుండు నగుచును । సర్వలోక
విభుఁడుఁ గపర్దియు । విశ్వనాథుఁడు నగు సోమేశ్వరునిఁ గొల్చి । సొరిది నంత
దక్షప్రజాపతి । తనపుత్రికలునగు దస్రాదితారల । తద్ద వగను

ఆ. గాంచి చందురునకు । గాఢశాపం బిడ
నలఁడు దాన దగ్ధుఁ । డగుచు సోలి
చంద్రధరుని కృపను । శాపవిముక్తుఁ డై
యలరె నట్టిచోట । హర్షమొప్ప. 433

వ. అట్టిపుణ్యతీర్థస్థలమునకుఁ బ్రహ్మాదుఁ డరిగి దేవాధీశ్వరులగు మురారిశంకరుల నర్చించి మహాలయక్షేత్రమున కరిగి యటనున్నరుద్రు సేవించి పిదప నుత్తర కురుదేశములకుఁ బోయి యాస్థలమున భాసిల్లుపద్మనాభుని సేవించి వెండి సప్త గోదావరిఁ జేరి తత్తీర్థమునఁ గ్రుంకి త్రిభువనార్చితుం డగుభీమేశ్వరునిఁ బూజించి క్రన్నన దారువనంబునకుఁ బోయి యందున్న శ్రీలింగమును గాంచి సేవించి యంత బ్రాహ్మణినది కేగి తత్రత్యత్రిదివేశ్వరు నర్చించి కదలి ప్లక్షావతరణ మునకుఁ జని యట భాసిలు శ్రీనివాసునిఁ గొలిచి మఱియుఁ గుండినపురవరం బుఁ జేరి యాస్థలంబున విలసిల్లు చతుర్భుజశూర్పారకేశుని భజించి యంత.

ఉ. మాగధకాననస్థలికి । మానుగ నేగి ధరాధినాథుఁడుం
వాగధిపాదిసర్వసుర । వందితుఁడౌ భవుఁ బూజచేసి భూ
భాగమునందు నిత్యమును । వాసినిఁ గాంచి ప్రజాసుఖాఖ్యతో
రాగిలుపుణ్యభూమికినిఁ । బ్రాకటభక్తినిఁ జేరె నారదా!. 435

శా. శ్రీవాసు న్భజియించి యంత సురసం । సేవ్యంబు నాశోకముం
భావానందము మీఱ నేగి విలస । ద్వాక్యప్రధర్మాధ్యుఁడుం
శ్రీవిశ్వేశుఁడు నైనసీలగళునిం । సేవించి కీర్తించి భూ
దేవశ్రేణులఁ బూజచేసి మఱియు । న్దీపించుమార్గంబునన్. 436

తే. అమలమైన మహాకోశి । నలరుహంస
నామయాత్కుఁ డైనపార్వతీ । నాథునంత
నరవిఁ బూజించి మోదించి । సైంధవోత్త
మాటవికిఁ బోయి మౌనికు । లాగ్రగణ్య!. 437

వ. ఇట్లాసురనాథుఁ డేగి 438

క. ఆయటవి నలరుశౌరిని, మాయనిదగు భక్తిఁ గొలిచి । పదపడి తమి నా
తోయమునఁ గనఖలమునకుఁ, బోయును సంతోషవార్ధి । మునిఁగి మునీంద్రా!.

క. చని తత్తీర్థతలంబున, ఘనదీప్తిం దనరునట్టి । కాళేశ్వరునిం
ధననాథవీరభద్రుల, కనకాచలరవినిఁ గొలిచి । కామూహలి దై. 440

వ. అంత నచ్యుతుఁడు. 441

తే. పుణ్యదం బా గిరివ్రజమునకు నేగి
భూతపతియు మహేశుండు భువనభర్త
యైనహరు విధిఁ బూజించి యంతఁ గామ
మూర్తితీర్థంబునకుఁ జని భూరిభక్తి. 442

ఉ. ఆవరతీర్థభూమి నలరారెడివాఁడు శశిప్రకాశుఁడై
దేవవరుండు త్ర్యంబకుఁడు దీప్తహిమాచల పుత్రికాత్ముఁడై
భావజవైరినిం గొలిచి భవ్యమహాఖ్యతలంబుఁ జేరి యా
పావనతీర్థభాగమున భాసిలుశంభునిఁ గొల్చి యంతటన్. 443

ఆ. శైలజాతంబు నచ్యుత సహితమహాద్రి
కూటగిరిఁ జూడఁ జని యటఁ గోమరుమిగులు
శీతవసను భజించి జపించె దంతి
పార్థివుని మోక్షణము దృఢభావుఁ డగుచు 444

క. మనములర నంత నటఁ డా, వని మాసత్రయము దాఁక ఫలమధుకందా
శనుఁడై వసించి మున్నన, ధనము ధరామరుల కిచ్చి తాపసనాథా!. 445

ఉ. దారుణదండకాటవికిఁ దద్దగు పూన్కినిఁ బోయి యక్కడన్
సారతరోరుశాఖుఁడును సాలవపుర్ధరుఁ డార్తిహారుఁడౌ
శౌరిని గాంచి యాదనుజసత్తముఁ డాతని ముందివైపునం
జేరి దినత్రయంబు గురుశేముషి స్థండిలశాయి యై మునీ!. 446

సీ. సరవి సారస్వతస్తవముఁ బఠించుచుఁ గడఁగి కన్నన సర్వకలుషనాశ
కరమైనతీర్థంబు గాఢాఘహరుఁ డైన హరిఁ గననేగి తదగ్రభాగ
మందుండి కిటిరూపి యైభగవంతుఁ డౌనటఁడు మున్నాధించి నట్టిపాప
హరస్తవంబుల నతిభక్తి జపియించి స్థావరంబులు నగుస్తంభతతుల

ఆ. మురహరుండు నట్టిపుణ్యశాలగ్రామ, మందు నలరెఁ దొల్లి యట్టిచోటఁ
కరిగి యాస్థలంబునందు శ్రీవిష్ణుండు, సర్వగతుఁ డటంచుఁ జాలఁ దలఁచి.

వ. పరమభాగవతుఁ డగు ప్రహ్లాదుఁడా శౌరి పాదారవిందద్వంద్వము నర్చించె నారదా! నీకు నేఁ జెప్పినట్టియీ ప్రహ్లాదతీర్థయాత్రావిధంబు పుణ్యకరంబు మునిసేవ్యంబు నై యుండు; దీని వినినఁ జదివిన మనుజులు కలుషరహితు లగుదు రనఁ గలహాశనుం డతని! మఱియు నిట్లనియె. 448

తే. అనఘ! హరి నాత్మ నిలిపి ప్రహ్లాదుఁ డట్టి, నాల్గువస్తవంబుల నైజభక్తి
నొనఁగి జపియించె నట్టిగజేంద్రమోక్ష, ణాదిసంస్తుతులను జెప్పుమార్యచరిత!

## గజేంద్రమోక్షణము.

మ. అని నాలించి పులస్త్యుఁ డాఘునితో । నాదైత్యసింహోత్తమా
విను మానాల్గిటి భక్తితోఁ దలఁచిన । న్విఘ్నం దగం బల్కినన్
ఘనదుస్స్వప్నహరంబు మానవులకుం । గల్గున్ ధరన్ముందుఁగా
వినుతంబైన గజేంద్రమోక్షణము నే । వేడ్కన్ప్రశంసించెదన్. 450

క. పారస్వతనుతి నంతటఁ, గూరిమి భాషింతు వెనుక । గురుపుణ్యము లా
దారుణపాప ప్రశమన, కారస్తోత్రములఁ జెప్పఁ । గడఁగెదఁ బ్రీతిన్. 451

సీ. భాస్కరద్యుతితోడ । భాసిల్లుచును నగపార్థివంబైనట్టి । భర్మగిరికి
తనయుఁ డైనత్రికూట । ధరణీధరం బొండు కల దట్టిగిరి రత్న । గణమయంబు
నగుచు శ్రీమంత మై । యనిశము క్షీరాబ్ధి వీచ్యగ్రములతోడ । విమల మైన
పాషాణములతోడ । వఱలుచుఁ గంధిని భేదించి పైకి న । భేద్యవృత్తిఁ
ఆ. వెలఁగి వచ్చి మాని । సిద్ధాప్సరో దేవ, తాలియుక్త మైన । దగుచుఁ గొండ
సెలల నీటఁ గలఁతఁ । జెన్నారి దీప్తితో, సంతతంబు వెలయు । సంయమీశ!

వ. అది మఱియు సపత్నీక గంధర్వ కిన్నర యక్ష చారణ గుహ్య విద్యాధర బహుం తపోధనులతోడను దృఢకాయంబుల నలరు వృకసింహశరభ శార్దూలసదామద దంతావళ జీవంజీవకపన్నగాదు లగుమృగములతోడను బిల్వామలకపాటలనీపకదంబ చందనాగరు చంపక సాల తాలరసాల తమాల సరళార్జున పర్పటాదివృక్షములతోడను, సకలభాగవ్యాప్త నానాధాతుగణాంకిత ప్రస్రవత్కూటములతోడను విస్తీర్ణసానుత్రయంబుతో రాణిల్లు దానియం దొక బంగరుశిఖరమును వేడివేల్పు గొలుచుచుండుఁ బెక్కుపుణ్యములవలనఁ బిక్కటిల్లుచుఁ దావులకుఁ దావగు రెండవ వెండికూటముఁ జందురుఁడు సేవించుచుండు. శ్వేతవారివాహ సంకాశంబై వజ్రవైడూర్యాది నవరత్నగణప్రభా పటలమున దీపించు మేటి మూఁడవశృంగము నలువసదనం బైయుండు వినుము. 453

క. ధరఁ గలకృతఘ్నులును దు, ర్భరకలుషులు నరులఁ జంపు । రాక్షసులు తపో
భరితాత్ములు గాకుండిన, పురుషులు తత్పదనమునకుఁ । బోఁజాల రిలన్. 454

సీ. ఆగిరిమీఁద భ । ర్మాబ్జాళికలితమై కారండవాళుల । కమ్రహంస
బకములతోడను । భాసిల్లి కల్హారపుండరీకోత్పల । పూర్ణకుముద
శతపత్త్రతతులతోఁ । జాల రాజిల్లుచుఁ గాంచనసంకాశ । కాంతమరక
తప్రఖ్యసుమములఁ । దనరి కీచకవేణుగుల్మకాండంబులఁ । గూడినట్టి
ఆ. దివ్యమైనకొలను । తేజరిల్లును దాని, నీటనడుమ నెపుడు । నెగడి కరుల
గలవిఁ గాని దగుచు । నధికసారస్ఫూర్తిఁ, గడఁగు మొసలి యొకటి । గండుమిగిలి.

క. మదగంధపరిమళమ్మునఁ, బొదలుచు విహరించునట్టి । భూధ్రముమాడ్కన్
గదలుచు నగ్గిరిగజపతి, మదఘూర్ణితలోచనముల । ముదమున వసించున్. 456

చ. సురవిభుహస్తిచందమున శోభిలి యంజనసన్నిభంబునై
గురుకుచిదంతదీప్తి నటఁ గ్రుమ్మఱుచుండెడు నాకరీంద్రుఁ డా
సరసిఁ గృష్ణతో నరిగి సారసదివ్యవనంబునందు భా
సురకరిణీసమేతుఁడయి సొంపున డిగ్గి విధాతృనాతలిన్. 457

చ. కర మట ముగ్గి మోదమునఁ గ్రాలి జలంబులఁ గ్రోలి యాకరి
శ్వరుఁడు నిజోరుహస్తమున భాసురసారసపంక్తిఁ ద్రుంచుచుం
గరిణుల కెల్ల నిచ్చుచును గ్రక్కున నీళుల మింటి నంటఁగాఁ
బరువడిఁ జల్లుచుం దమిని వాటిలు చుండెను భూరిలీలతోన్. 458

సీ. అక్కాలమందున వ్యక్తరూపంబుతో నలరి మహారౌద్రమైన మొసలి
పెంటియేనుఁగులన్ని బెదరి చూచుచు నుండఁ గనలి యానాగేంద్రుకాలుఁబట్టె
కడు నీడ్వ గజపతి వడి దాని మఱి లాగ నీరిలి నాలెండు పృథులశక్తి
వఱలి దివ్యసహస్రవర్షము ల్పోరెను వారణాధిపుఁ డంత బలిమి నొప్పు
తే. వాఁడునై ఘోరవారుణపాశబద్ధుఁ
డగుచు ఫూత్కార కలితుఁడై యధిక రవముఁ
జేసెఁ గర్మముతో వృద్ధిఁ జెందు రోగ
మునకు వడి చిక్కి యఱచెడి పురుషు మాడ్కి.

ఉ. ఆపదఁ జెంది కుంది యపు డాగజనాథుఁడు సుస్థిరస్థితిన్
దీపితమైన భావమున దివ్యుఁడు భూతగణాంతరాత్ముఁడున్
బాపహరుండు సాధుజనభావ్యుఁడు భాస్కరకోటి తుల్యుఁడున్
శ్రీపతియైన మాధవుని శిష్టపదంబుల సంస్మరింపుచున్ 460

సీ. అఖిలజన్మాంతరాభ్యాసవశంబున గరుడధ్వజునియందుఁ గరివిభుండు
భక్తితోఁ జెన్నారి భగవంతుఁడును మహాదేవుఁడు సంతతదీప్తతనుఁడు
మథితామృతసుఫేనమంజులాభుఁడు శంఖచక్రగదాధరసహితుఁ డజుఁడు
వాణీసతీశసంభవనాభికమలుండుఁ బద్మాకళత్రుఁ డాపరమశౌరి
ఆ. నాత్మ నిలిపి యంత నాపన్నవారణేచ్ఛారతుండు నగుచు సరవి దివ్య
కేకచోదితంబు విమలమౌ స్తుతిఁ జేయ, సాగె వినుము నిష్ఠసంయమీంద్ర!

గజేంద్రుఁడు హరిని నుతించుట.

క. శ్రీరమ్యరత్నమందిర, సారోదారప్రచార! సత్యవిచారా!
పారావారగభీరా!, కారుణ్యముతోడ నన్నుఁ గావు రమేశా! 462

క. గురుమూలప్రకృతివి షు, స్థిరుఁడవు నళినుఁడవు భూరిదీపితుఁడవు భా
సురుఁడవు నిస్పృహుఁడవు నగు, వరదా! మ్రొక్కెదను నీకు భక్తతతిద్వన్.

క. మునివరుఁడ వనాశ్రితుఁడవు, ఘనుఁడ వనంతుండ వఖిల గణ్యుఁడవు సనా
తనుఁడవు నాకఁడవు నగునీకును మ్రొక్కెద నన్నుఁ గావు కూరిమి మీఱన్,

క. ఆదిప్రవర్తకాద్యా!, సాదరసాధ్య స్తగుహ్యా। చక్రీ! సుగుణా
పాదిత! మాధవ! భూధవ!, నేఁ డవి మ్రొక్కెదను భక్తి। నీకు మురారీ!.

తే. అప్రతర్క్యాప్రమేయ మహాత్ములాఢ్య
శాంతగుణ కీర్తి సంయుత। సత్యనిరత
రమ్య నిశ్చింత పూర్వపు। రాణపురుష!
భక్తి మ్రొక్కెదఁ బాలింపు। పరమదయను. 466

చ. అమలుఁడ వై గుణాత్ముఁడవు। నై గుణి వై పరమేశ్వరుండ వై
కుమతివినాశకారివయి। గోపతి వై భువనేశ్వరుండ వై
సమధికశాంతియుక్తజన। సంఘహృదబ్జవికర్తనుండ వై
సుమహితశక్తితో మిగుల। శోభిలు నీకు నమస్కరించెదన్. 467

క. భవనాశ! సాంఖ్యయోగా!, ధ్రువ! దేవా! పద్మనాభ! । దానవనాశా!
భువనార్చిత! గోవిందా!, శివ! హర! మ్రొక్కెదను భక్తి। చెలఁగ స్వీకున్ 468

క విశ్వేశ్వర! నారాయణ, విశ్వంభరరూప విబుధ। వినుతచరిత్రా!
శశ్వత్సుఖ వామన హరి, దశ్వసహస్రాభ! వందనాలి నొనర్తున్. 469

క. పురుషోత్తమ! చక్రగదా, వరశార్ఙ్గధరా మహేశ। భాసురసదనా!
గురుసర్పసింహదానవ, హర! నీకు నమస్కరింతు। సకలాధారా! 470

ఉ. చారణసిద్ధసాధ్యముని। సారససంభవరుద్రసన్నుతా
ఘోరవికారదూర సుర। గోష్ఠిత సత్తమ నాశహీన భూ
భారధురంధ రాహిపతి। భాసురసచ్ఛయనా సనాతనా
క్షీరసువర్ణనీలఘన। చిత్రకుకోపము! నీకు మ్రొక్కెదన్. 471

క. కనకాంబరవిశ్వాద్యా ఘనమధుకైటభవినాశ। కమలాధీశా
వనజాక్షధర నినుఁ గడు, వినుతించెద నన్నుఁ గావు। విశ్వాధిపతీ! 472

క. క్షీరాబ్ధిసదన సత్యా,చారా నానావిచిత్ర। చామీకర కే
యూరకిరీటసుభూషణ, ధారాధర సన్నిభాంగ దయ। నేలు ననున్. 473

సీ. భక్తప్రియాధిక। బహుదీప్తకరచక్ర శక్రమహావిఘ్న। శమనయత్న
విక్రమవికచాబ్జ। విమలలోచన యోగివర వరదా బ్రహ్మ। వర్ణ్యదివ్య
దమరాయనా జగ। దయనా మహాయనా బంధురప్రవివాస। భద్రవాస
నానాచరాచర। నాథనిరాబాధభవహర శుభకర। పరమశూర

ఆ. సాధుసంఘులోల। సారమహోన్నత, శీలసుగుణజాల। శిష్టపాల
చాలదస్సి మిగులఁ। జదువుఁ జెందిననన్ను, నేలు కరుణతోడ। నిందిరేశ! 474

తే. అక్షరుండవు నచింత్యుండవు। నచ్యుతుండవు
వ్యక్తావ్యక్తుఁ డాదిని। ర్గుణుఁడవు కూట

వాసుదేవుఁడును గారణుండును బహుళయుగాంత
శేషపురుషుండు నగుచున్న శ్రీశుఁ దలఁతు. 475

క. కాంతవిచిత్రకిరీటా!, శాంతాత్రేయాగ్రయోగిసత్తమ! లక్ష్మీ
కాంతాంతరాత్మభవ! మా, యాంతజ్ఞా! ప్రోవు నన్ను నతిదయతోడన్. 476

చ. కనులకుఁ గానరాక నెఱిఁ గన్పడు కాక సనాతనస్థితిం
దనరుచు భావ్యరూపములఁ దద్ద వెలింగి యచింత్యుఁడై యశో
ధనుఁడును వేదగుహ్యుఁడును దాత్మమయుం డగునంచు మౌనులె
వ్వనినుతియింతు రట్టిహరి భక్తి భజించెద నే మనంబునన్. 477

ఆ. అజుఁడు నాశహీనుఁ డగునట్టి యేవాని
బ్రహ్మగాను మునులు పల్కుచుండు
రట్టిసర్వగుని నరేశులు విని మృత్యు
ముక్తులగుదు రట్టిపురుషుఁ దలఁతు. 478

సీ. ఏవానిమదియందుఁ బృథుభక్తి సేవింపఁ బాతకరాసులు పాఱిపోవు
నేపరాత్పరు శ్రద్ధ నెసఁగి భావించిన జన్మరాహిత్యమై జగతి వఱలు
నేవాఁడు బ్రహ్మరుద్రేంద్రార్చితపదారవిందుఁడై నిత్యము వెల్గుచుండు
నేవాని వీక్షింప నిల నెవ్వరు నశక్తు లగుచుండ్రు ప్రత్యహమందు మునుల

తే. నట్టికార్యక్రియందు నా హరినిఁ గొలుతు
నళిననాభుండు వరపద్మనాభుఁ డధిక
బలుఁడు బహుదేవనిధియును భావ్యభావ్యుఁ
డప్రమేయుఁ డనంతుఁ డాహరి భజింతు 479

ఆ. హాటకార్ఘ్యరత్న హారకిరీటాంగ, దప్రభాభిరామ తనుఁడు ఘనుఁడు
భావహరుఁడు భక్తబంధనహరుఁ డైన, పరమశౌరిఁ గొల్తు భావమందు. 480

క. తారోద్భవుండు ధర్మా, ధారుఁడు యోగాత్ముఁ డధికదర్పుఁడు సాంఖ్యా
చారజ్ఞపరుఁడు నగుహరి, సారెకు సారెకును దలఁతు శ్రద్ధాభరతిన్. 481

క. హరిచంద్రాశ్వమరుద్గణ, గరుడోరగసిద్ధసాధ్యగంధర్వమునీ
శ్వరనుతుఁడగు మానాథునిఁ, బరిపరివిధములను నేను భక్తిఁ దలంతున్.

క. శ్రీవత్సాంకమనోగమ, దేవ మహాదేవ గుహ్య దేవేశ్వర స
ద్భావవరేణ్యా సూత్మా, ధీవంద్యా భీతిహరణ ధృతిఁచెడ మిగులన్ 483

ఆ. ముక్తసంగులైన మునులకు మేలగు, గతియు నగుచు జీవగణము నెల్లఁ
గలుగఁ జేయునట్టి కంజాక్షుమృదుపాద, వనజముల కొనర్తు వందనంబు 484

ఉ. అక్షరుఁ డంబుజేక్షణుఁడు హాటకచేలుఁడు శాంతసద్గుణా
ధ్యక్షుఁడు భక్తవత్సలుఁడు ధర్మశరణ్యుఁడు నైనశౌరినిఁ

దీప్త భక్తిచేతు లోకముల ; దీప్తి వెలింగెడివాఁడు కేవల
దత్తుఁడు నైనమాధవునిఁ ; దద్దఁ గులించెదఁ జిత్తసీమలోన్. 485

క. సర్వజనప్రపితామహ, సర్వేశ త్రివిక్రమా సుచరితాధారా
శర్వజనార్దన సలితా, ఖర్వతపోయోగభావ! ; కావుము నన్నున్. 486

క. వ్యక్తావ్యక్తసనాతన, భక్తిప్రియ దేవదేవ! ; భక్తావనసం
యుక్త ద్విజప్రియ భాసుర, ముక్తిపదా! ప్రోవు నన్ను ; మ్రొక్కెద నీకున్. 487

సీ. నీవు సూక్ష్మమున కణీయాంసుఁ డవు దేవపతివి మహుండవు ; భద్రుఁడవు
సర్వమహాండవా ; సర్వేశ్వరేశ్వరా మ్రొక్కెద నీకు నే ; భూరిభక్తి
నేకమా మూర్తితో ; నెసఁగి జగత్సేతువ్వఁడవు నగునిముఁగొల్తు ; నమలబుద్ధిఁ
బరమాత్ముఁడా నిన్ను ; బ్రహ్మమయుండని పలుకుదు రార్యులు ; ప్రత్యహంబు
ఆ. నట్టివాఁడ వగుచు ; నలరునీవే నాకు
గతియుఁ గాని వేలు ; గాన నన్నుఁ
గరుణతోడ వచ్చి ; కనులకుఁ గనఁబడి
ముదము మిగులఁ బ్రోవు ; పుణ్యపురుష!. 488

క. వరదా బ్రహ్మణ్యదయా, కర భక్తాభయద నిత్య ; కరుణాధారా
శరణాగతుఁడను నగుననుఁ, గరుణను గాపాడి కీర్తిఁ ; గనుమా మిగులన్. 489

శా. శ్రీవాగీశ్వరసన్నుతా మకరి బల్చేవన్ గొనెన్ జూడుమా
కావుల్దప్పుచు శోషఁ బ్రాణములు కంఠప్రాంతముం జొంచె నా
భావానందము కుందె దేహము వడిన్ ; స్వాధీనము దప్పె నో
దేవాధీశ్వర! నామొఱ న్విని దయ ; న్దీపించి పాలింపవే 490

క. మునివర! గజేంద్రుఁ డీవిధ, మునఁ జొగడఁ దదీయమహా ; మోఘుపుభక్తిం
దనమనమున హరిఁ దలపోసినవాఁడై కరుణ మిగులఁ ; దెలఁగుచునుండన్.

హరి గజేంద్రుని రక్షించుట.

సీ. మణిగణహాటకమయకిరీటము తల నలరఁ గస్తురినామ ; మాననమున
నమర నురంబున ; నతులకౌస్తుభమణి ఘనదీప్తిఁ జెన్నారఁ ; గంఠమందు
వనమాల రాణింప ; బాహుమూలంబులఁ గేయూరకాంతులు ; కెరలుచుండఁ
గరములఁ జక్రశంఖంబులు విలసిల్లఁ బక్షీశుపై నెక్కి ; పైడిపటము
తే. పైన భాసిల్ల జిగిబిగి ; పర్వఁ గడల
జలధరము చెంత వెలిఁగెడి ; శంపమాడ్కి
లక్ష్మి తనవెంట రాఁగ నాలలితసరసు
సన్నిధినిఁ జేరె వెన్నుండు ; సంయమీంద్ర! 492

వ. ఇట్లు జగదాధారుఁడు దపోధనుఁడు నగుదామోదరుఁడు కరుణారసభరితాం
తఃకరణుం డగుచు నేతెంచి యుండె. 493

ఆ. వారిలోనుండు బెనఁగు వారణమకరుల, నీటనుండి వెలికి నిపుణశక్తి
మొనసి లాగి చక్రమున మకరినిఁ ద్రుంచి, హస్తినాథుఁ గాచె నధికరయమున.

క. అనఘా! హూహూనామం, బును గలగంధర్వరాజు మును సురశాపద
బున నక్రమయ్యె నిట్టెడఁ, గనకాంబరువలన ముక్తిఁ గని విలసిల్లెన్. 495

క. హరి సుప్రసాదమున భా, సురతనుఁడై హస్తివిభుఁడు శోభిల్లెను నీ
కరణిని నాకరిమకరము, లురుశాపవిముక్తితోడ నొప్పెను దీప్తిన్. 496

క. శరణాగతవత్సలుఁడై, సరసీరుహనేత్రుఁడైన చక్రధరుం డా
తెరుణమున వారిచేతను, బోరిఁ బోరి పూజితుఁడు నగుచుఁ బొంగె మునీంద్రా!

క. కరుణాకరుఁడును శ్రద్ధా, పరుఁడు విధేయుండు భక్తబంధుఁడుఁ డౌనా
కరివరుఁ గని మధురంబుగ, హరి యీచందానఁ బల్కె నాలింపు తగన్. 498

సీ. త్వత్స్థలి నెవ్వఁడీ తాసారమును నన్ను గ్రాహవారణములఁ గాంతు నిన్నుఁ
గుల్మకీచకవేణు గురుమేరుసుతరూపమును రావిచెట్టును బ్రొద్దు సుస్థి
రాత్ముడై పూన్కితో నాలించి కీర్తించి చదువుదురో యట్టి సజ్జనులకు
దుఃస్వప్ననాశనంబు దుఃఖసంహారంబు గలుగు సుస్వప్నము గ్గాంచుచుండు

తే. మత్స్యకూర్మవరాహవామనఖగేశ, సర్పపతినారసింహులఁ జాలవేడు
కను దలంచినవారు పాపములవాసి, పుణ్యలోకంబులకు దీప్తిఁ బోదు రనఘ!

ఆ. ఇట్టు దంతితోడ హితమొప్పఁగా శౌరి, పలికి మదిని ముదము ప్రజ్వరిల్ల
హస్తమునను వాని నంటె నర్తితీ దివ్య, తాయ మలర భక్తి గజవిభుండు.

ఉ. శౌరిపరాయణుండు నయి చక్కఁగ నాహరి భక్తి వేఁడినన్
సారసనాభుఁ డాయెడ గజప్రభుపాశములన్ సడల్చి యా
వారిచరోగ్రపాపములఁ బాపి మహాసురగోప్యసక్తులా
ధీరులు మానులుం బొగడఁ దీప్తి నదృశ్యుఁడునై చనన్ మునీ! 501

వ. అక్కాలమునందు. 502

చ. సురలును బాకశాసనుఁడు సుస్థిరచిత్తులునైన తాపసుల్
కరివిభుమోక్షణంబుఁ గని గ్రక్కున వింతను విచ్చుకన్నులన్
గరిమ వెలుంగువారు నయి కంజదళాక్షుఁడునైన మాధవుం
బరిపరి ప్రస్తుతించి రతిభక్తి చెలంగుచునుండ నాయెడన్. 503

చ. ఘనకరినాథమోక్షణముఁ గంజదళాక్షునిదివ్యచేష్టితం
బును గని భార్గవాంకురులు పొంగుచుఁ బల్కిరి దీని శ్రద్ధమై
వినిన స్మరించినన్ జదువ విష్ణుపదంబును గూర్చి మానవుల్
చని యట సంతసించుచును జాల వెలుంగుదు రంచు వేడుకన్. 504

సీ. మునినాథ! యీగాథ భువి విన్నఁ జదివినఁ దలఁచిన మానవతల్లజులకు
దుఃస్వప్నదుఃఖముల్దొలఁగుఁ బంకహారంబు కలుగుచునుండు నీకమలనేత్ర

కథ కీర్తనీయ మై । గణ్య మై పరమ మై పుణ్యాకరస్థితిఁ । బొనరు దీనిఁ
గనులార ధాత్రిలోఁ । గన్నట్టిమనుజుఁడు గజపతి పొందినగతినిఁ జెందు.

ఆ. నజుఁడు పద్మనాభుఁ । డమరేశ్వరుఁడు బ్రహ్మ
నిధి సనాతనుండు । నిర్మలుండు
నమరగుహ్యుఁ డాఢ్యుఁ । డగునట్టిహరి కేను
మ్రొక్కుచున్నవాఁడఁ । బూన్కి నిపుడు 505

దుష్టనృపతిచరితము.

వ. మునీంద్రా! సారస్వతస్తుతిని వక్కాణించెద సావధానచిత్తుండ వై వినుము

చ. కలఁడు నృపాధముం డొకఁడు । కాశ్యపిఁ దొల్లి యతండు దాష్ట్యసం
కలితుఁడు నిర్ఘృణుండు నయి । క్రౌర్యమునం బరపీడఁ జేయుచున్
బలిమిని విత్తమీఁగి వడిఁ । బాపలఁ బెద్దల మానులన్ దయా
కలితులు నైనవేల్పులను । గాని మదిం దలఁపం డొకప్పుడున్. 507

మ. అనఘా వాఁ డిటు దుష్ప్రవర్తనపరుం । డై నీల్గి తత్కర్మసం
జనితాఘంబున రాక్షసుండు నగుచున్ । జన్మించి యామీఁదటన్
దనుజత్వంబునఁ బాపకార్యముల విస్తారంబుగా నూఱుహా
యనముల్చేసి తదీయకర్మమున దుష్టాత్ముండు నై నిత్యమున్ 508

సీ. కనులకు నెట్టిమృగంబులు మనుజులు కనఁబడునో వానిఁ । గ్రౌర్యవృత్తిఁ
బట్టి చంపుచు మహాపాపి యై బహుకాలపర్యంత మీరీతి । వసుధ మీఁదఁ
దిరుగుచు నొకరితి । దివ్యనదీకూలమునం దూర్ధ్వభుజముల । నలరి యోగ
కలితుఁ డై శుచియు నై । కడిమి దక్షుండు నై హరిపాదపంకజాయత్తబుద్ధి

ఆ. నిట్టిరతుతోడఁ । గృతాంతుఁడును దక్ష:
కలితుఁ డైనమానిఁ । గాంచె నొకని
దత్కృతంబు నైన । దైత్యారిపంజర
మును వచింతు భక్తి । మొనయబుద్ధి. 509

వ. సావధానచిత్తుండ వై వినుము. 510

హరిపంజరము.

ఆ. చక్రధరుఁడు నైన । శౌరి తూర్పునగదా
ధరుఁడు నామురారి । దక్షిణమున
శార్ఙ్గధరుఁడు నైన । సారసాక్షుఁడు కడుఁ
బశ్చిమాశ నాకుఁ । బరఁగుఁ గాక!. 511

క. కరఖడ్గుం డగుహరి యుత్తరమునఁ గోణములయందుఁ । దచ్చక్రములం
దు రహి హృషీకేశుఁడు భా, సురుఁ డై నజనార్దనుఁడు । శోభిలు నాకున్. 512

క. కిరిరూపి యైన శ్రీహరి, ధరణి నృసింహుండు గగనతలమున నాకుం
బరిపరివిధముల రక్షా, కరు లై సంతతము నుండి కాతురు ప్రీతిన్. 513

చ. అమలము సంభ్రమంబును దురాప్తము నిత్యసుదర్శనంబు నై
సుమహితదీప్తితో నెపుడు శోభిలు చక్రము ప్రేతదైత్యులం
క్రమమున ద్రుంచు నీగదయుఁ గాంతుల వేయిటి నొప్పి మింటిపై
నమరు వృకాదిభూతముల నన్నిటి నాశ మొనర్చు నుద్ధతిన్. 514

ఆ. చాల వెలుఁగునట్టి శౌరిశార్ఙ్గం బస్త
దీయ మై నరిపుల ధృతి తలిర్చ
దిశలఁ జెలఁగునట్టి తిర్యఙ్మనుష్యకూ
ష్మాండగణము ప్రేతచయము నణఁచు 515

క. అనిశము నా కహితము లగు, వనచరములు ఖడ్గధారవలన నశించు౯
వినతాత్మజుచేఁ బాములు, ఘనముగ నుగ్గగుచుఁ గూలు గైవడి మిగుల౯.

సీ. దానవకూష్మాండ దైత్యయక్షప్రేత భీమమనుష్యులు విష్ణుపతులఁ
గడిమి జృంభకమునా ఘనఖగస్తోమంబు సింహాదిమృగము లాశీవిషంబు
లచ్యుతు శంఖవరారావాలిచే శాంతిఁ జెందుచు నుండును జిత్తవృత్తి
సరణి స్మృతులనెల్లఁ జాల హరించెడి జనము లోజోబలకాంతిహరులు

ఆ. చాయ నడచువారు సద్భోగలక్షణ
హరులు నై చెలంగునట్టిదులును
చక్రరయమువలన సమయుదు రనిశము
భీతి మనసులందుఁ బెంపుసెంద. 517

క. మతిమానసేంద్రియస్థిర, గతి కలుగును నాకు దేవగణపుండు మహా
చతురుఁ డగువాసుదేవుని, వితతామలకీర్తనమున విశ్వంబందున్. 518

ఆ. అగ్రమందుఁ బృష్ఠమునఁ దిక్కోణంబు, లందు నుత్తరంబునందు దక్షి
ణాశయందు నాకు ననవరతము లోక, పతియు నైనశౌరి పరిధవిల్లు. 519

చ. ఘనతరవిశ్వరూపమునఁ గ్రాలెడి బ్రహ్మము కేశవుండు నై
యనిశము వెల్గునట్టిజగదాధ్యుఁడు నిత్యుఁడు నైనచక్రికీ
ర్తనమున మూఁడులోకములఁ దండడిసేసెడి నేగి శాంతితోఁ
బొనరుచుచుండు నాకఖిలభూస్థలమందు సహార్ధిశంబులన్. 520

క. ఇటు లాత్మరక్షణార్థము, పటుతర మగుభక్తితోడఁ బద్మాక్షుని దు
ర్ఘటపంజరంబు నాతఁడు, తటవటఁ గావించుచుండ దైత్యుఁడు దానిన్. 521

క. కని వెఱచి పాతి మఱియా, మునిగణనాథుని సమాధి ముగిసెడి దనుకం
గన వానివలన గతజవ, మున నుండెను నాల్గునెలలు పొగులుచు నచటన్.

తే. అనఘ! రక్షావసానంబునందుఁ గనుల
విచ్చి యాతాపసేంద్రుఁడు వెఱపుతోడఁ
గడఁగి గతతోషశక్తులఁ గ్రాలి సోలి
వగలవీర్యుఁడు నగుదైత్యవీరుఁ గాంచి. 523

మ. అనుకంపాయుతచిత్తుఁడై యతనితో నాడె న్మహాదైత్య! యే
పనికై వచ్చితివన్న వాఁ డతనితో బాగొప్ప నాత్మాగమం
బును రక్షంబున సంభవించిన భయంబుం జెప్పి నైజక్రియా
ఘనమౌదుఃఖము వింతగా మనసులోఁ గ్రాలంగ నిర్విణ్ణుఁడై. 524

క. అన నోమునినాయక! దుర్జనుఁడను పాపుఁడను ప్రాణిసంఘాతనుఁడన్
దనుజాధముఁడను గావున, గనికరము చిగుర్ప నన్నుఁ గాపాడఁ దగున్.

సీ. గణ్యాత్మ! విను మహాగర్వంబుతో నేను బలిసుతహీనలై పరఁగునట్లు
చేసితిఁ బెక్కండ్ర చెలుల నిర్దోషులౌ పురుషులఁ జంపితి భూస్థలమున
నందుచేతను పాపినై నీప్రసాదంబువలన ముక్తిని గోరువాఁడనైతి
ధర్మనాశనముతోఁ దనరెడునాపాపశమనంబుకొఱకు నై చాలవెలయు
తే. నట్టిహితమార్గగతి నాకు నాడు మనుచు
ధర్మమోక్షార్థహేతుభూతంబు సత్య
భరిత మైనట్టిదా నిజభాషణంబుఁ
బలికె దానవుఁ డీమాడ్కి భక్తి నంత. 525

క. మునివరుఁ డామాటను విని, యనె దైత్యా! క్రూరబుద్ధి నలరారెడి నీ
కును బలిమి నెట్లు ధర్మా, యనమున జిజ్ఞాస పొడమె నాదృతిఁ జెపుమా!

మ. అన నాదైత్యుఁడు పల్కె నోమునివరేణ్యా! నిన్నుఁ జంప న్మనం
బునఁ గాంక్షించినవాఁడనై కినుకఁ బల్ప్రాంగార నేతెంచి యా
ఘనరక్షాగతభీతి నే నిట మహాకంపంబున న్నిల్వఁగా
విను నీకూడికతోడ నాకు గురునిర్వేదంబు పుట్టెన్ వడిన్. 528

క. మౌనీంద్రరక్ష యిట్టిదొ, మానుగ నద్దానిఁగాన మతి తన్మహిమం
గాన మహానిర్వేదము, దాన న్నాకొదవె మిగుల దర్పోద్ధతి మై 529

ఆ. కాన నిప్పు డీవు గాఢమై వెల్గాందు, కరుణతోడఁ బాపగణము పోవు
నటులొనర్పు మన్న నాదైత్యునుడి విని, యాతపస్వివర్యుఁ డనియె మరల.

క. దనుజా! మహోపదేశం, బును జేయుమటంచు దీనబుద్ధి న్నన్నుం
గని పల్కితి వది యుత్తమె, కనఁ గలుషనివృత్తి భద్రకారియుఁ గాదే 531

ఆ. అట్టిచేయ ధర్మమైనరక్కసులకుఁ, బథ్యమైనపలుకుఁ బలుకనొల్ల
వేదవిదితశాస్త్రవిషయము నెఱిఁగిన, ధరణిసురుల నడుగఁ దగును దైత్య!

క. మునివర! యతఁ డీకైవడి, నన విని తనపాప మెట్టు । లడఁగునొ యని బు
ద్ధినిఁ దలపోయుచుఁ గళవళ, మును జెందెడునింద్రియములఁ । బొనరినవాఁడై.

ఉ. భూసురదర్శనార్థమయి । పోవుచు నాఁకలిచేత నెంతయుఁ
గాసిలుచున్నవాఁడగుచుఁ । గంటికిఁ గన్పడుభూతవర్గమే
వాసములోనఁ జిక్కినను । వాంఛను మ్రింగక దీక్ష నాఱునా
మాసము లేగఁ దాఁ దినును । మానుగ నాతఁడు నొక్కజంతువున్ 534

వ. ఇట్లారక్కసుం డాఱునెలల కొకసారి యొకజంతువును బట్టి మ్రింగుచుఁ దిరుగు
చుండి యొకానొకతఱి నావనమునందు ఫలగ్రహణముఁ గావించుచున్న బ్రహ్మ
చారినిఁ గని క్షుధార్తుఁడై కడువేగమున వచ్చి యంత 535

చ. కరమునఁ బట్ట నాద్విజుఁడు । కంపితుఁడై యిఁక జీవితంబు లే
దరయఁగ నాకు ధాత్రిపయి । నంచు నిరాశుఁడునై యపూర్వభీ
కరతనుఁడుం దురాత్ముఁడును । గాఢబలుం డగునట్టి యామహా
సురుఁ గని పల్కసాగె నిటు । సోలుచు సొక్కుచు బ్రహ్మనందనా! 536

క. దనుజా! నను నేకారణ, మునఁ బట్టితి వట్టికార్య । మునుఁ గడు దయతో
డను జెప్పి చంప నొ నా, పని యొప్పిద మౌను నీకు । భద్రము కలుగున్ 537

చ. అని వగ నాద్విజప్రవరుఁ । డాడిన వాఁ డని పద్ధముంబునై
చనునెల నాఁకలిఁ మిగుల । సత్త్వముఁబోయినవాఁడ నిర్దయం
దనరినవాఁడఁ గర్కశుఁడ । దర్పితవపుఁడ నైననాకు నీ
వనమున నీవు దివ్యమగు । భక్షణమైతివి నేఁడు భూసురా! 538

క. అన నతఁ డనె దైత్యా! కోసినఫలముల గురునకిచ్చి । చెలఁగెడి పూన్కిం
జనుదెంచి యంత నీచే, తను భక్ష్యుడ నగుదు వినుము । దయ నామాటన్ 539

తే. గురునికార్యార్థమై భక్తిఁ । గోయఁబడెను
బండ్లు నాచేత నేనిట । భక్షితుండ
నైనయెడ నట్టిఫలముల । నతనికిడెడి
వాఁడు లేఁడింకఁ బాపంబు । వచ్చుఁ గాన 540

క. చని యతనికి ఫలముల నిడి, చనుదెంచెడిదనుక నన్నుఁ । జంపి తినక బ
ల్కనికరమున నేలందగు, నని వేఁడెదు విప్రుమాట । నాలించి మునీ! 541

క. అని వాఁ డో బ్రాహ్మణ! యే, జనుఁ డాహారంబుతోడ । పాత్తాసములం
దున రాఁ డాశను విడువదు, కనుఁగొన నాపాపజీవి । కయిన నద్దానన్ 542

సీ. పురుషుఁ డొక్కఁడు భవన్మోక్షణంబునకును గారణంబైయుండుఁ । గడిమి నిష్ఠ
వినుము నిక్కము నిను । విడుతు నీవారీతిఁ గావించినట్లైనఁ । గౌతుకమున
నన విని యాభూసు । రాత్మజుఁ డాతనిఁ గని యిట్టు పల్కె నో । కర్బురేశ!
ధర్మావిరోధతఁ । దనరుచు గురునకు నవిరుద్ధమగుచుఁ జెన్నారి మద్వి

ఆ. తాపనాశకరణి । పావనించుపని యైన: జేయఁగలరటంచుఁ । జెప్ప నరుఁడు
మౌనిబాలుఁ జూచి । మఱియు నీచందానఁబలుకసాగె వినుము । బ్రహ్మతనయ!
ఆ. వినుతచరిత! నిర్వివేకచిత్తంబునఁ, గర్మములను నేను । గడిమి నెఱుఁగ
దుష్టభావజాలి । దోషంబుతోడను జేసినాఁడ మఱియుఁ । జెనటి నగుచు 544
క. మనమా బాల్యమునందాగిఁ, బోనరె నధర్మోరుపాపములలోఁ దన్నా
శనమును నేనేకారణ, మునఁ జెందంగలనో చెప్పుము । మునికులతిలకా! 545

ఆ. చిన్ననాటనుండి । చేసినసర్వపా
తకగణంబువలన । ధరణి నిట్టి
పాపదనుజయోని । భవుఁడ నైతిని దద్వి
ముక్తిఁ బలుకు మీవు । బుధులు మెచ్చ 546

క. ధరణీసురా! దీనిని గురు, కరుణను సర్వంబుఁ జెప్పఁ । గలిగితివా యీ
తరుణంబున తుల్పిదం, బరఁగెడి నావలన ముక్తిఁ । బడసెదవు వెసన్ 547

ఉ. నీవటు చేయువేని కడు । నిర్దయుఁడుండిన మానవుష్ట్రముల్
బోవఁగ నప్డు నేమనుజ । పుంజమునెల్ల నృశంసకుండ నై
వావిరి రేగి ఘోరముగఁ । బట్టి మహోద్ధతి మ్రింగెద న్వడిం
గావుర దానిఁ జెప్పి నను । గణ్యులు మెచ్చగ నేలు మియ్యెడన్. 548

మ. మునినాథా! యిటు లాదురాత్ముఁ డన నా । భూదేవుఁ డామాటయం
దు నశక్తుండయి చాలఁ జింత మదిఁ దోఁడ్తోఁ బుట్టఁగా సంశయం
బునఁ జెన్నారుచు జ్ఞానదానమునకై । పుణ్యుండు సద్గణ్యుఁడున్
ఘనుఁ డాఁ బావకునంతవేఁడఁ దొడఁగె । న్గాఢంబు నాభక్తితోన్. 549

క. గురుదహనులకు శుశ్రూషన్, బోరి సువ్రతములను జేసి । భూస్థలమందున్
స్థిరమతి నుండినయీశ నీ, తరుణంబున నన్నుఁ గాచు । దమనుఁడు పేర్మిన్. 550

ఆ. గౌరవంబుతోడఁ । గ్రాలి నేఁ బితృమాతృ
గురులఁ బ్రత్యహంబుఁ । గొలుచుచున్న
వాఁడ నైతినేని । పావకుం డత్తఱిఁ
గరుణతోడ నన్నుఁ । గాచుఁగాత. 551

ఉ. మానసకర్మవాక్యముల । మాన్యుని సద్గురువర్యు నెన్నఁడున్
మానుగ నిందచేయకయ । మాటికిమాటికి నామహాత్మునిం
గానఁగ నేగి భక్తి మదిఁ । గ్రాలుచునుండ భజింతునేని నన్
బూనికతోఁ గృశానుఁ డొగిఁ । బ్రోచు నటంచని ధీరవృత్తిమై 552

చ. శపథముఁ బట్టి యాకరణి । సంయమిబాలుఁడు దీక్షమీఱఁగాఁ
గపటములేనిభావమును । గ్గైకొని సత్యముఁ బల్కె నాయెడన్

గృహ మదిలోఁ జెనంగొన సుకీర్తనుఁ డై విలసిల్లుపావకుం
దపగతదీప్తిఁ జెన్నలరు నట్టిసరస్వతిఁ బంపె జెచ్చెరన్ 553

క. జ్వలనప్రేషితరై యా, జలజాసను రాణి యపుడు సకలాశలయం
దు లలితనిజతనుకాంతులు, చెలఁగను సాక్షాత్కరించి శిష్టచరిత్రా! 554

సీ. అసురునిచేఁ జిక్కి యట్టియాభూసురుఁ గని పల్కె నో విప్రగణ్య! యిప్పు
డీబాధనుండి నిన్ బృథుదయ విడిపింతు భయపడ కే నాఁగి బాలి నీదు
విహ్వాగ్రమందుండి చెనటియాసిదైత్యునకు నట్లు క్షేమంబు నలిగలుగునొ
తద్విధానము నెల్ల దయఁ జెప్పఁగలదాన నందున ముక్తుండ వగుదు వనుచు

ఆ. నాసురారికనుల కగపడ కేరితి, ననుచు మాయ మయ్యె నంత నవని
దేవసూనుఁ డట్టి బిలికులజానిఁ జూచి, పలుకఁ దొడఁగె నిట్లు పరమమాని!

క. దురులకు నీకును గలదు, ష్కారకలుషము నడఁచి పుణ్యచయమును శివమున్
గర మొనరించెడినుతినే, స్థిరభక్తి వచింతు వినుము తివిరి నిశాటా! 556

తే. అస్తమయమందు మధ్యాహ్నమందుఁ బ్రొద్దు
పొడుచులతి బాలకుఁడు దీని భూరిభక్తి
వెలయుచుండ జపింపనా విపులతుష్టి
శాంతికరమైన దై యిది జగతి వెల్గు. 557

క. శ్రీమంతుఁడు గోవిందుఁడుఁ, గామితఫలదుండు నైన కమలాక్షునకున్
వేమఱు మ్రొక్కెద నస్మ, ద్భీమాఘము నణఁచు నతఁడు ప్రీతి చెలంగన్.

క. వరదుండు హృషీకేశుఁడు, స్థిరుఁడు జనార్దనుఁడు వాసుదేవుఁడు నగుమా
వరునికి మ్రొక్కెద నాదు, ర్భరపాపముఁ బాపు శౌరి పాయనికరుణన్. 559

క. సకలోరుచరాచరగురుఁ, డకళంకుఁడు శేషశయనుఁ డధిపుం డగుచ
క్రికి మ్రొక్కెద నాదుష్కృత, నికరము నాశౌరి పాపు నెఱిదయమీఱన్.

తే. పరమదేవుండు పరముఁడు భద్రుండు
శార్ఙ్గియును స్రగ్ధరుండును శంఖచక్ర
ధరుఁడు నైనట్టి హరికి వందన మొనర్తు
నామహాత్ముఁడు నాకలుషాళి నడచు. 561

క. దామోదరుం డుదారుఁడు, సామజవరదుండు నైన చక్రికి నుతి నే
వేమఱుఁ జేసెద నాగుణ,ధాముఁడు నాకలుషవితతి దయఁ బాపు నొగిన్.

తే. స్తుత్యసుతుఁడును సంతత సుగుణశీలుఁ, డచ్యుతుం డబ్జనేత్రుండు నైనహరికి
భక్తి మ్రొక్కెద నాశౌరి పాలిమిగుల,నస్మదఘములనడచుఁ బ్రియత్నమతిని.

క. నారాయణుండు హరియును, శౌరియు మధుసూదనుండు సజ్జనుఁ డగుచై
త్యారికి మ్రొక్కెద నస్మ, త్క్రూరాఘము నామురారి కూరిమిఁ బాపున్.

ఉ. శ్రీకరదైత్యహారుఁడు శ్రీకరపుండును మహా
భుజాఁడు కంసగర్వ భుజగగరుఁడు
నఘరుండు నైన హరి కేను మ్రొక్కెద
నలఁడు పాపు నస్మ దభుము నెవుడు 565

క. వతుఁడు శ్రీవత్సాంకిత, వతుఁడు శ్రీకుంతు శ్రీనివాసుండు సుశా
శ్వతుఁ డగుశౌరిని నలి, దీతుగ గావింతు నఘముఁ ద్రెంచు నతఁ డొగిన్

తే. సర్వభూతాధినాథుఁ డతఁడునైన, చక్రి నేమానివర్యులు చాలఁ దలఁతు
రట్టిభూనాథునింగూర్చి యధికభక్తి, శరణుఁ జొచ్చెదఁగలుషప్రశాంతికొఱకు.

సీ. నలి నఖిలాలంబనంబుల మాను లేవాసుదేవాఖ్యుని భావకుని
గాఁ జేసి తలఁతురొ కడిమి నావైకుంఠు శరణుఁ జొచ్చెద నేను సంతతంబు
నఖిలజగంబుల కాధారుఁ డగువాఁడు సర్వభూతమయుఁడు సర్వగుండు
వాసుదేవుఁడు పరబ్రహ్మంబు నగుపరాత్పరునకుఁ జేసెద వందనంబు

తే. నధిపుఁ డవ్యక్తుఁడును బరమాత్ముఁ డైన
మాధవుఁ గవులు తలఁచి కర్మక్షయంబు
నందు ముక్తినిఁ గందురొ యట్టిశౌరి
శరణమునుఁ గోరి మ్రొక్కెదఁ బరమభక్తి. 568

క. మును తెవనిఁ జెంది పుణ్యాంబుధు గని పాపముల వాసి భువిపై జన్మం
బునుఁ జెంద రట్టిశార్ఙ్గి, ననిశము శరణాగతుండ నగుచున్నాఁడన్. 569

క. పరమేష్ఠి యగుచు మానవ, సురదానవసమితితోడ శోభిలు జగముఁ
గరము సృజించెడు నచ్యుతు, శరణముఁ జొచ్చెదను భక్తిసహితాత్ముఁడ నై.

తే. వారిజాసనుముఖములవలన నట్టి
కారికాయంబు శ్రుతి చతుష్టయమయంబు
నైన బ్రహ్మత్వమునగను స్తుత్యంబు నయ్యె
నట్టిహరి కేను మ్రొక్కెద నతులభక్తి 571

వ. సృష్టియందు బ్రహ్మరూపియు జగద్యోనియు జనార్దనుఁ డగువాసుదేవుని
గూర్చి శరణాగతుండ నగుచున్నాఁడ. భూధరుండును దేవరక్షకుఁడును రాక్ష
సనాశకుఁ డగువారికి నమస్కరించెద విష్ణు లేవరదుని సవనభావనుఁ డగుయ
జ్ఞేశునిఁగా దన్నములందు మిన్నగ యజింతురో యాయజ్ఞపురుషునకు మ్రొక్కెద.
కాలరుద్రుఁ డై యేపరాత్పరుఁడు పాతాళస్థాదిసకలభూతంబుల హరించుచుం
డునో యట్టి జగదీశునకు వలగొనుచున్నాఁడ 572

సీ. నిర్మితంబులు నైననిఖిలవిష్టపములఁ గాలుఁ డై మ్రింగి యేభగునుఁడు దుష్ట
వృత్యంబు సలుపుచు నెగడునో యట్టిదైత్యప్రభేదిని వంతన మొనర్తు

నరసురగంధర్వ|నాగనభశ్చరతరుగుల్మనగకీట|దంతశూక
పశ్వాదు లేవాని | పరమాంశభవములో సరవి నా శౌరి | శరణుశరణు
ఆ. హరికి మించినట్టి | దైనవస్తువు కొంచె
మైన లేదొ యువని|యందు సకల
ముందు నెవఁ డనంతుఁ | డొగి సర్వగుఁడొ యట్టి
వాసుదేవునకును | వందనంబు 573

తే. కట్టెలం దగ్ని దాఁగిన | కరణి నెపుడు
సకలభూతంబులందు నే | చక్రి వెలయు
నట్టివిష్ణుఁడు నాసమ|స్తాఘసమితిఁ
బాపి నిత్యము నన్నేలుఁ | బరమదయను

క. చర మచరము బ్రహ్మాదులు, కర మెటువారిమయము లగునొ | కడఁగెడు తెలివిం
శౌరి నడచెడిదగు నాదు, ర్ఘరపాపం బట్టె నశ్వ|రము నై పోవున్. 574

చ. సరవిశుభాశుభంబులును | సత్వరజస్తమసు ల్సమస్తదు
స్తరతరజన్మకర్మగణ|సంభవకల్మషము ల్నిశాహ్నభా
స్కరపరమోదయాస్తమయ|కాలకృతాఘముఁ గర్మవాక్యహృ
త్కరపటుపాపజాలములఁ | గంజదళాక్షుఁడు వాపి ప్రోవుతన్. 575

సీ. శయ్యాగతంబు లై | సకలాఘములు లేచి సంచరించెడి వేళ | సంభవించు
కలుషచక్రంబులు | కాయజమురితము లజ్ఞానజనితంబు | లైనపంక [వ్రజిన
ములు జ్ఞానకృతకర్మ|ములు మదకృతదోషములు చంచలాత్మతో | మొనయు
సంఘము లెల్ల శ్రీ|శౌరినామోచ్చారణంబున నిత్యము | నశ్వరంబు
ఆ. లగుచునుండు మఱియు | నన్యదారావిత్త
బంధునాశవాంఛఁ | బరఁగుదుష్కృ
తంబు నన్యపీడఁ | దనరుపంకము హరి
స్మరణమునను మిగుల | సమయుఁగాక! 577

క. సురదీనసాధుగణములఁ, బోరిఁ బోరిఁ గాఱించ దానఁ | బుట్టిన పాపో
త్కరములు నశించు దామో, దరునామస్మరణమునను | దథ్యముఁ గాఁగన్.

ఆ. భోజ్యపేయభక్ష్య|భూయిష్ఠచోష్యవి
లేపనములఁ గల్గు | పాపగణము
లయముఁ జెందుఁ జూడ | లవణభోజన మెట్టు
లప్పులందు మ్రగ్గునట్లు మిగుల. 579

సీ. బాలకౌమారయౌ|వనవార్ధకములందు జన్మాంతరములందుఁ | జాలఁ జేయఁ
బడినపంకము కృష్ణ|వాసుదేవాచ్యుతనారాయణాసుర|నాశనేత్ర

గోపాలగోవిందగోవర్ధనోద్ధారనరసఖ యనుకీర్తనంబువలన
జలగతలవణభాజనము తైవడిని నశించు మహామునిసేవ్యుఁ డజుఁడు

ఆ. హరుఁడు వాసుదేవుఁ డక్షరుండు మహాశి
వుండు వరజనార్దనుండుఁ గృష్ణుఁ
డైనచక్రపాణి కనవరతము నేను
మ్రొక్కుచున్నవాఁడ మెనయభక్తి 580

తే. పాపకర్మఘ్నుఁడును గంసవైరియును న
రిష్టకేశిముఖామరరిపుహరుండు
భక్తజనపోషకుం డగుపరమశౌరి
పాదములఁ గూర్చి మ్రొక్కెదఁ బ్రత్యహంబు. 581

ఉ. వారిధియందు సేతువును వావిరి నవ్వఁ డొనర్చె నేమహా
పూరుషుఁ డాటి హైహయుని పొంగు నడంచె నెవండు సర్వదే
వారియు నాబలీశువిభవాతిశయంబు గ్రహించె నట్టికం
సారికి మ్రొక్కువాఁడఁ జెలువారెడి భక్తి చిగుర్చుచుండఁగన్. 582

ఉ. రామనృపాలుఁ డై యెవఁడు రావణు మంత్రిసమేతుఁ గాఁగ నీ
భూమినిఁ గూల్చె నేఘనుఁడు పొంగుచు నందునిగోకులంబులోఁ
బ్రేమ నటించి పూతనను భీషణమూర్తుల నొప్పురాక్షస
స్తోమముఁ జంపె నట్టిమధుసూదనుఁ గూర్చి నమస్కరించెదన్. 583

తే. రక్షకా! దేవదేవ సుసేవ్య యనుచు!
నిట్టిస్తోత్రరాజంబు నెలమి నరుఁడు
భక్తితోడ జపింప నాఁ ప్రత్యహంబు
ఘోరపాతకనాశంబు కొలకు నిజము. 584

క. జ్ఞానాజ్ఞానకృతంబులు, నైనమహాపాపరాసు లన్నియు మఱి యి
ష్టానిష్టార్జితకలుషా, భ్యాసస్థితి యడఁగు దీన ధరపై మిగులన్. 585

ఆ. ఇద్ది యజ్ఞహోమ పృథుజపాదులఁ గల్గు
పుణ్యఫలము యోగిపుంగవులకుఁ
దీర్థవీటియందు దెలఁగెడి యానపా
త్రంబుకూడికఁ బుణ్యదంబు నగుచు. 586

చ. జనుఁ డొకవత్సరంబు తిలసంభృతపాత్రములం బదాతిటా
ధనములతోడ విప్రులకు దానముఁ బ్రత్యహముందుఁ జేయునే
ఘనతరమైన పుణ్య మిలఁ గ్రాలునొ యాస్తుతి శ్రద్ధతోఁ బఠిం
చినయెడఁ దత్సమానఫలసిద్ధియుఁ గల్గును సత్య మారయన్. 587

తే. అసుర! చెడనట్టి బ్రహ్మచర్యమున నరుఁడు, నళిననాభుని సంస్మరణము నొనర్చి
చెందు వారివిష్టపంబు నేఁ జెప్పినట్టి, యిద్ది పుణ్యాలవాలమై పెద్ద వెలయు.
తే. భక్తి నేఁ బల్కినట్టి యీభద్రవినుతి, లేశమైన నబద్ధంబు లేని దగుచు
సత్యమున నొప్పనేని రాక్షసునిచేతఁ, బట్టుపడినట్టి నామేను వదలు గాక!
వ. ఇట్లు తెలిపిన నారక్కసుండు విప్రుని వదలె నంత నామునిబాలుఁడు వాని కిట్లనియె 590
సీ. దానవ! విన వోరి! దమనచోదితయై యరుదెంచి నాకివ్వేళయందు నిలిచి
పద్మాసనుని రాణి భాషించినట్టి యీదైత్యారిసారస్వత స్తవంబు
భక్తితో నీకు నేఁ బలికితి నిది సర్వభయశాంతికరంబునై ప్రజ్వరిల్లు
నీమహాస్తవముతో నీవు కేశవుఁడును జగదీశుఁడైనట్టి శౌరిఁ గొల్వ
ఆ. మామురారి స్తుత్యుఁడైన నీశాపంబు, పాతిపోవు నిజము ప్రత్యహంబుఁ
గనకవసను దీనఁ గడిమి నారాధింపు, సర్వపాపవితతి సమయుఁ బిదప 591
ఉ. ఈనుతి ఘోరపాపముల నెల్ల హరించు నిజంబు స్తుత్యుఁడై
దానవవైరి యైనహరి తద్దయుఁ గష్టము వాపి మోక్షముం
గానుగ నిచ్చునన్న విని మాటికి నాతనిఁ జేరి మ్రొక్కి యా
దానవుఁ డంత నాకరణిఁ దాల్మి నొనర్పఁ దలంచి పూన్కిమై. 592
వ. అక్కాలమందు. 593
శా. సాలగ్రామముఁ జేరి యాస్తవముఁ జంచద్భక్తితో నిత్యముం
వాలాయంబు పఠించుచుం సకలదేవప్రక్రియాసక్తుఁడై
త్రిల్లోలుం డగుశౌరిఁ గూర్చి తపము నిష్ఠాత్ముఁడై చేసి పా
పాళిం వేగమె పాసి పొందె విమలం బావిష్ణుసాయుజ్యమున్. 594
చ. మునివర! విప్రవక్త్రమునఁ బొల్పెసలారిన వాణిసత్కృపం
బొనరి వచించినట్టిదియుఁ బుణ్యకరం బగునట్టియీస్తవం
బును దయ నీకుఁ జెప్పితినిఁ బూర్ణఁపు భక్తిని దీని నేజనుం
డనితరబుద్ధితోఁ జదువు నాతనిదుఃఖములెల్లఁ బోయెడున్. 595
క. అని యిట్లు పులస్త్యుం డన, విని భక్తి మనంబులోన వెలయఁగ వనజా
సనుపుత్త్రుఁడైననారద, మునివర్యుం డతని గాంచి పూన్కి వచించెన్. 596
క. మునినాథ! నీవు చెప్పిన, వినుతస్తోత్రంబు నేను వింటిని గురుభ
క్తిని నాడురితంబులు నా, శన మయ్యెను బుణ్య మబ్బె సంతస మలరెన్.
వ. ఇట్లు తెలిపి తరువాతి స్తవంబులు భాషింపు మనుటయు 598
చ. దురితలతాలవిత్ర! బహు దుర్జనకానన వీతిహోత్ర! ని
ర్జరనుతిపాత్ర! భూరితర చైత్ర! వలాహకతుల్యగాత్ర! శం

కరవరమిత్ర! శాంతగుణ - గణ్యచరిత్ర! పవిత్ర! దివ్యభా
స్కరకులదీప! సారశర - చాప! మహేశ్వర! జానకీశ్వరా! 599

ఉ. అంగజభంగసంగ! పర - మాంగ! నిశాటవిపత్పరంపరో
త్తుంగ! నిరామయాంగ! బుధ - తోషణభాషణరంగ! దేవతా
చంగ! కృపాంతరంగ! కలుష - ప్రకరోత్కటఘోరమూర్తిమా
తంగ! ధరాత్మజాహృదయ - తామరదీపితభృంగ! రాఘవా! 600

మానినీవృత్తము. సోమపురందరసాధ్యమునీశ్వర - సూర్యముఖామరవంద్య! లస
ద్ధామ! మణిప్రకరాంచితవాటక - దామ! హిమాచలధీరసమా!
భీమతరోన్నతరాక్షససంచయ - భీమపయోధరతుల్యతను
శ్యామ! నృపాలలలామ! బుధేశ్వర! - సంతతమంగళ! రామవిభూ! 601

గద్య. ఇది శ్రీరామకరుణాసమాసాదిత కవితాప్రాభవ హారితసకులాన్వయప్రభవ, రామవజ్ఝలవంశసాగరసుధాకర కొండయకుమార బుధజనవిధేయ కొండయ నామధేయప్రణీతమగు తెలుఁగువామనమహాపురాణమందు దశమస్కంధము.



శ్రీరస్తు.

శ్రీసీతాలక్ష్మణభరతశత్రుఘ్నహనుమత్సమేత శ్రీరామచంద్రాయ నమః.

# తెలుఁగు వామనపురాణము.

## ఏకాదశస్కంధము



శ్రీకరగుణగణమాలా!
పాకారిప్రముఖదేవవరగణపాలా!
భీకరదుర్జనకాలా!
ప్రాకటతేజోవిశాల! రామనృపాలా! 1

క. అవధారు పులస్త్యముని, ప్రవరుఁడు నారదున కధిక బంధురసాహో
ద్భవదోషప్రశమనసం, స్తవముల రెండిటినిఁ జెప్పఁ సాగెను బ్రీతిన్. 2

### ఈశ్వరకృతపాపప్రశమనస్తవము.

క. శ్రీరమ్యమందిరా! వి, స్తారయశోదార! దురిత తతిసంహారా!
సారాచారవిచారా! నారాయణ నీకు వందనం బొనరింతున్. 3

దండకము. శ్రీమానినీచిత్తచోరా నిరాకార భక్తాలిహృత్పద్మసంచార దేవాదిదేవా జగన్నాథ దామోదరా వాసుదేవా మహాదేవ సత్యాభిరామా కృతావర్త యజ్ఞధ్వజానంత ధర్మధ్వజా ధర్మవాసా మహామూలవాసా మహానాథ కాలాధ్యనాథా మహావర్త వైకుంఠ కాలధ్వజైకాధ్య శృంగా జయంతా లసత్పద్మగర్భా జలావాస శ్రీవాస శక్రంజయా పృశ్నిగర్భా మహావాక్పతిశ్రీప్రియా కాలనేత్రా మహాకల్ప సర్వాత్మ సర్వేశ నిత్యేశ, నీలా మహానీల కాలాత్మ భూతాత్మ విష్ణూ వరేణ్యా వృషాంకా ధరాధార భద్రంజయా గోధ్వజా వృష్ణిమూలా బలాధ్యక్ష పద్మాక్ష హైరణ్యగర్భా గదాశంఖచక్రాన్వితా మానవాధ్యక్ష సామస్వరూపా భ్రమాంసాత్మ సూక్ష్మాత్మ వేదాత్మ కర్మాత్మ యజ్ఞేశ యజ్ఞాత్మ బ్రహ్మాభిధానా మహాసేన, దివ్యాహృషీకేశ శ్రీకేశవా పద్మనాభా మహాకేశ సన్మంతికేశా గుడాకేశ మృత్యుంజయా ద్వాదశాత్మానిరుద్ధా జగద్వీర దుష్టారిసంహార సంసారదూరా సదాచార స్వర్ణాద్రిధీరా పయోరాశిగంభీర పీతాభకేశా రమేశా నిరాశా నమస్తే నమస్తే నమః. 4

క. విజయా విష్వక్సేనా, సుజనాకర పురుషవర్య । సుస్థిరవీర్యా
గజరాజవరద ధర్మ, ధ్వజ రవిశశిదహననేత్ర । రమ్యచరిత్రా!. 5

క. సత్యవృషధ్వజసంతత, కాత్యాయన ముఖ్యమౌని । గణసంస్తుత్యా
నిత్యయశోహారశుచివ్రత, నిత్యజగత్పాల ధర్మ । నిలయ నతియిదే. 9

క. భూరిపృథుశ్రవబహుళ, ల్పారమ్యాగార ధీర । పాలా విమలా
సారార్ష్ణి వేషణా భూ, భారహరా సతతభూరి । భావా! జోరల్ 7

తే. ఆదిమధ్యాంత రహిత సు।రాధినాథ, దివ్యదేవ శుచిశ్రవ । దీప్తభావ
కాలకాల ధనంజయ । గణ్యాగణ్య, పరమశూరపురంజయ । వందనంబు 8

సీ. కల్పనాముఖహారి । గాఢఘోరభీకర కాలపాండురచేల । కాంతిజాల
వరకేశ పరమేశ । పద్మజేశ జయేశ హర్షకారకభూత । హంసరూప
శార్ఙ్గధ్వజాధోక్ష।జా వామనామ ధుచ్ఛేదకా సాహస్ర । శీర్ష బ్రహ్మ
శీర్షసహస్రవి।చిత్రసాహస్రనేత్ర ప్రభాకర కోటి । తరణితుల్య
ఆ. బహుశశీర్ష భూరి । బలధర్మనేత్రమ, హాసునేత్ర దుష్ట । హర సహస్ర
పాదకర సమస్త । పాపనాశనకర, పరమశూర నీకు । వందనంబు

తే. క్రతువరాహప్రభారూప । గరుడవాహ, విశ్వదేవ శివాత్మక । విశ్వజనక
విశ్వరూప మహాదీప । విగతకోప, పరమపూరుష! మ్రొక్కెద । భక్తినిగుల.

వ. నిర్వికారా! నిరాభాస! ప్రత్యగాత్మస్వరూపా! నీకు వందనములు 11

తే. చెలఁగి యీవిశ్వమెల్ల నీ।చేతఁ గల్పి
తంబు నయ్యెఁగదా వట।తరువు దాని
శాఖలును బల్లవంబులు । స్కంధపత్ర
సముదయము నీవె మ్రొక్కెద । సరసిజాక్ష! 12

చ. మొదలు ధరామరుల్ నృపులు । బోదెలు కొమ్మలు వైశ్యు లంఘ్రిజుల్
పదిలము లైనపట్టులయి । భాసిలుచుండు వటస్వరూప నీ
పదములకేను మ్రొక్కెదను । బాధము లెల్లను బాపి నిత్యమఁగా
ముదము చెలంగుచుండఁగను । బ్రోవుము పాపహరా మహేశ్వరా!. 13

సీ. సాగ్నులై చెన్నారు । సర్వవిప్రులు నీముఖంబున బటులెర।కాండసహితు
లగునృపుల్ హస్తంబు।లం దుద్భవించిరి పార్శ్వరుతలముల । వైశ్యగణము
పుట్టెను వరపద।ముల శూద్రులును నేత్రముల సూర్యుఁడును మహా।పుణ్యపదము
లందు భూమియుఁ జెవు।లందు దిక్కులు నాభియం దంతరిక్షమ్ము । నాత్మయందు
ఆ. నబ్జవైరి యసువు।లందుఁ దెమ్మెరలునుఁ, గోర్కెవలన బ్రహ్మ । కోపమునఁ బు
రారి శీర్షమందు । నమరపురం బుద్భ, వించె గాదె పరమ । విశ్వరూప! 14

క. అనలుం డింద్రుం డానన, మున నోషధులంత రోమములు పక్షులు వి
ట్టునఁ బుట్టె నీకు విరజలఁ, దనరిన నీకేను మ్రొక్కెదను పద్మేశా!. 15

సీ. ప్రణవరూపుఁడ వీవ । స్వాహావషట్కారవౌషట్స్వధాస్వధా । భద్రవాక్య
ములు నీస్వరూపమై । యొనయ సర్వాకారుఁడవుదు నిరాకారుఁ । డవుదు వీవ
భద్రవాసుఁడ వీవె పరదేవుఁడవు వేదమయుఁడవు బహుతీర్థమయుఁడ వీవ
యజ్ఞమయుండవు । యజ్ఞపూరుషుఁడవు యజ్ఞభాగభుజుండ । వగుదు వట్టి
ఆ. నీకు వందనంబు । నెఱి దశశతధార, ధరుఁడ వీవు నూఱు । ధార లొనరు
వాఁడ వైననీకు । వందనం బొనరింతు, బరమపూర! ప్రోవు । కరుణమెఱయ.

వ. భూర్భువస్స్వస్స్వరూపుండవు, గోదామృతప్రదుండవు, బ్రహ్మాధరుండవు, సర్వాధ
రుండవు, బ్రహ్మణ్యుఁడవు, పరబ్రహ్మవు, శబ్దబ్రహ్మంబ వగునీకు నమస్కరిం
చెద. 17

ఉ. విద్యవు వేద్యరూపుఁడవు । విచ్యుతసారుఁడ వీవు వందనీ
యాద్యుఁడ వక్షరుండవు మహాత్ముఁడ వీవాగి భూరి సద్గుణా
పాద్యసుబోధ్యహవ్యవహ । పావనసర్వసుపూజ్యదేవతా
రాధ్యనిరామయా సకల । రాజమహేశ్వర ప్రోవు మ్రొక్కెదన్ 18

సీ. బుద్ధియు హోమంబు । పుణ్యంబు హవ్యంబు హాయియుమానుండవు । హోతవీవు
పాతవుఁ బోతవుఁ । బూతవు హంతవు హవ్యమానుండ వీ । వరయ నెపుడు
హర్తవు నీతియు । నగ్ర్యుండు విశ్వధార్యుండు నీ వగుదువు । రూఢిఁగాను
విశ్వధాముండును । విశ్వభావుండును సృక్స్రువంబులు నీవె । శిష్టచరిత
ఆ. యాజకుండ వీవె । యజ్ఞేశ్వరుఁడ వీవె, యజ్ఞ మీవె సర్వ । యాగఫలము
నీవె జ్ఞాన మీవె । నిజముఁగా గోపాల, ధర్మచేల! నీకు । వందనంబు. 19

తే. యజ్ఞపాత్రారణేయుండ । వగుదు వీవు
నీలిసుఖమోక్షములు నీవు । నిఖిల మీవు
ధృతియు యోగంబు సత్యంబు । దివ్యపదము
నీకు మ్రొక్కెద నన్గావు । నిర్మలాత్మ!. 20

మ. యజమానుండవు నీద్యగణ్యుఁడవు యోగారూఢచిత్తుండ వీ
వజ రాధ్యుండవు సర్వగుండ వలిహార్ద్రాత్ముండ వీ వోమహా
సుజనావాస మహేశ భద్రచరణా । శోభాకరా కాలచ
క్రజనాధార నమస్కరింతు నను దీనుంగా ప్రోవుమా శ్రీహరీ!. 21

క. ఒకటిఁగ మూఁటిఁగఁ జెప్పఁగ, సకలంబును నిండినట్టి , చతురుండవు నీ
వకళంకుండవు జ్ఞాతవు, సుకరుండవు నీవు మిగుల । సుజనాధారా!. 22

క. జ్ఞేయుండవు ధ్యాతవు ది, వ్యాయుధుఁడవు నరుఁడ వీవు । హరిహారభూషా

తే. సారసనయనుఁడు రుచ్యుఁడు । చక్రహస్తుఁ
డధికకీర్తిధనుండు మ। హాభుజుండుఁ
గదియుఁ గిరప్రియుండు నా। కప్రశంసి
తుండు నగుకృష్ణు నేభక్తి। తోఁ దలంతు 44

సీ. శంకుకర్ణుండును । సారబలుండును భద్రాత్ముఁడౌ వీర। భద్రుఁ గొలుతు
వృషభధ్వజుండు మ। హేశుఁడు గురువిశ్వసఖుఁడు చంద్రాభుఁడు । సారసప్రి
యుండు సురేంద్రుఁడు। యోగియాగోవిందునకును మ్రొక్కెద నేను। ప్రకటభక్తి
దళశరశీర్షుండు । దానవారియుఁ గుందమాలాధరుండును । మామనోత్త

ఆ. భాస్కరుఁడయి గృత్తి। వాసుఁడౌ కాలాగ్ని
రుద్రునకును నేను । మ్రొక్కుచున్న
వాఁడ భాగధేయ । పరమేష్ఠికిని గురు
భక్తి నే నొనర్తు । వందనంబు. 45

క. హరిహరము సహస్రాక్షము, పరమం బగుకోకనదము । భద్రాత్ముఁడ నై
నిరతము నామదిలోపలఁ, గరము స్మరించుచును మ్రొక్కి । గణుతింతుఁ దమిన్.

క. గరుఁడాగస్త్యుల విష్ణుని, గురుఁడును బ్రహ్మోక్తమయుఁడు । ఘోరాఘమహో
త్కరహరుఁ డగుకపిలేశుని, వరభక్తిఁ దలంచి మ్రొక్కు।వాఁడను మిగులన్.

ఆ. కరచతుష్టయుండు । గరుఁడవాహుం డప్ర
తర్క్యుఁడును సహస్ర। దార్ఢ్యకిరణుఁ
డక్షరుఁడు దపోమ। యాత్ముఁడు నగుధర్మ
పతికి నే నొనర్తు । వందనంబు. 48

సీ. సర్వభూతగుఁడును । శాంతుఁడు సర్వలక్షణుఁడు నిర్మలుఁడు దు। ష్కరమహాఘ
హరుఁ డక్షరుండు న। వ్యక్తుండు బహుయోగ పరుఁడైన హరికిని । వందనంబు
నిర్గుణుండు విశిష్ట। నిలయుఁ డనాకారుఁ డజుఁడు నిరంజనుఁ । డక్షరుండు
పరమశరణ్యుఁ డౌ। పంకజాక్షున కేను మ్రొక్కెద నిత్యము । మొనయుపూన్కి

ఆ. ననుచుఁ గుంభజాతుఁ । డాడె నీ ప్రశ్నసంస్తవము నిద్ధఘోర। సకలపాప
హరము పావనంబు । నగు దీనిఁ జదివిన, వినినవారి కెల్ల । వెలయు ముక్తి. 49

బలిక్రులు కురుక్షేత్రమునకు నరుగుట.

క. మునివర! హిరణ్యకశిపుని, తనయుఁడు తీర్థములఁ గూర్చి । తలభక్తిని తో
యున వెనుకఁ గురుక్షేత్రం, బును గన బలిచక్రవర్తి । పోయెను బూన్కిన్.

వ. అర్తతీ కుక్రుండు. 51

ఆ. అట్టిపుణ్యభూమి। యందున్న భూదేవ, వరులనెల్లఁ బిలువఁ । బనుప నంత
నాలకించి భార్గ। వామంత్రితులు నయి, శాకుకంబు మతులఁ । గ్రాలుచుండ. 52

సీ. కురుజాంగలస్థలిఁ గొమరారువారును దత్త్వజ్ఞులును దపోధనులు నైన
కశ్యపాత్రేయాది ఘనమును లేతెంచి శుక్రునితోఁ గూడి సొరిది ధనదు
దెసయందు మిక్కిలిఁ దేజరిల్లు శతద్రవీనదికినిఁ బోయి వేడ్క నలరి
యానదీజలమందు నాయెడ మున్గుచుఁ బితరుల వేల్పులఁ బ్రీతులుఁగను
ఆ. జేసి రవికరవిచ్యుతిఁ జెలఁగి పుణ్య
కరము నైనట్టి కిరణాపగను నిరావ
తికినిఁ జని యాజలంబందుఁ దివురు పూన్కి
మునిఁగి పిమ్మట వా రతిమోద మొప్ప. 53
క. వావిరి భూరిపరోక్షి, పావనజలమందుఁ గ్రుంకి బహువిస్మయసం
భావితనిజబింబమ్ముల, నావనమధ్యమునఁ గాంచి యయ్యెడ మౌనీ!. 54
ఆ. నీటనుండి లేచి నెఱి దానిఁ గ్రన్ననఁ, గాంచి వింతతోడఁ గ్రాలునట్టి
చిత్తసరణి వారు చెన్నారి స్నాతులై, వారి విడిచి బయట వచ్చి పిదప.
చ. చనుచు నిదేమొకో యనుచు శంకను వారు పరస్పరంబుఁగా
మనములలోనఁ జింతిలుచు మాటికి మాటికి నాడుకొంచు నా
వినుతమహాస్థలి న్విడిచి విస్తృతభక్తిని బోయి దవ్వునన్
వనచయశోభితంబునగు భాసురవాసముఁ గాంచి రాయెడన్. 56
సీ. అనిశ మాయదిఘనమగుచును ఘనదళశ్యామమై పథులశ్రమును బాపు
నదియు నైయున్నతి నడరుచు మిన్నంది సుమఫలవృక్షసంశోభితంబు
నగుచు దశార్ధబాణాళిసన్నిభము లౌచుక్కల మిక్కిలి సొంపుఁ జెందు
వినువీథికైవడి వెడవెడ విలసిల్లి రక్తోత్పలంబుల రహిఁ జెలంగి
ఆ. పద్మవనమువలెను భాసిలునట్టిఁ దు
శిష్టభూమి వారు చెన్నుమిగుల
నంచగుములు సరసి యందుఁ జొచ్చిన మాడ్కిఁ
జేరి రధిక తుష్టిఁ జేవఁ గులుక. 57
వ. మునీంద్రా! వినుమా భూస్థలమందు ధర్మరూపమున జగదర్చితమగు చతుర్భువ
నపాలవర్గముల పుణ్యాశ్రమంబు కలదు దానికి దూర్పుదెస మోఁదుగు
చెట్లతో నిండినదగు ధర్మాశ్రమంబును, దక్షిణంపుకడ రంభాశోకవనయుతం
బగు కామ్యాశ్రమంబును, బడమరఁ బుణ్యవనాశ్రమంబు, నుత్తరమందు శుద్ధ
స్ఫటికసన్నిభంబగు మోక్షాశ్రమంబును గలవు. ఆయాశ్రమంబులఁ గృత
త్రేతాద్వాపరకలియుగాంతములయందు నొకమోక్షకామియగు మహర్షి
నిర్మించె నద్దాని నాశరహితులగు భార్గవాదులు చూచి యంత. 58
చ. పరమజలప్రపూర్ణమయి భాసిలు నాస్థలమందు వా రొగిన్
స్థిరరతి నిల్చి యక్కడఁ బ్రతిష్ఠితుఁ డాద్యుఁ డఖండనాముఁడున్

వరదుఁడు విక్రముండు నగు / వారిజనేత్రుని బ్రహ్మచర్యదు
ర్ధరగురుయోగసేవలను / భక్తినిఁ గొల్చుచునుండి రో మునీ! 59

చ. ఇరవిటు శుక్రయుక్తులయి / గాఢవ్రతీశుఁ జెలంగి యామునీ
శ్వరులొగి నాల్గురూపముల / వర్తిలు మావరుఁ బెద్దనిష్ఠతోఁ
బరఁగి భజించుచుండ నట / భాసిలు మానులు దైత్యభీతులై
యరిగి రఖండపర్వతము / లై సకలాళులఁ గూర్చి చెచ్చెఱన్. 60

తే. అత్రికుత్సమరీచిపా / ద్యన్యవిప్ర
వర్యులారీతి యమునాప్ర / వాహవారి
యందుఁ గ్రుంకి భయంబుచే / నలరి దక్షి
ణాభిముఖులై రయంబున / నరిగి పిదప. 61

క. వినుతావంతీదేశం, బునకును జని యట వెలుంగు / పురుషోత్తముచెం
తను నిలిచి నిర్భయస్థితిఁ, దనరారుచు నుండి రద్ది / ధారణియందున్. 62

క. హరిసుప్రభావశక్తి, స్ఫురణను జెన్నారుచుంట / సురవిద్వేషుల్
గురుభయమున నాచోటికి, దిరుగనివారైరి మిగుల / ధృతిచెడి మౌనీ! 63

తే. వాలఖిల్యాదులైనట్టి / బ్రహ్మచారు
లంత నాదైత్యభీతికి / నవశు లగుచుఁ
బుణ్యమగు రుద్రకోటికిఁ / బోయి శంక
రాశ్రితస్థితి నుండిరి / హర్ష మొప్ప 64

## కురుక్షేత్రమందు బలి హయమేధ మొనర్చుట

క. విను మిట్లరిగి రసాదులు, చనఁ గవిభార్గవుల వాజి / సవవిధిలో ని
ల్పినవాఁడై గురుతాంలిగా, దనరెడి బలిదైత్యనాథుఁ / దన్మఖమందున్. 65

సీ. సవనదీక్షితుఁ జేసి / సవిధిఁ దానంతన యాదైత్యవిభుఁడు శ్వే / తాంబరముల
వరశుక్లమాల్యలేపనముల ధరియించి దివ్యమృగాజిన / దీప్తపుష్టుఁ
డై రహి బర్హిపత్రాభిరామవిచిత్రకుండు నై వెల్గుచు / ఘోరవాజి
కంధరతురమయు / ఘనబాణముఖదైత్యగణసదస్యులతోడఁ / గడఁగుచుండ
ఆ. చెక్కువనితలందుఁ / జేరఁగన్నదియును, నాబలీశుభార్య / యైనదియు సు
పార్శ్వదివ్యపుత్రి / యైనవింధ్యావళి, యాగకర్మదీక్ష / నలరె నంత. 66

ఉ. భాసురశుక్లవర్ణమున / బంధురశాశ్వతలక్షణంబులన్
వాసినిఁ గాంచునట్టి దగు / వాజిని భూస్థలి సంచరింప ను
ల్లాసముతోడఁ బంపెఁ గవి / శ్లాఘ్యులు మెచ్చఁగ దానివెంట వి
త్రాసగతిన్ జనన్ గడిమి / రాగిలి తారకనేత్రుఁ డాయుడన్. 67

మ. అనఘా! యామఖమందు భార్గవునిచే / యజ్ఞాశ్వ ముత్సృష్టమం
బానర స్వామునెల ల్పునన్ గడిమి కై / పొల్పారుచున్నట్టిల

ర్జను వైశ్వానరుఁ డుండ యుగ్మగతుఁడై । సప్తార్చ్యుఁ డేపార ము
ర్జనులౌ రాక్షసులెల్లఁ బూదికులు నై । రాగిల్ల నావేళలోన్. 68

వామనుం డుదయించిన నలువ స్తుతించుట.

చ. సురజనయిత్రి ప్రాప్తసుతసుందరుఁడౌ పరమేశుఁ గాంచె నా
దరుణమునందుఁ బద్మజాఁడు । తాపసవర్గముఁ గూడి వచ్చి ని
ర్జరవరుఁడు న్మహేశ్వరుఁడు । త్ర్యాధరుఁడు న్ఖగవంతుఁ డౌరమా
వరుఁ గని మౌనియుక్తుఁడయి । భక్తిని నిట్లు నుతించె నారదా! 69

క. శ్రీపురుషోత్తమ! పావన, పాపహరా! సత్యరూప! । పరివ్యాప్తశోభా
దీపిత! విశ్వాకారా!, భూపా! మ్రొక్కెదను నీకుఁ । బూర్ణపుభక్తిన్. 70

ఉ. వైరిగణేంధనప్రకట । పావక! పాపమహాకరీంద్రదు
ర్వారమృగేంద్ర! లోకగణ । భావన! సారసలోచనా! మహో
దార! సమస్తవిష్టపవి । ధాయక! హాటకచేల! విశ్వరూ
పా! రమణీయ! భోగహర! । పావన! మ్రొక్కెద నీకు భక్తితోన్. 71

క. వరద! జనార్దన! ధర్మా, కర! సర్వాధార! ఘోర । కలుషవిదూరా!
పరమేశ్వర! కరుణాకర, నరసఖ! నీకొఱకు వంద । నం బొనరింతున్ 72

సీ. నీవు రక్షకుఁడవు । నీవు గోప్తవు సర్వవిశ్వాత్మకుఁడ వీవు । విశ్వనాథ!
నీవు సర్వగుఁడవు । నీ వవ్యయుండవు సర్వాధారివి నీవు । సత్య మీవు
నీవు భూధరుఁడవు । నీవు వర్ధితుఁడవు దేవపూజ్యుఁడ వీవు । దేవదేవ
వర్ధిష్ణుఁడవు నీవు । వాసుదేవుఁడ వీవు పరమపావన నీవు । వాసవునికిఁ
ఆ. గలిగినట్టిదైన । కన్నీరు వోవఁగాఁ, జేయు మీవు సత్య । శీలుఁడవు వి
ధాత వీవు సంవి । ధాతవు హంతవు, సకలమౌనిపాల । సాధులోల! 73

ఆ. యోగి వీవు భూరి । యోగశాయివి నీవు
సర్వ మీవు విబుధ । జాలవినుత
వారజనార్దనా! మహాలయ! గతలయ!
నే నమస్కరింతు । నీకు భక్తి. 74

క. అనఘా! మగిడుం డీవిధి, వినుతించిన సంతసించి । విశ్వేశ్వరుఁ డి
ట్లని యుపనయనము చే నా, కును జేయుము చేద్క నిపుడు । గుణరత్ననిధీ!.

వ. ఇట్లు పురాణపురుషుం డన విని మహామునివర్యులును దపోధనులు నగు భార
ద్వాజకాశ్యపప్రముఖులు భక్తి నాసర్వేశ్వరునకు జాతకర్మాదిక్రియల జరిపించి
రయ్యెడ వామనునికిఁ బులహుండు జందెమును బులస్త్యుఁడు శ్వేతవస్త్ర
యుగ్మంబు నగస్త్యుఁడు మృగాజినంబును, భారద్వాజుండు మొలనూలును బ్రహ్మ
సుతుఁ డగు మరీచి మోదుగుదండమును వారుణి జపమాలను, నంగిరసుండు

పట్టుగోచిని వేడి వెలుఁగు గొడుగును భృగుమహర్షి పాదరక్షలును భూరితే
జస్వి యగుబృహస్పతి కమండలువును గ్రమక్రమంబున నొసఁగి రయ్యెడ. 76

ఆ. భూరిభావనుండు । భూతేశ్వరుఁడు భగ
వంతుఁ డాద్యుఁ డఖిల । వంద్యుఁ డైన
వరదుఁ డిట్టు లట్టి । వారిచే నుపనీతుఁ
డగుచు దీప్తితోడ । నలరుచుండె 77

సీ. తర్వాతఁ దా భర । ద్వాజమహామునివలన నంగిరసుని । వలన నంత
పారమహాఖ్యాన । సంభృతంబును మహోదార్థసుస్వరంబు గాం । ధర్వమైన
సామవేదంబును । సక్రమంబుగ నొక్కనెలలోనఁ దెలిసి మ । నీషి యగుచు
వేదార్ణవస్థితి । వెలసి లోకాచార వృత్త్యర్థమై యిట్లు । విమలబుద్ధి
ఆ. విద్దెలందు మిగులఁ । బెద్దవాఁడై సర్వ, శాస్త్రనైపుణమునఁ । జాల నలరి
యవ్యయుండు నతఁ । డాత్ముఁడు దేవుఁ డా, వామనేశుఁ డంతఁ । బాలి మెఱసి.

క. ఘనుఁ డైనభరద్వాజున, కనెను మహోదయముతోడ । నలరారెడి దా
వినుతకురుక్షేత్రమునకుఁ, జనునట్టి యనుజ్ఞ నిడుము । సంయమిచంద్రా!. 79

చ. బలి యటఁ బుణ్యదంబయిన । వాజిమఖంబును జేయసాగె నా
స్థలమునఁ బర్వతేజములు । చాల వెలింగెను జూడు మెవ్వి మ
ల్లలితమహాంశధర్మపట । లప్రవిధానము లయ్యెనో కనఁ
దెలియుదు వాని నన్నిటిని । దీపితచిత్తమునందుఁ దాపసా!. 80

క. నీవెట్టిఁ డుగుడువని మది, భావింపకు తెలియు దైత్య । పతియా బలి యా
పావనకురువిభుభూమి, న్నావిరి నీమాడ్కి నున్న । వాఁడని మౌనీ!. 81

క అని యిట్లు వామనుం డన, విని భారద్వాజుఁ డనియె । విశ్వేశ్వర! యా
జ్ఞ నిడంగాఁ గూర్చుండుము, చనెదము మఱి బలి దితిజు । జన్నముఁ జూడన్.

క. ఏరేచోటులలో భవ, దీయాకారములు కలవొ । తెలియుట కో ఱి
నాయమునఁ గోర్కె పొడమెను, బాయనిదయ వానినెల్లఁ । బలుకు మురారీ!.

క. నారద! యిట్లన హరి యనె, ధీరా! యేయునికిపట్ల । దీప్తింగనే వి
స్తారాకారంబులఁ జెన్నారెదఁ జెప్పెదను వాని । నాలింపు మగున్. 84

సీ. వసుమతీపుష్కర । పాతాళవననిధిస్వర్గసుస్త । పర్వతము లన్న
దనురూపకస్థితి । నలరెడునవతారములతోడ నిత్యము । నెనయుచుండు
నెవ్వారు దివ్యులై । యొసఁగి రెవ్వరు ధరఁ బొడమిరి జలమందుఁ । బుష్కరమున
నెవ్వారుఁ దిరుగుదు । రెవ్వి స్థావరము లా నెవరు భాస్కరవాస । వేందువరుణ
ఆ. కాలదహనలోక । గణపాలవాణీశు, లైరొ యట్టివార । లంద అపగ
తాంగతతిఁ దనర్పు । నట్టినావలన భూ, పూరణంబుతోఁ బెఱుఁ । దొసఁగి రనఘ!.

క. ధర సన్నిహితులు నగుచుఁ, బురుషులు పుణ్యులు సమస్తమునికర్త్యురుని
ర్జరపూజితు లగుదురు తత్స్మరణము దర్శనము కలుగుటలఁ బాపు చెపన్. 86

క. మునిచంద్ర! మానసహ్రద, మున నాతోలిరూప ముండు భువినది సంస్ప
ర్శనకీర్తనాదివిధితోఁ, ననిశము సర్వాఘనాశమై విలసిల్లున్. 87

క. ఘనమా కార్ముకరూపము, బూనగఁ గౌశికసమాఖ్యఁ బొందిన నది చెం
తను భూరిపాపదయనా, శనకరమై యద్దివగలఁ జాల వెలుంగున్. 88

సీ. అనఘ! కృష్ణానదియం దలరారును హయశీర్షమూర్తియు హాస్తినాపు
రంబందు గోవిందరమ్యరూపంబుందు వెల్గుఁ గాళింది త్రైవిక్రమంబు
తనరును లింగభేదంబందు భవవిభుమూర్తి భాసిలుచుండుఁ బుణ్యమైన
శౌచ కుబ్జామ్రల సన్మాధవములందుఁ గేదారమందును గృష్ణమూర్ధ
తే. జార్ధరూపంబు మిగులఁ జెన్నారుచుండు
వటులు నారాయణాఖ్యరూపంబు బదరి
కాశ్రమంబున వారాహమందు దీప్తి
వెలయు గరుడధ్వజంబు వివేకధుర్య!. 89

క. విమలజయేశ్వరరూపము, ఘనలీలవిలసిల్లు భద్రకర్ణమున విపా
శను గాంతివిరాజి నిత్యముఁ, దనరారు ద్విజప్రియంబు ధరణిస్థలిపై. 90

క. పరఁగు నిరావతిసన్నిధిఁ, బరమంబగురూపధారి భాసిలుచుండుం
గురుదివ్యక్షేత్రంబున, సరవికురుధ్వజము వెలయుఁ జంచత్కీర్తిన్ 91

క. కృతశౌచమున నృసింహము, తతదీప్తిఁ జెలఁగు విశ్వధారయుఁ బుణ్యో
న్నతమగుగోకర్ణంబున, సతతము రాణించుచుండ సరసగుణాఢ్యా!. 92

సీ. ప్రాచీనమందుఁ గపాలంబు వాసిల్లుఁ బుండరీకము వెల్గు భూరివారి
హంసపదంబందు హంసస్వరూపంబు పరఁగు విశాఖయూపమున నజిత
మొప్పుఁ బయోష్ణియం దోగి యమఖండంబు తమిఁ గుమారిలయావిలస్తనలరు
మణిపుటీహ్రదమందు మానితమగు శంభుమూర్తియు బ్రహ్మణ్యముఖ్యతీర్థ
ఆ. మునఁ బ్రజాపతియును బొల్పారు మధునదిఁ
జక్రధరము వెలయు త్ర్యంబకేంద్ర
ముందు శూలహస్త మనుమూర్తి నిత్యము
వెల్గుచుండు మిగుల విలలితాంతి. 93

వ. మునీంద్రా! ఔషధసానువందు విష్ణ్వాఖ్యవలన భృగుతుంగక్షేత్రమందు సువర్ణ
నామమున నైమిశంబునఁ బీతవాసాభిధేయమున గయాస్థానమందు గోపిత,
గదాపాణి త్రైలోక్యనాథ గోప్రచార వరదకుశేశయాభిధానములవలన నేపా
రుచుండు; నాదతీరనగమునం దర్ధనారీశ్వర ముందు నుత్తరమున గోపాలను

, 58

రాజిల్లు. మహేంద్రగిరిమీఁద సోమపీఠి వెలుఁగొందు. సహ్యపర్వతమున శైలం
కముఁ జారియాత్రాద్రిఁ బరాజితముఁ గోకర్ణదేశమందు. దపోధనదేశ
మగు విశ్వమూర్తియు మలయకుధ్రమందు సౌగంధియు వింధ్యపాదమందు
సదాశివంబు నవంతివిషయమున ధిష్ణ్యాకారయు నిషధయం దమరేశ్వరంబుఁ
బాంచాలమందుఁ బాంచాలికస్వరూపంబు విలసిల్లు మఱియు. 94

చ. పరమమహోదయస్థలిని । వాజిముఖంబగు మూర్తినొప్పు శ్రీ
కరఫలదప్రయాగమున । గణ్యపదంబున యోగశాయియై
పరఁగెడిమూర్తి వెల్గు మధు । బంధురకాననభూస్థలంబులోఁ
గరము స్వయంభునామమునఁ । గ్రాలుచు నుండును మౌనిశేఖరా । 95

తే. అబ్జగంధాఖ్యతోడఁ జె । న్నారుపుష్క
రస్థలంబందు నిత్యము । రమణఁ గాశి
యందు భూదేవకులగణ్య । మగుచు నాది
కేశవాకార మలరారుఁ । గీర్తి మిగుల 96

క. దానిన యవిముక్తం బని, మానవులు సమస్తదేవ । మాన్యులు పెద్దల్
మౌనులు నిత్యశ్రద్ధా, ధ్యానులునై సంతతంబుఁ । దలఁతురు మిగులన్ 97

క. వననిధి బడబాముఖమను, ఘనతరనామంబుతోడఁ । గ్రాలుచు వపపం
పసువెల్గుఁ బద్మకిరణా, ఖ్యను నిత్యము దీప్తితోడ । గణ్యంబగుచున్ 93

ఆ. ధరణిపైఁ గుమార । ధారబహ్వాశసం, జ్ఞను జెలంగుచుండుఁ । గార్తికేయ
మనెడిపేరుతోడ । నలరు బర్హాణమందు, భాసమానమగుచు । భద్రమూర్తి ।.

క. వినుతంబగు కురుజాంగల, మున స్థాణుత్వంబుతోడ । మొనయును దీప్తిగ
దనరెడిరాజస్సందున, మనసిజహరు మూర్తితోడ । మానుగ నలరున్. 100

సీ. కిష్కింధపురియందుఁ । గెరలెడిమనుజాలు వనమాలినంచు నా । బ్రస్తుతింత్రు
శంఖగదాచక్ర । సహితమై శ్రీవత్సచిహ్నితమును వీర । సేవ్య మగుచుఁ
గువలయారూఢమై । గుణగణోదారాంగ మగుచు నర్మదయందు । నలరుచుండు
నమలమాహిష్మతి । యందు హాంతకాశన త్రినయన మూర్తులఁ । దేజరిల్లు
ఆ. నర్బుదంబునందు । నమలత్రిసౌవర్ణ, మగుచు సూకరాఖ్య । నలరు కొండ
యందు క్ష్మాధరంబు । ననునట్టిపేరుతోఁ, జాల వెలయుచుండు । సంయమీశ।.

వ. మఱియుఁ బ్రభాసతీర్థమందుఁ ద్రిణాచికేతు, కపర్ది, శశిశేఖరమూర్తులతో
మిగుల రంజిల్లుచుండు. 102

క. ఇనశశిధ్రువనామస్థితి, ననిశము నుదయాద్రి నలరు । హాటకకూటం
బున హైరణ్యాక్షము శర, వనమున స్కంధప్రకీర్తి । భాసిలుచుండున్. 103

క. ఘనమగుచున్న మహాలయ, మున రుద్రాకారమునను । శోభిల్లెడు

విసుతోత్తరకురుభూములఁ, దనఘస్థితిఁ బద్మనాభుఁ । డగుచుండు మునీ! 104

ఉ. వావిరిహాటకాఖ్యఁ గడు । వాసినిగాంచుచు నుండు సప్తగో
దావరియందు నిత్యమొగిఁ । దత్థ్సలమందు రుహాంసనామసం
భావితమై మహేశ్వరత । భాసిలు శోణమహాస్థలంబులోఁ
బావనధర్మసత్క్రపచ । బంధురమూర్తిఁ జెలంగు నిత్యమున్. 105

క. కుండినపురమందున్నతి, నుండును నాసార్పణంబు । సురుతరశోభా
మండితమగు భిల్లీవన, మండలిఁ బహురోగమూర్తి । మానుగ వెల్గున్. 106

క. పురుషోత్తమంబు మంత్రోత్కరములలో వెల్గు విప్ర । గణ్యప్రియమా
వరవిశ్వమూర్తికాంతిఁ, బరఁగుఁ బలభద్రావతరణ । వసుధాస్థలిపై 107

క. సుమహితసూర్యారకతీ, ర్థమునఁ జతుర్బాహుమూర్తి । రహిమాధవవా
సమున సుధాపితముకుదీప్తము నై సంతతము మిగుల । భాసిలుచుండున్.

క. యమునాతటమున శ్రీకం, ఠమును గిరివ్రజమునందు । దర్శించుచుండుఁ
విమలంబగు పశుపతిరూ, పము సుస్థిరశోభతోడఁ । బరమమునీంద్రా! 109

సీ. దండకావనమందుఁ । దనరు వనస్పతిమూర్తియు రూఢిగా । భూరిదీప్తి
కాలాంజరమునందు । ఘనతరనీలకంధరము రాజిలుచుండుఁ । దద్దసరయూ
వం దుత్తమస్థితి । నలరుమహామూర్తి యరతిమహాకోశ్య । మందుఁ బాహ
హారణమై వెలుఁగొందు । హంసయుక్తంబురుశిష్టగోకర్ణద । క్షిణమునందు

తే. శర్వమందుఁ బ్రజాముఖ । చారుతీర్థ
వాసమున వాసుదేవంబు । ప్రజ్వరిల్లు
దగ మహాగౌరవంబు వింధ్యస్థశిఖర
మందుఁ జెన్నారుచుండు నిత్యంబుదీప్తి. 110

క. అనఘాత్మా! కంధస్థల, మున మధుసూదనము కూట । భూధ్రశిఖరమం
దునఁ జక్రపాణి మూర్తియు, ననిశముఁ జెన్నారుచుండు । నతిదీప్తిమెయిన్. 111

వ. లోహదండమందు హృషీకేశముఁ గౌశలమున మహోదయము సురాష్ట్రదేశ
మందు మహావాసమూర్తియు నవరాష్ట్రమందు యశోధనరూపము దేవికానదీ
తీరమున భూధరమూర్తియు, విదేహయందుఁ గుశప్రియము గోమతియందు
ఛాదితగదిస్వరూపము శంఖద్వారమందు శంఖయు సైంధవాటవియందు సునే
త్రంబు, శూరపురంబున శూరంబు, నహిరణ్వతియందు రుద్రాఖ్యమూర్తియుఁ,
త్రివిష్టపమున వీరభద్రము శంకుకర్ణస్థలంబున నీలాభరూపంబు శాలవనమందు
భీమాకారము ఘటితమున విశ్వామిత్రమూర్తియుఁ, గైలాసమందు వృషభ
ధ్వజము, శుక్లప్రభాభాసితంబునై ప్రకీర్తి నలరారుచుండును. 112

ఆ. మహిలశైలమున హిమప్రభ నేపారఁ
గాయమూర్తి యొకటి । కడునలభ్య

పుణ్యతీర్థమందుఁ । భాస్వరగోమిత్ర
నొందు దీప్తితోడ । నొప్పుచుండు. 114

క. మునినాయక! సింహాళమునఁ, దనరు నుపేంద్రంబొకండు । దారిఁ జక్రాహ్వం
బునఁ గుందమాలి వెలుఁగును, వినుతంబై జగములందు । విస్తృతకాంతిన్.

మ. బలిసద్మంబున వేయిశీర్షములతో । వర్తిల్లి కాలాగ్నిసం
కలితంబై గజచర్మవస్త్రయుతమై । కన్పట్టురూపంబు భా
సిలుచుండుం; సుతలంబునం దచలమై । శిష్టోరుకూర్మాఖ్యను
జ్జ్వలమై ముక్తకరంబునై వెలయుఁ గస్మద్ద్వారిక మోతాపసా!. 115

వ. వితలమునఁ బంకజాసనాకృతిగను, మహాతలమందు మహావృషభేశ్వరాకారం
బుగను, దలమున సహస్రశీర్షభుజంబుల నేపారి ముసలాకృష్టదానవంబగుచు
సహస్రాఖ్య గలదిగను రసాతలమందు యోగీశమగుచు హరిశంకర మయం
బైనదిగను మన్మూర్తి రాజించుచుండు వినుము 116

సీ. భూతలంబందుఁ । దనరుఁ గోకనదంబు వసుధమీఁదను జక్రపాణియగుచు
నలరు భువర్లోకమందు గారుడమూర్తి రాజించు స్వర్లోకమందు నవ్య
యంబు విష్ణుమయంబు । నామహాలోకంబునందు దీప్తి నగస్త్యమగుచునుండు
జనవిష్టపంబున । సత్కపిలాకృతి నలరుఁ దపోలోకమందు సత్య

ఆ. యూతము వాఙ్మయంబు । యోగ్యంబు సకలంబు
నైనమూర్తి వెలయు । ననిశ మబ్జ
భవునిలోకమందు । బ్రహ్మస్వరూపమై
యస్మదీయమూర్తి । యలరు ననఘ!. 117

క. శైవమునందు సనాతన, మై వర్తిలు వైష్ణవంబు । నందాద్యంబై
కేవలపరబ్రహ్మము, నై వావిరి వెలయుచుండు । నతిదీప్తిమెయిన్. 118

ఆ. అనఘ! నిర్గుణంబునందుఁ దపోమయ
మగుచు నప్రతర్క్యమై నిరాకృ
తిని మహోన్నతముగ । దీపించు నామూర్తి
సంతతంబు సత్యసంధ లెన్న 119

సీ. అతుల జంబూద్వీపమందుఁ జతుర్భుజ మొనరుఁ గుశద్వీపమునఁ గుశేశ
యంబు ప్లక్షద్వీపమందు ఖగేశ్వరవాహనంబను పేర । వఱలుఁ గ్రౌంచ
మందొగి బ్రహ్మనాభాఖ్యతోఁ దనరారు శాల్మలద్వీప విశాలభూమి
గరుడధ్వజంబునై । క్రాలు సహస్రాక్షమగుచు శాకద్వీప । మునను నంతు

ఆ. వామనస్వరూప । భాసిత మైయుండు
సర్వనగములందు । సకలవితత

మైనసర్వభూము।లందు నామూర్తులు
బహుళశిఖలగుచు మిగులఁ । బ్రజ్వరిల్లు. 120

వ. మునీంద్రా! శాలిగ్రామమున సకలము నేనై యున్నవాఁడ నిప్పు డాడినట్టి యీపుణ్యమహాలయంబులు సనాతనములు బ్రహ్మప్రదంబులు తేజోభిరామములుఁ గీర్తనీయములుఁ బాపనాశనంబులు నై యుండు నీమహాస్థానములసంకీర్తనంబువలన నాస్థలస్థదేవతల సందర్శనంబువలన మనుజులు నిర్ధూతపాపులై ధర్మార్థసిద్ధిఁ బడసి దేవత్వమున మోక్షము నొందెదరు నీకు సేవసించునట్టి పుణ్యనివాసముల నన్నింటిని జెప్పితి నింక మహాసురుఁడగు బలిచక్రవర్తి చేయుజన్నమునకు దేవహితార్థమై పోదము లెమ్మని యిట్లు వామనుండు భారద్వాజమునికిఁ బల్కె నంతట. 121

వామనుఁడు బలిసభాభూమికిఁ బ్రయాణమగుట.

క. కురుజాంగలమ్మునకు శ్రీ, ధరుఁ డామునినాథుతోడఁ । దనరినవాఁడై
సురుచిరగమనస్థితితో, నరిగెను సంతోషమాత్మ । నలర మునీంద్రా. 122

ఆ. వాసుదేవుఁ డపుడు । వచ్చుచుండఁగ నంతఁ
బుడమి తిరుగసాగె । భూధ్రసంఘ
మెగురఁ జొచ్చెఁ గడలు । లెల్ల క్షుబ్ధము లయ్యె
గగనవిష్టపములు । గతుల దప్పె. 123

సీ. మధువిరోధియునైన । మాసతీనాథుఁడు చనుదెంచి తెలిసిన । శాంతిసేమి
చేయకుండున మహాత్మాలిపుఁ డా బలిచేత నేఁ బ్రదగ్ధస్థితి । నెగడితేని
యలుకతో నేమైన । నాడఁడో కో యని జన్నమాకులముతోఁ । జాలఁ జెలఁగ
మఱియుఋత్విక్సన్మంత్రాహుతులతోడ నలరుతదాసురీ । యాహుతులును

ఆ. భక్ష్యములు ద్విజేంద్ర । వారప్రదత్తంబు
లై చెలంగుచున్న । వైనవాని
నపుడు కోరకున్న । వయ్యె నగ్నులు హరి
భయమువలన నలరి । భాగసరణి. 124

వ అంత. 125

క. మునివర దారుణరూపం, బున నలరెడునానిమిత్తములను గని బలి శు
క్రునితోఁ గృతాంజలియు నై, వినయంబున మ్రొక్కి పలికె విస్మితుఁ డగుచున్.

చ. కరువలిచేతఁ గొట్టఁబడి । కంపముఁ జెందెడిరంభమాడ్కి వి
స్తరగిరివృక్షజాలమునఁ । జాల చెలంగెడిభూమి యేలొకో
పరువడి సంచలించె సుర । వైరులభాగము లాహుతంబులం
గరువలిమిత్రుఁ డేయడను । గైకొనఁ డూన నిదేల భార్గవా! 127

తే. అబ్ధు లేలొకో క్షుబ్ధంబు । లయ్యె నింటఁ
బూర్వవిధమునఁ జుక్కలు । పొదలవేల
దెసలు చీఁకట్ల నేలొకో । తేజరిల్ల
నెట్టిదోసంబుతో నిట్టు । లెసఁగెఁ జెపుమ. 128

క. అని యాకైవడి బలివిభుఁ, డనునుడి విని శుక్రుఁ డంత । నాహేతువు నా
త్మను దెలిసి పలికె దైత్యా, వినిపించెద నీకు దాని । వినుమా శ్రద్ధన్. 129

సీ. వసుదేవతనయుండు । వచ్చుచున్నండున నీమంత్రశాలికముల । నిప్పు డగ్ని
లో సఁగకున్నవి రాతు । సోత్తములకు నట్టి శ్రీహరిపాదవి । క్షేపమునను
నంతమై గిరియుతా । క్రాంతమై భూమియు దిక్కులు కంపించెఁ । దివిరిదాని
యందున్నమకరాల । యంబు లుద్వృత్తవేలాంతంబు లగుచుఁ బెం । పారసాగ
ఆ. దితిజు లెల్ల విగత । దీప్తులైరని యిట్లు, పలికినట్టి శుక్రు । భాషణముల
విని యతండు ధర్మ । విపులసత్యోత్సాహ, పథ్యసహిత మైన । పలుకు పలికె.

ఉ. భూసురవర్య! నాసవన । భూమికి శ్రీహరి వచ్చెనేని నే
వాసిని ధర్మకామముల । వర్ధిలు నేఁడునిఁ జేయనా మనో
ల్లాసముతోడ నీయెడను । లాలితరత్నసువర్ణవస్త్రస
ద్వ్యాసములందు దేని నడ । వచ్చునో నాకు నెఱుంగఁ బల్కు నా. 131

సీ. నిజహిత మైనదై । నీరజాక్షునకును బథ్య మై తథ్యమై । భద్రదంబు
నై ప్రియ మైనట్టి । దగు నెట్టివాక్యంబుఁ బలుకనర్హమె దానిఁ । బరమదయను
భాషింపుమా నీవు । పల్కెడుచందానఁ జేసెద వేఱుగాఁ । జేయననుచు
బలివిభుఁ డీమాడ్కి । వచియింప నాగురువాక్యంబు విని యంత । భార్గవుండు
తే. భూతభావ్యర్థముగఁ దన । బుద్ధిఁ గొంత
దాఁక యోచించి నుడివె నో । దైత్యనాథ
వేదవృష్టాగ్ర్యమార్గులౌ । విబుధవర్యు
లెల్ల నీచే బహిష్కృతి । నెసఁగి రిపుడు. 132

చ. వినుము శ్రుతిప్రమాణముగ । వేల్పులు యాగవిభాగదివ్యభో
జను లటుకాన వారికిని । శౌరి హితం బొనరింపఁ బూని వ
చ్చెను సవనంబుఁ గూర్చి తమిఁ । జెచ్చెర వచ్చెడు నామురారికే
లని సముకూర్చవచ్చునని । పల్కెటి వాస్థితి నాలకింపుమా. 133

ఉ. ఆనలినాయతాక్షునకు । నధ్వరభూధనరత్నవాజిస
మ్మానితవస్త్రవాహనవి । మానము లైనఁ దృణాగ్రమైన నే
మైన నొసంగరాదు హిత । మానుడి యూరక నీవు పల్కఁగా
నా నెడఁ దీయ శక్తుఁ డగు । నారయ నీకు వరంబుఁ గాంతమై. 134

క. తారణ మేమున వినుమా, వారిజదళనేత్రు కుక్షి వననిధిభూదే
వారామాదులు నిరత్యము, వారితమగు దీప్తితోడ భాసిలుచుంటన్ 135

ఆ. ఇట్లు శుక్రుఁ డాడినట్టివాక్యము నాతఁ, డాలకించి బలికె సర్థిజనుల
కెద్దియైన నిచ్చుకేలను నీమాట, యందు నాకుచిత్త మలర దిపుడు. 136

సీ. విను హీనవృత్తితో వెలసి కదా యర్థి చనుదెంచు యాచింప జగతియందు
నట్టిదావృత్తి నాయచ్యుతుఁ డేటికి వరుడెంచునట్టు జనార్దనుండు
విష్ణుపేరుండైన విష్ణుఁ డేతేర లేదని యిట్లు పల్కుడు నట్టి విబుధ
సత్తమ శుక్రతము నై చాల నాయది ధాత్రిఁ జెన్నారు నే నట్లు చెప్పఁగలనె

ఆ. తాన దానిఁ బల్కు గన్న్య లౌవిప్రులయందు సాధుభావ మలరు టర్థ
మగును భూరివాంఛ నడరెడువానిచే, నద్ది నిజము దృశ్యమైనకతన 137

క. విను పూర్వాభ్యాసమున, న్మనుజాలకందటుకు యోనిమధ్యగములు వా
త్తనుచిత్తములగు కర్మము, లొనఁగూడుచునుండు మిగుల నుర్విస్థలిపై. 138

ఆ. మున్ను మలయగిరిని మొనసెడికోశకా, రాత్మజాని ప్రవృత్తి మగుపురాణ
గాథనెల్ల నీవు కరమర్థి వినకున్న, వాఁడ వేమొ చూడ భవ్యశీల. 139

చ. పరమమునీశ! యిట్లు బలి పల్కిన భార్గవుఁ డాడె నోమహా
సురవర! కోశకారసుతు శోభనపుణ్యపురాణగాథను
స్థిరమతిఁ జెప్పెమా వినఁగఁ జెన్నలరారెను గోర్కి నాకు నీ
తరుణమునందన న్వని యతెం దన శుక్రునితోడ నిట్లనన్. 140

## కోశకారసుతుఁ డగునిశాకర చరితము.

క. దనుజాచార్యా! యాకథ, వినిపించెద నేను భక్తి వినుమా శ్రీరా
ఘునుఁడగు ముద్గలమునికిని, దనయుం డొక్కఁడు జనించెఁ దజ్ఞులు మెచ్చన్.

ఆ. అతఁడు కోశకారుఁ డనుపేర ధాత్రిపై, నడరుచును దపోధనాన్వితుండు
ధీరవరుఁడు జ్ఞానదీపితమూర్తియు, నై నిరంతరంబు నతిశయిల్లు. 142

సీ. ధర్మశీలయును వాత్సల్యయనసుతయును భవ్యభావయుఁ బతివ్రతయు నైన
ధర్మిష్ఠనామసుందరి వానికిని సతి యయ్యె నాసతియందు నామహర్షి
కతికిని బ్రకృతితో బలిసి జడాకృతిఁ బొదలెడిసూనుండు పుట్టె నట్టి
బాలుఁడు మూర్ఖుని వలె నేమి భాషింప కంధునిచందాన నవని మీఁద

తే. గనుఁగొనం దయ్యె నంతటఁ గలిగినట్టి
వాఁడు నంధుండు మూర్ఖుండుఁ బండితుండు
నై నతినయునిఁ బొడఁగాంచి యతనితల్లి
దైనధర్మిష్ఠ దుఃఖిత యగుచు నపుడు. 143

క. అరయ నాతివదినమున, ద్వారంబున వైచె నంతఁ బరుషతమ దుష్టా
చారయు ఘోరాభ్యాయు శిశు, హారిణియగు దనుజభామ యాఘ్రాటి గాగన్,

ఆ. పాపహీనుఁడైన । స్వసుతునిఁ గొనివచ్చి, చూచి పిదప నాత్మ । సుతుని విడిచి
కౌశికారు పుత్త్రుఁ । గొని వేగ చనెఁ దిన, విపులశైలగుహకు । వేడ్క నపుడు.

క. అరుదెంచినట్టి నిజసుం, దరి గని యామగుహమగఁడు । దర్పితుఁడు ఘుటో
దరనామధేయుఁ డగుక, ర్బురుఁ డాయెడఁ బలికె నిట్లు । పుణ్యమునీంద్రా! 146

చ. వనితరొ యేమి తెచ్చితివొ । పల్కవె నీవన నాపె చెప్పె నో
దనుజవరేణ్య! నేను జని । ధారుణిలో విహరించి కౌశికా
రునిసుతుఁ గాంచు నక్కడ వి । రూపుఁడు నానిజపుత్త్రునుంచి చ
య్యనఁ జనుదెంచితిం గుతుక । మాత్మఁ జెనంగొన నన్ను వాఁడనెన్. 147

ఆ. అబల నీవు చేసినట్టి యీపని శుభ, దంబు నగును యిట్టి । ధరణిదేవ
తనయుఁ డధికధర్మ । తత్త్వజ్ఞుఁ డలిగిన, శాప మొసఁగు మనకు । సత్యముగను.

క. వినుమా నీవా కారణ, మున నీతని విడిచి విశ్రుత । మూర్తియు నగుచుం
డిన మతిముకబాలునిఁ గై, కొని రా నీనేర్పుతోడఁ । గొబ్బునఁ జెలియా!

క. ఇటు లాదైత్యుఁడు పలికినఁ, బటురౌద్రియుఁ గామరూప । పరివృత యగునా
కుటిలాసురి యింటికి దు, ర్ఘటగతితో నగసిపోయెఁ । గడువడి నంతన్ 150

ఆ. విప్రవరునిగృహము । వెలి నిలువంబడి, నట్టిదైత్యసూనుఁ । డాననమున
చాటనవ్రేలునిచి । పొరిఁబొరి నేడ్చిన, సరవి నారవంబుఁ । జాల నేపు 151

సీ. అలించినట్టిదై । యుర్వ్యా డాధర్మిష్ఠ ప్రాణనాథునిఁ జూచి । బ్రాహ్మణేంద్ర
శుభశబ్దుఁడయ్యె నీ । సుతుఁడు చూడుము యని పలికి నివ్వెఱపాటు । వహిలమంది
రాంతరంబునుండి । యరిగె వేగముతోడ వర్ణరూపాదులఁ । బ్రబ్బురిల్లు
నిజసుతు పోలిక । నెగడెడు నాబాలుఁ గని నవ్వె యాకౌశి । కారుఁ డంత

ఆ. నాత్మసతినిఁ గూర్చి । యనెను భూతంబిటఁ, జేరి మనకు వెలుపు । చెలఁగునట్టు
వసుధపై స్వరూప । వంతుఁ డౌనొకబాలు, నునిచి చన నటంచు । నువిద తలఁతు.

మ. అని యీశైవడి భార్యతో నపుడు వి । ప్రాధీశ్వరుం డాడి ధా
త్రిని దర్పాన్వితపాణిగిచి యట నా । దివ్యార్భకు న్మంత్రశ
క్తిని బంధించెను పూర్వనేత్రములతో । దీపించుచున్నట్టి దా
దనుజస్త్రీ చనుదెంచి విప్రసుతు సు । ర్వస్థంబు నాభూమికిన్. 153

క. దూరమున నీడి మాయా, కారంబున నేగఁ గౌశి । కారుండు గుణా
ధారుం డగుతనసూనునిఁ, గూరిమిఁ గైకొనెను జేర్మి । కొమరార మునీ! 154

వ. తదనంతరంబున. 155

క. దనుజాంగన వచ్చినదై, తనతనయు గ్రహింపలేక । తల్లటపాటొం
దినమతి నట్టిటు తిరుగుచుఁ, బెనఁగొను నెవ్వగను నగడి । విభునకడకు వడిన్ 156

వ. అని యత్తఱి. 157

ఆ. వీడె పైకి వచ్చి । విస్తృతభక్తితోఁ, దల్లిపాదములకుఁ । దద్ద ప్రొక్కి-
నంత సాత్వికరూపుఁ । డగుసుతుఁ గని యామె, సంతసించి వాని । శ్రద్ధతోడ.

క. కౌని బంధుజనులకడకుం, జనిపలికెన్ నాత్మతనయ । సంగతి నెల్ల
న్వినిపింప నాఁటఁ దేలోకా, తనరారెను బాలమనుచుఁ । దగ మది పల్కెన్.

క. మున్నెట్టిది పాసఁగనో నా, కున్నతమతిఁ బల్కుమాత్మ । నొప్పారె ముదం
బున్న విని యామునీంద్రుని, చిన్నికుమారుండు భక్తి । చెలఁగుచునుండన్.

తే. కౌశికాఖ్యతోడను । గౌరుదుమిగులు
జనకునకు సత్యసహితయా । జనని కలఁడు
చిత్రమైనట్టి తనవార్తఁ । జెప్పె దాని
విన్నవించెద నాలింపు । విమలచరిత !. 173

సీ. జనక నామూఢాంధ । జడకారణము విను దేవవృషాకపి । దివ్యవిప్ర
మహితవంశంబందు । మాలాఖ్యసతికేను బూర్వకాలంబునఁ । బుట్టి పెరుగఁ
దండ్రి యంతట నన్ను । ధర్మకామార్థమోక్షాకరమైన వేదాంతశాస్త్ర
మును జతుర్వేదంబు । లను బురాణేతిహాసంబులఁ జదివింప । జ్ఞాని నగుచు

తే. బహుళవిద్యావిశారద । ప్రాభవుండ, నగుచు గర్వంబుతోడ నే । నలర దాన
విపులకల్మషవిగత । వేకదీప్త, మానసంబుల నేపారి । మగిడి దాన. 174

క. గురుమోహవార్థిఁ బడి దు,ర్భరజడభావంబువలన । బహుదోషినై
పరదారార్థగ్రహణము, నిరతముఁ గావించుచుంటి । నే నతికాంతున్. 175

- క. పరసతులఁ గూడినందునఁ, బరధనహరణంబువలన । బంధురపాపో
త్కరుఁడనయి చచ్చి యమకిం, కరబంధనమునకుఁ జిక్కి । కాలునిపురికిన్. 176

క. చని రౌరవాఖ్యనారక, మునఁ బడి వెయ్యేండ్లదాఁక । నోగులుచుఁ గష్టం
బున వెలసి భుక్తశేషతఁ, దనరుచు దోసంబు పెలఁగు । తతి నోజనకా !. 177

ఆ కాననమున ఘోర । కలుష యామ్యగతి
నగుచు నేను బుట్టి । వ్యాఘ్రచేష్ట
వఱలి యొక్కరితిని । బంజరంబునఁ బడి
నెగడువగను మిగులఁ । నోగులుచుండ. 178

క. నరవిభుఁ డొక్కఁడు నన్నుఁ దన, పురి- జేర్చిన బోనులోనఁ । బోరి ప్రొక్కి వ్యథగా
బరఁగుచు వ్యాఘ్రస్థితితో, నిరతము వర్తించుచుంటి । నిర్మలచిత్తా !. 179

క. కామార్థధర్మశాస్త్రము, లామనుజాధిపుసద్మ । మంతట వెలయగా
గావించి నేను వానిని, వేడుకు వినుచుండ నంత । విభుఁ డొక్కరతిన్. 180

సీ. ఒక్కదోవతితోడ । నొప్పి గదాపాణి యై పురివెలువలి । కరిగె నపుడు
ధరయను వేరుతోఁ । దెలఁగి రూపప్రతిమయు నై మహాదీప్తి । గలయునట్టి

ధరణీశ్వరునిసతి । ధవుఁడు పోయినవేళఁ గనుఁగొనుటకును నాకడకు రాఁగ
నాభామఁ గనుఁగొని క్రోధనంబునఁ బూర్వాభ్యాసమునఁ బెంపు సెందెను బుద్ధియందుఁ
తే. బంధకరుఁ డందువలన నేపాలిఁ గాను
శాస్త్రపద్ధతిఁ గానట్టి । చానతోడ
నగడుచతురోక్తులను గొన్ని । నీటుకులుకఁ
బలికితి వలపుమిన్నంద । వాని వినుము. 181

క. నవయౌవనసహితా! పార్థివతనయా! నిర్భయభద్రా! । దృఢనారకుతో
పావనించు పికమువలె న్నాకు వలలు మన మొప్ప నీవు । గొంటివి ధీరా! 182

క. వలరాజచేలిచిలుకా!, పలుకులు కంతుండు రేఁగి । బలువాడికరం
బులతో నవ్వుచు నిత్తఱి, బలిమిగాఁ గాతించె నన్నుఁ । బాలింపు దయన్. 183

తే. ఇట్లు రేసిన నామాట । నెలమి నద్ది
యాలకించి నమగాఁ గాంచి । వ్యాఘ్రిగన్య
మునకు రతితోఁగ మేలాగుఁ । బోనరు నన్ను
నాచకోరాక్షి తోడ నే । నవ్వు డిట్లు 184

చ. అనిత సుమధ్యమా! విపుల । మాదయ వాకిలి దీయు మావు నే
మనమలరార రాఁగలను । మాట లికేటికి నన్న నాపె నగ్
గనియని వ్యాఘ్రిమా పగటి । కాలమునం దాగి నెల్లవారుఁ గ
న్గానదరు రేయి ద్వారమును । గూరిమిఁ దీసెద నంత స్వేచ్ఛమై. 185

వ. మనము సంతసమున రమింతమని. 186

క. పలికిన నేనాడితి నో, కలికిరో! నామాట వినుము । కాలతమసం
బలరుట కోర్వదు మది వా, కిలిఁ దెఱచిన దానవగుచుఁ । గాఱిలెడికరుణన్.

ఉ. కట్టనత్రాడు కట్టులనుఁ । గ్రక్కునవీడఁగఁ జేయుమంత నే
డిట్టరి నై రమింప నరు । దెంతు ననన్విని యద్ది ప్రీతితోఁ
జొట్టిన వాంఛచిత్తమున । శోభిలఁ బంజరమందు గట్టిగాఁ
బెట్టిన మూఁతవాఁకిలిని । వేడుకఁ దీసెను మెల్లమెల్లనన్. 188

క. అనఘా ద్వారముఁ దెఱచినఁ, గని వెలుపలిచోటఁ గపుడ । కడువేగముతోఁ
జనుదెంచి నేను ఘనబల, మున నిగడాదిప్రపాశములఁ ద్రుంచి రతిన్. 189

క. మొనసెడివలపున వడి నా, జనపతిసతిఁ బట్ట నమిత । సత్త్వాలు నగు నా
మునుకొనిదూతలు నను, గని కరకరు లేచు నంతఁ । గ్రూర్యస్ఫూర్తిన్.

సీ. వచ్చి యత్తఱి నన్ను । వడిఁ జుట్టుకొని పటుముద్గరంబులచేత । మోఁది మిగుల
శృంఖలంబులచేతఁ । బృథుపాశములచేతఁ గట్టనే వారిని । గాంచి మీరు
నన్నిట్లు చంపుట । న్యాయంబు కాదన్న నామాట నాథుటు । లప్పు డెలమి
నాలించి వటవృక్ష । మందు నన్బంధించి ఖండింప మృతిఁ జెంది । కాలుపురిఁ

తే. తోయి పితరు నరకములఁ బరదారని
కుపణమునఁ జాలఁ । జెంది వేయి
హాయనములదాఁక । నట బాధలం గుంది
భుక్తశేషకర్మమున ధరిత్రి. 191

తే. అఖిలవిద్యావిశారదుం । డై వెలుంగు
నగ్నివేశాఖ్యవిప్రగృహమున శ్వేత
ఖరము నై పుట్టి తెలివితోఁ । గ్రాలి క్రీతి
నిత్యమూవాసమందున । నెగడి నేను. 192

క. భూసురవనితావాహ్యో, ద్యానితవిధి నుంటి నొక్కరతిని సు రాష్ట్ర
ఖ్యాసహితదేశజయు నా, భూసురసతి యైన వియతి । పొంగాడు మలిన్ 193

సీ. ఘన కాలయమునకుఁ । జన ముదిఁ గోరఁ దత్పతిదానిఁ గన్గొని । ఖాము యాఖ
రంబు నధిష్ఠించి । రహి నేగి పితృగృహమం దొకనెలదాఁక । నధికతుష్టి
నుండి యాపై నట । నొప్పారుచుండక రమ్మని పల్క నా రమణి యుట్టు
పలిచేతఁ బలుకఁగాఁ బడి గతబంధన మేపారు నామీఁద । నెక్కి వడిగ

ఆ. నెసఁగి యర్ధదూర । మేగి నాపై నుండి
డిగ్గి యేటిలోనఁ । దివురునీట
యందుఁ గ్రుంకుచుండ । నార్ద్రవస్త్రమున స
ర్వాంగసుందరమున । నడరుచున్న 194

వ. అచిలుకలకొలికిని దిలకించి వలరాజువాడితోలలకుఁ దాళఁజాల కేసరిగి పట్ట నా
బిడ పుడమి వ్రాలె నంత. 195

క. కడుఁదమి నాతురమతి నై, యదరుచు నావెలఁదిమీఁద । నత్యుద్ధతి నా
యెద వడిఁ బడ నాబిడ వెం, బడి వచ్చిననరుఁడు చూచి । పటుకోపమునన్.

ఉ. హస్తముచేతఁ గట్టెఁ గొని । యప్పుడ వాఁ డరుదెంచి కొట్ట నేఁ
ద్రస్తమనంబుతో నలరి । దాని వడి న్విడనాడి పోలి వి
ధ్వస్తముదంబున న్వెలసి । భాస్కరసూతిదిగాన నుండ నై
విస్తరమైనవేగమున । వెల్గుచు నేగగ నంత నో మునీ! 197

తే. వాఁడిరసనంబు వెడవెడఁ । బాఱుదుర్వి
దంబులకుఁ జొట్టుకొని నద్ది । లద్దఁ గ్రాఁ
హానికరమైన కలన నద్దాన నాలు
నికలు కదచడివలకు నోసెల్లె యంత. 198

క. నిరయప్రాప్తుఁడ నై యటఁ, బొరికష్టము లనుభవించి । ముక్తుఁడ నై యా
తరుణమునఁ జిలుకరూపున, ధరపై జన్మించి గగనతలమున నొకటన్. 199

క. మనములరఁ దిరుగుచుండం, గనుఁగొని యొకబోయవాఁడు । గ్రక్కున నసుఁ గై

కొని పంజరాంతరంబున, నునిచి దయాహీనబుద్ధి నొప్పార మునీ! 200

ఆ. భాగ్యశాలిరైన వణిగాత్మజాని కమ్మె
నంత నరఁడు మేడ నడరు చెలుల
కడను నిలుప నేనుఁ గడుసర్వశాస్త్రార్థ
విదునిమాడ్కిఁ దోఁప విగతుకీర్తి 201

క. నెగడుచునుండిన నటఁ గల, ముగుదలు దాడిమఫలాన్నములతో నను బా
గుగఁ బెంచుచుండఁ బెరుగుచు, బిగిబిగితో వెలయుచుంటి చెలువము మీఱన్.

సీ. అంతట నొక్కనాఁ డబ్జదళాక్షియు శుభయు సుశ్రోణియు సుందరాంగ
సహితయుఁ బృథుతర స్తనయు భాసురతనుమధ్యయుఁ జంద్రాఖ్య మహిళయధిక
వల్గుహాసినియగు వణిజానికూఁతురు పంజరంబును గొని పాలి నన్నుఁ
గరమునఁ గైకొని ఘననిజకుచయుగ్మమందుఁ బత్తమినుంచ నంత దానిఁ
తే. గలయు మది నెంచి రహిమించి కడిమి లలిత
గతిని మీఁదికి వలపుతోఁ గ్రాలి చనుచు
హారణవానరబంధన మందుఁ జిక్కి
యట మహాపాపమతినుండి యంత నీల్గి 203

క. కడుదారుణనారకమునఁ, బడి కష్టము ననుభవించి బహుదుర్గతితో
నడరి విముక్తస్థితిఁ బడఁ, బడి గోపతినగుచు నీచభవనములోనన్. 204

చ. కలిగితి నొక్కనాఁ డతఁడు గాదిలి బండికి నన్నుఁ గట్టి సొం
పిలెడి నిజాంగనామణిని వేడ్క నధిష్ఠితఁ జేసి కానన
స్థలికిని బోవుచో నొక్క మడిఁ జాలవెలుంగఁగ మున్నుఁ బోవ నా
చిలుకలకొల్క పృష్ఠమునఁ జెన్నలరారుచు నుండి యయ్యెడన్. 205

ఉ. గాన మొనర్పుచుం జనిన గాఢముదంబున నాలకించి నే
నూనశరాస్త్రజాలముల నోలుచు సంవ్యథితేంద్రియుండ నై
మానుగ వ్యత్యయస్థితిని మాటికి లాగుచు భూరివిభ్రమా
భానగతిం ధరాస్థలిని దద్దయు నాతణమంతె కూలితిన్. 206

తే. అపుడు నామెడఁగట్టినదైన పలుపు
తోడ నాచోట నాగిని బద్ధుండ నగుచుఁ
జచ్చి దుర్గతి వేయివత్సరము లుండి
జాతిసంస్మృతితో నిట్టిజగతియందు 207

మ. జనకా నీపరమాలయాంతరమునం జన్మించితే ముందుఁ బు
ట్టినజన్మంబుల నానుపూర్వికముగా డెందంబులో సారెఁ బె
న్పనటం జింతిలుచుంటిఁ బూర్వజనితాభ్యాసాత్తసంసిద్ధిచే
తను శాస్త్రార్థ జనించె నాకు నిపు డుద్దామస్థితిం దానొగిన్. 208

వ. విప్రేంద్రా! జ్ఞాతవిజ్ఞానసహితుండ నైయుండియు నేనాశాస్త్రోచితాగమోక్తులసర
ణి నెన్నఁడైన నొనర్పనైతి విను మనోవాక్కాయకర్మములవలనఁ జేసినభిక్ష
కలుషములు శుభాశుభంబులు స్వాధ్యాయశాస్త్ర జీవికములు వధబంధనాదు
లు పూర్వాభ్యాసపరణిఁ గలుగుచున్నవి పూర్వజంబగు జాతినిఁ దలఁచువాఁడు
సకలపంకనివృత్తి నొనర్పఁగలఁడు కానఁ గలుషముల నడంచి పుణ్యములఁ బెం
పొందించుట కొఱకు నరణ్యమునకు నేగెద నీవీదివాకరాఖ్యపుత్త్రుని గృహస్థ
ధర్మమునందు నియోగింపు మని యిట్లానిశాకరుఁడు భాషించి తలిదండ్రులకు
నమస్కరించి పుణ్యోద్దేశమైనదియు హరినివాసమగు బదర్యాశ్రమమున కరిగె
నని చెప్పి వెండియు నిట్లనియె. 209

క. దనుజాచార్యా! యిట్టిలఁ, దనరఁ బురాభ్యాసపరణి । దానము ధర్మం
బును విత్తాదులు ధరఁ గల, మనుజాలకును సంతతంబు । మాటికిఁ జూడన్.

ఆ. కానఁ బూర్వమందుఁ । గడిమి నాచే నభ్య, సింపఁబడినదానిఁ । జెప్పనాఁడ
నీకు నభ్యగలిని । నెగడెడుదానినిఁ, బలుకనైతి నిపుడు । భక్తిమీఱ. 211

సీ. భార్గవా! దానతపస్స్వాధ్యయములు నగ్నిదాహకంబులు మహాదారుణాఘ
ములు విమలజ్ఞానములు ధర్మకామార్థసిద్ధ్యయనంబులు । తీతితలమునఁ
బొనరఁ బూర్వాభ్యాసమునమానవులకెల్ల నభ్యంబుగా నెన్నఁడైన నగునె
తలపోయ నని యిట్లు । దైత్యేశ్వరుండును బలవంతుఁడైనట్టి । బలివిభుండు
ఆ. తనగురుండు ధర్మతత్పరుం డగు కవి, కపుడు చెప్పి కైటభారి మధువి
దారి యైనచక్రిఁ । దతభక్తిసహితుఁడై, తలఁచుచుండె మిగుల । ధర్మబుద్ధి.

వామనుఁడు బలిసవనస్థలిఁ జేరుట.

ఆ. అనఘ! యట్టితరుణమందు శ్రీభగవంతుఁ, డైనవామనుండు । హర్షమొప్ప
యజ్ఞవాటభూమి । కరుదెంచి గట్టిగా, నాడె నొక్కమాట । నార్యు లెన్న.

సీ. ఓదైత్యపార్థివ! । యోంకారపూర్వంబు లైనవేదంబు లీయజ్ఞమందుఁ
గడిమిఁ దపోధనాగణ్యరూపముతోడ హవణించుచున్నవి । యాగభావ్య
మైనట్టిదగువాహ యజ్ఞమే చందానఁ జేయ నా నారిలిఁ । జేయుమనుచు
భాషించె నట్టియావాక్యంబు నాలించి పలికియు దితిసుఁడా । బలి విభుండు
ఆ. సాధ్యపాత్రుఁ డగుచుఁ । జక్రియుండినచోట, కేగుదెంచి యంత । నీశ్వరుండు
దేవదేవుఁ డైన । దివ్యవామను వేడ, విధిని బూజచేసి । వేడ్కఁ బలికె. 214

శా. దేవాధీశ్వర యేమి నీవడిగెదో । తెంపొప్ప నర్థానినే
భావానందముతోడ నిచ్చెద దయా । భాసిల్లి భాషింప నా
నీవన్న న్నియని యంత నవ్యయుఁడుఁ బద్మేశుండు వైకుంఠుఁడుం
ధీవర్యుం డయినట్టివామనుఁడు బల్దీపించుకాంత్న్ మనీ. 215

క. చిరకాలము నవ్వుచు బలిఁ, బరమతపోధనుఁడు నైన । భారద్వాజా
గరమాలోకించుచు బలి, ధరణీశునితోడఁ బలికెఁ । దాపసవర్యా. 216

క. బలినాయక! నాగురునకు, గలదగ్నిపరిగ్రహంబు । ఘనతరమై యా
జ్వలనునిఁ బారక స్థిలి, నలరారెడిపుడమిఁ బెట్టఁ । దామునిచూడన్. 217

క. ఆకారసార్థమయి నే, నీకతిఁ యాచింపవలసె । నేలమి న్నిన్నుం
గేలిఁ ప్రీతిఁ బదత్రయ, భూతలమును మత్ప్రమాణమునఁ నిడు భూపా 218

క. అని వామనుఁ డపుడీవిధ, మున నన నాదైత్యవిభుఁడు । భుజసారుండుం
దనయుండగుబాణుని నిజ, వనితామణిఁ గాంచి యిట్టులపలికెను ప్రీతిన్ 219

ఉ. భూరిరమావిలాసమునఁ । బొల్పెసలారెడి నన్నుఁ బ్రీతితోఁ
జేరి క్రమత్రయంబు నిడు । చిత్తమురంజిలనంచు నేవిభుం
డారయఁ గోరివేఁడె ధర । నాలఘుకాముఁడు నైన వామనా
కారునిడా ప్రమాణమొగిఁ । గ్రాలెనకేవలమై విచిత్రతన్ 220

చ. వినుతము లైనపుణ్యముల । వెల్లనివారును స్వల్పబుద్ధులా
జనులకుఁ బ్రాయముం ధనము । శాంతిసుఖాదుల దుర్లభుండు నా
వనజదళాక్షుచందమున । వాగ్వనితాహృదయాబ్జహంస యా
వనజభవుం డొసంగఁ డిల । భగ్నదయారసయుక్త బుద్ధితోన్. 221

ఆ ధనముఁ గోలుపోయి । తల్లడిల్లెడివాని, కిడదు నలువ ధనము । నెలమి దాత
నైననన్ను నేమినడుగఁ జేయక శౌరి, కిడెఁ బదత్రయేచ్ఛ । నెలమి నార.

చ. పరమమునీశ్వరా యిటుల । పల్కి జనార్దనుఁ జూచి దానవే
శ్వరుఁడు మహాత్ముఁడు న్విబుధ । చక్రవిరోధియు నాబలీంద్రుఁ డా
తరుణమునందుఁ గ్రన్ననము । దంబు మదిం బదిలంబు నై తమిం
బరఁగుచునుండ నీకరణిఁ । బల్కుఁ దొడంగెను దెంపు పెంపునన్. 223

మ. వరదా రాజ్యమొ భూములో కనకమో । వజ్రంబులో సొమ్ములో
కరులో వస్త్రములో మహాధనములో । కంజాక్షులో మేడలో
హరులో గ్రామములో మణిప్రకరమో । యారామవాసంబులో
సిరియా లేక మరేమి నీమనసులోఁ । జెల్వారె భావింపుమా 224

మత్తకోకిల దేవతాధిప! నేను నీజగతిం విభుండనుదాతనై
వావిరిం వెలయంగ నీవిట । వచ్చి నన్నుఁ బదత్రయం
బావసుంధర నిమ్మటంచని । యడ్గినాఁడవు దానినే
నేవిధంబున నిత్తు నా కిపు । డెద్దురం మదినిగ్గొగిన్. 225

క. నాకుండినవసుధావర, నాకరసాతలములందు । నలి లేని మదిం
జేకొని యొక్కటనైనద, యాకరుఁడవు నగుచుఁ గోరుమా మానాథా. 226

చ. అని యిటు లాడితి ప్రవరుఁ డాడిన వామనమూర్తిపల్కె నో
దనుజవరేణ్య రత్నహయదంతి హిరణ్యముల న్మహార్థు లా
జనులకు నిట్టు లీఁదగు విశాలయశస్సులలారు నేను గో
రినదగు నీపదత్రయముఁ బ్రీతి నొసంగుము నాకు భూధవా. 227

క. దానిని హాటకగిరిఁగా, మానసమున నేఁ దలంతు మాటికి నని యి
ట్లా నారాయణుఁ డన నా, దానవనాథుండు భక్తి తళుకొత్తంగన్. 228

క. రంగారెడిదగుబంగరు, శృంగారపుగిన్నెఁ దాల్చి సిరిమగనికి ను
త్తుంగమతితోడ నాదిలి, పుంగవుఁడు పదత్రయంబుఁ బొంగుచు నిచ్చెన్. 229

వామనుఁడు విశ్వరూపమెత్తుట.

తే. అంత బలిదత్తమైనతోయంబు హస్త
మందుఁ బడినంతమాత్రమె హర్షమాత్మ
నలర హరి ముజ్జగంబుల నాక్రమించు
నట్టిదగు విశ్వరూపంబు నవుడు దాల్చె 230

వ. మునీంద్రా, వినుమా విశ్వరూపాభిరామపరణి భాసింతుఁ బాదమందు భూమియు, జంఘులఁ ద్రైలోక్యపూజితంబగు మిన్నును, దిక్కులందుఁ దపోసత్యంబులును, కటిప్రదేశమున విశ్వేదేవతలును, వస్తిమస్తకములఁ బ్రశస్తమరుద్గణంబులును, లింగమం దనంగుఁడును, వృషణములఁ బ్రజాపతియును, గుహ్యయందు సప్తసాగరోన్నతమహావిశాలచతుర్దశభువనములును, త్రివళులందు నదీబృందంబులు నంతఃకుక్షియం దఖిలాధ్వరక్రియామంత్రేష్టాపూర్తాదులును, పృష్ఠమం దష్టవసువులును, స్కంధమున రుద్రులును, భుజములందు నఖిలదిక్కులును, హృదయమునఁ బరమేష్ఠియుఁ దదస్థల వజ్రాయుధంబును, వక్షస్థ్సలమందు సుందరీమణులును, మనసందుఁ జందురుఁడును, గంఠమున దేవజననియగునట్టి యదితియుఁ, దద్వలయమందుఁ జతుష్షష్టివిద్యలును ముఖమున నగ్నియుతులగువిప్రులును, దంతముల సంస్కారసూక్తధర్మకామార్థమోక్షశాస్త్రంబులును, లలాటమందుఁ బద్మయుఁ జెవులలో నశ్వినీదేవతలును, శ్వాసములందు శ్వసనులును, సర్వసంధుల మరుద్గణంబులును, జిహ్వను సరస్వతియు, నేత్రములందుఁ జంద్రసూర్యులును, రెప్పలలోఁ గృత్తికాదులును, భ్రూమధ్యభాగమున విశాఖాదులును, రోమకూపములందు మహర్షినక్షత్రలోమరాసులును గలిగి భూతభావనుండును భూతేశ్వరుఁడును భగవంతుఁడు నగువామనదేవుఁ డతాదృశగుణంబులతోఁ బాణించి యొకపాదముతోడ స్థావరజంగమాత్మకమగు జగంబు నాక్రమించి యంత 231

ఉ. ఎన్నుచు మిన్నుఁ బ్రాఁకిపడి నేత్తల నద్భుత మైనమూర్తితో
నున్నతిఁ గన్నవామనుని నొయ్యన దిక్కనవైభవం గనఁగ

వెన్నెలతేట చెన్నలరి | వెల్గెను మిక్కిలి సవ్యపార్శ్వసం
పన్నుఁడు నై విభాకరుఁడు | పాలిని భాసిలె బ్రహ్మనందనా! 232

వ. అంతఁ దక్కాలమున. 233

సీ. అమలద్వితీయపా | దార్ధంబుతోడను స్వర్మహర్జనలోక | సంస్థులైన
మేటితాపసులను | మించితదర్ధంబువలన నభంబున | వాక్యదీప్తి
దాఁటిమింట వసించి | దత్తుణాంతరమందు నలివృద్ధిఁ జెలఁగి బ్రహ్మాండవిలస
దుదరమూహార్మ్యని | కోరువిష్టపమున వెల్గి చాఁచినదైన | విశ్వపాద

తే. మునఁ గటాహంబు ఛేదింప | మొనసి దాన
ధాత్రువిష్టపమందునఁ | దనరు కుటిల
యామురారిపదంబున | నాకులాత్త
యగుచుఁ బ్రవహింపసాగెను | హరిశ్చంద్ర! 234

ఆ. దానఁ జేసి యమ్మ | హానది మానులు, విష్ణుపది యటంచు | వితతభక్తి
మొనయుచుందురట్టి | బుద్ధులతోఁ బ్రస్తుతించుచుందు రెపుడు | దివిజులెన్న.

వ. ఆసమయమున. 236

క. హరిమూఁడవయడుగిడుటకు, నిరు వెద్దియులేనికతన | నీవుత్సుకరితా
ధరయుతుఁడై వచ్చిబలీశ్వరుతో భాషించెనిట్లు | పరమమునీశా. 237

క. దనుజేశబుణముతోడను, దనరిలివటుగాన ఘోర | దర్శనమగుబం
ధనమొనరునుమూఁడవ పద,మును బూర్ణము చేయుమీవు | బుధు లగ్గింపన్. 238

క. నీ వాపదమును నా కిడ, వావడిబంధనముఁ గోర | నా నీవన నా
చిత్రం డాడినభీషణ, మావాక్యము నాలకించి | యాకాలమునన్. 239

ఆ. భీతితోడ మిగులఁ | జెంపారువాఁడయి, బలితనూజుఁడైన | బాణుఁ డమర
వర్యపాలుఁడైన | వామనుతో సేతు, పరివృతంబునైన | పలుకుఁ బలికె. 240

బాణాసురుఁడు వామనునితో వాదించుట.

ఆ. జగదధీశ నీవు | సర్వవిష్టపముల, నేలునట్టిదొరల | కెల్ల తేఁడ
వగుచు నల్లభూమి | నల్పమాస్థితితోడఁ, దివురునట్టుచేసి | తివి స్వశక్తి 241

క. మును విస్తారముగా భూ, మినిఁ జేయక నీవు వాంఛ | మెఱయ న్విపులం
బును గల్గువుడమి నిడుమూ, యని యటు బలిదైత్యనాథు | నడిగెద వనఘా.

క. జగదంతరాళమందున, నగడౌడి పుట్టెఁడు ధరిత్రి | నీచేతను సొం
పుగఁ జేయఁబడెనా కన నా, జగతిని నాతండ్రి నీకు | సరవి నొసంగెన్. 243

ఆ. తుశ! నరుమతోడ | నట్టు లివిభుఁగట్ట, నేర్తువెట్టిదైన | నీవిశేష
బలముతోడఁ దొల్లి | భాసిల్లె నాశక్తి, వలన నిప్పు డిరఁడు | వఱలెదీప్తి 244

చ. మురహార! సర్వశక్తుఁడవు | పూజ్యుఁడ వీ వరయ న్మహాకృపా
కరమతితోడ నీయుదను | గావ నగుగా బలిదానవేంద్రుఁ దు

స్తర మగుబంధ నాజ్ఞను నొసంగకు ధన్యునిఁ జేసి కీర్తితోఁ
బరఁగి ధరాస్థలి న్మిగుల భాసిలఁ జేయుము నీకు మ్రొక్కెదన్. 245

క. ఉడుగనిపూన్కిని బాత్రుల, కిడుదానము సౌఖ్యమునకు నిరవగు ననుచున్
గడు శ్రుతి నీచేఁ జెప్పం, బడెఁ గద నిక్కంబు చూడ భావవిదూరా. 246

ఆ. పద్మనేత్ర చక్రపాణివై నీయందుఁ, బుణ్యదేశకాలములు సమస్త
ధర్మరాసులెల్లఁ దనరారుచుండును, సంతతంబు దీప్తిఁ జాల వెలసి. 247

వ. దేవా! యవధరింపుము విన్నవించెద. 248

సీ. సకలకామంబుల సమకూర్పు ధరదానమునకుఁ గర్తవు సకలాధిపుండ
వగు నీవె పాత్రంబు నమరేశ పూజనక్షత్రయోగమ్మృగాంక సహితసుప్ర
సిద్ధకాలము కురుక్షేత్రంబు దేశమై భాసిల్లఁ గడుదుష్టభావయూధ
నలరెడి మావంటి యజ్ఞాపదనుజాలచే నైన జెడు మేటి శిక్షనట్టు

ఆ. పొందనగును సకల భూలోక శ్రుతులందు, నాదికర్తవై వకటించుఁ జెప్పఁ
బడెను నీప్రభావ బంధురశక్తిని, నవఁ దలఁగ నేర్పు నెప్పుడవని. 249

మ. అనఘా! యిద్ధర నీవు హీనగతి బర్వాల్పార్యాందు మానంబుతోఁ
దనరఁగా జేసి పదత్రయంబు గురుమోదం బొప్ప నాకిమ్మటం
చని యాచించి సమస్తలోకలలితపూజ్యం బైనరూపంబుఁ గై
కొని యేక్రియవడి సంగ్రహించెదవు నాకుం జెల్పుమా సత్కృపన్. 250

తే. జగదధీశ! సమగ్రమా జగతి సరణి
దాఁటి కీర్తుండ వగునీవు ధరణినెల్ల
మూఁడుపదములతోడను ముగియఁ జేయు
దానియం దేమిచిత్రము తనకు నీకు. 251

చ. నరసఖ! పద్మనాభ! మురనాశ! రమేశ! గతప్రమాణమా
ధరణిని నీవె చేసి పటు దర్పముతో బలి నెట్టు కట్టనాఁ
గరము విచార్య మేదెటులు కాంతనొనర్పఁ దలంతు వాత్మనా
కరణిని జేయుమా విబుధ గణ్యులు నిం గానియాడ నియ్యెడన్. 252

క. అని యిట్టుల బలియును బలి, తనయుం దగుబాణుఁ డాద దయతోడ జనా
ర్దనుఁ డాదికర్త యగుమురదనుజాంతకుఁ డతనితోడఁ దాఁ బల్కెఁ దమిగా.

ఆ. బాణదనుజ! నీవు పలికినమాటల, కిష్టనే వచింతు నెలమి హేతు
కలిత మైననుడులఁ గరమర్థితో నాల, కింపనగును శ్రద్ధ నెరలుచుండ. 254

మ. మును నీతండ్రిని గూర్చి నాకొలఁది నో భూపాల పాదత్రయా
వని నిమ్మన్న నతండు నాభువి నిడాఁ బాగొప్ప నాచేత ని
ట్టొనరింపంబడె నావిధిం జెలిసి తా నూహింప కేవేళ నే
ద్యమున నాకుఁ బదత్రయంబు నిడఁ గాఁ బ్రాహుఁడై క్రన్ననన్. 255

వ. అత్యాదరంబున. 256

సీ. బాలేయ! విను మొక పాదంబుతో భూర్భువాదివసుంధర । నంత మిగుల
దాఁటితి నిక్కము । దానవేశుండైన బలికి నే లోవరించు । భావసరణి
నీ క్రమక్రమమునే । నీమాడ్కిఁ జేసితి నీతండ్రిచే నట్టి । నీరమాత్మ
హస్తంబుతో దత్తమయ్యెనా యావారిచే నాయు వలనికి । తిలిని నాక్క.

ఆ. కల్ప మొనరు ననుచుఁ । గరుణతో నీమాడ్కి
బలిసుతుండు నైన । బాణుతోడ
వామనేశ్వరుండు । బలికి క్రన్నన వాని
జనకుఁ జూచి పలికె । మునివరేణ్య. 257

ఆ. దైత్యనాథ! నీవు । దక్షిణాశా పూర, ణంబుతో నతుఁ గదలి । సవ్యగతినిఁ
బొమ్ము భూరిఫలసు । భోగ్యరసాతల, మున నిరామయత్వమున వసింపు. 258

క. అని యాకైవడి వామనుఁ,డనుపుడి విని దైత్యనాథుఁ । డగుబలి యాశ్రి
తునిఁ గాంచి పలికె భక్తిగ, దనరారెడిబుద్ధితోడఁ । దాపసనాథా! 259

క. అనఘా! సుతలస్థలమునఁ, బొనరెడి నాకెట్లు దివ్య । భోగంబులు క
ల్గును నే నిరామయుఁడ నై, యనిశం బట నెట్టులుందు । నాడుము కరుణన్.

క. అన విని వామనుఁ డను నీ, కును సుతలమునందు నెట్టి । గురుభోగ్యము లిం
పొనరఁగ గలవో యిపుడే, వినిపించెద వినుము వాని । వేడుక లూరన్. 261

తే. దనుజ యశ్రోత్రియ శ్రాద్ధ । కర్ములు నవిధి
దానములు నవ్రతులచేతఁ । దాల్మిఁ జదువఁ
బడినవియు నైనవిద్యలు । ఫలము నీకు
నెలవు నిడఁగల వంతటఁ । బృథులముగను. 262

వ. దనుజవరాపురుషవ్యాఘ్ర! మఱియు నింద్రమహోత్సవముజరగుతఱి దీపప్రదాన
మను పేరుగల పెద్దవేడుక యొండు నీకుఁ గాఁగలదు. దానియందు హృష్టపుష్టు
లును, నిజాలంకృతు లగుజనులు నిన్నర్చించెదరు ఆదివ్యోత్సవము జగతి
యందు భవన్నామచిహ్నితమై వానికెక్కు. నీరాజ్యమం దది మిన్నగ వెన్నెల
వలె మిన్నందుచు నంతట వన్నెఁ గాంచు నని యాదరంబున. 263

చ. పరమమునీశ! యిట్టు బలి । పార్థివుతో నని వామనేశుఁ డా
తరుణమునందు వాని సుత । దారలతోడను వీడి యంతటన్
ధరఁ గాని మాని కేవలి । బద్దయుభక్తినిఁ గొల్వ దీప్తితోఁ
బరఁగుచుఁ బోయి శక్రునకుఁ । బాలినిఁ దాని నొసంగి పిమ్మటన్. 264

క. నియమము మగుస్వర్గము నట, సురుచిరముగ నెల్లఁ జేసి । సురనాథుల న
ధ్వరభాగాశనులను గాఁ, గరుణఁ గావించి విబుధ । గణపూజితుఁడై. 265

క. సురనాథులు దనుఁ గొలుఁవఁగ, వరదుఁడు విశ్వేశుఁ డైన వామనదేవుం
డురుకాంతి మాయమయ్యెను, గరమాశ్చర్యంబుతోఁడ । గమలజపుత్రా. 266

సీ. పరమధాతయు నైన । వాసుదేవుఁడు నాకమున కేఁగఁ గనియప్పు । డమరులు చెలఁగ
శాల్యాఖ్యుఁ డనువాఁడు । సారోద్ధతిని మించి యాకాశమందున । నసురులకును
నప్రతిమంబు మహా ప్రసిద్ధం బైన సౌంభకం బనుపురిఁ । జతురసరణిఁ
జేసి యథేచ్ఛతోఁ । జెలఁగుచుఁ దిరిగెను మరియుఁ దష్టకనకతామ్రమునలోహ
ఆ. సుగ్రసుఖద మగుచు । సౌప్వరునాత్రిపు
రంబునందు నెపుడు । రమణసైద్య
కాసురేంద్రుఁ గూడి । యాత్మజబాంధవా
దులను గలిసి యుండెఁ । దుష్టునంత. 267

మ. బలిబద్ధస్థితితో రసాతలమున । న్వాసిల్లఁ దత్సూనుఁడుర్
బలియౌబాణుఁడు గుప్తిశోణపురమున్ సల్పిచ్చె మేపార నీ
యిలపైఁ గల్పనచేసి భూరిబలులై । యింపొందు రక్షోగణే
శులతోఁ గూడి వసించుచుండె మిగులన్ । శోభోన్నతి న్నారదా! 268

ఆ. ఇట్లు పూర్వమందుఁ । నింద్రగోబ్రాహ్మణ,
దేవహితము గోరి । దీప్తిఁ జక్ర
ధరుఁడు వామనుండు । దైత్యారి యగుహరి
బలిని బద్ధుఁ జేసెఁ । బ్రాజ్ఞులెన్న. 269

వ. మునీంద్రా! విను మెద్దిఁ గీర్తించినను సంస్మరించిన సకలపాపహరం బై పుణ్యో
న్నతిగలిగి నలరారునో యట్టివామనప్రాదుర్భావగాథ నీకిపుడు చెప్పితి నదిధర్మ
రయు మోక్షము నిచ్చుచుండు నీవిఁక భక్తి దీని వినఁ గోరితివో
దాని నడుగుము నుడివెద నని పులస్త్యుండు పలుకుటయు. 270

ఉ. శ్రీరమణీయపాదసర । సీరుహబంధుర దివ్యసుందరా
కార సుకీర్తిహార! వర । కంధర సంతతపాపదూర వి
స్తారకృపాకరా! పరమ । ధర్మవిచార సమస్తవిస్తృతా
ధార సురాత్మకార్తికర! । దానవభీకర! రామభూవరా! 271

గద్య. శ్రీరామకరుణా సమాసాదితకవితా ప్రాభవ, హారితసకులాన్వయ ప్రభవ, రా
మవరఘులవంశదుగ్ధసాగర సుధాకర, కొండయకుమార, బుధజనవిధేయ కొండయ
నామధేయప్రణీతమగు తెలుఁగు వామనపురాణము దేశాదశస్కంధము.



శ్రీ ర స్తు.

శ్రీసీతాలక్ష్మణభరతశత్రుఘ్నహనుమత్సమేతశ్రీరామచంద్రాయ నమః.

# తెలుఁగు వామనపురాణము

## ద్వా ద శ స్కం ధ ము.



కరశుభగుణజాలా !
భీకరసురవైరికాల। పృథుసంశీలా !
శ్రీకౌసల్యాబాలా !
ప్రకటతేజోవిశాల ! । రామనృపాలా ! 1

క. అవధారు భద్రగుణుఁడును, భవహరుఁడు తపోధనుండు । బ్రహ్మాత్మజుఁడున్
గవివరుఁడు నైననారదుఁ, డవిరళమతి నిట్టు పలికె । నతిమోదమునన్. 2

మ. మునినాథా ! భగవంతుఁ డాద్యుఁడు మహా । పుణ్యుండు నా వామనా
ఖ్యునిచే బద్ధుఁడు నా బలీంద్రుకథ నే । సొంపారుసద్భక్తితో
వినినాఁడం దగఁ బ్రశ్న కర్హమగుచు । న్నిల్లాండు వేఁ డొక్కఁడా
నిని మోదంబున నాలకించు రమితో । నేఁ బల్కెదన్ గ్రమ్మనన్. 3

క. సకలాత్ముఁడు భగవంతుం, డకలంకుఁడు నైనశౌరి । యమరేశునకున్
బ్రకటితభువనత్రయమును, సుకరస్థితి నొసఁగి భూరి। శోభ చెలంగన్. 4

ఆ. మాయ మగుచు నేగి । మానుగ నెటనుండెఁ
బల్కుమనుచు నిట్లు । బ్రహ్మపుత్రుఁ
డనఁగ విని పులస్త్యుఁ । డాతనితోడను
జెప్పె మోద మూర్తుఁ । డిందులాడ. 5

సీ. అనఘ యజ్ఞాసనుఁ । డాత్మాలయమునకు వచ్చిన మురవైరి। పదయుగంబుఁ
దొరి విధిఁ బూజించి । మురహర నీవేల చిరకాలమునకు వచ్చితి వనంగ
విని జగన్నాథుఁ డా। విష్ణుఁ డానలువతో భాషించె నే సుర। పతిహితంబుఁ
గోరింపఁ జని బలిఁ । గట్టి వచ్చితి నన్న నాహరివాక్యంబు । నాలకించి

ఆ. పరమ తుష్టుఁ డగుచు । బ్రహ్మదేవుం డన్న, కేశవ యెట్టు లెట్టు । కేజర్ల
బలియుఁ డైనబలిని । బంధించితివి? యాదం, భయము నాకుఁ బాసె । దగు నటన్న.

వ. విని యుత్తమ. 7

క. భగవంతుఁడు సుగుణాఢ్యుఁడు, ఖగపతికేతనుఁడు నైనకంజదళాక్షుం
డగణితదేవమహోన్నతి, నెగడెడి లఘుమూర్తిఁ జూపి నిపుణతతోఁచెన్. 8

ఆ. పిదప వింతతోఁచఁ బెంపొందురూపంబు
వలన చెలఁగె నంత బ్రహ్మ యోజ
నాయతోన్నతుండు నట్లూర్ధ్వమానుఁ డా
మురవిదారిఁ జూచి మ్రొక్కి యపుడు 9

బ్రహ్మ వామనుని పొగడుట.

మత్తకోకిల. సారె నీచరితంబు మేలిఁక సారసాక్ష యటంచువి
స్తారబుద్ధిని బల్కు యుంతను దారభక్తి రమేశుపైఁ
జేరి పెంపునఁ గుల్కుచుండను జేసి తన్మయసంయుతా
తారుఁడై పొగడంగ సాగెను గంజసంభవుఁ డోమునీ. 10

సీ. ఓన్నమస్తే జగద్వర్ధనానేకరూపా మహాసురదేవ వాసుదేవ
దేవాధిదేవసుదీపితభూతభావనరూప నరపతివాస శ్రీని
వాస సురాసురవందిత సురగణనిర్మాణసకలమునిప్రకాశ
కపిలమహోన్నత కపిలవిష్వక్సేన విమలగుణోత్కర వృషజయంత
తే. జయవిజయపురుషశ్రేష్ఠ చారుహాస, నవ్యభోగ పురంజయా నంతసద్ధ
నంజయా వేదసంచార నాగముఖ్య, నిర్జరార్చిత పదయుగ నీరజాక్ష! 11

క. నిరతావిష్ణు వరేణ్యా, పరమేశా విష్ణుదేవ వైకుంఠసురో
త్కరసంస్తుత నారాయణ, వరదా పృథుగర్భ నీకు వందనము హరీ! 12

తే. కమలగర్భ పృథుశ్రవ కనకగర్భ,
కమలసద్మాశ్రయా వృష్ణిగణ్యమూల
భూతివాస వృషధ్వజపుణ్యపురుష
నీకు మ్రొక్కెద నిత్యము నియతభక్తి. 13

క. అసురాంతక భవసేవిత, నిపుణాద్యంతోరుమధ్య నిధనకృతావ
త్రపరాక్రమ గుణసంయుత, విపులానాదిస్వరూప విశ్వాధిపతీ! 14

క. వర్గాధ్యక్ష గదాధర, భర్గత్ర్యాధరసుకేశ్య బహుకల్పప్రజా
సర్గకర విగతభవసం, సర్గ మహాకల్ప జాత పరవిష్ణికురా. 15

క. శ్రీధరరమాంగనాధర, భూధర వనమాల ఘోరమురదైత్యహరా
సాధుహృదంబుజచర మధు, బాధాకర మ్రొక్కు నీకుఁ బరమేశహరీ! 16

తే. నిఖిలలోకాధివాస వినీలవాస, పావనాలయ సంక్రీతివాస హంస
సీరకేతన సంతతకేలరక్త, వక్త్ర వలగొనెదను భక్తవత్సలుండ. 17

సీ. పద్మనాభుఁడ వీవు । బ్రహ్మదేవుఁడు వీవు సర్వగుండవు నీవు । సర్వమీవు
శర్వాత్మకుఁడ వీవు । సర్వాత్మకుఁడ వీవు ద్వాదశాత్ముఁడ వీవు । భద్రమీవు
కేతుమంతుఁడ వీవు । కీర్తనీయుఁడ వీవు ధర్మకల్పుఁడ వీవు । ధర్మమీవు
ముంజకేశుఁడ వీవు । భూతాత్మకుఁడ వీవు సోమాత్మకుఁడ వీవు । చూడ్కు లీవు
తే. సర్వలోకేశ భవనాశ । చారుకేశ, నిర్జరేశ గుడాకేశ । నృపగణేశ
పాలభవ్య సనాతన । పాండువస్త్ర, నీకు మ్రొక్కెద నే నిత్య । మెనగడుచుండ.

క. సేనాధ్యక్షా గురుతర, సేనపరిష్కృత సుసూత్మ । చిరసంస్థూలా
మానాతీతాధోక్షజ, నానావిధరూప వందనము నీకు నజా!. 19

ఆ. పీతరక్త శుక్ల । ప్రభువర్ణ రక్తాంబ, రప్రియా మహేశ । రమ్యసదన
వామనాభిరామ । వంద్య జనార్దన, వందనం బొనర్తు । భక్తి నీకు. 20

వ. దేవా! దేవతలు నిన్ను సహస్రశీర్షవదన నేత్రకరపదములు గలవానిగ భావింతురు. విశ్వదేవుఁడవు, విశ్వధరుండవు, విశ్వాత్ముఁడవు, విశ్వరూపుండవు, విశ్వంబు నీవగుదువు, నీముఖంబందు విప్రులును, బాహువుల రాజులుఁ దొడలందు వైశ్యులుఁ బాదముల శూద్రులును, నాభియందు మిన్నును, ముఖపంకజమున నింద్రాగ్నులును, మనస్సందుఁ జంద్రుఁడును, భవదనుగ్రహంబున నేనును క్రోధమున రుద్రుఁడుఁ బ్రాణంబుల సప్తమారుతమ్ములును, శిరస్సందు స్వర్గంబును, శ్రోత్రంబుల దశదిక్కులును బాదములందు సమస్తవస్తువృతనగాబ్ధి ప్రశస్తనిస్తలం బగునట్టివుడమియుఁ గలిగె. ఆకాశనక్షత్రస్వేదాండజ మూర్తామూర్తంబు లన్నియు నీవకాన మ్రొక్కెద. పుష్పహాసుఁడవుఁ, బరముఁడవు, మహాహాసుండవు, నోంకారుండవు, వషట్స్వాహాకారుండవును, యాగచరుండవుఁ, ద్రికో శివియును, హోతవును, హోమమును, హూయమానుండవును బరబ్రహ్మమును నీవ కావె! హాతవు నీలిమేఘాపావక, విశ్వధామార్థ ధర్మస్మృత్యాపాత్రములు నగణియు నరణియుఁడవు జ్ఞానమయుండవును ధ్యానధ్యేయములును యాగేష్టములును యష్టయు దానము సవనపశువును బాజ్యుండవు నిజ్యుఁడవు హోతవుగీతవు యజమానుండవును జ్ఞానియుజ్ఞానము యోగియోగములును మోక్షకాములకు మోక్షంబును శ్రీమల్లక్ష్మియును గృహ్యముఁబరము సోమము దక్షిణయు దీక్షితుఁడవు నరుఁడవును రుద్రుఁడవును భాను దీప్తుఁడవు శుచియుతుఁడవు నగుచున్నావు. సర్వేశ్వరా చక్రము గగనము నభస్యముఁ గ్రతువు సహము సహస్యముఁ దరుంబుఁ దపస్యము విక్రమపరాక్రమంబులు మధుమాసకాల సంక్రమంబులు నీవగుదువు. హయగ్రీవుఁడవు మహామేఘుఁడవు శంకరుండవు హరిశ్వరుండవు సత్యస్వరూపుఁడవు స్వరమును మిత్రావరుణుండవు ప్రాగ్వంశప్రకాశుండవు మహాభూతం బగు భూతాద్యుఁడవు సూర్యవర్మాంతకర్తవు సకలకలువహారుండవు వామనదేవుఁడ వగుచున్నావు నీకు నమస్కరించెద 21

క. అని యిట్టులు పద్మసంభవుఁ, డనితరమతి వేడ సంత।సాద్భుతకర్మం
బున మిక్కిలి నలరెడివా, మనదేవుం డనియె మోద।మహితాత్ముం డై. 22

ఆ. అనఘ దివ్యవరము। నధికాభిలాషతోఁ
గోరు మిచ్చెద ననుచుఁ। గూర్మి నన్ను
ముదితుఁ డగుచు నలువ। మురవైరితోఁ బల్కె
భక్తి మిగుల వెలయ। భద్రచరిత! 23

క. దేవా! నాగేహంబున, పావని నీమూర్తితోడ। వర్తించెడి దా
పావనవరమును దయతో, నీవేళ నొసంగు నాకు। హితమతి వగుచున్. 24

క. కరమిట్టు లుత్తముం డగు, పరమేష్ఠి యచింత్యమైన। వాక్యముఁ బలుకఁగా
వరదుఁడు భక్తాత్ముం డగు, సరసిజదళనేత్రుఁ డతని। సద్మమునందున్ 25

చ. సరవిని బూజ్యమానుఁడయి। చాలవెలింగెడివామనాకృతిఁ
బరఁగి వసించెఁ గీర్తి సుర।భామలు గీతముఁ బాడి రప్సరల్
పరమముదంబునన్ జెలఁగి। పాలినిఁ బాడిరి సర్వనిర్జరా
సురవరసిద్ధపన్నగులు। సుస్థిరభక్తి నుతించి రాయెడన్. 26

వ. మునీంద్రా! యక్కాలమందు సంతోషాక్రాంతస్వాంతులై వెలసి. 27

సీ. విద్యాధరులు తూర్య।విపులనాదంబులఁ జెలఁగుచు నుండఁగాఁ। జేసి రంతఁ
బరమేష్ఠి వామను।భక్తితో మిక్కిలి యర్చించి గతములుఁ। దగుచు బుద్ధిఁ
దయ్యె నంతట హరి। యబ్జాసనునిసద్మమును వీడి సురనాథు। పురినిఁ జేరి
చేయుపూజనములు। వెల్లడిమేరతో హరువొందె వామనుఁ। డయ్యెఁ జూడ

ఆ. నట సురేశ్వరుండు। నబ్జాసనునిమాడ్కి, నామురారి కధిక। మైనభక్తి
బుద్ధిలోన మిగులఁ। బొంగారి మిన్నంద, బూజసల్పె నపుడు। పుణ్యమాని!

మ. వరదుండుగా భగవంతుఁ డీతఁడు జగ।ద్వంద్యుండు నా చక్రి యా
దర మేపార సురార్థమై బలిని బా।తాళస్థునిఁ జేసి రా
స్థిరకీర్తిం గనినట్టి యీకథను బ। ద్ధించుభావంబుతోఁ
బరమశ్రద్ధతలిర్ప నీ కిపుడు నే। భాషించితి న్నారదా! 29

బలి సుతలమందు నివసించుట.

వ. ఇట్లు చెప్పి మరలఁ బులస్త్యుండు. 30

క. మునినాథ చెప్పఁ దొడఁగిన, ఘనమగుచున్నట్టియాజ్ఞఁ। గైకొని సుతలం
బునకును బలి తనసతితోఁ, జని యాకృష్టమునఁ దు।సరగున నంతన్ 31

సీ. బిగిబిగితోడను। జెలఁగెడికటకపు శిలలతో బొందుగఁ। జేయఁబడిన
సోపానపంక్తుల। శోభిల్లుచును మహారత్నచిత్రితము నా।రయ్యపురముఁ
దప్పురవరమధ్య। తలమునందు మహా[illegible]ద్వార।సహిత మగుచుఁ

తే. యట్టిహరిచక్రమునకు నే నధికభక్తి
మ్రొక్కెదను వాఙ్మనఃకాయములఁ జనించు
నట్టి త్రివిధాఘముల దీపితాంశువిష్ణు
చక్రరాజమ ఖండించు సంతతంబు. 40

క. పరమేశాయుధమా దు, ర్భరకలిపిత్రుమాతృరూప పటుతరపాపో
త్కరము హరింపుము కృప నే, స్థిరమతినో నీకు జోత సేసెద మిగులన్. 41

క. నీపేరుఁ దలఁపఁగా నా, యాపదలు మహత్తరంబు లగుకష్టంబుల్
తీఁపకు నశించుఁ బోరిఁ బోరిఁ, బాపము నాశమును బొందుఁ బరువడి ననుచున్.

తే. అనఘ! మతిమంతుఁ డగుబలి యప్పు డిట్టు
పలికి పంకహరుండగు పద్మనేత్రు
సారసారెకుఁ దలపోసి సారభక్తి
నలరి చక్రంబుఁ బూజించె నమరు లెన్న. 43

చక్రము మరలి చనుట.

క. దనుజేశుం డగుబలిచే, తను బూజిత మగుచు నాసుదర్శన మంతన్
గనదతులవిషువంబం, దున సుతలము వీడి దీప్తితోఁ జన వడిఁగన్. 44

క. సరసరఁ జక్రం బేగిన, తరుణంబున విక్లబమునఁ దనరుచు బలి దు
ర్భరశోకస్థితిఁ బొందఁగ, బరఁగుచుఁ బ్రహ్లాదు నాత్మభావంబందున్ 45

చ. తలఁచిన యంత నాదనుజతల్లజుఁ డాయెడఁ బేర్మితో రసా
తలమునుఁ జేరఁ జూచి బలి దైత్యగణేశుఁడు సాధ్యపాత్రముల్
జెలఁగెడిభక్తితోడఁ గొని చెచ్చెఱ వచ్చి గణేశ్వరుండు సు
జ్వలమతి యాపితామహునిఁ జాల యజించి వినమ్రభావుఁడై. 46

చ. కరములు మోడ్చి మ్రొక్కి యను గాఢభయంబున నే స్మరింప బ
ల్కరుణను బూని వచ్చితివి కాదె విషాదపుబుద్ధి వెల్ల నీ
చరణమునందు వచ్చుట హితంబును బధ్యము శోభనంబు సు
స్థిరఫలదంబు నై మిగులఁ జేకుఱె నాకు మహాసురేశ్వరా! 47

వ. పితామహా!, సంసారమందు మెలఁగునరుఁ డేమిఁ జేయఁ దగు నద్దానిచే నాథవముసకు బంధనం బొనరు సంసారసాగరమగ్నులును, స్వల్పచిత్తులగు మానవులు తరించుకొఱ కెద్దిముఖ్య మగునో దానిఁ గరుణించి నాకుఁ దెలుపు మన దనుజేశుఁ డగుప్రహ్లాదుఁడు మనుమఁ డైనబలివిభుఁ డాడినపలుకుల విని కొంత వడిఁ జింతించి తరించుటకొఱకు కర్తవ్యమగుపరమార్థ వచించె వినుము. 48

ప్రహ్లాదుఁడు బలికి హరిభక్తిఁ దెల్పుట

సీ. దైత్యేశ! యుత్తముల్ దనరారినట్టి యాబుద్ధి ధర్మస్థితిఁ బొనరెను నీకుఁ
బరులకు హితమగు వాక్యంబు భాషింతు వినుము దాని శ్రద్ధతో దెలుసి నీవు

గాఢసంసారసాగరగతులును ద్వంద్వాతాహతులు పుత్రపౌత్రపుత్రి
కాకళత్రత్రాణ ఘనభరార్దితులును పతితేంద్రియోత్కర విషమవారి

ఆ. మగ్నులప్పు డైన మానవులకు నొక, శౌరి యనెడినావ శరణ మగును
గాని యన్య మైన గతి యొక్క టైనను, ధరణి లేదు చూడఁ దథ్యముగను.

శా. ఏవా రండజయానుఁ డబ్జరుఁడుఁ బర్జేశుం డనాద్యుండు స
ద్భావుం డాద్యుఁ డనంతుఁ డీడ్యుఁడు జగద్వంద్యుండు సర్వేశుఁడుం
దేవాధీశుఁడు నైన శ్రీహరిని భక్తిం గొల్తురో యామహా
ధీవర్యుల్ హరిసూనుఁ డొందరు మహాదీప్తి న్విజృంభించుచున్. 05

ఆ. యముఁడు పాశహస్తుఁ డగునిజభటుఁ గాంచి
తొలుతఁ జెప్పె భక్తిఁ దోయజాక్ష
భక్తవరుల వీడు పరులకు నే నధి
పుఁడను గాను వైష్ణవులకు ననుచు. 51

క. హరిదాసు లెపుడు కాలుని, పురిఁ జూడఁగ నెన్నఁ డైనఁ బోరని మున్నీ
ధరయం దిక్ష్వాకునరే, శ్వరుఁ డనియెఁ బుధులకడను సభ్యులు మెచ్చన్.

సీ. శ్రీహరిఁ జింతించు చిత్తంబె చిత్తంబు హరినామమునుఁ బల్కునట్టిజిహ్వ
జిహ్వయౌ మాధవుసేవించుకరములుకరము లై భువి వాసికెక్కుచుండు
శౌరిపాదద్వయసారసంబుల పూజఁ జేయనిచేతులు చిగురుటాకు
గుముల సొంపునుఁ గని కూడియుండినవగు బొమ్మలకైవడిఁ గొమరు మిగులు

ఆ. వరదు సద్గుణముల వర్ణనచేయని
దైనజిహ్వ యొప్పు దధికరోగ
సమము కంఠభాగశాలూకతుల్య మౌ
మూలరసన యగుచు మొనయుచుండు 53

చ. గుకులరభక్తితో నడరి కుంజరపాలుఁడు నైన శౌరి నే
పురుషుఁడు గర్వయుక్తుఁడయి బుద్ధిఁ దలంపఁడొ జీవయుక్తుఁడై
ధరణిని బంధుబృందములఁ దద్ద నటించియు శోచనీయతం
బరఁగి మృతోపమానుఁడయి వాఁడు చెలంగును గాదె యారయన్. 54

క. పురుషోత్తము సేవించెడి, పురుషులు చచ్చియును గీర్తిఁ బొంగారుచు శ్రీ
కరసరణిఁ గుల్కుదురు నా, గురువాక్యము నిజము నిజము గుణరత్ననిధీ.

వ. వాఙ్మనఃకాయజ మూర్తామూర్త చరాచర దృశ్యాదృశ్యస్వరూపము లగుని
యన్నియు నారాయణాత్మకము లై రాణిల్లును. 56

క. భగవంతుఁ డౌ త్రివిక్రము, నొగి సర్వుఁడు గొలుచు నట్టి యుత్తమునే స
ద్యగణిత దేవాసురగణ, జగములు సేవితము లగును సత్యముగాఁగన్. 57

వ. దనుజనాథా! యెవ్వరిమనంబులు భగవంతుని నామామృతంబును భక్తితో శ్రవణయుగ్మములం గ్రోలి సంతసంబున నుండునో యట్టిపురుషులు బాధలఁ బాసి స్తుతినొందుచు ముక్తినిం గాంతురు. 68

ఆ. చక్రగదల వెలయు | శౌరిపై నెవరికి, భక్తి దృఢముగాను | పఱలుచుండు
నట్టివారు శార్ఙ్గి | యనిశము నివసించు, చోటుఁ జేరుచుండ్రు | సొంపుమీఱ.

సీ. హరిచింతనాసక్తు | లగువారి కెగసి పోనరునా యద్రియు | భూస్థలమున
వెయ్యేండ్లు తపసుతో | వెలసిననరులకుఁ బొసఁగ దెవ్వానికిని | బుద్ధిలోన
భవ్యమౌ హరినుతి | వాటిల్లుతో వాని శాస్త్రమంబులతోడ | సతులజప్య
తరమంత్రములతోడఁ | దలతపోరలితోడ నెట్టిలాభము కల్గ | దెన్నఁడైనఁ

ఆ. పరమభక్తి మిగులఁ | బద్మేశ్వరునియందు
నిలుపునట్టి నరుని | నిఖిలదాన
యాగయోగభోగ | యత్నంబు లన్ని వ్య
ర్థంబు లగును జూడు | దైత్యనాథ!.

క. నారాయణుతో వైరము, సారెకుఁ గావించునట్టి | జనుఁ డున్నతినిం
గోరి యొనర్చిన సర్వో, దారక్రియ లన్ని చెడును | దలపోయ ధరన్. 71

ఆ. సంతతంబు శ్రీశుఁ | జింతించువారికి, నెన్నఁడైన భీతి | యొసఁగ దెందు
శౌరిఁ దలఁపనట్టి | జనులకు నాపద, లనిశ మమరుచుండు | ననిరి బుధులు. 72

వ. శ్రీమదష్టాక్షర మంత్ర మఖిలార్థసాధకంబగు జనార్దనుండు నిందీవరశ్యాముఁ డైనదామోదరుఁ డెవ్వరిహృత్పద్మవాసుం డగు వారి కపజయంబు వాటిల్లక జయలాభంబు లొనరు సర్వమంగళమాంగల్యుండు వరేణ్యుండు వరదుండుఁ బార్థివుం డగుహృషీకేశునకు నమస్కరించుమనుజుల సకలకార్యములు నిర్విఘ్నముగ నెఱవేఱును. విష్టవ్యతీపాతాదులు దుష్టగతిజనితము లగుదోసంబులు పద్మనాభుని స్మరింప నశించు. 73

తే. తీర్థకోటిసహస్రము | తీర్థకోటి
శతశతంబులు హరినమ | స్కారషోడ
శాంశకాలంబునకు సమ | మగును బుద్ధిఁ
దలఁచి చూచిన నెప్పుడు | దానవేంద్ర. 74

వ. మఱియుఁ జెప్పెద వినుము. 75

చ. స్థిరఁ గల సర్వపుణ్యగురు | తీర్థఫలంబుల విష్ణునామభా
సురవరకీర్తనంబున వి | శుద్ధుఁడు నై నరుఁ డొందు సద్వ్రతా
చరణులు నైనపండితులు | చక్రధరున్మతులౌ స్మరించి సుం
దరమగుముక్తిసద్మమునఁ | దక్షులు మెచ్చ వసింతు రున్నతిన్. 75

సీ. పరదేవతాభక్తి । వఱలుచు మిథ్యతోఁ జక్రి నర్చించెడి । జనుఁడు సాధు
పురుషులుండెడిచోటుఁ । బొందునిక్కముజగద్వంద్యునిఁ బూజింప । వచ్చుఫలముఁ
బరిపూర్ణతపముతో । భాసిల్లువాఁ డొకలతినైనఁ జెందఁడు । తథ్య మరయ
భక్తిఁ త్రిసంధ్యలఁ । బద్మనాభుఁ దలంచుభక్తాత్ముఁ డుపవాస । ఫలము నొందు
ఆ. సందియంబు లేదు । శాస్త్రమహాదృష్టిఁ, బొనరునట్టి కర్మ । మున భజింపు
చక్రధరునిఁ దర్పి । ప్రసాదముతో నీకుఁ, గలుగు ముక్తి నిజము । గణ్య లెన్న.

ఆ. అతనిమీఁద చిత్త । మాతనిపై భక్తి, సంతతంబు గలిగి । సర్వదేవ
తాధినాథు మిగుల । నర్చించి సుఫలంబుఁ, జెందఁగలవు నీవు । శిష్టచరిత! 78

మ. వనజాక్షుం డజరుం డనంతుఁడును సర్వవ్యాపకుం డచ్యుతుం
డనఘుండుం బరమాత్ముఁడుం బరముఁ డవ్యక్తుండు నాశౌరినిం
ఘనభక్తిం దలపోయుమానవులు వేడ్కం శాశ్వతంబైనవి
ష్ణునిలోకంబును జెందుచుందురు మహాశోభోన్నతిం దానవా! 79

ఉ. శ్రీయుతుఁ డచ్యుతుండు మునిసేవ్యుఁడు తేఁడు సురేశుఁ డైననా
రాయణునిం స్మరించు మనుజాధ్యులు ధౌతవిశుద్ధపక్షసం
ధాయకరాజహంసలవిధంబున దుస్తరభావకంధితో
యాయతపారతారకులునై విలసిల్లుదు రార్య లెన్నఁగన్ 80

ఉ. మాధవనామకలాబ్ధవర । మత్తమధువ్రతుఁ డాశ్రితేశుఁడుం
భావనుఁడుం గదాచటుల । భాసురచక్రకశంఖహస్తుఁ డా
శ్రీవనమాలినామకుల । శిష్టతమంబగు భక్తి విన్నవా
రావనజాక్షుసద్మగతు । లౌదురు సత్యము దానవాధిపా! 81

చ. వినుతుఁడు కీర్త్యమానుఁ డురువిక్రముఁ డాద్యుఁడు నైనశౌరి పా
వనతరనామకీర్తనము । భక్తి నొనర్చినవాఁడు తొల్లి చే
సినగురుపాతకరాసులను । జెచ్చెఱ వాసి సుధారసంబుఁ ద్రా
వినఁ జనుమాడ్కి మోదమున । వెల్గుచు ముక్తినిఁ గాంచుఁ బిమ్మటన్. 82

సీ. మనుమఁడా! విను దాన । మధువైరినామంబు ధ్యానించి కీర్తించి । శ్రద్ధఁ జదివి
వినెడిసత్పురుషుల । విమలాత్ములై యుట్టిమనుజాలు కొలుతురో । మహితభక్తి
నట్టిపూరుషవర్యు । లాచరించినపూజ హరిసేవ యైవడి । నలరు ననుచుఁ
బలికిరి దేవతల్ । బాహ్యంబుతోడ నంతఃకరణముతోడఁ । దాల్మితోడఁ
ఆ. సకలకాలపుష్ప । సారపత్రముల
యోగులందు హరిని । యోగ్యమైన
విధినిఁ బూజచేయు । విమలులౌ జనులెల్ల
నఖిలపూజ్యు లగుదు । రన్నికడల. 83

క. మునినాయక ప్రహ్లాదుఁడు, వనజాక్షునిమహిమ యిట్టు । వర్ణించిన భ
క్తిని విని బలివిభుఁ డాతనిఁ, గని ప్రశ్నఁ బలికె నపుడు । కౌతూహలి యై. 84

వ. పితామహా! నీచేఁ జెప్పఁబడినసర్వగుఁడగు జనార్దనుఁడు లోకములఁ బురుషు
లచే నెట్టారాధింపఁ దగియుండునో దేనివలన నెన్నఁడు మిన్నఁగ సుప్రసన్నుఁ
డగునో జగదధిపుఁడగు ఖగవాహను ప్రీతికొఱకుఁ దగినదానంబు లెవ్వియో
యతిథులందు నుపవాసాదు లొనర్పనగునో తత్ప్రీతికై చేయనర్హములగు కార్య
ము లెవ్వియో హృష్టులు శ్రద్ధాళు లగునరు లేమి యాచరింతు రొక్కొ
వానినన్నింటినిఁ గరుణించి నాకుఁ దెలిపి రక్షింపుమని ప్రార్థించినఁ బ్రహ్లాదుఁడు
చెప్పఁ దొడంగె. 85

ప్రహ్లాదుఁడు బలికి దానాదిప్రశంసఁ జేయుట.

తే. శ్రద్ధధానులు సద్భక్తి । సహితు లైన
జనులు హరిఁ గూర్చి చేసిన । సర్వదాన
తతులు నాశంబు లేనివై । ధాత్రిలోనఁ
దనరు చుండును సత్యము । దైత్యనాథ! 86

మ. మనుజుం డెల్లతిథులందు లోకవిభుఁడౌ । మావల్లభు న్భక్తిచే
తను నర్చించునొ యవ్వి దివ్యతిథులౌఁ । దర్కింపఁ దద్రూపద
ర్పనచిత్తుం డుపవాసి యై సకలవి । ప్రశ్రేణి నర్చింప దు
ర్జనహారుం డగుచక్రి తుష్టుఁడగు నిస్సందేహ మూహించినన్ 67

క. నరుఁ డెవ్వఁడు విప్రులతో, నిరతము ద్వేషించె నేని । నిచ్చలతఁడు బల్
నరకప్రాప్తుఁడు నై దు, స్తరబాధల ననుభవించుఁ । దథ్యము పౌత్రా! 88

క. మును విప్రులు నాతనువని, వనజేక్షణుఁ డిట్టు ప్రీతిఁ । బల్కెను గానన్
ఘనభక్తి నాద్విజేంద్రుల, మనుజుఁడు పూజింపఁ దగును । మాధవపరుఁడై. 89

ఆ. అవనిసురుఁడు ప్రాజ్ఞుఁ । డైన నపండితుఁ
డైన నింద్యుఁ డగున । యాద్విజేశుఁ
డచ్యుతాఖ్యదేహ । మగుదానఁ బూజింపఁ
దగుమనుష్యుఁ డతనిఁ । దగిన భక్తి 90

ఆ. భద్రరససుగంధ । వర్ణయుక్తంబులౌ, పుష్పజాతు లెల్లఁ బూజ కర్హ
మగును హరికిఁ బ్రియము । లగుతిథిదానము,లను వచింతు భక్తి వినుము పౌత్ర!

సీ. బకుళదళచంపక । బాణజాతీకుందకరవీరయూధికా క్రమసారి
భద్రపీతకజపా । పాటలాశోకతిలకగిరికావకు । శ్రీప్రకృష్ట
తగరకేతాహ్వాది । తరులతాజాతపుష్పంబులుఁ దావుల । నలరునట్టి
నేలగుపూవులు । విష్ణ్వర్చనమునందుఁ దగిన వౌఁ గేతకి । తప్ప జమ్ము

తే. యూతు కూ కేదుదళము మృగాంకభృంగ
దళములును మాలతీపత్ర తతి తమాల
దళము లతిముఖ్య శ్రీరమా ధవునిపూజ
యందు సౌభాగ్యంబు లగుచుండు నసురనాథ ! 92

క. వివిధ బహుకుసుమములు శ్రీ, ధవుని పూజార్థంబు లట్ట శుభనగములఁ బు
ట్టినపల్లవములు హర్యర్చనయందుఁ బ్రశస్తములు విచారింపంగన్ 93

క. వీరుద్భూతప్రసూనల నల, రారెడిచిగురుటాకుల మురారి నర్చింపనగున్
ధీరుం డగునరవర్యుఁడు, సారం బగుభక్తి మదినిఁ జాల వెలుంగన్. 94

క. నానామూర్త్యనుభావము, లా నళినీభవ్యాశైరవాదులతోడన్
మానితదూర్వాంబులతో, మానాథు యజించుటొప్పు మనుజుఁడు భక్తిన్. 95

ఆ సూక్ష్మవారితోడ సౌరిదిఁ బ్రక్షాళిత, మై విశిష్టసరణి నలరు వృక్ష
పత్రతతులతోడఁ బంకజాక్షుని భక్తిఁ, బూజసేయనగును బురుషుఁ డవని

చ. జనుఁ డటు పత్రపుష్పవర చారు సుగంధసుమాలితోడ నీ
శునిఁ గడుఁబూజచేయనగు శోభనచందనకుంకుమంబులన్
ఘనమగుభక్తిఁ బూయనగుఁ గాముని తాతకు నిత్యభక్తిచే
తను మది ముక్తిఁ గోరు జన తల్లజుఁ డోదనుజాధినాయకా ! 97

వ ఉశీర పద్మక కాలాగరు మహిషాఖ్యకణ దారుసిహ్లక నాగర శంఖజాతీఫలధూ
పము హరిప్రీతికొఱకు నిడఁదగు హవిస్సంస్కృతము లగుయవశాలిగోధూమ
వ్రీహి మాష ముద్గంబులును బవిత్రములైన గోభూవస్త్రాన్నస్వర్ణములును
మాఘమాసమునఁ దిలలుఁ దిలధేనుకావ్యంబులు మధువైరిప్రీతుఁ డగుఁగాకని
మనుజుఁడు దానము చేయఁదగును వినుము. 98

తే. వ్రీహివస్త్రాదినాదులు విష్ణుతుష్టి
కొఱకుఁ బురుషర్షభుండు ఫాల్గునసమాఖ్య
నెసఁగుచుండిన నెలయందు నిచ్చుటొప్పు
ధరణిసురులకు నిత్యము దైత్యనాథ ! 99

క. చైత్రంబున ధీమంతుఁడు, చిత్రాసనశయనవస్త్ర శేఖరములను
బాత్రులగు ద్విజుల కిడఁ దగు, ధాత్రిన్ హరితుష్టికొఱకు దదయకభక్తిన్.

తే. కావులకు దావు లగువస్తుతతులుఁ దాళ
వృంతగోచందనంబులు విమలవారి
కలశములు శౌరితుష్టికై కడిమి సాధు
జనులు విప్రుల కిడనగు శ్రద్ధతోడ 101

చ. సతత మొవండు పౌత్రసుతతిజాయలఁ గూడినవాఁడునయ్యు మా
సతికథ నాలకించు విధి వాటల నావిధుఁ గూర్చి మ్రొక్కునో

క్షితిని పదక్షిణాశ్వసవ।శిష్టఫలంబును దత్తభూమిగో
తతిరథవాజి హేమకరి। దానఫలంబులఁ జెందు వాఁడొగిన్. 102

సీ. పురుషవర్యుండైనఁ। బొలఁతి యైనను హరిపద్యంబునం దతి।భక్తి నొక్క
పాదంబు విని గతపాపులై శుచితోడ నలరుచు హరిభక్తు।లై విశిష్ట
లోకాముఖంబందు। గురుపుణ్యులై యిహగయాపుష్కరలస।ద్గాంగతీర్థ
ములయందు మనుజులు।పారిఁబోరి శ్రద్ధతో మునుఁగ నెట్టిఫలంబు।మొనయునట్టి
తే. పుణ్యముఁ బ్రయాగజలమున। భూరిబుద్ధి
మాఘమాసంబులో మున్గు। మానవులకు
విప్రు లెట్టిఫలంబును। వెలయునందు
రట్టిఫలముల నెల్లవా। రందుచుంద్రు. 103

చ. మనసలరార నేనిపుడు। మానుగ నీ కతిభక్తిమీఱఁ జె
ప్పినదగు వామనేశుకథ। విన్నఁ బఠించిన సంతతంబు శో
భనమును రాజసూయముఖ। భద్రఫలంబును నాకభోగముల్
జన భువనంబునం దొనరు।సత్యము సత్యము ధాత్రిఁ జౌత్రుఁడా!

వ విను రాహుగ్రస్తసూర్యచంద్రోపరాగకాలములందును రత్నముల దానము చేసినవానికిని దుర్భిక్షమందు భార్యాపుత్రుల బ్రతికింప నెంచి వచ్చినదాయల రక్షించువానికి దేవాగ్నిమునిపితృ మాతృగురుజ్యేష్ఠసోదరాదిపాలకునకు నెట్టి పుణ్యము కలుగునో యట్టిఫలం బీవామనపురాణశ్రవణపఠన మొనర్చు పుణ్య జనులకు లభించును. పాపహరం బగ్ర్యమగునట్టియీ వామనము పదునెనిమిది పురాణంబులందుఁ బదునాల్గవది యగు ఈవామనస్థములగు శ్లోకములం దొక దానిని వినిన వ్రాసినఁ జదివినఁ దాఁకినమనుజులు విగతాఘులై వామనదేవుని కృపవలన నక్షయం బగుమోక్షమందిరముఁ బొంది సుఖింతు రని నామనంబు నందు నిసుమంతయైన శంక కలుగదు వినుము. 105

క సాముద్రోపానద్యుగ, ళామలకములను నరుండు। నాషాఢమునన్
వామను ప్రీత్యర్థముఁగా, నీమహి నిడవలయు భక్తి। నెసఁగి దితీశా! 106

తే. అద్యమధుయుక్తమైనపా।యసము లవణ
గుడసమేతంబు నగునట్టి। కూడు భాద్ర
పదమునందు మహాత్ములౌ। బ్రాహ్మణులకు
నొసఁగనగు శౌరితుష్టికై। యుర్వి జనుఁడు 107

క. మనుజుం డాశ్వయుజంబున, ఘననీలతురంగ శస్త్ర।గణములు వృషభం
బును దధ్యాదుల నిడ నగు, వనజాక్షుని ప్రీతికొఱకు। బ్రాహ్మణతతికిన్. 108

ఆ శాలికుంభరజత। సన్మణిదీపము, త్మాఫలములు సర్వ।దానవారి

సంతసించుటకును । సద్విజాలకు నిడఁ, దగుసుఁ గార్తికమునఁ । దాల్మి నరుఁడు.

క. పురుషుఁడు మార్గశిరంబున, హరితుష్టికి నిచ్చుటొప్పు । నవనిసురులకుఁ
దురగోష్ట్రాజావికములు, ఖరములు శకటములు భక్తి । గ్రాలెడిబుద్ధిన్ 110

సీ. రమ్యాలయప్రావా । రణపురప్రముఖము లచ్యుతప్రీతికై । యధికభక్తిఁ
బౌషమాసంబందు । బ్రాహ్మణశ్రేష్ఠుల కొసఁగ నొఁ బూన్కితోఁ । గొసఁగుఱులిని
దాసీగణంబుల । దాసుల ముద్రసకలితోదనము నలం । కారములను
సర్వకాలములందు । శౌరిసంప్రీతికై యిడనగు ద్విజాలకుఁ । బృథ్వి నరుఁడు
ఆ. నిష్టతమము నగుచు । నెయ్యది శుచినిజ
భవనమందు వెలయు । భక్తి దాని
శౌరితుష్టికొఱకు । సత్యవిప్రులకును
ననిశ మిచ్చు టొప్పు । నమరులెన్న 111

క. హరిగేహారామంబుల, ధరపైఁ గట్టించి కీర్తిఁ । దనరినవాఁడౌ
నరుఁ డురుశాశ్వతపుణ్యో, త్కరసుఖముల నొందె ముదము । కడలుకొనంగన్

క. కరమర్థి నలువముందర, సుర లౌనౌ ననఁగ వెలసి । సొంపున నష్టో
త్తరగోత్రజాలకు ముక్తిని, నిరతము సమకూర్చుచుండు । నిజముఁగఁ ధాత్రా!

క. తపసియు నమోఘచరితుం, డపగతదోషుండు నైన । హరిచెంగట ని
ష్కపటంబునఁ జెలరులు తూ, గిపు లాడినసుడుల వినుమ । కృప భాషింతున్.

సీ. అష్టత్కాలంబందు । నావిర్భవించినమనుజు లెవ్వరు శౌరి । మందిరముల
గట్టించి దీక్ష నా । ఘనసద్మములయందు సరవి ధ్వజప్రతి । ష్ఠల నొనర్చి
గోమయంబున నట్టి । గుడులను నలికించి పంచవర్ణపురంగ । వల్లికలను
గడిమి శృంగారింపఁ । గాఁ జేసి ధూపనివేదనంబుల సమ । ర్పింపఁగలరొ
ఆ. వసుధ నట్టివారు । బహుళమహాపాత, కోపపాతకముల । నొప్పి చక్రి
కరుణతోడ విగత । కల్మషులై దశ, దిక్కులందు దీప్తి । తేజరిల్ల 115

క. మముఁ గాంచుచుండి మోక్షప, దమునందు వసింపఁగలరు । తథ్యంబని యా
క్రమమున వారారాక్షస, దమనునికడఁ బల్కుచున్న । తరుణం బారున్. 116

క. ఆర్యమఘుఁ దనురాజేంద్రుం, డామాటల నాలకించి । హరికిని దివ్య
ద్ధామంబుల శృంగారో, ద్దామాన్వితములును గాఁగ । ధరఁ గట్టించెన్. 117

క. రంగుల నాపదనంబుల, శృంగారింపంగఁ జేసి । చిత్రపుముగ్గుల్
పొంగుచుఁ బెట్టించి విప, త్సంగతి విడనాడి యంత । సంతతభక్తిన్ 118

వ. కనకధూపదీపపాత్రములఁ జేయించి దీపములఁ బెట్టించి భక్ష్యభోజ్యనివేదనములు నిడఁ జేయుచు హరిద్రాచూర్ణరంజితనానావర్ణవైజయంతికలితములును

కాండుపాటలికాశ్రితమంజిష్ఠానవరంగీయములును దేవదారునగశోభితములును దృఢరత్నసంస్కారాభరణ మండితగాంధర్వ విద్యారాగజ్ఞనిపుణ గణాలంకృతంబులును లతాపల్లవ ఛన్నలలితపుష్ప ఫలజాలాభిరామంబు లగువివిధారామములఁ గల్పింపఁజేసి వానియందు దీనాంధయతిబ్రహ్మచారివికలాంగుల సంతతము సంతసంబునఁ బూజించుచుండి. 119

క. అతసీసన్నిభమధునగ, తటిబీజోద్భవము నైన । శైలములా శ్రీ
పలికిని దివియలఁ దగ సం, తతముఁ బ్రకాశింపఁ జేసెఁ । దత్పరబుద్ధిన్. 120

క. దనుజేశ! దాన నాతఁడు, ఘనతామిస్రాంధసంజ్ఞ । కలనరకములా
మును లెన్న దాఁటి హరిగృహ, మున కేగెను భార్యఁ గూడి । ముదమొదవంగన్.

ఆ. ఇట్టు లాన్నృపాలుఁ । డెసఁగినశ్రద్ధతో
డను జితేంద్రియుండు । వినుతసర్వ
భువనసత్తముండుఁ । బుణ్యుఁడై హరిఁ జెందె
ననఁగ నేను వింటి । నసురనాథ! 122

క. మతిమంతు లట్టిజ్యామఘు, కృతమార్గము ననుసరించి । కేశవపదకాం
క్షితులై పోవుచునుందురు, వితతంబగుభక్తి మదిని । వెలయ ధరిత్రిన్. 123

ఉ. నీవును శౌరిమందిరము । నిశ్చలభక్తినిఁ గట్టఁజేసి యా
భావజతండ్రిఁ గొల్చుచును । బావనులా శ్రుతిశాస్త్రపారగుల్
ధీవరులుం బురాణములఁ । దెల్పెడివారును శీలురైన భూ
దేవకులాగ్రగణ్యులకు । దీపితభక్తి చెలంగఁ బాత్రుఁడా!. 124

క. కనకాశ్వధేనుభూబహ్వా, ధనముల వస్త్రముల రత్న । తల్లజముల నీ
కొనరినవిభవోన్నతి కొలఁదిని మాధవుతుష్టికొఱకుఁ । దెంపున నిడుమీ. 125

ఉ. ఇట్టిదు కర్మయోగమున । నీ వల రారుచు దీటు నేర్తురా
బట్టితి వేని నిన్ను హరి । పాలన చేయు నిజంబు ధాత్రిపైఁ
బుట్టినమానవోత్తములు । పూర్ణపుభక్తి భజించి వాసవా
వృష్టముఁ దాల్చుశౌరిదయ । ముక్తినిఁ జెందిరి దానవాధిపా!. 126

శా. మాసీంద్రా! యిటు విష్ణుభక్తుఁడు మహా । మాన్యుండు దివ్యుండు ని
త్యానందుండును సుస్థిరుండు నగు ప్ర । హ్లాదుండు సత్యోక్తులం
దా నావేళ బలీంద్రుతోఁ బలికి యా । దైత్యుచేఁ బూజితుం
డై నవ్యస్థితి నేగ నైజపురి క । త్యంతానుమోదుండు నై. 127

సీ. అనఘాత్మ! తుష్టిఁ బ్రహ్లాదుఁ డత్తఱిఁ జన బలిగృహ మొగి నిందు । వర్ణకాంతి
పావణించె నంత మహాత్ముండు నగుదేవశిల్పి బలీశుఁడు । చెప్పినట్టి
భూస్థలంబున నొక్క । సురశైరిసదనంబుఁ గట్టె బల్వింతతోఁ । గ్రాల నట్టి
గుడియందుఁ దనభార్యఁ । గూడి తా సమ్మార్జనాదులౌ । క్రియల నత్యంతభక్తి.

తే. నాచరించుచు శర్కరా । ద్యాదికంబు
లైనవరబలి నర్పించె । నాయతాక్షి
యైనవింధ్యావళియు నట్టి । యాలయమున
దీపదానంబుఁ గావించె । దివ్యమతిని. 128

చ. వరకుపురాణగాథలను । వావిరి సద్విజు లాడఁ దాను భా
సురమతి నాలకించుచును । సుస్థిరభక్తి రమేశు నాత్మలోఁ
బోరిఁబోరి నిల్పి కొల్చుచును । భూతగణేశ మహేశ శ్రీశ సుం
దరతరమందిరా సుజనతత్పర! కావవె యంచు నిట్లొగిన్ 129

హరి ఖడ్గధరుఁడై బలిగృహద్వారమందుఁ గాపుండుట.

చ. నిరతము ధర్మమార్గమున । నిశ్చలభక్తి బలీంద్రుఁ డుండ భా
స్కరశతకోటిసుప్రభలఁ । జాలవెలింగెడిఖడ్గరాజముం
గరమునఁ బట్టి దేవపతి । గణ్యపదుండు జనార్దనుండు శ్రీ
కరతనుఁ డైనచక్రి దయ । గ్రాలుచు నుండఁగ వచ్చి యయ్యెడన్ 130

క. మనసలరఁగ బలిరక్షణ, మును జేయఁ దలంచి ద్వారమున వెలయుచు దు
ర్జనబలరిపులను ద్రుంచుచు, ఘనులందఱు తన్నుఁ బొగడఁ । గమనీయగతిన్

క. ప్రాకారగుప్తమౌ నా, శ్రీకరతలమందు నిలిచి । చేవఁ జెలఁగుచుఁ గా
భీకరులకును బ్రవేశము, నేకడ నిడకుండ దీప్తి । నెసఁగుచు నుండన్. 132

వ. మునీంద్రా ! సర్వభువననిర్మాణచాతురీధురీణుండును సుగుణమణిగణాభిరా
ముండును భూతపాలకుం డగునారాయణుం డాబలిప్రాసాదాంతర్ద్వారగతుండు
నై రాణిల్ల బాణజనకుఁడును రాక్షసపార్థివుం డగుబలివిభుఁడు సంతతము
శ్రీకాంతునిఁ దలఁచుచుఁ దత్పాదపంకజమ్ముల నర్చించుచు హరిభాషించినవా
క్యములఁ బలుమఱు స్మరింపుచుండ నతనికి వినయవివేకవైశారదత్వబుద్ధి పొడ
మె నంత నాకర్బురాధీశుఁడు గురుఁడును పితామహుండు నింద్రతుల్యుఁడగు
ప్రహ్లాదుఁ డాడినట్టివియు నిహపరలోకశుభప్రదంబు లగు హితతథ్యభాష
ణంబుల నెన్నుచు నిట్టివృత్తంబు నుడివె దానిఁ జెప్పెద నాలింపుము. 133

ప్రహ్లాదోక్తులఁ బ్రశంసించుట

చ. ధరణిని వృద్ధులాడినవిధంబునఁ బొల్త నటించినట్టిస
త్పురుషులు పిమ్మటం సకలపూజ్యులు నై నవనీతశుద్ధులై
కరము సమస్తభోగములఁ । గ్రాలుచుఁ గీర్తిని వెల్గి శ్రీమనో
హరుఁడగు శౌరిమందిరము । నందుదు రందము చిందులాడఁగన్ 134

సీ. దర్పితాపల్సర్పదష్టుండుఁ దద్విషహరమంత్రహైన్యసమాత్ముఁ డైన
వానికి వృద్ధసద్వాక్యౌషధులు విషపటులరబాధను । బాపుచుండు

నములమా వృద్ధవా।క్యామృతంబును గ్రోలి తద్భాషణంబులఁ । దనివిఁ జెందు
నరులకు సోమపా।నంబందు నభిరుచి యలరున యాపద।యందుఁ బడిన

తే. వారికిని నీతి బోధించు । పరమవృద్ధ
జనులు లేకున్న శోచ్యులై । చచ్చినట్టి
పురుషులను బోలి బంధుస।మూహమందు
వెలయుచుందురు నిత్యము । వేడ్క లేక. 135

క. ఘనబాధానక్రగ్ర,స్తునకును వృద్ధుం డొకండు । క్షోణిస్థలి నుం
డనియెడల నట్టికా బం,ధన మెట్టుల వదలిపోవుఁ । దర్కింపంగన్. 136

తే. అనయ మాపన్నవాజల।మందు మునిఁగి
శోకభంగాళితోడను । పోరిడి సిగ్గు
పడెడివారికి వృద్ధుల । భాషణములె
కారణంబగు వేఱెద్ది । తనరు నెట్టు? 137

మ. మునివర్యా! యిటు లాబలీశ్వరుఁడు స।మ్మోహోత్తమా బుద్ధిఁ జె
ప్పెను దా నన్నరుఁ డార్యభాషణములన్ । బృథ్వి న్మహాభక్తితో
విని యాశ్రైవడిఁ జేసినేని పోరిడి । స్వార్థ్యస్తకష్టుండునై
ఘను లెన్నన్ బలిమాడ్కి శ్రీహరికృపన్ । గాంచు న్మహాదీప్తితోన్. 138

క. నే నీపుణ్యపురాణము, మానుగఁ జెప్పితిని నీకు । మనుజుఁడు దీనిన్
మానితమతి విని దీప్తి, న్నానాధుని చెంత నలరు । మానిలలామా! 139

వామనపురాణప్రశంస.

క. ఘనగంగాపుష్కరగా,హనమున నె ట్టఘము లడఁగు।నట్టులె వడి వా
మనునిపురాణశ్రవణం,బునఁ బంకము లన్ని నాశ।మును గను గడిమిన్. 140

ఆ. వామనమును వినెడి।వారియంగంబుల
యందుఁగూడి తిరుగు।నట్టిరోగ
విషములెల్ల మిగుల।విలయమొందు సమస్త
పుణ్యములు లభించు । మునివరేణ్య!. 141

వ. నీకు నేఁజెప్పినట్టి యీపరమరహస్యము నవనిసురగర్హణరతుఁడును, సహోత్థు
వాక్యాదృతకలుషసత్త్వుఁడును, హరిభక్తిరహితుండునునగునరునకుఁ జెప్పవలదు.

క. నారాయణ పురుషోత్తమ, సారాసిగదాఢ్యచక్ర।శార్ఙ్గధరా! వి
స్తారపరాక్రమ మ్రొక్కెద, కారణవామన మహేశ! । కావుము నన్నున్. 143

క. అని యిట్లువ్వఁడు నియతిం, బొనరారెడి భక్తితోడఁ । బురుషోత్తముభా
వనుఁడై పలుకునొ వానికి, మునివందితుఁడైనశౌరి । ముక్తి నొసంగున్ 144

క. విను వామనవాచకునకుఁ, గనకాంబరభూమిధేను।గణముల నిడ నా

వినసట్టివాఁడు విస్తృత, ధనశౌర్యుఁడు కొపుడిడంగఁ దగశ్రో మాని!. 145

క. గురుశాపహరము సంపత్కరమగు వామనము మూఁడుకాలములందున్
నరుఁ డోర్పునఁ జదివిన సు, స్థిరమతి విన శౌరిపదముఁ జెందు ధరిత్రిన్. 146

నాగబంధము.

చ. వరవర జీవసారకర! నారద ముఖ్యసురేశ వందితా!
సురవరభావిభారధర శూరకులప్రవరోదితా! మునీ
శ్వరవశ! భూతఘోరపవి! భావితభక్త విచారలోల!. శం
కరవిదితా! సుధారచిత కాంతసుదివ్యతనూ రమాధరా! 147

ఖడ్గబంధము.

క. సురవర సారవర! స్ఫురదరవిందసమాననేత్ర యంచితపాత్రా!
కరివరదనీలజలద, స్ఫురదభినవకాంతిజాల శోభితగాత్రా! 148

ఉత్సాహము. శ్రీరసార్త్మజాకళత్ర చిత్తచోర! విష్టపా
ధార! భూరిసార! ఘోర దైత్యదూర! ధర్మని
స్తార! ధర్మభవ్యరత్న చారుమోక్షమందిరా!
ధీరసద్గుణాళిహార! దివ్యరామభూవరా! 149

గద్య. శ్రీరామకరుణా సమాసాదితకవితా ప్రాభవ, హరితసకులాన్వయప్రభవ, రా
మవర్యులవంశదుగ్ధసాగర సుధాకర, కొండయకుమార, బుధజనవిధేయకొండయ
నామధేయప్రణీతమగు తెలుఁగు వామనపురాణమందు ద్వాదశస్కంధము.

సంపూర్ణము.

శ్రీరామార్పణమస్తు

---

సీ. శ్రీశివోన్నతులతోఁ జెన్నారుభువిఁ బదునెనిమిది నూఱుల, నెసఁగి నలువ
దైరగుచున్నసంఖ్యలుకల్గుశాలివాహనశకవర్షంబులందు వెలయు
పత్రుధిరోద్గారిసమమాఘసితపక్షదశమితోఁ గలిసినదైత్యగురుని
వారమునాఁటికి వామనాఖ్యమహాపురాణంబుఁ దెలుఁగునరమణఁ బూర్తి
ఆ. చేసి భద్రమూర్తిఁ జెన్నారురఘురామ, భూపశేఖరునకు భూరిభక్తి
నొసఁగినాఁడ నిద్ధి యుర్విఁ జంద్రాదిత్యు, లొప్పుదాఁక దీప్తి నుండుఁగాత!

*

# పద్యకావ్యము.

ప్రతి 1-కి రు. అ

అచ్చతెనుఁగు రామాయణము,
శుద్ధప్రతి 1 4
డిటో కాలికోబైండు 1 10
అడవిమల్లెలు, ఎనమండ్ర నారా
యణమూర్తి గారిది 0 8
అధ్యాత్మ రామాయణము 1 8
అనంతునిఛందము, ఛందోదర్పణం 0 14
అనిరుద్ధచరిత్రము, కనుపర్తి అబ్బయా
మాత్య ప్రణీతము 0 8
డిటో కాలికోబైండు 0 14
అప్పకవీయము, శ్రీగిడుగురామ
మూర్తిపంతులుగారి విమర్శ
తో నున్నది. 2 8
అంబరీషోపాఖ్యానము, సటీక 0 4
ఆముక్తమాల్యద, వావిళ్ల రామ
స్వామిశాస్త్రిగారి వ్యాఖ్యాన
ముతో మేలుకాకితముల మీఁ
దచక్కఁగ మరల ముద్రితము 3 8
ఆంజనేయదండకము, హనుమ
ద్దండకము 0 2
ఆంధ్రభాగవతము, పోతనామాత్య
ప్రణీతము, ఇదివఱకు ముద్రిత
మైనప్రతులకన్న అన్నివిధముల
బాగుగనున్నది. 5 8
డిటో అత్యుత్తమప్రతి, రెండు
సంపుటములు 7 8
డిటో 3 సంపుటములు 9 0
శ్రీమదాంధ్రభారతము-పద్యకావ్యము:-
7 సంపుటములప్రతి 14 0
3 సంపుటములప్రతి 13 0
ఆది, సభాపర్వములుగ 2 0
అరణ్యపర్వము ,, 2 0

ప్రతి 1-కి రూ. అ

విరాటోద్యోగపర్వములు ,, 2 0
భీష్మద్రోణపర్వములు ,, 2 0
కర్ణశల్యసౌప్తిక స్త్రీపర్వములు 2 0
శాంతిపర్వము 2 0
అనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమ
వాస, మౌసల, మహాప్రస్థానిక,
స్వర్గారోహణపర్వములు గల
సంపుటము 2 0
ఆదిపంచకము, ఒకటేసంపుటము 5 8
యుద్ధపంచకము స్త్రీపర్వము 3 12
శాంతిసప్తకము ,, 3 12
ఆదిపర్వముమాత్రము, పెద్దచ్చు,
చిన్నసైజు 1 8
ఆంధ్రభారతవిమర్శనము, మల్లాది
సూర్యనారాయణశాస్త్రి 0 8
ఆనందరంగరాట్ఛందము, కాలికో 1 8
ఆంధ్రభాషాభూషణము 0 2
ఆంధ్రభాషార్ణవము, అట్టబైండు 0 12
,, కాలికోబైండు 1 2
ఆంధ్రనామసంగ్రహము, ఆంధ్రనామ
శేషము, సాంబనిఘంటువు, టీకా
నుక్రమణికాసహితము 0 12
డిటో కాలికోబైండు 1 0
ఆంధ్రచంద్రాలోకము సటీక 0 8
కవిసంశయవిచ్ఛేదము, అడిదము
సూరకవిది 0 6
ఉత్తరరామాయణము, కంకంటి పాప
రాజప్రణీతము చక్కనికూర్పు 2 0
ఉత్తరహరివంశము, నాచనసోమ
నాథకృతము 1 8
కవికర్ణరసాయనము 1 8
మేలుప్రతి, కాలికోబైండు 1 14

కావ్యస్యాలిలీఢః

# శ్రీజనమంచి శేషాద్రిశర్మగారి గ్రంధములు.

| | | ప్రతి 1-8 రూ. అ. | |
|---|---|---|---|
| శ్రీకృష్ణావతారతత్త్వము:— | | | |
| 1, 2, 3, 4, 5, 6, 7 భాగములు | ప్రతి 1-8 | 1 | 8 |
| ఆంధ్రశ్రీమద్వాల్మీకిరామాయణము, నిర్వచనము వ్యాఖ్యానములలోని భావముకూడ విడువక తెనిఁగింపఁబడినది. ఏశ్లోకమున కేపద్యమో తెలియుటకై శ్లోకసంఖ్యగూడఁ దెలుపఁబడినది | | | |
| | 3 సంపుటముల ప్రతి | 12 | 0 |
| | 7 సంపుటముల ప్రతి | 14 | 0 |
| ఆంధ్రబ్రహ్మాండపురాణము | ... | 5 | 0 |
| హాలాస్యమాహాత్మ్యము, స్కాందపురాణమునుండి తెనిఁగింపఁబడినది. మధురాపురమాహాత్మ్యమును దెలుపును. మీనాక్షీసుందరేశ్వరుల విలాసచరిత్రములు జెబ్బదిరెండుకథ లిందుకలవు. | ... | 1 | 0 |
| ఆంధ్రలలితోపాఖ్యానము, భండాసురుని లలితాదేవి చంపుట మొదలగు గాథలనేకములిందున్నవి మంచిబైండు | ... | 1 | 8 |
| విచిత్రపాదుకా పట్టాభిషేకనాటకము | ... | 0 | 12 |
| పాండవాజ్ఞాతవాసనాటకము | ... | 0 | 12 |
| రామవనవాసనాటకము | ... | 0 | 12 |
| సంగ్రహరామాయణము, వచనము సులభశైలి | ... | 0 | 10 |
| సంగ్రహభారతము | ... | 1 | 0 |
| సంగ్రహభాగవతము | ... | 1 | 0 |
| కలివిలాసము, విచిత్రప్రబంధము | (అచ్చగుచున్నది.) | | |
| హనుమద్విజయము | ... | 0 | 8 |

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,

292, ఎస్ప్లనేడ్, చెన్నపురి. ఈ.

| పుట. | పంక్తి. | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| | 21 | తేని | వేని |
| 48 | 10 | హృషీకేశవుఁడవు | హృషీకేశుఁడవు |
| 49 | 10 | కానని | తానని |
| 53 | 27 | నిదర్పిత | మహాకపటు |
| 64 | 24 | నరు | నగు |
| 65 | 13 | గర్వ | గర్భ |
| 67 | 32 | ఆంత్రు | ఆంధ్రు |
| 77 | 5 | నబోజ్య | నభోగ్ని |
| | 27 | పాషులు | పాపిష్ఠులు |
| 78 | 2 | కెనటి | జెనటి |
| 90 | 21 | వరుగని | జెవరని (యతిభంగము) |
| 94 | 11 | చందంబు | చిందంబు |
| 96 | 6 | గుణాము | గణాము |
| 102 | 28 | రాక్షసేశ్వశ | రాక్షసేశ్వర |
| 117 | 25 | కరయి | కరమి |
| 122 | 26 | గొంతయు | నెంకయు |
| 131 | 7 | బన్నిన | పన్నిన |
| | 7 | భాగుగ | బాగుగ |
| 134 | 25 | ప్రహ్లాదునతో | ప్రహ్లాదున |
| 139 | 31 | పురులు | సురలు |
| 143 | 11 | గంపులు | గంధులు |
| 159 | 25 | బటి | బట్టి |
| 166 | 20 | భవునకుని | భవునకును |
| 174 | 25 | చెలంగుచుండ | చెలంగుచుండు |
| 192 | 9 | ధ్యానించు | భావించు |
| 193 | 10 | వనజు | వనజజు |
| 196 | 27 | భావము | భావమును |
| 198 | 23 | పాప | తాప |
| 203 | 13 | స్థము ఁబా | రథము సా |
| 208 | 21 | భాసుర | కలమణి (యతిభంగము) |
| 225 | 33 | శరణా | శరణార్థి |
| 233 | 12 | గర్వాంసము | గర్వాంధువు |
| 235 | 16 | భిక్షు | భిక్షు |
| 241 | 30 | నటి | నట్టి |
| 245 | 27 | వందు | నందు |
| 250 | 8 | గణ్యాశ్ర | గణ్యాపు |
| 259 | 12 | నవ్య | నవ్య |
| 260 | 32 | సొసఁగె | సొసఁగె |
| 262 | 17 | పందు | రంపు |

| పుట. | పంక్తి. | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 266 | 12 | హిశాలం | విశాల |
| 267 | 1 | జంబ | బంశ |
| 272 | 9 | గన్నిభి | సన్నిభు |
| 278 | 24 | దంత | దంత్ర |
| 279 | 23 | సురల | సురుల |
| 288 | 4 | ము క్తవైచ | ముక్తములు |
| | 6 | చక్రోద్భృ | చక్రోద్యత |
| 296 | 29 | ధర్మరా | ధర్మి |
| 299 | 21 | ఇట్లు | ఇట్ల |
| 307 | 23 | గిన | గన |
| 312 | 15 | మాన | మానవ |
| 313 | 24 | మునుశ్రేరి | మునుఃశ్రేరి |
| 314 | 30 | తద్ఘన | తద్గురు |
| 318 | 22 | అనుగువగు | అనువగు |
| 320 | 24 | సీ | నే |
| 326 | 12 | కీశం | కీశ |
| 327 | 18 | జగద్వ్యభుక్త్వము | జగద్వ్యభుంక్త |
| 228 | 20 | యట్టిఁదయ్యె | నట్టివయ్యె |
| 339 | 25 | దగినట్టి | గగనట్టి |
| | 29 | వసు | వస్తు |
| 351 | 9 | విస్తత | విస్తృత |
| 352 | 27 | మూర్ద | మూర్ధ |
| 353 | 7 | ప్రమగోశులు | ప్రమగోశులు |
| | 8 | సురుల | గురుల |
| 354 | 4 | యింపగు | నింపగు |
| 352 | 22 | దై | సై |
| 358 | 23 | ప్రజ్వరిల్లె | విస్తరిల్లె (యతిభంగము) |
| 375 | 7 | సమిత్పలాశిని | సమిత్పలాశిని |
| 380 | 8 | కూర్చె | గార్చె |
| 391 | 18 | జేసిరి | జేసిరని |
| 393 | 26 | చరాచరమునకు | చరాచరములకును |
| 395 | 24 | యోజించు | యోచించు |
| 397 | 7 | సత్కారంబు | రసాకారంబు |
| 399 | 22 | లో | లో |
| 400 | 11 | నని పెట | నని పెట |
| 401 | 24 | సురు | సుర |
| 402 | 22 | డా | డా |
| | 29 | సురుల | సురల |
| 403 | 12 | సురులు | సూరి |

| పుట. | పంక్తి | తప్పు | ఒప్పు. |
|---|---|---|---|
| | 18 | ఆసురులు | ఆసురలు |
| 416 | 22 | ఆష్టలం బున | ఆష్ఠలంబున |
| | 30 | ఋద్ది | ఋద్ధి |
| 419 | 11 | చెప్పె | శెప్పెద |
| 421 | 19 | ల గెను | శెలఁగెను |
| | 23 | పాల | బాల |
| 425 | 20 | ఢుంకి | ఢుండి |
| 426 | | సద్భావం బున | సద్భావంబున |
| 427 | | బిందు | బందు |
| 435 | | నదికంయున | నధికసయము |
| 4,3 | | లంప్రిజుల్ | లంఘ్రిజుల్ |
| 448 | 26 | సాన్న త్రై చెన్నారు | సవపీతిహో త్రులా (యతిభంగము) |
| 457 | 28 | విలేక | విలేఖ |
| 459 | 20 | వింధ్యస్థ | వింధ్యష్ఠ |
| | 28 | నహి | మహి |
| 460 | 11 | వారిశంకటి | హారిశంకర |
| 476 | 21 | దరయు | దగ్గు |
| 479 | 9 | ప్రధు | పృథు |
| | 21 | వృమ | వృను |
| 487 | 19 | నిశ్చలతండు | నిజమాతఁడు |
| 491 | 5 | ముఖ్య | ముఖ్య |